శ్రీరస్తు.

మనుస్మృతి విషయానుక్రమణిక.

పుటసంఖ్య- విషయములు-

—(*) షష్ఠాధ్యాయము- (*)—



—(*) సప్తమాధ్యాయము. (*)—



—(*) అష్టమాధ్యాయము. (*)—

పుటసంఖ్య- విషయములు-



మనుస్మృతివిషయానుక్రమణిక ముగిసెను-

---

శ్రీరస్తు.

శ్రీ దుర్గాయై నమః.

# ఆంధ్ర మన్వర్థ దీపిక.

## కృత్యాది.

శ్రీనందాలయ మంగతేజమున భాసిల్లన్ యశోదాత్మసం। తానంబై వ
సుదేవసంతతి ప్రవృద్ధంబౌటకున్ వ్యాజమై। సానందంబుగ వింధ్యపై వెలయు దు
ర్గాంబామహాదేవి భ। క్తానందక్షితిపాలమౌళికి నభీష్టాళిన్ దయన్ గూర్చుతన్॥
(సీ) అప్రతిమోజ్జ్వల మంతమొప్పింపవిత్తులకట్టనాకమండలువు దనర। నొకచె
యిమ్మోనయింతయు గుణాఢ్యయదిక్రైవసంబయ్యె ననదిశూలంబు గ్రాలనసురుల
ద్రుంపగ నమరులబెంపనా శక్తియేయనకయి శక్తిమెరయ। నింతయు బ్రోవ
నాకేకచక్రంబన కరమునచక్రంబు మెరయుచుండ। నరులదంపగ నొంపగ నంప
ముసల వజ్రములునసిదగమాతృవర్గమనిశ। మాయురైశ్వర్య జయసంప దభయ
భోగ। విభవములబ్రోచు నానందవిభువరులను॥ (సీ) ఏవెల్గురేవెల్గు నెనసివెన్నె
లగాచి యమృతంబునోషధులందునించు। నేకరంబఖిలైక భీకరంబగుదమం బ
ణచిసాఫల్యంబు నత్తులకిడు। నేరశ్మిపర్జన్యద్వైరసాత్మకతవర్షంబున నాప్యా
యనంబొనర్చు। నేతేజముగుణత్రయీమయం బజ హరి హరత గావించు స
ర్గాదికముల। నట్టిచిత్రూప తేజోమయాదిశక్తి। ద్విజవరోపాస్యమాన సావి
త్రికరుణ నభిమతములిచ్చు గావుత నహరహంబు। శ్రీమదానందగజపతి క్షితిపతు
లకు॥ (గీ) అలగణేశ్వరిసిజదండ హస్తయగుచు। విఘ్నములడంచు గావుత వివిధ
మానిబృందబృందారకాద్యాది వందనీయ। శ్రీమదానందగజపతి క్షితిపకృతుల॥
(సీ)మన్వత్రికశ్యప మౌద్గలక్రతుభరద్వాజ బృహస్పతిదక్షవిష్ణు। కాత్యాయన
వ్యాసగౌతమగాలవశాతాతపవసిష్ఠ శంఖలిఖిత। యాజ్ఞవల్క్యపరాశరాంగిరో
దేవలజాబాలి నారదగోభిలభృగు। కణ్వసనందనాగస్త్యసంవర్తక వత్సకుత్స
పులస్త్య వామదేవ। పులహయమభృగుముఖ్యుల పూర్వమునుల। స్మృత్యుపస్మృ

తికాదుల సత్యధనుల। నుపపురాణ మహాపురాణోక్తిచతురు । లనుభజింతును ధ
ర్మశీలప్రదులను॥ (గీ) విబుధసంసేవ్యమానమౌ వేదశాస్త్ర। తత్వము నెఱుంగక
యెస్వమతంబు కంటె। నన్యమతమెక్కుడనియు భయము నెఱుంగ। సట్టివారలబా
ధింతు సవలజనగ॥ (వ) అని యిష్టదేవతావందన పూర్వకంబుగా నఖిలస్మృ
తిపురాణరచనా ధురంధరులగు మహామానివరులం గొనియాడి తద్విరుద్ధోక్తి ప్ర
వీణులగు బ్రాణులస్విడ వాడి ప్రాచీనార్వాచీనవిద్వదనుగ్రహంబున ధర్మతత్వ జి
జ్ఞాసం జేసి యేదేని యొక్క స్మృతిని యథామతిగా బరిశీలించి యొక్క గ్రంథర
భానపర్మందలచియుండునంత॥ (సీ) చండప్రతాపశుష్య ద్విషజ్జీవనప్రతతులినా
న్వయోద్భవత దెలుప । సర్వసర్వంసహా చక్రధురంధరత్వము నిజగజపతిత్వమును
దెలుప। బాహాసిశిఖిశిఖా భస్మీభవద్దుష్టపటలీద్విశేషాసి పదత దెలుప । ననుపమ
సింహసంహననతా వైఖరికా తర్మస్వరాప్పరాంకతను దెలుప । నఖిలరాజన్యలో
కజయంబనన్యమన్నె సుల్తాన్బిరుద మహామహిమ దెలుప । నలరు శ్రీమత్కళింగసిం
హాసనాధి। రాజ్యశుభశాలి శ్యాగ్నినందరాజమౌళి ॥ (సీ) సంస్కృతాంధ్రాదిభాషా
షట్కకవితావిరచనావిలాసవత్ప్రతిభదనర । నఖిలపురాణేతిహాసాగమస్మృ
తి పద్ధతివివరణ ప్రౌఢిమెరయ । సంగీతసాహిత్య సరసనూతననూత్న కల్పనా
చాతురీగరిమ వెలయ । వేదవేదాంతాంగ విద్యావిశేషార్థ తత్వనిర్ణయ సము
త్సాహమొప్ప । శమదమార్జవసత్య శౌచక్షమాద। యానిరాలస్యతాసునయా
దిదైవ । సంపదుజ్జ్వలశేముషీసంప్రయోగ । మహిమనొప్పునానందక్షమావిభుం
డు॥ (మ) నను ప్రేమన్ గని యానతిచ్చిరిటు లానందంబమందంబుగా । ఘనమా
రీతి మహాపురాణ వరమార్కండేయకౌమార్మద్వయం । బునుమన్వాత్యపిత్ప్రమో
దమునకై మన్మిశ్రవాగ్గద్యపద్యనిబంధంబులుగా రచించితిరిలన్ తత్తత్కృతుల్ రా
జిలన్॥ (గీ) అస్మదంకితముగ నామకాభిలషిత । గీతినొక గ్రంథమొనరించు ప్రీ
తినుంటి । రదిమనుస్మృతివివరణమాంధ్రభాష। జేరచింపు డెల్లరును హర్షించున
ట్లు ॥ ( వ ) అని దయారసంబువెల్లివిరియ నానతిచ్చి మేధాతిథిగోవిందరా
జకుల్లూకభట్ట నందన రామచంద్ర రాఘవేంద్రకృతవ్యాఖ్యాషట్క సహితంబు
గా ముద్రితంబగు పుస్తకంబనుగ్రహపూర్వకంబుగా దయచేసి తత్తద్వ్యా
ఖ్యాతృభిప్రాయంబుల నరసియథోక్తంబుగా సకల వైదిక లౌకిక ధర్మంబుల
నెల్లరకుం దెల్లంబుగా ద్రిలింగభాషచే రచింపు డిదియస్మదభిప్రాయంబని యా

జ్ఞాపించుటయు నేను నానందకందళితాంతరంగుండనై యద్యద్విభూతిమ దిత్యాది భగవదుక్తిజ్ఞాపిత పరమేశ్వరతేజోవిశేషావతారస్వరూపులగు శ్రీమన్మహాప్రభువులు సత్యసంకల్పులుగావున తదీయాజ్ఞయే సర్వంబు నెరవేర్పంగలదని నిర్భరంబుగా నంగీకరించి మేధాతిథిప్రముఖులవ్యాఖ్యానంబులందు సముజ్వలంబై బహుశ్రుతిస్మృతిపురాణేతిహాసాగమవచనంబులచే మనూక్తిగూఢార్థంబులఁ జేటపరచుచు విస్పష్టంబుగానుండుటంజేసి యాధునికులగువిద్వాంసులు దేనిముఖ్యంబుగా గ్రహించిరట్టికుల్లూకభట్టీయంబు ప్రధానంబుగాఁగొని సందేహంబులు విడచుచు నెడల నితరవ్యాఖ్యాతలయభిప్రాయంబులతోఁడం దత్తదుదాహృతశ్రుతిస్మృత్యాదులతాత్పర్యనిరూపణయుక్తంబుగా నాంధ్రమన్వర్థదీపికాఖ్యయగు వ్యాఖ్యయథామతిగా రచించ నంగీకరించి కృతీశ్వరులగు నిమ్మహామహీమండలేశ్వరుల వంశావతారవర్ణనంబుసంపూర్ణంబుగా మార్కండేయపురాణాది కృత్యాదులందు వివరించియుండుటంజేసి గ్రంథముఖలక్షణంబుగా నిందు నెల్లవారలకుం జేటతెల్లంబుగా వచనరచనావిశేషంబున సంగ్రహరూపంబుగా తద్వంశానుచరితంబు దురితంబునడంచుగావుతయని యభివర్ణించెద - మున్ను మహాప్రళయాంతంబునదికాలాదినిరూపణంబు జేయరాకుండ కేవలతమోమయంబగుచో సచ్చిదానందాద్యుపనిషదుక్తలక్షణంబుల నప్రమేయంబగు చిన్మాత్రంబువలన ననిర్వాచ్యమహిమంజేసి త్రిగుణాత్మికయగు చిచ్ఛక్తిశన తేజోవిశేషంబుచే దమంబు నడంచుచు మహాలక్ష్మి యావిర్భవించి స్వకీయసత్వతమోగుణప్రాదుర్భూత శక్తిద్వయంబుతో దానునుంగూడ సృజించి సశ్వేతరక్తనీలాంగులగు ముమ్వేలుపులును సృష్టిస్థితిలయంబులంజేయుచుండ నంత కొంతకాలంబునకు పద్మకల్పాంతంబున నారాయణుని నాభికమలంబున ప్రకటితుండగునట్టి బ్రహ్మమానసపుత్రులలో మరీచికి కశ్యపుడావిర్భవించె నతనికదితియందు వరంబునంజేసి వివస్వంతుండు మార్తాండుండనప్రభవిల్లె నతనికి వైవస్వతుండుబుట్టి మన్వంతరాధిపతియై యిక్ష్వాకుంగనియె నతనికి నూర్గురుపుత్రులావిర్భవించి బహ్వన్వయకర్తలైరందు క్షత్రియనురాజువంశంబున హరిశ్చంద్రసగరదిలీప భగీరథకకుత్స్థరఘు దశరథరామచంద్రకుశాదులనన్యసామాన్యలోకోత్తర ప్రతాపతపోయజ్ఞదాన ప్రజాపాలనాది కృత్యంబుల నిత్యంబగు ప్రతిష్ఠనలరిరట్టిరాజవంశపరంపరమను నిర్మితంబగు నయోధ్యాపురంబు రాజధానిగా నేలుచుండె రంత నొకకాలంబున నేదేనికారణంబు

స నయోధ్యానిలయులు[illegible]పుర సింహాసనాధీశ్వరులై దానశాస్త్రంబుల ననుప
మానంబు గాధరాపరిపాలనంబు జేయుచు నొకకాలంబున నయ్యోదయ పురాధీ
శ్వరులలో విజయభూపతియను రాజేంద్రుండు జయయాత్ర నంగీకరించి సకల
భూమండలాధీశ్వరుల నిజవిక్రమంబున గెలిచి తనవశంబుగా జేయుచు దక్షిణదేశం
బునకేతెంచి యందు విజయనగరంబను పురంబు తనపేర నిర్మింపంజేసి యెల్లవా
రలకుం దెలియబడుటంజేసి బుద్ధవర్మ యను నామాంతరంబున సుప్రసిద్ధుండై ప్ర
కాశించె తదనంతరంబున మాధవవర్మ తత్పురంబేలుచు యుద్ధయాత్రామార్గం
బున కృష్ణాతీరంబునకేతెంచి యచ్చట బెజవాడ కనకదుర్గను పాసించి తదనుగ్ర
హంబున సువర్ణవర్షంబు గురిపించి స్వవంశ్యుల కవిచ్ఛిన్న రాజ్యాధిపత్యంబు గ
లుగునట్లుగా వరంబులం గొనియె నతనికుమారుండు కుమారుండునుంబోలె శక్తి
సంపన్నుండగు దేవవర్మ ప్రభుత్వంబు నంగీకరించె నతని భార్యయగు మైలమాంబ
యందు జికభీముండుదయించి భూపరిపాలనంబొనర్చె నతండు బిడుగునడిదం
బునసరికె నతనికి నమలరాజు కొమరుండయ్యె నతనికి తమ్మిరాజు బుట్టె నవ్వీరునకు
రాచి రాజావిర్భవించి మన్నెసుల్తానను బిరుదు నరుదుగాబడసె నాజెట్టిబిరుదు
నకు తమ్మిరాజు బొడమె నతండు గజపతిబిరుదాంకుండయ్యె నివ్విరోధిభంజకున
కుతిప్పభూపాలుండు జనించె నాప్రతాపనిధికి కృష్ణభూపాలుండు జన్మించె నా
రాజేంద్రునకు పెదజగన్నాథరాజుదయించె నాధరానేతకు కృష్ణభూపాలుండు
సూనుండై పొట్నూరు దుర్గాధీశుం జయించి తద్రాజ్యంబు నాక్రమించె నతనినం
దనుండన్నమరాజుకు మిలకోట బెట్టించి యందునివసించె నతనికపత్యంబై కృష్ణధ
రాధీశ్వరుండు ధర్మమార్గంబున బ్రజాపాలనంబొనర్చె నతనికి చంద్రసూర్యు
లుంబోలె వేంకటరాజు నానందరాజునను కుమారద్వయం బుత్పన్నంబయ్యె నరే
దు వేంకటరాజు వేంకటరాజపురమని తనపేరు బెట్టి కొత్తామగ్రహారంబొనర్చె న
తనికి సీతారామచంద్రుండును నానందరాజునకు విజయరామ భూమీంద్రుండును
బ్రభవిల్లిరందు సీతారామచంద్రుండు తనస్నానజలంబు పానంబు జేయించి కుష్ఠ
రోగంబు మాన్పించె నితండు తనతనయుడగు నానందమహారాజును భ్రాతృపుత్రుం
డగు విజయరామభూపతికప్పగించె నతండు తనపేరనీ విజయనగరంబు నిర్మింపంజే
సి దుర్గంబు బెట్టించి బొబ్బిలినృపాలు రంగారావు పురికనిచి యాయుధోపహతుండై
హరింజేరి నంతనావల రాజేంద్రుండు బాలుండయ్యె నేల నేలకృతాభిషేకుండై జ

స్యంబున నన్యరాజన్యులబిలుకుమార్చి కృష్ణానదీపర్యంతంబుభూమినాక్రమించి జయస్తంభంబులనాటించె నటపై నేతద్వంశ్యుండగు రామభద్రరాజతనయుండైన విజయరామగజపతిరాజు మహారాజై విజయనగరసింహాసనంబలంకరించి వైష్ణవధర్మంబునవలంబించి మహాయోగీంద్రుండునుంబోలె దూరదృష్టి దూరశ్రవణాదిమహిమలం బ్రకటింపుచు నిజభుజప్రతాపంబునకు దనద్వైమాత్రేయుండగు సీతారామరాజేంద్రుని విక్రమంబుదోడుగా కటకమహానదీకృష్ణామధ్య భూమండలాధిపతులచే కప్పంబులుగొనుచు శ్రీమన్నారాయణగజపతీంద్రులం బుత్రులుగాబడసి వైకుంఠంబునకుం జనియె నట భగవదవతారసదృశదానశౌర్యాది గుణగరిష్ఠుండగు నారాయణగజపతిరాజ మహారాజశ్రేష్ఠుండు పట్టాభిషిక్తుండై ప్రాచీనమహారాజకృతాగ్రహారంబులతో స్వకృతానేకాగ్రహారంబులుగలయ నగ్రహారసప్తశతింబరిపాలించుచు తనకు శ్రీవిజయరామ గజపతిరాజ మహారాజవరేణ్యులుత్పన్నులైనం బుత్రముఖదర్శనంబున పితృఋణవిముక్తింగాంచనయ్యెనని స్వరాజ్యంబు సర్వాధికారులకప్పగించి ధర్మపత్నీసహితంబుగా వారణాసికింజని యందుత్తరదేశాధీశ్వరులగు మహారాజులచే సర్వోత్కృష్టసత్కారంబులువడసి వయసరాయప్రముఖహూణాధికారుల మైత్రిన్వెలుంగు నిజప్రభావంబుజ్వలంబై దగమహాయోగిఛందంబునం జిరకాలంబాక్షేత్రంబున వసియించి మణికర్ణికయందధోదకంబుల దేహత్యాగంబొనర్చి బ్రహ్మానందంబునొందె ననంతరంబున స్వపరివారంబుతో శ్రీవిజయరామ గజపతిరాజ మహారాజబిడౌజులు నిజరాజధానికేతెంచి విజయనగరసింహాసనాధీశ్వరులై ధర్మంబున బ్రజాపాలనంబుజేయుచు ధనంబుఘనంబుగా సంచయంబొనర్చి సత్పాత్రంబుల వినియోగంబుగావించుచు సర్వజనబాధకంబులగు వ్యాఘ్రంబుల సప్తశతింబరిమార్చి లోకహితంబాచరించి సాంగంబుగా చతుర్వేదశాస్త్ర కావ్యనాటకాలంకార స్మృతిప్రముఖ సంస్కృతవిద్యాపాఠశాలలను హూణభాషా వృద్ధికరంబుగా ననేకస్థలంబుల స్కూళ్లనుబాలికాపాఠశాలలను గల్పించి విద్యాభివృద్ధిగావించుచు సర్వాధికారులగు వయసరాయ ప్రభృతులతో నాగమన ప్రత్యాగమనాదులచే సత్కారంబులనొందుచు విజయనీ మహాదేవీపుత్రు లేగేశంబున కేతెంచునప్పుడు తత్సమాగమవైభవం బనన్యసామాన్యంబుగా స్వాస్థ్యాన స్వతంత్రరాజన్యప్రాప్యంబు నాత్మనామాంకితంబు నత్యంత ప్రతిష్ఠావహంబునగు నొక బంగరుబిళ్ళ నతండొసంగి మిత్రులకానందం

యోధ్యాపిలగా... రపపుర
బును ...త్రులకత్యంత వ్య...యం గానమూల్యఖడ్గనాళికాంగుళీయక స్వకుటుం
బ ప్రతికృత్యాద్యనేక వస్తూపధాపూర్వకంబుగా త్రయోదశసంఖ్యాక శతఘ్నీధ్వ
నిసహిత సర్వసభాప్రవేశరూపమర్యాదనొంది రూపౌదార్యప్రతాపవిద్యా య
శశ్చాతుర్య క్షమాసత్యవిక్రమాదుల ననురూపులును వంశకర్తలునగు పుత్రులం గ
ని నిజరాజ్యంబు పూజ్యంబుగా చిరకాలం బేలిరి తదనంతరంబున తత్తనయులగు
శ్రీమదానంద గజపతిరాజ మహారాజేంద్రులు సంధివిగ్రహాది రాజకార్యంబులు
స్వకీయతేజోవిశేషమహిమచే నెరవేరుచుండ సకలవిద్యాతత్వనిరూపణనిరుపమా
నందరసానుభవోల్లాసంబున కాలంబున కమూల్యత్వంబుఘటించుచు బ్రతివసంతశ
రదాగమంబుల నూత్నంబులగు కృతులనర్పించు విద్వద్వరులను నిరుపమానంబుల
గు సన్మానంబులదనుపుచు తదాశీర్వచనప్రభావంబున దినదినప్రవర్ధమాన రా
జ్యలక్ష్మీనిర్వాహఖర్వ ప్రతాపయశః పుత్రపౌత్రాయురారోగ్యసిద్ధి సమృద్ధులా
చంద్రార్కంబుగా వెలయ నలరుచుండి రమ్మహారాజరాజేంద్రుల కభ్యుదయ ప
రంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన యాంధ్రామన్వర్థ దీపికాఖ్యయగు వ్యా
ఖ్యకు బ్రారంభం బెట్టులనిన॥ ❋



శుభమస్తు.

శ్రీగణేశాయనమః.

# మనుస్మృతి * ప్రథమాధ్యాయము.

## ఆంధ్రమన్వర్థదీపికాసహితము.

శ్లో॥ స్వయంభువే నమస్కృత్య బ్రహ్మణేఽమితతేజసే। మను
ప్రణీతాన్వివిధాన్ధర్మాన్ వక్ష్యామి శాశ్వతాన్॥ *

టీక.—అమితమైన తేజస్సుగలిగినట్టిన్ని తనంతట దానావిర్భవించిన బ్రహ్మ కొరకు నమస్కరించి బ్రాహ్మణాది వర్ణములయొక్క నానావిధములైనట్టిన్ని శాశ్వతములనగ కల్పాంతరములనుంచి నడుచుచున్నట్టిన్ని మనువుచే జెప్పబడి నధర్మములను జెప్పగలనని మంగళార్థమై యీశ్లోకమును భృగుశిష్యుడుపఠించెనని గోవిందరాజ సర్వజ్ఞనారాయణరాఘవానందులు వ్యాఖ్యానమును జేసిరి- కుల్లూకభట్టుమొదలగువారు - మనుమేకాగ్రమాసీనమనుశ్లోకము మొదటిమనుశబ్దము మంగళకరమైనదని వ్యాఖ్యానమును జేసిరి - యీశ్లోకము వీరువ్రాయలేదు.

మూ॥ మనుమేకాగ్రమాసీన మభిగమ్య మహర్షయః। ప్రతిపూ
జ్య యథాన్యాయ మిదంవచన మబ్రువన్॥ ౧॥

టీక.—యీమానవధర్మశాస్త్రమందు మనుమేకాగ్రమాసీనమనునదిమొదలుకొని శ్రూయతామనుశ్లోకమువరకుగల నాలుగుశ్లోకములచే మహర్షులుగావించిన ధర్మ విషయకమగు ప్రశ్నయందు పండితుల ప్రవృత్తికి నుపయోగించునట్టి విషయసంబంధప్రయోజనములు వచింపబడియె - నందువిషయము-ధర్మము- ప్రత్యక్షానుమానోపమాన ప్రమాణములకుదూరమై - స్వర్గమోక్షాదులకు సాధనమగుధర్మము - శాస్త్రముచేతనే తెలియందగునది గావున ధర్మముతోగూడ వచనసందర్భరూపమగు మానవశాస్త్రమునకు ప్రతిపాద్య ప్రతిపాదకరూపముసంబంధము - శాస్త్రముప్రతిపాదకము ధర్మముప్రతిపాద్యము - స్వర్గమోక్షాదులు ధర్మాధీనములుగావున నదియె ప్రయోజనము- దీనియందైతే ప

వనయోధ్యాలయులు...సపుర సిం

త్న్యగమాదికామవృత్త్యర్థంబునుం జెప్పబడియున్న దదియును ఋతుకాల మతిక్రమించకుండ భార్యనుబొందవలయుననియు స్వదారయందే నిరతుండుగా వలయునను నియమములుండుటచే నాకామంబును ధర్మమే యగుచున్నది - ఇటులనే యర్థార్జనవిషయంబునుంగల దదియు నొకొర్క గింజచొప్పునగాని ధాన్యపువిస్నలుగాని యేరికొనుమను మొదలగు నియమములుండుటచే నిదియును ధర్మమేయగుచున్నది - మోక్షమున కుపాయముగా నిందుజెప్పబడిన యాత్మజ్ఞానంబునుధర్మమేకావున ధర్మవిషయత్వమున్ను మోక్షోపదేశకత్వమున్ను దీనికిసిద్ధమే యోగ్యులగుశిష్టులు పరిగ్రహించుటవలనను వేదమందు ప్రశంస కెక్కుటవలనను-వేదము మూలముగాగలవి గావున పౌరుషేయములైనప్పటికిని మనువాక్యములు ప్రమాణములు.

శ్రు॥ మనుర్వైయత్కించి దవదత్తద్భేషజం॥ మనువుకొంచమైననేమిజెప్పెనో యది యౌషధమని ఛాందోగ్యబ్రాహ్మణమందును. వేదార్థోప నిబంధృత్వాత్ప్రాధాన్యంహి మనోస్స్మృతం। మన్వర్థ విపరీతాతు యాస్మృతిస్సాన శస్యతే । తావచ్ఛాస్త్రాణి శోభంతే తర్కవ్యాకరణానిచ । ధర్మార్థమోక్షోపదేష్టా మనుర్యావన్నదృశ్యతే॥ వేదార్థమునుసంగ్రహించి చెప్పుటవలన నీమనుస్మృతిస్మృతులలో ప్రధానము గావుననే మనుశాస్త్రార్థమునకు విపరీతముగనుండిన స్మృతిప్రశస్తముగాదు ధర్మార్థకామమోక్షముల నుపదేశించు మనుశాస్త్రమునుజూచు దనుకనే తర్కవ్యాకరణాదిశాస్త్రంబులు శోభించునని బృహస్పతి స్మృతియందునుం జెప్పబడియె॥ మరియు ॥ శ్లో ॥ పురాణం మానవోధర్మస్సాంగోవేద శ్చికిత్సితం । ఆజ్ఞాసిద్ధానిచత్వారి నహంతవ్యానిహేతుభిః॥ పురాణములు - మానవధర్మము - సాంగమగువేదము - చికిత్సాశాస్త్రంబు - నీనాలుగు నాజ్ఞాసిద్ధంబులు గావున హేతువాదములచే గొట్టదగవని మహాభారతమందు జెప్పబడియె నదియును విరోధిబౌద్ధాదితర్కములచే నని దెలియవలయు మీమాంసాదితర్కం బనుకూలమేగావున నిది ప్రవర్తింపజేయందగు నట్లు గావుననే॥ శ్లో॥ ఆర్షం ధర్మోపదేశంచ సమ్యక్ఛాస్త్రావిరోధినా । యస్తర్కేణాను సంధత్తె సధర్మం వేదనేతరః॥ ఆర్షమనగా వేదమును ధర్మశాస్త్రమును సచ్ఛాస్త్రావిరోధియగు తర్కంబుచే నెవ్వండనుసంధించు నతండే ధర్మంబెరింగినవాడితరుం డెరుగడని ముందుజెప్పగలదు సకలవేదార్థ మననంబువలన మనువన్యోన

ను నిర్వచనంబున నగుమనుశబ్దమీ గ్రంథంబు మొదలనుండుట మంగళార్థమగుచు న్నది పరమాత్ముండే సంసారస్థితికై సర్వజ్ఞుఁడై సర్వైశ్వర్యాదిసంపన్నుండగుమనువై ప్రాదుర్భవించెంగావున నీమనునామంబు మంగళాతిశయద్యోతకంబై యొప్పె గావుననే॥ శ్లో॥ "ఏనమేకేవదంత్యగ్నిం మనుమన్యే ప్రజాపతిం॥" ఇతనినిగొందరగ్నినిగానున్ను కొందరుసృష్టికర్తయగు మనువునుగానున్ను ముందుజెప్పగలరు స్వస్థచిత్తుండును సుఖోపవిష్టుండునగు స్వాయంభువమనువునుగూర్చి మహర్షులభిముఖముగాజని యతనిచే కుశలప్రశ్నాసనదానాదులచే సత్కరించబడిన పిమ్మట నతనిని వారుబూజించి న్యాయముదప్పకుండ ననగా॥ శ్లో॥ "నాపృష్టః కస్యచిద్బ్రూయా న్నచాన్యాయేనపృచ్ఛతః॥" అడగనివానికిని నన్యాయముగా నడిగినవానికిని ధర్మమునుజెప్పవలదనియుండుటచే ప్రణతిభక్తిశ్రద్ధావినయాదులతో నీవక్ష్యమాణప్రకారమగు వచనమునుబలికిరి॥ ౧॥

మూ॥ భగవంత్సర్వవర్ణానాం యథావదను పూర్వశః। అంతరప్రభవానాంచ ధర్మాన్నోవక్తుమర్హసి॥ ౨॥

ఏమని యడిగిరనిన॥ ఓషడ్గుణైశ్వర్య సంపన్నుడా ఇది భగవన్నను సంబోధనకర్థము షడ్గుణములనగా నైశ్వర్యము పరాక్రమము యశస్సు సంపత్తియు జ్ఞానము వైరాగ్యము నీయారు నెవనికి పూర్ణముగ గలుగునతడు భగవంతుడనబడును గావున నట్లతని నభిముఖునిగాజేసికొని బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రవర్ణములకును సంకరజాతులకు నెవనికేది ధర్మమోయన నాశ్రమధర్మంబులుగూడ నదిక్రమంబుగ జాతకర్మంబు నాపిమ్మట నామకరణంబు నిట్లాధర్మములనెల్ల మాకు జెప్పుటకు నీవతగుదువు॥ ౨॥

ప్రశ్నోత్తరములు.

జరాయుజాం డజానాంచ తథా సంస్వేదజోద్భిదాం।
భూతగ్రామస్య సర్వస్య ప్రభవం ప్రళయంతథా ॥ ౧ ॥
ఆచారాంశ్చైవ సర్వేషాం కార్యాకార్య వినిర్ణయం ।
యథాకాలం యథాయోగం వక్తుమర్హస్యశేషతః॥ ౨॥

ఈరెండుశ్లోకములకును నందనుడును రామచంద్రుడునువ్రాసి వ్యాఖ్యజేసిరి-ఈ

ల్లూకభట్టు మొదలగువారు వ్రాయనేలేదు జరాయుజాది చతుర్విధమగు భూత జాతములన్నిటియొక్క సంభవప్రళయములనున్ను ఆప్రకారముగానె అందరియొక్క యాచారములనున్ను తత్తత్కాలమును యథాయోగముగ వచించుటకు తగుదువు॥ ౨॥

మూ॥ త్వమేకోహ్యస్యసర్వస్య విధానస్య స్వయంభువః। అచిం
త్యస్యాప్రమేయస్య కార్య తత్వార్థవిత్ప్రభో॥ ౩॥

సకలధర్మములను జెప్పుట కతండే యోగ్యుండెట్లయ్యెననిన ఓ ప్రభువా యనగా- ధర్మాధర్మముల నేర్పరుపసమర్థుండా - ఏదికారణంబున నీవొక్కరుండవే - యీప్రత్యక్షంబుగ వినబడుచున్నట్టియు స్మృత్యాదులచే నూహించదగినట్టియు పురుషులచే రచించబడక స్వయంవ్యక్తమయినట్టియు బహుశాఖలుగలిగి వేర్వేరుగ నుండుటవలన నింతయని యూహింప శక్యముగానట్టియు - మీమాంసాది న్యాయాపేక్షలేకుండం దెలియరాని నిరూపణము గలిగినట్టియు దేనిచే నగ్నిహోత్రాదికర్మములు విధించబడునో యదివిధానమనబడు- నదియ వేదంబట్టి వేదసంబంధమగు కార్యమనగా జేయదగిన యగ్నిష్టోమాదికము- తత్వమనగా॥ శ్రు॥ "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ"యని కాలత్రయమందు నేకరీతిగ- బాధలేకుండునది-స్వయముగా బ్రకాశించునదియు- నన్నిచోటుల నెల్లకాలమును పూర్ణముగ కొసలేకనుండునది- బ్రహ్మంబని దెల్పు- సకలోపనిషత్తత్వమున్ను- అనగా- వేదములుపనన్నిటిని నీవొక్కరుడవ యెరుంగుదువదిగాన నీవమాకు ధర్మమును దెల్పుమనిబుషులడిగిరి- యీశ్లోకమందు- కార్యతత్వమనుచో- కర్మమీమాంసావాసనచే- శ్రుతియొక్క కార్యమనేది- తత్వమనగా వేదార్థమని మేధాతిథియను వ్యాఖ్యాతవ్రాసె - నదికాదు - వేదములు బ్రహ్మవిషయ మయిన్ని ప్రమాణములుగా - నంగీకరించుటవలెనని కుల్లూకభట్టు వ్రాసెను॥ ౩॥

మూ॥ సతైఃపృష్ట స్తథాసమ్య గమితౌజామహాత్మభిః। ప్రత్యువా
చార్చ్యతాన్ సర్వా న్మహర్షీం చ్ఛ్రూయతామితి॥ ౪॥

ఆమనువు - జ్ఞానమందును-తత్వమును చెప్పడమందున పారమైనసామర్థ్యముగలవాడు గావుననే - మహాత్ములగునామహర్షులచే- నట్లుదాను భక్తియు

క్తముగనమునబడినవారైై-యమ్మహామునులందరికిని సత్కరించి వినుండని-యుపక్రమించిచెప్పెను - ధర్మోపదేశంబు-సత్కారపూర్వకంబుగ- జేయందగునని-ఫలితార్థము-మనువు చెప్పినగ్రంథములో - నామనువుచెప్పెనని యన్యప్రణీతముగునట్లనుట యుక్తముగాదు - నేనుజెప్పెదనని యుండవలయునను శంకరాగా తరుచుగా బ్రాచీనగ్రంథకర్తల శైలి- పరులుపదేశించునటులె కనబడుచున్నది- "క్షర్మాణ్యాపిజైమినిః ఫలార్థత్వా"దని జైమినియును -"తదుపర్యపిబాదరాయణస్సంభవా"దను శారీరకమీమాంసయందువ్యాసులును- పరోపదిష్టముగానే చెప్పిరి- ఈ లాగుగాకుండిన - మనూపదిష్టంబులగు ధర్మంబులనమ్మనువుగారి యనుజ్ఞగొని తచ్ఛిష్యుడగు భృగుమహాముని - యీగ్రంథంబు రచించెనని జెప్పబడియున్నది॥ శ్లో ॥ ఏతద్వోయం భృగుశ్శాస్త్రం శ్రావయిష్యత్యశేషతః ॥ ఈశాస్త్రము భృగువుని శ్శేషముగ-మీకువినిపింపగలడని యుండుటవలననున్ను - మనువుచెప్పెననున దియుక్తమె-మనువుచే నుపదేశింపబడిన ధర్మములగుటచే - మానవీయసంహిత యని చెప్పబడుచున్నది॥ ౪॥

మూ॥ ఆసీదిదం తమోభూత మప్రజ్ఞాతమలక్షణం। అప్రతర్క్య
మ విజ్ఞేయం ప్రసుప్తమివసర్వతః॥ ౫॥

వినుండనియుపక్రమించిన యర్థమును జెప్పుచున్నాడు- అయ్యా- మునులు ధర్మంబడిగిన నదిజెప్పటయుచితము - కారణంబగు బ్రహ్మంబున లీనంబగుజగంబుయొక్క సృష్టి నుపక్రమించుట యప్రస్తుతంబికేమియని శంకరాగా నిచ్చట మేధాతిథి-శాస్త్రముయొక్క పెద్దప్రయోజనమీసకలంబుచేతనే జెప్పబడును-బ్రహ్మమొదలు స్థావరపర్యంతంబునగు - సంసారగతులు- ధర్మాధర్మనిమిత్తములిందు జెప్పబడును॥ శ్లో ॥"తమసా బహురూపేణ వేష్టితాః కర్మహేతునా॥" కర్మము హేతువుగాగల బహుప్రకారంబగుతమంబుచే - బద్ధులగుచున్నారనియును ॥ శ్లో॥ "ఏతాదృష్ట్వాస్య జీవస్య గతిస్స్వేనైవ చేతసా । ధర్మతోధర్మతశ్చైవ ధర్మేదద్యా త్సదామనః॥" ఈజీవుని ధర్మాధర్మంబుల వలననగునీగతులను - తమమనంబుచే నరసి ధర్మంబునందు మనస్సునుంచవలయుననియు-నీగ్రంథంబున నె జెప్పంగలడు - నిరతిశయైశ్వర్య హేతువుధర్మంబు-తద్విపరీతంబధర్మంబు-వాటిస్వరూపంబు దెలియుటకై - యీశాస్త్రంబు- మహాప్రయో

జనంబధ్యయనంబు జేయందగునని యధ్యాయతాత్పర్యమును జెప్పెను - గోవింద రాజు యిదియే సమాధానమని జెప్పెను - యివిబాగుండలేదని కుల్లూకభట్టుధర్మ మునడిగినవో - ధర్మమాత్రముం జెప్పి-దానిఫలప్రశంస జేయుటయు నప్రస్తుతమే గావచ్చును- మునులుధర్మఫలమునడిగిన ద్వాదశాధ్యాయమందు జెప్పబడు ననియె- గాన-మునులు ధర్మమునడిగిన-జగత్కారణంబగు - బ్రహ్మస్వరూపంబు- నిరూపించుటయును ధర్మకథనమే గావున నదియప్రస్తుతంబుగాదు|| శ్లో|| "ధృతిఃక్షమాదమోఽస్తేయం శౌచమింద్రియ నిగ్రహః । ధీర్విద్యా సత్యమక్రోధో దశకంధర్మలక్షణం||" ధైర్యము-సహనము-అంతరింద్రియనిగ్రహము - చౌర్యము లేకుండుట-శుచిత్వము-బహిరింద్రియనిగ్రహము - బుద్ధి-విద్య-సత్యము- క్రోధములేకుండుటయు- నీపదియును ధర్మస్వరూపములనియుండుటచే - నిందువిద్యయనగా ధర్మజ్ఞానమదియు ధర్మమని జెప్పబడియె || శ్లో|| "ఆత్మజ్ఞానం తితిక్షాచధర్మస్సాధారణోనృప||" స్వస్వరూపజ్ఞానమున్ను- ద్వంద్వసహనమున్ను- సాధారణమగు ధర్మమని మహాభారతమునందునుంగలదు|| శ్లో||"అయంతు పరమోధర్మో యద్యోగేనాత్మదర్శనం||" యోగముచే నాత్మదర్శనము పరమధర్మమని యాజ్ఞవల్క్యులున్ను జెప్పిరి|| సూ || "అథాతో బ్రహ్మజిజ్ఞాసా"యనుదాని యనంతరసూత్రము|| సూ||"జన్మాద్యస్యయతః"యీగజముయొక్క సృష్టిస్థితిలయములు దేనివలన నయ్యెనో యదిబ్రహ్మంబని వ్యాసులు జెప్పుటవలన బ్రహ్మంబ జగత్కారణంబని|| శ్రు|| "యతోవాఇమాని భూతానిజాయంతే- యేనజాతానిజీవంతి- యత్ప్రయంత్యభిసంవిశంతి- తద్విజిజ్ఞాసస్వ-తద్బ్రహ్మేతి" దేనివలన నీభూతములు పుట్టినవో దేనిచే జీవించుచున్నవో - దేనియందు బ్రవేశించిలయమైయున్నవో-దానిం దెలియనిచ్ఛజేయుమదియె బ్రహ్మంబని-సృష్టిస్థితిలయనిమిత్తోపాదానము - బ్రహ్మమనియుపపాదించుట యాత్మజ్ఞానరూపపరమధర్మము - దానిదెలియుటకై- ప్రథమాధ్యాయమునురచించి-సంసారాదిరూపంబగు ధర్మంబును. తదంగంబుగా ద్వితీయాధ్యాయాదిక్రమంబున జెప్పగలడు - గావున విరోధమేమియులేదని జెప్పెను- మరియు ప్రశ్నోత్తర వాక్య స్వారస్యంబున నీయర్థము తెల్లంబగు - నందరికిని బ్రత్యక్షముగ బ్రకాశించుటవలన నిదియనగా జగంబు దమంబున లయంబు నొందినదై - యనగా గుణవృత్తిచే దమంబునం బ్రకృతి దానియందు సూక్ష్మరూపంబున లీనమయ్యె నీయర్థమునకు|| శ్రు || "తమఆసీత్తమసా గూఢమ

గ॥ "ముందుగ చీకటివలె నేనినిం గనపడకుండ జేయుగ - దమంబనం బ్రకృతియ య్యె- దానిచే నిది కనపడకుండె- నదిగానం బ్రత్యక్షగోచరంబుగానిదై యొక చి హ్నమైనలేనిదై- యూహించుటకై నశక్యంబై నదై - యప్పుడు శబ్దంబులేకుండుట చే దెలియనశక్యంబై - యంతయు నిద్రితమగునట్లయ్యె - ననగా జగంబులేదనుటే గాదు ॥ శ్రు॥ "తద్వేదంతర్హ్యవ్యాకృతమాసీత్॥" విచారించగా నీజగంబా బ్రహ్మ మై- అప్పుడు నామరూపవిభాగము లేకుండనుండెనని ॥ శ్రు॥ "సదేవసోమ్యేదమగ్ర ఆసీత్॥" ముందుగనిది- బ్రహ్మమే ఆయెనని ఛాందోగ్యోపనిషత్తు - యీజగంబప్పు డు- బ్రహ్మరూపమై - స్వకార్యమందు సమర్థముగాకయుండెనని తాత్పర్యము. ధరణీధరుని వ్యాఖ్యానంబును నిట్టులనే యుండెను॥ ౫॥

మూ॥ తతస్స్వయం భూర్భగవానవ్యక్తో వ్యంజయన్నిద । మ
హాభూతాది వృత్తౌజాః ప్రాదురాసీ త్తమోనుదః॥ ౬॥

ఆప్రళయావసానానంతరమందు - జీవులవలె కర్మాధీనుడుగాక తనంత టతానగు భగవంతుడనగా పరమాత్మ - బాహ్యేంద్రియాగోచరుడై పంచమహా భూత మహదహంకారాదులను ముందుగ సూక్ష్మరూపముగానున్ను- నట స్థూల రూపముగానున్ను బ్రకాశింపజేయుచు బ్రకృతిప్రేరకుడై యప్రతిహతమగు సృ ష్టిసామర్థ్యముగలవాడై ప్రాదుర్భవించెను- యీశ్లోకమందు- దమోనుదః యను దానికి ప్రళయమును ధ్వంసింపజేయుచున్నదని మేధాతిథి గోవిందరాజుల వ్యాఖ్యా నము॥ ౬॥

మూ॥ యోసావతీంద్రియగ్రాహ్య స్సూక్ష్మోవ్యక్త స్సనాతనః।స
ర్వభూతమయోచింత్య స్సఏవ స్వయముద్బభౌ॥ ౭॥

అతీంద్రియగ్రాహ్యుడనగా - ఇంద్రియములనతిక్రమించినమనస్సుచేగ్ర హించదగినవాడు॥ శ్లో॥ "నైవాసౌ చక్షుషాగ్రాహ్యోనచశిష్టైరతీంద్రియైః। మ నసాతు ప్రసన్నేన గృహ్యతే సూక్ష్మదర్శిభిః॥" నేత్రముచేగాని - తదితరేంద్రియ ములచేగాని గ్రహించబడక- నిర్మలమగుమనస్సుచేతనే యతీంద్రియద్రష్టలచేనీబ్ర హ్మము గ్రహించబడునని- వ్యాసులచే జెప్పబడెను - గావున మనోగ్రాహ్యుడును బహిరింద్రియముల కగోచరుడును నవయవరహితుడును నిత్యుండును సర్వభూ

తాత్మ్యుండును గావున నీ[illegible]యుంతయని కొలవ శక్యము గానివాడు నే పరమాత్మునీ డోయతండె స్వయముగా మహదాదికార్యరూపుడై ప్రాదుర్భవించెను॥ ౭॥

మూ॥ సోభిధ్యాయ శరీరాత్స్వా త్సిసృక్షుర్వివిధాః ప్రజాః ।
• అపఏవ ససర్జాదౌ తాసుబీజ మపాసృజత్॥ ౮॥

ఆపరమాత్ముడు నానావిధప్రజలనున్ను సృజించ నిచ్ఛయించినవాడై ఆ వ్యాకృతంబగు తనశరీరంబువలన నుదకంబు లుద్భవించెనని ధ్యానించి జలంబులనే సృజించెను ధ్యానపూర్వకసృష్టిని జెప్పి మనువుకు అచేతనయగు బ్రకృతిస్వతంత్రయై తాను జగద్రూపముగ బరిణమించుననను మతము సమ్మతముగాదు మరియేమ్మనిన అవ్యాకృతశక్త్యాత్మకంబై బ్రహ్మమే జగత్కారణ మను వేదాంతసిద్ధాంతమే యభిమతమని దోచుచున్నది యిటులనే ఛాందోగ్యోపనిషత్తులో నుండుటవలనశారీరసూత్రకర్తయగు వ్యాసులవారిచే సిద్ధాంతము చేయబడెను అవ్యాకృతమేప్రకృతి యనేతచ్ఛరీరమని భగవద్భాష్యకారీయ వేదాంతదర్శనమందు గానంబడుచున్నదనికుల్లూకభట్టు ఆజలములందు జగచ్ఛక్తిరూపమగు బీజము నారోపించెను॥ ౮॥

మూ॥ తదండమభవద్ధైమం సహస్రాంశుసమప్రభం । తస్మిన్
జజ్ఞే స్వయంబ్రహ్మా సర్వలోకపితామహః॥ ౯॥

ఆబీజము పరమేశ్వరేచ్ఛచే సువర్ణమువలె శుద్ధిగలదై సూర్యునివలె వెలుగుగలయండమాయెను యట్టి యండమందు హిరణ్యగర్భుండు సకల లోకములకున్ను బితామహుండై స్వయముగ బుట్టెను॥ ౯॥

మూ॥ ఆపోనారాఇతిప్రోక్తా ఆపోవై నరసూనవః । తా యద
స్యాయనంపూర్వం తేన నారాయణ స్స్మృతః॥ ౧౦॥

ఉదకములు నరుడనే బ్రహ్మవలన బుట్టినవి గావున నారములని చెప్పబడెను ఆనారము లీ పరమాత్మునకు నునికిపట్టగుటచే నతడు నారాయణుండని స్మృతులలో జెప్పబడియె గోవిందరాజు "అపోనరాఇతిప్రోక్తా" యని పఠించి నరాయణుడె "అన్యేషామపి దృశ్యతే" యను శాస్త్రము వలన దీర్ఘముగా నారాయణుడాయెనని వ్యాఖ్యానం బొనరించె కొందరాపోనారాయని పఠించి న

ల్లూకుభట్టు మొదలగువారు వ్యాఖ్యానములను జేసిరి॥ ౧౦॥

మూ॥ యత్తత్కారణమవ్యక్తం నిత్యం సదసదాత్మకమ్ । తద్వి
సృష్టస్సపురుషో లోకేబ్రహ్మేతికీర్త్యతే॥ ౧౧॥

పుట్టువుగలవారి కెల్లను కారణమైనట్టియు బహిరింద్రియముల, కగోచ రమైనట్టియు ఉత్పత్తినాశరహితమైనట్టియు సత్స్వభావుడై ప్రత్యక్షాదుల కగో చరుడగుటచే నసత్స్వభావుడువలె నుండుటయె స్వరూపముగాగల వే యాపర మాత్ముండు గలడో యాపరమాత్మచే బుట్టించబడి యాపురుషుండు లోకములో బ్రహ్మయని జెప్పబడుచున్నాడు॥ ౧౧॥

మూ॥ తస్మిన్నండే సభగవా నుషిత్వాపరివత్సరమ్ । స్వయమే
వాత్మనోధ్యానా త్తదండమకరోద్ద్విధా॥ ౧౨॥

ఆయండమందు భగవంతుడగు నాబ్రహ్మమందు జెప్పగల బ్రహ్మమాన ముచే నొకసంవత్సరముండి తనంతట దాని యండము రెండుగా గావలయు నని యాత్మగత ధ్యానమాత్రముచే నాయండము రెండు శకలములగు నట్లు గావిం చెను॥ ౧౨॥

మూ॥ తాభ్యాంసశకలాభ్యాంచ దివం భూమించనిర్మమే । మధ్యే
వ్యోమదిశశ్చాష్టా వపాంస్థానంచశాశ్వతం॥ ౧౩॥

టీక॥ ఆబ్రహ్మ ఆశకలములచేననగా మీదిశకలముచే స్వర్గమునున్ను క్రిందిశక లముచే భూలోకమునున్ను వాటిమధ్య నాకాశమునున్ను నెనిమిది దిక్కులనున్ను సముద్రమనునట్టి జలస్థానమునున్ను స్థిరముగా నిర్మించెను॥ ౧౩॥

శ్లో॥ "వైకారికంతైజసంచ తథాభూతాదిమేవచ । ఏకమేవ త్రిధాభూతమ హామిత్యేవ సంస్థిత .. ఇంద్రియాణాం సమస్తానాం ప్రభవం ప్రళయంతథా" ఈ సార్ధశ్లోకమునకు యెవరున్ను వ్యాఖ్యచేయలేదు క-గ-ట గ్రంధములలో వ్రాసి యున్నవని యెచ్చువాడు వ్రాసెను.

మూ॥ ఉద్వవహాత్మనశ్చైవ మనస్సదసదాత్మకం । మనసశ్చా
ప్యహంకార మభిమంతారమీశ్వరం॥ ౧౪॥

ఇంక మహత్తత్వాది క్రమముగా సృష్టినిర్మాణమని కనపరచుచున్నాడు ఆబ్రహ్మ పరమాత్మవలననె సద్రూపమయిన్ని ప్రత్యక్షముగానందున నసత్తగుటచే సదసద్రూపమగు మనస్సునుద్ధరించెను ॥ శ్రు ॥ "ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్స ర్వేంద్రియాణిచ । ఖంవాయుర్జ్యోతిరాపశ్చ పృథ్వీవిశ్వస్యధారిణీ" ఈబ్రహ్మమువలన ప్రాణము మనస్సు అన్నియింద్రియములు ఆకాశము జ్యోతి జలములు విశ్వమునుధరించినభూమిన్నీ పుట్టుచున్నవి మనస్సుకంటె పూర్వమహంకారతత్వమునున్ను స్వకార్య కరణక్షముండగు నీశ్వరునిన్ని యుద్భవింపజేసెను॥ ౧౪॥

మూ॥ మహాంతమేవ చాత్మానం సర్వాణి త్రిగుణానిచ। విషయాణాం గ్రహీతౄణి శనైఃపంచేంద్రియాణిచ॥ ౧౫॥

నామరూపవిభాగములేని చిచ్ఛక్తి ప్రవృత్తిగానదానితోగూడినపరమాత్మ ఆహంకారముకంటె మున్నుగమహత్తత్వము నుద్భవింపజేసెను యీసరికి చెప్పబడినవాటినిన్ని ముందుచెప్పగలవాటినిన్ని శబ్దస్పర్శరూపరసగంధములను గ్రహించే శ్రోత్రాదిపంచబుద్ధీంద్రియములనున్ను వాగాది పంచకర్మేంద్రియములనున్ను త్రిగుణయుక్తములగువాటినన్నింటినిన్ని బుట్టించెను॥ ౧౫॥

"శ్లో॥ అవిశేషా న్విశేషాంశ్చ ఉపాయాంశ్చ పృథగ్విధాః॥" దీనికి వ్యాఖ్యానములేదు- క - గ - పుస్తకములోవున్నది

మూ॥ తేషాం త్వవయవాన్సూక్ష్మాన్ షణ్ణామప్యమితౌజసాం। సన్నివేశ్యాత్మమాత్రాసు సర్వభూతాని నిర్మమే॥ ౧౬॥

అనంతములగు కార్యముల నిర్మాణములచే యొప్పచున్నవి గావుననే ఆరైన యహంకారపంచతన్మాత్రలయొక్క సూక్ష్మావయవముల నయ్యారింటివికారములగు నింద్రియమహాపంచభూతములతో యోజించి యాపరమాత్ముడు సకలభూతములను నిర్మించెను అనగా నహంకారవికారములింద్రియములు పంచతన్మాత్రవికారములు స్థూలదేహములు వీటిసంఘాతములతో నహంకార తన్మాత్రావయవములకలిపి చేసెనని తాత్పర్యము॥ ౧౬॥

మూ॥యన్మూర్త్యవయవా స్సూక్ష్మా స్తస్యేమాన్యాశ్రయంతిషట్। తస్మాచ్ఛరీర మిత్యాహు స్తస్య మూర్తిం మనీషిణః॥ ౧౭॥

ఏ కారణమువలన శరీరమున్ను తత్సంపాదకములగు తన్మాత్రాహంకారరూపములైన యారవయవములున్ను ప్రవృత్తియుక్తుడగు బ్రహ్మయొక్క యీచెప్పబోయెడిశరీరములను మున్నుబలకబడిన ఇంద్రియములను కార్యత్వముచే నాశ్రయించినవో యదికారణము వలన నాబ్రహ్మయొక్క మూర్తివనగా నింద్రియముల తోనొప్పుచున్న మూర్తిగా పరిణమించిన స్వభావమును శరీరమని విద్వాంసులుశరీరనిర్వచనమును జెప్పిరి॥ శ్లో॥"ప్రకృతేర్మహాం స్తతోఽహంకార స్తస్మాద్గణశ్చ షోడశకః। తస్మాదపిషోడశకా త్పంచభ్యః పంచభూతాని" ప్రకృతి వలన మహత్తత్వంబు దాని వలన నహంకారము దానివల్ల షోడశవికారముల గణము అనగా బంచతన్మాత్రలున్ను బదియింద్రియములున్ను మనస్సును వీటిలో బంచతన్మాత్రల వలన పంచమహాభూతములున్ను బుట్టెనని జెప్పబడియున్నది గాన మున్నుజెప్పబడినయుత్పత్తిక్రమము దృఢమై చేయ బడెను॥ ౧౭॥

మూ॥ తదావిశంతిభూతాని మహాంతిసహకర్మభిః। మనశ్చావ
యవై స్సూక్ష్మై స్సర్వభూతకృదవ్యయమ్॥ ౧౮॥

టీక॥ పంచతన్మాత్రరూపుడైయున్న పరమాత్ముని యాకాశాది పంచమహాభూతములున్ను వాటివాటికర్మములతో గూడ నావేశించుచున్నవి యనగా పంచతన్మాత్రలనగా పంచమహాభూతములున్ను బుట్టెననుట కర్మములనగా ఆకాశమునకు నవకాశములిచ్చుట వాయువునకు నవయవవిన్యాసరూపము కర్మముఅగ్నికి పాకాదిరూపమున్ను పిండీకరణమున్ను కర్మము జలమునకు నాడీకరణము భూమికిధారణము మరియు నహంకారరూపమగు బ్రహ్మమున మనస్సావేశించెననగా నహంకారమువలన బహిరింద్రియాగోచరములును శుభాశుభసంకల్ప మనోజన్య సుఖదుఃఖాది రూపావయవములతో సకలభూతోత్పత్తి నిమిత్తమున్ను నాశరహితమునయిన మనస్సు పుట్టెననుట॥ ౧౮॥

మూ॥ తేషామిదంతు సప్తానాం పురుషాణాం మహౌజసాం।
సూక్ష్మాభ్యో మూర్తి మాత్రాభ్య స్సంభవత్యవ్యయా
ద్వ్యయం॥ ౧౯॥

తాము చేసెడి కార్యములందు సామర్థ్యముగల పూర్వోక్తనులైన మ

హదహంకార పంచతన్మాత్రల యేడింటిసంబంధములగు సూక్ష్మములై ననీశరీరము లను బుట్టించెడి భాగములనుండి యశాశ్వతమగు నీజగత్తు శాశ్వతుడగు పరమాత్మునివలన నాయెను ఈశ్లోకములో పురుషుడగు పరమాత్మునివలన పుట్టినవేగావున మహదాదులేదున్ను పురుషశబ్దముచే జెప్పబడెను కార్యమట్ల నశక్యమేగావున జగము శాశ్వతను దీనికారణ మింతకంటే శాశ్వతను సర్వకారణమగు బ్రహ్మము నిత్యముగావున బ్రహ్మోపాసన మావశ్యకమని ఈయనవాదము॥ ౧౯॥

మూ॥ ఆద్యాద్యస్య గుణం త్వేషా మవాప్నోతి పరఃపరః। యో

యోయావతిథ స్తేషాం ససతావద్గుణస్స్మృతః॥...౨౦॥

పూర్వశ్లోకమందు జెప్పబడిన యాకాశాది భూతములలో పూర్వపూర్వభూతముల శబ్దాదిగుణములను పైపైభూతములు స్వీకరించును వీటిలో యేదేది యున్నదో అదియది యన్నేసి గుణములుగలదగునని మన్వాదులచే జెప్పబడెను అదెట్లన్న ముందు జెప్పగల భూతగుణములలో నాకాశమునకు శబ్దమొకటియే గుణము వాయువునకు శబ్దమున్ను స్పర్శయున్ను వహ్నికి శబ్దస్పర్శరూపములున్ను పృధివికి శబ్దస్పర్శరూపరసగంధములున్ను గుణములాయెను॥ ౨౦॥

మూ॥ సర్వేషాంతు సనామాని కర్మాణిచ పృథక్పృథక్ । వేద

శబ్దేభ్యఏవాదౌ పృథక్సంస్థాశ్చనిర్మమే॥ ౨౧॥

హిరణ్యగర్భుడగు నాపరమాత్ముడందరికిని వేరువేర గోవు అశ్వము నను మొదలగు నామంబులను బ్రాహ్మణులకు నధ్యయనాదికము క్షత్రియులకు ప్రజాపాలనము నిట్లవి మొదలగు కర్మములను నింక వేరువేరుగ కుమ్మరులకు ఘటనిర్మాణము తంతువాయులకు బట్టలనేతయు మొదలగు లౌకికవ్యవస్థలును మొదలను వేదశబ్దములచేతనే నిర్మించెను వేదశబ్దములవలన నర్థమునుదెలిసి కల్పాంతరకృత కర్మసంస్కారానుసారముగ నొనచేను ॥ సూ ॥ "వేదపూర్విక్త్వైవ జగత్సృష్టి ర్వ్యుత్పాదితా" వేదమూలముగానే జగత్తుయొకటి సృష్టిచెయ్యబడెనని వేదమీమాంసయందు వ్యాసులవారిచే జెప్పబడెను॥ ౨౧॥

మూ॥ కర్మాత్మనాంచ దేవానాం సోఽసృజ త్ప్రాణినాంప్రభుః।

సాధ్యానాంచగణంసూక్ష్మం యజ్ఞంచైవసనాతనం॥౨౨॥

అబ్రహ్మ ప్రాణులయొక్కయున్ను కర్మస్వభావులగు ఇంద్రాది దేవతలయొక్కయున్ను సాధ్యులనే దేవయోనివిశేషులయొక్కయున్ను అథార్తు ప్రాణులయొక్కయున్ను సూక్ష్మములగు గణములయొక్కయున్ను సనాతనమగు అనగా కల్పాంతరమందున్ను ఊహింపబడ్డటువంటి యజ్ఞమునున్ను సృజించెను॥ ౨౨॥

మూ॥ అగ్నివాయు రవిభ్యస్తు త్రయం బ్రహ్మసనాతనం। దుదో
హ యజ్ఞసిద్ధ్యర్థ మృగ్యజు స్సామలక్షణమ్॥ ... ౨౩॥

సనాతనమును ఋగ్యజుస్సామ సంజ్ఞకమైన వేదత్రయమును అగ్నివలనను వాయువలనను సూర్యునివలనను బ్రహ్మ యజ్ఞసిద్ధికొరకుగా నాకర్షించెను బ్రహ్మ సర్వజ్ఞుండుగావున నాస్మృతిచే పూర్వకల్పాంతమునందు నేవేదములుండెనో వాటినేతిసికొనెను ॥ శృతి॥ "అగ్నేఋగ్వేదోవాయోర్యజుర్వేద ఆదిత్యాత్సామవేద ఇతి" అగ్నివలన ఋగ్వేదమును వాయువువలన యజుర్వేదమును సూర్యునివలన సామవేదమునున్ను అనే శృత్యర్థము మున్నున్నవాటికే నేపితికె ననుట చెల్లును ఆకర్షించెననగా దెచ్చి ప్రకాశింపజేసెనని తాత్పర్యము॥ ౨౩॥

మూ॥ కాలంకాల విభక్తీశ్చ నక్షత్రాణి గ్రహాంస్తథా । సరి
త స్సాగ రాంశ్శైలాం త్సమాని విషమాణిచ॥ ౨౪॥

సూర్యుడు మొదలగు జ్యోతిస్సులయొక్క క్రియాసముదాయరూపమగు కాలమునున్ను మాసములు ఋతువులు అయనములు మొదలగు కాలావయవములనున్ను కృత్తికాదినక్షత్రములనున్ను సూర్యాదిగ్రహములనున్ను నదులనున్ను సముద్రములనున్ను పర్వతములనున్ను సమభూములనున్ను మెరకపల్లములుగల భూములనున్ను బ్రహ్మసృజించెనుయీక్రియాపదముతరువాతశ్లోకమునుంచి తేవడమైనది॥ ౨౪॥

మూ॥ తపోవాచం రతించైవ కామం చక్రోధ మేవచ । సృష్టింసస
ర్జచైవేమాం స్రష్టుమిచ్ఛన్నిమాః ప్రజాః॥ ౨౫॥

కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సునున్ను వాక్కునున్ను మనస్సంతుష్టినిన్ని కోరికనున్ను కోపమునున్ను యీ రెండుశ్లోకములలో చెప్పినసృష్టిని యీ చెప్పగల దైవాదిప్రజలను సృజించవనిచ్ఛయించుచున్ను బ్రహ్మసృజించెను॥ ౨౫॥

మూ॥ కర్మణాంచవివేకార్థం ధర్మాధర్మౌవ్యవేచయత్। ద్వంద్వై రయోజయచ్చేమాః స్సుఖదుఃఖాదిభిః ప్రజాః॥ ౨౬॥

ధర్మమనగా యజ్ఞాదికము చేయదగినది యధర్మము బ్రహ్మహత్యాదికము చేయరానిది యీధర్మాధర్మములను కర్మముల కృత్యాకృత్యవివేకముకొరకు సృజించెను మఱియు ధర్మఫలముసుఖము నధర్మఫలముదుఃఖము నిట్లుధర్మాధర్మఫలరూపములగు సుఖదుఃఖాదిద్వంద్వములతో నీప్రజలనుగలిపెను ఆదిశబ్దముచే కామక్రోధరాగద్వేషక్షుత్పిపాస శోక మోహాదికములు ప్రజలకుకల్గజేసెను॥ ౨౬॥

మూ॥ అణ్వ్యోమాత్రావినాశిన్యోదశార్ధానాంతుయాస్మృతాః। తాభిస్సార్ధమిదంసర్వం సంభవత్యనుపూర్వశః॥ ౨౭॥

పంచమహాభూతములయొక్క సూక్ష్మములగు పంచతన్మాత్రలున్ను మహాభూతములుగా బరిణమించినవి గావున వినాశశీలములగునని యేవిచెప్పబడినవో వాటితోగూడ నీపూర్వోక్తము వక్ష్యమాణమునగు నీసకలజగత్తున్ను క్రమముగాననగా సూక్ష్మమువలన స్థూలమును స్థూలమువలన నతిస్థూలము నిట్లు సంభవించుచుండెను సర్వశక్తియగు బ్రహ్మయొక్క మానససృష్టికిన్ని తత్సనిరపేక్షఅయినేమాయనియిట్లు మధ్యనుస్మరింపజేసెను॥ ౨౭॥

మూ॥ యంతుకర్మణియస్మిన్ స న్యయుఙ్త్తప్రథమంప్రభుః। సతదేవస్వయంభేజే సృజ్యమానః పునఃపునః॥ ౨౮॥

ఆబ్రహ్మ ముందుగా యేజాతిజంతువను యేకర్మమందు నియోగించెనో యాజాతిజంతువు మరలమరల సృజించబడుచున్నదై స్వకీయ పూర్వకర్మవాసనావశతచే యాకర్మమునే తనంతటదానొందెనదియెట్లనిన పులిజాతికి లేడినిచినుట స్వాభావికముగావున ఆజాతికల్లా నాకర్మము స్వయముగానే సంభవించును గాన బ్రహ్మ తత్తత్ప్రాణులకర్మముల ననుసరించే యుత్తమాధమజాతులను సృజించెనుగాని వైషమ్యముచేగాదని కనపర్చబడియె అదిగావుననే॥ "యథాకర్మ తపోయోగాత్సృష్టంస్థావరజంగమమితి॥" బ్రహ్మ తనయోగముచే ప్రాణులకర్మముల నతిక్రమించకుండ స్థావరజంగమప్రపంచమును సృజించెనని యిందులో ముందుజెప్పగలదు॥ ౨౮॥

మూ॥ హింస్రాహింస్రే మృదుక్రూరే ధర్మాధర్మావృతానృ
తే। యద్యస్యసోదధాత్సర్గే తత్తస్యస్వయమావిశేత్ ॥౨౯॥

హింసాకర్మము సింహాదులకు గజవధాదికము అహింసాకర్మము లేడిమొదలగువాటికి తృణాదిభక్షణముమృదుకర్మము బ్రాహ్మణునకు దయాప్రధానముక్రూరకర్మము క్షత్రియాదులకు యుద్ధాదికము ధర్మమనగా బ్రహ్మచర్యగురుశుశ్రూషాదికము అధర్మమనగా వానికేమాంసమైథునసేవాదికము దేవతలకు తరుచుగా సత్యము మనుష్యులకుతరుచుగానసత్యము॥ శ్రు॥ "సత్యావాచోదేవా అనృతవాచో మనుష్యా" అని ఇవిసృష్ట్యాదియందెవనికేదిబ్రహ్మసృజించెనో వానికదిస్వయముగా నావేశించును॥ ౨౯॥

మూ॥ యథర్తులింగాన్యృతవ స్స్వయమేవర్తుపర్యయే। స్వా
నిస్వాన్యభిపద్యంతే తథా కర్మాణిదేహినః॥ ౩౦॥

ఇందుకుదృష్టాంతము- వసంతాదిఋతువులచిహ్నములనగా మావిడిచెట్లుపూయడము మొదలగునవి యేఋతువువచ్చినప్పుడు ఆఋతుచిహ్నములు వాటియంతటనవి యేలాగునావిర్భవించునో ప్రాణులకు హింసాదికర్మములు పూర్వానుసారముగా నగుచుండును॥ ౩౦॥

మూ॥ లోకానాంతు వివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః। బ్రా
హ్మణం క్షత్రియం వైశ్యం శూద్రంచ నిరవర్తయత్ ॥౩౧॥

భూమియందగు జనులవృద్ధికొరకు బ్రహ్మతనముఖమువలన బ్రాహ్మణులనున్ను బాహువులవలన క్షత్రియులనున్ను తొడలవలన వైశ్యులనున్ను పాదములవలనశూద్రులనున్ను సృజించెను ఇందుకు- "బ్రాహ్మణోస్యముఖమాసీ"దనుశ్రుతి॥ శ్లో॥ "అగ్నౌప్రాస్తాహుతిస్సమ్య గాదిత్యముపతిష్ఠతే। ఆదిత్యాజ్జాయతేవృష్టిః వృష్టేరన్నంతతః ప్రజాః॥" అనునట్లు బ్రాహ్మణాదులచేత వేల్చబడిన యాహుతిసూర్యునిబొంది నతనివలన వర్షమగు నందువలన నన్నమున్ను దానివలనబ్రజలున్ను గలుగుదురని ముందుజెప్పబడును గాన వృద్ధికొరకనుటయుచితము॥ ౩౧॥

మూ॥ ద్విధాకృత్వాత్మనోదేహ మర్ధేన పురుషోభవత్। అర్ధే
ననారీతస్యాంస విరాజమసృజత్ప్రభుః॥ ౩౨॥

ఆబ్రహ్మ తనదేహమును రెండుభాగములుగాజేసి యందొకభాగముచే పురుషుడాయెను రెండవభాగముచే స్త్రీయై యందువిరాట్టును బుట్టించెను॥ శ్రు॥ "తతోవిరాడజాయత॥" దానివలన విరాట్టుపుట్టెనని॥ 32॥

మూ॥ తప స్తప్త్వా సృజద్యంతు సస్వయం పురుషోవిరాట్ । తం మాంవిత్తాస్య సర్వస్య స్రష్టారం ద్విజస త్తమాః॥ 33॥

ఆవిరాట్టుతపస్సుజేసి యెవరిని నిర్మించెనో యతనిని యీసర్వమునుసృజించే నన్ను మనువును గానో బ్రాహ్మణోత్తములారా తెలసికొనుడు తనజన్మము... యుత్కృష్టమని తాజెప్పినధర్మములయందు విశ్వాసముగలుగుటకై జెప్పెనని కుల్లూకభట్టువ్రాసెను॥ 33॥

మూ॥ అహం ప్రజాస్సిసృక్షు స్తు తప స్తప్త్వా సుదుశ్చరం। పతీన్ ప్రజానామసృజం మహర్షీ నాదితోదశ॥ 34॥

నేను బ్రజలనుసృజించ నిశ్చయించినవాడనై ముందుగా దుశ్చరమగు దపంబొనర్చి పదుగురుఋషులను బ్రజాపతులను వారిని సృజించితిని॥ 34॥

మూ॥ మరీచిమత్ర్యఙ్గిరసౌ పుల స్త్యం పులహంక్రతుం । ప్రచేతసంవసిష్ఠంచభృగుంనారదమేవచ॥ 35॥

వారెవ్వరనిన మరీచి యత్రి యంగిరస్సు పులస్త్యుడు పులహుడు క్రతుడు ప్రచేతస్సు వసిష్ఠుడు భృగుడు నారదుడు యీపదిమందినిన్ని సృజించెను॥ 35॥

మూ॥ ఏతేమనూంస్తు సప్తాన్యానసృజన్భూరి తేజసః। దేవాన్దేవనికాయాంశ్చ మహర్షీంశ్చా మితౌజసః॥ 36॥

మరీచిమొదలైన తేజశ్శాలురగు పదుగురున్ను మిక్కిలితేజోవంతులగు మరియేడ్వురమనువులను దేవతలనున్ను దేవతలకుస్థానములగు స్వర్గాదులనున్ను మహర్షులనున్ను సృజించిరి మనుశబ్దమధికారవాచకము సర్గాదియందు బ్రజాసృజనమునందు సమర్థునకు మనువనుపేరు సెల్లును॥ 36॥

మూ॥ యక్షరక్షః పిశాచాంశ్చ గంధర్వాప్సరసోరగాన్ । నా

నాగాన్సర్పాన్ సుపర్ణాంశ్చ పితౄణాంచ పృథగ్గణాన్॥

యక్షులు రాక్షసులు పిశాచములు గంధర్వులు నప్సరులు నసురులను వాసుకి ప్రముఖనాగులనందు నీటిపాము మొదలగు సర్పములను గరుడులను వేరువేర పితృగణములనున్ను సృజించెను. ౩౭॥

మూ॥ విద్యుతో శనిమేఘాంశ్చ రోహితేంద్ర ధనూంషిచ। ఉల్కా
నిర్ఘాతకేతూంశ్చ జ్యోతీంష్యుచ్చావచానిచ॥ ౩౮॥

టీ॥ మెరుపులనున్ను పిడుగులనున్ను మేఘములనున్ను కొరడ్లనున్ను శక్రచాపములనున్ను నిర్ఘాతజ్వాలలనున్ను భూమ్యంతరిక్షములబుట్టినధ్వనినిన్ని ధూమకేతువులనున్ను పెద్దచిన్నచుక్కలనున్ను॥ ౩౮॥

మూ॥ కిన్నరా న్వానరాన్మత్స్యా న్వివిధాంశ్చ విహంగమాన్।
పశూన్మృగా న్మనుష్యాంశ్చ వ్యాళాంశ్చో భయతో
దతః॥ ౩౯॥

నరశరీరమున్ను గుర్రపుమోమున్నుగల దేవయోనివిశేషములగు కిన్నరులనున్ను కోతులనున్ను చేపలనున్ను నానావిధపక్షులనున్ను వేళ్లుమొదలగు మృగములనున్ను మనుష్యులనున్ను సింహవ్యాఘ్రాదులనున్ను క్రిందనుమీదను దంతములుగల యశ్వాదులనున్ను॥ ౩౯॥

మూ॥ కృమికీట పతంగాంశ్చ యూకామక్షిక మత్కుణం। స
ర్వంచ దంశ మశకం స్థావరంచ పృథగ్విధం॥ ౪౦॥

చిన్నపురుగులనున్ను పెద్ద పురుగులనున్ను మిడతలనున్ను చీరపేలలనున్ను యీగలనున్ను నల్లులనున్ను చిన్నదోమలనున్ను పెద్దదోమలనున్ను తరుగుల్మలతాభేదముగల వేరువేరగుస్థావరములనున్ను॥ ౪౦॥

మూ॥ ఏవమేతై రిదంసర్వం మన్నియోగా న్మహాత్మభిః। యథా
కర్మతపోయోగా త్సృష్టంస్థావర జంగమం॥ ౪౧॥

ఈప్రకారముగా మహాత్ములగు మరీచ్యాదులచేత తత్తత్ప్రాణులకర్మ

హంకార ములననుసరించి తపస్సుజేసి స్థావరజంగమాత్మకమగు జగత్తు నానియోగము వలనసృజించబడెను॥ ४०॥

మూ॥ యేషాంతు యాదృశంకర్మ భూతానా మిహకీర్తితం ।
తత్తథా వోఽభిధాస్యామి క్రమయోగంచ జన్మని॥ ४२॥

ఈ సంసారమందు నేభూతములకై తే నెటువంటికర్మము పూర్వాచార్యులచే బ్రాహ్మణులకు నధ్యయనాదికము ఓషధులు ఫలపాకాంతములై ఫలపుష్పాదికముల గనపర్చునని జెప్పబడెనో యట్టికర్మము నాప్రకారముగా మీకు జన్మక్రమయోగమునున్ను జెప్పగలను॥ ४२॥

మూ॥ పశవశ్చ మృగాంశ్చైవ వ్యాళాంశ్చో భయతోదతః । ర
క్షాంసిచ పిశాచాంశ్చ మనుష్యాశ్చ జరాయుజాః॥ ४३॥

జన్మాదిక్రమయోగమనగా దానినివివరించు చున్నాడు గోమహిషాదులున్ను మృగములున్ను సింహాదులున్ను గుర్రములుమొదలగు కిందిమీది పళ్లుగలవిన్ని పిశాచములున్ను మనుష్యులున్ను మావివలన జన్మించినవి॥ ४३॥

మూ॥ అండజాఃపక్షిణస్సర్పా నక్రామత్స్యాశ్చకచ్ఛపాః। యాని
చైవంప్రకారాణి స్థలజాన్యౌదకానిచ॥ ४४॥

సర్పములు మొసళులు చేపలు తాబేళ్లు ఇకనీప్రకారమగు స్థలజములు తొండలు బల్లులు మొదలగునవిన్ని జలజములగు జలగలుమొదలగునవిన్ని గుడ్లవలన బుట్టుకగలవి॥ ४४॥

మూ॥ స్వేదజందంశమశకం యూకామక్షికమత్కుణమ్।ఊష్మణ
శ్చోపజాయంతే యచ్చాన్య త్కించిదీదృశమ్॥ ४५॥

ఈగలు దోమలు పేలు నల్లులున్ను నీప్రకారమయినవన్నియున్ని ఉకవలన బుట్టును గావున స్వేదజము లనబడుచున్నవి॥ ४५॥

మూ॥ ఉద్భిజ్జా స్థావరా స్సర్వే బీజకాండప్రరోహిణః।ఓషధ్యః
ఫలపాకాంతాః బహుపుష్పఫలోపగాః॥ ४६॥

గంజలవలనను కొమ్మలవలనను మొలిచే స్థావరములెల్లను భూమిని భేదించుకొని జన్మించునవి అందు బహుపుష్పఫలములనుగూడినవియై పంటకావడముతోనే నశించేవి యోషధు లనిపించుకుంటున్నవి॥

మూ॥ అపుష్పాః ఫలవంతో యే తే వనస్పతయ స్స్మృతాః। పుష్పిణః ఫలినశ్చైవ వృక్షా స్తూభయత స్స్మృతాః॥ ४२॥

పుష్పములు పూయక ఫలించునవి వనస్పతులనబడు నవిన్ని పుష్పించి ఫలించునవి వానస్పతులవిన్నిగాగా వృక్షములు రెండుప్రకారములు॥ ४२॥

మూ॥ గుచ్ఛగుల్మంతు వివిధం తథైవతృణ జాతయః। బీజకాండరుహాణ్యేవ ప్రతానా వల్ల్యఏవచ॥ ४८॥

మొదటినుంచిన్ని తీవిలగాబుట్టేవి మల్లి కాదులు గుచ్ఛములనబడును వేరొకటిౖపై పిలకలుపెట్టిపొదవలె బెరుగునవి రెల్లు చెరుకు మొదలగునవి గుల్మము లనబడును నేలను పాకిరి బలియు గరికె మొదలగునవి తృణజాతి తీగెలుగా మొలచి చెట్లను పాకిరి కొనలకు కొనబుట్టి బలియు గుమ్మిడి ఆనబ గుమ్మడి మొదలగునవి లతలివియన్నియు బీజకాండరుహములే॥ ४८॥

మూ॥ తమసాబహురూపేణ వేష్టితాః కర్మహేతునా। అంతస్సంజ్ఞాభవంత్యేతే సుఖదుఃఖసమన్వితాః॥ ४९॥

ఈ వృక్షముల ధర్మాకర్మము హేతువుచే దుఃఖము ఫలముగా గల యధికముగు తమోగుణముచే వ్యాప్తములై పైకి తెలివి యున్నట్లు కనపడకుండి యంతస్సంజ్ఞగలవై కొంచమైన సత్వగుణమున్ను కలవి గావున వహ్యాదికముచే సుఖమును దుఃఖమును గలవై యగుచున్నవి॥ ४९॥

మూ॥ ఏతదంతాస్తుగతయో బ్రహ్మాద్యాస్సముదాహృతాః। ఘోరేఽస్మిన్భూతసంసారే నిత్యంసతతయాయిని॥ ५०॥

అనాదిగా తెంపులేని భయంకరమగు జననమరణ ప్రవాహము సంతతము నడుచుచున్న సంసారమందు బ్రహ్మ మొదలుకొని యీ స్థావరపర్యంతము ... తములయొక్క జన్మములు కథితములాయెను॥

మూ॥ ఏవంసర్వంససృష్ట్వేదం మాంచాచింత్యపరాక్రమః । ఆ
త్మన్యంతర్దధేభూయః కాలంకాలేనపీడయన్॥ ౫౧॥

సృష్ట్యనంతరమున ప్రళయమును జెప్పుచుండు ప్రకారముగా నచింత్యశక్తియగు బ్రహ్మ యీసమస్తమునున్న నన్నును సృజించి మరల సృష్టికాలమును బ్రళయకాలముచే పీడించుచు స్వస్వరూపమం దంతర్ధానము నొందె ననగా నాశరీరమును విడచెననుట ప్రాణుల కర్మవశముచే సృష్టిలయము లిట్లు చేయుచుండును॥ ౫౧॥

మూ॥ యథాసదేవోజాగర్తి తదేదంచేష్టతేజగత్ । యదాస్వ
పితిశాంతాత్మా తదాసర్వంనిమీలతి॥ ౫౨॥

ఆబ్రహ్మ యెప్పుడు సృష్టిస్థితుల నిచ్ఛయించి జాగరూకుడై యుండునో యప్పుడీజగము శ్వాసోచ్ఛ్వాసాహారాది చేష్టలనొందును యెప్పుడీజగము నుపసంహరించనిచ్ఛయించి శాంతాత్ముడై సుప్తినొందునో యప్పుడు జగమాత్మయందు లీనమగును॥ ౫౨॥

మూ॥ తస్మిన్స్వపితిసుస్థేతు కర్మాత్మానశ్శరీరిణః । స్వకర్మ
భ్యోనివర్తంతే మనశ్చగ్లానిమృచ్ఛతి॥ ౫౩॥

ఆప్రజాపతి మనశ్శరీరవ్యాపారములను విడచి యున్నవాడైనచో కర్మసంపాదితశరీరులగు ప్రాణులు శరీరగ్రహణాదికర్మముల వలన నివర్తింతురు వారి మనస్సులు సర్వేంద్రియములగూడ వృత్తిరహితములగును॥ ౫౩॥

మూ॥ యుగపత్తుప్రలీయంతే యదాతస్మిన్మహాత్మని। తథాయం
సర్వభూతాత్మా సుఖంస్వపితి నిర్వృతః॥ ...... ౫౪॥

ఇంక మహాప్రళయమును జెప్పుచున్నాడు- ఏకాలమందు నొకమారు సకలభూతములు నాపరమాత్మయందు లీనమగుచున్నవో యప్పుడు సర్వభూతాత్ముడు జాగ్రత్స్వప్న వ్యాపారములవలననివర్తించినవాడై సుఖముగ సుషుప్తుడువలెనుండును నతండు నిత్యానందస్వరూపుడైనను జీవధర్మోపచారమని తెలియవలయును॥ ౫౪॥

మూ॥ తమోయంతు సమాశ్రిత్య చిరంతిష్ఠతి సేంద్రియః। నచస్వం
కురుతేకర్మ తదోత్క్రామతిమూర్తితః॥ ...... ౫౫॥

ఇప్పుడు ప్రళయప్రసంగముచే జీవునియుత్క్రమణమును రెండుశ్లోకములచేత జెప్పుచున్నాడు- ఈజీవుడు జ్ఞాననివృత్తినొంది యింద్రియాదియుక్తుడై చిరకాలముంటున్నాడు ఎప్పుడు శ్వాసోచ్ఛ్వాసాదికమగు స్వీయమగు కర్మమును జేయకుండునో యప్పుడు పూర్వదేహమువలన నుత్క్రమించిపోవును లింగశరీరావచ్ఛిన్నుడగు జీవుని యుద్గమనమువలన నటులజెప్పబడెను ॥ శ్రు ॥ "తముత్క్రామంతంప్రాణోఽనూత్క్రామతి । ప్రాణమనూత్క్రామంతి సర్వప్రాణా అనుత్క్రామంతి ప్రాణాయింద్రియాణి" ఉత్క్రమించుచున్న యాజీవాత్మననుసరించి ప్రాణమున్ను దానిననుసరించి మిగిలినప్రాణములున్ను వాటిననుసరించి యింద్రియములున్ను ఉత్క్రమించుచున్నవని బృహదారణ్యకోపనిషత్తు॥ ౫౫॥

మూ॥ యదాణుమాత్రికోభూత్వా బీజంస్థాస్ను చరిష్ణుచ। సమా
విశతిసంసృష్ట స్తదామూర్తిం విముంచతి॥ ... ౫౬॥

ఆజీవుడెప్పుడణురూపములగు మాత్రలనగా పుర్యష్టకముగలవాడై యనగా భూతములు నింద్రియములు మనస్సు బుద్ధి వాసనలు కర్మము ప్రాణములు నవిద్యయు నీయెనిమిదియు పుర్యష్టకమనబడును వీటినొంది స్థావరహేతువుగానీ జంగమహేతువుగాని యైన బీజమునధిష్ఠించుచున్నాడో యప్పుడు పుర్యష్టకయుక్తుడై కర్మానుసారమగు స్థూలదేహాంతరము నొందుచున్నాడు ॥ శ్లో ॥ "భూతేంద్రియమనోబుద్ధి వాసనాకర్మవాయవః । అవిద్యాచాష్టకంప్రోక్తం పుర్యష్ట మృషిసత్తమైః" ఈయెనిమిదిన్ని పుర్యష్టకమని పెద్దలచే జెప్పబడెనని సనందవచనము ॥ శ్లో ॥ "పుర్యష్టకేనలింగేన ప్రాణాద్యేనసయుజ్యతే । తేనబద్ధస్య వైబంధో మోక్షోముక్తస్యతేనతు" పుర్యష్టకరూపమగు లింగశరీరముతో బంధముగలవాడు బద్ధుడు దానితో ముక్తిగలవాడు ముక్తుడని బ్రహ్మాండపురాణము॥ ... ౫౬॥

మూ॥ ఏవంసజాగ్రత్స్వప్నాభ్యా మిదం సర్వంచరాచరం। సం
జీవయతిచాజస్రం ప్రమాపయతి చావ్యయః ... ॥౫౭॥

అవ్యయుండగు నాబ్రహ్మ తన జాగ్రత్స్వప్నములచే నీప్రకారముగ నీసకలచ

రాచరజగత్తును సంతతమును బ్రవిశించుచు చంపుచున్నాడు॥ ౫౭॥

మూ॥ ఇదంశాస్త్రంతు కృత్వాసౌ మామేవస్వయమాదితః। విధి
వద్గ్రాహయామాస మరీచ్యాదీన్ మహామునీన్॥... ౫౮॥

ఈబ్రహ్మ యీశాస్త్రమును రచించి సృష్ట్యాదియందు తాను నాకు సాంగోపాంగముగజెప్పెను నేను మరీచ్యాది మహామునులకుజెప్పితిని- ఓయీ శాస్త్రము బ్రహ్మచే నిర్మింపబడెనుగదా మానవమని దీనికిం బ్రసిద్ధి రాకారణంబేమియని శంక రాగా శాస్త్రమన విధినిషేధములవి బ్రహ్మమనువునకుపదేశించిన నతండీశాస్త్రమును రచించెనని మేధాతిథి యీశాస్త్రము బ్రహ్మనిర్మితమైనప్పటికిని మనువు మునులకుపదేశించుటవలన మానవమయ్యెను వేదమపౌరుషేయమయినప్పటికి కాఠకములను సంజ్ఞ గలిగినట్లులని రామచంద్రాదులు కొందరు బ్రహ్మలక్షగ్రంథము జేసి మనువునకుజెప్పిన నతండది సంగ్రహించి యీగ్రంథమును రచించిన మనుస్మృతియనుటకు కారణమని కుల్లూకభట్టును సమాధానమునుజెప్పిరి "శతసాహస్రోయం గ్రంథఇతిస్మరతిస్మ" అని నారదస్మృతి॥ ౫౮॥

మూ॥ ఏతద్వోయం భృగుశ్శాస్త్రం శ్రావయిష్యత్యశేషతః। ఏత
ద్ధిమత్తోధిజగే సర్వమేషోఖిలంమునిః॥ ౫౯॥

ఈభృగుమహాముని నావలన సర్వమును సాంగముగ నధ్యయనమొనర్చె గావున మీకితండు దీనిని శ్శేషముగ గరపునని మనువనియె॥ ౫౯॥

మూ॥ తతస్తదాస తేనోక్తో మహర్షిర్మనునాభృగుః। తానబ్రవీ
దృషీన్సర్వాన్ప్రీతాత్మా శ్రూయతామితి॥ .....౬౦॥

ఆ మనువుచే నాభృగుమహర్షి యాప్రకారముగా వచింపబడినవాడై సంతుష్టమనస్కుడగుచు నటపై నా సమస్తమైన ఋషులకును వినుండనిచెప్పెను॥౬౦॥

మూ॥ స్వాయంభువస్యాస్య మనోష్షడ్వంశ్యా మనవః పరే। సృ
ష్టవంతః ప్రజాస్స్వాస్స్వా మహాత్మానో మహౌజసః॥౬౧॥

ఈ స్వాయంభువమనువుయొక్క వంశ్యులారుగురు మనువులు మహాత్ములును మహాతేజస్కులునై తమతమ ప్రజలను సృజించిరి॥ ౬౧॥

మూ॥ స్వారోచిషశ్చోత్తమశ్చ తామసో రైవత స్తథా । చాక్షు
షశ్చమహాతేజా వివస్వత్సుతఏవచ॥ ౬౨॥

స్వారోచిషుడు నుత్తముడు తామసుడు రైవతుడు చాక్షుషుడు వైవస్వతు
డు నీయారుగురి పేరులు చెప్పబడెను॥ ౬౨॥

మూ॥ స్వాయంభువాద్యాస్సప్తైతే మనవో భూరితేజసః । స్వే
స్వేంతరేసర్వమిద ముత్పాద్యా పు శ్చరాచరమ్॥ ౬౩॥

అధికమగు తేజముగల స్వాయంభువుడు మొదలగు నేడ్వురు మనువులు దమత
మ యధికారమందు నీసకలమైన చరాచరమును సృజించి పరిపాలించిరి॥ ౬౩॥

మూ॥ నిమేషాదశచాష్టౌచ కాష్ఠాత్రిం శత్తుతాఃకలా । త్రింశ
త్కలాముహూర్తఃస్యా దహోరాత్రంతుతావతః॥౬౪॥

నిమేషమనగా రెప్పపాటు యివిపదునేనిమిదియైన నొకకాష్ఠయను కాలవిశే
షము ముప్పదికాష్ఠలుకల ముప్పదికలలు ముహూర్తము ముప్పదిముహూర్తము
లొకయహోరాత్రము॥ ౬౪॥

మూ॥ అహోరాత్రేవిభజతే సూర్యోమానుషదైవికే । రాత్రి
స్స్వప్నాయభూతానాం చేష్టాయైకర్మణామహః॥ ౬౫॥

భూతములనిద్రకై రాత్రిన్ని కర్మానుష్ఠానముకై పగలున్ను గాగా మానుష
దైవికములగు రాత్రిపవళులను సూర్యుడు విభజించుచున్నాడు॥ ౬౫॥

మూ॥ పిత్ర్యే రాత్ర్యహనీమాసః పరిభాగస్తుపక్షయోః । కర్మ
చేష్టాస్వహఃకృష్ణ శ్శుక్లస్స్వప్నాయశర్వరీ॥ ౬౬॥

మనుష్యుల మాసము పితృదేవతల కొక దినమగు నందు కృష్ణపక్షము వారికి
పవలున్ను శుక్లపక్షమందు నిద్రకై రాత్రిన్ని॥ ౬౬॥

మూ॥ దైవేరాత్ర్యహనీవర్షం ప్రవిభాగ స్తయోఃపునః। అహ స్త
త్రోదగయనం రాత్రిస్స్యాద్దక్షిణాయనమ్॥ ౬౭॥

మనుష్యుల సంవత్సరము దేవతల కొక దినమగు నందుత్తరాయణము పగలు

దేవకర్మ లన్నియు నుత్తరాయణమందే చేయవలయును దక్షిణాయనము రాత్రి॥ ౬౭॥

మూ॥ బ్రాహ్మస్యతుక్షపాహస్య యత్ప్రమాణం సమాసతః । ఏకైకశో యుగానాంతు క్రమశ స్తన్నిబోధత॥ ౬౮॥

బ్రహ్మయొక్క యహోరాత్రప్రమాణమున్ను ప్రత్యేకముగా యుగముల యొక్క ప్రమాణమున్ను జెప్పెదను వినుండు బ్రహ్మమానముచే నగు నహోరాత్రాదిజ్ఞానము పుణ్యసాధనము గావున నిచ్చట చెప్పుట॥ ౬౮॥

మూ॥ చత్వార్యాహుస్సహస్రాణి వర్షాణాంతుకృతంయుగం। తస్యతావచ్ఛతీసంధ్యా సంధ్యాంశశ్చతథావిధః॥ ౬౯॥

దేవమానముచే నాలుగువేల సంవత్సరములు కృతయుగప్రమాణము దీనిసంధ్య నన్నూరువర్షములు సంధ్యాంశమునకున్ను నాలుగువందల వర్షనులే యగుచున్నవి.యుగమునకు పూర్వసంధిసంధ్యయని యుత్తరసంధి సంధ్యాంశమని సంకేతము॥ శ్లో॥ "తత్ప్రమాణైశ్శతై స్సంధ్యా పూర్వాతస్యాభిధీయతే। సంధ్యాంశకశ్చతత్తుల్యో యుగస్యానంతరోహియః। సంధ్యాసంధ్యాంశయోరంత ర్యఃకాలోమనుసత్తమ। యుగాఖ్యస్యతువిజ్ఞేయః కృతత్రేతాదిసంజ్ఞికః॥" యే యుగమున కెన్నివేలో యన్నివందలవత్సరములు యుగపూర్వసంధియనిన్ని అన్నేవర్షములయుగాంతమందగు సంధ్యాంశమనిన్ని మధ్యకాలము యుగమనిన్ని దెలియదగునని విష్ణుపురాణము"దివ్యైర్వర్షసహస్రైస్తు కృతత్రేతాదిసంజ్ఞికమ్ । చతుర్యుగం ద్వాదశభి స్తద్విభాగంనిబోధమే॥" కృతత్రేతాదియుగములు నాలుగున్ను సంధ్యాసంధ్యాంశములతోగూడ దేవమానముచేత పదిరెండువేల వర్షములగునని విష్ణుపురాణముగావుననీలెక్క దివ్యవర్షములని తెలియందగు నని కుల్లూకభట్టు॥ ౬౯॥

మూ॥ ఇతరేషుససంధ్యేషు ససంధ్యాంశేషుచత్రిషు। ఏకాపాయే నవర్తంతే సహస్రాణిశతానిచ॥ ౭౦॥

మిగిలిన మూడుయుగములకున్ను క్రమముగా నొక్కొక్క వేయియుగమునకున్ను సంధ్యకు నూరున్ను సంధ్యాంశమునకు నూరున్ను చొప్పున తక్కువగా నగును అదియెట్లనిన త్రేతకు మూడువేలరీతిని సంధ్యకు మున్నూరు సంధ్యాంశమున

కు మున్నూరు ద్వాపరమునకు రెండువేలు దీనిసంధ్యకు నిన్నూరు సంధ్యాంశము నకు నిన్నూరు కలియుగమున నొకవేయి దీనిసంధ్యకు నూరు సంధ్యాంశమునకు నూరు॥ ౭౦॥

మూ॥ యదేతత్పరిసంఖ్యాత మాదావేవచతుర్యుగం। ఏతద్ద్వాద
శసాహస్రం దేవానాం యుగముచ్యతే॥ ౭౧॥

పైని నాలుగుయుగములయొక్క సంఖ్యయేదిచెప్పబడెనో యీసంఖ్యదివ్యమా నముచేత పదిరెండువేల వర్షములపరిమితకాలము దివ్యయుగమని చెప్పబడెను- "ఏతద్ద్వాదశసాహస్రం" అన్నచోట చతుర్యుగములు పదిరెండైతే దివ్యయుగమ ని మేధాతిథివ్రాసెను గాని యిది భ్రమమని కుల్లూకభట్టువ్రాసెను॥ శ్లో॥ "కృత త్రేతాద్వాపరంచ కలిశ్చేతిచతుర్యుగం। ప్రోచ్యంతేతత్సహస్రంతు బ్రహ్మణోది వసోమునే॥" మానుషమానముచేనగు నాలుగుయుగములున్ను వేయుమార్లుదిరిగి తే బ్రహ్మకొకదివసమని విష్ణుపురాణవచనమువలన నాలుగుయుగములున్ను దివ్యవ ర్షములు సంధ్యాసంధ్యాంశములతోనగును॥ ౭౧॥

మూ॥ దైవికానాంయుగానాంతు సహస్రంపరిసంఖ్యయా। బ్రా
హ్మమేకమహర్జ్ఞేయం తావతీరాత్రిరేవచ॥ ౭౨॥

దేవమానముచేత వేయియుగములయితే బ్రహ్మకొకపవలగును మరియునంతి యకాలముచే రాత్రియగును॥ ౭౨॥

మూ॥ తద్వైయుగసహస్రాంతం బ్రాహ్మం పుణ్యమహర్విదుః।
రాత్రించతావతీమేవ తేహోరాత్రవిదోజనాః॥ ౭౩॥

వేయుమహాయుగములు కొనసాగగలకాలము బ్రహ్మయొక్క పుణ్యమైనపవలని న్ని యింతియె కాలము బ్రహ్మకొకరాత్రియనిన్ని తెలసినవారలేయహోరాత్రము లనుదెలసినవారని స్మృత్యర్థము॥ ౭౩

మూ॥ తస్యసోహర్నిశస్యాంతే ప్రసుప్తః ప్రతిబుధ్యతే। ప్రతిబుద్ధ
శ్చసృజతి మనస్సదసదాత్మకం॥ ౭౪॥

ఆబ్రహ్మ నిద్రితుడై తనయహోరాత్రాంతమందు మేలుకొనినవాడై సదసదా

త్మకమగు తనమనస్సును సృజించెను అనగా భూలోకాదిత్రయమును సృజించుటకు మనుస్సును నియోగించెనని తాత్పర్యము- మనుస్సును బుట్టించెననికాదు మనస్సృష్టిమహాప్రళయమందేగాని యిప్పుడదినశించదు దైనందినప్రళయమందీమూడు లోకములకే లయముగావున వాటిసృష్టికై నియోగించె ననవలెను॥ "మనస్సిసృక్షయాయుక్తం సర్గాయనిదధేపునః॥" సృష్టిజేయనిచ్ఛతోగూడియున్న మనస్సునుదిరుగసృష్టికై నియమించెనని పురాణ వచనము ఈలాగుగాకుంటే మనస్సనగా మహత్తత్వమనవలె నదియును మహాప్రళయానంతరసృష్టియేయనిన నీబ్రహ్మాయాపరమాత్మ్మదేగాన నప్పటిసృష్టిక్రమమునిందు సూచించెనని చెప్పవచ్చునట్లుగావున నే॥ "ఇత్యేషాసృష్టిరాదితః॥" ఇదిఆదిసృష్టియని చెప్పబోయెడి గ్రంథమటులగాకున్న వ్యర్థమయియాని యని కుల్లూకభట్టు॥ ౭౪॥

మూ॥ మనస్సృష్టిం వికురుతే చోద్యమానం సిసృక్షయా। ఆకా
శంజాయతే తస్మా త్తస్యశబ్దంగుణంవిదుః॥ ౭౫॥

మనస్సనగా మహత్తత్వము పరమాత్మునియొక్క సృజించేయిచ్ఛచేత ప్రేరితమై సృష్టినిజేసె నదియెట్లనిన నహంకారపంచతన్మాత్రక్రమంబున నే ఆమహత్తత్వమాకాశమును సృజించెను దానిగుణము శబ్దమనియందురు॥ ౭౫॥

మూ॥ ఆకాశాత్తువికుర్వాణా త్సర్వగంధవహాశ్శుచిః। బలవాఞ్
జాయతేవాయు స్సవై స్పర్శగుణోమతః॥ ౭౬॥

ఒకవికారమును బుట్టించెడి యాకాశమువలన శుచియు గంధమునువహించునట్టిన్ని బలముగలిగినట్టిన్ని వాయువుపుట్టెను. అదిస్పర్శమే గుణముగాగలది॥ ౭౬॥

మూ॥ వాయోరపి వికుర్వాణా ద్విరోచిష్ణుతమోనుదం। జ్యోతిరు
త్పద్యతేభాస్వ త్తద్రూపగుణముచ్యతే॥ ౭౭॥

వాయువువలన తేజముగలదియు ప్రకాశించునదియు చీకటినిబోగొట్టునదియునగు జ్యోతిస్సుబొడమె నదిరూపము గుణముగాగలది॥ ౭౭॥

మూ॥ జ్యోతిషశ్చవికుర్వాణా దాపోరసగుణాస్స్మృతాః । అ
ద్భ్యోగంధగుణాభూమి రిత్యేషాసృష్టిరాదితః॥ ౭౮॥

తేజస్సువలన రసముగుణముగాగల జలముద్భవించును ఆజలమువలన గంధగుణయుక్తమగు భూమిజన్మించె నిది మహాప్రళయానంతర సృష్ట్యాదియందగు భూతసృష్టి యాభూతములచేతనే యవాంతర ప్రళయానంతరమందును లోకత్రయ నిర్మాణమగుచున్నది॥ ౭౮॥

మూ॥ యత్ప్రాగ్ద్వాదశసాహస్ర ముదితందైవికం యుగం । త
దేకసప్తతిగుణం మన్వంతరమిహోచ్యతే॥ ౭౯॥

పూర్వమందు సంధ్యాసంధ్యాంశయుక్తములగు నాలుగు యుగములకు పన్రెండువేల దివ్యవర్షములు దివ్యయుగప్రమాణమని యేదిచెప్పబడెనో యాదివ్యయుగములు డెబ్బదియొకటియైన నొకమన్వంతరకాలమగు నందొకమనువు సర్గాద్యధికారమగుచున్నదని యీమనుశాస్త్రమందు జెప్పబడెను॥ ౭౯॥

మూ॥ మన్వంతరాణ్యసంఖ్యాని సర్గస్సంహార ఏవచ । క్రీడన్ని
వైతత్కురుతే పరమేష్ఠీ పునఃపునః॥ ౮౦॥

మన్వంతరములు పదునాలుగు అయినప్పటికిని సృష్టిలయము లనంతమగుటవలన లెక్కలేని మన్వంతరములనున్ను అటులె సృష్టిలయములనున్ను యీబ్రహ్మాలీలచేతనువలెను మరలమరల జేయుచున్నాడు॥ ౮౦॥

మూ॥ చతుష్పాత్సకలో ధర్మస్సత్యంచైవ కృతేయుగే । నా
ధర్మేణాగమః కశ్చిన్మనుష్యాన్ప్రతివర్తతే॥ ౮౧॥

కృతయుగమునందు సమస్తధర్మములున్ను సత్యమున్ను నాలుగుపాదములుగలదై సంపూర్ణముగ ప్రవర్తించును సత్యము ధర్మమైనప్పటికిని వేరే చెప్పడము అదియుత్తమధర్మమగుటవలన ధర్మమునకు ముఖ్యమగుపాదములు లేకుండిన చతుష్పాచ్ఛబ్దము సంపూర్ణపరమని తాత్పర్యము లేదా॥ శ్లో॥ "వృషోహిభగవాన్ధర్మః॥" యనిధర్మము వృషభరూపమని చెప్పుటవలన తపస్సు జ్ఞానము యజ్ఞము దానము యీనాల్గున్ను ఉత్తమములని మనువచనమువలన నివి నాల్గుపాదములుగా నిరూపించి ధర్మము సాంగోపాంగముగ వర్తించునని కుల్లూకభట్టుచెప్పెను శాస్త్రము నతిక్రమించి యధర్మముగ ధనాగమముగాని విద్యాగమముగాని మనుష్యులకు సత్యయుగమందు గాకయుండును॥ ౮౧॥

మూ॥ ఇతరేష్వాగమా ద్ధర్మః పాదశ స్త్వవరోపితః । చౌరి
కానృతమాయాభి ర్ధర్మశ్చాపైతి వేధసః॥ ౮౨॥

ఇతరములగు త్రేతాదియుగములందు అధర్మముచే ధనార్జనమువలన ధర్మముపాదము పాదము చొప్పున యనగా నాలవవంతుతరిగిపోవును యిచ్చట నాగమమనగా వేదమని మేధాతిథి గోవిందరాజులువ్రాసిరి ధనాగమమని కుల్లూకభట్టువ్రాసెను అదిన్ని చౌర్యము అనృతము మాయ వీటిచేతను ధనాగమమగుట వలన త్రేతాదియుగములందు నాలవపాలు త్తరో త్తరాధిక్యముగ చౌర్యాదులువృద్ధిబొందును గాన నారీతినే ధర్మముతగ్గిపోవును॥ ౮౨॥

మూ॥ అరోగా స్సర్వసిద్ధార్థా శ్చతుర్వర్ష శతాయుషః। కృ
తే త్రేతాదిషు హ్యేషా మాయుర్హ్రసతి పాదశః॥౮౩॥

కృతయుగమందు రోగాదినిమిత్తమగు నధర్మములేకుండుటచే నప్పటిజనులు నిరోగులును సకలకార్యసిద్ధికలవారును నన్నూరుసంవత్సరములు ఆయుర్దాయముకలవారునగుచున్నారు త్రేతాయుగాదుల యందీజనులకు ధర్మముతరిగినట్టే నాలవవంతుచొప్పున నాయుష్యమున్ను తరుగును అనగా త్రేతాయుగమందు జనులకాయుష్యము మున్నూరు సంవత్సరములు ద్వాపరమందిన్నూరు కలియుగమందునూరు నిట్లులగును "శతాయుఃపురుషః" యను వేదవాక్యమందగు శతశబ్దముబహుత్వపరముగాని యీశ్రుతికలియుగజనులకనిగాని గావచ్చును॥ ౮౩॥

మూ॥ వేదోక్తమాయు ర్మర్త్యానా మాశిషశ్చైవ కర్మణాం ।
ఫలంత్యనుయుగం లోకే ప్రభావశ్చ శరీరిణాం॥ ౮౪॥

శతాయుః పురుషయను వేదవచనముచేనగు నాయుష్యమున్ను కామ్య కర్మలయొక్క ఫలవిషయప్రార్థనమున్ను బ్రాహ్మణాదులయొక్క శాపానుగ్రహసమర్థమగు ప్రభావమున్ను యీలోకమందు యుగానుసారముగ మనుష్యులకు ఫలించుచున్నవి॥ ౮౪॥

మూ॥ అన్యే కృతయుగేధర్మా స్త్రేతాయాం ద్వాపరేపరే। అ
న్యేకలియుగే నౄణాం యుగహ్రాసానురూపతః॥ ౮౫॥

కృతయుగమందు ధర్మములువేరు త్రేతయందు మరియొకలాటి ధర్మములు ద్వాపరమందును కలియుగమందును ధర్మములు వేరువేర మనుష్యులకు యుగానురూపముగ తరగతితో వర్తించును॥ ౮౫॥

మూ॥ తపః పరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే। ద్వాపరే యజ్ఞమేవాహు ర్దానమేకం కలౌయుగే॥ ౮౬।

కృతయుగమందు తపంబును త్రేతాయుగమందాత్మజ్ఞానంబును ద్వాపరమందు యజ్ఞంబును కలియుగమందు కేవలదానంబును ప్రధానములు తపము మొదలగునవి నాలుగు నన్నియుగములయందునుం జేయందగినవే యైనను ఫలాతిశయంబు గలదని ప్రత్యేకం బిట్లు జెప్పబడియెను॥ ౮౬॥

మూ॥ సర్వస్యాస్యతు సర్గస్య గుప్త్యర్థం సమహాద్యుతిః। ముఖబాహూరుపజ్జానాం పృథక్కర్మాణ్య కల్పయత్॥ ౮౭॥

సమర్థుడగు నాబ్రహ్మ యీసమస్తసృష్టియొక్క రక్షణముకొరకు తనముఖమువలన బ్రాహ్మణులను బాహువులవలన క్షత్రియులను వైశ్యుల నూరువుల వలనను శూద్రులనంఘ్రులవలనను సృజించి వీరికి వేరు వేరకర్మములను గల్పించెను॥ ౮౭॥

మూ॥ అధ్యాపనంచాధ్యయనం యజనం యాజనంతథా। దానం ప్రతిగ్రహంచైవ బ్రాహ్మణానామకల్పయత్॥ ౮౮॥

బ్రాహ్మణులకు వేదమునుచదవడము చెప్పడము యజ్ఞమును జేయడము జేయించడము దానమునివ్వడము బ్రతిగ్రహించడమీయారును బ్రహ్మగల్పించెను యిచ్చట నివిసృష్టిక్రమములు జెప్పబడెను ముందు విధిరూపముగ జెప్పబడును॥ ౮౮॥

మూ॥ ప్రజానాం రక్షణం దాన మిజ్యాధ్యయన మేవచ। విషయేష్వ ప్రసక్తిశ్చ క్షత్రియస్య సమాసతః॥ ౮౯॥

ప్రజాపరిపాలనమున్ను దానమున్ను యజ్ఞమున్ను వేదముచదవడమున్ను విషయములందనగా గీతనృత్యస్త్రీభోగాదులయందు సంగములేకుండుటయు నివిక్షత్రియులకు ధర్మములుగా సంక్షేపరూపముచే గల్పించెను॥ ౮౯॥

మూ॥ పశూనాం రక్షణం దాన మిజ్యాధ్యయన మేవచ। వణిక్ప
థంకుసీదంచ వైశ్యస్య కృషి మేవచ॥ ౯౦॥

పశురక్షణము దానము యజ్ఞము నధ్యయనము క్రయవిక్రయములువడ్డిబేరము కృషియు నివివైశ్యులకు గల్పించబడెను॥ ౯౦॥

మూ॥ ఏక మేవతు శూద్రస్య ప్రభుః కర్మ సమాదిశత్। ఏతేషా
మేవవర్ణానాం శుశ్రూషామనసూయయా॥ ౯౧॥

బ్రహ్మ శూద్రునకు అసూయలేకుండ బ్రాహ్మణాదివర్ణత్రయమువారికి బనిజేయుటయొక్కటియే నిర్మించెను॥ ౯౧॥

మూ॥ ఊర్ధ్వంనాభే ర్మేధ్యతరః పురుషః పరికీర్తితః। తస్మాన్మే
ధ్యతమంత్వస్య ముఖము క్తంస్వయంభువా॥ ౯౨॥

సర్వముకంటె పురుషుడుశ్రేష్ఠుడు పురుషునకు నాభికంటె పైభాగము శ్రేష్ఠతరము అందులోముఖనుమిక్కిలిశ్రేష్ఠమని బ్రహ్మచేజెప్పబడెను ౯౨॥

మూ॥ ఉత్తమాంగో ద్భవా జ్జ్యైష్ఠ్యా ద్బ్రహ్మణశ్చైవ ధారణాత్।
సర్వస్యైవాస్యసర్వస్య ధర్మతో బ్రాహ్మణః ప్రభుః॥ ౯౩॥

ముఖము త్తమో త్తమమని పైనిజెప్పడమెందుకనిన ముఖమందుజన్మమువలననుక్షత్రియాదులకంటె ముందుగ బుట్టుటవలనను వేదమును ధరించుట వలనను యీజగమంతకును ధర్మానుశాసనమువలన బ్రాహ్మణుడు ప్రభువు॥ ౯౩॥

మూ॥ తంహి స్వయంభూస్స్వాదాస్యా త్తప స్తప్త్వాదితో సృ
జత్। హవ్యకవ్యాభివాహ్యాయ సర్వస్యాస్యచగుప్తయే॥ ౯౪॥

ఆబ్రాహ్మణుని బ్రహ్మతపంబొనర్చి తనముఖమువలన హవ్యకవ్యములను నడుపుటకును ఈసకలజగత్తుయొక్క రక్షణముకొరకును ముందుగసృజించెను॥ ౯౪॥

మూ॥ యస్యాస్యేన సదాశ్నంతి హవ్యాని త్రిదివౌకసః। కవ్యాని
చైవపితరః కిం భూతమధికం తతః॥ ౯౫॥

ఏబ్రాహ్మణునియొక్కముఖముచేత హవ్యములను దేవతలును కవ్యములను పితృ

దేవతలు నెల్లప్పుడును భక్షింతురో యాబ్రాహ్మణునికంటే నధికమగు భూతము మరేదికలదు బ్రాహ్మణుడందరికంటే నధికుడనియర్థము॥ ౯౫॥

మూ॥ భూతానాం ప్రాణినశ్శ్రేష్ఠాః ప్రాణినాం బుద్ధిజీవినః।
బుద్ధిమత్సునరాశ్శ్రేష్ఠా నరేషుబ్రాహ్మణాస్స్మృతాః॥ ౯౬॥

స్థావరజంగమభూతములలో ప్రాణులు శ్రేష్ఠములు ప్రాణులలోబుద్ధిచే జీవించునవి యనగా ననుకూలమైనస్థలములకు పోవడము ప్రతికూలమైన స్థలములను విడువడముగల పశ్వాదులు శ్రేష్ఠములు వాటికంటే మనుష్యులు శ్రేష్ఠులు మనుష్యులలో బ్రాహ్మణులు స్వర్గాపవర్గాధికారయోగ్యులగుటవల్లన నుత్తములని చెప్పబడిరి॥ ౯౬॥

మూ॥ బ్రాహ్మణేషుచ విద్వాంసో విద్వత్సుకృతబుద్ధయః। కృతబు
ద్ధిషు కర్తారః కర్తృషు బ్రహ్మవేదినః॥ ౯౭॥

బ్రాహ్మణులలో విద్వాంసులు మహాఫలప్రదనులగు నగ్నిష్టోమాది కర్మముల జేయనధికారులగుటచే శ్రేష్ఠులు విద్వాంసులలో కృతబుద్ధులనగా స్వాధీనబుద్ధులు నిదియుగాక ననాగతములగు కర్మములందు కృతబుద్ధులు అనగా వేదోక్తములగు సంస్కారములు తమచే చేయందగిన వనుబుద్ధిగలవారుత్తములు వీరిలో సత్కర్మ కర్తలు హితములను గూర్చుటకు నహితములను బరిహరించుకొనుటకుం దగినవారగుటవలనయోగ్యులు వీరలకంటెబ్రహ్మవేత్తలు ముక్తులుగాన నుత్కృష్టులు॥ ౯౭॥

మూ॥ ఉత్పత్తిరేవవిప్రస్య మూర్తిర్ధర్మస్యశాశ్వతీ । సహిధ
ర్మార్థముత్పన్నో బ్రహ్మభూయాయకల్పతే॥ ౯౮॥

బ్రాహ్మణునియొక్క జన్మమే నాశరహితమగు ధర్మముయొక్క మూర్తి యేది కారణముచే నతడు ధర్మమును జేయుటకేపుట్టినవాడై ధర్మానుగృహీతజ్ఞానముచే మోక్షమునొందుటకగుచున్నాడో॥ ౯౮॥

మూ॥ బ్రాహ్మణోజాయమానోహి పృథివ్యామధిజాయతే। ఈ
శ్వరస్సర్వభూతానాం ధర్మకోశస్యగుప్తయే॥ ౯౯॥

సర్వభూతములయొక్క ధర్మమను ధనరాశిని రక్షించుటకై భూమియందు

జన్మించుచున్న బ్రాహ్మణుడై ఈశ్వరుడు జన్మించుచున్నాడు॥ ౯౯॥

మూ॥ సర్వస్వం బ్రాహ్మణస్యేదం యత్కించిజ్జగతీగతం । శ్రై
ష్ఠ్యేనాభిజనేనేదం సర్వంవై బ్రాహ్మణోఽర్హతి॥ ౧౦౦॥

భూమియందేమేమి ధనముకలవో యిదంతయు బ్రాహ్మణునకు స్వయమనిస్తుతికై జెప్పబడెను స్వయమువంటిదేయని తాత్పర్యము అటులగాకున్నను బ్రాహ్మణునకు చౌర్యము శిక్షాశాస్త్రమందు మనువేలజెప్పడు బ్రహ్మముఖమందు బుట్టుటవలనను శ్రేష్ఠత్వమువలనను నీసర్వమునుగ్రహించుటకు బ్రాహ్మణుండే యర్హుడగుచున్నాడు॥ ౧౦౦॥

మూ॥ స్వమేవ బ్రాహ్మణోభుఙ్క్తే స్వంవస్తే స్వందదాతిచ । ఆన్ృ
శంస్యాద్బ్రాహ్మణస్య భుంజతేహీతరేజనాః॥ ...౧౦౧॥

బ్రాహ్మణుడు పరునియన్నమేది తినునో పరునివస్త్రమేది కట్టుకొనునో పరుని సొమ్మేది యొరునికిచ్చునో యది స్వీయమువలెనె యగునని స్తుతికై జెప్పబడెను యీజగంబునగల పదార్థముల నితరులందరును బ్రాహ్మణునికారుణ్యముచే ననుభవించుచున్నారు॥ ౧౦౧॥

మూ॥ తస్యకర్మ వివేకార్థం శేషాణా మనుపూర్వశః । స్వా
యంభువో మనుర్ధీమా నిదం శాస్త్రమకల్పయత్ ॥౧౦౨॥

ఇప్పుడు శ్రేష్ఠులగు బ్రాహ్మణుల కర్మములనుచెప్పుట కుపక్రమించుచుండెను బ్రాహ్మణునియొక్కయున్ను క్షత్రియాదులయొక్కయున్ను కర్మములు దెలియుటకై సర్వవిషయక జ్ఞానముగల స్వాయంభువమనువీ శాస్త్రమునుగల్పించెను॥౧౦౨॥

మూ॥ విదుషాబ్రాహ్మణేనేద మధ్యేతవ్యం ప్రయత్నతః। శిష్యే
భ్యశ్చప్రవక్తవ్యం సమ్యగ్జ్ఞానేనకేనచిత్॥......౧౦౩॥

శాస్త్రముయొక్క యధ్యయనఫలమును దెలిసిన బ్రాహ్మణునిచే ప్రయత్నమువలన నిది యధ్యయనముజేయదగును శిష్యులకొరకు బ్రాహ్మణునిచేతనే జెప్పదగనది క్షత్రియాదులకు చదువుటకే యధికారముగలదు గాని చెప్పుటకధికారములేదు ॥ శ్లో ॥ "నిషేకాదిశ్మశానాంతః" అనే శ్లోకము మొదలుకొనిన యర్థముచే

క్షత్రియ వైశ్యులకున్ను ముందు విధించగలదు అనువాదమాత్రమిదియని మేధాతిథివ్రాసెను యదికాదని కుల్లూకభట్టు ముందధ్యయనవిధిజెప్పటలో మూడువర్ణములవారి కధ్యయనమున్ను బ్రాహ్మణులకధ్యాపనమునను వ్యాఖ్యయందు ననువాద మనరాదుగదాయని వ్రాసెను॥ ౧౦౩॥

మూ॥ ఇదంశాస్త్రం మధీయానో బ్రాహ్మణశ్శంసితవ్రతః । మనోవాగ్దేహజైర్నిత్యం కర్మదోషై ర్నలిప్యతే॥ ... ౧౦౪॥

బ్రాహ్మణుడీశాస్త్రమును బఠించి వ్రతములను లెస్సగానాచరించి మనోవాక్కాయకర్మములనగు దోషములతో లేపనమునొందడు॥ ౧౦౪॥

మూ॥ పునాతి పఙ్క్తింవంశ్యాంశ్చ సప్తసప్తపరావరాన్। పృథివీమపిచైవేమాం కృత్స్నామేకోపి సోర్హతి॥ ... ౧౦౫॥

ఈశాస్త్రము నధ్యయనముజేసినవాడు పఙ్క్తిపావనుడుగాక వారిచేదూషితమగు పఙ్క్తిలో దనతోనున్నవారినందరినిన్ని తనతండ్రిమొదలుకొని పైవారేడుగురునిన్ని తనపుత్రుడుమొదలు కిందివారినేడుగురినిన్ని పవిత్రులనుగాజేయును సకలధర్మములునెరిగినవాడగుట నతడీ సర్వభూమినిన్ని యొకడుబ్రతిగ్రహించుట కర్హుడగును॥ ౧౦౫॥

మూ॥ ఇదంస్వస్త్యయనం శ్రేష్ఠ మిదంబుద్ధి వివర్ధనం । ఇదంయశస్యమాయుష్య మిదం నిశ్శ్రేయసంపరమ్॥ ... ౧౦౬॥

ఈశాస్త్రాధ్యయనము స్వస్త్యయన జపహోమాది బోధకమగుటచే నభీష్టార్థములకవి నాశమునుగూర్చు నదియనగా నిష్టసిద్ధులకు లోపములేకుండ జేయునది ఇతర స్వస్త్యయనములకంటే ప్రకృష్టము గావున శ్రేష్ఠమైనది విధినిషేధపరిజ్ఞానముగలిగించు నదిగాన బుద్ధిని వృద్ధినొందించునదిన్ని దీని జదువుటచే విద్వాంసుడగు గావున కీర్తికరమగునది తెలసినయాచారముల నాచరించుటచే నాయుదాయకరమగునది మోక్షోపాయమును దెలుపుటచే ముక్తిప్రదమయినది యగుచున్నది॥ ౧౦౬॥

మూ॥ అస్మిన్ధర్మోఖిలేనోక్తో గుణదోషౌచ కర్మణామ్ । చతు

ర్ణామపి వర్ణానా మాచారశ్చైవ శాశ్వతః॥ ౧౦౭॥

ఈశాస్త్రమందు సకలమైనధర్మమున్ను జెప్పబడెను కర్మములయొక్క గుణదోషములున్ను నాలుగువర్ణములయొక్క శాశ్వతమగు నాచారమున్ను జెప్పబడెను॥ ౧౦౭॥

మూ॥ ఆచారః పరమోధర్మ శ్శ్రుత్యుక్తస్స్మార్త ఏవచ। తస్మా
దస్మిన్ సదాయుక్తో నిత్యంస్యాదాత్మవాన్ ద్విజః॥ ౧౦౮॥

శ్రుతిస్మృత్యుక్తమైన యాచారము పరమధర్మము గావున నాత్మహితేచ్ఛగలద్విజుడు యత్నవంతుడై యాయాచారమందు సర్వదా నిష్ఠగలవాడు గావలెను॥ ౧౦౮॥

మూ॥ ఆచారాద్విచ్యుతో విప్రో నవేద ఫలమశ్నుతే। ఆచారేణ
తు సంయుక్త స్సంపూర్ణ ఫలభాగ్భవేత్॥ ౧౦౯॥

ఆచారభ్రష్టుడగు విప్రుడు వేదఫలమునొందడు ఆచారయుక్తుడగు నతడు సంపూర్ణమగు వేదఫలము నొందును॥ ౧౦౯॥

మూ॥ ఏవమాచారతోదృష్ట్వా ధర్మస్యమునయోగతిమ్। సర్వ
స్యతపసోమూల మాచారంజగృహుఃపరమ్॥ ౧౧౦॥

ఈప్రకారముగా ఋషులు ధర్మప్రాప్తి యాచారమువలననె యనితెలసి కృచ్ఛ్రచాంద్రాయణాది సకల తపస్సులకును మూలము గావున నుత్కృష్టమగునాచారమును గ్రహించిరి॥ ౧౧౦॥

మూ॥ జగతశ్చసముత్పత్తిం సంస్కారవిధిమేవచ। వ్రతచర్యోప
చారంచ స్నాతకస్యపరంవిధిమ్॥ ౧౧౧॥

ఇటుపయిని శిష్యులకు సుఖముగ దెలియుటకు వక్ష్యమాణార్థముల యనుక్రమణికను జెప్పుచున్నాడు జగదుత్పత్తిప్రకారము జాతకర్మాది సంస్కారవిధి బ్రహ్మచర్య వ్రతప్రకారము గురుసేవావిధానము స్నాతకవిధానము॥ ౧౧౧॥

మూ॥ దారాధిగమనంచైవ వివాహానాంచలక్షణమ్। మహాయ

జ్ఞవిధానంచ శ్రాద్ధకల్పంచశాశ్వతమ్॥ ౧౧౨॥

వివాహము బ్రాహ్మ్యాదివివాహలక్షణ ప్రశంస వైశ్వదేవ పంచమహాయజ్ఞ విధానము కల్పాంతరములనుంచి జరుగుటవలన నశాశ్వతమగు శ్రాద్ధకల్పము॥౧౧౨॥

మూ॥ వృత్తీనాంలక్షణంచైవ స్నాతకస్యవ్రతానిచ । భక్ష్యాభ
క్ష్యంచశౌచంచ ద్రవ్యాణాంశుద్ధిమేవచ॥ ౧౧౩॥

జీవనోపాయములగు నుంఛవృత్త్యాదిలక్షణము గృహస్థునియొక్క నియమములు భక్ష్యాభక్ష్యవిచారము జాతమృతాద్యాశౌచ నిర్ణయము సకలద్రవ్యములయొక్క శుద్ధిప్రకారము॥ ౧౧౩॥

మూ॥ స్త్రీధర్మయోగంతాపస్యం మోక్షంసన్యాసమేవచ। రా
జ్ఞశ్చధర్మమఖిలం కార్యాణాంచవినిర్ణయమ్॥ ౧౧౪॥

స్త్రీలయొక్క ధర్మోపాయము వానప్రస్థాశ్రమ ధర్మము మోక్షోపాయము సన్యాసవిధి ఇది షష్ఠాధ్యాయపర్యంతానుక్రమణిక ఇటుపైని రాజధర్మము మూర్ధాభిషిక్తులకిహపరసాధనమగు సకలధర్మమున్ను ఋణాదానప్రముఖ కార్యములందు వాదిప్రతివాదులపేర్కొను గ్రంథములందగు యాథార్థ్యముయొక్క నిర్ణయము॥ ౧౧౫॥

మూ॥ సాక్షిప్రశ్నవిధానంచ ధర్మంస్త్రీపుంసయోరపి । విభా
గధర్మంద్యూతంచ కంటకానాంవిశోధనమ్॥ ౧౧౫॥

సాక్షులను విమర్శించే క్రమము భార్యాభర్తల ధర్మము విభాగవిషయమగు ధర్మము ద్యూతవిధి చోరాదిబాధలను బోగొట్టుట॥ ౧౧౫॥

మూ॥ వైశ్యశూద్రోపచారంచ సంకీర్ణానాంచసంభవం । ఆప
ద్ధర్మంచవర్ణానాం ప్రాయశ్చిత్తవిధింతథా॥ ౧౧౬॥

వైశ్యులకును శూద్రులకును కర్మానుష్ఠానము సంకరజాతులయొక్క యుత్పత్తి యన్నివర్ణముల వారికి నాపద్ధర్మ ప్రకారము ప్రాయశ్చిత్త విధానము॥ ౧౧౬॥

మూ॥ సంసారగమనంచైవ త్రివిధంకర్మసంభవం । నిశ్శ్రేయసం
కర్మణాంచగుణదోషపరీక్షణమ్॥ ౧౧౭॥

స్వకర్మసంపాదితోత్తమ మధ్యమాధమభేదత్రివిధదేహాంతర ప్రాప్తివిషయము మోక్షహేతువగుటచే శ్రేయోరూపమగు నాత్మజ్ఞానము విహితనిషిద్ధకర్మముల గుణదోషపరీక్ష॥ ౧౧౭॥

మూ॥ దేశధర్మాన్జాతిధర్మాన్ కులధర్మాంశ్చ శాశ్వతాన్।
పాషండగణధర్మాంశ్చ శాస్త్రేస్మిన్నుక్తవాన్మనుః॥ ౧౧౮॥

వేరే వేరే దేశములందగు ధర్మములు బ్రాహ్మణాదిజాతుల ధర్మములు అనాదికుల ధర్మములు పాషండధర్మములు వేశ్యాదిగణధర్మములు నీశాస్త్రమందు మనువుజెప్పెను॥ ౧౧౮॥

మూ॥ యథేదముక్తవాన్శాస్త్రం పురాపృష్టోమనుర్మయా । త
థేదంయూయమప్యద్య మత్సకాశాన్నిబోధత॥ ౧౧౯॥

ఇతి మానవే ధర్మశాస్త్రే
భృగుప్రోక్తాయాం సంహితాయాం
ప్రథమోధ్యాయః.

---

నాచే నడుగబడినవాడై మనువు నాకేరీతిని జెప్పెనో దాని నన్యూనాతిరిక్తముగ మీకు నేను జెప్పెద నావలన నెరిగికొనుడు॥ ౧౧౯॥

ఇది శ్రీమన్మహామహీబిడౌజ శ్రీమదానంద గజపతిరాజ
మహారాజదయాపాత్ర భారద్వాజసగోత్ర
పవిత్రసుకవిజనవిధేయమండకామేశ్వర
నామధేయరచితాంధ్ర
మన్వర్థదీపికాఖ్యయగు
వ్యాఖ్యయందు
ప్రథమాధ్యాయము.



శుభమస్తు.

# మనుస్మృతి * ద్వితీయాధ్యాయము.

ఆంధ్రమన్వర్థదీపికాసహితము.

---

మూ॥ విద్వద్భిస్సేవితస్సద్భిర్నిత్యమద్వేషరాగిభిః । హృదయే
నాభ్యనుజ్ఞాతో యోధర్మస్తం నిబోధత॥ ... ౧॥

ఉత్కృష్టమయిన పరమాత్మజ్ఞానరూపధర్మమును దెలియుటకై జగత్కారణంబగు బ్రహ్మమును బ్రతిపాదించి యిప్పుడు బ్రహ్మజ్ఞానాంగభూతమగు సంస్కారాదిరూపధర్మమును దెలుపనిచ్ఛయించుచు ముందుగ ధర్మసామాన్యలక్షణమును జెప్పుచున్నాడు- వేదవేత్తలును ధార్మికులును రాగద్వేషశూన్యులునగు వారిచే నిత్యముగ ననుష్ఠింపబడినట్టియు హృదయముచే నభిముఖముగ ననుసరించి దెలియబడినట్టి దేధర్మమో దానిని జెప్పెద దెలియుండు- ఈశ్లోకమందు హృదయమున కభిముఖముగా జేసి దెలియబడినదనుటచే ధర్మము శ్రేయస్సాధనమనియు వేదవేత్తలచే దెలియబడినదనెడు విశేషణస్వారస్యమువలన దెలియబడినవేదము శ్రేయస్సాధనజ్ఞానమందు కారణమనెట్లనిన ఖడ్గధారిచే హతుడయ్యెననిన నాహననమందు ఖడ్గమెవనిచేనుండె నతడు బ్రధానముగదా గావున వేదము ప్రమాణముగాగలిగి శ్రేయస్సాధనమయినది ధర్మము ॥ స్మృ॥ "అథాతోధర్మంవ్యాఖ్యాస్యామః శ్రుతిప్రమాణకోధర్మః" ఇంక ధర్మమును జెప్పగలను ధర్మము వేదము ప్రమాణముగాగలదని హారీతుడు ॥ శ్లో ॥ "ధర్మశ్శ్రేయస్సముద్దిష్టం శ్రేయోభ్యుదయలక్షణం। సతుపంచవిధఃప్రోక్తో వేదమూలస్సనాతనః । అస్యసమ్యగనుష్ఠానాత్స్వర్గోమోక్షశ్చ జాయతె । ఇహలోకెసుఖైశ్వర్యమతులంచఖగాధిప" ధర్మము వేదమూలమని శ్రేయస్సాధనమని భవిష్యత్పురాణము ॥ సూ॥ "చోదనాలక్షణార్థోధర్మః" శ్రేయస్సాధనము జ్యోతిష్టోమాదికము ప్రత్యవాయసాధనము శ్యేనాదికము ఈయుభయవిధులచేతను లక్షణవలన బ్రాప్తమైనయర్థము ధర్మమం దు శ్రేయస్సాధనమై వేదమూలమగు జ్యోతిష్టోమాదికము ధర్మమని జైమిని

స్మృతులుమొదలగునవియును వేదమూలములుగావున ధర్మవిషయమై ప్రమాణమ గుచున్నవని కుల్లూకభట్టు- ఇందు గోవిందరాజు "హృదయేనాభ్యనుజ్ఞాతః" యను దాని నంతఃకరణముచే సందేహించబడనిదనివ్రాసెను గాని తనమతమందు వేద వేత్తలచే ననుష్ఠింపబడినదై సందేహరహితమైనది ధర్మమనిగదా ధర్మలక్షణము- దీ నిని దృష్టార్థమగు గ్రామగమనాది సాధారణముగాగని యీధర్మలక్షణమును వి చక్షణులు శ్రద్ధనొందరని కుల్లూకభట్టువ్రాసెను-మేధాతిథి హృదయమును దేనియం దు ప్రవర్తింపజేతురోయనియు వేదార్థములా భావనచే హృదయశబ్దమునకు హృదయమని యర్థమువ్రాసెను॥ ౧॥

మూ॥ కామాత్మతా న ప్రశస్తా నచైవేహాస్త్యకామతా। కామ్యో
హి వేదాధిగమః కర్మయోగశ్చ వైదికః॥ ౨॥

పురుషునకు కామాత్మతయనగా ఫలాభిలాషగలుగుట బంధమునకు హేతువు గావున ప్రశస్తముగాదు స్వర్గాది ఫలాభిలాషచే గర్మములుజేసిన నది పునర్జ న్మమునకు కారణమగుచున్నది నిత్యనైమిత్తికకర్మములైతే నాత్మజ్ఞానమునకు స హకారులై మోక్షమునకగుచున్నవి దీనిచే నిచ్ఛామాత్రము నిషేధించబడదు గావు న నిత్యాదులయందును నకామతలేదు వేదస్వీకారమును వైదికమగు కర్మయోగ మున్ను కామ్యమేగదా॥ ... ... ౨॥

మూ॥ సంకల్పమూలః కామో వై యజ్ఞాస్సంకల్పసంభవాః। వ్ర
తా నియమధర్మాశ్చ సర్వేసంకల్పజాస్స్మృతాః॥ ౩॥

పైశ్లోకార్థవిషయమై యుపపత్తిని చెప్పుచున్నాడు- ఈకర్మముచే నీఫలము సాధించబడుననే బుద్ధిగదా సంకల్పము తదనంతరమందిష్టసాధనముగా దెలియబడి న దానియందిచ్ఛపుట్టు నందుకు ప్రయత్నమొనరించు నిట్లుయజ్ఞములు వ్రతములు చ తుర్థాధ్యాయమందు జెప్పబడిన నియమరూపములగు ధర్మములు నింక నన్ని శా స్త్రార్థములును సంకల్పమువలనంబుట్టినవే యిచ్ఛలేకుండ నవిమేవైనం ప్రవర్తిం పవని కుల్లూకభట్టు- "వ్రతాని।యమధర్మాః" యని పదచ్ఛేదమొనర్చి వ్రతము లనగా చేయతగినకర్మములు యమధర్మములనగా జేయగూడని కర్మములనిగోవిం

మూ॥ అకామస్య క్రియా కాచి ద్దృశ్యతే నేహకర్హిచిత్ । య
ద్యద్ధి కురుతే కించి త్తత్తత్కామస్య చేష్టితం॥ ౪॥

ఈలోకమందు భోజనము గమనము మొదలగు లౌకిక ధర్మములుగాని వైదిక కర్మములుగాని కోరికలేనివానికి యేకర్మమును యెచ్చోటను జూడబడలేదు- ఏ యే కర్మ మెంతమాత్రమైనం బురుషుడు సేయునో యదియెల్ల కామముచేష్టయే॥ ౪॥

మూ॥ తేషు సమ్యగ్వర్తమానో గచ్ఛత్యమరలోకతాం। యథా
సంకల్పితాంశ్చేహ సర్వాన్కామాంత్సమశ్నుతే॥ ౫॥

ఇప్పుడు పూర్వోక్తమగు ఫలాభిలాషమును నియమించుచున్నాడు ఇచ్చటనిచ్ఛ నిషేధించబడలేదు మరేమంటే శాస్త్రోక్తములగు కర్మములయందు లెస్సగా బ్రవర్తించుమని విధించుచున్నాడు బంధహేతువగు ఫలాభిలాషములేకుండ శాస్త్రీయ కర్మానుష్ఠానములందు లెస్సగ బ్రవర్తించిన వాడమరధర్మకమగు బ్రహ్మభావము నొందును ముక్తుడగునని యర్థము- అట్లయిననతడు సర్వేశ్వరుడుగావున వానిచే నే విషయేలాగుగోరబడునో వాటినన్నిటినట్లొందును॥ శ్రు॥ "సయదా పితృలోకకామో భవతి సంకల్పాదేవాస్య పితరస్సముత్తిష్ఠంతి॥ ఆసిద్ధుడెప్పుడు పితృలోకమున భిలషించునతనిపితరులు సంకల్పమాత్రముచే నచ్చటనే లేచి కనపడుదురని ఛాందోగ్యము॥ ౫॥

మూ॥ వేదోఖిలోధర్మమూలం స్మృతిశీలేచతద్విదాం । ఆచార
శ్చైవసాధూనా మాత్మనస్తుష్టిరేవచ॥ ౬॥

ఇప్పుడు ధర్మప్రమాణమును జెప్పుచున్నాడు. ఋగ్యజుస్సామాథర్వణలక్షణ మగు వేదము విధ్యర్థవాదమంత్రాత్మకమంతయు ధర్మవిషయమై ప్రమాణము అర్థవాదములుకూడా విధితోనేకవాక్యత గలుగుటచే స్తుతిగా ధర్మమందు ప్రమాణములగుటవలన॥ సూ॥ "స్తుత్యర్థేన విధీనాం విధినాత్వేకవాక్యత్వాత్" అని జైమినియున్ను పైనివ్రాసినట్లే విధులయొక్క స్తుతికై మంత్రార్థవాదములకు కూడ విధితోనైక్యముగలుగుటచే ధర్మవిషయమై వేదమంతయు బ్రమాణమనెను కర్మకాలమందును వేదవేత్తలగు మన్వాదులయొక్క స్మృతియున్ను శీలమున్ను బ్రమాణములు వేదవేత్తలను విశేషణముచే స్మృతులు వేదము మూలముగాగలవగు

టనే ధర్మమందు బ్రమాణములు వేదమనుష్ఠేయస్మారకమగుటచే ధర్మమందుబ్ర మాణము ఏలాగు న్యాయసిద్ధమనుభవమునకు కరణత్వరూపమగుచున్నదో మరి యు శీలమనగా బ్రహ్మణ్యతాది రూపము॥ "బ్రహ్మణ్యతా వేదపితృభక్తతా సౌమ్యతా అపరోపతాపితా అనసూయతా మృదుతా అపారుష్యంమైత్రతా ప్రియవాదిత్వం కృతజ్ఞతా శరణ్యతా కారుణ్యం ప్రశాంతిశ్చేతి త్రయోదశవిధం శీలం" బ్రహ్మజ్ఞాన సంపత్తి వేదమందును తలిదండ్రులందును భక్తి సాధుత్వము నితరుల కుపతాపమును బుట్టించకుండుట యొకని గుణముల నోర్వక దోషములుగా నారోపించకుండుట మనస్సులో మార్దవము క్రియచే కాఠిన్యము లేకుండుట స్నేహము ప్రియముగ బలుకుట యుపకారమును మరువకుండుట రక్షకత్వము యొకరికష్టమును సహింపలేకుండుట శీలమని గోవిందరాజువ్రాసెను- కంబళవల్లూలాద్యాచరణ రూపమగు నాచారమును సజ్జనులయొక్క మనస్సమాధానమున్ను రెండుపక్షములు సమబలములుగా నున్నప్పుడు ధార్మికుల మనస్తుష్టిధర్మమందు బ్రమాణ మగుచున్నది- "వైకల్పికె ఆత్మతుష్టిః ప్రమాణం" వైకల్పికమన తుల్యబలవిరోధ మెటుసుజనులమనస్తుష్టియగునోయది ప్రమాణమనిగర్గవ్యాసులు॥ ౬॥

మూ॥ యఃకశ్చిత్కస్యచిద్ధర్మో మనునాపరికీర్తితః। ససర్వో
భిహితో వేదే సర్వజ్ఞానమయోహిసః॥ ౭॥

వేదమూలములగు వేదేతరము లన్నియు బ్రమాణము లగుచుండ మనుస్మృతి విశేషించి వేదమూలమని చెప్పుచున్నాడు- బ్రాహ్మణాదులలో నెవ్వనికేది ధర్మమనిమనువుచే జెప్పబడెనో యాసర్వధర్మమున్ను వేదమందు చెప్పబడ్డదే ఆమనువు సర్వజ్ఞానమయుండుగదా మనువు సర్వజ్ఞుడై వుట్టి సంకీర్ణముగా బఠించబడిన వేదముయొక్క యర్థమును లెస్సగా దెలిసి లోకహితంబునకై యీ స్మృతిని రచించెనని కుల్లూకభట్టు-గోవిందరాజైతే సర్వజ్ఞానారబ్ధము వేదవిశేషముగా వ్రాసెను॥ ✱

మూ॥ సర్వంతుసమవేక్ష్యేదం నిఖిలంజ్ఞానచక్షుషా। శ్రుతిప్రా
మాణ్యతోవిద్వాన్ స్వధర్మే నివిశేతవై॥ ౮॥

విద్వాంసుడు వేదార్థమును దెలియుటకు దగిన మీమాంసావ్యాకరణాదిజ్ఞానమనే నేత్రముచే వేదప్రామాణ్యము వలన చేయదగినయీసమస్తమున్ను దెలి

సి స్వధర్మమందు ప్రవేశింపవలయును॥ ౮॥

మూ॥ శ్రుతిస్మృత్యుదితంధర్మ మనుతిష్ఠన్హిమానవః । ఇహ
కీర్తిమవాప్నోతి ప్రేత్యచానుత్తమం సుఖం॥ ౯॥

శ్రుతిస్మృతులచే జెప్పబడిన ధర్మమును మనుష్యుడు చేసి యీలోకమందప్రయత్నసిద్ధమగు కీర్తిన్ని బరలోకమందు స్వర్గాపవర్గరూపఫలమగు నుత్తమసుఖమునున్ను బొందును-స్వభావముగానున్న యర్థమును దెలియజేయుచు ధర్మమాచరించుమని విధించెను॥ ౯॥

మూ॥ శ్రుతిస్తువేదోవిజ్ఞేయో ధర్మశాస్త్రంతువై స్మృతిః। తేస
ర్వార్థేష్వమీమాంస్యే తాభ్యాంధర్మోహినిర్బభౌ॥౧౦॥

శ్రుతిస్మృతులు ప్రసిద్ధములైనను వీటివిశేషమును జెప్పడమెందు కనిన శ్రుతివలెనే స్మృతిన్ని ప్రతికూలతర్కముచే విచారింప దగదని శ్రుతిస్మృతులు సమగ్రాహ్యములని దెలియుట కిట్లుజెప్పుచున్నాడు- శ్రుతియనగా వేదము స్మృతియనగా మన్వాదికృతధర్మశాస్త్రము వీటిలోజెప్పబడిన వన్నియును మీమాంసకు దగవనగా శంకింపదగవు ఈశ్రుతిస్మృతుల వలననే గదా ధర్మము మిక్కిలి ప్రకాశించెను॥ ౧౦॥

మూ॥ యోవమన్యేతతేమూలే హేతుశాస్త్రాశ్రయాద్ద్విజః। స
సాధుభిర్బహిష్కార్యో నాస్తికోవేదనిందకః॥ ౧౧॥

ఏద్విజుడు ధర్మమూలములగు శ్రుతిస్మృతులను చార్వాకాదిమతసంబంధహేతువాదశాస్త్రములను సంచరించి యవమానించునో యాద్విజుడు నాస్తికుడు వేదనిందకుడు గావున సజ్జనులచే బహిష్కార్యుడు గావలయును॥ ౧౧॥

మూ॥ వేదస్స్మృతిస్సదాచార స్స్వస్యచప్రియమాత్మనః । ఏత
చ్చతుర్విధంప్రాహు స్సాక్షాద్ధర్మస్యలక్షణం॥ ౧౨॥

ఇప్పుడు శీలమునకు సదాచారమంతర్భావమవుటచే వేదమూలత్వమేస్మృతిశీలములప్రమాణత్వమునకు హేతువుగాన నట్లుగనపరచుటకు ధర్మమునకు బ్రమాణమునాలుగుప్రకారములని చెప్పుచున్నాడు- వేదము ధర్మమందుప్రమాణ మదియొకచోబ్రత్యక్షముగనగు నొకచోస్మృతిచే నూహించబడునని తాత్పర్యముగానిపరిగణ

నముగాదు కనకనే శ్రుతిస్మృతులచేజెప్పబడినది ధర్మమని పైనిజెప్పబడియెను శిష్టా చారమున్ను మనస్సంతుష్టిన్ని యీనాలుగున్ను ధర్మమునకుబ్రమాణము॥ ౧౨॥

మూ॥ అర్థకామేష్వసక్తానాం కర్మజ్ఞానం విధీయతే । ధర్మం
జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమంశ్రుతిః॥ ౧౩॥

అర్థకామములందాసక్తులుగాని వారికే కర్మములయొక్క జ్ఞానమనగా ధర్మజ్ఞానము విధించబడుచున్నది అర్థకామములందాసక్తులై లోకవిడంబనముకొరకు కర్మములుజేయదలచువారి కీధర్మోపదేశము నిష్ఫలము ధర్మమును దెలసికొననిచ్ఛయించుచున్నవారికి వేదముధర్మమందు బరమప్రమాణము శ్రుతిస్మృతుల విరోధమగునప్పుడు స్మృత్యర్థమాచరించ దగదని తాత్పర్యము అదిగావుననే॥ శ్లో॥ "శ్రుతిస్మృతివిరోధేతు శ్రుతిరేవబలీయసీ । అవిరోధే సదాకార్యం స్మార్తంవైదిక వత్సదా॥" శ్రుతిస్మృతులకు విరోధమైనప్పుడు శ్రుతికే మిక్కిలి బలము శ్రుతికి విరుద్ధముగాని స్మార్తధర్మము వైదికధర్మమువలె నెప్పుడును జేయదగినది యనిజాబాలి॥ శ్లో॥ "శ్రుత్యాసహ విరోధేతు బాధ్యతే విషయంవినా॥" శ్రుతికివిరుద్ధమగు స్మృత్యాదికము వ్యవస్థలేకుండిన బాధించబడుననిభవిష్యత్పురాణము॥సూ॥ "విరోధేత్వనపేక్షంస్యా దసతిహ్యనుమానం॥" శ్రుతికి విరుద్ధమగుస్మృతియపేక్షించదగ దప్రమాణమాదరింపవలదు విరోధములేనప్పుడు వేద మూలమని యూహించవలెనని జైమిని॥ ౧౩॥

మూ॥ శ్రుతిద్వైధంతు యత్రస్యా త్తత్రధర్మా వుభౌస్మృతౌ।
ఉభావపి హితౌ ధర్మౌ సమ్యగుక్తౌ మనీషిభిః॥ ౧౪॥

శ్రుతులకు విరోధ మన్యోన్యముగలిగి ధర్మమెచ్చటజెప్పబడె నచ్చట వారెండును బ్రమాణములేయని మన్వాదులుజెప్పిరి అనాదిగా బ్రాచీనులచేతనున్ను విరుద్ధశ్రుత్యుక్తములు రెండున్ను ధర్మములేయని వికల్పముగా జెప్పబడియె సమానన్యాయమువలన స్మృతులకు రెండింటికి విరోధముగలుగునప్పుడును వికల్పమే యగును "తుల్యబలవిరోధే వికల్పః॥" సమముగా బలముగలశ్రుతులకుగాని స్మృతులకుగాని విరోధముగలిగినను వికల్పమని గౌతమవచనము॥ ౧౪॥

మూ॥ ఉదితే నుదితేచైవ సమయాధ్యుషితే తథా । సర్వథావ
ర్తతేయజ్ఞ ఇతీయం వైదికీశ్రుతిః॥ ౧౫॥

సూర్యోదయమైన బిమ్మటనున్న సూర్యుడుదయించకుండ కిరణప్రసారము క లిగి నక్షత్రములు విరళములైనవేళ సమయాధ్యుషితమనబడును యిట్లు పరస్పరవిరు కాలములు వేదమందు వినబడుచుండినను యజ్ఞమనగా నగ్నిహోత్రహోమా క్రమ వికల్పముగా బ్రవర్తించుచున్నది॥ శ్రు॥ "ఉదితే హోతవ్య॥" అనువైదిక శ్రుతి॥ ౧౫॥

ఇకకూడ రామచంద్రుని వ్యాఖ్యానమందు విశేషము.

శ్లో॥ రాత్ర్యాస్తు షోడశేభాగే గ్రహనక్షత్ర భూషితే । కాలంత్వనుదితం జ్ఞాత్వా హోమంకుర్యా ద్విచక్షణః॥ ౧ ॥ తథాచప్రాత స్సముదే నష్టేనక్షత్ర మండలే । రవిర్యావన్న దృశ్యేత సమయాధ్యుషితం చ తత్। ౨॥ రేఖామాత్రంతు దృశ్యేత రశ్మిభిశ్చ సమన్వితః।ఉదితంతం విజానీయా త్తత్ర హోమం ప్రకల్పయేత్॥

నక్షత్రములుండగా రాత్రియొక్క పదియారవభాగమనుదిత హోమకాలము ప్రాతఃకాలమందు నక్షత్రములుపోయి సూర్యుడుదయించకున్నప్పటికాలము సమయాధ్యుషితము రేఖామాత్రము రవికనపడి రశ్ములువ్యాపించువేళ నది హోమ కాలమని కాత్యాయనుడుబోధాయనాపస్తంబాశ్వలాయనాదులుపయాసానంతరమ న హోమముజేయుచున్నారు మాధ్యందిన వాజసనేయు లుదయసమనకముగా హోమముజేయుచున్నారు మిగిలిన వ్యాఖ్యాతలేమి వ్రాయలేదు॥ ప్రక్షిప్తం శ్లో॥ "శ్రుతింపశ్యంతిమునయ స్స్మరంతిచ యథాశ్రుతి। తస్మాత్త్రికాలంమునయః ప్రమాణం ప్రథితంభువి॥ ధర్మవ్యతిక్రమోదృష్ట శ్శ్రేష్ఠానాంసాహసంతథా । తదన్వీ క్ష్యప్రయుంజానా స్సీదంత్యపరధర్మజాః॥ఇవిప్రక్షిప్తములు॥

మూ॥ నిషేకాది శ్మశానాంతో మంత్రైర్యస్యోదితో విధిః । తస్య
శాస్త్రేధికారోస్మిన్ జ్ఞేయోనాన్యస్య కస్యచిత్।... ౧౬॥

ఎవరికి గర్భాధానము మొదలుకొని యంత్యేష్టిపర్యంతము మంత్రములచే విధి యనుష్ఠానము విధింపబడెనో యట్టి ద్విజులకుమాత్ర మీమానవశాస్త్రమునుచదువు టకును వినుటకు నివరించుటకు నధికారముగలదు తదితరుడగు శూద్రునకధికార ములేదు సకలజాతులవారు నిందుజెప్పిన ధర్మమునవలంబించి చేయందగుగాని చ దువుటకును ధర్మము వివరించుటకును బ్రాహ్మణునికే యధికారముగలదని వ్యాఖ్యా

నను చేయబడెను॥ ౧౬॥

మూ॥ సరస్వతీ దృషద్వత్యో ర్దేవనద్యోర్యదంతరం। తం దేవని
ర్మితందేశం బ్రహ్మావర్తం ప్రచక్షతే॥ ౧౭॥

ధర్మముయొక్క స్వరూపమును బ్రమాణమును బరిభాషనున్ను జెప్పి యిప్పుడు ధర్మానుష్ఠానయోగ్యదేశమును జెప్పుచున్నాడు-"సరస్వతీదృషద్వతీ" యను దేవనదులరెండింటి మధ్యభాగ మేదిగలదో యది దేవనిర్మితమగుదేశము బ్రహ్మావర్తమని జెప్పుచున్నారు- "దేవనిర్మిత దేవనద్యోః" యని దేవశబ్దముగూర్చుటచే దేశమునకును నదులకును యోగ్యతవచ్చెను॥ ౧౭॥

మూ॥ తస్మిన్ దేశే య ఆచారః పారంపర్య క్రమాగతః। వర్ణా
నాం సాంతరాళానాం స సదాచార ఉచ్యతే॥ ... ౧౮॥

ఆదేశమందు నేయాచారము నవీనముగాక పారంపర్యక్రమాగతమై యుండెనో బ్రాహ్మణాదివర్ణములకు సంకరజాతులకు నదియె సదాచారమని జెప్పబడియె॥ ౧౮॥

మూ॥ కురుక్షేత్రంచ మత్స్యాశ్చ పాంచాలాః శూరసేనకాః। ఏ
ష బ్రహ్మర్షి దేశోవై బ్రహ్మావర్తాదనంతరః॥ ... ౧౯॥

కురుక్షేత్రమున్ను మత్స్యదేశములున్ను కన్యాకుబ్జదేశములున్ను మధురాది దేశములున్ను నీదేశములుగల ప్రదేశము బ్రహ్మర్షులు నివసించునది గావున బ్రహ్మావర్తముకంటెనించుక తక్కువయినది॥ ౧౯॥

మూ॥ ఏతద్దేశ ప్రసూతస్య సకాశాదగ్రజన్మనః। స్వంస్వం చరి
త్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః॥ ౨౦॥

కురుక్షేత్రాది దేశములం దగు బ్రాహ్మణునివలన భూమిపైనున్న యన్ని దేశములమనుష్యులను దమతమ యాచారముల నభ్యసింపవలెను॥ ౨౦॥

మూ॥ హిమవద్వింధ్యయో ర్మధ్యం యత్ప్రాగ్వినశనాదపి। ప్ర
త్యగేవ ప్రయాగాచ్చ మధ్యదేశః ప్రకీర్తితః॥ ... ౨౧॥

దక్షిణమునకు వింధ్యపర్వతము నుత్తరమునకు హిమవంతముగల భూమిలో సరస్వతి యంతర్ధానమైన స్థలమునకు తూరుపుగానున్న ప్రయాగకు పశ్చిమముగానున్న గల దేశము మధ్యదేశమనబడును॥ ౨౧॥

మూ॥ ఆసముద్రాత్తు వై పూర్వా దాసముద్రాత్తు పశ్చిమాత్ ।
తయోరేవాంతరంగిర్యో రార్యావర్తంవిదుర్బుధాః॥౨౨॥

పూర్వ పశ్చిమ సముద్రముల మధ్యనా హిమవద్వింధ్యాచలముల నడిమి దేశమార్యావర్తమని పెద్దలు దెలసికొనిరి సముద్రమధ్యద్వీపము లార్యావర్తాంతర్గతములు గావనుట- ఆర్యులిందు మరలమరల జన్మించి ప్రవర్తింతురు గావున నీదేశ మార్యావర్తమనబడెను॥ ౨౨॥

మూ॥ కృష్ణసారస్తు చరతి మృగోయత్ర స్వభావతః । సజ్ఞేయో
యజ్ఞియోదేశో మ్లేచ్ఛదేశ స్త్వతఃపరః॥ ౨౩॥

కొమ్ములుగలయిర్రి యొకరిచే బెంచబడక స్వభావముగా నెందు సంచరించునా దేశము యజ్ఞములుజేయ నర్హమైనది యంతకంటె బరమగునది మ్లేచ్ఛదేశము యజ్ఞీయమని తెలియవలెను॥ ౨౩॥

మూ॥ ఏతాద్విజాతయో దేశాన్ సంశ్రయేరన్ ప్రయత్నతః। శూ
ద్రస్తుయస్మిన్ కస్మిన్వా నివసేద్వృత్తి కర్శితః॥... ౨౪॥

ఇతర దేశములందుండినను ద్విజులు ఈదేశములు యజ్ఞార్హములు నత్యుత్కృష్టములు ధర్మము ప్రయోజనముగా గలవగుటవలన బ్రయత్నపూర్వకముగ నీజెప్పబడిన దేశములనాశ్రయింపవలయు జీవనమునకు లేక శూద్రుడుయే దేశమందుండిన నుండవచ్చును॥ ౨౪॥

మూ॥ ఏషాధర్మస్య వోయోని స్సమాసేన ప్రకీర్తితా। సంభవ
శ్చాస్య సర్వస్య వర్ణధర్మా న్నిబోధత॥ ౨౫॥

తు॥ "వేదోఖిలోధర్మమూలమిత్యాదినా" సకల వేదమూలధర్మమునకు మూలమనునది మొదలయిన దానిచే ధర్మమునకు యోనియనగా జ్ఞప్తికారణము

గునివి మీకు సంగ్రహముగా జెప్పబడియె- నిచ్చట గోవిందరాజు ధర్మశబ్దము
పూర్వాఖ్యార్థధర్మమందు వర్తించుననియె- "విద్వద్భిస్సేవిత" యను శ్లోకమం
దు తత్కారణములగు నిషేకాదియందైనా నపూర్వాఖ్యమగు ధర్మమునకని వ్యా
ఖ్యానము జేసెను- యీసకల జగత్తుయొక్క యుత్పత్తిన్ని జెప్పబడె నింకవర్ణధ
ర్మములను వినుండనియె వర్ణధర్మశబ్దముచే వర్ణధర్మము నాశ్రమధర్మ
ము వర్ణాశ్రమధర్మము గుణధర్మము నైమిత్తికధర్మము నుపలక్షణముగా
జెప్పబడుచున్నవి॥ శ్లో॥ "వర్ణధర్మస్స్మృతస్త్వేక ఆశ్రమాణామతఃపరమ్। వ
ర్ణాశ్రమస్తృతీయస్తు గౌణో నైమిత్తిక స్తథా॥ వర్ణత్వమేకమాశ్రిత్య యోధ
ర్మస్సంప్రవర్తతే। వర్ణధర్మస్సఉక్తస్తు యథోపనయనంనృప॥యస్త్వాశ్రమం
సమాశ్రిత్య అధికారఃప్రవర్తతే।సఖల్వాశ్రితధర్మస్తు భిక్షాదండాదికోయథా॥ వ
ర్ణత్వమాశ్రమత్వంచ యోధికృత్యప్రవర్తతే। సవర్ణాశ్రమధర్మస్తు మౌంజీ
యా మేఖలాయథా। యేగుణేనప్రవర్తేత గుణధర్మస్సఉచ్యతే॥ యథామూ
ర్ధాభిషిక్తస్య ప్రజానాంపరిపాలనమ్। నిమిత్తమేకమాశ్రిత్య యోధర్మస్సంప్ర
వర్తతే॥ నైమిత్తికస్సవిజ్ఞేయః ప్రాయశ్చిత్తవిధిర్యథా॥" వర్ణత్వమును బట్టిజె
ప్పినది ఉపనయనాదికము వర్ణధర్మము ఆశ్రమత్వము నుద్దేశించినది దండాది
ధారణరూపమాశ్రమధర్మము వర్ణత్వాశ్రమత్వము ననుసరించి పలకబడినది-
మౌంజీమేఖలాదికము వర్ణాశ్రమధర్మము మూర్ధాభిషిక్తత్వాదిగుణమునుం
చి యేర్పరిచిన ధర్మము గౌణధర్మము ప్రాయశ్చిత్తాది నిమిత్తముచే నిర్ణ
యించిన ధర్మము నైమిత్తికమని భవిష్యత్పురాణము॥ ౨౫॥

మూ॥ వైదికైః కర్మభిః పుణ్యైర్నిషేకాదిర్ద్విజన్మనాం। కా
ర్యశ్శరీరసంస్కారః పావనః ప్రేత్యచేహచ॥ ౨౬॥

వేదమూలములును శుభప్రదములునగు మంత్రయుక్తకర్మములచే ద్విజులకు
గర్భాధానాది శరీరసంస్కారమిహపరసాధనమును పాపహరమును గావునం
జేయందగినది॥ ౨౬॥

మూ॥ గార్భైర్హోమైర్జాతకర్మ చౌలమౌంజీనిబంధనైః।
బైజికంగార్భికంచైనో ద్విజానామపమృజ్యతే॥ ౨౭॥

ఈ సంస్కారములు పాపక్షయకరములంటిరి పాపమెట్లు సంభవించుననినగ

ర్భశుద్ధికై జేసెడు గర్భాధానసంబంధములగు కర్మములచేతనున్ను హోమములచేతనున్ను ననగా హోమశబ్దము కర్మముల కుపలక్షణము బితృబీజసంబంధదోషమును నశించిన మాతృగర్భవాసముచేతను నైన పాపములుశోధించ బడును॥ ౨౭॥

మూ॥ స్వాధ్యాయేనవ్రతైర్హోమై స్త్రైవిద్యేనేజ్యయాసుతైః। మహాయజ్ఞైశ్చయజ్ఞైశ్చ బ్రాహ్మీయంక్రియతే తనుః॥ ౨౮॥

వేదాధ్యయనముచేతనున్ను మధుమాంసవర్జనాదినియమములచేతనున్ను సాయంప్రాతర్హోమముల చేతనున్ను వేదవ్రతముచేతనున్ను బ్రహ్మచర్యమందు దేవర్షిపితృతర్పణ రూపమగు నిజ్యచేతనున్ను గృహస్థాశ్రమమందు పుత్రోత్పాదనము చేతనున్ను దేవయజ్ఞాదిపంచమహాయజ్ఞములచేతనున్ను అగ్నిష్టోమాదియజ్ఞముల చేతనున్ను బ్రహ్మప్రాప్తియోగ్యమగు నీశరీరమనగా శరీరావచ్ఛిన్నమగు నాత్మచెయ్యబడుచున్నది కర్మయుక్తమగు బ్రహ్మజ్ఞానముననే ముక్తుడగును గావున నట్లు చెప్పుట॥ ౨౮॥

మూ॥ ప్రాఙ్నాభివర్ధనాత్పుంసో జాతకర్మవిధీయతే।మంత్రవత్ప్రాశనంచాస్య హిరణ్యమధుసర్పిషామ్॥ ౨౯॥

పురుషునకు నాభిచ్ఛేదనమునకు పూర్వమందు మంత్రయుక్తముగ బంగారముచే తేనియనేయియున్ని శిశువునకు బానముజేయించడముగలది జాతకర్మమది జేయవలయును॥ ౨౯॥

మూ॥ నామధేయందశమ్యాంతు ద్వాదశ్యాంవాస్యకారయేత్ । పుణ్యేతిథౌముహూర్తేవా నక్షత్రేవాగుణాన్వితే॥ ౩౦॥

జన్మదినము మొదలుకొని పదోదినమునగాని పదిరెండవ దినమునగాని తాను లేకుండినను నామకరణము జేయించ వలయును॥ శ్లో॥ "ఆశౌచేతువ్యతిక్రాంతే నామకర్మవిధీయతే" పురుడు దాటిన బిమ్మట నామకర్మము జేయవలయునని శంఖ వచనము వలన బదోదినమతిక్రమించిన పదకొండవదినమున నని వ్యాఖ్యానము జే

యవలయును- ఆకాలమతిక్రమించినచో జ్యోతిశ్శాస్త్రము వలన బ్రశస్తతిథియు హూర్తనక్షత్రములందు దప్పక జేయవలయును॥ 30॥

మూ॥ మంగళ్యంబ్రాహ్మణస్యస్యాత్ క్షత్రియస్యబలాన్వితమ్। వై
శ్యస్యపుష్టిసంయుక్తం శూద్రస్యతుజుగుప్సితమ్॥ 31॥

బ్రాహ్మణులకు మంగళవాచకము క్షత్రియులకు బలప్రధానము వైశ్యులకు పుష్టియుక్తము శూద్రులకు దాసాదిరూపమగు నామధేయమునుంచ వలయును॥31॥

మూ॥ శర్మవద్బ్రాహ్మణస్యస్యాద్రాజ్ఞో రక్షాసమన్వితం । వై
శ్యస్య ధనసంయుక్తం శూద్రస్య ప్రైష్యసంయుతం॥ 32॥

ఇప్పు డుపపదనియమమును జెప్పుచున్నాడు బ్రాహ్మణునకుశుభశర్మ క్షత్రియునకు బలవర్మ వైశ్యునకు వసుభూతి శూద్రునకు దీనదాస యీప్రకారమగునర్థముగల నామములనుంచవలయును॥ 32॥

మూ॥ స్త్రీణాం సుఖోద్యమ క్రూరం విస్పష్టార్థం మనోహరం।
మంగల్యం దీర్ఘవర్ణాంత మాశీర్వాదాభిధానవత్॥33॥

స్త్రీలకు సుఖముగా బల్కుకదగిన యక్షరములు గలదియు అక్రూరమగు నర్థముగలదియు స్పష్టముగ నర్థము దెలిసెడిది మనస్సుకు ప్రీతికరమగునది మంగళకరమగునది దీర్ఘవర్ణము క్రొనసుగలది ఆశీర్వాదార్థయుక్తమగునదియునగునామమును యశోదా యిటువంటిపేరు నుంచవలయును॥ 33॥

మూ॥ చతుర్థే మాసికర్తవ్యం శిశోర్నిష్క్రమణం గృహాత్।ష
ష్ఠేన్నప్రాశనం మాసి యద్వేష్టం మంగళం కులే॥ 34॥

జన్మాది నాలవమాసమందు శిశువునకు సూర్యదర్శనము నిమిత్తము జన్మగృహమువల్లనుండి బయలుదేరించవలెను ఆరవమాసమందు అన్నప్రాశనముజేయవలయు లేదా కులమందు యేదిఇష్టమై జరుగుచుండెనో యట్లు శర్మ మొదలైనయుపనామములుకూడా నటులు జరిగించవచ్చును॥ శ్లో ॥ "తత స్తృతీయె కర్తవ్యం మాసి సూర్యస్యదర్శనం॥" మూడవమాసమందు సూర్యదర్శనము జేయదగినద

ని యమవచనము ఇందువలన కూడా కులాచారము రీతి నన్ని సంస్కారములును జేయవచ్చును॥ 34॥

మూ॥ చూడాకర్మ ద్విజాతీనాం సర్వేషామేవ ధర్మతః । ప్రథమే
ఽబ్దేతృతీయేవా కర్తవ్యం శ్రుతిచోదనాత్॥ 35॥

ద్విజులందరికిని ప్రథమ వర్షమందు గాని మూడవవర్షమందుగాని స్వస్వకులాచారప్రకారముగాని వేదవిధివలన చూడాకర్మ జేయవలయును॥ సూ॥ "తృతీయేవర్షే చూడాకరణం యథాకుల ధర్మంవా॥" మూడవవర్షమందైనను కుల ధర్మప్రకారముగానైన చూడాకర్మము జేయవలయునని అశ్వలాయన గృహ్యసూత్రము॥ 35॥

మూ॥ గర్భాష్టమేఽబ్దే కుర్వీత బ్రాహ్మణస్యోపనాయనం। గర్భా
దేకాదశేరాజ్ఞో గర్భాత్తుద్వాదశేవిశః॥ 36॥

గర్భాష్టమమనగా నేడవ సంవత్సరమందు బ్రాహ్మణులకును గర్భైకాదశమనగా పదోసంవత్సరమందు క్షత్రియులకును గర్భద్వాదశమనగా పదకొండవసంవత్సరమందు వైశ్యునకును యుపనయనము జేయవలయును॥ 36॥

మూ॥ బ్రహ్మవర్చసకామస్య కార్యం విప్రస్య పంచమే। రాజ్ఞోబ
లార్థినష్షష్ఠే వైశ్యస్యేహార్థినోష్టమే॥ 37॥

బ్రహ్మవర్చస్సును కోరే బ్రాహ్మణునకు పంచమాబ్దమునందున్ను బలమును కోరే రాజునకు షష్ఠాబ్దమందున్ను కృష్యాదిని కోరె వైశ్యున కష్టమాబ్దమునందున్ను ఉపనయనము చెయ్యవలయును॥ బ్రాహ్మణాదులకు క్రమముగా గర్భపంచమ గర్భషష్ఠ గర్భాష్టమములయందని కుల్లూకభట్టు వ్యాఖ్యానముజేసెను బాల్యమాటచే బ్రహ్మవర్చస్సుమొదలైన కోరుకలను వటులకు సంభవమౌటచే తజ్జనకులయందుపచరించవచ్చును॥ 37॥

మూ॥ ఆషోడశా ద్బ్రాహ్మణస్య సావిత్రీనాతివర్తతే। ఆద్వావిం
శాత్క్షత్రబంధో రాచతుర్వింశతేర్విశః॥ 38॥

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు జెప్పబడిన యెనిమిది పదకొండు పదిరెండు వ

త్సరములు క్రమముగా రెట్టించి షోడశవర్షపర్యంతము బ్రాహ్మణునకు నిరువది రెండువత్సరములపర్యంతము క్షత్రియునకు నిరువదినాలుగువత్సరములపర్యంతము వైశ్యునకు నుపనయన గౌణకాలమతిక్రమించదు॥ ౩౮॥

అనగా సామర్థ్యకాలమందుపనయనము చెయ్యవచ్చునని కుల్లూకభట్టు యీ యాజ్ఞ మర్యాదార్థకమని కొందరు వ్రాసిరి॥ శ్లో॥ "పతితాయస్య సావిత్రీ ద శవర్షాణి పంచచ । బ్రాహ్మణస్య విశేషేణ తథా రాజన్యవైశ్యయోః॥ ప్రా యశ్చిత్తం భవేదేషాం ప్రోవాచ వదతాం వరః । వివస్వతస్సుతశ్శ్రీమా న్యమో ధర్మార్థతత్త్వవిత్ । సశిఖం వపనం కృత్వా వ్రతం కుర్యాత్సమాహితః।హవి ష్యం భోజయేదన్నం బ్రాహ్మణాన్ సప్తపంచవా"॥ ౩౮॥

మూ॥ అత ఊర్ధ్వం త్రయోప్యేతే యథాకాల మసంస్కృతాః।
సావిత్రీపతితా వ్రాత్యా భవంత్యార్యవిగర్హితాః॥ ౩౯॥

బ్రాహ్మణాదులగు మూడు వర్ణములవారున్ను ఉక్తకాలమందుపనయనము గాకుండినపైని చెప్పబడిన గౌణకాలమనగా పదియారు నిరువదిరెండు నిరువదినా లుగువత్సముల పరిమితి కాల మతిక్రమించినమీద సావిత్రీపతితులు వ్రాత్యులనన బడి పెద్దలచే నిందితులగుదురు॥ ౩౯॥

మూ॥ నైతైరపూతైర్విధివ దాపద్యపిహి కర్హిచిత్। బ్రాహ్మా
న్యౌనాంశ్చ సంబంధా నాచరే ద్బ్రాహ్మణస్సహ॥ ౪౦॥

అపవిత్రులై వ్రాత్యులగువారు ప్రాయశ్చిత్తముగూడ జేయకుండిరేని వారితో నాపదయందైనను వైదికయాజనాది సంబంధములనున్ను యౌనసంబంధమున్ను బ్రాహ్మణుడు జేయగూడదు॥ ౪౦॥

మూ॥ కార్ష్ణరౌరవ బాస్తాని చర్మాణి బ్రహ్మచారిణః । వసీ
రన్నానుపూర్వ్యేణ శాణక్షౌమావికానిచ॥ ౪౧॥

బ్రాహ్మణునకు కృష్ణాజినము క్షత్రియునకు రురుచర్మము వైశ్యునకు ఛాగచ ర్మము నుత్తరీయములుగావలయును జనపనార బట్టయు పట్టుబట్టయును గొఱ్ఱె బొచ్చుబట్టయు క్రమముగా మూడువర్ణముల బ్రహ్మచారు లివి బట్టగా ధరించవల

రేయను॥ ౪౧॥

మూ॥ మౌంజీ త్రివృత్సమాశ్లక్ష్ణా కార్యావిప్రస్య మేఖలా।క్షత్రి
యస్యతు మౌర్వీజ్యా వైశ్యస్య శణతాంతవీ॥ ౪౨॥

బ్రాహ్మణునకు ముప్పేటసమముగా పేనిన ముంజగడ్డిత్రాడున్ను క్షత్రియునకు నాగనారచే వింటినారివలె పేనినత్రాడున్ను వైశ్యునకు జనపనార ముప్పిరిత్రాడున్ను మొలత్రాడుగావలెను॥ ౪౨॥

మూ॥ ముంజాలాభేతు కర్తవ్యా కుశాశ్మాంతక బల్బజైః। త్రివృ
తా గ్రంథినైకేన త్రిభిఃపంచభిరేవవా॥ ౪౩॥

బ్రాహ్మణాదులకు నుగ్గురికిని ముంజాదులుదొరకనియెడ క్రమముగా కుశాశ్మాంతకబల్బజములచే నొకటి మూడునైదుచుట్లతో వేసిన ముడిగలత్రాడు కులాచారప్రకారము మేఖలచేయవచ్చును॥ ౪౩॥

మూ॥ కార్పాస ముపవీతంస్యా ద్విప్రస్యోర్ధ్వవృతం త్రివృత్।
శణసూత్ర మయంరాజ్ఞో వైశ్యస్యావిక సౌత్రికం॥ ౪౪॥

మూడుపోగు లొకటిగానెగబురివేసి యది మరల మూడుపోగు లొకటిగాదిగబురివేసి నదిబ్రాహ్మణునకు ప్రత్తినూలు- క్షత్రియునకు జనపనార వైశ్యులకు ఆవికలోమములు వీటిచే నిర్మించినది యజ్ఞోపవీతము॥ శ్లో ॥ "ఊర్ధ్వంతుత్రిగుణంకార్యం తంతుత్రయ మధోవృతం। త్రివృతంచోపవీతంస్యా త్తస్యైకోగ్రంథిరిష్యతే॥ యజ్ఞోపవీతం కుర్వీత సూత్రాణి నవతంతవః॥" తొమ్మిది పోగులుగలది యజ్ఞోపవీతమని దేవలవచనము॥ ౪౪॥

మూ॥ బ్రాహ్మణోబైల్వ పాలాశౌ క్షత్రియో వాటఖాదిరౌ। పై
లవౌదుంబరౌవైశ్యో దండానర్హంతి ధర్మతః॥ ౪౫॥

బ్రాహ్మణుడు బిల్వమైన పలాశమైనను క్షత్రియుడు వటదండమైన చంద్రకర్రైనను వైశ్యుడు పీలుదండమైన నుదుంబరదండమైనను ధర్మవిధిచే ధరించవలెను- యీశ్లోకమందు బ్రాహ్మణాదులకు రెండేసి సముచ్చయముగ జెప్పుటవలన రెండుదండములు ధరించవలసిరాగా॥శ్లో॥ "కేశాంతికో బ్రాహ్మణస్య దండః కా

ర్యః॥" విప్రునకు కేశాంతప్రమాణ దండమున్ను "ప్రతిగృహ్యేప్సితందండం" ఇష్టమైన దండమును బట్టియున్ను విధులలో నేకవచనమును "బైల్వః పాలాశోవాదండః" మారేడుకర్రైన మోదుగకర్రైన దండమని వాసిష్ఠమందు వికల్పముగానుండుటవల్లనున్ను వికల్పమునే తాత్పర్యమని కుల్లూకభట్టు వ్రాసెను॥ ౪౫॥

మూ॥ కేశాంతికో బ్రాహ్మణస్య దండఃకార్యః ప్రమాణతః । ల
లాట సమ్మితో రాజ్ఞః స్యాత్తు నాసాంతికో విశః॥ ౪౬॥

బ్రాహ్మణాది మూడువర్ణముల వటువులు క్రమముగా కేశాంత లలాటాంత నాసికాంత ప్రమాణములగు దండములను ధరింపవలయును॥ ౪౬॥

మూ॥ ఋజవస్తేతు సర్వేస్యు రవ్రణాః సౌమ్యదర్శనాః । అను
ద్వేగకరా నృణాం సత్వచో నాగ్నిదూషితాః॥ ౪౭॥

ఆదండములు తిన్ననివి నరుకులులేనివిన్ని శుభముగా గనపడేవిన్ని భయము ఇయ్యనివిన్ని తోలుతోనున్నవిన్ని యగ్నిచే నించుకైన కాలినచిహ్నములు లేనివిన్ని యావటులకు కావలయును॥ ౪౭॥

మూ॥ ప్రతిగృహ్యేప్సితం దండ ముపస్థాయచ భాస్కరం। ప్రద
క్షిణం పరీత్యాగ్నిం చరేద్భైక్షం యథావిధి॥ ౪౮॥

నిర్ణయించబడిన లక్షణములుగల దండములలో నిష్టమైన దండమును ధరించి సూర్యునుపాసించి యగ్నికి బ్రదక్షిణము నొనర్చి యథావిధిగా భిక్షాచరణమాచరించవలయును॥ ౪౮॥

మూ॥ భవత్పూర్వం చరేద్భైక్ష ముపవీతో ద్విజోత్తమః। భవ
న్మధ్యంతు రాజన్యో వైశ్యస్తు భవదుత్తరమ్॥ ... ౪౯॥

"భవతి భిక్షాందేహీయని" బ్రాహ్మణుడుపవీతియై భవచ్ఛబ్దపూర్వముగ వాక్యముచ్చరించి యాచించవలయును "భిక్షాంభవతి దేహి" యని భవచ్ఛబ్దము మధ్యనుంచి క్షత్రియుడున్ను "భిక్షాందేహిభవతి" యని భవచ్ఛబ్దమంతమందుంచి వైశ్యుడును యాచించవలయును॥ ౪౯॥

మూ॥ మాతరంవా స్వసారంవా మాతుర్వా భగినీం నిజాం। భి
క్షేతభిక్షాం ప్రథమం యాచైనం నావమానయేత్॥ ౫౦॥

ఉపనయనమయినపిమ్మట ముందుగా భిక్ష తల్లినడుగవలెను తనసోదరినైనా తల్లితోబుట్టిన పినతల్లినైన నడిగినవెంటనే లేదనకుండనుండు వారినడుగవలెను. యీ చెప్పబడినవారలలో బూర్వపూర్వులులేకున్నను త్తరోత్తరులనడుగవలయును॥౫౦॥

మూ॥ సమాహృత్యతు తద్భైక్షం యావదర్థ మమాయయా।ని
వేద్యగురవేశ్నీయా దాచమ్య ప్రాఙ్ముఖశ్శుచిః॥ ౫౧॥

బహుస్థలములనుంచి యన్నముదెచ్చి మాయలేకుండనన గా మంచి యన్నము దనకని దాచక గురువునకు చాలినంతయిచ్చి మిగిలినయన్నమును దానాచమనమొనర్చి శుచియై తూరుపుముఖముగ గూర్చుని భక్షింపవలయును॥ ౫౧॥

మూ॥ ఆయుష్యం ప్రాఙ్ముఖోభుంక్తే యశస్యం దక్షిణాముఖః।
శ్రియం ప్రత్యఙ్ముఖో భుంక్తే ఋతంభుంక్తే హ్యుదఙ్ము
ఖః॥ ౫౨॥

కామ్యభోజనమును జెప్పుచున్నాడు ఆయుష్యమును గోరిన పూర్వాభిముఖముగను యశస్సునుగోరిన దక్షిణాభిముఖముగను సంపత్తినిగోరిన పశ్చిమముఖముగను సత్యముయొక్క ఫలమునుగోరిన నుత్తరాభిముఖముగను భుజించుచున్నాడు॥ ౫౨॥

మూ॥ ఉపస్పృశ్య ద్విజోనిత్య మన్నమద్యా త్సమాహితః। భు
క్త్వాచోపస్పృశే త్సమ్యగద్భిః ఖానిచసంస్పృశేత్॥ ౫౩॥

ఆచమనమొనర్చి భుజించి హస్తపాదప్రక్షాళనముజేసి మరలనాచమించవలెను జలముచే నింద్రియములననగా ॥ సూ॥ "ఖానిచోపస్పృశేచ్ఛీర్షణ్యాని" శిరస్స్థలములగు నింద్రియములను స్పృశించవలయునని గౌతమసూత్రమువలన ఘ్రాణచక్షుశ్శ్రోత్రాదులను స్పృశించవలెను నిత్యమనిజెప్పుటవలన నీనియమము బ్రహ్మచారికేగాదు గృహస్థునకునని దెలియవలయును॥ ౫౩॥

మూ॥ పూజయే దశనంనిత్య మద్యాచ్చై తదకుత్సయన్। దృ

ష్ట్వాహృష్యేత్ప్రసీదేచ్చ ప్రతినందేచ్చ సర్వశః॥ ౫౪॥

సర్వదా ఆయన్నమును ప్రాణార్థమని భావించి బహూకరించవలయును ఈ యన్నమును నిందించకుండ భక్షింపవలయును అన్నమునుచూచి సంతోషించవల యును ఇతర హేతువులచేత బుట్టిన యప్రసన్నతనున్ను నన్నముజూచుటతో విడచి నెమ్మదిగనుండవలయును నిత్యమును మాకిట్టియన్నము సంభవించుగాకయని సక లాన్నమునున్ను స్తుతిజేసి మ్రొక్కవలయును॥ ౫౪॥

మూ॥ పూజితం హ్యశనంనిత్యం బలమూర్జంచ యచ్ఛతి । అ
పూజితంతు యద్భుక్త ముభయం నాశయేదిదం॥ ౫౫॥

పూజితమగునన్నము సామర్థ్యమునున్ను వీర్యమునున్ను జేయును పూజితమ గునిది యీ రెంటిని నశింపజేయునుగాన నన్నమును బూజింపవలయునని పూర్వ శ్లోకముతో నేకార్థత భోజనము శ్రుతిచే నిత్యముగదా ఫలమేలననిన నిత్యమగు సంధ్యోపాసనకు నుపాత్తదురితక్షయత్వమువలె నిత్యశ్రుతికి భంగములేదని కుల్లూ కభట్టు ఈఫలశ్రవణము నిత్యశ్రుతికి విరోధము గావున స్తుతికొరకని మేధాతిథి గో విందరాజులు॥ ౫౫॥

మూ॥ నోచ్ఛిష్టం కస్యచిద్దద్యా న్నాద్యాచ్చైవ తదంతరా । న
చైవాత్యశనంకుర్యాన్నచోచ్ఛిష్టః క్వచిద్వ్రజేత్॥ ౫౬॥

భోజనశేషముచ్ఛిష్టమది యెవ్వనికి బెట్టగూడదు తానున్ను భక్షింపగూడదు సాయంప్రాతర్భోజనముల మధ్యను భుజింపగూడదు రెండుపూటలనైన నతిభో జనముచేయదగదు ఉచ్ఛిష్టుడై యెక్కడికిని నేగరాదు॥ ౫౬॥

మూ॥ అనారోగ్య మనాయుష్య మస్వర్గ్యం చాతిభోజనం। అ
పుణ్యం లోకవిద్విష్టం తస్మాత్తత్పరివర్జయేత్॥... ౫౭॥

అమితముగా భుజించుటచే నజీర్ణాదిరోగోత్పత్తియగుటవలన నారోగ్యము లేకుండుటయు నాపై మరణమున్ను సంభవించును గాన ననాయుష్యకరము నగు నది మరియు నత్యాశి స్వకర్మానుష్ఠానము జేయలేకుండుటచే స్వర్గమున్ను గాదు తిండిపోతు దినునని లోకులు నిందింతురుగాన జనద్వేషమును...

శనము వర్జించవలయును॥ ౫౭॥

మూ॥ బ్రాహ్మేణవిప్రస్తీర్థేన నిత్యకాల ముపస్పృశేత్ । కా
యత్రైదశకాభ్యాంవా నపిత్ర్యేణకదాచన॥ ౫౮॥

ముందుజెప్పబోయెడియీబ్రాహ్మతీర్థముచేబ్రాహ్మణుడు నిత్యము నాచమింపవలెను- ప్రజాపతితీర్థముచేగాని దేవతీర్థముచేత గాని యాచమింపవచ్చును గాని పితృతీర్థముచే నెప్పుడు నాచమనము జేయకూడదు॥ ౫౮॥

మూ॥ అంగుష్ఠమూలస్యతలే బ్రాహ్మంతీర్థంప్రచక్షతే । కాయ
మంగుళిమూలేగ్రే దైవంపిత్ర్యంతయోరధః॥ ౫౯॥

అంగుష్ఠమూలముగు కరతలమునుంచి క్రిందిభాగము బ్రాహ్మతీర్థము కనిష్ఠికామూలము బ్రాజాపత్యతీర్థము దైవతీర్థమంగుళ్యగ్రములనుంచి తర్జన్యంగుష్ఠముల మధ్యము పితృతీర్థము॥ ౫౯॥

శ్లో॥ "కనిష్ఠికాదేశిన్యంగుష్ఠమూలాన్యగ్రంకరస్యచ । ప్రజాపతి పితృబ్రహ్మ దేవతీర్థాన్యనుక్రమాత్॥" కనిష్ఠికామూలము ప్రజాపతితీర్థము తర్జనీమూలము పితృతీర్థము నంగుష్ఠమూలము బ్రహ్మతీర్థము కరాగ్రము దేవతీర్థమని యాజ్ఞవల్క్య॥ *

మూ॥ త్రిరాచామేదపఃపూర్వం ద్విఃప్రమృజ్యాత్తతోముఖమ్। ఖా
నిచైవస్పృశేదద్భి రాత్మానంశిరఏవచ॥ ౬౦॥

బ్రహ్మతీర్థముచే ముందు మూడుమారు లుదకమును త్రావి ఓష్ఠపుటము నంగుష్ఠమూలముచే రెండుమారులు తుడవ వలయును ముఖమందగు నింద్రియములననగా శ్రోత్రాక్షిఘ్రాణములనున్ను హృదయమునున్ను శిరస్సునున్ను జలముచే స్పృశింపవలయును॥ ౬౦॥

మూ॥ అనుష్ణాభిరఫేనాభి రద్భిస్తీర్థేనధర్మవిత్ । శౌచేప్సు
స్సర్వదాచామే దేకాంతేప్రాగుదఙ్ముఖః॥ ౬౧॥

శుచిత్వమును గోరునతడు సంమర్దము లేనిచోటను వేడిచెయ్యనట్టియు ను

రుగులేనట్టి జలముచే పూర్వాభిముఖుడై గాని యుత్తరాభిముఖుడై గాని బ్రాహ్మతీర్థమున నెప్పుడు నాచమింప వలయును- రోగియై నప్పుడు వేడినీళ్లచేనైన నాచమింపవచ్చును. "తప్తాభిశ్చ కారణాత్" రోగాదికారణము వలన కాచినజలముచే నాచమించదగునని యాపస్తంబవచనము మరలతీర్థముచే ననిచెప్పుట యతీర్థముగా నెప్పుడు నాచమింపదగదనుట॥ ౬౧॥

మూ॥ హృద్గాభిఃపూయతే విప్రః కంఠగాభిస్తుభూమిపః। వైశ్యో
ద్భిః ప్రాశితాభిస్తు శూద్రస్స్పృష్టాభిరంతతః॥ ౬౨॥

బ్రాహ్మణు డాచమించిన జలము హృదయమందు ప్రవేశించునట్లున్ను క్షత్రియుడు కంఠమందు దడియుటయును వైశ్యుండు కంఠము దిగకున్న నోరు తడియుటయును శూద్రునకు పెదవులు జిహ్వాయు దడియు మాత్రముగానన్నంత జలముచే నాచమింపవలయు నట్లయిన శుద్ధుడగును॥ ౬౨॥

మూ॥ ఉద్ధృతే దక్షిణే పాణా వుపవీత్యుచ్యతే ద్విజః।సవ్యే ప్రాచీన
ఆవీతి నివీతీకంఠసజ్జనే॥ ౬౩॥

యడమభుజము పైనుండు నటులు కుడిచే యెత్తి ధరించిన బ్రహ్మసూత్రముగాని గలద్విజు డుపవీతియనబడును కుడిభుజము పై నుండునటుల ధరించిన ప్రాచీనావీతియనబడును పేరువలె కంఠమునందుండి వ్రేలుచున్న నివీతియన బడును. యిందుకు గోభిలస్మృతి "దక్షిణంబాహుముద్ధృత్య శిరోవధాయసవ్యంసప్రతిష్ఠాపయతి దక్షిణస్కంధమవలంబనం భవతి- ఏవంయజ్ఞోపవీతీభవతి- సవ్యంబాహుముద్ధృత్య శిరోవధాయదక్షిణేంసే ప్రతిష్ఠాపయతి - సవ్యంకక్షమవలంబంభవత్యేవం ప్రాచీనావీతీ భవతి- నివీతీకంఠసజ్జనఇతిశిరోవధాయ దక్షిణపాణ్యాదావప్యుద్ధృతేకంఠాదేవసజ్జనే - ఋజుప్రాలంబే యజ్ఞసూత్రేవస్త్రైవ నివీతీభవతి॥ దీని యర్థము మొదటవివరించుటచే నిందుకర్థము వ్రాయలేదు॥ ౬౩॥

మూ॥ మేఖలామజినందండ ముపవీతంకమండలుమ్।అప్సుప్రాస్య
వినష్టాని గృహ్ణీతాన్యానిమంత్రవత్॥ ౬౪॥

మేఖలయున్ను ఆజినమున్ను దండమున్ను నుపవీతమున్ను జీర్ణమైనప్పుడుద

కేమందు బడవేసి క్రొత్తవాటిని మంత్రయుక్తముగ మరల ధరించవలెను॥ ౬౪॥

మూ॥ కేశాంతష్షోడశేవర్షే బ్రాహ్మణస్యవిధీయతే । రాజన్య
బంధోర్ద్వావింశే వైశ్యస్యద్వ్యధికేతతః॥ ౬౫॥

కేశాంతమనప్రసిద్ధమగు గృహ్యోక్తసంస్కారము బ్రాహ్మణునకు సాగర్భ షోడశాబ్దమందును క్షత్రియునకు గర్భాద్ద్వావింశాబ్దము నందును వైశ్యునకుగర్భ చతుర్వింశాబ్దమందునుం జేయందగును- "కేశాంతాఖ్యోగృహ్యోక్తసంస్కారో గర్భాదిసంఖ్యావర్షాణామితి" ఈసంస్కారము యథావర్ణముగ జెప్పబడిన వర్షములు గర్భాదిగానని బోధాయన వచనము॥ ౬౫॥

మూ॥ అమంత్రికాతు కార్యేయం స్త్రీణా మావృదశేషతః। సం
స్కారార్థం శరీరస్య యథా కాలం యథాక్రమం॥ ౬౬॥

ఈచెప్పబడిన యావృదనగా జాతకర్మాదిక్రియాకలాపము సమగ్రముగ స్త్రీలకు యథాకాలము శరీరసంస్కారార్థమమంత్రకముగ జేయవలయును॥ ౬౬॥

మూ॥ వైవాహికో విధిస్త్రీణాంసంస్కారో వైదికస్స్మృతః।
పతిసేవా గురౌవాసో గృహార్థోఽగ్నిపరిక్రియా॥ ౬౭॥

స్త్రీలకు వివాహసంస్కారమే యుపనయనస్థానీయము భర్తృసేవే గురుకులవాసవేదాధ్యయనములు గృహకృత్యమే అగ్నిపరిచర్య యనగా సాయంప్రాతస్సమిద్ధోమను గాన వివాహాదికమే యుపనయనస్థానీయమని మన్వాదులుచెప్పుటవలన స్త్రీలకుపనయనాదికము లేకుండెను॥ ౬౭॥

మూ॥ ఏషప్రోక్తో ద్విజాతీనా మౌపనాయనికోవిధిః । ఉత్పత్తి
వ్యంజకః పుణ్యః కర్మయోగం నిబోధత॥ ౬౮॥

ద్విజులకీయుపనయనసంబంధమైనవిధి ద్వితీయ జన్మమును బోధింపజేయుపుణ్యమైనది యావత్తున్ను జెప్పబడెను ఇంక నుపనీతునకు నేకర్మముతో యోగమో దానినివినుండు॥ ౬౮॥

మూ॥ ఉపనీయ గురుశ్శిష్యం శిక్షయేచ్ఛౌచమాదితః । ఆచారమ
గ్నికార్యంచ సంధ్యోపాసనమేవచ॥ ౬౯॥

ఉపనయనానంతరమందు గురువు శిష్యునికిముందుగ మృత్తికాశౌచమున్ను స్నానాచమన సంధ్యోపాసనాద్యాచారమున్ను సాయంప్రాతరగ్నికార్యమునున్ను తెలియచెప్పవలెను॥ ౬౯॥

మూ॥ అధ్యేష్యమాణస్త్వాచాంతో యథాశాస్త్రముదఙ్ముఖః।బ్ర
హ్మాంజలికృతోధ్యాప్యో లఘువాసాజితేంద్రియః॥ ౭౦॥

అధ్యయనము చేయబోయేవటుడు యథాశాస్త్రముగ నాచమించియుత్తరాభిముఖముగ బ్రహ్మాంజలికృతుడనగా చేతులుజోడించుకుని పవిత్రమైన వస్త్రమును ధరించి నియతములగు నింద్రియములుగలవాడై గురువుచే నధ్యయనముజేయించవలెను తూరుపుముఖముగానున్న గురువుకు దక్షిణపార్శ్వమందు దుత్తరాభిముఖుడై యుండవలెను- "ప్రాఙ్ముఖో దక్షిణతశ్శిష్య ఉదఙ్ముఖో వేతి" యని గౌతమవచనము॥ ౭౦॥

మూ॥ బ్రహ్మారంభేఽవసానేచ పాదౌ గ్రాహ్యౌ గురోస్సదా।
సంహత్యహస్తావధ్యేయం సదా బ్రహ్మాంజలిస్స్మృతః॥౭౧॥

వేదాధ్యయనారంభమందును విరమించునప్పుడును గురుపాదములకు నమస్కరించవలెను హస్తములు జోడించుకుని చదువవలెను కరపుటమే బ్రహ్మాంజలి యనబడును॥ ౭౧॥

మూ॥ వ్యత్యస్తపాణినా కార్య ముపసంగ్రహణం గురోః। సవ్యే
న సవ్యస్స్ప్రష్టవ్యో దక్షిణేనచ దక్షిణః॥ ౭౨॥

వ్యత్యస్తములైన హస్తములుత్తానములుగా గురువుయొక్క దక్షిణపాదము దక్షిణహస్తముచేతనున్ను వామపాదము వామహస్తముచేతనున్ను స్పృశించి నమస్కరించవలెను॥ సూ॥ "ఉత్తానాభ్యాం హస్తాభ్యాం దక్షిణేనదక్షిణం సవ్యేనసవ్యం పాదావభివాదయేత్ దక్షిణో పరిభావేన వ్యత్యాసోవాయం శిష్టసమాచారాత్" అని పైఠీనసి॥ సూత్రార్థము గతార్థము ॥ శిష్టాచారమువలన హస్తములు వ్యత్యస్తములు గావడనులో కుడిచేయిమీదుగా చేయవలెను॥ ౭౨॥

మూ॥ అధ్యేష్యమాణంతు గురు ర్నిత్యకాలమతంద్రితః। అధీష్వ

భో ఇతిబ్రూయా ద్విరామో స్త్వితిచారమేత్॥ ౭౩॥

చదువుకొనుటకు సిద్ధముగానున్న శిష్యునినిత్యమున్ను చదువుకోవోయియని ప్రారంభించి చదువయిన బిమ్మట నిలుపుదువుగాక యని గురువు బలికి విరమించవలెను॥ ౭౩॥

మూ॥ బ్రహ్మణః ప్రణవం కుర్యా దాదావంతేచ సర్వదా। స్రవత్యనోంకృతం పూర్వం పరస్తాచ్చ విశీర్యతే॥ ౭౪॥

వేదము జదువ నుపక్రమించునప్పుడున్ను విరమించినబిమ్మటనున్ను బ్రణవోచ్చారణము జేయవలయును మొదల నోమనకున్న చదివినవేదము మందమందముగానశించును అంతమందు బ్రణవను నుచ్చరించకున్నచదివినచదువు నిలువనేనిలువదు॥ ౭౪॥

మూ॥ ప్రాకూలా న్పర్యుపాసీత పవిత్రైశ్చైవ పావితః। ప్రాణాయామైస్త్రిభిఃపూత స్తతఓంకారమర్హతి॥ ౭౫॥

పూర్వాగ్రములగు దర్భలపైగూర్చుని రెండుహస్తముల యందును కుశపవిత్రము లుదాల్చిశుద్ధుడై॥సూ॥ "పంచదశమాత్రాః॥" యను గౌతమవచనము వలన మాత్రయనగాహ్రస్వవర్ణోచ్చారణకాలముమాత్ర గావున నట్టిపదియేనుమాత్రల పరిమితకాలమొకప్రాణాయామమట్టి ప్రాణాయామములు మూడొనర్చిన యటపైనోంకారము నుచ్చరించ నర్హుడగును॥ ౭౫॥

మూ॥ అకారంచా ప్యుకారంచ మకారంచ ప్రజాపతిః । వేదత్రయాన్నిరదుహ ద్భూర్భువ స్స్వరితీతిచ॥ ౭౬॥

అకారోకార మకారములనున్ను "భూః భువః సువః" అనే యీమూడింటి నిన్ని బ్రహ్మ ఋగ్యజు స్సామవేదములనుంచి సారముగా నుద్ధరించెను॥ ౭౬॥

మూ॥ త్రిభ్యఏవతు వేదేభ్యః పాదంపాద మదూదుహత్ । తదిత్యృచోస్యా స్సావిత్ర్యాః పరమేష్ఠీ ప్రజాపతిః॥ ౭౭॥

పరమస్థానమం దుంటున్న బ్రహ్మ ఋగ్యజుస్సామనామక వేదత్రయమువలన "తత్" యనేదిమొదటగల సావిత్రీమంత్రముయొక్క మూడుపాదములను బితికెనన

గా నాకషించెను॥ ౭౭॥

మూ॥ ఏతదక్షర మేతాంచ జపన్ వ్యాహృతి పూర్వికాం। సంధ్య
యోర్వేద విద్విప్రో వేదపుణ్యేన యుజ్యతే॥ ౭౮॥

ఈప్రణవాక్షరమునున్ను త్రిపదాసావిత్రిని వ్యాహృతియుక్తముగ రెండు సంధ్యలయందున్ను వేదవేత్తయగు ద్విజుడుజపించిన వేదత్రయపఠన పుణ్యఫలమునొందును॥ ౭౮॥

మూ॥ సహస్రకృత్వ స్త్వభ్యస్య బహిరేత త్త్రికంద్విజః। మహ
తోప్యేనసోమాసా త్వచేవాహి ర్విముచ్యతే॥ ౭౯॥

సంధ్యావ్యతిరిక్తకాలమందు నదీతీరమందైన వనమందైన నీత్రితయమునగా ప్రణవవ్యాహృతిసహితముగ గాయత్రిని ప్రత్యహమొకవేయిచొప్పున నొకమాసము జపించినద్విజుడు కంచుకమువలన విముక్తుడగును॥ ౭౯॥

మూ॥ ఏతయర్చావిసంయుక్తః కాలేచ క్రియయాస్వయా। బ్ర
హ్మక్షత్రియ విడ్యోని ర్గర్హణాం యాతిసాధుషు॥ ౮౦॥

కాలమందు స్వకీయసంధ్యోపాసనాది కర్మమును నీగాయత్రీ జపమునున్ను విడచిన బ్రహ్మక్షత్రియవైశ్యులలో నెవడైన సజ్జనులలో నింద్యుడగును॥ ౮౦॥

మూ॥ ఓంకార పూర్వికాస్తిస్రో మహావ్యాహృతయోవ్యయాః।
త్రిపదాచైవ సావిత్రీ విజ్ఞేయం బ్రహ్మణోముఖం॥ ౮౧॥

ఓంకారము మున్నుగాగల వ్యాహృతులు మూడున్ను బ్రహ్మప్రాప్తికారణము లుగావున నవ్యయములు మూడుపాదములుగల గాయత్రి వేదమునకు ముఖము గాయత్రియొక్క యుపదేశము ముందుగనైనగదా వేదాధికారమని తాత్పర్యము లేదా సావిత్రీజపముచే దురితక్షయమగుటచే మోక్షమునకు ద్వారభూతము।౮౧॥

మూ॥ యోధీతేఽహన్యహన్యేతాం వర్షాణిత్రీణ్యతంద్రితః।సబ్ర
హ్మపరమభ్యేతి వాయుభూతః ఖమూర్తిమాన్॥ ౮౨॥

ఏవిప్రుడు మూడుసంవత్సరములు ప్రతిదినంబున నీప్రణవవ్యాహృతిసహిత సా

విత్రిని జపించు నతండు పరబ్రహ్మలో గలయును॥ వాయురూపుఁడై వ్యాపకుఁడును కామచారుఁడై బ్రహ్మ స్వరూపమునొందును॥ ౮౨॥

మూ॥ ఏకాక్షరం పరంబ్రహ్మ ప్రాణాయామాః పరంతపః। సా-
విత్ర్యాస్తు పరం నాస్తి మౌనాత్సత్యం విశిష్యతే॥ ౮౩॥

ఓంకారము పరబ్రహ్మప్రాప్తి హేతువుగావున నదియే పరబ్రహ్మము తపఃఫలము గు పరబ్రహ్మముయొక్క భావనచే ముక్తియగుగావున ప్రాణాయామములు ప్రణవవ్యాహృతిసహిత గాయత్రిని శిరస్సుగూడ నుచ్చరించిన నది ప్రాణాయామము. బహువచనముచే నిట్లు మువ్మారుజపించిన నది పరమమగు తపస్సుకృచ్ఛ్రచాంద్రాయణములవలె పాపక్షయకరమని తాత్పర్యము- సావిత్రికంటె నన్యము ప్రకృష్టమంత్రములేదు మౌనముకంటె సత్యవచన ముత్కృష్టము ఈనాల్గింటియొక్క స్తుతివలన నీనాల్గు నవశ్యముపాస్యములని విధి గల్పించబడుచున్నదని కుల్లూకభట్టు- ధరణీధరుఁడు "ఏకాక్షరపరంబ్రహ్మ" యనియు "ప్రాణాయామ పరంతపః" యని వ్రాసెను- ఏకాక్షరముపరము జేనికో యది యేకాక్షరపరమనిన్ని ఇటులే ప్రాణాయామపరమనిన్ని వ్యాఖ్యానము చేసెను-మేధాతిథిమొదలగు వృద్ధులెవరునూయీ పాఠాంతరము వ్రాయలేదు॥ ౮౩॥

మూ॥ క్షరంతి సర్వావైదిక్యో జుహోతియజతి క్రియాః।అక్షరం
దుష్కరం జ్ఞేయం బ్రహ్మచైవప్రజాపతిః॥ ౮౪॥

వేదవిహితములగు యాగహోమాది క్రియలు యావత్స్వరూపముచేతను- నన్ను ఫలముచేతనున్ను నశించును ప్రణవరూపమగు నక్షరమక్షరము బ్రహ్మప్రాప్తికి హేతువుగావున ఫలద్వారముచేతను నక్షరమే యీ హేతువుచేత బ్రజాపతియే బ్రహ్మమోయదేయీ ప్రణవము బ్రహ్మప్రతిపాదకమౌటచేతనున్ను స్వరూపముచేతనన్ను బ్రహ్మమే ప్రణవమని యుపాసించుట మోక్షహేతువని చెప్పబడెను॥౮౪॥

మూ॥ విధియజ్ఞాజ్జపయజ్ఞో విశిష్టోదశభిర్గుణైః। ఉపాంశుస్స్యా
చ్ఛతగుణ స్సాహస్రో మానసస్స్మృతః॥ ౮౫॥

దర్శపూర్ణమాసాదివిధి యజ్ఞముకంటె ప్రణవాది జపయజ్ఞము పదిమడుం

గులేకుండ వగా ఫలప్రదము ఆజప ముపాంశువుగా నైతే శతగుణము దగ్గిర వున్న వారికివినరాకుండ జేయునదియుపాంశువు మానసికమైతే సహస్రగుణము జిహ్వో ష్ఠాదిచలనములేనిజపముమానసికము॥ ౮౫॥

మూ॥ యెపాకయజ్ఞాశ్చత్వారోవిధియజ్ఞసమన్వితాః । సర్వేతే
జపయజ్ఞస్య కళాం నార్హంతి షోడశీం॥ ౮౬॥

బ్రహ్మయజ్ఞమువినాగా మిగిలిన పంచమహాయజ్ఞాంతర్గతములగు వైశ్వదేవ హోమ బలికర్మ నిత్యశ్రాద్ధాతిథి భోజనాత్మకములు నాలుగు పాకయజ్ఞముల తోగూడిన దర్శపౌర్ణమాసాది యాగమును జపముయొక్క ఫలములో పదియా రవపాలైన జేయవనగా జపయజ్ఞము పదియారవపాలుకైనను సరిరావు॥ ౮౬॥

మూ॥ జప్యేనైవతు సంసిధ్యే ద్బ్రాహ్మణో నాత్రసంశయః । కు
ర్యాదన్యన్నవా కుర్యా న్మైత్రో బ్రాహ్మణఉచ్యతే॥ ౮౭॥

జపముచేతనే బ్రాహ్మణుడు నిస్సందేహముగ సిద్ధినొందును యాగాదికర్మము లుచేయనీ చేయకపోవనీ పశుహింసాదికములేక సర్వమునకును మిత్రమగు గావున నతడు బ్రహ్మసంబంధియన్ని గాని బ్రహ్మమందు లీనమగుననిగాని బ్రాహ్మణు డనిపించు కొనును॥ ※

హింసలేకనే జప్యము మోక్షకరమని స్తుతిగాని యాగాదికమునకు నిందగాద దియు నుత్తమమే గావున॥ ౮౭॥

మూ॥ ఇంద్రియాణాం విచరతాం విషయేష్వపహారిషు। సంయమే
యత్నమాతిష్ఠే ద్విద్వాన్యంతేవవాజినాం॥ ౮౮॥

ఇప్పుడు సర్వవర్ణానుష్ఠేయము నఖిల పురుషార్థోపయుక్తమునగు నింద్రియ సంయమమును జెప్పుచున్నాడు-అపహరణశీలములగు విషయములందు బ్రవర్తించెడి యింద్రియములయొక్క జయమునకు యత్నమును రథాశ్వములనుస్వాధీనపర్చుటకు సారథియుంబోలె జేయవలయును॥ ౮౮॥

మూ॥ ఏకాదశేంద్రియాణ్యాహు ర్యాని పూర్వే మనీషిణః। తాని
సమ్యక్ప్రవక్ష్యామి యథావదనుపూర్వశః॥ ౮౯॥

పూర్వపండితులు వేటిని పదాకండింద్రియములను జెప్పిరో యిప్పటివారువాటి నినియమించుటకై యింద్రియముల కర్మములతోను నామములతోను స్పష్టముగాజెప్పగలను॥ ౮౯॥

మూ॥ శ్రోత్రం త్వక్చక్షుషీజిహ్వా నాసికాచైవ పంచమీ। పాయూ
పస్థం హస్తపాదం వాక్చైవ దశమీస్మృతా॥ ౯౦॥

శ్రోత్రము త్వకుచక్షుస్సు జిహ్వా నాసికయైదవది పాయువు నుపస్థయు హస్తములు పాదములు వాకుచ నివిపదియు నింద్రియములు॥ ౯౦॥

మూ॥ బుద్ధీంద్రియాణి పంచైషాం శ్రోత్రాదీ న్యనుపూర్వశః। క
ర్మేంద్రియాణి పంచైషాం పాయ్వాదీని ప్రచక్షతే॥ ౯౧॥

ఈ పదింటిలోను శ్రోత్రాదులైదును బుద్ధికరణములు గావున బుద్ధీంద్రియముల నిన్ని పాయ్వాదు లుత్సర్గాదికర్మ కరణములు గావున నాపదింటిలోను వీటిని క ర్మేంద్రియములని తజ్జ్ఞులు సెప్పుచున్నారు॥ ... ౯౧॥

మూ॥ ఏకాదశం మనోజ్ఞేయం స్వగుణేనో భయాత్మకం। య
స్మిన్జితే జితావేతౌ భవతః పంచకౌగుణౌ॥ ... ౯౨॥

పదకొండవది మనోరూపమగు నంతరింద్రియము తన సంకల్పరూపమగు గుణముచే నుభయములగు బుద్ధీంద్రియ కర్మేంద్రియములకు బ్రవర్తకమని తెలియదగు నుభయాత్మక మగుటచేతనే యీమనస్సు స్వాధీనమయితే బుద్ధీంద్రియపంచకము న్ను కర్మేంద్రియ పంచకమున్ను జయించబడును॥ ౯౨॥

మూ॥ ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛ త్యసంశయమ్।
సంనియమ్యతు తాన్యేవ తపస్సిద్ధిం నియచ్ఛతి॥ ... ౯౩॥

ఇంద్రియములయొక్క సక్తిచే దృష్టాదృష్టదోషముల నిస్సంశయముగ నొందును వాటిని లెస్సగా నియమించి మోక్షాదిలాభయోగ్యతా సిద్ధిని బొందును గావున నింద్రియములను నియమించవలయును॥ ౯౩॥

మూ॥ నజాతు కామః కామానా ముపభోగేన శామ్యతి। హ

విషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభి వర్ధతే॥ ... ౯౪॥

ఇంద్రియముల నణచనేల భోగముచే దృప్తుడై విరమించరాదాయని శంకించుకొనిచెప్పుచున్నాడు- ఎప్పుడైనను కామోపభోగముచే నభిలాషశమించదు హవిస్సులచే నగ్నివలె నధికతమముగ వృద్ధినొందును భోగమునొందినదానికంటె నధిక భోగవాంఛ వృద్ధినొందును ॥ శ్లో ॥ "యత్పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవ(స్త్రి)యః। ఏకస్యాపినపర్యాప్తం తదిత్యతి తృషం త్యజేత్॥ పూర్ణంవర్షసహస్రంమే విషయాసక్తచేతసః। తథాప్యనుదినంతృష్ణా యత్తేష్వేవహిజాయతే" భూమియందుగల వ్రీహియవాదులున్ను సువర్ణమున్ను పశువులున్ను స్త్రీలున్నొకనికే సమృద్ధిగావు నేను వేయుసంవత్సరములు పూర్ణముగ విషయాసక్తచిత్తుడ నగుచున్నప్పటికిని ననుదినమున్ను తృష్ణవృద్ధి నొందెనని విష్ణుపురాణములో యయాతివచనము॥ ౯౪॥

మూ॥ యశ్చైతా న్ప్రాప్నుయా త్సర్వా న్యశ్చైతా న్కేవలాం
స్త్యజేత్ । ప్రాపణాత్సర్వకామానాం పరిత్యాగో వి
శిష్యతే॥ ౯౫॥

ఎవడీవిషయములన్నింటినిన్ని బొందెనో యెవడీ సర్వకామముల నుపేక్షించెనో వారియుభయులలోను సర్వకామప్రాప్తి గలవానికంటె విషయత్యాగమేలు విషయలబ్ధియందా సాధన సంపాదన కెక్కువకష్టమగును గావున విషయోపేక్షకుడుత్తముడు॥ ౯౫॥

మూ॥ నతథైతాని శక్యంతే సంనియంతు మసేవయా। విషయేషు
ప్రజుష్టాని యథా జ్ఞానేన నిత్యశః॥ ౯౬॥

ఇంద్రియజయోపాయము జెప్పుచున్నాడు- ఏలాగునైతే విషయభోగమనిత్యము దేహము క్షయిష్ణువనని భోగ్యములయందగు దోషవిచారజనిత జ్ఞానముచే విషయములందసక్తములగు నింద్రియములను నియమించుటకు శక్యమో యట్లువిషయాసక్తములగు నింద్రియములను విషయసేవ మాన్పించుటచే నియమించుట శక్యముగాదు॥ ౯౬॥

మూ॥ వేదాస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసిచ। న విప్ర

దుష్టభావస్య సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్॥ ...... ౯౭॥

వేదాధ్యయనము త్యాగము యజ్ఞములు నియమములు తపస్సు భోగాదివిషయసేవాసంకల్పశీలునకుగా భోగార్థమై విషయసంకల్పములచే దుష్టమయిన మనస్సుగలవానికి సిద్ధించ నేరవు॥ ౯౭॥

మూ॥ శ్రుత్వా స్పృష్ట్వాచ దృష్ట్వాచ భుక్త్వా ఘ్రాత్వాచ యో
నరః। నహృష్యతిగ్లాయతివా సవిజ్ఞేయోజితేంద్రియః॥౯౮॥

జితేంద్రియునిస్వరూపమును జెప్పుచున్నాడు- స్తుతివాక్యమును నిందావాక్యమును విని మెత్తనిస్పర్శగల పట్టువస్త్రమును దుఃఖస్పర్శగల గొంగళిని స్పృశించి సురూపమును కురూపమును జూచి స్వాదువస్తువును స్వాదుగాని దానిని భక్షించి సుగంధమును దుర్గంధమును నాఘ్రాణించి హర్షమునుగాని విషాదమునుగాని యెవడు పొందకుండునో యతండు జితేంద్రియుడని తెలియదగును॥...... ౯౮॥

మూ॥ ఇంద్రియాణాంచ సర్వేషాం యద్యేకం క్షరతీంద్రియమ్।
తేనాస్య క్షరతి ప్రజ్ఞాదృతేః పాదాదివోదకమ్॥... ౯౯॥

ఇంద్రియములలో నొకయింద్రియమైన విషయాసక్తమయినయెడల నన్నియింద్రియముల సంబంధమగు బుద్ధిన్ని తోలుసంచిలో నీరొకకాలుకట్టువిప్పితే దానివెంబడి నీరంతయు నెట్లుస్రవించిపోవు నట్లనే వ్యవస్థలేకపోవును॥ ౯౯॥

మూ॥ వశేకృత్వేంద్రియగ్రామం సంయమ్యచ మనస్తథా। సర్వాన్
సంసాధయేదర్థా నక్షిణ్వన్ యోగతస్తనుమ్॥ ౧౦౦॥

ఇంద్రియనిగ్రహము సకలపురుషార్థములకును హేతువని చెప్పుచున్నాడు-బహిరింద్రియములను స్వాధీనముగజేసి మనస్సును నియమించి సర్వపురుషార్థములను లెస్సగా సాధించిని యుపాయముచే దనశరీరమునకు పీడలేకుండనుండును॥౧౦౦॥

మూ॥ పూర్వాంసంధ్యాంజపం స్తిష్ఠే త్సావిత్రీ మార్కదర్శనాత్।
పశ్చిమాంతు సమాసీన స్సమ్యగృక్ష విభావనాత్॥ ౧౦౧॥

ప్రాతస్సంధ్యయందు సూర్యదర్శన పర్యంతమును సావిత్రీజపము జేయుచు

నిలవబడియుండవలెను- ఆసనము వలన లేచి స్థిరముగ నొకచో నుండి జపించ వ లెను-సాయంసంధ్యయందు గూర్చుని నక్షత్రముల జూచే పర్యంతమును సావిత్రీజపమును జేయవలయును-ఇచ్చట ఫలము గలది గావున జపము ప్రధానను స్థానాసనము లంగములు-ఫలవత్సన్నిధిని దదంగమఫలమగు నని న్యాయము వలన॥ శ్లో॥ "సంధ్యయోర్వేదవిద్విప్రో వేదపుణ్యేనయుజ్యతే। సహస్రకృత్వ స్త్వభ్యస్య" రెండు సంధ్యలయందును వేదవేత్తయగు బ్రాహ్మణుడు సహస్రగాయత్రిజేసి వేదపారాయణపుణ్యము నొందునని ఫలము జెప్పబడెను- మేధాతిథిస్థానాసనములకే ప్రాధాన్యమని వ్రాసెను-ముహూర్తమాత్రము సంధ్యాకాలము అందుకు॥శ్లో॥ "హ్రాసవృద్ధీతుసతతం దివసానాంయథాక్రమం। సంధ్యాముహూర్తమాత్రంతు హ్రాసేవృద్ధౌచసాస్మృతా॥" పగటియొక్క వృద్ధిక్షయములు క్రమముగ నగుచుండు ను సంధ్యహ్రాసమందైనను వృద్ధియైనను ముహూర్తమాత్రమె రెండుగడియలగుచున్నది యనియోగియాజ్ఞవల్క్య॥ ౧౦౧॥

మూ॥ పూర్వాంసంధ్యాంజపం స్తిష్ఠ న్నైశ మేనోవ్యపోహతి।ప
శ్చిమాంతుసమాసీనో మలంహంతిదివాకృతం॥ ౧౦౨॥

ప్రాతస్సంధ్యయందు నిలబడి జపించుచు రాత్రికృతమగు పాపమును పోగొట్టును సాయంసంధ్యయందుగూర్చునిజపించి పగటిదయిన పాపమును బోగొట్టును ఇదియజ్ఞానకృతపాపవిషయము॥శ్లో॥ "దివావాయదివారాత్రౌ యదజ్ఞానకృతం భవేత్। త్రికాలసంధ్యాకరణా త్తత్సర్వంవిప్రణశ్యతి॥ రాత్రిగాని పగలుగానియజ్ఞానముచే జేసిన పాపమంతయు గాలత్రయంబునుం జేసిన సంధ్యాజపముల వలన నాసవర్ణపాపము నశించునని యాజ్ఞవల్క్య॥ ౧౦౨॥

మూ॥ నతిష్ఠతితు యఃపూర్వాం నోపాస్తేయశ్చపశ్చిమాం।సశూ
ద్రవద్బహిష్కార్య స్సర్వస్మా ద్ద్విజకర్మణః॥ ౧౦౩॥

ఎవడైతే సాయంప్రాతస్సంధ్యలయందు జేయదగిన జపాదికర్మములను జేయడో వాడు శూద్రుడువలెనే బ్రాహ్మణకర్మముల కన్నిటికి బాహ్యుడై యతిథిసత్కారానర్హుడై జేయబడదగునని ప్రత్యవాయము చెప్పుట వలన సంధ్యాకర్మము నిత్యమగుచున్నది నిత్యమైనప్పటికిని దాకోరకుండనే పాపక్షయమగుటచే ఫల

లమైనను నిత్యత్వహానిలేదు ఫలమవిరుద్ధము గావున॥ ౧౦౩॥

మూ॥ అపాం సమీపే నియతో నైత్యకంవిధి మాస్థితః। సావిత్రీమ
ప్యధీయీత గత్వారణ్యంసమాహితః॥ ౧౦౪॥

ఇది బ్రహ్మయజ్ఞరూపము-బహువేదాధ్యయనమం దశక్తుడైనప్పటికిని సావిత్రీమాత్రాధ్యయనమును విధించుచున్నాడు- అరణ్యాః నిర్జనదేశమందు నద్యాద్యుదకసమీపమున నియతేంద్రియుండైసమాహితమనస్కుఁడగుచు నైత్యకమైనబ్రహ్మయజ్ఞవిధిని జేయనిశ్చయించి ప్రణవవ్యాహృతిత్రయసహితమగు సావిత్రీమాత్రమైన యథోక్తముగా జపించవలెను॥ ౧౦౪॥

మూ॥ వేదోపకరణేచైవ స్వాధ్యాయేచైవనైత్యకే । నానురోధో స్త్యనధ్యాయే హోమమంత్రేషుచైవహి॥ ౧౦౫॥

శిక్షాదివేదాంగమందున్ను నిత్యమును జేయదగిన బ్రహ్మయజ్ఞ రూపమగు స్వాధ్యాయమందున్ను హోమమంత్రమందును ననధ్యాయనిషేధము లేదు॥ ౧౦౫॥

మూ॥ నైత్యకేనా స్త్యనధ్యాయో బ్రహ్మసత్రంహి తత్ స్మృతమ్।
బ్రహ్మాహుతిహుతంపుణ్య మనధ్యాయవషట్కృతమ్॥౧౦౬॥

మున్ను జెప్పబడిన నైత్యకమగుస్వాధ్యాయమున కదియనువాదము నైత్యకమగుజపయజ్ఞము సతతకృత్యమగుట వలన దాని కనధ్యాయము లేదు- దానిని మన్వాదులు బ్రహ్మసత్రమనిరి-బ్రహ్మమే యాహుతియని హుతమగుహవిస్సును ననధ్యాయమం దధ్యయన రూపమగు వషట్కృతమున్ను పుణ్యప్రదమే యగుచున్నది॥ ౧౦౬॥

మూ॥ యస్స్వాధ్యాయమధీతేబ్దం విధినా నియతశ్శుచిః। తస్య నిత్యంక్షరత్యేష పయోదధిఘృతంమధు॥ ౧౦౭॥

ఎవ్వడైన నొకసంవత్సరము ప్రతిదినవిహితమగు నధ్యయనము నంగయుక్తమగునట్లు నియతేంద్రియుడై జపించు నతని స్వాధ్యాయరూప జపయజ్ఞము పయోదధిఘృత మధుకుల్యలను గురియును వాటిచే తృప్తులై దేవతలును పితరులు నతనికభీష్టముల నొసంగుదురు ॥ శ్లో ॥ "మధునా పయసాచైవ సదేవాం స్త

ర్పవేద్ద్విజః । పితౄన్మధు ఘృతాభ్యాంచ ఋచోధీతే హియోన్వహం॥ ఇత్యాద్యుక్తశేషః॥ తే తృప్తా స్తర్పయంత్యేనం సర్వకామఫలైశ్శుభైః॥" ప్రతిదినమందున్ను ఋక్కులనుబఠించిన యతండు తనదేవతలనున్ను పితృదేవతలనున్ను క్షీరాజ్యమధ్వాదులచే దృప్తిబొందించుననునదిమొదలుకుని యజుస్సామాధర్వణ శిక్షాద్యంగపురాణేతిహాసాదుల మహిమనుజెప్పి నాశేషముచే నిట్లు దృప్తులై వారా యజమానుని కభీష్టము లిచ్చెదరని యాజ్ఞవల్క్యు॥ ౧౦౭॥

మూ॥ అగ్నీంధనం భైక్షచర్యా మధశ్శయ్యాం గురోర్హితం। ఆ
సమావర్తనాత్కుర్యా త్కృతోప నయనోద్విజః॥౧౦౮॥

ఉపనీతుడగు ద్విజుడు సాయంప్రాతఃకాలములం దగ్నికార్యమున్ను భిక్షాహారము మంచముమీద బరుండకుండుట గురుశుశ్రూష సమావర్తన పర్యంతమున్ను జేయవలయును॥ ౧౦౮॥

మూ॥ ఆచార్య పుత్ర శ్శుశ్రూషు ర్జ్ఞానదో ధార్మికశ్శుచిః। ఆ
ప్తశ్శక్తోర్థద స్సాధు స్స్వోధ్యాప్యో దశధర్మతః॥ ౧౦౯॥

గురుపుత్రుడు పరిచర్యజేయునతడు మరియొకవిద్యను జెప్పెడువాడు ధార్మికుడు శుచియగువాడు మిత్రమగువాడు గ్రహణధారణసమర్థుడు ధనదాత సాధువు జ్ఞాతి యీపదుగురు నధ్యయనము జేయించదగుదురు॥ ౧౦౯॥

మూ॥ నాపృష్టః కస్యచిద్బ్రూ యాన్నచాన్యాయేన పృచ్ఛతః।
జానన్నపిచ మేధావీ జడవల్లోక ఆచరేత్॥ ౧౧౦॥

అన్యు డల్పాక్షరవిస్వరాదికముగ చదువుచు నడుగకున్నను భక్తిశ్రద్ధాదిపరిశ్నధర్మము లేకుండి నడిగిన నెవ్వనికిం జెప్పదగదు శిష్యుడడుగకున్ననుం జెప్పందగు దానుప్రాజ్ఞుడై యెరిగియున్నను లోకమందు మూగివానివలె వ్యవహరించవలెను॥ ౧౧౦॥

మూ॥ అధర్మేణ చయఃప్రాహ యశ్చాధర్మేణ పృచ్ఛతి। తయో
రన్యతరః ప్రైతి విద్వేషం వాధిగచ్ఛతి॥ ౧౧౧॥

అధర్మముగా నెవని యెవడడుగునో యెవనికెవ్వ డధర్మముగా జె

వారిలో నొకనికి మరణమైనాయగును ద్వేషమైనావచ్చును॥ ౧౧౧॥

మూ॥ ధర్మార్థౌ యత్ర నస్యాతాం శుశ్రూషావాపి తద్విధా। త
త్రవిద్యా నవక్తవ్యా శుభంబీజమివోషరే॥ ౧౧౨॥

ఏ శిష్యునకు విద్యచెప్పినచో ధర్మమైన నర్థమైనను శుశ్రూషయైనను లేకుం డునో వానికి విద్యయూషర క్షేత్రమందుంచిన బీజమువలె నంకురించదు గాన నట్టివానికి విద్యజెప్పరాదు అర్థములేదో యనటచే భృతకాధ్యాపకతయగునన రాదు ధనమింతయిచ్చిన నింతవిద్యజెప్పెదనని నిర్ణయములేనిచో నట్టిదోషములేదు॥

మూ॥ విద్యయైవ సమంకామం మర్తవ్యం బ్రహ్మవాదినా। అప
ద్యపిహి ఘోరాయాం నత్వేనామిరిణేవపేత్॥ ౧౧౩॥

తగినశిష్యునకు విద్యచెప్పుచు నత్యంతము మరణమునొందదగును గాని యెంత ఘోరమైన యాపదవచ్చిన నూషరక్షేత్రమువంటి యపాత్రమగువానికి విద్యచెప్ప గూడదు ఇందుకు ఛాందోగ్య బ్రాహ్మణము॥ శ్రు॥ "విద్యయాసార్థం మ్రియేత నవిద్యామూషరేవపేత॥" విద్యతోగూడ ననగా విద్యాధ్యాపకతతో మృతినొం దదగునుగాని యూషరమువంటి యపాత్రమగువానికి విద్యచెప్పరాదు॥ ౧౧౩॥

మూ॥ విద్యాబ్రాహ్మణమేత్యాహ సేవధిస్తేస్మి రక్షమాం। అసూ
యకాయమాంమాదా స్తథాస్యాం వీర్యవత్తమా॥౧౧౪॥

విద్యాధిష్ఠానదేవత యొకానొక యధ్యాపకునితో నిట్లనియె - నీకునేను నిధిన గుచున్నాను నన్నురక్షించు మసూయాదిదోషములుగలవానికి నన్నుచెప్పకుమట్లై న నేనత్యంతవీర్యవతి నగుచున్నాను॥ శ్రు॥ "విద్యాహవై బ్రాహ్మణమాజగామతవాహమస్మిత్వంమాంపాలయ। అనర్హతేమానిమానైవ మాదాగోపాయమాం శ్రేయసీతథాహమస్మి॥" బ్రాహ్మణునివద్దికివచ్చి విద్యపలుకుచున్నది నేను నీదానను నన్నుబాలింపు మనర్హుండుగాని యభిమానికి నన్నివ్వకుము నీకు నేను శ్రేయస్కరినని ఛాందోగ్యబ్రాహ్మణము॥ ౧౧౪॥



మూ॥ యమేవహి శుచిం విద్యా న్నియతంబ్రహ్మచారిణమ్। త
స్మైమాంబ్రూహివిప్రాయనిధిపాయాప్రమాదినే॥౧౧౫॥

ఎవనిని శుచిగానున్ను నియమవంతునిగానున్ను బ్రహ్మచారినిగానున్ను నీవు దెలుసుకుంటున్నావో విద్యారూపనిధి రక్షకుడున్ను ప్రమాదరహితుడునగు నతనికి నన్ను జెప్పుము॥ ౧౧౫॥

మూ॥ బ్రహ్మయస్త్వ ననుజ్ఞాత మధీయానాదవాప్నుయాత్। సబ్ర
హ్మస్తేయసంయుక్తో నరకం ప్రతిపద్యతే॥ ... ౧౧౬॥

ఎవడైతే నభ్యాసమునకై చదువుచున్నట్టిన్ని వేరొకనికి చెప్పుచున్నట్టి వానివలన యనుజ్ఞ లేకుండ వేదమును గ్రహించునో వాడు వేదచోరుడై నరకమునొందును గావున నట్లు చదవకూడదు॥ ౧౧౬॥

మూ॥ లౌకికం వైదికంచాపి తథాధ్యాత్మిక మేవచ। ఆదదీతయతో
జ్ఞానం తం పూర్వ మభివాదయేత్॥ ౧౧౭॥

నీతిశాస్త్రమునున్ను వేదార్థజ్ఞానమునున్ను బ్రహ్మజ్ఞానమునున్ను నెవనివలన సంపాదించునో తనకు మాన్యులు బహుమంది గలచో నతనికి ముందుగ నమస్కరించవలెను॥ ౧౧౭॥

మూ॥ సావిత్రీమాత్ర సారోపి వరం విప్ర స్సుయంత్రితః। నాయం
త్రితస్త్రివేదోపి సర్వాశీ సర్వవిక్రయీ॥ ...... ౧౧౮॥

గాయత్రీమాత్ర వేత్తయైనను శాస్త్రనియమములకు బద్ధుడగు నతడెంచుకనుంచివాడు విధినిషేధరహితుడు వేదత్రయవేత్తయైన నభక్ష్య భక్షకుడును నవిక్రేయ విక్రయియునైన శ్రేష్ఠుడుగాడు॥ ౧౧౮॥

మూ॥ శయ్యాసనే ధ్యాచరితే శ్రేయసానసమావిశేత్। శయ్యాస
నస్థశ్చైవైనం ప్రత్యుత్థాయాభివాదయేత్॥ ... ౧౧౯॥

గురువు శయ్యయందు నాసనమందును గూర్చుండిన సమయమందున్ను శిష్యుడు శయ్యాసనములయందుండదగదు తాను శయ్యాసనములయందుండగా గురువు వచ్చిన నా శిష్యుడు లేచి యెదురుగవెళ్ళి నమస్కరించవలెను॥ ౧౧౯॥

మూ॥ ఊర్ధ్వం ప్రాణాహ్యుత్క్రామంతి యూనస్థవిర ఆయతి। ప్ర

ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే॥ ౧౨౦॥

పైదానికి యర్థమును చెప్పుచున్నాడు- విద్యచేతను వయస్సుచేతను అధికమగు స్థవిరుడు వచ్చుచుండిన చిన్నవయస్సువానికి ప్రాణములుపైకి పోనిచ్ఛయించుచున్నవి యప్పుడతడులేచి యెదురుగనరిగి మ్రొక్కిన యా ప్రాణములను మరల సుస్థములుగ జేయుచున్నాడు॥ ౧౨౦॥

మూ॥ అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః। చత్వారి తస్య వర్ధంతే ఆయు ర్విద్యా యశో బలం॥ ౧౨౧॥

పెద్దలు రాగానె లేచి నమస్కరించే స్వభావముగల వృద్ధోపసేవికి ఆయుష్యము విద్యయు యశస్సు బలము నీనాల్గును వృద్ధినొందును॥ ౧౨౧॥

మూ॥ అభివాదాత్పరం విప్రో జ్యాయాంస మభివాదయన్।అసౌ నామాహమస్మీతి స్వనామ పరికీర్తయేత్॥ ౧౨౨॥

ఇప్పుడభివాదవిధిని జెప్పుచున్నాడు- వృద్ధునకు నమస్కారము జేయుచు "నభివాదయె" యని యటుపైని ఈనామముగల నేనని తన నామమునుచ్చరించి నమస్కరించవలయును- ఈశ్లోకమందు నామశబ్దము విశేషపరము- మేధాతిథి గోవిందరాజులు అభివాదనవాక్యమందు నామముంచవలెనని వ్రాసిరది బాగుండలేదు ॥ సూ ॥ "స్వనామప్రోచ్యాభివాదయ ఇత్యభివదేత్" తనపేరుజెప్పి యభివాదయేయని నమస్కరించవలెనని గౌతములు॥ ౧౨౨॥

మూ॥ నామధేయస్య యేకేచి దభివాదం నజానతే। తాన్ప్రాజ్ఞో హమితిబ్రూయాత్ స్త్రియస్సర్వా స్తథైవచ॥ ౧౨౩॥

కొందరు సంస్కృతముదెలియనివారు నామధేయము పలుకబడినదైన నయ్యభివాదార్థమును దెలియలేరు వారికి నమస్కరించేప్రాజ్ఞుడు నేను నమస్కరించుచున్నానని మ్రొక్కవలయును నింక స్త్రీలకు నిటులె నమస్కరించవలెను॥౧౨౩॥

మూ॥ భోశ్శబ్దం కీర్తయేదంతే స్వస్యనామ్నోభివాదనే । నామ్నాంస్వరూపభావోహిభోభావఋషిభిస్స్మృతః॥౧౨౪॥

అభివాదనమందు నమస్కరించే వాని పేరు జెప్పి యాపైని భోశ్శబ్దము ననవ లెను నమస్కార్యుల నామములస్వరూపభావమె భోశ్శబ్దభావమని ఋషులచే జెప్పబడెను గావున నభివాదనవాక్యమిది "అభివాదయే శుభశర్మాహమస్మిభోః" అనినమస్కరించవలెను॥ ౧౨౪॥

మూ॥ ఆయుష్మాన్భవసౌమ్యేతి వాచ్యోవిప్రోభివాదనే । అకారశ్చాస్యనామ్నోంతే వాచ్యఃపూర్వాక్షరఃప్లుతః॥ ౧౨౫॥

అభివాదనము చేయబడినదగుచుండగా నమస్కరించిన విప్రుడు మొదలగు వానిని నమస్కరించ బడినవాడు "ఆయుష్మాన్భవసౌమ్య" యని యాశీర్వదించవలెను ఈనమస్కరించిన వాని నామాంతమందగు నకారమనగా నకారాదిస్వరమ నితాత్పర్యము. ప్రతివానినామము కొసయందకారమె నియమముగనుండదు గావున నేయచ్చైనానదిప్లుతముగా నుచ్చరించవలెను ఆనామము హలంతపదమైతే పూర్వాక్షరమనగా నాపొల్లక్షరమునకు పూర్వమందున్న యచ్చును ప్లుతముగా బలకవలెను ఇందుకు "ఆయుష్మాన్భవసౌమ్యశుభశర్మన్" ఇలాగునే క్షత్రియునకు "బలవర్మన్" అనిన్ని వైశ్యునకు "వసుభూతే" యనిన్ని॥ సూ ॥ "ప్లుతోరాజన్యవిశాం వా" యని కాత్యాయనవచనము వలన క్షత్రియవైశ్యులకాప్లుతము వికల్పము శూద్రునకు ప్లుతముచ్చరించ దగదు "అశూద్రే" యనిపాణిని నిషేధమువలన॥సూ॥ "స్త్రీయామపినిషేధః" అనుకాత్యాయన వచనమువలన స్త్రీలకుప్లుతనిషేధము ఇక్కడ గోవిందరాజు బ్రాహ్మణునకు నామయందు "శర్మన్" యను ఉపపదము నిత్యమని మున్నుగా జెప్పి ప్రత్యభివాదనవాక్యమందు "ఆయుష్మాన్భవసౌమ్యభద్ర" యనివ్రాసి తననిరుపపదోదాహరణ సోపపదోదారణానభిజ్ఞత్వమునే జ్ఞాపకముజేసె నన్ని ధరణీధరుడున్ను "ఆయుష్మాన్భవసౌమ్య" యని సంబుద్ధ్యంతము మనువచనమందు జూచిన్ని యసంబుద్ధిప్రథమైకవచనాంతముగా నముకశర్మాయనే యుదాహరణము వ్రాసి విచక్షణులచే నుపేక్షించ దగియెనని కుల్లూకభట్టు వ్రాసెను॥ ... ... ... ౧౨౫॥

మూ॥ యోనవేత్త్యభివాదస్య విప్రఃప్రత్యభివాదనమ్ । నాభివాద్యస్సవిదుషాయథాశూద్రస్తథైవసః॥ ౧౨౬॥

విప్రుడు శాస్త్రీయమగు నభివాదనమునకనురూపమగు ప్రత్యభివాదన మెరుంగ

డో యతండు శూద్రప్రాయుడు గాన వానికి నుక్తప్రకారముగా నభివాదనము జేయకూడదు నేను నమస్కరించుచున్నా ననవలెను గాని చరణగ్రహణాదికము వలదని మున్నె జెప్పబడే యున్నది॥ ౧౨౬॥

మూ॥ బ్రాహ్మణంకుశలంపృచ్ఛే త్క్షత్రబంధుమనామయం । వై
శ్యం క్షేమంసమాగమ్య శూద్రమారోగ్యమేవచ॥ ౧౨౭॥

కలుసుకుని నమస్కరించిన చిన్నవానికి నమస్కరించకుండినను సమానవయస్కుని బ్రాహ్మణుని కుశలమాయనియు క్షత్రియుని యనామయమాయనియు వైశ్యుని క్షేమమాయనియు శూద్రునారోగ్యమాయనియు నడుగవలయును॥సూ॥"కుశలమవరవయసంసమానవయసంవావిప్రంపృచ్ఛేత్ అనామయంక్షత్రియంక్షేమం వైశ్యం ఆరోగ్యంశూద్రంఅవరవయసమభివాదకమనభివాదకం వయస్యమితి"యని యాపస్తంబులు అర్థముప్రాయబడినదే గోవిందరాజుప్రకరణము వలన నీకుశలాదిప్రశ్నమనిచెప్పెను- నమస్కరించినవానితో సమాగమము సిద్ధమె గావున సమాగమ్యయను పదము వ్యర్థమగును గావున కుశలక్షేమశబ్దములకును ననామయారోగ్యశబ్దములకును సమానమే యర్థమగుటచే కుశలాదిశబ్దవిశేషోచ్చారణమేవివక్షితము॥ ౧౨౭॥

మూ॥ అవాచ్యోదీక్షితోనామ్నా యవీయానపియోభవేత్। భోభ
వత్పూర్వకంత్వేన మభిభాషేతధర్మవిత్॥ ౧౨౮॥

ప్రత్యభివాదకాలమందుగాని మరొకపుడుగాని దీక్షారంభము మొదలుకొనియవభృథపర్యంతమున్ను నాదీక్షితుడు చిన్నవాడైనను వానినామము నుచ్చరించగూడదు భోదీక్షితభవతాయజమానేనయని భోశ్శబ్దభవచ్ఛబ్దపూర్వముగ దీక్షితాద్యుత్కర్షాభిధాయకశబ్దములచే ధార్మికుడు భాషింపవలెను॥ ౧౨౮॥

మూ॥ పరపత్నీతు యాస్త్రీస్యా దసంబంధాచ యోనితః। తాం
బ్రూయాద్భవతీత్యేవం సుభగే భగినీతిచ॥ ౧౨౯॥

తనకు వావిసంబంధములేని పరుని భార్యను భవతి సుభగే భగిని యనుచు మాటలాడవలెను పరపత్నిగాని కన్యకనైతె ఆయుష్మతియనునట్టి పదములచే పిలువవలెను॥ ౧౨౯॥

మూ॥ మాతులాంశ్చ పితృవ్యాంశ్చ శ్వశురా నృత్విజో గురూన్।
అసావహ మితిబ్రూయా త్ప్రత్యుత్థాయ యవీయసః॥౧౩౦

మేనమామలు పినతండ్రులు గురువులు దనకన్నచిన్నవయస్సుగలవారు వచ్చినప్పుడు దానులేచి అసావహామనియనగా నీపేరుగలవాడను నేనని యనవలెనుగాని నమస్కరించదగదు హారీతుడు గురువులను జెప్పుటలో జ్ఞానవృద్ధ తపోవృద్ధులను గూడ గురువులనుగా జెప్పినందున నిచ్చట నట్టిగురువులని తాత్పర్యము. ౧౩౦॥

మూ॥ మాతృష్వసామాతులానీ శ్వశ్రూరథపితృష్వసా। సంపూజ్యాగురుపత్నీవత్సమాస్తాగురుభార్యయా॥ ౧౩౧॥

తల్లితోబుట్టినస్త్రీలున్ను మేనమామ భార్యయున్ను భార్య తల్లియున్ను తండ్రితోబుట్టుమేనత్తయును వీరుగురుభార్యతో సమానులు గావున ప్రత్యుత్థానాభివాదనదానాదులచే గురుపత్నితో తుల్యముగ వారిని సత్కరించవలెను॥ ౧౩౧॥

మూ॥ భ్రాతుర్భార్యోపసంగ్రాహ్యా సవర్ణాహన్యహన్యపి।
విప్రోష్యతూపసంగ్రాహ్యా జ్ఞాతిసంబంధి యోషితః॥౧౩౨॥

అన్నగారి సజాతీయయగుభార్య తనకంటె పెద్దయైన వెడల ప్రత్యహమును పాదాభివందనముజేయదగును పితృవ్యులు మామలు మొదలగుజ్ఞాతిబంధువుల భార్యలకు గ్రామాంతరమునకు వెళ్లి వచ్చినప్పుడు పాదాభివందనముజేయవలెను నిత్యముగానని నియమములేదు॥ ౧౩౨॥

మూ॥ పితుర్భగిన్యాం మాతుశ్చ జ్యాయస్యాంచ స్వసర్యపి। మాతృవద్వృత్తిమాతిష్ఠే న్మాతా తాభ్యో గరీయసీ॥ ౧౩౩॥

మేనయత్త తల్లితోబుట్టువు తనయక్కయును వీరికి దల్లితోసమముగా సత్కారములు నడపవలెను వారికంటె తల్లి యెక్కువ "మాతృష్వసామాతులానీ" యనుశ్లోకముచే మేనత్త మొదలగువారి సత్కారము విషయమై పూర్వము వ్రాసియుండినప్పటికిని "మాతాతాభ్యో గరీయసీ" యనినదే యధికము తల్లితో బుట్టువయు తల్లియు భిన్నప్రకారముగ నాజ్ఞ యిచ్చినచో దల్లియాజ్ఞ ముందుజేయవలయును యింతమాత్ర మాధిక్యము దెలియుట ప్రయోజనము గావున బునరుక్తి లేదు॥ ౧౩౩॥

మూ॥ దశాబ్దాఖ్యం పౌరసఖ్యం పంచాబ్దాఖ్యం కలాభృతాం ।
త్ర్యబ్దపూర్వం శ్రోత్రియాణాం స్వల్పేనాపి స్వయోనిషు॥

పౌరసఖ్యము దశాబ్దాఖ్యము పదిసంవత్సరములాఖ్యగాగల సఖ్యము- ఇది యొక గ్రామమందు నివసించినవారికి పదిసంవత్సరములు జ్యేష్ఠత్వమున్నప్పటికి పౌరసఖ్యమగును గీతాది కలాభిజ్ఞుల కైదుసంవత్సరముల పర్యంతము గావున పంచాబ్దాఖ్యము-మూడుసంవత్సరములపర్యంతము శ్రోత్రియసఖ్యము స్వల్పమగుకాలముచేతనే సపిండులకు సఖ్యమగును - అన్నింటను జెప్పినప్రకారమగు కాలమున కూర్ధ్వము సర్వమందున్ను జ్యేష్ఠత్వ వ్యవహారమగును॥ ౧౩౪॥

మూ॥ బ్రాహ్మణం దశవర్షంతు శతవర్షంతు భూమిపం । పి
తాపుత్రాది జానీయా ద్బ్రాహ్మణస్తు తయోః పితా॥౧౩౫॥

పదివర్షములు వయస్సుగల బ్రాహ్మణునిన్ని నూరువర్షములుగల క్షత్రియునిన్ని పితాపుత్రులుగా దెలియవలయును వీరిలో దశవర్ష బ్రాహ్మణుడు శతవర్ష క్షత్రియునకు పితృవ్యవహారయోగ్యుడు గావున నతని కతడు తండ్రిభంగి మాన్యుడగును॥ ౧౩౫॥

మూ॥ విత్తం బంధు ర్వయః కర్మ విద్యా భవతి పంచమీ। ఏతాని
మాన్యస్థానాని గరీయో యద్యదుత్తమం॥ ౧౩౬॥

న్యాయార్జితధనమున్ను పితృవ్యాదిబంధుత్వమున్ను వయోధికత్వమున్ను శ్రౌతస్మార్తకర్మమున్ను వేదార్థతత్వజ్ఞానమున్ను వీనైదున్ను మాన్యత్వకారణములు-వీటిలో పూర్వపూర్వముకంటె నుత్తరోత్తరము శ్రేష్ఠము బహుమాన్యమేళనమందు బలాబలము జెప్పబడెను॥ ౧౩౬॥

మూ॥ పంచానాం త్రిషువర్ణేషు భూయాంసి గుణవంతిచ। యత్ర
స్యుస్సోత్రమానార్హః శూద్రోపి దశమీం గతః॥ ౧౩౭॥

బ్రాహ్మణాది వర్ణత్రయమందు పైనజెప్పిన విత్తాదులయిదింటిలోనూ యేపురుషునియందు పూర్వమైనప్పటికి ననేకములు గలుగునో యతడే పైవాని కన్నను మాన్యుడు దీనిచేత విత్తబంధుత్వయుక్తుడు వయోధికునికంటే మాన్యుడు విత్తాది

చతుష్టయము క్రతువు విద్వాంసునికంటే మాన్యుడు గుణవంతిచ యను దానిచే వి ద్యాదులు గలుగుచునుండ నారెండిటి యుత్కృష్టతయే మానహేతువు ॥ శూ ద్రుడున్ను దశమీయవస్థననగా తొంబదివత్సరములకుపై వయస్సు గలవాడు ద్విజు లకు మానార్హుడు నూరువత్సరములు పదివంతులేయగా పదేసివత్సరములు వ కయవస్థ తొంబదివత్సరములుదాటిన దశమావస్థయని తాత్పర్యము॥ ౧౩౭॥

మూ। చక్రిణో దశమీస్థస్య రోగిణో భారిణస్స్త్రియాః। స్నాతక
స్యచ రాజ్ఞశ్చ పంథా దేయో వరస్యచ॥ ౧౩౮॥

రథాదియానములందెక్కిన వానికిని తొంబదివర్షములకు పైవయస్సుగలవాని కిని రోగాతురునకు భారపీడితునకు స్త్రీకి స్నాతకునకు దేశాధిపతికిని పెళ్లికొడు కునకును మార్గమువిడచి వదలిపోవలెను॥ ౧౩౮॥

మూ॥ తేషాంతుసమవేతానాం మాన్యౌ స్నాతకపార్థివౌ। రా
జస్నాతకయోశ్చైవ స్నాతకో నృపమానభాక్॥ ౧౩౯॥

పైనిజెప్పిన వారొకచో గలసినపుడు దేశాధిపతియును స్నాతకుడును మిగిలిన వారికిమాన్యులు వీరిలో స్నాతకుడు రాజుకుమాన్యుడు॥ ౧౩౯॥

మూ॥ ఉపనీయతు యశ్శిష్యం వేదమధ్యాపయేద్ద్విజః। సకల్పం
సరహస్యంచ తమాచార్యం ప్రచక్షతే॥ ౧౪౦॥

ఆచార్యాదిశబ్దార్థమును జెప్పుచున్నాడు-ఏబ్రాహ్మణుడు శిష్యునకుపనయన ముజేసి కల్పరహస్యములతో వేదాఖ్యమగు సర్వసంహితనుజెప్పునో యతనినాచా ర్యుడని ప్రాచీన మునులు జెప్పుచున్నారు కల్పమనగా యజ్ఞవిద్య రహస్యముప నిషత్తు॥ ౧౪౦॥

మూ॥ ఏకదేశంతు వేదస్య వేదాంగాన్యపివాపునః। యోధ్యాప
యతి వృత్త్యర్థ ముపాధ్యాయ స్సఉచ్యతే॥ ౧౪౧॥

వేదమునొక్కటి యేకదేశమనగా మంత్రము బ్రాహ్మణము వేదరహితములగు వ్యాకరణాదియంగములు నివియేనైన వృత్తికొరకు జదివించు నతండుపాధ్యా యుడని చెప్పబడును॥ ౧౪౧॥

మూ॥ నిషేకాదీనికర్మాణి యఃకరోతియథావిధి। సంభావయ
తిచాన్నేన సవిప్రో గురు రుచ్యతే॥ ౧౪౨॥

గర్భాధానాదిసంస్కారకర్మములను తండ్రిచే జెప్పబడిన వాటి నెవడు జే
యుచు ఘనముచే వృద్ధిబొందించు నా విప్రుడు గురువనబడును॥ ౧౪౨॥

మూ॥ అగ్న్యాధేయంపాకయజ్ఞానగ్నిష్టోమాదికాన్మఖాన్।యః
కరోతివృతోయస్య సతస్య ర్త్విగిహోచ్యతే॥ ౧౪౩॥

ఆ హవనీయాద్యగ్న్యుత్పాదకమగు కర్మమగ్న్యాధేయ మష్టకాదులు పాక
యజ్ఞములు నగ్నిష్టోమాదియజ్ఞములు వీటి నెవడు వరించబడి యెవనికి జేయునత
డతనికి ఋత్విక్కుడనబడును ఇవి బ్రహ్మచారి ధర్మములుగాకున్న నాచార్యునట్ల
ఋత్విక్కును పూజ్యుడనుటచే బ్రసంగము వలన జెప్పబడెను। ౧౪౩॥

మూ॥ య ఆవృణోత్యవితథం బ్రహ్మణాశ్రవణావుభౌ।సమాతా
సపితాజ్ఞేయ స్తంనద్రుహ్యేత్కదాచన॥ ౧౪౪॥

ఎవడు రెండుకర్ణములనున్ను వర్ణస్వరవైగుణ్యరహితముగ సఫలమగు వే
దముచే బూరించునతండు తనకు తల్లియు దండ్రియు ననబడును మహోపకార
గుణయోగమువలన నీయధ్యాపకుడు మాతాపితృశబ్దవాచ్యుడు గావున నెప్పుడున
నగా విద్యజెప్పిన బిమ్మట నేనియు నతనికి ద్రోహము శేయగూడదు॥ ౧౪౪॥

మూ॥ ఉపాధ్యాయాన్దశాచార్య ఆచార్యాణాంశతంపితా। స
హస్రంతుపితౄన్మాతా గౌరవేణాతిరిచ్యతే॥ ౧౪౫॥

పదుగురుపాధ్యాయులకంటె నాచార్యుడును నూరుగురాచార్యులకంటె తం
డ్రియు వేవురు దండ్రులకంటె తల్లియు గౌరవముచే నెక్కుడగుచున్నారు- ఇచ్చ
ట సావిత్రీమాత్రాధ్యాపకుడు ఆచార్యుడు॥శ్లో॥ "ఉత్పాదకబ్రహ్మదాత్రో" రను శ్లోక
మునందు ముఖ్యాచార్యునకు పిత్రపేక్షచే నుత్కర్షను జెప్పగలడు గావున విరో
ధము లేదు॥ ౧౪౫॥

మూ॥ ఉత్పాదకబ్రహ్మదాత్రోర్గరీయాన్బ్రహ్మదః పితా।బ్రహ్మ
జన్మచవిప్రస్య ప్రేత్యచేహచశాశ్వతమ్॥ ౧౪౬॥

జనకుడు నాచార్యుడు ననినిద్దరు తండ్రులు జన్మదాతగావున వీరిలో నాచార్యుడను దండ్రి గురుతరుడు విప్రున కుపనయన సంస్కారజన్మము వేదమును గ్రహించుటకే గావున నిది బ్రహ్మజన్మము పరలోకమందు నిచ్చటనున్ను శాశ్వతము మోక్షప్రాపకము గావున॥ ౧౪౬॥

మూ॥ కామాన్మాతాపితాచైనం యదుత్పాదయతోమిథః। సం
భూతింతస్యతాంవిద్యా ద్యద్యోనావభిజాయతే॥ ౧౪౭॥

కామవశులగు దలిదండ్రులు వీనినన్యోన్యము బుట్టించిరియని జన్మము పశ్వాదిసాధారణమని దెలియదగును॥ ౧౪౭॥

మూ॥ ఆచార్యస్త్వస్యయాంజాతిం విధివద్వేదపారగః। ఉత్పాద
యతిసావిత్ర్యా సాసత్యాసాఽజరాఽమరా॥ ౧౪౮॥

వేదజ్ఞుడగు నాచార్యుడు విధ్యుక్తప్రకారముగా నీని కనకు నేజన్మమును సావిత్ర్యుపదేశపూర్వక సాంగవేదాధ్యయనయుక్తిగా గలిగించెనో యది వేదార్థజ్ఞానతదుక్తానుష్ఠానాద్యుత్పన్నపుణ్యమున బ్రహ్మప్రాప్తికారణము గావున నజరామరణమగుచున్నది॥ ౧౪౮॥

మూ॥ అల్పంవాబహువాయస్య శ్రుతస్యోపకరోతియః। తమపీహ
గురుంవిద్యా చ్ఛ్రుతోపక్రియయాతయా॥ ౧౪౯॥

ఎవడు కొంచమైన నధికమైనను శ్రుతమున కుపకారమెతనికి జేయు నాశ్రుతోపక్రియచే నతండు తనకు గురువుగా నతని నెన్నుకొన వలయును॥ ౧౪౯॥

మూ॥ బ్రాహ్మస్యజన్మనఃకర్తా స్వధర్మస్యచశాసితా। బాలో
పివిప్రోవృద్ధస్యపితాభవతిధర్మతః॥ ౧౫౦॥

బ్రహ్మమనగా వేదము తచ్ఛ్రవణార్థమైన జన్మము బ్రాహ్మముపనయనము. దానికి కర్త వేదార్థమునకు వ్యాఖ్యాతయగు నట్టి విప్రుడు బాలుండైనను వృద్ధుండగు తనకు ధర్మము వలన పితయగుచున్నాడు స్వకృతగౌరవాది పితృధర్మముల నతనియందాచరించ వలెనని యర్థము॥ ౧౫౦॥

మూ॥ అధ్యాపయామాస పితౄన్ శిశురాంగిరసఃకవిః। పుత్రకా

ఇతిహోవాచ జ్ఞానేన పరిగృహ్యతాన్॥ ౧౫౧॥

విద్వాంసుడును బాలుండునగు నాంగిరసుండు దనకు దండ్రులవంటి పితృవ్యత త్పుత్రాదులను దాపుత్రుడయ్యు జ్ఞానముచే వారిని శిష్యులనుగా బరిగ్రహించి పుత్రకాః యని పలికెనని ప్రాచీనచరిత్రము సూచింపబడియె॥ ౧౫౧॥

మూ॥ తేతమర్థమపృచ్ఛంత దేవానాగతమన్యవః। దేవాశ్చై
తాన్ సమేత్యోచు ర్న్యాయ్యం వశ్శిశురుక్తవాన్॥ ౧౫౨॥

వారు చిన్నవాడు తమ్మును పుత్రకాః యనుటకు కోపించి పుత్రకశబ్దార్థము ను దేవతలనడుగ ఆదేవతలుగూడి న్యాయముగా నీశిశువు మిమ్ము నుపలికినది యుక్తమేయని వారికనిరి॥ ౧౫౨॥

మూ॥ అజ్ఞోభవతివై బాలః పితా భవతి మంత్రదః। అజ్ఞంహి
బాలమిత్యాహుః పితేత్యేవహి మంత్రదం॥ ౧౫౩॥

అజ్ఞుడే బాలుడుగాని చిన్నవయస్సువాడు కాడు మంత్రమనగా వేదము దీనిని చెప్పినవాడు తండ్రి గావున నజ్ఞునిబాలునిగానున్ను మంత్రప్రదుని దండ్రినిగానున్ను బలికిరి॥ ౧౫౩॥

మూ॥ నహాయనైర్నపలితై ర్నవిత్తేన నబంధుభిః। ఋషయశ్చ
క్రిరేధర్మం యోనూచానస్సనోమహాన్॥ ౧౫౪॥

అట్లగుటకు హేతువును జెప్పుచున్నాడు- అనేకసంవత్సరములు కావడముచేత నైనను తలనెరియుటచేనైనను బంధుబృందము గలుగుటనైనను నధికధనముగలుగుటనైనను మహత్వము గలవాడు గాడు మరేమంటే మున్ను మునులొకధర్మమును బలికిరదేమనిన నెవడు సాంగవేదాధ్యేయగుచున్నాడో యతండు సత్యముగా మహత్వముగలవాడని బలికిరి॥ ౧౫౪॥

మూ॥ విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠ్యం క్షత్రియాణాంతు వీర్యతః।
వైశ్యానాం ధాన్యధనతః శూద్రాణామేవజన్మతః॥౧౫౫॥

బ్రాహ్మణులకు విద్యచేతనే క్షత్రియులకు పరాక్రమముచేతనే వైశ్యులకు ధన ధాన్యాదికము చేతనే జ్యైష్ఠ్యమగుచున్నది ఇంక శూద్రులకు పూర్వజన్మముచే

తనే శ్రేష్ఠత్వము॥ ౧౫౫॥

మూ॥ న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః। యోవాయు
వాప్యధీయాన స్తం దేవాః స్థవిరంవిదుః॥ ౧౫౬॥

జనిచేతను శిరస్సు నెరిసేనో దానిచేత వృద్ధుఁడుగాఁడు ఎవఁడు పిన్నవయస్సువాఁడైనను విద్వాంసుఁడో వానినివృద్ధునిగా దేవతలు దెలసిరి॥ ౧౫౬॥

మూ॥ యథా కాష్ఠమయోహస్తీ యథాచర్మమృగశ్చ చ। యశ్చ
విప్రోనధీయాన స్త్రయస్తేనామ బిభ్రతి॥ ౧౫౭॥

కఱ్ఱచే నిర్మించిన గజమున్ను చర్మముచే నిర్మించిన మృగమున్నెట్లో విద్వాంసుఁడుగాని విప్రుఁడట్లే యనఁగా సీత్రయను నామమాత్రమును ధరించును గానిగజాదులు సేయుపనుల కుపయోగము లేదని యర్థము॥ ౧౫౭॥

మూ॥ యథాషండోఽఫలః స్త్రీషు యథాగౌర్గవిచాఫలా। యథా
చాజ్ఞేఽఫలం దానం తథా విప్రో నృచోఽఫలః॥ ౧౫౮॥

ఎట్లు షండుఁడు స్త్రీలయందు వ్యర్థుఁడో గోవుగోవుయందేలాగునిష్ఫలమో జ్ఞానరహితునకిచ్చిన దానమేలాగు నిష్ఫలమో వేదమును జదువని విప్రుఁడట్లు నిష్ఫలుఁడు శ్రౌతస్మార్తాది కర్మానధికారి యగుటవలన॥ ౧౫౮॥

మూ॥ అహింసయైవ భూతానాం కార్యం శ్రేయోనుశాసనం।
వాక్చైవమధురాశ్లక్ష్ణా ప్రయోజ్యాధర్మమిచ్ఛతా॥౧౫౯॥

భూతములనఁగా ప్రకరణముచే శిష్యులకు హింసగాకుండ రజ్జువచేనైన వేణుదళముచేనైన శ్రేయస్సునుగూర్చి శిక్షించునది ధర్మము నిచ్ఛయించు గురువుచే మధురమైనవాకులను బలుకవలెను॥ ౧౫౯॥

మూ॥ యస్య వాఙ్మనసీ శుద్ధే సమ్యగ్గుప్తేచ సర్వదా। సవై సర్వ
మవాప్నోతి వేదాంతోపగతం ఫలం॥ ౧౬౦॥

ఇప్పుడు పురుషమాత్రునకు ఫలమగుధర్మమును వాఙ్మనసశుద్ధిగా జెప్పుచున్నాఁడు ఎవనియొక్క వాకులన్ను మనస్సున్ను శుద్ధములో వాకలనృతముచేతనున్ను మనస్సు రాగద్వేషములచేతనున్ను దూషితములు గాకుండ నెల్లప్పుడు రక్షించబడు

టీ॥ యతండు వేదాంతనుల వలననైన జ్ఞానరూపఫలమును సర్వజ్ఞత్వసర్వేశాన త్వాదికమును మోక్షలాభమువలన బొందును॥ ౧౬౦॥

మూ॥ నారుంతుదస్స్యా దార్తోఽపి నపరద్రోహ కర్మధీః। యయాస్యోద్విజతేవాచా నాలోక్యాంతాముదీరయేత్॥౧౬౧॥

తానార్తుడైనను పరుల మర్మోద్ఘాటనముజేయగూడదు పరులకు ద్రోహమగునట్టి పనులందు బుద్ధిగలవాడుగారాదు తనయొక్క యేవాక్కుచే లోకముభయమునొందునో యట్టివాక్కు తనకు స్వర్గాదిలోకప్రాప్తికి విరోధిగావున బలుకదగదు॥ ౧౬౧॥

మూ॥ సమ్మానాద్బ్రాహ్మణోనిత్య ముద్విజేత విషాదివ। అమృతస్యేవచాకాంక్షే దవమానస్య సర్వదా॥ ౧౬౨॥

విషమువలననువలె నెల్లప్పుడును బ్రాహ్మణుడు సమ్మానమువలన భయపడవలెను సమ్మానమందు బ్రీతినొందగూడదు అమృతమునకువలె నెల్లప్పుడు నవమానమునకు కోరికకలిగియుండవలయును- పరుడు దన్నవమానించిన క్షమనొంది ఖేదమునొందగూడదు॥ ౧౬౨॥

మూ॥ సుఖంహ్యవమతశ్శేతే సుఖంచ ప్రతిబుధ్యతే। సుఖంచరతి లోకేస్మి న్నవమంతా వినశ్యతి॥ ౧౬౩॥

పరుడు దన్నవమానించిన నది క్షమించి ఖేదమునొందకుండునతండు సుఖముగ నిద్రించును సహనములేకుండిన నాఖేదముచే నిద్రనెట్లొందును గాన సహించినవాడు సుఖముగా మేల్కొనును సుఖముగా కార్యములందు సంచరించు నింక నవమానమొనర్చునతడా పాపముచే నశించును॥ ౧౬౩॥

మూ॥ అనేన క్రమయోగేన సంస్కృతాత్మా ద్విజశ్శనైః। గురౌవసంత్సంచినుయా ద్బ్రహ్మాధిగమికంతపః॥ ౧౬౪॥

ఈచెప్పబడిన యుపాయముచే జాతకర్మాద్యుపనయన పర్యంత సంస్కారసంస్కృతుడగు ద్విజుడు గురుకులమందు నివసించుచుం ద్వరలేకుండ వేదాధ్యయనముకొరకైన దపస్సునవగా వక్ష్యమాణనియమ కలాపమును జేయవలయును-ఇత

రవిధులచే విహితమైనప్పటికి నధ్యయనాంగమని దెలియుటకిదియర్థవాదము॥౧౬౪॥

మూ॥ తపోవిశేషై ర్వివిధై ర్వ్రతైశ్చ విధిచోదితైః । వేదః కృత్స్నోఽధిగంతవ్యః సరహస్యో ద్విజన్మనా॥ ౧౬౫॥

అధ్యయనాంగత్వమునే స్పష్టపరచుచున్నాడు- ఆచమనమొనర్చి యధ్యయనమును జేయవలయుననను విధి మొదలుగా జెప్పబడిన వివిధములగు నియమవిశేషములవలనను ॥ శ్లో ॥ "సేవ తేమాంశ్చనియమాత్" అని చెప్పబోయే వ్రతములచేతనున్ను సమగ్రమగు వేదమనగా మంత్రబ్రాహ్మణోపనిషత్సంహితాత్మకమని యర్థము రహస్యమనగ నుపనిషత్తు ప్రాధాన్యమని వేరేజెప్పెదము॥ ౧౬౫॥

మూ॥ వేదమేవ సదాభ్యస్యే త్తపస్తప్యన్ద్విజోత్తమః । వేదాభ్యాసోహివిప్రస్య తపః పరమిహోచ్యతే॥ ౧౬౬॥

వేదాధ్యయనమందు నేనియమముల కంగత్వము జెప్పబడెనో అది సకలవేదాధ్యయనమున్ను దీనిచే విధించుచున్నాడు-తపస్సును జేయుచున్న ద్విజుడు వేదమునే గ్రహణార్థమై యావృత్తిజేయవలెను విప్రునకు వేదాభ్యాసమే యిక్కడ తపస్సని మునులచే జెప్పబడెను ॥ శ్రు ॥ "స్వాధ్యాయప్రవచనే ఏవేతినాకో మౌద్గల్యః - తద్ధితపస్తద్ధితపః" వేదముజదువుట జెప్పుట యేతపస్సు అదేతపస్సదేతపస్సని మౌద్గల్యుడు జెప్పెనని తైత్తిరీయోపనిషత్తు॥ ౧౬౬॥

మూ॥ ఆహైవసనఖాగ్రేభ్యః పరమం తప్యతేతపః। యస్స్రగ్వ్యపి ద్విజోఽధీతే స్వాధ్యాయం శక్తితోఽన్వహం॥ ౧౬౭॥

ఈశ్లోకము స్వాధ్యాయస్తుతి పరము- ఏవిప్రుడు పుష్పమాలికను ధరించినవాడైనప్పటికిన్ని యనగా బ్రహ్మచారి నియమముల నతిక్రమించినవాడైనాయనిస్తుత్యర్థముగాని నియమముల నతిక్రమించుమనికాదు రాగవంతుడైనప్పటికిని ప్రతిదినమున్ను యథాశక్తిగా స్వాధ్యాయాధ్యయనమొనర్చునోయతడు నఖశిఖాపర్యంతమును వ్యాపించిన పరమతపస్సును జేసినవాడగుచున్నాడుగదా ఇక్కడరామచంద్రుని వ్యాఖ్యానము- సః ఆమనువు నఖాగ్రేభ్యః నఖములుతల్లోష్టములుగా గలవారు ఋషులు వారికొరకు ఆహ చెప్పెననివ్రాసెను॥ ౧౬౭॥

మూ॥ యోనధీత్య ద్విజో వేద మన్యత్ర కురుతే శ్రమం । సజీవ
న్నేవ శూద్రత్వ మాశుగచ్ఛతి సాన్వయః॥ ౧౬౮॥

ఏద్విజుడు వేదమును జదువక నర్థశాస్త్రాదులయందు పరిశ్రమచేయునో వాడు జీవించి యుంటున్నే పుత్రపౌత్రాదులతో శూద్రత్వమును బొందును. వేదమును జదువకుండినను స్మృతులను వేదాంగములనున్ను జదివినట్లైతే నీవిరోధము లేదు॥ అదిగావుననే శంఖలిఖితులు॥ శ్లో॥ "నవేదమధీత్యాన్యాం విద్యామధీత్యాన్యత్ర వేదాంగ స్మృతిభ్యః॥" వేదమును జదువకనన్ను వేదాంగములు స్మృతులు వినాగా నితరశాస్త్రములను జదివిన నాదోషమని యర్థము॥ ౧౬౮॥

మూ॥ మాతురగ్రేధి జననం ద్వితీయం మౌంజి బంధనం । తృతీ
యం యజ్ఞదీక్షాయాం ద్విజస్య శ్రుతిచోదనాత్॥ ౧౬౯॥

ద్విజుల కచ్చటచ్చట నధికారము వినబడుట వలన ద్విజనిరూపణమును జెప్పుచున్నాడు పురుషునకు మొదటిజన్మము తల్లి యందు రెండవజన్మ ముపనయనమందు మూడవజన్మము యజ్ఞదీక్షయందునని వేదవిధివలన నిందుకుశ్రుతి॥ "పునర్వా యదృత్విజో యజ్ఞియంకుర్వంతి యద్దీక్షయంతీతి॥" యని మూడుజన్మములు జెప్పడము ద్వితీయజన్మస్తుతికొరకు ద్విజునకే యజ్ఞదీక్షయం దధికారమువలన॥ ౧౬౯॥

మూ॥ తత్రయద్బ్రహ్మ జన్మాస్య మౌంజీబంధన చిహ్నితం । త
త్రాస్యమాతా సావిత్రీ పితా త్వాచార్య ఉచ్యతే॥ ౧౭౦॥

ఆమూడు జన్మములందును బ్రహ్మమనగా వేదము తత్సంపాదనార్థమైనదిగాన బ్రహ్మజన్మముపనయనము మౌంజీబంధనము చిహ్నముగాగలది జన్మము మాతృపితృసాధ్యముగావున నామాణవకునకు నాజన్మమందు దల్లి సావిత్రి దండ్రి యాచార్యుడున్ను॥ ౧౭౦॥

మూ॥ వేదప్రధానా దాచార్యం పితరం పరిచక్షతే । నహ్యస్మి
న్యుజ్యతే కర్మ కించిదా మౌంజిబంధనాత్॥ ౧౭౧॥

వేదము నిచ్చుటవలన నాచార్యునిదండ్రిగా మన్వాదులు జెప్పుచున్నారు తండ్రివలె మహోపకారి గావున నతని బితృత్వము గౌణము మహోపకారమునుజెప్ప

చున్నాడు యీమాణవునకు నందుపనయమగుదనుకనించుకన్యైన కర్మముసంబంధించదనగా నేకర్మమునకు నధికారికాడనుట॥ ౧౭౧॥

మూ॥ నాభివ్యాహారయేద్బ్రహ్మ స్వధానినయనాదృతే । శూ
ద్రేణహి సమస్తావ ద్యావద్వేదేన జాయతే॥ ౧౭౨॥

ఉపనయనమగు పర్యంతమునని యనువర్తించును తండ్రి చనిపోయిన నతనికి శ్రాద్ధము జేయుటకంటె ననునదితప్ప వేదమునుబలికించగూడదు తండ్రి శ్రాద్ధమే మంత్రమున నగునోయదియు నుచ్చరింపజేయగూడదు గావున నెంతపర్యంత ముపనయనజన్మముగాదో యంతదనుక శూద్రునితో తుల్యుడుగదా॥ ౧౭౨॥

మూ॥ కృతోపనయనస్యాస్య వ్రతాదేశన మిష్యతే । బ్రహ్మణో
గ్రహణంచైవ క్రమేణ విధిపూర్వకం॥ ౧౭౩॥

ఉపనీతుడగు నతనికి నుభయసంధ్యలయందు నగ్నికార్యమును జేయడను పగలునిద్రించకుండడమునను నియమముల నుపదేశించి క్రమముగనాచమించి వేదమును జదవవలయునని విధిపూర్వకముగ నధ్యయనము జేయించనగును గాన ననుపనీతునకు మంత్రాధికారము లేదనుట॥ ౧౭౩॥

మూ॥ యద్యస్య విహితంచర్మ యత్సూత్రం యాచ మేఖలా ।
యోదండోయచ్చ వసనం తత్తదస్య వ్రతేష్వపి॥ ౧౭౪॥

ఏవర్ణను బ్రహ్మచారి కుపనయనకాలమందు చర్మము మేఖల దండము వస్త్రము యేవివిధించబడెనో యవియే గోదానాదివ్రతములయందును ధరించవలయును॥ ౧౭౪॥

మూ॥ సేవేతేమాంస్తు నియమాన్ బ్రహ్మచారీ గురౌవసన్। సం
నియమ్యేంద్రియగ్రామం తపోవృద్ధ్యర్థమాత్మనః॥ ౧౭౫॥

బ్రహ్మచారి గురునికటముందుంటున్న జితేంద్రియుడై దన యానుగతాదృష్ట వృద్ధికై చెప్పబడిన నియమములను నడుపవలయును॥ ౧౭౫॥

మూ॥ నిత్యంస్నాత్వా శుచిః కుర్యాద్దేవర్షిపితృతర్పణం। దేవ

తాభ్యర్చనంచైవ సమిధాధానమేవచ॥ ౧౭౬॥

ప్రత్యహము స్నానముచే శుద్ధుడై దేవర్షిపితృతర్పణమొనర్చి ప్రతిమాదులయందు హరిహరాది దేవపూజనమును సాయంప్రాతఃకాలములందు సమిద్ధోమమున్ను జేయవలయును గౌతమవచనమందు బ్రహ్మచారికి స్నాననిషేధము జెప్పె నది యభ్యంజనవిషయము గావుననే విష్ణుస్మృతి ॥ సూ ॥ "కాలద్వయమభిషేకం కార్యకారణమప్సుదండవన్మజ్జనం" రెండుకాలములయందు నభిషేకమున్ను కార్యకారణముగ నుదకములందు దండముతో మునుగుటయు నని రెండుస్నానములు జెప్పెను॥ ౧౭౬॥

మూ॥ వర్జయేన్మధుమాంసంచ గంధమాల్యం రసాన్ స్త్రియః।
శుక్తానియానిసర్వాణి ప్రాణినాంచైవ హింసనం॥౧౭౭॥

తేనియ మాంసము దినరానివి మొదలగునవి యభక్ష్యములని తాత్పర్యము- కర్పూర కస్తూర్యాది పరిమళద్రవ్యముల ననుభవింపదగదు పుష్పాదిమాల్యధారణము నిషిద్ధము ఉద్రేకముగలిగించే బెల్లము మొదలగు రసద్రవ్యములను భక్షించవలదు స్వభావముచే మధురాదిరసములుగలవి జలాదులలో నుంచుటవలన బులిసినవి శుక్తములు వాటినిన్ని విడువవలయును హింస జేయగూడదు॥ ... ౧౭౭॥

మూ॥ అభ్యంగమంజనం చాక్ష్ణో రుపానచ్ఛత్ర ధారణం। కామ
క్రోధంచ లోభంచ నర్తనం గీతవాదనం॥ ... ౧౭౮॥

చమురుచే దలంటుకుని యొడలు నలుచుకొని స్నానముచేయుట కాటుక బెట్టుకొనుట చెప్పులను దొడుగుట గొడుగు వేసుకొనుట కామమున్ను క్రోధమున్ను లోభమున్ను నాట్యము గానము వీణాపణవాది వాద్యాసక్తియు నివి వర్జింపవలయును ఈశ్లోకమందు కామశబ్దమునకు మైధునవ్యతిరిక్తమగు నభిలాషవిషయమని కుల్లూకభట్టు॥ ౧౭౮॥

మూ॥ ద్యూతంచ జనవాదంచ పరివాదం తథానృతం। స్త్రీణాం
చప్రేక్షణాలంభ ముపఘాతం పరస్యచ॥ ... ౧౭౯॥

జూదము జనులతో నిరర్థక వాక్కలహము పరునిపై దోషనిరూపణమున్న

తము మైథునాపేక్షచే స్త్రీలను జూచుట కౌగిలించుట పరుల కపకారము ఇవివ
ర్జింపవలెను|| ౧౭౯||

మూ|| ఏకశ్శయీత సర్వత్ర న రేతః స్కందయేత్క్వచిత్ । కామా
ద్ధి స్కందయన్ రేతో హినస్తి వ్రతమాత్మనః||౧౮౦||

ఒక్కఁడనైనా నేలనే యొంటిగ బరుండవలెను కామాతురతచే నిచ్ఛవలన రేతఃపాతము చేసినందున వ్రతము నశించును- వ్రతలోపమున కవకీర్ణి ప్రాయశ్చిత్తము జేయవలయును|| ౧౮౦||

మూ|| స్వప్నే సిక్త్వా బ్రహ్మచారీ ద్విజశ్శుక్రమకామతః । స్నా
త్వార్కమర్చయిత్వా త్రిః పునర్మామిత్యృచం జపేత్ ||౧౮౧||

ఇచ్ఛలేకుండ స్వప్నాదులందు రేతస్స్ఖలనమైతే స్నానంబొనర్చి చందన పుష్ప ధూపదీపాదులచే సూర్యునర్చించి పునర్మామనుఋక్కును మువ్మారు జపించవలెను- ఇందుకు ప్రాయశ్చిత్తము|| ౧౮౧||

మూ|| ఉదకుంభం సుమనసో గోశకృన్మృత్తికాకుశాన్ । ఆహరేద్యా
వదర్థాని భైక్షంచాహరహశ్చరేత్ || ౧౮౨||

జలకలశమునున్ను పుష్పములనున్ను గోమయమునున్ను మృత్తికనున్ను పలతృణము చేగురువుకుగావలసిన వస్తువులను దెచ్చియివ్వవలెను ప్రతిదినమున్ను భిక్షాన్నమును దేవలయును|| ౧౮౨||

మూ|| వేదయజ్ఞైరహీనానాం ప్రశస్తానాం స్వకర్మసు । బ్రహ్మ
చార్యాహరేద్భైక్షం గృహేభ్యః ప్రయతోఽన్వహం|| ౧౮౩||

పంచమహాయజ్ఞములు మానక చేయు ధార్మికులగృహములనుంచి భిక్షాన్నమును భిక్షనెత్తి తేవలయును|| ౧౮౩||

మూ|| గురోః కులే న భిక్షేత న జ్ఞాతికులబంధుషు । అలాభేత్వన్యగో
త్రాణాంపూర్వపూర్వంవివర్జయేత్ || ౧౮౪||

గురువుగృహమందున్ను దనజ్ఞాతులయిండ్లను బంధువులనగా మేనమామమొదల

ళువారి గేహములందును భిక్షచేయకూడదు పరులగృహమందు సంభవించినచో పూర్వపూర్వులను వదలివేయవలెను బంధు జ్ఞాతి యీ క్రమమున॥ ౧౮౪॥

మూ॥ సర్వంవాపి చరేద్గ్రామం పూర్వోక్తానామసంభవే । నియ
మ్య ప్రయతో వాచ మభిశస్తాంశ్చ వర్జయేత్॥ ౧౮౫॥

మున్ను ధార్మికుల గృహములందేయని జెప్పుటవలననలాభమందీవిధిని జెప్పుచు వ్నాడు-గ్రామమందరిళ్లనూ భిక్షనెత్తవలెను గాని మహాపాతకులనినిందితులగువా రిళ్లకు వెళ్లగూడదు॥ ౧౮౫॥

మూ॥ దూరాదాహృత్య సమిధ స్సన్నిదధ్యాద్విహాయసి।సాయం
ప్రాతశ్చ జుహుయా త్తాభిరగ్నిమతంద్రితః॥ ౧౮౬॥

గ్రామమునకు దూరముగ వెళ్లి సమిత్సంభారము దెచ్చి యెండదగలేలాగుపంచ నుంచి వాటిచే సాయంప్రాతఃకాలములం దగ్ని వేల్చవలెను దూరాదన్నదానికియొ కరివిగాకుండ సామాన్యాధికారముగల వనవృక్షములన్ని వాటికి గ్రామప్రాంత మందున్నవాటికివలె నమేధ్యాదిసంపర్క మున్ను రజస్వలాదిస్పర్శయున్న లేకుం డునని మేధాతిథి రామచంద్రులు వ్రాసిరి॥ ౧౮౬॥

మూ॥ అకృత్వా భైక్షచరణ మసమిధ్యచ పావకం।అనాతుర స్స
ప్తరాత్ర మవకీర్ణివ్రతం చరేత్॥ ౧౮౭॥

భిక్షాహారమున్ను సాయంప్రాతః సమిద్ధోమమున్ను రోగములేకనే సమముగ నేడుదినములు లేకుండిన నవకీర్ణియగును ప్రాయశ్చిత్తముజేయవలయును॥౧౮౭॥

మూ॥ భైక్షేణ వర్తయేన్నిత్యం నైకాన్నాదీభవేద్వ్రతీ। భైక్షే
ణవ్రతినోవృత్తి రుపవాససమాస్మృతా॥ ౧౮౮॥

బ్రహ్మచారియొకరిని యన్నమునే దినగూడదు బహుగృహములనుంచి దెచ్చిన యన్నము దినవలె నట్లు దినినను పవాససమమూ బ్రహ్మచారికగును॥ ౧౮౮॥

మూ॥ వ్రతవద్దేవదైవత్యే పిత్ర్యేకర్మణ్యథర్షివత్ । కామమభ్య
ర్థితోఽశ్నీయా ద్వ్రతమస్య నలుప్యతే॥ ౧౮౯॥

మున్ను నిషేధించబడిన యేకాన్న నిషేధభోజనమునకు నిషేధము దేవోద్దేశముగ జేసెడి కర్మమందు గోరబడి బ్రహ్మచారివ్రతతుల్యముగ మధుమాంసవర్జితముగ యథేష్టముగ నొకరియన్నముసైతే దినవచ్చు నటులనే పితృకర్మములందును నియమించబడి ఋషితో తుల్యముగ యథేష్టముగ భుజించ వచ్చును వ్రతలోపమున్ను లేదు॥ శ్లో॥ "బ్రహ్మచర్యే స్థితో నైక మన్నమద్యా దనాపది । బ్రాహ్మణో కామమశ్నీయా చ్ఛ్రాద్ధే వ్రతమపీడయన్నితి॥" శ్రాద్ధమందు నియమించబడి బ్రహ్మచర్యవ్రతమునకు హానిలేకుండ నేకాన్నమునున్ను దినవచ్చునని యాజ్ఞవల్క్యవిశ్వరూపునిచేనైతే "వ్రతమస్య నలుప్యతే" యను మనువుచే బ్రహ్మచారికనిమంత్రితభోజనమునందు మాంసభక్షణము విధించబడెనని వ్రాసెను॥ ౧౮౯॥

మూ॥ బ్రాహ్మణస్యైవ కర్మైతత దుపదిష్టం మనీషిభిః। రాజన్యవైశ్యయోస్త్వేవం నైతత్కర్మవిధీయతే॥ ౧౯౦॥

మూడువర్ణముల బ్రహ్మచారులకును భిక్షాచరణము విధించుటవలన వ్రతవదనుశ్లోకముచే దానికపవాదముగ నేకాన్నభోజనము క్షత్రియవైశ్యులకున్ను బ్రాప్తించిన యేకాన్నభోజనమును ప్రత్యేకముగ నిషేధించుచుండెను- ఆ నిమంత్రితైకాన్నభోజనము బ్రాహ్మణునకే యని పెద్దలచే విహితమగుట వలన క్షత్రియవైశ్యులకు లేదని మనువు జెప్పుచున్నాడు॥ ౧౯౦॥

మూ॥ చోదితో గురుణానిత్య మప్రచోదితఏవవా । కుర్యా దధ్యయనేయత్న మాచార్యస్య హితేషుచ॥ ౧౯౧॥

ప్రత్యహమును గురువుచే బ్రేరితుడైనను గాకుండినను వేదాధ్యయన మందును గురుహితములందును యత్నమును స్ఫుటముగ జేయవలయును॥ ౧౯౧॥

మూ॥ శరీరంచైవ వాచంచ బుద్ధీంద్రియమనాంసిచ।నియమ్య ప్రాంజలి స్తిష్ఠే ద్వీక్షమాణో గురోర్ముఖమ్॥ ౧౯౨॥

శరీరమును వాకును బుద్ధిని యింద్రియములను నియమించి ప్రాంజలియగుచు గురునిముఖమును జూచుచు నిలవబడవలెను గాని కూచుండగూడదు॥ ౧౯౨॥

మూ॥ నిత్యముద్ధృతపాణిస్స్యా త్సాధ్వాచారస్సుసంయతః । ఆ

స్యతామితిచోక్తస్సన్నాసీతాభిముఖంగురోః॥ ౧౯౩॥

ఉత్తరీయమునకు పైగానుంచిన దక్షిణబాహువుగలవాడై నియతచిత్తుడును శోభనాచారుడు ననగా వస్త్రావృతశరీరుడై గురువుచే గూర్చుండుమని యాజ్ఞాపింపబడి గురువున కభిముఖముగ గూర్చుండవలయును॥ ౧౯౩॥

మూ॥ హీనాన్నవస్త్రవేషస్స్యాత్సర్వదా గురుసన్నిధౌ। ఉత్తిష్ఠేత్ప్రథమంచాస్య చరమంచైవసంవిశేత్॥ ౧౯౪॥

గురువుకంటె నపకృష్టమగు నన్నమును వస్త్రమును వేషమును గలవాడగుచునుండవలెను రాత్రియందు గురువు పరుండిన పిమ్మట బరుండి యతనికంటె మున్నుగ లేవవలెను॥ ౧౯౪॥

మూ॥ ప్రతిశ్రవణసంభాషే శయానో నసమాచరేత్। నాసీనో నచభుంజానోనతిష్ఠన్నపరాఙ్ముఖః॥ ౧౯౫॥

గురువు నాజ్ఞను వినడమును వారితో మాటలాడడమును దాను బరుండిగాని గూర్చుండిగాని భుజించుచుండిగాని నిట్టనిలవబడిగాని పరాఙ్ముఖుడయిగాని జేయగూడదు॥ ౧౯౫॥

మూ॥ ఆసీనస్యస్థితఃకుర్యా దభిగచ్ఛంస్తుతిష్ఠతః। ప్రత్యుద్గమ్యత్వావ్రజతఃపశ్చాద్ధావంస్తుధావతః॥ ౧౯౬॥

గురువాసనమందుగూర్చుండి యాజ్ఞాపించినం దానాసనమునుంచి లేచియు నిలవబడినచో నభిముఖముగ జనియుండియు నడుచుచున్నప్పుడు దానెదురుగ దిరిగవచ్చియు బరువెత్తుచున్నప్పుడు వెనుకంబరువిడుచును శిష్యుడు వినవలయును భాషించవలయును॥ ౧౯౬॥

మూ॥ పరాఙ్ముఖస్యాభిముఖో దూరస్థస్యైత్యచాంతికమ్।ప్రణమ్యతుశయానస్య నిదేశేచైవతిష్ఠతః॥ ౧౯౭॥

గురువు పరాఙ్ముఖుడై యాజ్ఞాపించినచో శిష్యుడు దానభిముఖుడయియు దూరముగ నుండినచో సమీపమునకు వచ్చియును పరుండిన నమస్కరించియును

దగ్గరదాలగ యుండి కరములు జోడించుకొని ప్రతిశ్రవణసంభాషణములు జేయవ లయును॥ ౧౯౭॥

మూ॥ నీచంశయ్యాసనంచాస్య సర్వదాగురుసన్నిధౌ । గురోస్తు
చక్షుర్విషయే నయథేష్టాసనోభవేత్॥ ౧౯౮॥

ఎల్లప్పుడును గురుసన్నిధిని దనశయ్యాసనములు నీచములనగా క్రిందుగ నుండ వలెను గురువుచూచుచునుండ యథేష్టాసనగతుడుగా గూడదు॥ ౧౯౮

మూ॥ నోదాహరేదస్య నామపరోక్షమపికేవలమ్ । నచైవాస్యా
నుకుర్వీత గతిభాషితచేష్టితమ్॥ ౧౯౯॥

పరోక్షమందైన నుపాధ్యాయాచార్యోపనామములచే వ్యవహరించవలెనుగాని గురునామమునుచ్చరింప దగదు గురువుయొక్క మాటలనున్ను చేష్టలనున్ననగా గమనాదుల నపహాసార్థమనుకరించగూడదు॥ ౧౯౯॥

మూ॥ గురోర్యత్రపరీవాదో నిందావాపిప్రవర్తతే । కర్ణౌతత్ర
పిధాతవ్యౌ గంతవ్యం వాతతోన్యతః॥ ౨౦౦॥

ఉన్నదోషము నెంచడము పరీవాదము లేనిదోషమును కల్పించడము నిందయీ రెండింటిలో నేదైనా తనగురువువిషయమై జరుగుచుండినచో చెవులు మూసుకొనవలెను లేదా కొండొకచోటికి బోవలయును॥ ౨౦౦॥

మూ॥ పరీవాదాత్ఖరోభవతి శ్వావైభవతి నిందకః । పరిభోక్తా
క్రిమిర్భవతి కీటోభవతి మత్సరీ॥ ౨౦౧॥

ఇంక శిష్యుడుజేయు పరీవాదాదులకు ఫలమునుజెప్పుచున్నాడు శిష్యుడు గురువును పరీవాదముజేసిన రాసభమగును నిందించిన కుక్కయగును అనుచితముగ గురుధనమునుదినిన క్రిమియగును మత్సరించిన కీటమగును॥ ౨౦౧॥

మూ॥ దూరస్థో నార్చయేదేనం నక్రుద్ధో నాంతికేస్త్రియాః ।
యానాసనస్థశ్చైవైన మవరుహ్యాభివాదయేత్॥ ౨౦౨॥

తాను దూరముగనుండి యన్యునిచే వస్త్రాదులంపి గురువును పూజించగూడ

చు క్రోధయుక్తుడయిన్ను స్త్రీసన్నిధినిన్ని పూజించగూడదు యానముం దైన నాస
నమం దైననున్నచో గురువు కనపడెనేని దిగసత్కరించవలెను॥ ౨౦౨॥

మూ॥ ప్రతివాతే నువాతేచ నాసీత గురుణాసహ । అసంశ్రవే
చైవ గురో ర్నకించిదపి కీర్తయేత్॥ ౨౦౩॥

ప్రతివాతమందు ననువాతమందును గురువుతో సరిగాగూర్చుండనగదు శిష్యు
డుపైనుండి గురువుపైకివచ్చే గాలిప్రతివాతను గురువుపైనుండి శిష్యునిపైకివచ్చే
గాలియనువాతము ఎచ్చట గురువునకు మాటవినరాకుండు నచట యేమైనను గు
రువుతో జెప్పకూడదు॥ ౨౦౩॥

మూ॥ గోశ్వోష్ట్రయాన ప్రాసాద ప్రస్తరేషు కటేషుచ । ఆసీ
తగురుణాసార్థం శిలాఫలక నౌషుచ॥ ౨౦౪॥

ఎడ్లబండియందున్ను అశ్వయుక్త రథమందున్ను ఉష్ట్ర రథమందున్ను మేడ
యందున్ను కొండచరియయందును చాపయందును శిలయందును బల్లయందును
నౌకయందును గురువుతోగూడ గూర్చుండవచ్చును॥ ౨౦౪॥

మూ॥ గురోర్గురౌ సన్నిహితే గురువద్వృత్తిమాచరేత్। నచా
నిసృష్టో గురుణా స్వాన్గురూ నభివాదయేత్॥ ౨౦౫॥

గురువుయొక్క గురువు సమీపించినప్పుడు గురువునకుంబోలె నభివాదనాదిక
ము జరిగించవలెను తాను గురువునింటనుండినప్పుడు గురువునాజ్ఞ లేక దనసంబంధి
పితృపితృవ్యాదులకు నమస్కరించదగదు॥ ౨౦౫॥

మూ॥ విద్యాగురుష్వే తదపి నిత్యావృత్తి స్స్వయోనిషు । ప్ర
తిషేధత్సు చాధర్మా ద్ధితంచోప దిశత్స్వపి॥ ౨౦౬॥

ఆచార్యులుగాని విద్యాగురువులయందు నిట్టులే నిత్యముగ సత్కారవృత్తి జర
పవలెను తనపితృవ్యాదులయందును నధర్మమువలన మళ్లించెడివారియందును ధ
ర్మము నుపదేశించువారియందు నట్టులే జరగవలెను॥ ౨౦౬॥

మూ॥ శ్రేయస్సు గురువద్వృత్తిం నిత్యమేవ సమాచరేత్। గురు

పుత్రేషు చార్యేషు గురోశ్చైవ స్వ బంధుషు॥ ౨౦౭॥

విద్యాతప స్సమృద్ధిగలవారియందును యోగ్యతగలిగి తనశిష్యుడుగాక శ్రేష్ఠుడగు తనగురుపుత్రునియందున్ను గురుసంబంధబంధువులందును దనపితృవ్యాది బంధువులయందును గురువునకుబోలె సత్కారమాచరించవలెను॥ ౨౦౭॥

మూ॥ బాల స్సమానజన్మావా శిష్యోవా యజ్ఞకర్మణి । అధ్యాపయ న్గురుసుతో గురువన్మాన మర్హతి॥ ౨౦౮॥

గురుపుత్రుడు తనకంటె తక్కువవయస్సుగలవాడుగాని సమానవయస్సు గలవాడుగాని శిష్యుడుగాని వేదమునుచెప్పుటకు సమర్థుడై యజ్ఞకర్మమందు ఋత్విజుడైనా గాక జూడవచ్చినను గురువునకుంబలె పూజకర్హుడగుచున్నాడు॥ ౨౦౮॥

మూ॥ ఉత్సాదనంచగాత్రాణాం స్నాపనోచ్ఛిష్టభోజనే । నకుర్యాద్గురుపుత్రస్య పాదయోశ్చావనేజనమ్॥ ౨౦౯॥

గురువద్వృత్తిమాచరేదనుటవలన నాచార్యునితోనవిశేషను బ్రాప్తించగా నొడలునలుగు బెట్టడము స్నానమును జేయించడము నుచ్ఛిష్టభోజనము కాళ్లుగడగడము నివిగురుపుత్రునికి జేయగూడదు॥ ౨౦౯॥

మూ॥ గురువత్ప్రతిపూజ్యాస్స్యు స్సవర్ణాగురుయోషితః । అసవర్ణాస్తుసంపూజ్యాః ప్రత్యుత్థానాభివాదనైః॥ ౨౧౦॥

సవర్ణలగు గురుభార్యలాజ్ఞాకరణాదులచే గురువువలెనే పూజార్హులు అసవర్ణలైతే ప్రత్యుత్థానాభివాదనములచే మానార్హులు॥ ౨౧౦॥

మూ॥ అభ్యంజనంస్నాపనంచ గాత్రోత్సాదనమేవచ । గురుపత్న్యానకార్యాణి కేశానాంచప్రసాధనమ్॥ ౨౧౧॥

నూనె తలకును శరీరమునకు రాసి నలుగుబెట్టి స్నానము చేయించుటయును కేశప్రసాధనమనగా పువ్వులు ముడుచుటయు నిందుచే నొడలచందనమలదుట గురుపత్నికి జేయగూడదు॥ ౨౧౧॥

మూ॥ గురుపత్నీతు యువతి నాభివాద్యేత పాదయోః । పూ

నా వింశతివర్షేణ గుణదోషావిజానతా॥ ౨౧౨॥

గురుభార్య యువతియేని నిరువదివత్సరములు వయస్సు కలిగి గుణదోషము తెలిసినవాడు పాదాభివందనము జేయగూడదు నేలను హస్తముంచి నమస్కరింపవలెను॥ ౨౧౨॥

మూ॥ స్వభావఏషనారీణాం నరాణామిహదూషణమ్ । అతోర్థాన్నప్రమాద్యంతి ప్రమదాసువిపశ్చితః॥ ౨౧౩॥

పురుషులమనస్సులకు వికారమును దమశృంగారచేష్టలచే గలిగించి దోషమును బుట్టించుట స్త్రీలకు స్వభావము గావున బండితులు తమపురుషార్థము నకు భంగము రాకుండ స్త్రీలయందు బ్రమాదము నొందరు॥ ౨౧౩॥

మూ॥ అవిద్వాంసమలంలోకే విద్వాంసమపివాపునః । ప్రమదాహ్యుత్పథంనేతుం కామక్రోధవశానుగం॥ ౨౧౪॥

లోకమునందు విద్వాంసుడైన నవిద్వాంసుడైన దు॥ ఙులు కామక్రోధ వశునిగా నమార్గవర్తిగ నొనర్చుటకు సమర్థులగుచున్నారు॥ ౨౧౪॥

మూ॥ మాత్రాస్వస్రాదుహిత్రావా నవివిక్తాసనోభవేత్ । బలవానింద్రియగ్రామో విద్వాంసమపికర్షతి॥ ౨౧౫॥

తల్లితోనయిన భగినితోనైన రహస్యస్థలమందుండగూడదు ఇంద్రియగణ మెక్కువబలముగలది శాస్త్రముచే నియమితమగు మనస్సుగల విద్వాంసునైన బరవశునిగా జేయును॥ ౨౧౫॥

మూ॥ కామంతుగురుపత్నీనాం యువతీనాంయువాభువి । విధివద్వందనంకుర్యా దసావహమితిబ్రువన్॥ ౨౧౬॥

అత్యంతయువతులగు గురుపత్నులకు తానున్న యౌవనవంతుడగు శిష్యుడువిధిచే నేనునమస్కరించుచున్నానని చేతులు నేలనుంచి మ్రొక్కవలెను॥ ౨౧౬॥

మూ॥ విప్రోష్యపాదగ్రహణ మన్వహంచాభివాదనం। గురుదారేషుకుర్వీత సతాంధర్మమనుస్మరన్॥ ౨౧౭॥

పరదేశమునుండి వచ్చినప్పుడు శాస్త్రము సద్ధర్మమును స్మరించి కుడిచేతకు డిపాదము నెడమచేత నెడమపాదమును గ్రహించి విధ్యుక్తముగనున్న నిత్యమున్ను భూమిపై కరములుంచిన్ని గురుపత్నులకు యువయగు శిష్యుడు మ్రొక్కవలెను॥ ౨౧౭॥

మూ॥ యథాఖనన్ ఖనిత్రేణ నరో వార్యధిగచ్ఛతి । తథాగురుగ
తాంవిద్యాం శుశ్రూషురధిగచ్ఛతి॥ ౨౧౮॥

ఉక్తమగు శుశ్రూషావిధికి ఫలమును జెప్పుచున్నాడు తవ్వుగోలచే దవ్వుచు జలము నెట్లొందునట్లనే శుశ్రూషజేయు నిచ్ఛగలవాడు గురుగతమగు విద్యపొందుచున్నాడు॥ ౨౧౮॥

మూ॥ ముండీవా జటిలోవాస్యా దథవాస్యాచ్ఛిఖాజటః । నైనం
గ్రామేభినిమ్లోచేత్సూర్యోనాభ్యుదియాత్క్వచిత్॥ ౨౧౯॥

బ్రహ్మచారికి మూడు ప్రకారములని చెప్పుచున్నాడు ముండిత శిరస్కుడైనను జటిలుడైనను జటగట్టిన శిఖగలవాడైనను ఏకగ్రామమందైన బ్రహ్మచారి నిద్రితుడగుచునుండ సూర్యుడస్తమయమునుగాని ఉదయమునుగాని బొందగూడదు॥ ౨౧౯॥

మూ॥ తంచేదభ్యుదియాత్సూర్య శ్శయానం కామచారతః । ని
మ్లోచేద్వాప్యవిజ్ఞానా జ్జపన్నుపవసేద్దినం॥ ౨౨౦॥

ఇందుకు ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు-ఆబ్రహ్మచారికామచారము వలన నిద్రితుడగుచుండ నిద్రావశంబున నెరుంగకున్నంతలో సూర్యుదుదయించిన నస్తమించిననొకపగలుజపముజేయుచు నుపవసించి రాత్రిభుజింపవలయు నిదిసూర్యాభ్యుదితునకు బ్రాయశ్చిత్తము సూర్యాభ్యస్తమితునకు మరునాటిపగ లుపవసించవలయునని కుల్లూకభట్టు-సావిత్రీజపమునకు గౌతమువచనము॥ సూ॥"సూర్యాభ్యుదితోబ్రహ్మచారీ తిష్ఠేదహరభుంజానోభ్యస్తమితశ్చరాత్రౌజపన్ సావిత్రీం"గతార్థము॥ ౨౨౦॥

మూ॥ సూర్యేణ హ్యభినిర్ముక్త శ్శయానోభ్యుదితశ్చయః । ప్రా
యశ్చిత్తమకుర్వాణో యుక్తస్స్యాన్మహతైనసా॥ ౨౨౧॥

ఏదికారణమున సూర్యాభ్యుదిత సూర్యాభ్యస్తమితుడై బ్రహ్మచారియథోక్తముగ ప్రాయశ్చిత్తము జేయకుండిన నాపాపముచే నరకము నొందును గావున ప్రాయశ్చిత్తమనువశ్యముగ జేయవలయును॥ ౨౨౧॥

మూ॥ ఆచమ్య ప్రయతో నిత్యముభే సంధ్యే సమాహితః। శుచౌ
దేశే జపఞ్జప్యముపాసీత యథావిధి॥ ౨౨౨॥

ప్రతిదినము నుభయసంధ్యలనాచమించి సమాహితుడై శుచియగు దేశమందు నియమవంతుడగుచు జప్యము ను జపించి యథావిధిగ సంధ్యోపాసన మొనర్పవలెను॥ ౨౨౨॥

మూ॥ యదిస్త్రీయద్యవరజ శ్శ్రేయః కించిత్సమాచరేత్। తత్స
ర్వమాచరేద్యుక్తో యత్రవాస్యరమేన్మనః॥ ౨౨౩॥

స్త్రీగాని శూద్రుడుగాని శ్రేయస్కార్యము నెద్దియేని యాచరింతురది శాస్త్రవిరుద్ధము గాకుండిన దానినాచరించవలెను దనమనస్సునకు మంచిదని తోచినదానిని స్సి జేయవలెను॥ ౨౨౩॥

మూ॥ ధర్మార్థావుచ్యతేశ్రేయః కామార్థౌ ధర్మఏవచ। అ
ర్థఏవేహవాశ్రేయ స్త్రివర్గఇతితుస్థితిః॥ ౨౨౪॥

శ్రేయస్సనగా ధర్మార్థములని కనపరచుచున్నాడు-కొందరాచార్యులు కామహేతువులుగాన ధర్మార్థములు శ్రేయస్సనిరి కొందరు సుఖహేతువులుగానర్థకామములు శ్రేయస్సనిరి కొందరర్థకామముల కుపాయముగాన ధర్మమేశ్రేయస్సనిరి కొందరు ధర్మకామములకు సాధనమగుట నిచ్చట నర్థమే శ్రేయస్సనిరి యింక స్వమతమును జెప్పుచున్నాడు పరస్పరావిరుద్ధములగు ధర్మార్థకామములు స్వరూపముగాగల త్రివర్గము శ్రేయస్సని నిశ్చయము-ఇట్లు భోగేచ్ఛులకుగాని మోక్షేచ్ఛులకుగాదు ముముక్షులకైతే మోక్షమే పురుషార్థమని షష్ఠాధ్యాయమందు జెప్పగలడు॥ ౨౨౪॥

మూ॥ ఆచార్యో బ్రహ్మణో మూర్తిః పితా మూర్తిః ప్రజాప
తేః। మాతాపృథివ్యా మూర్తిస్తు భ్రాతాస్వో మూర్తిః

రాత్మనః॥ ౨౨౫॥

ఆచార్యుడు వేదాంతప్రతిపాదిత పరబ్రహ్మమూర్తి తండ్రి హిరణ్యగర్భునిమూర్తి తల్లి ధారణాది వలన పృథివీమూర్తి సోదరుడు క్షేత్రజ్ఞునిమూర్తిగావున వీరవమానించిన నవమానించదగరు॥ ౨౨౫॥

మూ॥ ఆచార్యశ్చ పితాచైవ మాతా భ్రాతాచ పూర్వజః। నార్తేనాప్యవమంతవ్యా బ్రాహ్మణేన విశేషతః॥ ౨౨౬॥

ఆచార్యపితృమాతృజ్యేష్ఠభ్రాతలాతురునిచేనైన నవమానింపదగరు బ్రాహ్మణునకు నియమము విశేషించి గావలయును॥ ౨౨౬॥

మూ॥ యంమాతాపితరౌ క్లేశం సహేతే సంభవే నృణాం। న తస్య నిష్కృతిం శక్యం కర్తుంవర్షశతైరపి॥ ౨౨౭॥

మనుష్యులయొక్క ఉత్పత్తియందుదలిదండ్రులే క్లేశమును సహించుచున్నారో దానికి ననేకవర్షశతములచేనైన ననగా జన్మశతములచేనైన నానృణ్యమును జేయుటకు శక్యముగాదు॥ ౨౨౭॥

మూ॥ తయోర్నిత్యం ప్రియం కుర్యా దాచార్యస్యచసర్వదా। తేష్వేవత్రిషుతుష్టేషు వ్రతం తపస్సమాప్యతే॥ ౨౨౮॥

నిత్యముగా దలిదండ్రులకును సర్వదా యాచార్యునకును సంతుష్టిని జేయవలయును వారు మువ్వురును సంతుష్టినొందిరేని నీకు సకలమున్ను కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతఫలము సిద్ధించినదేను॥ ౨౨౮॥

మూ॥ తేషాం త్రయాణాం శుశ్రూషా పరమం తపఉచ్యతే। న తైరభ్యననుజ్ఞాతో ధర్మమన్యత్సమాచరేత్॥ ౨౨౯॥

ఆతలితండ్రులు నాచార్యుడు నీమువ్వురిపరిచర్యయే పరమతపంబని చెప్పబడుచున్నది దీనివలననే సకలతపఃఫలమున్ను ప్రాప్తించు నన్యధర్మము లేనైన వీరియనుజ్ఞ లేక జేయగూడదు॥ ౨౨౯॥

మూ॥ తఏవహి త్రయోలోకా తఏవత్రయఆశ్రమాః। తఏవహి

త్రయో వేదా స్తఏవోక్తా స్త్రయోగ్నయః॥ ౨౩౦॥

తల్లి దండ్రి యాచార్యుడు అమువ్వురే మూడులోకము లగుచున్నారు లోకత్రయప్రాప్తి హేతువులు గావున కారణమందు కార్యోపచారము గార్హస్థ్యాద్యాశ్రమములను మూటిని బొందించువారగుటచే వారు మువ్వురే మూడాశ్రమములు వేదత్రయఫలమున కుపాయములు గావున వారేమూడు వేదములు మూడగ్నులచే సంపాద్యమగు యజ్ఞఫలదాతలు గావున వారే త్రేతాగ్నులు॥ ॥౨౩౦

మూ॥ పితా వై గార్హపత్యోగ్ని ర్మాతాగ్ని ర్దక్షిణ స్స్మృతః।
గురు రాహవనీయస్తు సాగ్నిత్రేతా గరీయసీ॥ ౨౩౧॥

తండ్రియె గార్హపత్యాగ్ని తల్లి దక్షిణాగ్ని యాచార్యుడాహవనీయాగ్ని యీయగ్నిత్రియము స్తుత్యర్హముగావున శ్రేష్ఠతరము॥ ౨౩౧॥

మూ॥ త్రిష్వప్రమాద్యన్నేతేషు త్రీన్ లోకాన్ విజయేద్గృహీ। దీ
ప్యమానస్స్వ వపుషా దేవవ ద్దివి మోదతే॥ ... ౨౩౨॥

పిత్రాదిత్రయమం దప్రమాదముగానున్న బ్రహ్మచారి తేసరే గృహస్థుడున్ను మూడులోకములనున్ను జయించుచున్నాడు స్వతేజముచే సూర్యాదులవలె వెలుంగుచు స్వర్గమందు సంప్రాప్తుడగుచున్నాడు॥ ౨౩౨॥

మూ॥ ఇమంలోకం మాతృభక్త్యా పితృభక్త్యాతు మధ్యమం। గు
రుశుశ్రూషయా త్వేవం బ్రహ్మలోకం సమశ్నుతే॥ ౨౩౩॥

మాతృభక్తిచే నీభూలోకమునున్ను పితృభక్తిచే నంతరిక్షలోకమునున్ను గురుశుశ్రూషచే బ్రహ్మలోకమునున్ను బొందును॥ ౨౩౩॥

మూ॥ సర్వేతస్యా దృతాధర్మా యస్యైతే త్రయ ఆదృతాః। అ
నాదృతాస్తు యస్యైతే సర్వాస్తస్యాఫలాః క్రియాః॥ ౨౩౪॥

ఎవని తలిదండ్రులున్ను గురువున్ను సత్కరించబడిరో వానికి సకలధర్మములున్ను సఫలములు ఎవనిచే నీముగ్గురును సత్కరించబడరో వాని శ్రౌతస్మార్తకర్మములన్నియు నిష్ఫలములగును॥ ౨౩౪॥

మూ॥ యావత్త్రయస్తే జీవేయు స్తావన్నాన్యంసమాచరేత్ । తే
ష్వేవనిత్యంశుశ్రూషాం కుర్యాత్ప్రియహితేరతః॥ ౨౩౫॥

ఎంతపర్యంతము వీరుముగ్గురును జీవించియుందు రంతపర్యంతము నితరధర్మములు జేయ నక్కఱలేదు వారి యాజ్ఞచే ప్రాగుక్తధర్మములం జేయదగదు- వారలకు ప్రీతియొట్లగు హితమెట్లగు నట్లు జేయ నాసక్తుడగుచు వారి శుశ్రూషజేయవలెను॥ ౨౩౫॥

మూ॥ తేషామనుపరోధేన పారత్ర్యం యద్యదాచరేత్ । తత్త
న్నివేదయేత్తేభ్యో మనో వచన కర్మభిః॥ ౨౩౬॥

వారి శుశ్రూషకు విరోధములేకుండ పరలోకహితకరమగు కర్మమేదైనజేసినదాని నవశ్యము మనోవచనములందు మాయలేకుండ జెప్పవలయును॥ ౨౩౬॥

మూ॥ త్రిష్వేతేష్వితి కార్యంహి పురుషస్య సమాప్యతే। ఏషధ
ర్మః పరస్సాక్షా దుపధర్మోఽన్యఉచ్యతే॥ ౨౩౭॥

ఏదికారణమున వీరు ముగ్గురును శుశ్రూషితులగుచుండిరేని శ్రౌతస్మార్తాది కర్తవ్య కర్మకలాపమేమియు ననుష్ఠించబడెనో తత్ఫలంబు ప్రాప్తించునది కారణమున నీధర్మముత్కృష్టము॥

ప్రత్యక్షమగు నగ్నిహోత్రాది పురుషార్థసాధనధర్మమంతయు జఘన్యమని స్తుతి॥ ౨౩౭॥

మూ॥ శ్రద్దధానశ్శుభాం విద్యా మాదదీత వరాదపి। అంత్యా
దపి పరంధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి॥ ౨౩౮॥

శ్రద్ధాయుక్తుడు శుభమైనవిద్యననగా దృష్టశక్తియగు గారుడాదివిద్యను శూద్రునివలననైన గ్రహించవలసినది చండాలునివలననైన యనగా జాతిస్మరణము మొదలగు జన్మాంతరీయయోగ ప్రకర్షమువలన పాపశేషముచే ప్రాప్తనుగుచండాలత్వము గలవానివలననని యర్థము అట్టివానివలననైన మోక్షోపాయముగ్రహించదగనది- అట్లు జ్ఞానమునే యుపక్రమించి మోక్షధర్మమని గ్రంథము॥
శ్లో ॥ "ప్రాప్తంజ్ఞానం బ్రాహ్మణాత్క్షత్రియాద్వైశ్యాచ్ఛూద్రాదపినీచాదభీక్ష్ణం।

శ్రీ)ద్ధాతవ్యం(శ్రద్ధధానైననిత్యం నశ్రీ)ద్ధినం(ప్రతిజన్మమృత్యువిశేషతా"||(శ్రద్ధావంతుని చే (బ్రాహ్మణాది చండాలాంతమగువారిలో నెవరివలననైనం (బా ప్తంబగుజ్ఞానము నుగూర్చి-మే (శ్రద్ధజేయదగును జన్మమృత్యుధర్మకమగుశరీరముతో బనిలేదు. ఇచ్చ టమేధాతిథి చండాలునివలన (శ్రౌతస్మార్తాదులకంటె పరమగు లౌకికధర్మము గ్రి హించదగినది- ధర్మశబ్దము వ్యవస్థయందుగూడవర్తించుచున్నది-చండాలుడైననిచ ట చిరముండదగదనియు నీయుదకమందు స్నానముజేయవలదనియు ననిపలికినేని యట్లుచేయవలెను- (ప్రౌఢుడయిన్ని పరమధర్మమును లౌకికవస్తుపరమని బలుకుచు న్నవాడైనప్పటికిని మేధాతిథి సత్పురుషులకు శ్లాఘ్యుడగుచున్నాడు- అద్భుతమనికు ల్లూకభట్టువ్రాసెను- తన కులముకంటె తక్కువకులములోనుంచిదైనను స్త్రీర త్నమునుజేసికొనవచ్చును|| ౨౩౮||

మూ|| విషాదప్యమృతం గ్రాహ్యం బాలాదపి సుభాషితం । అమి
(త్రాదపిసద్వృత్తమమేధ్యాదపికాంచనమ్||...... ౨౩౯||

అమృతము విషముతో గలసియుండెనేని యావిషమును బరిహరించియమృతము గ్రిహించదగును- యజ్ఞానివలననైన మంచిమాటనున్న శత్రువునివలననైన సజ్జన ధర్మమునున్ను కాంచనము నమేధ్యమువలననైన గ్రిహించదగును|| ౨౩౯||

మూ|| స్త్రియోరత్నాన్యథోవిద్యా ధర్మశ్శౌచం సుభాషితం। వివి
ధానిచ శిల్పాని సమాదేయాని సర్వతః|| ౨౪౦||

స్త్రీలున్ను రత్నములున్ను విద్య ధర్మమున్ను శౌచము నానావిధశిల్పములు ని వి యందరివలననైన గ్రిహించవచ్చును స్త్రీలు మొదలగు దృష్టాంతము లేలాగునె వరివలననైన గ్రిహించందగునో యట్లు శిల్పము లెవనివలననైన సంపాదించం దగును|| ౨౪౦||

మూ|| అ(బ్రాహ్మణాదధ్యయన మాపత్కాలె విధీయతె। అను(వ
జ్యాచ శుశ్రూషా యావదధ్యయనం గురోః|| ... ౨౪౧||

అధ్యాపకుడు (బ్రాహ్మణుడు దొరకనియప్పుడు (బ్రాహ్మణేతర క్షత్రియునివలన గాని శూద్రునివలనగాని (బ్రాహ్మణుడధ్యయనము జేయవచ్చును శుశ్రూషైతే శ

దువు చెప్పుచున్నంత కాలమే గురుత్వముగావున నతనితో గూడ ననుసరించుట యేశు
శ్రూష-పాదప్రక్షాళనాదికముగూడదు ఇందుకువ్యాసులు ॥ శ్లో ॥ "మంత్రతః క్ష
త్రియోవిప్రై శ్శుశ్రూషానుగమాదినా। ప్రాప్తవిద్యోబ్రాహ్మణస్తు పునస్తస్యగురు
స్స్మృతః"॥ వేదమును బ్రాహ్మణునకు క్షత్రియుడు చెప్పినంత కాలము తనతో ననుసరిం
చడము మొదలగునది యు శుశ్రూష-విద్య జెప్పడమైన బిమ్మట తిరిగ బ్రాహ్మణుడేగు
రువగును॥ ౨౪౧॥

మూ॥ నాబ్రాహ్మణే గురౌ శిష్యో వాసమాత్యంతికం వసేత్। బ్రా
హ్మణే చాననూచానే కాంక్షన్గతి మనుత్తమాం॥ ౨౪౨॥

అబ్రాహ్మణుడగు నీగురువు సన్నిధిని యనూచానుడుగాని బ్రాహ్మణగురుసన్నిధి
ని యావజ్జీవ బ్రహ్మచర్యమును బట్టి సాంగవేదాధ్యయనముగ గురుకులమందుండి
మోక్షమునుగో రుచున్న బ్రాహ్మణుడుండదగదు॥ ౨౪౨॥

మూ॥ యదిత్వాత్యంతికం వాసం రోచయేత గురోః కులే। యుక్తః
పరిచరేదేన మా శరీర విమోక్షణాత్॥ ౨౪౩॥

నైష్ఠిక బ్రహ్మచర్యము నుద్దేశించినట్టైతే గురుకులమందే శరీరపతనపర్యంత
ము నియమయుక్తుడైయుండి గురుశుశ్రూష జేయవలయును॥ ౨౪౩॥

మూ॥ ఆసమాప్తే శ్శరీరస్య యస్తుశుశ్రూషతే గురుం। సగచ్ఛత్యం
జసావిప్రో బ్రహ్మణస్సద్మశాశ్వతం॥ ౨౪౪॥

దీనికి ఫలమును జెప్పుచున్నాడు- శరీరపతనపర్యంతము సేవడు గురుశుశ్రూష జే
యుచుండు నావిప్రుడు తత్వముచే శాశ్వతమగు బ్రహ్మలోకమునొందుచున్నాడు
అనగా బ్రహ్మమందు లీనమగుచున్నాడు॥ ౨౪౪॥

మూ॥ నపూర్వం గురవే కించి దుపకుర్వీత ధర్మవిత్। స్నాస్యం
స్తు గురుణాజ్ఞప్త శ్శక్త్యాగుర్వర్థ మాహరేత్॥ ౨౪౫॥

ఉపకుర్వాణబ్రహ్మచారికీవిధి నైష్ఠికునకు స్నానములేదు గావున బ్రహ్మచారి
స్నానాత్పూర్వము గోవస్త్రాదిధనమునిచ్చుటకై నసీవలదు అప్రయత్నముగా దనకే

మైనలభించినసీవచ్చును॥సూ॥"యదన్యాని ద్రవ్యాణి యథాలాభముపహరతి దక్షిణా ఏవతాః. సఏషబ్రహ్మచారిణో యజ్ఞోనిత్య వ్రతమితి॥" ఇతరములగు ద్రవ్యము శిష్యునకులభించిన వాటిని గురువు స్వీకరించునవియె దక్షిణలు అది బ్రహ్మచారికి యజ్ఞమై నిత్యవ్రతమగుచున్నదని ఆపస్తంబుడు- స్నానముచేయనిచ్ఛయించుచు గురునాజ్ఞచే ధనికులను యాచించియైన శక్తిగొలదిధనము ను గురువునకవశ్యమునొసగవలయును॥ ౨౪౫॥

మూ॥ క్షేత్రం హిరణ్యంగామశ్వం ఛత్రోపానహమాసనం। ధాన్యంశాకంచ వాసాంసి గురవే ప్రీతిమావహేత్॥ ౨౪౬॥

భూమి సువర్ణము గోవు తురగము ఛత్రము ఉపానహము ఆసనము ధాన్యము శాకము వస్త్రములు వీటినన్నింటినిగాని కొన్నింటినిగాని యివిగాకమరికొన్నిటినిగాని గురునకొసంగ ప్రీతినిబుట్టించవలెను॥ శ్లో॥ "ఏకమప్యక్షరం యస్తు గురుశ్శిష్యేనివేదయేత్। పృథివ్యాంనాస్తి తద్ద్రవ్యం యద్దత్వాచా నృణీభవేత్॥ అసంభవే మపిదద్యాత్॥" శిష్యునకొకయక్షరమైననేగురువుజెప్పెనోనతనిఋణము తీరుటకుగా నొసగగలద్రవ్యము భూమియందు లేదుగావున నసంభవమందు శాకమునైన నొసగవలయునని వృద్ధహారీతుడు॥ ౨౪౬॥

మూ॥ ఆచార్యేతు ఖలుప్రేతే గురుపుత్రే గుణాన్వితే । గురుదారసపిండేవా గురువద్వృత్తిమాచరేత్॥ ౨౪౭॥

నైష్ఠికునకీయుపదేశము ఆచార్యుడు మృతుడయ్యెనేని గుణవంతుడగు నతని పుత్రుని తదభావమందు గురుభార్య నామెలేకున్నగురుసపిండులను గురువునుంబలెసేవించవలెను॥ ౨౪౭॥

మూ॥ ఏతేష్వవిద్యమానేషు స్నానాసన విహారవాన్ । ప్రయుంజానోగ్ని శుశ్రూషాం సాధయే ద్దేహమాత్మనః॥ ౨౪౮॥

వీరెవరులేకున్న గురునియజ్ఞవేది సమీపమందు విహరించుచు సాయంప్రాతరగ్నికార్యములను నడుపుచు తనదేహావచ్ఛిన్న చైతన్యమును బ్రహ్మమందు లీనమగునట్లు సాధించవలయును॥ ౨౪౮॥

మూ॥ ఏవంచరతియోవిప్రో బ్రహ్మచర్య మవిప్లుతః । సగచ్ఛత్యు
త్తమంస్థానం నచేహ జాయతేపునః॥ ౨౪౯॥

ఇతి శ్రీమానవే ధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాం సంహితాయాం
ద్వితీయోధ్యాయః.

ఈప్రకారముగ తనయావజ్జీవము గుర్వాదితదగ్నివేదికా పర్యంతము యథా సంభవశుశ్రూషకు మోక్షప్రాప్తిఫలమని చెప్పుచున్నాడు యేవిప్రుడుమధ్యనుభ్రష్టుడుగాకుండ బ్రహ్మచర్యమును బరిపాలించునో యతండుత్తమస్థానము నొందును మరలనిచటంబుట్టడు॥ ౨౪౯॥

ఇది శ్రీమహామహీంబిరాజ శ్రీమదానంద గజపతిరాజమహారాజదయా
పాత్ర భారద్వాజసగోత్రపవిత్ర సుకవిజనవిధేయ మండ
కామేశ్వర నామధేయవిరచితాంధ్రమన్వర్థ దీపి
కాఖ్యయగు వ్యాఖ్యయందు
ద్వితీయాధ్యాయము.



శ్రీరస్తు.

ఆంధ్ర మన్వర్థ దీపికా సహిత

# మనుస్మృతిః తృతీయాధ్యాయ ప్రారంభము.

మూ॥ షట్త్రింశదాబ్దికంచర్యం గురౌత్రైవేదికంవ్రతం । తదర్ధికంపాదికంవా గ్రహణాంతికమేవవా॥ ౧॥

పూర్వాధ్యాయాంతమందు శరీరపతనావధిగనైష్ఠిక బ్రహ్మచర్యవిధి జెప్పబడె నుపకుర్వాణుడుగదా గృహస్థుడు గావలసి యుండె నతనికి బ్రహ్మచర్యమున కవధి జెప్పకుండె నదియిచ్చట జెప్పుచున్నాడు- ఋగ్యజుస్సామనామకములగు మూడు వేదముల విషయమై జేయు వ్రతమనగా దమ తమ శాఖల ననుసరించిన నియమముల సమూహమది ముప్పదియారబ్దముల కాలము గలది యొక్కొక వేదమునకు పదిరెండువర్షముల చొప్పుననయ్యె నందు సగమైనం బ్రతిశాఖకు నారింటి చొప్పున పదునెనిమిదయ్యె పాదికమనుటచే మూడుమూడబ్దముల చొప్పునం దొమ్మిదివర్షములయ్యె వేదములు వచ్చెడి పర్యంతమైన నావ్రతము జేయవలెనని చెప్పెను॥ శ్రు॥ "నియమేనాధీతంవీర్యవత్తరంభవతి" నియమముగా జదివినది వీర్యవత్తరమగుచున్నదని శ్రుతివలన నా నియమము మొదట చెప్పిన మూడుపక్షములకున్ను గ్రహణాంతికపక్షముచే నుక్తకాలములకు లోపునైన నా కాలము దనుకనుండనక్కరలేదా కాలము నతిక్రమించినదైన గ్రహణాపేక్షచే మొదట మూటిపై నీ గ్రంథము వచ్చు పర్యంతము నియమము కావలెననితోచుచున్నది గాని నియమమునకు ఫలముగాగల దాని విషయమై వికల్పను న్యూనాపేక్షగలది- అధర్వవేదము ఋగ్వేదాంశమైనప్పటికిని॥ శ్రు॥ "ఋగ్వేదంయజుర్వేదం సామవేదమధర్వాణం చతుర్థమితి" యని నాలుగవ వేదమునుగా నధర్వణవేదమును ఛాందోగ్యోపనిషత్తుయందున్ను॥ శ్లో॥ "అంగానివేదాశ్చత్వారః" అని విష్ణుపురాణమందున్ను నా వేదములుగా చెప్పబడినప్పటికిని నీయధర్వవేదము తరుచుగా నాగుటనున్ను యజ్ఞవిద్యయందు మూడువేదములకే ప్రమాణములున్ను త్రిసం

మెట్లన్న "ఋగ్వేదేనైవహోత్రంకుర్వ న్యజుర్వేదేనాధ్వర్యవం సామవేదేనోద్గాత్రంయదేవత్రయ్యైవిద్యాయైసూక్తంతెనబ్రహ్మత్వమితి" యను శ్రుతివలన యజ్ఞములు యీసంపాద్యములని తెలియబడుచున్నవి మనువుత్రయీమాత్రవ్రతచర్యావిధిని జెప్పెను గాని యథర్వవేదమునకు వ్రతము లేదని నిషేధించలేదు ఇతర శ్రుతులయిరిజు వేదమాత్రమునకు వ్రతచర్యవినబడుచున్నది॥ శ్లో॥ "ప్రతివేదంబ్రహ్మచర్యం ద్వాదశాబ్దానిపంచవేతి" అన్నివేదములకును బ్రహ్మచర్యము పదిరెండైన నైదైన వత్సరములు గావలెనని యోగియాజ్ఞవల్కి॥ ౧.

మూ॥ వేదానధీత్యవేదౌవా వేదంవాపియథాక్రమం। అవిప్లుతబ్రహ్మచర్యో గృహస్థాశ్రమమావిశేత్॥ ౨॥

ఇచ్చట వేదశబ్దము భిన్నవేదశాఖాపరను స్వశాఖాధ్యయనపూర్వకముగ మంత్రబ్రాహ్మణక్రమముచే మూడుగాని రెండుగాని యొకటైననధ్యయనము బ్రహ్మచర్యవ్రతలోపము లేకుండనయ్యేనేని యటపై గృహస్థాశ్రమము ననగా గృహశబ్దము దారపరము వివాహితుడై గార్హ్యస్థ్యవిహితకర్మకలాపమును జేయవలయును పురుషశక్తిననుసరించి ఏకద్విత్రిశాఖాధ్యయన వికల్పము వ్రతము నధ్యయనము నీరెండును నిత్యములుగా నుపదేశించెడు మనువుచే నుభయస్నాతకుడు శ్రేష్ఠుడు గావున నధీత్యఅవిప్లుత యనువాటిచే నుభయస్నాతకుడే చెప్పబడెను "త్రయస్స్నాతకాభవంతివిద్యాస్నాతకో వ్రతస్నాతకో విద్యావ్రతస్నాతకశ్చేతి" ఎవడు వేదమును సమాప్తినొందించి వ్రతసమాప్తిలేకస్నాతకుడగు నతడు విద్యాస్నాతకుడు వ్రతమును సమాప్తినొందించి విద్యనుసమాప్తినొందించనివాడు వ్రతస్నాతకుడు రెంటినిసమాప్తినొందించినవాడు భయస్నాతకుడని హారీతుడు॥ శ్లో॥ "వేదంవ్రతానివాపారం నీత్వాప్యుభయమేవవా" అనియాజ్ఞవల్కి॥

మూ॥ తంప్రతీతంస్వధర్మేణ బ్రహ్మదాయహరం పితుః। స్రగ్విణంతల్పఆసీన మర్హయేత్ప్రథమంగవా॥ ౩॥

బ్రహ్మచర్యధర్మముచే బ్రసిద్ధుడును దండ్రివలన వేదమను దాయమును స్వీకరియు ననదండ్రియొద్దనే వేదముచదివినట్టి వాడనియర్థము తండ్రివలన వేద ...యు త్తమమతడు లేకున్న నాచార్యుని వలన నని మాలికను ధ ...న నతని ముందుగ గోవుచే మధుపర్కపూజను వివా

కానునట్టి సంయుగ దన(ండ్రి)మైన సాచార్యుడైన జేయవలయు॥ ౩॥

మూ॥ గురుణానుమతస్స్నాత్వా సమావృత్తో యథావిధి ।
స్వహేతద్విజో భార్యాం సవర్ణాం లక్షణాన్వితాం॥ ౪ ॥

గురువుచే ననుజ్ఞాతుడైన స్నాతకుడు విధ్యుక్తముగ సమావర్తనమైనన్నటుపై ద్విజుడు సవర్ణయు సులక్షణయు నగు కన్యకను వివాహముగావలెను॥ ౪॥

మూ॥ అసపిండాచయా మాతు రసగోత్రాచయాపితుః। సాప్రశ
స్తాద్విజాతీనాందారకర్మణిమైథునే॥ ౫॥

శ్లో॥ సపిండతాతుపురుషే సప్తమేవినివర్తతె॥ సప్తమపురుషునితో సాపిండ్యము నివర్తించుననువచనమువలన వరునితల్లి సపిండులలో బుట్టినదిన్ని చకారముచే తల్లిగోత్రమందు బుట్టినదిన్ని తండ్రిగోత్రమందు బుట్టినదిన్ని చకారముచే తండ్రికిసపిండులయందు ననగా పితృవ్యాదికన్యాజాతగానిదియైన కన్యకద్విజులకు వివాహముజేసుకొనుటకును నగ్నిహోత్రాదికర్మములకును పుత్రోత్పాదనమునకును యోగ్యయగుచున్నది ఇటులుండగా మాతామహవంశము గాకున్న యన్యమాతృగోత్రజ యనగా మాతామహవంశ పరంపరాసంబంధములేని మాతృగోత్రజాత కానిషేధములేదని సంగ్రహించబడినది॥ ఇందుకు వ్యాసవచనము॥ శ్లో॥ "సగోత్రాంమాతురప్యేకే నేచ్ఛంత్యుద్వాహకర్మణి । జన్మనామ్నోరవిజ్ఞానేఉద్వహేదవిశంకితః॥" మాతృగోత్రమందుబుట్టిన కన్యనుద్వాహముగాగూడదని కొందరిమతము మాతామహవంశములో జన్మమును వారికూటస్థుడి నామమున్ను దెలియకుండినచో మాతృగోత్రజాతమైనను దానినిశ్శంకముగ బెళ్లిగావచ్చునని॥ ఇచ్చట మేధాతిథి॥ శ్లో॥ "మాతులస్యసుతాంచైవ మాతృగోత్రాంతథైవచేతి-"మేనమామకూతురినిన్ని మాతృగోత్రజాతనున్ను బెళ్లిగాగూడదని విశిష్టనామముతో మాతృగోత్రజానిషేధమువ్రాసెను ఇదిన్ని మాతృవంశజన్మనామపరిజ్ఞానవిషయమనికుల్లూకభట్టువ్రాసెను॥ ౫॥

మూ॥ మహాంత్యపిసమృద్ధాని గోజావిధనధాన్యతః। స్త్రీసంబం
ధేదశైతాని కులానిపరివర్జయేత్॥ ౬॥

గోవులు మొదలగు సంపత్తిచే నెంతగొప్పవైన నీపదికులములున్ను స్త్రీసం

బంధమున కర్హములుగావు గానవర్జించవలెను॥ ౬॥

మూ॥ హీనక్రియం నిష్పురుషం నిశ్ఛందో రోమశార్శసం। క్షయ్యా
మయావ్యపస్మారి శ్విత్రికుష్ఠికులానిచ॥ ౭॥

జాతకర్మాదిసంస్కారములులేనిది స్త్రీసంతానమేగాని పురుషులుపుట్టకున్నట్టి
ది వేదాధ్యయనములేనిది శరీరమందు లోమములెక్కువగలది మూలశంకరోగము
క్షయరోగము మందాగ్ని యపస్మారము బొల్లి కుష్ఠు యీరోగములుగలవిన్నియీ
పదికులములలోసంబంధముచేయగూడదని పూర్వశ్లోకముతోగలసిసంబంధము॥ ౭॥

మూ॥ నోద్వహేత్కపిలాం కన్యాం నాధికాంగీం నరోగిణీం।
నాలోమికాంనాతిలోమాం నవాచాటాంనపింగలాం॥ ౮॥

కులాశ్రయమగు నిషేధములుజెప్పి కన్యాశ్రయములగు ప్రతిషేధములుజెప్పుచు
న్నాడు-కపిలకేశయు నధికాంగయు నిత్యవ్యాధితయు దేహమందు లోమములులే
నిదియు తరుచులోమములు కలదియు బహుపరుషభాషిణియు పింగాక్షియు నగు
కన్యను వివాహముగాదగదు॥ ౮॥

మూ॥ నర్క్షవృక్షనదీనామ్నీం నాంత్యపర్వతనామికాం। నపక్ష్య
హిప్రేష్యనామ్నీం నచభీషణనామికాం॥ ౯॥

రోహిణీరేవతిమొదలగు నక్షత్రముల పేళ్ళుగలదానినిన్ని వృక్షములపేళ్లు న
దులపేళ్లు మ్లేచ్ఛులపేళ్లు పర్వతములపేళ్లు పక్షులపేళ్లు సర్పములపేళ్లు దాసులపే
ళ్లు భయంకరమైనపేళ్లుగల కన్యను వివాహము గాకూడదు॥ ౯॥

మూ॥ అవ్యంగాంగీం సౌమ్యనామ్నీం హంసవారణగామినీం।తను
లోమకేశదశనాం మృద్వంగీముద్వహేత్ స్త్రియం॥ ౧౦॥

మరియెట్టిదివివాహయోగ్యయనిన వికలాంగికానిది సౌమ్యమగుపేరుగలదిహం
సభంగిని గజముభంగిని మందమగుగమనముగలది స్వల్పములగు లోమములు కేశము
లు చిన్నదంతములుగలదినునుపుగలదేహముగలది యగుకన్యను వివాహము గావ
లెను॥ ౧౦॥

మూ॥ యస్యాస్తునభవేద్భ్రాతా నవిజ్ఞాయేతవాపితా। నోపయ

చ్ఛేతతాం ప్రాజ్ఞః పుత్రికాధర్మశంకయా॥ ౧౧॥

ఇచ్చట విధినిషేధములు చెప్పడము అనిషిద్ధవిహితకన్యావివాహ మభ్యుదయముకొరకని చెప్పుచున్నాడు- ఏకన్యకకుభ్రాతలేదో॥ శ్లో॥ "యదపత్యంభవేదస్యాంతన్మమస్యాత్స్వధాకర మిత్యభిసంధానమాత్రాదపి పుత్రికాభవతి-అభిసంధిమాత్రాత్పుత్రికేత్యేక ఇతి॥" యీకన్యక కేసంతతికలుగునో యదినాకు స్వధాకరముగావుతయని చెప్పుటమాత్రమువలన ననగా వివాహకాలమందు పుత్రీకరణము జేయుటవలన పుత్రికాసంజ్ఞకలది ప్రతిజ్ఞామాత్రముచేతనే పుత్రికయగునని కొందరిమతమని గౌతమస్మరణమువలన పుత్రుడులేనివానిదుహిత వివాహకాలమందు దీనియందుపుట్టిన పుత్రుడు తనపరలోకములకుగావలయుననునది పుత్రికాధర్మమనబడును గావున నట్టిపుత్రికాధర్మశంకచే నట్టియభ్రాతృకన్యకను బ్రాజ్ఞుడు వివాహముగాకూడదు దానిసంతానముయొక్క హక్కు దానితండ్రికియగుటవలనతండ్రి యెవడో తెలియనికన్యకను వివాహముగాకూడదు ఇచ్చట పుత్రికా ధర్మశంకయాయనునది యోచించనక్కర లేదని కొందరిమతము ఇద్దరుతండ్రులు నొకతల్లియుగల సంతతియన్న చెల్లెళ్లగుదురుగాన నెవరికెవరుబుట్టినదిన్ని దెలియదుగాన దండ్రిదెలియబడకున్న నభ్రాతృకన్యయగును గాన పుత్రికాధర్మశంకచేతనే పెళ్లియాడగూడదని గోవిందరాజువ్రాసెను-తండ్రి మృతుడైనను దేశాంతరగతుడైనను తండ్రిమెరుగబడడు తండ్రియుండి దీనిపుత్రుడు తనకక్కరలేదనిపలికిన నాకన్య నభ్రాతృకనైనను వివాహముగావచ్చునని రెండింటికి నొకటేయర్థముగ మేధాతిథివ్రాసెను॥ పుత్రికాశంకయు నధర్మశంకయునని ద్వంద్వాంతమందుగలశంకాశబ్దము రెండింట నన్వయించునుగాన క్రమముగా నభ్రాతృకన్యను పుత్రికాశంకచేతనున వివాహముగాగూడదు అధర్మశంకయనగా తండ్రితెలియ బడకున్న "నసపిండాచయామాతుః॥" యనెడి శ్లోకమందున్నసకారముచేనగు నిషేధదోషమువలననైన యధర్మమని దెలియందగునది యెట్లన్న సగోత్రజ నబుద్ధిపూర్వకముగ వివాహమైనచో తెసినపైదానినిముట్టక తల్లినివలె పోషించుమనుట నభార్యాత్వమేగలుగుచున్నది భార్యాత్వమన నగ్నిహోత్రాదులకుపయోగించుటసగోత్రానిషేధముతోగూడ జెప్పకుండినను మాతృగోత్రజయునభార్యయే యగుచున్నది గాని హీనక్రియాదికులజయు "నర్క్షవృక్షనదీనామ్నీం" మనియు మొదలగు దృష్టదోషములందునభార్యాత్వములేదుగాని ప్రాయశ్చిత్తమాత్రము జేసికొనవలయునని కుల్లూ

కభట్టు॥ ౧౭॥

మూ॥ సవర్ణాగ్రే ద్విజాతీనాం ప్రశస్తాదారకర్మణి । కామత
స్తు ప్రవృత్తానా మిమాస్తు క్రమశోవరాః॥ ౧౨॥

బ్రాహ్మణాదివర్ణములవారు ముందుగాసవర్ణయగు స్త్రీని వివాహము గావ లెను కామముచే నీచెప్పబోయెడి క్రమముననను లోమముగావీరు వివాహాంతర ప్రవృత్తిగలిగెనేని వివాహ్యలగుదురు॥ ౧౨॥

మూ॥ శూద్రైవభార్యా శూద్రస్య సాచస్వాచ విశస్మృతే। తే
చస్వాచైవ రాజ్ఞశ్చ తాశ్చస్వాచాగ్ర జన్మనః॥ ౧౩॥

శూద్రునకు శూద్రస్త్రీ యొకటియే భార్యగాని పైవర్ణముల స్త్రీలనువివాహముగాగూడదు వైశ్యశూద్రస్త్రీలు వైశ్యునకును క్షత్రియవైశ్య శూద్రస్త్రీలు క్షత్రియునకును బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రస్త్రీలు బ్రాహ్మణునకును క్రమముగభార్యలుగావచ్చును॥ సూ ॥ "శూద్రామప్యేకె మంత్రవర్జమితి॥" శూద్రస్త్రీనిన్ని కొందరు మంత్రవర్జముగా వివాహము జేసికొనవచ్చునని రనువసిష్ఠవచనముచే ద్విజులుశూద్రను మంత్రములేకుండ పెళ్లి జేసికొనవలెను॥ ౧౩॥

మూ॥ నబ్రాహ్మణక్షత్రియయో రాపద్యపిహి తిష్ఠతోః। కస్మింశ్చి
దపి వృత్తాంతె శూద్రాభార్యోపదిశ్యతె॥ ౧౪॥

బ్రాహ్మణక్షత్రియులకు సవర్ణస్త్రీదొరకని యాపదయందైనను యేపురాణేతిహాసములయందైనను శూద్రస్త్రీ భార్యగా నుపదేశింపబడలేదు పయిశ్లోకమందు అనులోమక్రమముచే శూద్రస్త్రీ వివాహవిషయమై యనుజ్ఞయుండడమువలన యీనిషేధము ముందుగా శూద్రస్త్రీనే ప్రాతిలోమ్యముచేనగు వివాహ విషయమని తెలుసుకొనవలయును బ్రాహ్మణక్షత్రియుల కనడను దోషాధిక్యమని తెలియుటకు ముందువైశ్యునకుకూడ నిషేధించుచున్నాడు॥ ౧౪॥

మూ॥ హీనజాతి స్త్రియంమోహా దుద్వహంతో ద్విజాతయః ।
కులాన్యేవ నయంత్యాశు ససంతానాని శూద్రతాం॥౧౫॥

సవర్ణ స్త్రీని వివాహముగాకుండ బ్రాహ్మణక్షత్రియవైశ్యులుశూద్రస్త్రీనిచె

శ్లియాడి రేని కుమపుత్రపౌత్రాదిసంతతితోగూడ కులములను శూద్రత్వమునుపొందిం చుచున్నారు వైశ్యులకు నిషేధించుచు బ్రాహ్మణ క్షత్రియులకు చెప్పుట నిందామాత్రము॥ ౧౫॥

మూ॥ శూద్రావేదీపతత్యత్రే రుచథ్యతనయస్యచ। శౌనకస్యసుతోత్పత్త్యా తదపత్యతయాభృగోః॥ ౧౬॥

శూద్రస్త్రీని వివాహమయినవాడు పతితుడగుచున్నాడని యత్రిమహాముని యొక్కయు నుచథ్యపుత్రుండగు గౌతమునియొక్కయు మతము అత్ర్యాదులను చెప్పుట చే నిది బ్రాహ్మణవిషయము శూద్రస్త్రీయందు పుత్రోత్పత్తిచే పతితుడగునని శౌనకునిమతము యిది క్షత్రియవిషయము శూద్రస్త్రీలయందు పుత్రోత్పత్తిచే పతితు డగునని భృగుమహాముని మతము యిది వైశ్యవిషయము యీమహర్షి మతత్రయము నకు వ్యవస్థచెప్పకుండినను సాదృశ్యమునకు వికల్పము లేకపోవుటవలన వ్యవస్థ సేయబడెను మేధాతిథి గోవిందరాజులయొక్క మతమయితే మొదటిది పూర్వోక్తశూద్రావివాహనిషేధవిశేషము రెండవది ఋతుకాలమందు శూద్రస్త్రీనిబొందగూడదను నిషేధమువలన ఋతుకాలమందు శూద్రస్త్రీని ముట్టకున్నను దైవాత్తుపుత్రోత్పత్తివిషయము మూడవది ఋతుకాలగమనముచే పుత్రోత్పత్తివిషయము ని దీనిచే శూద్రేతరస్త్రీలయందు సంతానము గనినవాడు శూద్రస్త్రీని ఋతుకాలములయందు బొందవచ్చునని చెప్పబడ్డది॥ ౧౬॥

మూ॥ శూద్రాం శయనమారోప్య బ్రాహ్మణో యాత్యధోగతిం।
జనయిత్వా సుతంతస్యాం బ్రాహ్మణ్యాదేవహీయతే॥౧౭॥

బ్రాహ్మణుడు సవర్ణస్త్రీని వివాహముకాక స్నేహముచే శూద్రస్త్రీని వివాహమై దానిని శయ్యను చేర్చుకొనెనేని యధోగతినొందును దానియందు సంతానమునుగనెనేని బ్రాహ్మణ్యమువలననే హీనుడగును ఇందుచే బ్రాహ్మణుడు శూద్రస్త్రీనిబొంది నరకమునబడునని శూద్రాగమననిషేధము సంతానముగనిన బ్రాహ్మణ్యమే పోవుననునది ఋతుకాలగమననిషేధపరమై దోషాధిక్యముచెప్పెను॥ ౧౭

మూ॥ దైవపిత్ర్యాతిథేయాని తత్ప్రధానానియస్యతు। నాశ్నంతిపితృదేవాస్తన్నచస్వర్గంసగచ్ఛతి॥ ౧౮॥

సవర్ణానుక్రమముచే వివాహితయైనను శూద్రస్త్రీచే సంపాదితమగుననగా సిద్ధముచేయబడిన ద్రవ్యములచే జేసిన హవ్యకవ్యములు నతిథిపూజయు నేమేమి జేసినను వాటిని దేవతలు పితృదేవతలును గైకొనరతిథిపూజచే నాకర్తకు స్వర్గప్రాప్తిలేదు ఇదిసవర్ణస్త్రీసన్నిధినుండినను లేకుండినను దెలియదగును॥ ౧౮॥

మూ॥ వృషలీఫేనపీతస్య నిశ్వాసోపహతస్యచ । తస్యాంచైవప్రసూతస్య నిష్కృతిర్నవిధీయతే॥ ౧౯॥

శూద్రస్త్రీయొక్క యధరపానమును జేసినవాడు దానినిశ్వాసములచే నుపహతుడయినవాడు దానియందు సంతానమును గనినవాడు నెవడో వానికిప్రాయశ్చిత్తము విధింపబడలేదు యీమూడింటికిని క్రమముగానధరము చుంబించకూడదనియు నేకశయ్యాగతుడు గాగూడదనియు ఋతుకాలమందు దానినొందగూడదనియునిషేధించెను॥ ౧౯॥

మూ॥ చతుర్ణామపివర్ణానాం ప్రేత్యచేహ హితాహితాన్। అష్టావిమాంత్సమాసేన స్త్రీవివాహాన్నిబోధత॥ ౨౦॥

బ్రాహ్మణాదినాలుగువర్ణములవారికిని యిహలోకపరలోకములయందు కొన్నిహితములునుగొన్నియహితములునగు నెనిమిదిస్త్రీవివాహములనువినుండు॥౨౦॥

మూ॥ బ్రాహ్మోదైవ స్తథైవార్షః ప్రాజాపత్య స్తథాసురః। గాంధర్వోరాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమోధమః॥ ౨౧॥

వాటినామములను జెప్పుచున్నాడుబ్రాహ్మము దైవము ఆర్షము ప్రాజాపత్యము ఆసురము గాంధర్వము రాక్షసముఅధమమగు నెనిమిదవది పైశాచము వీటిలో బ్రాహ్మరాక్షసాదినామములు శాస్త్రీయసంకేతములుగాని బ్రహ్మదేవతత్వాదికమీవివాహములకుసంభవించదు- ఇది బ్రహ్మకువలెనేయన బ్రాహ్మమని అసురునకు వలెనిదియనగా నాసురమని వివాహములయొక్క మంచిచెడ్డలను తెలియజేసేవని చెప్పవచ్చును పైశాచము సర్వనింద్యమని నిందార్థము విశేషణము॥ ౨౧॥

మూ॥ యోయస్యధర్మోవర్ణస్య గుణదోషౌచయస్యయౌ। తద్వస్సర్వం ప్రవక్ష్యామి ప్రసవేచ గుణాగుణాన్॥ ౨౨॥

ఏవర్ణముువానికే వివాహము ధర్మమో యేవివాహమునకు గుణదోషములేవో తత్తద్వివాహోత్పన్నసంతానమందే గుణాగుణములో యీసర్వమున్ను మీకు జెప్పెదను॥ ౨౨॥

మూ॥ షడానుపూర్వ్యా విప్రస్య క్షత్రస్యచతురోవరాన్।విట్ఛూ
ద్రయోస్తు తానేవ విద్యాద్ధర్మ్యానరాక్షసాన్॥ ౨౩॥

బ్రాహ్మణునకు బ్రాహ్మదైవార్ష ప్రాజాపత్యాసుర గాంధర్వములారున్ను క్షత్రియునకాసుర గాంధర్వపైశాచములు నాలుగున్ను వైశ్యశూద్రులకాసురగాంధర్వ పైశాచములు మూడున్ను ధర్మ్యములని దెలియవలయు॥ ౨౩॥

మూ॥ చతురో బ్రాహ్మణస్యాద్యాన్ ప్రశస్తాన్కవయో విదుః।
రాక్షసంక్షత్రియస్యైక మాసురం వైశ్యశూద్రయోః॥౨౪॥

బ్రాహ్మణునకు బ్రాహ్మదైవార్ష ప్రాజాపత్యములు నాలుగున్ను క్షత్రియునకు నొకటి-రాక్షసమున్ను వైశ్యశూద్రులకాసురమున్ను ప్రశస్తములని ప్రాజ్ఞులు దెలిసికొనిరి బ్రాహ్మణాదులకు బూర్వమందు జెప్పబడినవాటినే తిరుగజెప్పట యాసురాదివివాహము లధమములని దెలుపుటకుగాన నుత్తమాసంభవమందు జఘన్యము కర్తవ్యమని ముందున్ను గర్హితపరిత్యాగమిట్లని తెలియదగును॥ ౨౪॥

మూ॥ పంచానాంతు త్రయోధర్మ్యాద్వావధర్మ్యౌస్మృతావిహ।
పైశాచశ్చాసురశ్చైవ నకర్తవ్యౌ కదాచన॥ ౨౫॥

ఈస్మృతియందు పైశాచాసురములయొకటి నిషేధమువలన నైదింటిలోన ప్రాజాపత్య గాంధర్వ రాక్షసములు మూడెధర్మ్యములు- అందుప్రాజాపత్యము క్షత్రియాదుల కప్రాప్తము విధింపబడుచున్నది- బ్రాహ్మణునకు విహితముగావునను విధించబడుచున్నది- గాంధర్వము నాలుగువర్ణములవారికిని ప్రాప్తమగుటవలన ననువాదమే రాక్షసమున్ను వైశ్యశూద్రులకును క్షత్రియవృత్తియందున్నబ్రాహ్మణునకున్ను విధించబడుచున్నది- ఆయాసురపైశాచములు నాలుగువర్ణములవారికిని నిషేధించబడుచున్నవి ఇచ్చట నేవర్ణమునకే వివాహమందు విధియు నిషేధమును నుండెనో వారికదివికల్పము అదిన్ని విహితమైనది సంభవించకుండినచోన

ని తెలియదగును॥ ౨౫॥

మూ॥ పృథక్పృథగ్వా మిశ్రౌవా వివాహౌ పూర్వచోదితౌ ।
గాంధర్వోరాక్షసశ్చైవ ధర్మ్యౌక్షత్రస్యతౌస్మృతౌ॥ ౨౬॥

క్షత్రియునకు గాంధర్వరాక్షసములు వేరువేరు మున్ను విధించబడుటవలన నిచ్చట ననువాదించబడుచున్నవి- మిశ్రములయినననుటవలన మిశ్రములుగాను విధించబడుచున్నవి గావున వేరుగాగాని మిశ్రముగాగాని క్షత్రియునకు గాంధర్వరాక్షసములు ధర్మ్యములని మన్వాదులచే జెప్పబడెను- మిశ్రములనగా నన్యోన్యానురాగముచే మనస్సులుగలసినచో వరుడు యుద్ధముచే కన్యాజ్ఞాతులను జయించితెచ్చి పెండ్లిచేసుకొనుటగలచో మిశ్రములగుచున్నవి॥ ౨౬॥

మూ॥ ఆచ్ఛాద్యచార్చయిత్వాచ శ్రుతశీలవతే స్వయం। ఆహూయదానం కన్యాయా బ్రాహ్మోధర్మః ప్రకీర్తితః॥ ౨౭॥

కన్యావరులను యథాశక్తిగా వస్త్రాలంకారములచే నలంకరించి తన్నడగకుండనే స్వయముగాబిలచి యభిరుచి శ్రుతశీలసంపన్నునకు కన్యకిచ్చుట బ్రాహ్మవివాహమని చెప్పబడినది॥ ౨౭॥

మూ॥ యజ్ఞేతు వితతేసమ్య గృత్విజే కర్మకుర్వతే । అలంకృత్య
సుతాదానం దైవంధర్మం ప్రచక్షతే॥ ౨౮॥

అగ్నిష్టోమాదులయందు కర్మమును నడుపుచునున్న ఋత్విజునలంకరించి కన్య నిచ్చుట దైవవివాహమని జెప్పుచున్నాడు॥ ౨౮॥

మూ॥ ఏకం గోమిధునం ద్వేవా వరాదాదాయధర్మతః । కన్యా
ప్రదానం విధివదార్షో ధర్మస్సఉచ్యతే॥ ౨౯॥

ఒకయావునొక యెద్దు నీరెండును గోమిధున మనబడును అట్టి గోమిధునమొకటిగాని రెండు మిథునములుగాని తన యజ్ఞదక్షిణకై నాకన్యాధనముగానైనా తులరూపము గాకుండ వరుని వలన బుచ్చుకుని విధ్యుక్తముగ కన్య నిచ్చిన నది యార్షవివాహమనబడును॥ ౨౯॥

మూ॥ సహోభౌ చరతాంధర్మ మితివాచానుభాష్యచ । కన్యా ప్రదానమభ్యర్చ్య ప్రాజాపత్యోవిధిస్స్మృతః॥ 30॥

కన్యావరుల నలంకరించి మీరుభయులును ధర్మకార్యములను జేయుడని చెప్పి పూజించి కన్యనిచ్చి విధ్యుక్తముగ పెళ్లి జేసిన నది ప్రాజాపత్యమనబడును॥ 30॥

మూ॥ జ్ఞాతిభ్యోద్రవిణందత్వా కన్యాయైచైవశక్తితః । కన్యాప్రదానంస్వాచ్ఛంద్యం హ్యాసురోధర్మఉచ్యతే॥ 31॥

కన్యకయొక్క తండ్రిమొదలగు వారికైనను కన్యకకునైనను యథాశక్తిగా ధనమునిచ్చి కన్యను స్వీకరించుట యాసురధర్మమనబడె నిది తన యిచ్ఛచేగాని ఆర్షశాస్త్రనియమముచే గాదు॥ 31॥

మూ॥ ఇచ్ఛయాన్యోన్యసంయోగః కన్యాయాశ్చవరస్యచ । గాంధర్వస్సతువిజ్ఞేయో మైథున్యఃకామసంభవః॥ 32॥

కన్యావరులన్యోన్య మనురాగముచే గలసి యాలింగనాదికములచే వలసినమిదునసంభవమగు నీ వివాహము గాంధర్వము॥ 32॥

మూ॥ హత్వాఛిత్వాచభిత్వాచ క్రోశంతీంరుదతీంగృహాత్ । ప్రసహ్యకన్యాహరణం రాక్షసో విధిరుచ్యతే॥ 33॥

బలాత్కరించి కన్యను దెచ్చి వివాహము కావడము రాక్షసవివాహము దీనిలక్షణమిదే కన్యతండ్రిమొదలగువారు వరుని బలము మొదలగు యోగ్యతలను బట్టి యుపేక్షించిరేని సరే లేకవారు పైబడిన వారిని జంపిగాని ఛేదించిగాని భేదించిగాని కన్యాపక్షీయుల నణచి కన్యరోదనము నొనర్చుచుండిన ననుటచే కన్యక కన్యమతమై నప్పటికిని ననుట గాంధర్వాదిభేదము కొరకు నట్టిది రాక్షసము॥ 33॥

మూ॥ సుప్తాంమత్తాంప్రమత్తాంవా రహోయత్రోపగచ్ఛతి । స పాపిష్ఠోవివాహానాం పైశాచశ్చాష్టమోధమః॥ 34॥

నిద్రచేగాని మద్యాదిపానములచేగాని యొడలెరుగకున్న దానిమానసంరక్షణ మెరుగని దాని మైథున ధర్మముచే నయిన వివాహము పైశాచమష్టమమధమము

పాపిష్ఠము॥ ౩౪॥

మూ॥ అద్భిరేవద్విజాగ్ర్యాణాం కన్యాదానంవిశిష్యతే। ఇతరే
షాంతువర్ణానా మితరేతరకామ్యయా॥ ౩౫॥

బ్రాహ్మణులకు కన్యాదానముదకదాన పూర్వకమే ప్రశస్తము క్షత్రియాదులకు దకములేకుండిన నితరేతరేచ్ఛచే వాఙ్మాత్రముచేనైన కన్యాదానమగుచున్నది ఉదకపూర్వకమనిన్ని నియమమక్కర లేదు॥ ౩౫॥

మూ॥ యోయస్యైషాం వివాహానాం మనునాకీర్తితోగుణః। స
ర్వంశృణుతతంవిప్రా స్సర్వంకీర్తయతోమమ॥ ౩౬॥

విచారించగా నే వివాహమునకు యేయేగుణదోషములో యని ప్రతిజ్ఞ చేయబడినవే అయినప్పటికి చెప్పదగినవి విస్తారముగ నుండుటచే విశేషజ్ఞాపనార్థమై మరలనుపన్యసించుట యీవివాహములలో దేనికి నేగుణము మనువుచే జెప్పబడెనో విప్రులారా దాని నెల్ల జెప్పెదను వినుండు॥ ౩౬॥

మూ॥ దశపూర్వాన్ పరాన్వంశ్యానాత్మానంచైవవింశతిం। బ్రా
హ్మీపుత్రస్సుకృతకృన్మోచయేదేనసఃపితౄన్॥ ౩౭॥

బ్రాహ్మవివాహోఢాపుత్రుడు తండ్రిమొదలగు పయివారిని పదుగురనున్నుపుత్రులు మొదలగు క్రిందివారిని పదుగురనున్ను తనతో యిరువదియొక పురుషులను దాను పుణ్యకర్ముడై పాపము వలన పితరుల నుద్ధరింపజేయుచున్నాడు॥ ౩౭॥

మూ॥ దైవోఢాజస్సుతశ్చైవ సప్తసప్తపరావరాన్। ఆర్షో
ఢాజస్సుత స్త్రీంస్త్రీన్ షట్షట్కాయోఢజస్సుతః॥ ౩౮॥

దైవవివాహితకన్యాపుత్రుడు పిత్రాదుల నేడుగురను పుత్రాదుల నేడుగురనున్ను ఆర్షవివాహోఢాపుత్రుడు ముగ్గుర ముగ్గురనున్ను ప్రాజాపత్యవివాహోఢాపుత్రుడారుగుర నారుగురనున్ను దనతోగూడ పాపమువలన విముక్తులనుగా జేయును స్వల్పఫలముగలయార్షవివాహమును ముందుజెప్పి యధికఫలముగల ప్రాజాపత్యవివాహమును బిమ్మట జెప్పడము బ్రాహ్మాద్యష్టవివాహోద్దేశక్రమానుసారము

ఆశ్లోకమందాక్రమమేలననిన "పంచానాంతు త్రయోధర్మ్యాః" యనుశ్లోకమందు ప్రాజాపత్యగ్రహణార్థ మట్లుగాకున్న నార్షమునకే గ్రహణమై పోవును గదా॥ ౩౮॥

మూ॥ బ్రాహ్మాదిషు వివాహేషు చతుర్ష్వేవానుపూర్వశః। బ్రహ్మ
వర్చస్వినః పుత్రాః జాయంతే శిష్టసమ్మతాః॥ ౩౯॥

బ్రాహ్మాదులగు నాలుగువివాహములయందు నగుస్త్రీలకుబుట్టిన పుత్రులు శ్రుతాధ్యయనసంపత్తిగల తేజోయుక్తులును శిష్టప్రియులునగువారును క్రమముగానగుచున్నారు॥ ౩౯॥

మూ॥ రూపసత్వగుణోపేతా ధనవంతోయశస్వినః। పర్యాప్త
భోగాధర్మిష్ఠా జీవంతిచ శతం సమాః॥ ౪౦॥

సుందరమగు రూపము బలము ద్వాదశాధ్యాయమందు చెప్పబోవుదు గుణములును గలిగిన ధనవంతులును కీర్తిగలవారును స్రక్చందనాదిపూర్ణభోగ యుక్తులును ధార్మికులును శతవర్ష జీవనులు- నగుపుత్రులు బ్రాహ్మాదివివాహిత స్త్రీలకుజన్మింతురు వారట్టివారగుదురని పూర్వశ్లోకముతో సంబంధము॥ ౪౦॥

మూ॥ ఇతరేషు తు శిష్టేషు నృశంసా నృతవాదినః। జాయంతే
దుర్వివాహేషు బ్రహ్మధర్మద్విషస్సుతాః॥ ౪౧॥

ఆసురాది వివాహస్త్రీలకు క్రూరకర్ములు నస్నృతవాదులు వేదయాగాదిధర్మద్వేషులునగు పుత్రులు పుట్టుచున్నారు॥ ౪౧॥

మూ॥ అనిందితైః స్త్రీవివాహై రనింద్యా భవతిప్రజా। నిందితై
ర్నిందితానౄణాం తస్మాన్నింద్యాన్వివర్జయేత్॥ ౪౨॥

వివాహములయొక్క ఫలములను సంక్షేపముగజెప్పుచున్నాడు - భార్యాప్రాప్తిహేతువులగు వివాహములలో అనిందితవివాహములచే ననింద్యప్రజ యుత్పత్తి నిందితములగు వాటిచే మనుష్యులయొక్క సంతతి గర్హితమగును. గావున నింద్యములగు వాటిని జేసికొనగూడదు॥ ౪౨॥

మూ॥ పాణిగ్రహణ సంస్కార స్సవర్ణా సూపదిశ్యతే। అసవ

ర్ణాస్వయంజ్ఞేయో విధిరుద్వాహకర్మణి॥ ౪౩॥

సవర్ణస్త్రీల వివాహమందు పాణిగ్రహణసంస్కారము గృహ్యసూత్రముచే నుపదేశించబడుచున్నది. యసవర్ణస్త్రీ వివాహముల పాణిగ్రహణ స్థానమందీ ముందుశ్లోకమున జెప్పగలవిధి దెలియదగినది॥ ౪౩॥

మూ॥ శరః క్షత్రియయాగ్రాహ్యః ప్రతోదో వైశ్యకన్యయా। వస
నస్య దశాగ్రాహ్యా శూద్రయోత్కృష్టవేదనే॥ ౪౪॥

క్షత్రియస్త్రీచే బ్రాహ్మణుడు వరుడైన వివాహమందు పాణిగ్రహణస్థానమందు బ్రాహ్మణుడు పట్టుకొనిన శరైకదేశము గ్రహించదగినది. వైశ్యస్త్రీ బ్రాహ్మణ క్షత్రియవరులు బట్టిన ములుకోలనేకదేశమందు బట్టుకోవలెను శూద్రస్త్రీ బ్రాహ్మణ క్షత్రియ వైశ్యవరులపై బట్టికొనను బట్టకొనవలెను॥ ౪౪॥

మూ॥ ఋతుకాలాభిగామీస్యా త్స్వదారనిరతస్సదా। పర్వవ
ర్జం వ్రజేచ్చైనాం తద్వ్రతో రతికామ్యయా॥ ౪౫॥

ఋతువనగా స్త్రీలకు శోణితదర్శనము చిహ్నముగాగల గర్భధారణ యోగ్యావస్థావిశేషము అట్టి ఋతుకాలమందు భార్యనుబొందవలెనని నియమవిధి॥ ౪౫॥

"మూ॥ ఋతుస్నాతాంతు యోభార్యాం సన్నిధౌ నోపగచ్ఛతి।
ఘోరాయాంబ్రహ్మహత్యాయాంపతతేనాత్రసంశయఇతి॥"

ఋతుస్నాతయగు భార్యను సన్నిధినియుండిన్ని యెవడు పొందడో వాడు భయంకరమగు బ్రహ్మహత్యనరకమందు నిస్సంశయముగ బడునని పరాశరులు- ఈ నియమ మనుత్పన్న పుత్రునికే యనిరి. "జాయమానో వై బ్రాహ్మణస్త్రిభిర్ఋణవా జాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యోయజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యఇతి" పుట్టినబ్రాహ్మణుడు మూడు ఋణములు గలవాడౌచున్నాడు. బ్రహ్మచర్యముచే ఋషిఋణమును యజ్ఞముచే దేవర్ణమును సంతానముచే పితౄణమునున్ను పోగొట్టుకొనుసని తైత్తిరీయము. అదిగనుకనే "తస్మాత్ యుగ్మాసు పుత్రార్థీ సంవిశేదార్తవే స్త్రియమితి" పుత్రులను గోరెడివారు ఋతుదినములలో సమరాత్రులనే స్త్రీని బొందవలయునని వక్ష్యమాణమగునిది యీశ్రుతిమూలము గాగలదని తోచబడుచున్నది. "కామజానితరాన్విదురితి" యొకకుమారుడు పుట్టిన మీద జనించినవు

తుప్రోలను కామజులని కనబడుటవలన నజాతిఘ్నత్వమునకే యానియమము ॥ తుః॥ "న శాస్యాం పుత్రానాధేహీతి" యాస్త్రీయందు పనిగాని ఘాతములను గలుగజేయుట యను నది బహుళః శ్రుత్యే ప్రశంసాపరము గాని జాతఘ్నత్వమున్ను ఋతుకాలగమననియ మము పనిగానియమున్ను లేదు॥ *

శ్లో॥ "స్వదారనిరతస్సదేతి" నిత్యమున్ను స్వదారయందే సంతుష్టుడై ఇతరుని భార్యను పొందగూడదను వాక్యమునకా నర్థవాక్యమువలన పరిసంఖ్యావిధిన్ని సవర్ణాగమనము ప్రశస్తమాటచే ఋతుస్నానమునూవలెను అగమనమునకు దోషము వినబడకపోవుటవలన నియమవిధి గాదు. "పర్వవర్జం వ్రజేచ్చైనామితి" అమావాస్యాది పర్వములనువిడచి భార్యాప్రీతి వ్రతముగాగలవాడు ఋతుకాలముగానప్పుడున్ను పొందవలెనని గావుననే రతికామ్యయా యనుటచే పుత్రోత్పాదక శాస్త్రబుద్ధిచే గాదని యందువలన ఋతుకాలమందు స్త్రీనిపొందవలెనన్యే వే ఇతరుని భార్యను పొందగూడదు ఋతువులేనప్పుడును భార్యాప్రీతికై పొందవలెననుటచే నిది విధిన్నియమమున్ను॥ *

శ్లో॥ "ఋతావుపేయాదన్యత్రాచ పర్వవర్జమితి॥" *

పర్వములను విడచిఋతుకాలమందును - నితరకాలమందును పొందవచ్చునని గౌతమవచనము॥

శ్లో॥ "యథాకామీ భవేద్వాపి స్త్రీణాం వరమనుస్మరన్నితి॥"

స్త్రీలయొక్క వరమునుస్మరించుకొని కామానుసారికావలెనని- పర్వవర్జనును నఋతువునందు కానప్పుడును సంబంధించుచున్నది॥ ౪౫॥

మూ॥ ఋతుస్స్వాభావికస్స్త్రీణాం రాత్రయష్షోడశస్స్మృతాః।
చతుర్భిరితరైస్సార్ధమహోభిస్సద్విగర్హితైః॥ ౪౬॥

ఇచ్చట రాత్ర్యహశ్శబ్దము లహోరాత్రపరములు- శోణితదర్శనము మొదలు కొని స్త్రీసంపర్కగమనాదివిషయమై శిష్టనిందితములగు నాలుగుదినములతో కూడ బదియారు దినములు ఋతుదినము లనబడును స్త్రీలకిది పరిసెలయందున్న స్వభావముచేనగును న్యూనాధికసమయములయందైనచో రాగాదికమువలననని దెలియవలయును॥ ౪౬॥

మూ॥ తాసామాద్యాశ్చతస్రస్తు నిందితైకాదశీచయా। త్రయోద

శీవశేషాస్తు ప్రశస్తాదశరాత్రయః॥ ౪౭॥

ఆపదియాఱురాత్రులలో శోణితదర్శనప్రభృతిమొదటి నాలుగురాత్రులును పదోకండు పదమూడవరాత్రులును స్త్రీగమనవిషయమైనిందితములు మిగిలినపదిరాత్రులు ప్రశస్తములు॥ ౪౭॥

మూ॥ యుగ్మాసుపుత్రాజాయంతేస్త్రియోఽయుగ్మాసురాత్రిషు।
తస్మాద్యుగ్మాసుపుత్రార్థీ సంవిశేదార్తవేస్త్రియం॥౪౮॥

ఆ పదిరాత్రులయందును యుగ్మరాత్రులయందు గర్భోత్పత్తియైన పుత్రులును అయుగ్మ రాత్రులయందు పుత్రికలును జన్మించెదరదిగావున పుత్రార్థియగువాడుయుగ్మరాత్రులయందుభార్యను బొందవలయును॥ ౪౮॥

మూ॥ పుమాన్ పుంసోధికేశుక్లే స్త్రీభవత్యధికేస్త్రియాః।సమేఽ
పుమాన్ పుంస్త్రియౌవా క్షీణేల్పేచవిపర్యయః॥ ౪౯॥

పురుషునిబీజముశుక్లమధికమైనని బేసిరాత్రులయందైనను పుత్రుడుజన్మించును స్త్రీబీజముశోణితమధికమయ్యేనేని సమరాత్రులయందునైన స్త్రీలుపుట్టెదరు స్త్రీపురుషుల బీజములు తుల్యములేని నపుంసకులు జన్మింతురు స్త్రీపురుషద్వంద్వమైనం బుట్టు నుభయబీజములును క్షీణములయ్యేనేని గర్భోత్పత్తికాకపోవును గావున పుత్రునిగోరు పురుషుడాహారాదికముచే శుక్లవృద్ధిగలుగునట్లున్ను స్త్రీలకాహారాది నియమముచే శోణితవృద్ధిగాకుండునట్లున్నునై ఋతుదినములలో యుగ్మరాత్రుల యందు గర్భాధానము జేయవలయు॥ ౪౯॥

మూ॥ నింద్యాస్వష్టాసుచాన్యాసు స్త్రియోరాత్రిషు వర్జయన్।
బ్రహ్మచార్యేవభవతి యత్రతత్రాశ్రమేవసన్॥ ౫౦॥

మున్ను నింద్యములనిచెప్పబడిన యాఱురాత్రులయందున్ను మరియేవైననింద్యములగు నెనిమిదిరాత్రులయందును స్త్రీలనువర్జించి యాపదునాలుగుగాకనున్న రెండురాత్రులను బర్వవర్జముగ స్త్రీనిబొందుచు నఖండితబ్రహ్మచారియే యగుచున్నాడు యేయేయాశ్రమమందుండుచున్నను అని యనుట వానప్రస్థాశ్రమాపేక్షచేనని యందు భార్యతోగూడ గమనముగల పక్షములో ఋతుగమనము ప్రసక్తమనికు

ల్లూకభట్లు- మరిన్ని వనస్థునిభార్యకు ఋతుకాలముండదే మోయని శంకవలదు॥ ః

శ్లో॥ "వనంపంచాశతోవ్రజేదితి॥" యేబదివర్షములపయిని వనమునకు బోవలయునని యుండుటచేత॥ *

శ్లో॥ "వర్షైరేకగుణాంభార్యా ముద్వహేత్త్రిగుణఃపుమాన్॥" . *

అనువచనముచే నూహించిన ఋతుసంభవముండుటకు సందియములేదు॥ ఇచ్చట గార్హస్థ్యేతరములగు మూడాశ్రమములలోను జితేంద్రియుడు గావలెననువిధివలన దినద్వయాభ్యనుజ్ఞ సంభవించక పోవడమువలన యత్రతత్రాశ్రమేవసన్నునని యనువాదమాత్రమని మేధాతిథివ్రాసెను॥ గోవిందరాజైతే యేయాశ్రమమందుండిన నుత్పన్నపుత్రుడిచ్ఛచే బుత్రార్థమై రాత్రిద్వయగమన మొనర్చినదోషములేదని చెప్పుటకిదియనియు "యత్రతత్రాశ్రమేవస" న్ననువచనమువలన పుత్రార్థీసంవిశేదనునది ప్రస్తుతమగుటవలననున్న పుత్రుడు మహిమాదయకరుడగుటవలననసివ్రాసెను. ఈవ్యాఖ్యను నిందించికుల్లూకభట్లొకశ్లోకమునువ్రాసెను॥

శ్లో॥ "హంతగోవిందరాజేన విశేషమవివృణ్వతా । వ్యక్తమంగీకృతమృతౌ స్వదారసురతంయతేః॥" *

ఆశ్చర్యము విశేషము వివరించలేని గోవిందరాజుచే ఋతుకాలమందు స్వదారసురతము యతికిస్పష్టముగ నంగీకరించబడెను॥ ౫౦॥

మూ॥ నకన్యాయాః పితావిద్వాన్ గృహ్ణీయాచ్ఛుల్కమణ్వపి। గృహ్ణంచ్ఛుల్కంహి లోభేన స్యాన్నరోపత్యవిక్రయీ॥ ౫౧॥

ధనగ్రహణదోషజ్ఞుడగు కన్యక తండ్రి కొంచెమైన శుల్కమునుబుచ్చికొనగూడదు ధనలోభముచే శుల్కమునుబుచ్చికొనెనేని సంతానము నమ్ముకొనినవాడగుచున్నాడు॥ ౫౧॥

మూ॥ స్త్రీధనానితుయే మోహా దుపజీవంతి బాంధవాః। నారీయానాని వస్త్రంవా తే పాపా యాంత్యధోగతిం॥౫౨॥

కన్యా శుల్కగ్రహణనిషేధమువలన నవమాధ్యాయోక్తస్త్రీధనగ్రహణనిషే

ధమిది - స్త్రీకిబంధువులగు నెవరైన ననగాపతిపిత్రాదులు మోహముచే స్త్రీసంబంధమైన యానములు వస్త్రములు మొదలగు ధనములను హరించి బ్రదుకుదురో యాపాపాత్ములు నరకమును బొందుదురు॥ ౫౨॥

మూ॥ ఆర్షే గోమిథునం శుల్కం కేచిదాహు ర్మృషైవతత్।
అల్పోప్యేవం మహాన్వాపి విక్రయస్తావ దేవసః॥ ౫౩॥

ఆర్షవివాహమందు గోమిథునము శుల్కముగా కొందరాచార్యులుచెప్పిరి ఆ గోమిథునము స్వల్పధనసాధ్యమైన నంతమాత్రముచే నది విక్రయమేయగుచున్నది మున్నెది యొకగోమిథునమని చెప్పబడెనో యది పరమతమని గోవిందరాజు వ్రాసెను కుల్లూకభట్టుకాదని మనుమతమందు ఆర్షలక్షణములేకనే పోవును వరుని వలన నొకగోమిథునమునుగాని రెండింటినిగాని బుచ్చికొని కన్యనిచ్చిన నార్షమని చెప్పిన మనువచనముపరమతమైతే ఆర్షవివాహజాతసంతతికి ఫలమునుగూడ చెప్పిన మనువార్షవివాహలక్షణము చెప్పలేకపోయనో యెనిమిది వివాహములని జెప్పిన మనువుస్వమతమందార్ష వివాహలక్షణము జెప్పకుండిన నట్లుసరిపడును- ఇచ్చట మేధాతిథిపూర్వాపర విరోధోపన్యాస నిరాసమే చేయడాయెను గావునమే మిట్లు వ్యాఖ్యానము జేయుచున్నాము ఆర్షవివాహమందు గోమిథునశుల్కము ప ధారూపమని కొందరాచార్యులు చెప్పుచున్నారు ఇదిమనుమతముగాదు మఱేమనిన॥

"శ్లో॥ వరాదాదాయ ధర్మతః"॥

యని చెప్పుటవలన ధర్మముకొఱకుగాని లోభముచే గాదని పౌర్వాపర్య విచారముచే ఆర్షేగోమిథునం గ్రాహ్యమనిధర్మముచేగాని భోగార్థముగాదని మనువుచేత నిర్ణీతమాయెనని కుల్లూకభట్టు॥ ౫౩॥

మూ॥ యాసాం నాదదతేశుల్కం జ్ఞాతయో నస విక్రయః। అ
ర్హణం తత్కుమారీణా మానృశంస్యంచ కేవలం॥౫౪॥

ఆర్షమందు గోమిథునము శుల్కమని చెప్పె నిప్పుడు కన్యార్థమై ధనమిచ్చుటగూడ శుల్కముగాదని చెప్పుచున్నాడు - ఏకన్యకకు బ్రీతిచే నీబడినధనమునుదండ్రిమొదలగువారు స్వీకరించకున్న నదివిక్రయముగాదు విధికారణమున కన్యకలకు సత్కారరూపమగు నదికేవలమను కంపాప్రధానమె॥ ౫౪॥

మూ॥ పితృభిర్భ్రాతృభిశ్చైతాః పతిభిర్దేవరైస్తథా । పూజ్యా
భూషయితవ్యాశ్చ బహుకల్యాణ మీప్సుభిః॥ ౫౫॥

వివాహకాలమందు వరునిచేతనే ధనమివ్వదగనదని గాను అనంతరమందున్న బహుమంగళములను గోరెడి పితృభ్రాతృపతి దేవరాదులచే కన్యకలు భోజనవస్త్రాలంకారాదులొసగ పూజించి యలంకరింపందగినవారు॥ ౫౫॥

మూ॥ యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః। యత్రై
తాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః॥ ౫౬॥

ఏకులమందు స్త్రీలు పిత్రాదులచే సత్కరించబడుదురో యాకులమందు దేవతలు ప్రసన్నులగుదురు మేకులమందు సత్కరించబడరో యచ్చట దేవతా ప్రసన్నత లేనందున యాగాదికర్మములు నిష్ఫలములగుచున్నవి॥ ౫౬॥

మూ॥ శోచంతి జామయోయత్ర వినశ్యత్యాశు తత్కులం। నశో
చంతితు యత్రైతా వర్ధతే తద్ధిసర్వదా॥ ౫౭॥

జామిశబ్దార్థము కుల స్త్రీలు ఏకులమందు సోదరీపుత్రికాసమీపసపిండస్త్రీలునుభార్యాస్నుషాదులునగు స్త్రీలును దుఃఖించుచుందురో యాకులము శీఘ్రముగ నిర్ధనమైపోవును దైవపీడయు రాజపీడయు గలుగును మెచ్చట నాస్త్రీలుసంతోషించుచునుందురో యచ్చట ధనాదిసమృద్ధిగలిగయుండును॥ ౫౭॥

మూ॥ జామయోయానిగేహాని శపంత్యప్రతిపూజితాః। తానికృ
త్యాహతానీవ వినశ్యంతిసమంతతః॥ ౫౮॥

భగినీదుహితృస్నుషాదులగు స్త్రీలు పూజితలు గాక మేకులములను శపింతురో యాకులములాభిచారికోత్పన్నశక్తిచే నెట్లు నాశమునొందునట్లునశించి యాకులములు చెడిపోవును॥ ౫౮॥

మూ॥ తస్మాదేతాస్సదాపూజ్యా భూషణాచ్ఛాదనాశనైః। భూ
తికామైర్నరైర్నిత్యం సత్కారేషూత్సవేషుచ॥ ౫౯॥

అదిగావున నీభగినీప్రభృతులగు స్త్రీలైశ్వర్యకాములగు నరులచే బంధుగుల

యందును వివాహాద్యుత్సవములయందును వస్త్రాలంకారభోజనాదులచే సత్కరింపదగినవారు॥ ౫౯॥

మూ॥ సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యాతథైవచ।
యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్రవైధ్రువం॥ ౬౦॥

ఏకులమందు రూపశీలాదిసంపన్నయగు భార్యచే భర్తయున్ను స్త్ర్యంతరాపేక్షలేక ప్రేమించుభర్తచే భార్యయున్ను సంతుష్టులగుచుందురో యాకులమనగా పుత్రపౌత్రాది సంతతితోనిత్యమగు కల్యాణము నొందియొప్పును॥ ౬౦॥

మూ॥ యదివాస్త్రీనరోచేత పుమాంసం నప్రమోదయేత్ । అ
ప్రమోదాత్పునః పుంసః ప్రజనం నప్రవర్తతే॥ ౬౧॥

ఇకకూడదీప్త్యర్థకమురుచి॥ వస్త్రాభరణాదికముచేస్త్రీశోభగలదిగాకుండిన తన భర్తను సంతోషింప జేయనేలేదు సంతుష్టుడుగాని భర్తచే గర్భధారణముగానేరదు॥ ౬౧॥

మూ॥ స్త్రియాంతు రోచమానాయాం సర్వం తద్రోచతేకులం।
తస్యాం త్వరోచమానాయాం సర్వమేవనరోచతే॥ ౬౨॥

స్త్రీమండనాదికముచే ప్రకాశించుచున్న భర్తృప్రీతిచేసన్యపురుషేచ్ఛబుట్టకుండుట నాకులమంతయుం బ్రకాశించును స్త్రీప్రకాశించకుండిన భర్తృప్రీతిలేకుండునందువలన నరాంతరేచ్ఛబుట్టినందువలన నాకులమంతయు మలినమగును॥ ౬౨॥

మూ॥ కువివాహైః క్రియాలోపై ర్వేదానధ్యయనేనచ । కులాం
న్యకులతాంయాంతి బ్రాహ్మణాతిక్రమేణచ॥ ౬౩॥

యథావర్ణముగ నిషిద్ధములగు నాసురాదివివాహములచేతనున్ను జాతకర్మాదిక్రియాలోపములచేతనున్ను వేదముజదవకపోవడముచేతనున్ను బ్రాహ్మణపూజాభావముచేతనున్ను కులములపకర్షనుబొందును॥ ౬౩॥

మూ॥ శిల్పేనవ్యవహారేణ శూద్రాపత్యైశ్చ కేవలైః।గోభిరశ్వై
శ్చయానైశ్చ కృష్యారాజోపసేవయా॥ ౬౪॥

కలాభ్యాసముగ చిత్రకర్మాదిశిల్పముచేతనున్ను ధనార్జనోపాయ వ్యవహారము చేతనున్ను కేవల శూద్రసంతానముచేతనున్ను గోవులను గుఱ్ఱములనుకొని యమ్మడముచేతనున్ను కృషిచేతనున్ను రాజసేవచేతనున్ను కులములు శీఘ్రముగనశించును॥ ౬౪॥

మూ॥ అయాజ్య యాజనైశ్చైవ నాస్తిక్యేనచ కర్మణాం। కులా
న్యాశువినశ్యంతి యాని హీనాని మంత్రతః॥ ౬౫॥

వ్రాత్యాదులకు యజ్ఞాదికర్మములు చేయించడనుచేతనున్ను శాస్త్రీయములగు కర్మములకు ఫలములేదనేది నాస్తిక్యము దీనిచేతనున్ను యేకులములు వేదాధ్యయనము లేకనున్నవో యందుచేతను నట్టికులములు శీఘ్రముగనశించును॥ ౬౫॥

మూ॥ మంత్రతస్తుసమృద్ధాని కులాన్యల్పధనాన్యపి। కులసంఖ్యాం
చగచ్ఛంతి కర్షంతిచ మహద్యశః॥ ౬౬॥

వివాహప్రకరణమందు కువివాహనిందా ప్రసంగముచే క్రియాలోపాదులు నిందించబడె నానిందచే నవిచేయకూడదని నిషేధమందు తాత్పర్యమట్టి కులనిందాప్రసంగముచే నిప్పుడు కులోత్కర్షము నుపన్యసించుచున్నాడు.విచారించగాధనముచే కులము వన్నెకెక్కదని యుండెనైనను స్వల్పధనముగలవైనను వేదపఠనతదర్థజ్ఞాన విహితానుష్ఠాన ప్రసక్తములగు కులములు సత్కులగణనమందు గణ్యములగును గొప్పఖ్యాతితోకూడ గలవగును॥ ౬౬॥

మూ॥ వైవాహికేగ్నౌ కుర్వీత గృహ్యంకర్మ యథావిధి। పంచ
యజ్ఞ విధానంచ పక్తించాన్వాహికీం గృహీ॥ ౬౭॥

వివాహప్రకరణముచే నిప్పుడు వివాహాగ్నియందు జేయదగిన పంచయజ్ఞములను జెప్పుచున్నాడు. వివాహకాలమందు సంపాదితమగు నగ్నియందు గృహ్యములగు సాయంప్రాతర్హోమము నష్టకాదికమును పంచయజ్ఞాంతర్గత వైశ్వదేవప్రముఖకర్మకలాపమునున్ను ప్రతిదినకర్తవ్య పాకాదికమునున్ను గృహస్థుడు చేయవలయును॥ ౬౭॥

మూ॥ పంచసూనా గృహస్థస్య చుల్లీపేషణ్యుపస్కరః। కండనీ

చోదకుంభశ్చ బధ్యతేయాశ్చవాహయన్॥ ౬౮॥

సూనాశబ్దమునకు వధస్థానమర్థము అట్టివేగావున నీమైదున్ను సూనాఖ్యను బొందెను పొయ్యియున్ను సన్నికల్లుపొత్రము చీపురు మొదలగు గృహోపస్కరణములు రోలున్ను రోకలియున్ను నీళ్ళబిందెయున్ను నీమైదింటినిన్ని తత్తత్కార్యములందువినియోగించుచున్న గృహస్థుడు పాపముచే బద్ధుడగును॥ ౬౮॥

మూ॥ తాసాంక్రమేణ సర్వాసాం నిష్కృత్యర్థం మహర్షిభిః।
పంచక్లృప్తామహాయజ్ఞాః ప్రత్యహం గృహమేధినాం॥౬౯॥

ఆచుల్ల్యాదిస్థానములకు నిష్కృతికొరకనగా వాటివలనబుట్టిన పాపనాశనము కొరకు క్రమమునుగా గృహస్థులకు పంచమహాయజ్ఞములను బ్రత్యహమునుం జేయదగనవిగాను మన్వాదులు నిర్ణయించిరి. ఇట్లగుటచే నిష్కృత్యర్థమనిచెప్పటవలన పంచసూనములకు పాపహేతుత్వమున్ను ॥ శ్లో ॥ "సూనాదోషైర్నలిప్యతే"యని చెప్పగలదగుటవలన పంచమహాయజ్ఞములకా పాపనాశకత్వమున్ను దోచుచున్నది-ప్రతిదినమందును పాపక్షయముగావలసినదేగావున సంధ్యావందనమువలె నీయజ్ఞములు నిత్యములగుటకు విరోధమేమియులేదు॥ ౬౯॥

మూ॥ అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తుతర్పణం। హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞోఽతిథిపూజనం॥ ౭౦॥

అధ్యాపనమనగా నధ్యయనము బ్రహ్మయజ్ఞము-జలాదికముచే దర్పణము పితృయజ్ఞము-హోమము దేవయజ్ఞము-బలి భూతయజ్ఞ-మతిథిపూజ మనుష్యయజ్ఞము- వీటికి మహచ్ఛబ్ద యజ్ఞశబ్దములు స్తుత్యర్థమై గౌణములు॥ ౭౦॥

మూ॥ పంచైతాన్యోమహాయజ్ఞాన్నహాపయతిశక్తితః। సగృహే పివసన్నిత్యం సూనాదోషైర్నలిప్యతే॥ ౭౧॥

పంచమహాయజ్ఞములను శక్త్యనుసారముగా ననుటచే ననుకల్పముగానైన నివి జేయదగనననుట వీటిని విడువక నెవడు జేయుచుండునో యతండు గృహమందుండినను సూనాదోషములను బొందడు॥ ౭౧॥

మూ॥ దేవతాతిథిభృత్యానాం పిత్రూణామాత్మనశ్చయః। నని

ర్వసతి పంచానా ముచ్ఛ్వస న్నసజీవతి॥ ౭౨॥

దేవతలకు భూతములకున్ను నతిథులకున్ను భృత్యులనగా దనచే బోషింపదగిన వృద్ధమాతృపితృత్రాదులు వీరికిన్ని పితృదేవతలకు నాత్మనః యనగా సర్వతఏవాత్మా నం గోపాయేత యను శ్రుతివలన తనరక్షణ మావశ్యకము గావున నీజెప్పబడిన వారందరికి నన్నమునిడనివాడు శ్వాసవిచ్చుచున్నప్పటికిని బ్రతికియున్నవాడు గాడని నించచే వీటికి నవశ్యకర్తవ్యత్వము బొందించబడుచున్నది॥ ౭౨॥

మూ॥ అహుతంచహుతంచైవ తథాప్రహుతమేవచ। బ్రాహ్మ్యం హుతంప్రాశితంచ పంచయజ్ఞాన్ ప్రచక్షతే॥ ... ౭౩॥

పంచమహాయజ్ఞములకు నితరమునులచే జేయబడ్డిన సంజ్ఞాంతరముల నహుతాదులనుచా జెప్పెను॥ ౭౩॥

మూ॥ జపోఽహుతోహుతో హోమః ప్రహుతోభౌతికోబలిః। బ్రాహ్మ్యం హుతం ద్విజాగ్ర్యార్చా ప్రాశితం పితృతర్పణం॥ ౭౪॥

అహుతమనగా బ్రహ్మయజ్ఞరూపమగు జపము హుతమనగా దేవయజ్ఞరూపమగు హోమము ప్రహుతమనగా భూతబలి బ్రాహ్మ్యహుతమనగా బ్రాహ్మణశ్రేష్ఠులపూజ ప్రాశితమనగా పితృయజ్ఞాఖ్యమగు నిత్యశ్రాద్ధము॥ ౭౪॥

మూ॥ స్వాధ్యాయేనిత్యయుక్తస్స్యాద్దైవేచైవేహకర్మణి। దైవేకర్మణియుక్తోవా బిభర్తీదంచరాచరం॥ ౭౫॥

దారిద్ర్యముచే నతిథిభోజనాదికమందు శక్తుడు గాకుండినచో బ్రహ్మయజ్ఞమందును హోమమందునున్ను నిత్యయుక్తుడు గావలయును. హోమమును స్తుతించుచున్నాడు ఎవ్వడుదైవకర్మమందు నిరతుడగు నతండు చరాచరయుక్తమగు ప్రపంచమును బోషించుచున్నాడు॥ ౭౫॥

మూ॥ అగ్నౌప్రాస్తాహుతిస్సమ్యగాదిత్యముపతిష్ఠతే। ఆదిత్యాజ్జాయతేవృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః॥ ౭౬॥

యజమానునిచే నగ్నియందు వేల్చబడిన యాహుతిరసాహరణకారిగా నాది

త్యాసై బొందునయ్యాహుతిరసమాదిత్యుని వలన వృష్టిరూపమగును వృష్టివలన న
న్నముత్పన్న మగుచున్నది తదుపభోగముచే ప్రజలు పుట్టుచున్నారు॥ ౭౬॥

మూ॥ యథావాయుంసమాశ్రిత్య వర్తంతేసర్వజంతవః। తథా
గృహస్థమాశ్రిత్య వర్తంతెసర్వఆశ్రమాః॥ ౭౭॥

ఏరీతిని ప్రాణాఖ్యవాయువు నాశ్రయించి ప్రాణులు జీవించుచున్నారో య
ట్లు గృహస్థునాశ్రయించి యితరాశ్రమనుల వారందరును జీవించుచున్నారు॥ ౭౭॥

మూ॥ యస్మాత్త్రయోప్యాశ్రమిణో జ్ఞానేనాన్నేనచాన్వహం।
గృహస్థేనైవధార్యంతే తస్మాజ్జ్యేష్ఠాశ్రమోగృహీ॥ ౭౮॥

ఏకారణమున గృహస్థవ్యతిరిక్తాశ్రమములవారు ముగ్గురున్ను వేదార్థవ్యా
ఖ్యానాన్నదానములచే ప్రతిదినమును గృహస్థునిచేతనే ధరింపబడుచున్నారో ఆ
కారణమువలన గృహస్థుడు జ్యేష్ఠాశ్రముడు జ్యేష్ఠమగునాశ్రమముగలవాడు॥ ౭౮॥

మూ॥ ససంధార్యఃప్రయత్నేన స్వర్గమక్షయమిచ్ఛతా। సుఖం
చేహేచ్ఛతానిత్యం యోఽధార్యోదుర్బలేంద్రియైః॥ ౭౯॥

అది గావున నాగృహస్థాశ్రమము అక్షయమనగా చిరకాలముండునట్టి స్వ
ర్గసుఖమును నీలోకమందగు స్త్రీసంభోగ భోజనాదిసౌఖ్యమునున్ను గోరునతని
చే ప్రయత్నమున లెస్సగననుష్ఠానముచే నవలంబించదగును దుర్బలులచే నింద్రి
యపాటవము లేనివారిచే నిదిసంధార్యము గాదు॥ ౭౯॥

మూ॥ ఋషయఃపితరోదేవా భూతాన్యతిథయ స్తథా। ఆశాస
తేకుటుంబిభ్య స్తేభ్యఃకార్యంవిజానతా॥ ౮౦॥

ఋషులును పితరులును దేవతలును భూతములు నతిథులును గృహస్థుల వలన
నుపకారమును గోరుదురు గావున దెలిసిన గృహస్థుడు వారికుపచరించ వల
యును॥ ౮౦॥

మూ॥ స్వాధ్యాయేనార్చయేతర్షీన్ హోమైర్దేవాన్యథావిధి।
పితౄన్ శ్రాద్ధైశ్చ నౄనన్నై ర్భూతానిబలికర్మణా॥ ౮౧॥

అర్చన లనేకప్రకారములు గావున ఋషిదేవపితృమనుష్యభూతములను క్రమముగా విధ్యుక్త స్వాధ్యాయ హోమశ్రాద్ధాన్న బలిహరణములచే నర్చించవలయును॥ ౮౧॥

మూ॥ కుర్యాదహరహశ్శ్రాద్ధ మన్నాద్యేనోదకేన వా । పయో
మూలఫలైర్వాపి పితృభ్యః ప్రీతిమావహన్॥ ౮౨॥

అందు పితృయజ్ఞమును జెప్పుచున్నాడు అన్నాదులచేత ననగా తిలవ్రీహియవాదులచేత నైనను జలముచేనైనను పాలచేనైనను కందమూలఫలాదులచే నైన పితృప్రీతికరముగ ప్రతిదినమును శ్రాద్ధమును జేయవలయును॥ ౮౨॥

మూ॥ ఏకమప్యాశయేద్విప్రం పిత్రర్థే పాంచయజ్ఞికే । న చైవా
త్రాశయేత్కించి ద్వైశ్వదేవం ప్రతి ద్విజం॥ ౮౩॥

పంచయజ్ఞాంతర్గతశ్రాద్ధ పితృప్రయోజనమం దొకనినైన నపిశబ్దముచే సంభవమందు బహుమందినైన బ్రాహ్మణభోజనమును జేయించవలయు వైశ్వదేవార్థమయి బ్రాహ్మణభోజన మక్కఱలేదు॥ ౮౩॥

మూ॥ వైశ్వదేవస్య సిద్ధస్య గృహ్యేగ్నౌ విధిపూర్వకం । ఆభ్యః కు
ర్యాద్దేవతాభ్యో బ్రాహ్మణో హోమమన్వహం॥ ౮౪॥

సకలదేవతల కొరకు నయ్యెదిగావున వైశ్వదేవమనిరి దానికి ఆవసథ్యాగ్నియందుసిద్ధమగు నన్నముచే నీచెప్పబోయెడి దేవతలకందరికిని స్వగృహ్యోక్తప్రకారముగ హోమము బ్రాహ్మణుడు నిత్యమును జేయవలయును బ్రాహ్మణశబ్దముచే ద్విజులకని ప్రకరణము వలన జెప్పవలయును॥ ౮౪॥

మూ॥ అగ్నేస్సోమస్య చైవాదౌ తయోశ్చైవ సమస్తయోః । వి
శ్వేభ్యశ్చైవ దేవేభ్యో ధన్వంతరయ ఏవ చ॥ ౮౫॥

హోమమన స్వాహాకారముచే నిచ్చుట కాత్యాయనస్మృతిచే ముందుగ నగ్నయేస్వాహా సోమాయస్వాహా॥౨॥అగ్నీషోమాభ్యాంస్వాహా॥ ౩ ॥ విశ్వేభ్యోదేవేభ్యస్స్వాహా॥౪॥ ధన్వంతరయేస్వాహా॥ ౫॥

మూ॥ కుహ్వైచైవానుమత్యై చ ప్రజాపతయ ఏవ చ । సహ

ద్యావా పృథివ్యోశ్చ తథాస్విష్టకృతే తతః॥ ౮౬॥

కుహ్వైస్వాహా॥౬॥ అనుమత్యైస్వాహా॥౭॥ ప్రజాపతయేస్వాహా॥ ౮ ॥ద్యావాపృథివీభ్యాంస్వాహా॥౯॥ అగ్నయేస్విష్టకృతేస్వాహా॥ ౧౦ ॥ అని యీపదియాహుతులను వ్రేల్చవలెను - యీశ్లోకమందు "స్విష్టికృతేయని॥" మాత్రమేయున్నప్పటికిని శ్రుత్యంతరమందగ్నివిశేషణముతో "స్విష్టకృద్ధోమరయోగ॥" మని చెప్పుటచేనిట్లువ్రాయబడెనని కుల్లూకభట్టు॥ ౮౬॥

మూ॥ ఏవం సమ్యగ్ఘవిర్హుత్వా సర్వదిక్షు ప్రదక్షిణం। ఇంద్రాంతకాప్పతీందుభ్య స్సానుగేభ్యో బలింహరేత్॥ ౮౭॥

ఈప్రకారముగ లెస్సగాననగా ననన్యచిత్తుడై దేవతాధ్యానపరుడై హవిస్సునుహోమముచేసి ప్రదక్షిణముగా నాలుగుదిక్కులయందు పూర్వదిక్కునందునింద్రాయనమః ఇంద్రపురుషేభ్యోనమః యనిన్ని దక్షిణదిశను యమాయనమః యమపురుషేభ్యోనమః యనియు పశ్చిమమందు వరుణాయనమః వరుణపురుషేభ్యోనమఃయనియు నుదీచినిసోమాయనమః సోమపురుషేభ్యోనమః యనుచు బలులనుంచవలెను - శ్లోకమందైతే "నింద్రాంతకాప్పతీందుభ్యః॥" యని చెప్పుటవలన నామబ్దములచేతనే హోమముకావలెనుగానిబహ్వృచగృహ్యపాఠములో యమాయయమపురుషేభ్యో వరుణాయ వరుణపురుషేభ్య స్సోమాయ సోమపురుషేభ్య ఇతి ప్రతిదిశమనియుండుటవలన నట్లువ్రాయడమయ్యనది యని కుల్లూకభట్టు॥ ౮౭॥

మూ॥ మరుద్భ్య ఇతి తుద్వారి క్షిపేదప్స్వద్భ్య ఇత్యపి। వనస్పతిభ్య ఇత్యేవం ముసలోలూఖలే హరేత్॥ ౮౮॥

మరుద్భ్యోనమః యని ద్వారమందున్ను అద్భ్యః యని జలమందున్ను వనస్పతిభ్యః యని రోలు రోకలి వీటిలో నొకదానియందున్ను బలిహరణము జేయవలెను॥ ౮౮

మూ॥ ఉచ్ఛీర్షకే శ్రియైకుర్యా ద్భద్రకాళ్యైచ పాదతః। బ్రహ్మవాస్తోష్పతిభ్యాంతు వాస్తుమధ్యే బలింహరేత్॥ ౮౯॥

వాస్తుపురుషుని శిరఃప్రదేశమందు నీశానదిక్కున శ్రియైనమః యనిన్ని వాస్తుపు

రుషునిపాదదేశమందు నైరృతిదిక్కునందు భద్రకాళ్యైనమః యనియును వాస్తు మధ్యమందు "బ్రహ్మవాస్తోష్పతిభ్యాం" మని యిద్దరుదేవతలకుకలిపి యొకటే బలి ద్యావా పృథివీభ్యాం మనుదానికివలెను యిట్లు బలులుంచవలయును॥ ౮౯॥

మూ॥ విశ్వేభ్యశ్చైవ దేవేభ్యో బలిమాకాశ ఉత్క్షిపేత్ । దివా
చరేభ్యో భూతేభ్యో నక్తంచారిభ్య ఏవచ॥ ౯౦॥

"విశ్వేభ్యో దేవేభ్యః" యని గృహాకాశమందు నొకటేబలి మీదికి చిమ్మవల యును "దివాచరేభ్యో భూతేభ్యః॥" యని రాత్రిన్ని బలినుంచవలయును బహ్వృ చగృహ్యదర్శనమువలన నీవ్యవస్థ॥ ౯౦॥

మూ॥ పృష్ఠవాస్తుని కుర్వీత బలింసర్వాత్మ భూతయే । పితృభ్యో
బలిశేషంతు సర్వందక్షిణతోహరేత్॥ ౯౧॥

పృష్ఠవాస్తుయందనగ గృహముమీదనునైన గృహము భూమియందైనను సర్వా త్మభూతయేనమః॥" యని యీబలి నివ్వవలయును రక్తబలిదానావశిష్టమగు నం తయన్నమును దక్షిణదిక్కునందు దక్షిణాభిముఖుడై ప్రాచీనావీతి యగుచు స్వ ధాపితృభ్యః॥" యనిబలినుంచవలయును॥ సూ॥ " ప్రాచీనావీతీశేషం దక్షిణాభి ముఖో నినయేదని బహ్వృచగృహ్య వచనమువలన॥ ౯౧॥

మూ॥ శునాంచ పతితానాంచ శ్వపచాం పాపరోగిణాం। వా
యసానాం క్రిమీణాంచ శనకై ర్నిర్వపే ద్భువి॥ ౯౨॥

మిగిలినయన్నమును శ్వపతితశ్వపచ పాపరోగివాయస క్రిమ్యాదులకు భూ మియందు మెల్లగా భూమియొక్క ధూళియన్నమునంటకున్నట్లుమందముగా నుం చవలయును॥ ౯౨॥

మూ॥ ఏవం యస్సర్వ భూతాని బ్రాహ్మణోనిత్యమర్చతి । సగ
చ్ఛతి పరంస్థానం తేజోమూర్తిః పథర్జునా॥ ౯౩॥

ఈప్రకారముగ నేబ్రాహ్మణుడు సర్వభూతముల నన్నదానాదికములచే ని త్యమునర్చించునతండు బ్రహ్మాత్మకమగు పరమస్థానమును తేజస్స్వరూపుడై య

వక్రమగు నచిరారాదిమార్గముచే బొందును పరబ్రహ్మమందు గలయునని తాత్పర్యము - జ్ఞానకర్మములచే మోక్షప్రాప్తియగుననుటవలన॥ ౯౩॥

మూ॥ కృత్వైతద్బలికర్మైవ మతిథింపూర్వమాశయేత్। భిక్షాం
చ భిక్షవేదద్యా ద్విధివ ద్బ్రహ్మచారిణే॥ ౯౪॥

పైని చెప్పబడిన ప్రకారముగను బలికర్మమును జేసిగృహమందు భుజించు వారికంటే ముందుగా నతిథిని భుజింపజేయవలయును సన్యాసికిని బ్రహ్మచారికిని విధ్యుక్తముగ భిక్ష నొసగవలయును విధివదనగా "స్వస్తివాచ్య భిక్షాదాన మప్పూర్వ మితి" యను గౌతమాద్యుక్తవిధిచేసివలయునని "గ్రాసమాత్రాభవేద్భిక్షా"యను శాతాతపవచనము వలన నొకకబళప్రమాణమగు నన్నమును గలిగయుండిన నధికముగను నొసగవచ్చును॥ ౯౪॥

మూ॥ యత్పుణ్యఫలమాప్నోతి గాందత్వా విధివద్గురోః। తత్పు
ణ్యఫలమాప్నోతి భిక్షాందత్వాద్విజోగృహీ॥ ౯౫॥

రజతఖురస్వర్ణశృంగాది విధానముతో గురునకు గోవునిచ్చి యెట్టిపుణ్య ఫలమునొందునో భిక్షనొసగ గృహస్థుడగు ద్విజుండట్టి పుణ్యఫలమునొందును॥ ౯౫॥

మూ॥ భిక్షామప్యుద పాత్రంవా సత్కృత్య విధిపూర్వకం। వేద
తత్వార్థవిదుషే బ్రాహ్మణాయోప పాదయేత్॥ ౯౬॥

అన్నము సమృద్ధిగలేనియెడల గ్రాసప్రమాణభిక్షనైన వ్యంజనాది యుక్తముగ వేదతత్వార్థవేత్తయగు బ్రాహ్మణునకు విధ్యుక్తముగ నొసగవలయును. జలపూర్ణపాత్రమునైన పుష్పాదులచేనర్చించి యొసగవలయు॥ ౯౬॥

మూ॥ నశ్యంతి హవ్యకవ్యాని నరాణామవిజానతాం। భస్మీభూ
తేషు విప్రేషు మోహాద్దత్తాని దాతృభిః॥ ౯౭॥

పాత్రమును తెలియలేకుండుటవలన దేవపిత్రుద్దేశముచే వేదాధ్యయనతదర్థజ్ఞానానుష్ఠాన తేజశ్శూన్యులగుటవలన భస్మరూపులగు నపాత్రజనులకు దాతలచే నివ్వబడిన యన్నాదికములు నిష్ఫలములగుచున్నవి॥ ౯౭॥

మూ॥ ఏకరాత్రంతు నివస న్నతిథి ర్బ్రాహ్మణ స్స్మృతః। అనిత్యం హి స్థితో యస్మా త్తస్మాదతిథి రుచ్యతే॥ ౧౦౨॥

అప్రసిద్ధముగాని యతిథిలక్షణమును జెప్పుచున్నాడు॥ ఒకరాత్రిమాత్రము పరగృహమందుండుచున్న బ్రాహ్మణుడతిథి యనబడు ననిత్యముగనుండుటవలన రెండవ తిథిలేనివాడు గావున నతిథియనబడుచున్నాడు॥ ౧౦౨॥

మూ॥ నైకగ్రామీణ మతిథిం విప్రం సాంగతికం తథా। ఉపస్థితం గృహేవిద్యా ద్భార్యా యత్రాగ్నయోపివా॥ ౧౦౩॥

ఏకగ్రామనివాసినిన్ని లోకమందు విచిత్రములగు కథలు పరిహాసనులు మొదలగునవి చెప్పుచు సంగతిచే వృత్త్యర్థియగు నతనినిన్ని భార్యతోగూడ నగ్నిహోత్రములుండి గృహమందు వైశ్వదేవకాలమునకు వచ్చినప్పటికిన్ని యట్టి విప్రునతిథినిగా దెలియదగదు ఈచెప్పుటచే భార్యదగ్గిర లేక నగ్నిహోత్రములులేని పరదేశవాసియగు వానికి నతిథిత్వములేదని బోధితమాయెను॥ ౧౦౩॥

మూ॥ ఉపాసతే యే గృహస్థాః పరపాక మబుద్ధయః। తేన తేప్రేత్య పశుతాం వ్రజంత్యన్నాది దాయినాం॥ ౧౦౪॥

ఆతిథ్యమందగు లోభముచే యేగృహస్థులు గ్రామాంతరములకు బోవుచున్నైన పరపాకరతులై దోషబుద్ధిలేనివారై పరాన్నమును భక్షింతురో వారు జన్మాంతరమందా యన్నాదికమునొసగువారికి పశువులై పుట్టుదురుగావున పరాన్నము గూడదని యతిథిప్రకరణముచే నిషేధము కల్పించబడెను॥ ౧౦౪॥

మూ॥ అప్రణోద్యో తిథిస్సాయం సూర్యోఢో గృహమేధినా। కాలేప్రాప్త స్త్వకాలేవా నాస్యానశ్నన్ గృహేవసేత్॥

సూర్యుడస్తమించినవెనుక వచ్చిన యతిథిని బొమ్మనగూడదు సాయంవైశ్వదేవకాలమందుగాని భోజనకాల మతిక్రమించినబిమ్మటగాని వచ్చిన సూర్యోఢుడనగా సూర్యునిచే పంపించబడినవాడని యట్టియతిథి భుజించకుండ గృహస్థునింటనుండగూడదు రాత్రివచ్చిన యతిథికవశ్యమన్నమిడవలెనని యర్థము రాతిరన్నమిడకున్న బ్రాయశ్చిత్త గౌరవమని దీనియారంభమదిగావునసే॥

శ్లో॥ దివాతిథౌ తు విముఖే గతే యత్పాతకం నృప। తదేవాష్టగుణం ప్రోక్తం సూర్యోఢే విముఖే గతే॥ యః పగలు యతిథివిముఖుడై పోతే నే పాపమో రాత్రి యతిథివిముఖుడైన నెనిమిది రెట్లు కూడ పాపము గలుగునని యర్థము గోవిందరాజైతే ప్రతిషిద్ధాతిథినిషేధార్థమన్నారు॥ ౧౦౫॥

మూ॥ న వై స్వయం తదశ్నీయా దతిథిం యన్న భోజయేత్। ధన్యం
యశస్య మాయుష్యం స్వర్గ్యం వా తిథిపూజనం॥ ౧౦౬॥

ఘృతదధ్యాదికమగు నుత్కృష్టద్రవ్యమేది యతిథికి బెట్టడో యది తానున్ను దిన గూడదు అతిథిపూజ ధనమును కీర్తిని యాయుర్వును స్వర్గమును జేయును ॥ ఇది యతిథిపూజవలననగుఫలము॥ ౧౦౬॥

మూ॥ ఆసనావసథౌ శయ్యా మనువ్రజ్యా ముపాసనం। ఉత్త
మేషూత్తమం కుర్యాద్ధీనే హీనం సమే సమం॥ ౧౦౭॥

పీఠచర్మాద్యాసనము విశ్రమించుటకు స్థానము ఖట్వాదికము అంపకము బెట్టడము పూజ యీసర్వమున్ను బహుమంది అతిథులువచ్చినప్పుడు ఉత్తమమధ్యమాధములయందు తత్తదనుసారప్రకారముగా జేయవలయును నందరికి సమముగా జేయకూడదు॥ ౧౦౭॥

మూ॥ వైశ్వదేవేతు నిర్వృత్తే యద్యన్యోఽతిథిరావ్రజేత్। తస్యా
ప్యన్నం యథాశక్తి ప్రదద్యాన్న బలిం హరేత్॥ ౧౦౮॥

అతిథిభోజనపర్యంతమగు వైశ్వదేవను జరిగినబిమ్మట మరియొక యతిథివచ్చినట్లైతే వానికి యథాశక్తిగా పునఃపాకముచేసి యన్నమును బెట్టవలయును బలిహరణము మరిజేయవలదు॥ ౧౦౮॥

మూ॥ న భోజనార్థం స్వే విప్రః కులగోత్రే నివేదయేత్। భో
జనార్థం హి తే శంసన్ వాంతాశీత్యుచ్యతే బుధైః॥ ౧౦౯॥

భోజనలాభముకొరకు బ్రాహ్మణుడు తనకులగోత్రములను దెలియజేయగూడదు అట్లు దెలియజేసినయెడల కక్కినకూడు దినినవాడని పండితులచే జెప్పబడుచున్నాడు॥ ౧౦౯॥

మూ॥ న బ్రాహ్మణస్య త్వతిథి ర్గృహే రాజన్య ఉచ్యతే। వైశ్య
శూద్రౌ సఖాచైవ జ్ఞాతయో గురురేవచ॥ ౧౧౦॥

బ్రాహ్మణునిగృహమునకువచ్చిన క్షత్రియాదు లతిథులుగారు వారికంటె బ్రాహ్మణుడు తత్కృష్టుడౌటవలన ఆత్మసంబంధమువలన మిత్రులును జ్ఞాతులును ప్రభుడౌటవలన గురువున్ను నతిథులుగారు యీన్యాయముచేతనే క్షత్రియునకు తత్కృష్టుడైన బ్రాహ్మణుడున్ను సజాతీయుడగు క్షత్రియుడున్ను నతిథులగుచున్నారు క్షత్రియునకు వైశ్యశూద్రు లతిథులుగారు ఇటులే వైశ్యునకు ద్విజులుముగ్గురునతిథులగుచున్నారు గాని శూద్రుడతిథిగాడని కుల్లూకభట్టు॥ ౧౧౦॥

మూ॥ యది త్వతిథి ధర్మేణ క్షత్రియో గృహ మావ్రజేత్। భుక్త
వత్సుచ విప్రేషు కామం తమపి భోజయేత్॥ ౧౧౧॥

గ్రామాంతరమువలన నతిథికాలోపస్థితుడగు క్షత్రియు డతిథి ధర్మముచే విప్రగృహమునకువచ్చినట్లైతే నప్పటికి గృహమందున్న విప్రులందరును భుజించిన పిమ్మట నిచ్ఛవలన నాక్షత్రియునిన్ని భుజింపజేయవలయును॥ ౧౧౧॥

మూ॥ వైశ్యశూద్రావపి ప్రాప్తౌ కుటుంబేతిథి ధర్మిణౌ। భో
జయేత్సహభృత్యైస్తా వానృశంస్యం ప్రయోజయన్॥ ౧౧౨॥

బ్రాహ్మణగృహమునకు వైశ్యశూద్రులు గ్రామాంతరమువలననతిథిధర్మము గలవారైవచ్చినయెడల వారికిక్షత్రియభోజనమైనపిమ్మట గృహదంపతుల భోజనమునకు పూర్వము దాసాది భోజనకాలమందు కృపాప్రయోజనముగా నావైశ్యశూద్రులకన్నముబెట్టవలయును॥ ౧౧౨॥

మూ॥ ఇతరానపి సఖ్యాదీన్ సంప్రీత్యా గృహమాగతాన్। ప్ర
కృత్యాన్నం యథాశక్తి భోజయే దవిచారయన్॥ ౧౧౩

ఉక్తభోజనకాలమందు క్షత్రియాది వ్యతిరిక్తులగు సఖిసహాధ్యాయప్రభృతు లతిథిభావముచేగాక ప్రీతిచే గృహమునకువచ్చిరేని యథాశక్తిగా ప్రకృష్టమగు నన్నమును భార్యాభోజనకాలమందు వారికిని బెట్టవలయును॥ గృహస్థునకు స్వభోజనకాలము॥ "అవశిష్టంతుదంపతీ॥" యనిచెప్పగలదుగావునగురువులయొక్క-

భోజనకాలను చెప్పకపోవడము వారుప్రభువులగనుక స్వాధీనకాలులని॥ ౧౧౩॥

మూ॥ సువాసినీః కుమారీశ్చ రోగిణో గర్భిణీస్త్రియః। అతిథిభ్యో
గ్రఏవైతాన్ భోజయే దవిచారయన్॥ ౧౧౪॥

నవోఢలగు సువాసినీలకున్న చెల్లెళ్లు పుత్రికలు మొదలగు పిల్లలకును రోగుల కును గర్భిణీస్త్రీలకన్న నతిథులకు ముందుగ విచారము లేకుండ నన్నము బెట్ట వలయును ఇచ్చట మేధాతిథి అతిథిభ్యోనుమేతియనె పఠించి యతిథులతోగూడ బె ట్టవలయుననివ్రాసి అగ్రఏవైతానని కొందరి పాఠమనివ్రాసెను॥ ౧౧౪॥

మూ॥ అదత్వాతు య ఏతేభ్యో పూర్వం భుంక్తేఽవిచక్షణః। సభుం
జానో నజానాతి శ్వగృధ్రైర్జగ్ధిమాత్మనః॥ ౧౧౫॥

ఈ చెప్పబడిన యతిథిమొదలుకొని భృత్యులపర్యంతమగు వారి కన్నమిడక దా నినపలననగు దోషమునెరుంగని వాడైయెవడు వారికంటెముందుగదినునోయత డుమరణానంతరమునగృధ్రకుక్కురాదులు తనమాంసమునుదినునని యెరుంగనివా డుఅతిథ్యాదివ్యతిక్రమఫలమిదియనివచనవైదగ్ధ్యముచేజెప్పబడెను॥ ౧౧౫॥

మూ॥ భుక్తవత్స్వథ విప్రేషు స్వేషుభృత్యేషు చైవహి। భుంజీ
యాతాం తతః పశ్చాదవశిష్టంతుదంపతీ॥ ౧౧౬॥

అతిథులగు విప్రులుజ్ఞాతులుదాసాదులు భుజించిన పిమ్మట శేషించిన యన్నము నాదంపతులుభుజించవలయు॥ ౧౧౬॥

మూ॥ దేవా నృషీ న్మనుష్యాం శ్చ పితౄన్ గృహ్యాశ్చ దేవతాః। పూజ
యిత్వా తతః పశ్చాత్ గృహస్థ శ్శేషభు గ్భవేత్॥ ౧౧౭॥

దేవతలను ఋషులను మనుష్యులను పితరులను గృహ్యాననగా భూతములను లేదా దేవాననుట వలననే భూతములను జెప్పెడిచో గృహ్యాననుటచే గృహదేవ తార్చన వాసుదేవాది పంచాయతనపూజనమిట్లు పంచయజ్ఞ గృహదేవతార్చ నానంతరమందు గృహస్థుడు శేషము నారగించవలయును॥ ౧౧౭॥

మూ॥ అఘం స కేవలం భుంక్తే యః పచ త్యాత్మకారణాత్। యజ్ఞశి

ష్టాశనం హ్యేత త్సతా మన్నం విధీయతే॥ ౧౧౮॥

ఎవఁడు తన నిమిత్తమై వంటచేయించుకొని దేవాది నివేదన రహితముగ దిను నోయదిపాపహేతువుగాన కేవలపాపమునేతినెనదియన్నముగాదు॥ "శ్రు॥ కేవ లాదీ" యని ఏది కారణమున పాకయజ్ఞావశిష్టమగు నన్నమును జేసిని దింటున్నా డో యదే సాధుల కన్నమని యుపదేశించ బడుచున్నది॥ ౧౧౮॥

మూ॥ రాజర్త్విక్స్నాతకగురూన్ ప్రియశ్వశురమాతులాన్ ।
అర్చయేన్మధుపర్కేణ పరిసంవత్సరాత్పునః॥ ౧౧౯॥

మూర్ధాభిషిక్తులను తనకు యజ్ఞముజేయించిన ఋత్విజుని విద్యావ్రతస్నా తకుని గురువును ప్రియుని మామగారిని మేనమామను వీరినేద్వరనున్ను గృహ్యో క్తమగు మధుపర్కముచే బూజించవలెను తిరిగి సంవత్సరమునకుపైనివచ్చి న మరల మధుపర్కముచే బూజించవలెను- ఇచ్చట పరిసంవత్సరాననిపఠించియ తిక్రమించబడిన సంవత్సరముగల వారినని మేధాతిథివ్రాసెను యిదిన్ని సంవత్సర ములోపలవచ్చిన వారికి మధుపర్కపూజను జెప్పలేదు॥ ౧౧౯॥

మూ॥ రాజాచశ్రోత్రియశ్చైవ యజ్ఞకర్మణ్యుపస్థితౌ । మధు
పర్కేణ సంపూజ్యౌ నత్వయజ్ఞ ఇతిస్థితిః॥ ౧౨౦॥

రాజుకున్ను స్నాతకునకున్ను పూజాసంకోచార్థమైచెప్పుచున్నాఁడు॥ రాజు న్ను స్నాతకుడున్ను సంవత్సరమునకు పయినైనా యజ్ఞకర్మమందు వచ్చిరేని మధుపర్కముచే పూజకర్హులు యజ్ఞము వినామధుపర్కములేదు అల్లుడు మొ దలగువారైతే యజ్ఞములేకున్నను సంవత్సరము పయిని వచ్చిరేని మధుపర్కము చే పూజార్హులు సంవత్సరములోపున వచ్చిరేని యజ్ఞవివాహకర్మములందే యందరును మధుపర్కార్హులు॥ "సూ॥ ఋత్విగాచార్యశ్వశురపితృవ్యమాతులా నాముపస్థానేమధుపర్కస్సంవత్సరేపునర్యజ్ఞవివాహయోరర్వాక్ రాజ్ఞశ్శ్రోత్రియ స్యచేతి" ఋత్విక్కులు ఆచార్యుడు మామగారు పితృవ్యుడు మేనమామసంవత్సర మునకుపైనితిరిగివచ్చిరేనియు నీలోపున వివాహయజ్ఞములందును నెప్పుడువచ్చిన ను రాజుకు శ్రోత్రియునకునువివాహయజ్ఞములందుమాత్రమేమధుపర్కముచేబూ

జగావలయునని గౌతముడు॥ ౧౨౦॥

మూ॥ సాయంత్వన్నస్య సిద్ధస్య పత్న్యమంత్రం బలింహరేత్।వై
శ్వదేవంహినామైత త్సాయంప్రాత ర్విధీయతే॥ ౧౨౧॥

రాత్రియన్నము సిద్ధముగాగానే పత్నియమంత్రకముగ ననగా "నింద్రాయన మః॥" యనిమనస్సులోనుద్దేశించి నోటనుచ్చరించక బలినొసగదగును మానసికము నకు దోషములేదు॥ అన్నసాధ్యమగు వైశ్వదేవనామకమగు నీకర్మము గృహస్థు నకు సాయంప్రాతఃకాలములయందు హోమబలిదానాతిథి భోజనాత్మకమగు ని దియుపదేశించబడెను॥ ౧౨౧॥

మూ॥ పితృయజ్ఞంతు నిర్వర్త్య విప్ర శ్చంద్రక్షయే గ్నిమాన్।పిం
డాన్వాహార్యకం శ్రాద్ధం కుర్యా న్మాసానుమాసికం॥౧౨౨॥

అనుక్రమణికలో "శ్రాద్ధకల్పంచ శాశ్వత"మని ప్రతిజ్ఞాతమవ్వ్యగాననది యి ప్పుడు శ్రాద్ధకల్పము నుపక్రమించుచున్నాడు॥ అగ్నిమంతుడు ప్రతియమావాస్య యందును పిండపితృయజ్ఞమొనర్చి శ్రాద్ధముజేయవలయు పితృయజ్ఞపిండములన నుసరించి యననావెనుక నుదాహరించబడునదిగాన పిండాన్వాహార్యకమను శ్రాద్ధ ము ప్రతిమాసమందును విప్రుడు సేయవలయుగాన నిది నిత్యము విప్రపదనుచేద్వి జులకు మువ్వరకును ప్రకరణముచే నీవిధియగుచున్నది॥ ౧౨౨॥

మూ॥ పితౄణాం మాసికంశ్రాద్ధ మన్వాహార్యం విదుర్బుధాః।
తచ్చామిషేణ కర్తవ్యం ప్రశస్తేన ప్రయత్నతః॥ ౧౨౩॥

ఇప్పుడు నామనిర్వచనముచే నుక్తమగు పితృయజ్ఞానంతర్యమగు దానినే వృథ పరచుచున్నాడు॥ ప్రతిమాసమందును పితరులకు జేయదగిన యీశ్రాద్ధమునన్వా హార్యముగా బండితులు తెలియుచున్నారు. పితృయజ్ఞపిండముల ననుసరించి యవ లజేయునది గాన నన్వాహార్యమది వక్ష్యమాణమగు ప్రశస్తమాంసముచే నది ప్ర యత్నముతో జేయవలయును పిండానాంమాసికంశ్రాద్ధ మనియును పాఠాంతర ము పిండములయొక్క యనగా పితృయజ్ఞపిండములయొక్కయని శేషమంతయు తు

ల్యమని కుల్లూకభట్టు॥ ౧౨౩॥

మూ॥ తత్రయేభోజనీయాస్స్యుర్యేచవర్జ్యాద్విజోత్తమాః।యా
వంతశ్చైవయైశ్చాన్నైస్తాన్ప్రవక్ష్యామ్యశేషతః॥౧౨౪॥

ఆశ్రాద్ధమందు భోక్తలుయెందరో యెట్టివారహులో యెవరహులుగా
రో యేపదార్థములు దగునో యాసర్వమును జెప్పగలను॥ ౧౨౪

మూ॥ ద్వౌదైవే పితృకార్యేత్రీ నేకైక ముభయత్రవా।భోజయే
త్సుసమృద్ధోపి నప్రసజ్జేత విస్తరే॥ ౧౨౫॥

ముందుగ బ్రాహ్మణసంఖ్యను చెప్పుచున్నాడు దేవశ్రాద్ధమందిద్దరిని పితృపితామహ ప్రపితామహోద్దేశముగ ముప్పురను లేక దేవోద్దేశముగ నొకనిని పిత్రాదిత్రయోద్దేశముగ నొకనినైన బ్రాహ్మణులను నియమించి భుజింపజేయవలయును ఎకుడవగాజేయుటకు సామర్థ్యముండిన నంతకంటే బ్రాహ్మణసంఖ్యయధికముగజేయ నాసక్తుడుగాగూడదు॥ఇచ్చట మేధాతిథి॥"పితృకార్యేత్రీ"ననుచోతండ్రికిముప్పురను తాతకుప్పురను నతనితండ్రికి ముప్పురనులేక "ఏకైకముభయత్రవా" యనుచో దేవోద్దేశముగ నొకనిని పిత్రాదిత్రయమునకు ప్రత్యేక మొకనికొకని చొప్పున ముప్పురనునైన బ్రాహ్మణులను భుజింపజేయవలెను గానిముప్పురకునొకనే నియమించదగదు "సర్వేషాంపిండైర్వ్యాఖ్యాత"మనునాశ్వలాయనగృహ్యవిరోధమువలనఏలాగునైతే పిత్రాదిత్రయమునకొకపిండమునిరూపించబడలేదో యటులేముప్పురకునొకబ్రాహ్మణుడనదగదనివ్రాసెను-ఇది మంచిదికాదనికుల్లూకుభట్టువ్రాసెను॥"సూ॥ నత్వేవైకంసర్వేషాం పిండైర్వ్యాఖ్యాత" మనిపఠించికామమనాద్యే"యనిగృహ్యసూత్రకారునిచేతనే పలుకబడెను దీనియర్థము పిత్రాదులకు జేసెడి యనేకశ్రాద్ధములలో నాద్యమన సపిండీకరణ మదిదప్ప యథాకామముగా పిత్రాదిత్రయమున కొకొక బ్రాహ్మణుడే యని యర్థము నిదిగాక "ననాద్యేయనదనీ"యమగుద్రవ్యము లేనప్పుడు నొకనినైనబ్రాహ్మణునిభుజింపజేయవలయునుభయవ్యాఖ్యానముల యందును పిత్రాదిత్రియమున కొనకనినేపార్వణాదిశ్రాద్ధములందు భుజింపజేయవలెనని గృహ్యకారునిచేతనే చెప్పబడెను॥

శ్లో॥ యద్యేకంభోజయేచ్ఛ్రాద్ధేదైవం తత్రకథంభవేత్ । అన్నంపాత్రే సముద్ధృత్య సర్వస్యప్రకృతస్యచ। దేవతాయతనేకృత్వా యథావిధిప్రవర్తయేత్॥

నావశ్యము జేయవలయును ఇచ్చట గోవిందరాజు "విధుక్షయే" యని పాఠము వ్రాసి విధుక్షయనగా శ్రాద్ధకర్మమని ధుక్షయనగా నమావాస్యయందు లేదాగ్రహణమందని వ్యాఖ్యానముజేసెను గాని యిట్లనెన్నఁడు ప్రాచీనులగు మేధాతిథి మొదలగువారు వ్రాయలేదు గావున సాంప్రదాయికమని కుల్లూకభట్టువ్రాసెను॥ ౧౨౭॥

మూ॥ శ్రోత్రియాయైవ దేయాని హవ్యకవ్యాని దాతృభిః। అర్హ
త్తమాయ విప్రాయ తస్మై దత్తం మహాఫలమ్॥ ౧౨౮॥

ఛందస్సునుమాత్రమధ్యయనమొనర్చిన నతడు శ్రోత్రియుడతనికి హవ్యకవ్యము లొసంగవలయు శ్రుతాచారాభిజనాదులచే పూజ్యతముడగునట్టి విప్రునకు నొసంగిన మహాఫలమగును॥ ౧౨౮॥

మూ॥ ఏకైకమపి విద్వాంసం దైవే పిత్ర్యే చ భోజయేత్। పుష్కలం
ఫలమాప్నోతి నామంత్రజ్ఞాన్ బహూనపి॥ ౧౨౯॥

దేవపితృకర్మములందు వేదతత్త్వార్థవేత్తలగు బ్రాహ్మణుల నొక్కొకనినైన భుజింపజేయవలయును- అటులయిన పుష్కలమగు మహాఫలమును బొందును అవిద్వాంసులను బహుమంది నైనియు భుజింపజేయదగదు- ఇట్లుండగా ఫలశ్రవణము వలన బ్రాహ్మణభోజనమే ప్రధానము పిండదానాదికమంగమని గోవిందరాజువ్రాసెను అట్లైన కుల్లూకభట్టు పితరులనుద్దేశించిన ద్రవ్యత్యాగము బ్రాహ్మణులు స్వీకరించుచే సంపన్నంబగును శ్రాద్ధశబ్దమున కర్థమిది ప్రధానమని పలుకుచున్నారు అదేమనఁగా పిండాన్వాహార్యకమను శ్రాద్ధము జేయవలయునని యాపస్తంబులున్నవన్వర్థమునే వ్యాఖ్యానము జేసిరి॥ "సూ॥ తత్త్రై తన్మనుశ్శ్రాద్ధశబ్దం కర్మప్రోవాచ ప్రజానిఃశ్రేయసార్థం తత్ర పితరో దేవతా బ్రాహ్మణాస్త్వాహవనీయార్థే మాసి మాస్యపరపక్షస్యాపరాహ్ణశ్శ్రేయానితి॥" శ్రాద్ధమనే శబ్దము దేనికి వాచకమో యది శ్రాద్ధము త్యక్తమైన ద్రవ్యమును దెలిసికొనుటకు స్థానమగుటవలన నాహవనీయమువంటి వాడు బ్రాహ్మణుడు నియతముగ పితరులు దేవత శ్రాద్ధాదికమందు శ్రాద్ధశబ్దము శ్రాద్ధశబ్దార్థప్రాప్తియర్థము గాగలది గారణము పుష్కలమగుఫలమును పొందుచున్నారనుటయైనచో పుష్టతర ఫలార్థమికి గుణఫలవిధి యగు భోజనమునకంగమగుచున్నప్పటికిని తదాశ్రయము విరుద్ధముగాదని కుల్లూకభట్టు॥ ౧౨౯॥

మూ॥ దూరాదేవ పరీక్షేత బ్రాహ్మణం వేదపారగమ్। తీర్థం తద్ధ

వ్యకవ్యానాం ప్రధానే సో౽తిథిస్స్మృతః॥ ౧౩౦॥

కృత్స్న శాఖాధ్యయనముగల బ్రాహ్మణుని తాతతండ్రుల వర్తినుంచిన్ని కులము యొక్క మంచితనము పరీక్షించవలెను యేమంటే యాతడు హవ్యకవ్యము లిచ్చుటకు పాత్రముగదా మహాఫలమును గూర్చెడి యతిథి యతడేయని చెప్పబడెను॥౧౩౦॥

మూ॥ సహస్రంహి సహస్రాణా మనృచాం యత్ర భుంజతే। ఏక
స్తాన్మంత్రవిత్ప్రీత స్సర్వానర్హతి ధర్మతః॥ ౧౩౧॥

శ్రాద్ధమందు పదిలక్షలమంది వేదరహితులగు బ్రాహ్మణులు భుజించినను వేదవేత్తయగు నొకబ్రాహ్మణుడు భోజనముచే తృప్తుడయ్యెనేని వారందరు భుజించిన ఫలము నిచ్చుట కర్హుడగుచున్నాడు॥ ౧౩౧॥

మూ॥ జ్ఞానోత్కృష్టాయ దేయాని కవ్యానిచ హవీంషిచ। నహి
హస్తావసృగ్దిగ్ధౌ రుధిరేణైవ శుధ్యతః॥ ౧౩౨॥

జ్ఞానముచే నుత్కృష్టుడగు విద్వాంసునకు హవ్యకవ్యముల నొసంగందగునుగాని మూర్ఖున కీయరాదు రక్తసిక్తములగు కరములు రక్తముచే గడిగినను శుద్ధములు గావుగదాయని యర్థాంతరన్యాసాలంకారము మూర్ఖతచే పాత్రమెఱుగక మూర్ఖులకన్నమిడిన నామూర్ఖులతనిదోషమును బోగొట్టలేరు మరేమంటే విద్వాంసుడందు కర్హుడు॥ ౧౩౨॥

మూ॥ యావతో గ్రసతే గ్రాసాన్ హవ్యకవ్యేష్వమంత్రవిత్। తావ
తో గ్రసతే ప్రేత్య దీపశూలష్ట్యయోగుడాన్॥ ౧౩౩॥

హవ్యకవ్యముల యందెన్ని కబళముల నవేదవేత్త భక్షించునో దాత పరలోకమందన్ని మండుచున్న లోహశూల ఋష్టిపిండముల గ్రసించును॥ "శ్లో॥ గ్రసతే యావతః పిండాన్ యస్యైహ హవిషో౽వ్రతః। గ్రసతే తావతశ్శూలాన్ స్థిత్వా వైవస్వతక్షయే" మనివ్యాసులు గావున నపాత్రదానముచే నాపేక్షఫలమా దాతకీయగదని యపాత్రదాననిందా రూపమున పాత్రదానస్తుతియగుచున్నది॥ ౧౩౩॥

మూ॥ జ్ఞాననిష్ఠాద్విజాః కేచి త్తపోనిష్ఠా స్తథాపరే। తపస్స్వా
ధ్యాయనిష్ఠాశ్చ కర్మనిష్ఠా స్తథాపరే॥ ౧౩౪॥

బ్రాహ్మణులు కొందరు బ్రహ్మజ్ఞాననిష్ఠులు కొందరు ప్రాజాపత్యాదితపోనిష్ఠులు కొందరుస్వాధ్యాయ తపోనిష్ఠులు కొందరు యాగాది కర్మనిష్ఠులు॥ ౧౩౪॥

మూ॥ జ్ఞాననిష్ఠేషుకవ్యాని ప్రతిష్ఠాప్యానియత్నతః। హవ్యానిచ
యథాన్యాయం సర్వేష్వేవచతుర్ష్వపి॥ ౧౩౫॥

పితృకర్మములయందు జ్ఞాననిష్ఠులకే ప్రయత్నముచే బెట్టవలయును దేవోద్దేశము చశాస్త్రోక్తన్యాయప్రకారము పైనిచెప్పిన నలుగురికి బెట్టవచ్చును॥ ౧౩౫॥

మూ॥ అశ్రోత్రియఃపితాయస్య పుత్రస్స్యాద్వేదపారగః। అశ్రో
త్రియోవాపుత్రస్స్యా త్పితా వై వేదపారగః॥ ౧౩౬॥

ఏబ్రాహ్మణుడు శ్రోత్రియుడు గాని తండ్రిగలవాడై తాను వేదవేత్తయగు చున్నాడో ఎవడుశ్రోత్రియపితృకుడై తానుశ్రోత్రియుడు గాకపోవుచున్నాడో వాని విషయమై చెప్పెదను॥ ౧౩౬॥

మూ॥ జ్యాయాంసమనయోర్విద్యా ద్యస్యస్యాచ్ఛ్రోత్రియఃపితా।
మంత్రసంపూజనార్థంతు సత్కారమితరోర్హతి॥౧౩౭॥

పూర్వశ్లోకోక్తులగు నిద్దరిలోనున్న తానుశ్రోత్రియుడైనను శ్రోత్రియపుత్రుడు జ్యేష్ఠుడు తాను వేదవేత్తయైనను శ్రోత్రియపుత్రుడైతే చదివిన వేదమునకు గా పూజార్హుడగు చున్నాడు "శ్రోత్రియాన్నైవ దేయాని" యని యుండుట వలననున్ను మూరాదేవపరీక్షేతయని పితాదుల యోగ్యతను దెలియవలెనన్ని యుండుట వలననున్ను శ్రోత్రియపుత్రుడైనను దానును శ్రోత్రియుడు గావలెనని తాత్పర్యము॥

మూ॥ న శ్రాద్ధే భోజయేన్మిత్రం ధనైః కార్యోస్య సంగ్రహః। నా
రింనమిత్రం యంవిద్యా త్తంశ్రాద్ధేభోజయేద్ద్విజం॥౧౩౮

మిత్రుని శ్రాద్ధమందు భుజింపజేయరాదు. ధనముచే నతనిసంగ్రహించవలెను ఏ

బ్రాహ్మణుడు శత్రుత్వమిత్రత్వములుతనతో లేనివాడో వానిని నిమంత్రణము జేయ
వలయును॥ ౧౩౮॥

మూ॥ యస్యమిత్ర ప్రధానాని శ్రాద్ధానిచ హవీంషిచ । తస్యప్రేత్యఫ
లంనాస్తి శ్రాద్ధేషుచ హవిష్షుచ॥ ౧౩౯॥

ఎవడు చేసెడి శ్రాద్ధములున్ను దేవకర్మములును మైత్రిప్రధానముగాగలవియ
గుచున్నవో యంటే మిత్రులనే భోక్తలగా జేయునో వానికి పరలోకమందు నా
రెంటియందున్ను ఫలముపయోగించదు॥ ౧౩౯॥

మూ॥ యస్సంగతాని కురుతే మోహాచ్ఛ్రాద్ధేన మానవః। సస్వర్గా
చ్చ్యవతేలోకా చ్ఛ్రాద్ధమిత్రో ద్విజాధమః। ౧౪౦॥

తాను శ్రాద్ధభోజనమునకు బిలిచియందువలన నాప్తులనుగా జేసుకొనదలం
చియాటుచేసినవాడు శ్రాద్ధమిత్రుడనబడు నాద్విజాధముడు స్వర్గలోకమునుం
చి భ్రష్టుడగుననగా వానికి స్వర్గప్రాప్తియే లేదు శ్రాద్ధముస్వర్గఫలకమనియా
జ్ఞవల్క్యుడుజెప్పెను. "శ్లో॥ ఆయుః ప్రజాంధనంవిద్యాం స్వర్గంమోక్షం సుఖానిచ।
ప్రయచ్ఛంతి తథారాజ్యం ప్రీతానౄణాం పితామహాః॥" యని దీర్ఘాయుష్య
ము మొదలగునవి ప్రీతులగు పితరులిత్తురని॥ ౧౪౦॥

మూ॥ సంభోజనీసాభిహితా పైశాచీదక్షిణాద్విజైః । ఇహైవాస్తేతు
సాలోకే గౌరంధేవైకవేశ్మని॥ ౧౪౧॥

అందరునొకమారే భుజించునది సంభోజనీ యనుపించుకొనును భోజనగోష్ఠి
యేకో ఆదానక్రియసు పైశాచియని పిశాచములన్నియుంగలసి తినినట్లుగా సనిమన్వా
దులుజెప్పిరి అదిమిత్రప్రయోజనముగాగలది గావున బరలోకమందు ఫలమునిచ్చేది
కాదు కన్నులేనిగోవు మరియొకచోటికి వెళ్లక నొకయింటగృహమందే యున్నట్లు
గా నిహలోకమందే యుండును॥ ౧౪౧॥

మూ॥ యథేరిణే బీజముప్త్వా నవప్తా లభతేఫలం। తథాన్నృచేహవిర్ద

త్వా నదాతాలభతే ఫలం॥ ౧౪౨॥

ఊషరక్షేత్రమందు బీజముంచి కర్షకుఁడు ఫలము నొందనట్లు వేదము చదవని వానిని పిత్రుకర్మయందు భుజింపజేసినదాత తత్ఫలమునొందఁడు॥ ౧౪౨॥

మూ॥ దాతౄన్ ప్రతిగ్రహీతౄంశ్చ కురుతే ఫలభాగినః। విదుషేద
క్షిణాందత్వా విధివత్ప్రేత్య చేహచ॥ ౧౪౩॥

వేదవేత్తయగువానికి నిచ్చినది దాతనైహికాముష్మికఫలభాగులనుగా జేయును ప్రతిగ్రహించినవానికిని ప్రతిగృహీతమగు ధనముచే జేసినయాగాదికమువలనపరలోకసుఖమగు నన్యాయార్జితధనముచే జేసిన యాగాదికము పరలోకసుఖమునీ జాలదు ఇహమందును న్యాయాగతధనముచే జేసిన కృషిఫలించును మేధాతిథిగోవిందరాజులు యథాశాస్త్రముగ పిత్రుకర్మమును జేసిన నిహమందు నానుషంగికము గఖ్యాతిగలుగు ననిరి॥ అదికాదని అయుః ప్రజ్ఞామనుయాజ్ఞవల్క్య వచనోక్తమగు నాయుష్యాదికమిహఫలమని కుల్లూకభట్టువ్రాసెను॥ ౧౪౩॥

మూ॥ కామంశ్రాద్ధేర్చయేన్మిత్రం నాభిరూపమపిత్వరిమ్। ద్విషతాహి
హవిర్భుక్తం భవతి ప్రేత్యనిష్ఫలం॥ ౧౪౪॥

యథోక్త విద్వద్బ్రాహ్మణాభావమందు మిక్కిలిగుణవంతుఁడగు మిత్రునిశ్రాద్ధమందు భుజింపజేయవలయును విద్వాంసుఁడైనను శత్రునికిబెట్టగూడదు ఏహేతువుచే శత్రుభుక్తమగు శ్రాద్ధముపరలోకమందు నిష్ఫలమగునో చెప్పబడ్డ పాత్రము దొరకనియపుడు మిత్రనిషేధనిషేధార్థమిది॥ ౧౪౪॥

మూ॥ యత్నేన భోజయేచ్ఛ్రాద్ధే బహ్వృచం వేదపారగం। శాఖాం
తగమథాధ్వర్యుం ఛందోగంతు సమాప్తిగం॥ ౧౪౫॥

ఈ సరికి శ్రోత్రియునకు శ్రాద్ధమందిమ్మని చెప్పబడుటవలనఛందోమాత్రాధ్యయనవంతునకావశ్యకమనియుండగా నిప్పుడు ఫలాధిక్యమునకై మంత్ర బ్రాహ్మణాత్మకకృత్స్నశాఖాధ్యయనవంతుఁడగు శ్రోత్రియునకు దానము త్తమమని చెప్పుచున్నాఁడు॥ కృత్స్నశాఖాధ్యాయియగు ఋగ్వేదిని ప్రయత్నముచే భుజింపజేయవలయును శాఖాంతగుఁడగు యజుర్వేదినిన్ని మంత్రబ్రాహ్మణ యుక్తముగ సమాప్తి

వాండ్రసామశాఖనుజదివినవానినిన్ని భుజింపజేయవలయును॥ ౧౪౫॥

మూ॥ ఏషామన్యతమో యస్య భుంజీత శ్రాద్ధమర్చితః। పితౄణాం
తస్య తృప్తిస్స్యా చ్ఛాశ్వతీ స్సాప్తపౌరుషీ॥ ౧౪౬॥

వారిభోజనమందధికఫలమును జెప్పుచున్నాడు ॥ ఈఋుగ్యజుస్సామకృత్స్నశాఖాధ్యాయులలో నెవడైన నెవ్వనిచే శ్రాద్ధమందర్చితుడై భుజించు నా శ్రాద్ధదాత యొక్క పితరుల కేడుతరములవారికి శాశ్వతమగు దృప్తిగలుగును॥ ౧౪౬॥

మూ॥ ఏష వై ప్రథమః కల్పః ప్రదానే హవ్యకవ్యయోః।అను కల్ప
స్త్వ యం జ్ఞేయ స్సదాసద్భి రనుష్ఠితః॥ ౧౪౭॥

హవ్యకవ్యములయందు సంబంధులుగాని వేదవేత్తలకుబెట్టుమనుట యేదో యది ముఖ్యకల్పము చెప్పబడియెనటుసంభవించనిచో నింక ననుకల్పమిదిచెప్పబడునే ది పెద్దలచే ననుష్ఠించబడెనది తెలియందగును॥ ౧౪౭॥

మూ॥ మాతామహం మాతులంచ స్వస్రీయం శ్వశురం గురుం।
దౌహిత్రం విట్పతిం బంధు మృత్విగ్యాజ్యౌచ భోజయేత్॥

మాతామహుడు మేనమామ మేనల్లుడు మామగారు ఆచార్యాదులు దౌహిత్రుడు అల్లుడు పినతల్లికుమారుల్లు మొదలగు బంధువులు ఋత్విక్ శ్రోత్రియాభావమందు వీరిపదుగురిలో నన్యతములను శ్రాద్ధమందుభుజింపజేయవలయును॥

మూ॥ న బ్రాహ్మణంపరీక్షేత దైవేకర్మణి ధర్మవిత్।పిత్ర్యేకర్మణి
చ ప్రాప్తేపరీక్షేత ప్రయత్నతః॥ ౧౪౯॥

దేవకర్మమందు ధర్మవేత్తయగు నతడు బ్రాహ్మణుని మిక్కిలి పరీక్షించవలదు బ్రసిద్ధివలన సాధుత్వముతెలిసి భుజింపజేయవచ్చును పితృకర్మమునందు బ్రయత్నముచే ననగాపితృపితామహాద్యభిజనసంపత్తిని బరీక్షసేయందగు॥ ౧౪౯॥

మూ॥ యేస్తేన పతిత క్లీబా యేచనాస్తికవృత్తయః। తాన్ హ
వ్యకవ్యయోర్విప్రా ననర్హాన్ మనురబ్రవీత్॥ ౧౫౦॥

సువర్ణవ్యతిరిక్తవస్తుచోరుడు సువర్ణచోరుడైతె పతితుడనుటచే చెప్పబడె

ను గావున మహాపాతకి నపుంసకుడు పరలోకములేదని ప్రవర్తించువాడువీరుహవ్యకవ్యములందనర్హులని మనువుసెప్పెను సకలధర్మములున్ను మనువుచెప్పినవికాగానిచ్చుటమనువుచెప్పెననుట దోషాధిక్యజ్ఞాపకార్థము॥ ౧౫౦॥

మూ॥ జటిలంచానధీయానం దుర్బాలం కితవం తథా। యాజయంతి
చయేపూగాం స్తాంశ్చశ్రాద్ధేన భోజయేత్॥ ౧౫౧॥

జటలను ధరించినవాడనగా బ్రహ్మచారి ముండోవా జటిలోవాస్యాదనుటవలన నుపలక్షణముచే ముండుడున్ను వేదాధ్యయనములేనివాడున్ను ఉపనయన మాత్రమయి వేదమును చదవని బ్రహ్మచారిననుటచే వేదమును జదువుచిన్న బ్రహ్మచార్యభ్యనుజ్ఞానార్థమీనిషేధము పైనిశ్శోత్రియాయైవ దేయానియనుట. బ్రహ్మచారీతరవిషయము దుర్బాలుడనగా దుశ్చర్మరోగముగలవాడు మేధాతిథిమద్బాలుడనగా యెర్రనికేశములుగలవాడైనా బట్టతలవాడైవాదుశ్చర్మరోగమైనవాయనిపూర్వార్థములువార్చిసెనుజూదమాడువాడును అనేకమందికి యాజకుడైనవాడును॥ "శ్లో॥ యశ్చాపిబహుయాజ్యస్స్యాద్యశ్చోపనయతె బహూనసివసిష్ఠవచనము వారిని శ్రాద్ధమందు భుజింపజేయదగదు॥ ౧౫౧॥

మూ॥ చికిత్సకాన్ దేవలకాన్ మాంసవిక్రయిణస్తథా। విపణే
నచజీవంతో వర్జ్యాస్స్యుర్హవ్యకవ్యయోః॥ ౧౫౨॥

వైద్యముచే జీవించువారికి జీతముగాని ప్రతిమారాధనముజేయువారికి ధర్మార్థమై దేవపూజ నిషిద్ధముగాదు॥ "శ్లో॥ దేవకోశోప భోజీస్యా న్నామ్నా దేవలకోభవేత్॥". దేవద్రవ్యముచే బ్రతికేవాడు దేవలుడని దేవలవచనము మాంసము వాళ్ళమ్మారైననమ్ముకొనెడువాడును వీరిని భుజింపజేయరాదని పూర్వాన్వయము "సద్యఃపతతిమాంసేన॥" మాంసమునమ్ముటచేనప్పుడే పతితుడగుననుట వచనమువలన వాణిజ్యముచే జీవించువారు హవ్యకవ్యములయందు వర్జింపదగుదురు॥

మూ॥ ప్రేష్యోగ్రామస్య రాజ్ఞశ్చ కునఖీశ్యావదంతకః। ప్రతిరో
ద్ధాగురోశ్చైవ త్యక్తాగ్నిర్వార్ధుషిస్తథా॥ ౧౫౩॥

జీతమును పుచ్చుకొని గ్రామములకుగాని రాజుకుగాని యాజ్ఞాకారియు పుప్పిగోళ్లుగలవాడు నల్లని దంతములుగలవాడు గురువునకుబ్రతికూలాచరణముగలవా

ము శ్రౌతస్మార్తాగ్నులను విడచినవాడు వృద్ధిచే జీవించువాడు వీరు హవ్యకవ్యములయందు వర్జింపదగుదురని పూర్వముతోగానియు త్తరముతోగాని సంబంధము॥ ౧౫౩॥

మూ॥ యక్ష్మీచ పశుపాలశ్చ పరివేత్తా నిరాకృతిః । బ్రహ్మద్విట్పరివిత్తిశ్చ గణాభ్యంతర ఏవచ॥ ౧౫౪॥

క్షయరోగి జీవనార్థమై గొర్రెలమేకలను పెంచువాడు అన్నకు పెళ్లికాకుండ పెళ్లిజేసికొనినవాడు పరివేత్తయా పెళ్లిగాని యన్న పరివిత్తి వీరారున్నున్ని రాకృతియనగా పంచయజ్ఞరహితుడు॥ "శ్లో॥ నిరాకర్తాఽమరాదీనాం స విజ్ఞేయో నిరాకృతిః।" దేవాదియజ్ఞములను నిరాకరించినవాడు నిరాకృతియనబడును గణదోగపరిశిష్టము- బ్రాహ్మణద్వేషి బది మందికై చేర్చిన దాని వలన జీవించువాడు॥ ౧౫౪॥

మూ॥ కుశీలవోవకీర్ణీచ వృషలీ పతిరేవచ । పౌనర్భవశ్చకాణ శ్చ యస్యచోప పతి గృహే॥ ౧౫౫॥

గాయకనర్తకులు స్త్రీసంబంధముచే చెడిన బ్రహ్మచారి సవర్ణా వివాహము లేకనే శూద్రస్త్రీని వివాహమైన వాడు రెండవపెండ్లిగల స్త్రీకి బుట్టినవాడు ఒకకంటిగుడ్డివాడు నైవనిభార్యకు జారుడుంటను వానోవాడు॥ ౧౫౫॥

మూ॥ భృతకాధ్యాపకో యశ్చ భృతకాధ్యాపిత స్తథా । శూద్రశి ష్యోగురుశ్చైవ వాగ్దుష్టః కుండగోళకౌ॥ ౧౫౬॥

సొమ్మిచ్చి చదివిన వాడును పుచ్చుకొని చెప్పిన వాడును శూద్రునకు శిష్యుడగు వానికి గురువున్ను పరుషభాషియు నిందితుడును కొండెరు కుండుడు గోళకుడునువ ర్జ్యమాణులు॥ ౧౫౬॥

మూ॥ అకారణ పరిత్యక్తా మాతా పిత్రో గురో స్తథా । బ్రా హ్మైర్యౌనైశ్చ సంబంధై స్సంయోగం పతితై ర్గతః॥ ౧౫౭॥

కారణము లేకనే మాతా పితృ గురుశుశ్రూష మానిన వాడున్ను వేదాధ్యయనకన్యాదానాది సంబంధములచే పతితులతోగూడ సంయోగముగల వాడున్ను వి

డు పతితుడుగాడాయంటే॥ "శ్లో॥ సంవత్సరేణపతతి" యని పతితసంయోగము సంవత్సరముండిన పతితుడని చెప్పగల వచనముచే పతితుడనరాదు గాన నిచ్చట చెప్పవలసెను॥ ౧౫౭॥

మూ॥ అగారదాహీగరదఃకుండాశీసోమవిక్రయీ । సముద్రయా
యీవందీచ తైలికఃకూటకారకః॥ ౧౫౮॥

ఇండ్లు కాల్చినవాడు గరళము ననగా జంపెడు విషమును బెట్టినవాడు॥ "శ్లో॥ అమృతేజారజఃకుండః మృతేభర్తరిగోళకః । యస్తయోరన్నమశ్నాతి సకుండాశీతికథ్యతే॥" భర్తజీవించియుండగా జారుని వలన పుట్టినవాడు కుండుడు భర్తమృతుడైన పిదప జారజుడు గోళకుడు వీరియన్నమును దినినవాడు కుండాశియనబడునను దేవల వచనము వలన కుండగోళకుల యన్నము దినినవాడు సోమలతనమ్మినవాడు ఎవడు నౌకాదికముచే ద్వీపాంతరమునకు బోవునో యతడున్ను స్తుతిపాఠకుడు నువ్వులను గానుగ నాడినవాడు నస్మతసాక్ష్యమును బలికినవాడు॥ ౧౫౮॥

మూ॥ పిత్రావివదమానశ్చ కితవోమద్యపస్తథా । పాపరోగ్యభి
శస్తశ్చ దాంభికోరసవిక్రయీ॥ ౧౫౯॥

శాస్త్రార్థమందును లౌకికమందును తండ్రితోవివాదపడెడువాడు జూదమొకనిచే నాడించినవాడు మున్ను స్వయముగా జూదమాడిన వాడని గాన పునరుక్తిలేమి కేకరఃయనిపాఠాంతరముచే నడ్డుగా జూచెడువాడు సురావ్యతిరిక్తమాదకద్రవ్యమును బానము జేయు నతడు కుష్ఠురోగి నిర్ణీతముగాని పాపముచే నిందితుడు కపటముచే ధర్మము జేయువాడు రసద్రవ్యముల నమ్ముకొనినవాడు॥

మూ॥ ధనుశ్శరాణాంకర్తాచ యశ్చాగ్రేదిధిషూపతిః । మిత్రధ్రు
గ్ద్యూతవృత్తిశ్చ పుత్రాచార్యస్తథైవచ॥ ౧౬౦॥

ధనుస్సులను శరములను జేసెడువాడు "శ్లో॥ జ్యేష్ఠాయాంయద్యనూఢాయాం కన్యాయామూహ్యతేనుజా । సాచాగ్రేదిధిషూర్జ్ఞేయా పూర్వాతుదిధిషూస్మృతేతి॥" అక్కకువివాహము గాకుండ వివాహితురాలగునది యగ్రేదిధిషూయనబడు ఆయక్క దిధిషూయనియు జెప్పబడుదురని లోకాక్షివచనము వలన ఏకోదరజ్యేష్ఠ భగినికి వివాహముగాకున్నచో కనిష్ఠను వివాహమైనవాడు ఇచ్చట గోవిందరాజు॥

“శ్లో॥ భ్రాతుర్మృతస్య భార్యాయాం” అను దానిచే నగ్రేదిధిషూపతియే వృత్తనియమమున కెూడవగనన యగ్రేదిధిషూ శబ్దము విరచెనని చెప్పెను। మిత్రునకు ద్రోహము చేసినవాడు సఖ్యమును బెట్టి ద్యూతవృత్తి కొడుకునొద్ద చదివిన తండ్రి॥ ౧౬౪॥

మూ॥ భ్రామరీ గండమాలీ చ శ్విత్ర్యథో పిశునస్తథా। ఉన్మత్తోంధ
శ్చ వర్జ్యాః స్యుర్వేదనిందక ఏవ చ॥ ౧౬౫॥

అపస్మారము గండమాలరోగ శ్వేతకుష్ఠముగల వాడు దుర్జనుడు వెఱ్ఱివాడు గ్రుడ్డివాడు వేదమును నిందించువాడు వీరు శ్రాద్ధభోజనమందు వర్జింప దగినవారు॥ ౧౬౫॥

మూ॥ హస్తిగోశ్వోష్ట్రదమకో నక్షత్రైర్యశ్చజీవతి। పక్షిణాం
పోషకోయశ్చ యుద్ధాచార్య స్తథైవచ॥ ౧౬౬॥

ఏనుగులను గోవులను గుఱ్ఱములను నుష్ట్రములను శిక్షించెడివాడు జ్యోతిశ్శాస్త్రముచే జీవించువాడు క్రీడార్థమై పక్షులను పంజరములందుంచి పోషించువాడు యుద్ధార్థమాయుధవిద్యనేర్పువాడు॥ ౧౬౬॥

మూ॥ స్రోతసాం భేదకో యశ్చ తేషాంచావరణే రతః। గృహ
సంవేశకోదూతో వృక్షారోపక ఏవచ॥ ౧౬౭॥

ప్రవహించుచున్న జలమునుగట్టి దెగగొట్టి స్థలాంతరమునకు బ్రవహింపజేసెడువాడు ప్రవాహగతిని ప్రతిబంధించేవాడు వాస్తుశాస్త్రముచే గృహనిర్మాణ మొనర్చి బ్రతికెడువాడు రాజగామప్రేష్యుడు గాక దూతయగువాడు జీతముపుచ్చుకొని చెట్లుపాతెడు వాడు। “శ్లో॥ పంచామ్రవాపీనరకంనయాతి” అయిదు మామిడి చెట్లు వేసెడువాడు నరకమునకు బోడనుటచే ధర్మార్థము చెట్లను వేయువాడు కాడు॥ ౧౬౭॥

మూ॥ శ్వక్రీడీ శ్యేనజీవీచ కన్యాదూషక ఏవచ। హింస్రో వృషలవృ
త్తిశ్చ గణానాంచైవ యాజకః॥ ౧౬౮॥

క్రీడార్థము కుక్కలను పెంచెడువాడు డేగలనమ్ముకొని జీవించువాడు కన్యా

గామి హింసారతుడు శూద్రవ్యాపారముగలవాడు "వృషలపుత్రశ్చ" యనిపాఠాంతరము శూద్రాభార్యకు మాత్రమే పుట్టిన పుత్రులు గలవాడు వినాయకాదిగణయాగకర్త॥ ౧౬౪॥

మూ॥ ఆచారహీనః క్లీబశ్చ నిత్యం యాచనక స్తథా। కృషిజీవీశ్లీ
పదీచ సద్భిర్నిందితఏవచ॥ ౧౬౫॥

గురువునకు నతిథికిని బ్రహ్మశ్రద్ధావాద్యాచారరహితుడు "క్లీబః" యనగా ధర్మకార్యములందాదరము నుత్సాహము లేనివాడు మున్నె నపుంసకుడు చెప్పబడెను గాన నిత్యముయాచనచే పరులకు భయము పుట్టించువాడు స్వయంకృషిచేజీవించువాడు వృత్త్యంతరమున్నప్పుడన్యులచే జేయించే కృషిచే జీవించెడివాడు బూరకాలువాడు ఏనిమిత్తముచేతనైన సత్పురుషులచే నిందితుడు॥ ౧౬౫॥

మూ॥ ఔరభ్రికోమాహిషికః పరపూర్వాపతి స్తథా । ప్రేతని
ర్యాతకశ్చైవ వర్జనీయాః ప్రయత్నతః॥ ౧౬౬॥

గొఱ్ఱెలచేతను మహిషాదులచేతను జీవించువాడు మున్నొకనికి భార్యయైన దాని భర్త ధనముపుచ్చుకొని శవములను మోసెడివాడు- ధర్మార్థమైతే దోషములేదు "ఏతద్వై పరమంతపోయత్ప్రేతమరణ్యం హరంతీ॥" ధర్మార్థముగా ప్రేతమునరణ్యమునకుమోయుట యేదో యది పరమతపస్సు॥అని శ్రుతిచే నవశ్యముగ జేయనగన దానివలన వీరిని శ్రాద్ధమందు బ్రయత్నముచే వర్జించవలెను॥

మూ॥ ఏతాన్విగర్హితాచారా నపాఙ్క్తేయాన్ద్విజాధమాన్।
ద్విజాతిప్రవరోవిద్వా నుభయత్రవివర్జయేత్॥ ౧౬౭॥

ఈ చెప్పబడిన చోరులు మొదలగు నిందితాచారులనున్ను కాణుడు మొదలగు పూర్వజన్మకృతపాపశేషలబ్ధకాణాది భావముగలవారినిన్ని సాధుజనులతోసహపఙ్క్తిభోజనానర్హులగు నధముబ్రాహ్మణులను శాస్త్రజ్ఞుడగు బ్రాహ్మణశ్రేష్ఠుడు దైవకర్మమందున్ను పితృకర్మమందున్ను త్యజించవలెను॥ ౧౬౭॥

మూ॥ బ్రాహ్మణస్త్వనధీయాన స్తృణాగ్నిరివశామ్యతి।తస్మైహ
వ్యంనదాతవ్యం నహిభస్మనిహూయతే॥ ౧౬౮॥

ఎట్లు తృణాగ్నియందు హవిస్సును హుతముగా జేసెడి శక్తిలేక హవిస్సుచే
వారిపోవునో ఆహోమము నిష్ఫలమయినట్లు వేదమనేయగ్నిలేని బ్రాహ్మణుడు తృ
ణాగ్ని వంటివాడువానికి దేవోద్దేశముగ హవ్యమును బెట్టరాదు॥ భస్మమందుహో
మము జేయరాదు॥ శ్రోత్రియునకే యివ్వదగుననుటచే నధ్యయనములేనివానికి ని
షేధముసిద్ధమైనప్పటికినిమరలజెప్పుట స్తేనాదులనుంబోలెపఙ్క్తిదూషకులనిజ్ఞాప
కార్థము ఇక్కడ కొందరు కేవలకర్మమందధ్యయనము లేనివాడే వర్జనీయుడుశ్రో
త్రియుడయితే కాణత్వాదిదోషయుక్తులైననర్హులనుటకు మరలజెప్పుటయనిరి॥
అది గావుననే వసిష్ఠుంతు॥ "శ్లో॥ అథచేన్మంత్రవిద్యుక్తశ్శారీరైః పఙ్క్తిదూ
షణైః। అదూష్యంతం యమఃప్రాహ పఙ్క్తిపావనఏవసః॥" వేదవేత్తకాణత్వా
దిశారీరదోషయుక్తుడైనను పఙ్క్తిపావనుడే గావునదూష్యుడుగాడని యమస్మృ
తిలోజెప్పబడెనని యె గాని స్వకృతచోరత్వాదిదోషదూషితుడువర్జనీయుడేయ
నితాత్పర్యము॥ ౧౬౮॥

మూ॥ అపాఙ్క్త్యదానే యోదాతుర్భవత్యూర్ధ్వం ఫలోదయః। దైవే
హవిషిపిత్ర్యేవా తత్ప్రవక్ష్యామ్యశేషతః॥ ౧౬౯॥

దేవపితృకార్యములయందు పఙ్క్తిభోజనానర్హుడగు బ్రాహ్మణునకు హవి
స్సిడినదాతకు నాపైన యేఫలోదయము నఖిలమును జెప్పుచున్నాను॥ ౧౬౯॥

మూ॥ అవ్రతైర్యద్ద్విజైర్భుక్తం పరివేత్రాదిభిస్తథా। అపాఙ్క్తేయై
ర్యదన్యైశ్చ తద్వై రక్షాంసి భుంజతే॥ ౧౭౦॥

వేదగ్రహణార్థవ్రతరహితులచేతను పరివేత్రాదులచేత నితరచోరాదులగున
పాఙ్క్తేయులచే నే హవ్యము భుక్తమగునో దానిరాక్షసులు భుజింతురా శ్రాద్ధ
మునిష్ఫలమనియర్థము॥ ౧౭౦॥

మూ॥ దారాగ్నిహోత్రసంయోగం కురుతే యోఽగ్రజేస్థితే। పరివే
త్తాస విజ్ఞేయః పరివిత్తిస్తు పూర్వజః॥ ౧౭౧॥

ఇచ్చట యగ్నిహోత్రశబ్దమగ్నిహోత్రాద్యాధానపరము ఎవడు సోదరుడగు
జ్యేష్ఠునకు వివాహాగ్నిపరిగ్రహములుగాకుండదారాగ్నిసంగ్రహములను జేయునో
వాడుపరివేత్త యాజ్యేష్ఠుడు పరివిత్తి యనబడుదురు॥ ౧౭౧॥

మూ॥ పరివిత్తిః పరీవేత్తా యయాచ పరివిద్యతే। సర్వే తేనరకం
యాంతి దాతృయాజక పంచమాః॥ ౧౭౨॥

ప్రసంగమువలన పరివేదనసంబంధముగలవారికి ననిష్టఫలమును జెప్పుచున్నాడు పైనిచెప్పిన పరివిత్తి పరివేత్త యేకన్యకచేనీపరివేదనముసేయబడెనో యకన్యకయు కన్యనిచ్చినవాడును వివాహహోమాదికము జేయించినవాడునీయయిదుగురును నరకమును బొందుదురు॥ ౧౭౨॥

మూ॥ భ్రాతుర్మృతస్య భార్యాయాం యోనురజ్యేత కామతః।
ధర్మేణాపి నియుక్తాయాం సజ్ఞేయో దిధిషూపతిః॥౧౭౩॥

ఎవడు చనిపోయినభ్రాతయొక్కభార్య వక్ష్యమాణనియోగధర్మముచే నియుక్తురాలయినప్పటికిని॥"శ్లో॥ సకృత్సకృదృతావృతౌ॥" ప్రతిఋతువునందు నొక్కొకమారనునదిమొదలగువిధిని విడచి దానియందు కామముచే నాలింగన చుంబనాదులనను రాగమును భావించెనేనియు మరలమరల బొందెనేనియు వాడు దిధిషూపతియని దెలియదగును గావున నితడును హవ్యకవ్యములకపాత్రమని కల్పించఁదగును॥ ౧౭౩॥

మూ॥ పరదారేషు జాయేతే ద్వౌసుతౌ కుండగోళకౌ। పత్యౌ
జీవతికుండస్స్యా న్మృతేభర్తరి గోళకః॥ ౧౭౪॥

పరదారలందు కుండగోళకులను నిద్దరుపుత్రులగుచున్నారు దానిభర్త బ్రతికియుండగబుట్టినవాడుకుండుడు విధవయందుబుట్టినవాడు గోళకుడు॥ ౧౭౪॥

మూ॥ తౌతుజాతౌ పరక్షేత్రే ప్రాణినౌ ప్రేత్యచేహచ। దత్తాని
హవ్యకవ్యాని నాశయేతే ప్రదాయినాం॥ ౧౭౫॥

పరభార్యయందుబుట్టిన కుండాదులు దృష్టాద్యనుపయోగమువలన బ్రాహ్మణులని వ్యపదేశించబడిరి ఆప్రాణులు బ్రాహ్మణత్వమున్నప్పటికిని తత్కార్యము లేకపోవుటవలన ననగా పరమందుఫలములేదిహమందునైనానుషంగిక కీర్త్యాదులును లేనందున వారికిచ్చినహవ్యకవ్యములను దాతలకునిష్ఫలముగ జేయుచున్నారు॥

మూ॥ అపాఙ్త్యోయావతః పాఙ్త్యాన్ భుంజానా ననుపశ్యతి। తా

వతాంనఫలంప్రేత్య దాతాప్రాప్నోతి బాలిశః॥ ౧౭౮॥

సజ్జనులతోనేకపఙ్క్తికహులుగాని చోరాదులు పఙ్క్తికహులగువారి నెందరినిభుజించుచుండంబూతురో వారియందరిభోజనఫలమును హవ్యకవ్యదాత పొందఁడదిగావున నే యతఁడు బాలిశుడుగాన చోరాదులు జూడకుండ నట్టిశ్రాద్ధములందు బరిహరింపవలయును॥ ౧౭౮॥

మూ॥ వీక్ష్యాంధో నవతేః కాణ ష్షష్టేశ్శ్విత్రీ శతస్యతు। పాపరోగీసహస్రస్య దాతునాశయతేఫలం॥ ౧౭౭॥

పఙ్క్తిలోనంధునకు చూపులేదుగావున చూచుటకు దగిన సమీపమందుండిన యంధుడు తొంబదిమంది భుజించినఫలమున్ను దాతకునశింపజేతురు॥ఇదిశ్రాద్ధమందంధాదులం బరిహరించుమని చెప్పడము ॥ అయితే నల్పాధిక్య సంఖ్యయేలనంటే దోషగౌరవజ్ఞానముచే ప్రాయశ్చిత్తగౌరవార్థమని జూపించబడెను॥ ౧౭౭॥

మూ॥ యావత స్సంస్పృశేదంగై బ్రాహ్మణాన్ శూద్రయాజకః। తావతాం నభవేద్దాతుః ఫలందానస్య పౌర్తికం॥ ౧౭౮॥

శూద్రునియజ్ఞాదులయందు ఋత్విక్కుడైనవాడు తనయవయవములచే శ్రాద్ధపఙ్క్తిలో నెందరిని స్పృశించునోయనగా॥ "శ్లో॥ అసనేషూపక్లృప్తేషు"ఇత్యాదులచే నాసనములు వేరువేరనుండుటచే ముఖ్యమగు స్పర్శలేకున్న నెందరితోనున్న బఙ్క్తిలో శూద్రయాజకుడుండునో యంతమంది భుజించిన శ్రాద్ధీయమైన పౌర్తికమగు ఫలముదాతకునశించును॥ అంతమందియొక్క పౌర్తికఫలముబహిర్వేదిదానమువలన యేఫలములేదోయని మేధాతిథిగోవిందరాజులు అదిగావుననే నిషిద్ధగణపతితుడైనను శూద్రయాజకభోజననిషేధము కల్పించబడెను॥ ౧౭౮॥

మూ॥ వేదవిచ్చాపి విప్రోస్య లోభాత్కృత్వా ప్రతిగ్రహం। వినాశం వ్రజతిక్షిప్ర మామపాత్ర మివాంభసి॥ ౧౭౯॥

ఇచ్చట ప్రసంగమువలన లాఘవార్థమై శూద్రయాజకుని వలన ప్రతిగ్రహమును నిషేధించుచున్నాడు మరియొక నిషేధకరణమందు శూద్రయాజకశబ్దోచ్చారణమును చెయ్యతగనదియేయని వేదజ్ఞుడైనను బ్రాహ్మణుడు లోభమువలన యీ

శూద్రయాజకుని ధనము ప్రతిగ్రహించి నీటియందుంచిన పచ్చికుండవలెను శీఘ్రముగ నశించును వేదజ్ఞుడుకాని వాడత్యంతమునశించును॥ ౧౭౯॥

మూ॥ సోమవిక్రయిణేవిష్ఠా భిషజేపూయ శోణితం। నష్టందేవల
కేదత్త మప్రతిష్ఠంతు వార్ధుషౌ॥ ౧౮౦॥

సోమలతనువిక్రయించినవానికిబెట్టునదితనకు విష్ఠయగుననగా జన్మాంతరమందు మలమునుభక్షించెడిజాతియందు బుట్టుననియర్థము వైద్యునకుబెట్టినది చీమునరక్తమునగును దేవప్రతిమాపూజకునకుబెట్టునదియు వృద్ధివల్ల జీవించెడివానికిని బెట్టునదియును నిష్ఫలమైనశించును ॥ ౧౮౦॥

మూ॥ యత్తువాణిజికే దత్తం నేహనాముత్రతద్భవేత్ । భస్మనీ
వహుతంహవ్యం తథాపౌనర్భవేద్విజే॥ ౧౮౧॥

వాణిజ్యముచే జీవించువిప్రునకుబెట్టిన హవ్యమిహపరముల కుపయోగించకపోవును మారుమనువుదానికిబుట్టినవానికి బెట్టునది భస్మమందిడిన హవిస్సువలె నశించును॥ ౧౮౧

మూ॥ ఇతరేషు త్వపాఙ్క్త్యేషు యథోద్దిష్టేష్వ సాధుషు। మే
దోసృఙ్మాంసమజ్జాస్థివదంత్యన్నం మనీషిణః॥ ౧౮౨॥

ఇతరులగుపఙ్క్తికనర్హులని జెప్పబడిన స్తేనాదులకుబెట్టిన హవ్యకవ్యములాదాతకు మేదస్సురక్తముయముకలుమజ్జ మొదలగునవియగునని పండితులు చెప్పుచున్నారు యచటనున్న రక్తమాంసాదిభక్షణాహారజాతిజన్మమగునని యర్థము॥

మూ॥ అపాఙ్క్త్యోపహతాపఙ్క్తిః పావ్యతేయై ర్ద్విజోత్తమైః। తాన్ని
బోధతకార్త్స్న్యేన ద్విజాగ్ర్యాన్ పఙ్క్తిపావనాన్॥౧౮౩॥

ఒకపఙ్క్తియందు కూర్చున్న స్తేనాదులచే దూషితమగుపఙ్క్తియేబ్రాహ్మణులచే బవిత్రముగచేయబడునో యట్టిబ్రాహ్మణులను సమగ్రముగజెప్పెదనువినుండు పఙ్క్తిదూషకులని తెలియబడక సంభవించిన యపాఙ్క్త్యసహపఙ్క్తిభోజనదోషనివారణసాధకమీవచనము॥ ౧౮౩॥

మూ॥ అగ్ర్యాస్సర్వేషువేదేషు సర్వప్రవచనేషుచ । శ్రోత్రియాన్వయజా

శ్చైవ విజ్ఞేయాః పఙ్క్తిపావనాః॥ ౧౮౪॥

నాలుగు వేదములయందు శ్రేష్ఠులనగా లెస్సగ వేదములు చదివినవారును వేదాంగములను జదివినవారును పదితరములు సమముగా వేదము జదువుచూవచ్చిన శ్రోత్రియుల వంశమందు బుట్టినవారును బఙ్క్తిపావనులని తెలియవలెను॥ "శ్లో॥ చతుర్వేదవిదశ్చైవ॥" యని పఙ్క్తిపావనగణనమందు యమస్మృతి॥ ప్రకృష్టముగ వేదార్థము వీటిచే జెప్పబడును గావున ప్రవచనములనగా వేదాంగములు "న్యాయవిచ్ఛషడంగవిత్॥" యని యమవచనను "ఛందసాంశుద్ధపురుష ఇతి" యని యాశనసస్మృతివలన దశపురుషపర్యంతమవిచ్ఛిన్న వేదసంప్రదాయవంశజులు పఙ్క్తిపావనులని జెప్పబడియున్నది॥ ౧౮౪॥

మూ॥ త్రిణాచికేతః పంచాగ్ని స్త్రిసుపర్ణ ష్షడంగవిత్। బ్రహ్మదేయాత్మసంతానో జ్యేష్ఠసామగ ఏవచ॥ ౧౮౫॥

"త్రిణాచికేతః॥" అనగా తైత్తిరీయశాఖయందొకభాగము తద్వ్రతము గలవాడును పంచాగ్నులుగలవాడును॥ "శ్లో॥ పవనః పావనస్త్రేతా యస్యపంచాగ్నయోగృహే। సాయంప్రాతః ప్రదీప్యంతే సవిప్రః పఙ్క్తిపావనః॥" పవనఃయనగా నావసథాగ్ని గృహ్యాగ్నియని యర్థము పావనఃయనగా సభ్యాగ్ని శీతనివారణార్థమైసంగ్రహించబడునది త్రేతాయనగా గార్హపత్యాహవనీయదక్షిణాగ్నులు ప్రసిద్ధములీయయిదగ్నుల నెవడు సాయంప్రాతఃకాలములందు ప్రజ్వలింపజేయునతడు పఙ్క్తిపావనుడని హారీతుడు ఋగ్వేదమందు త్రిసుపర్ణమనే వేదభాగమున్నతము గల పురుషుడు శిక్షాదిషడంగవేత్తయును పైనిషడంగాధ్యేతయని జెప్పబడెను బ్రాహ్మవివాహదత్తకన్యాజాతుడు ఆరణ్యకమందు గానము జేయబడు జ్యేష్ఠసామములను గానము జేయువాడు నీయాగురును బఙ్క్తిపావనులని యుత్తరశ్లోకముతో నన్వయము॥ ౧౮౫॥

మూ॥ వేదార్థవిత్ప్రవక్తాచ బ్రహ్మచారీ సహస్రదః। శతాయుశ్చైవవిజ్ఞేయా బ్రాహ్మణాః పఙ్క్తిపావనాః॥ ౧౮౬॥

వేదము జదువకున్నను గురువు వలన వేదార్థమును దెలిసికొనిన వాడును దాని నొరులకు జెప్పెడివాడును బ్రహ్మచారియు "సహస్రదః" యనుచో దయవిశేషమును జెప్పుకున్నను॥ "శ్రు॥ గావోవై యజ్ఞస్యమాతరః॥" యజ్ఞమునకు గోవులు

తల్లులను బ్రతికించిన పేయిగోవులనిచ్చినవాడును బహుదాతయు నగు నాతడును నూ రేడులు బ్రతికినవాడును॥ "శ్లో॥ శ్రోత్రియాయైవ దేయాని" యనుటచే శ్రోత్రియత్వ ముండగాను నుక్తగుణయుక్తుడు పఙ్క్తిపావనుడగుచున్నాడు॥ ౧౮౬॥

మూ॥ పూర్వేద్యురపరేద్యుర్వా శ్రాద్ధకర్మణ్యుపస్థితే। నిమం
త్రయేత త్ర్యవరాంత్సమ్యగ్విప్రాన్ యథోదితాన్॥౧౮౭॥

శ్రాద్ధదినమునకు తొలి దినమందైనను శ్రాద్ధదినమందైనను పూర్వోక్తలక్షణ ములుగల బ్రాహ్మణులనైదుగురిలో ముగ్గురు తక్కువగాన నిద్దరిననియర్థము స్వీకరించవని జెప్పుట వలన లెస్సగా నర్చించి నిమంత్రణము జేయవలయును॥ ౧౮౭॥

మూ॥ నిమంత్రితో ద్విజః పిత్ర్యే నియతాత్మా భవేత్సదా। నచ
ఛ్ఛందాంస్యధీయీత యస్య శ్రాద్ధంచ తద్భవేత్॥ ౧౮౮॥

శ్రాద్ధమందు నిమంత్రితుడగు బ్రాహ్మణుడు నిమంత్రణము మొదలు శ్రాద్ధాహో రాత్రములందు మైథుననివృత్తియు వాఙ్నియమము గలవాడు గావలెను- అవశ్య కర్తవ్యజపాదులు దప్ప వేదాధ్యయనము జేయగూడదు శ్రాద్ధకర్తకును నిదేనియ మము॥ ౧౮౮॥

మూ॥ నిమంత్రితాన్హి పితర ఉపతిష్ఠంతి తాన్ ద్విజాన్।వాయు
వచ్చాను గచ్ఛంతి తథాసీనా నుపాసతే॥ ౧౮౯॥

ఇది పూర్వశ్లోకమున కనువాదము నిమంత్రితులగు నా బ్రాహ్మణులను పితృదే వత లదృశ్యరూపులై యధిష్ఠించి యుందురు ప్రాణవాయువులువలె ననుసరింతు రు వారుకూర్చుండిన సమీపమందుండురు గాన నియమవంతులు గావలయును॥

మూ॥ కేతితస్తు యథా న్యాయం హవ్యకవ్యే ద్విజోత్తమః। కథం
చిదత్యతిక్రామన్ పాపస్సూకరతాం వ్రజేత్॥ ౧౯౦॥

యథా శాస్త్రముగ హవ్యకవ్యములందు నిమంత్రితుడై యంగీకరించిన బ్రా హ్మణుడే కారణముననైన భోజనమొనరించకుండిన నతండా పాపముచే నన్యజ న్మమందు సూకరమై బుట్టును॥ ౧౯౦॥

మూ॥ ఆమంత్రితస్తు యశ్శ్రాద్ధే వృషల్యా సహ మోదతే। దా

తుర్య్యద్వృషల్యాం కించి త్తత్సర్వం ప్రతిపద్యతే॥ ౧౯౧॥

"శ్లో॥ నియతాత్మాభవేత్సదా।" యనుట వలన మైథున నిషేధము ప్రాప్తించిన నిప్పుడు వృషలీగమన మధికదోషమని కనపరచుచున్నాడు- వృషలి యనగా శూద్రస్త్రీ నిమంత్రితుడైన యేవిప్రుడు శూద్రస్త్రీతో బోయి రమించునో వాడా శ్రాద్ధకర్తయొక్క పాపమే మున్ననంతయును గొనును- ఇట్లని పాపమగునని వివక్షచేయబడెను యట్లు గాకున్న నాగర్తకు పాపము లేకున్న వీడికి పాపములేకపోవలసినది- ఇది దాతకు ప్రాయశ్చిత్తముగా జెప్పబడలేదు కర్తపాపమునువాడు గొనుటచే ఇచ్చట మేధాతిథిగోవిందరాజులు సామాన్యముగ బ్రహ్మచర్యవిధానము వలన"వృషస్యంతిచపలయతిభర్తారంమితి వృషలీ" యనగా భర్తకు కామమును బుట్టించునది బ్రాహ్మణియైన వృషలియగుచున్నదని చెప్పిరి॥ ౧౯౧॥

మూ॥ అక్రోధనా శ్శౌచపరా స్సతతం బ్రహ్మచారిణః । న్యస్తశ
స్త్రామహాభాగాః పితరః పూర్వదేవతాః॥ ౧౯౨॥

క్రోధరహితులు నంత స్స్బాహ్యాశౌచయుక్తులు నంగనాసంగరహితులు యుద్ధాదిశూన్యులు దయాదిగుణవంతులు ననాదిదేవతలునగు వారు పితృదేవతలదిగావున కర్తయు భోక్తలును నతినియతులు గావలయును॥ ౧౯౨॥

మూ॥ యస్మాదుత్పత్తిరేతేషాం సర్వేషా మప్యశేషతః । యేచ
యైరుపచర్యాస్స్యు ర్నియమైస్తా న్నిబోధత॥ ౧౯౩॥

ఈ సమస్తపితృదేవతలయొక్క యుత్పత్తియెవరి వలననో బ్రాహ్మణాదులు వీరినే నియమములచే సేవించవలెనో వీరెవరో వాటినన్నిటినిన్ని నిశ్శేషముగ జెప్పెదను వినుండు॥ ౧౯౩॥

మూ॥ మనోర్హైరణ్యగర్భస్య యేమరీచ్యాదయస్సుతాః । తే
షామృషీణాంసర్వేషాం సుతాఃపితృగణాస్స్మృతాః॥ ౧౯౪॥

హిరణ్యగర్భాపత్యమగు మనువుయొక్క పుత్రులగు పూర్వోక్తమరీచ్యాదుల సుతులు సోమపాదులు పితృగణమైరి॥ ౧౯౪॥

మూ॥ విరాట్సుతాస్సోమసద స్సాధ్యానాం పితరస్స్మృతాః। అ

గ్నిష్వాత్తాశ్చ దేవానాం మారీచా లోకవిశ్రుతాః ॥౧౯౫॥

విరాట్పుత్రులు సోమసదులను వారు సాధ్యులకు పితరులగుచున్నారు మరీచి పుత్రులగు నగ్నిష్వాత్తాఖ్యులు దేవతలకు పితరులయిరి॥ ౧౯౫॥

మూ॥ దైత్య దానవ యక్షాణాం గంధర్వోరగరక్షసామ్ । సుప
ర్ణకిన్నరాణాంచ స్మృతా బర్హిషదో ఽత్రిజాః॥౧౯౬॥

ప్రథమాధ్యాయోక్త దైత్యాదులగు వారి కందరికిని అత్రిజులగు బర్హిషదులు పితరులయిరి॥ ౧౯౬॥

మూ॥ సోమపానామ విప్రాణాం క్షత్రియాణాం హవిర్భుజః । వై
శ్యానామాజ్యపానామ శూద్రాణాంతు సుకాలినః॥౧౯౭॥

బ్రాహ్మణులకు సోమపులు క్షత్రియులకు హవిర్భుజులు వైశ్యులకాజ్యపులు శూద్రులకు సుకాలికులు నీపేళ్లు గలవారు పితరు లగుచున్నారు॥ ౧౯౭॥

మూ॥ సోమపాస్తుకవేః పుత్రా హవిష్మంతోఽంగిరస్సుతాః । పుల
స్త్యస్యాజ్యపాః పుత్రా వసిష్ఠస్య సుకాలినః॥ ౧౯౮॥

సోమపులు భృగుపుత్రులు హవిష్మంతులంగిరఃపుత్రులాజ్యపులు పులస్త్యపుత్రులు సుకాలులు వసిష్ఠపుత్రులు॥ ౧౯౮॥

మూ॥ అగ్నిదగ్ధానగ్నిదగ్ధాన్ కావ్యాన్బర్హిషదస్తథా। అగ్ని
ష్వాత్తాంశ్చ సౌమ్యాంశ్చ విప్రాణామేవనిర్దిశేత్॥౧౯౯॥

అగ్నిదగ్ధులు ననగ్నిదగ్ధులు కావ్యులు బర్హిషదులు నగ్నిష్వాత్తులు సౌమ్యులు వీరిని బ్రాహ్మణులకనిని ర్దేశించవలెను॥ ౧౯౯॥

మూ॥ య ఏతేతు గణాముఖ్యాః పితౄణాం పరికీర్తితాః । తే
షామపీహ విజ్ఞేయం పుత్రపౌత్ర మనంతకమ్॥ ౨౦౦॥

వీరు ప్రధానభూతులగు పితృదేవతల గణములవారు ముఖ్యులని చెప్పబడిరి వీరి పుత్రపౌత్రులు అనంతములు పితృగణము లుండెనని తెలియవలయును గావున వరుసు వరేణ్యుడు నని మార్కండేయపురాణమందు జెప్పబడెరి॥ ౨౦౦॥

మూ॥ ఋషిభ్యః పితరోజాతాః పితృభ్యో దేవదానవాః । దేవే
భ్యస్తు జగత్సర్వం చరంస్థాణ్వనుపూర్వశః॥ ౨౦౧॥

మరీచ్యాదులగు ఋషులవలన పైని జెప్పిన ప్రకారము పితృదేవతలు పుట్టిరి పితృదేవతల వలన దేవదానవులు జన్మించిరి దేవతల వలన స్థావరజంగమ ప్రపంచము సంభవించెను- గావున సోమపాదుల వలన బుట్టుటచే పితృపితామహాదిశ్రాద్ధములందు వీరుపూజనీయులగుచున్నారు సోమపాదులు పూజితులై శ్రాద్ధఫలము నిచ్చుట కగుచున్నారు ప్రకృతము పిత్రాదిశ్రాద్ధము స్తుత్యర్థమీసోమపాదిపితృగణోపన్యాసమిట్లు గాకున్న నావాహనకాలమందు బ్రాహ్మణాదులచే నిజపిత్రాదులు సోమపాదిరూపముచే ధ్యేయులిట్లు వ్యవస్థయు జ్ఞానము ననుష్ఠానపరతయు గావచ్చును॥ ౨౦౨॥

మూ॥ రాజతైర్భాజనైరేషా మధోవా రాజతాన్వితైః। వార్య
పిశ్రద్ధయాదత్త మక్షయాయోపకల్పతే॥ ౨౦౨॥

ఈపితృదేవతలకు రజతపాత్రముచేగాని లేదా రజతాన్విత తామ్రాదిపాత్రములచేగాని జలమైన శ్రద్ధచేనిచ్చిన నక్షయసుఖమునకగును పాయసాదులొసగిననేమిజెప్పవచ్చును॥ ౨౦౨॥

మూ॥ దేవకార్యాద్ద్విజాతీనాం పితృకార్యం విశిష్యతే। దైవం
హిపితృకార్యస్య పూర్వమాప్యాయనం స్మృతం॥ ౨౦౩॥

దేవతల నుద్దేశించిచేసెడికర్మము దేవకార్యమీదేవకార్యముకంటె పితృకార్యముప్రధానము ముందు దేవకార్యమునచేః పితృకార్యముసేయుట యాప్యాయనకరమని చెప్పబడెను॥ ౨౦౩॥

మూ॥ తేషా మారక్షభూతంతు పూర్వందైవం నియోజయేత్।ర
క్షాంసిహి విలుంపంతి శ్రాద్ధమారక్షవర్జితం॥ ౨౦౪॥

పితృదేవతలకు రక్షాభూతము దైవమటులనగా విశ్వేదేవస్థానీయుడగు బ్రాహ్మణునిముందుగా నిమంత్రణము జేయవలయునట్లుగాకున్నరక్షావర్జితమగు శ్రాద్ధమును రాక్షసులు విచ్ఛిన్నముగనొనర్తురు॥ ౨౦౪॥

మూ॥ దైవాద్యంతం తదీహేత పిత్రాద్యంతం నతద్భవేత్ । పిత్రా
ద్యంతం త్వీహమానః క్షిప్రంనశ్యతి సాన్వయః॥ ౨౦౫॥

అదిగావుననే ఆశ్రాద్ధము దైవాద్యంతముగా నిశ్చయించవలయును దేవకర్మ మాదియందును నంతమందునుగలదానిగా జేయవలయుననియర్థము నిమంత్రణాద్యర్చనమంతయు దేవస్థానమునందు ముందుగా జేసి విసర్జనము దైవాంతముగ జేయవలయును॥ "శ్లో॥ యత్రతత్క్రియతే కర్మ పైతృకే బ్రాహ్మణంప్రతి । తత్సర్వంతత్రకర్తవ్యం వైశ్వదైవికపూర్వకం" ఆశ్రాద్ధమందే కర్మమైన దేవస్థానీయబ్రాహ్మణార్చన పూర్వకముగ జేయువలయునని దేవలుడు - పిత్రాద్యంతముగ జేయగూడదటు జేసినససంతానముగ నశించును॥ ౨౦౫॥

మూ॥ శుచిందేశం వివిక్తంచ గోమయేనోపలేపయేత్ । దక్షిణా
ప్రవణంచైవ ప్రయత్నేనోపపాదయేత్॥ ౨౦౬॥

ఎముకలు బొగ్గులుమొదలగువాటిచే నుపహతముగాని నిర్జనమగు స్థలమును గోమయముచే నలకవలయును ఆభూమి దక్షిణమునకుపల్లముగనుండునట్టిదిగా బ్రయత్నమున సంపాదించవలయును॥ ౨౦౬॥

మూ॥ అవకాశేషు చోక్షేషు నదీతీరేషు చైవహి । వివిక్తేషు చ
తుష్యంతె దత్తేనపితరస్సదా॥ ౨౦౭॥

చోక్షేషయనగ స్వభావశుద్ధములగు నరణ్యాది ప్రదేశములందును జనశూన్యస్థలములందును బెట్టిన శ్రాద్ధముచే పితృదేవతలు సంతోషింతురు॥ ౨౦౭॥

మూ॥ ఆసనేషూపక్లృప్తేషుబర్హిష్మత్సు పృథక్పృథక్ । ఉపస్పృ
ష్టోదకాన్సమ్యగ్విప్రాంస్తానుపవేశయేత్॥ ౨౦౮॥

ఆస్థలమందు కుశలచే వేరువేర నేయబడినయాసనములందు నున్ననిమంత్రితులగు బ్రాహ్మణులస్నానాచమనాదులచే శుద్ధులగువారిని గూర్చుండబెట్టవలెను అందు దేవార్థమైనబ్రాహ్మణునకు ప్రాఙ్ముఖముగ రెండుదర్భలున్న పీఠస్థానము ప్రత్యేకముదక్షిణాగ్రముగనొకటియు నాసనంబుగ నేయవలయు నిందుకు దేవలవచనము॥ "శ్లో॥ యేచాత్రవిశ్వేదేవానాం విప్రాఃపూర్వ నిమంత్రితాః । ప్రా

-ప్సుఖాన్యాసనాన్యేషాం ద్విదర్భోపహతానిచ । దక్షిణాముఖయుక్తాని పిత్ర్యాణామాసనానిచ । దక్షిణాగ్రైకదర్భాణి ప్రోక్షితానితిలోదకైః॥" దీనియర్థము పైనివ్రాయబడెను దక్షిణాముఖయుక్తములనగా దక్షిణాగ్రములని అగ్రములనగా మొదలునపేక్షించి॥ ౨౦౮॥

మూ॥ ఉపవేశ్యతుతాన్విప్రా నాసనే ష్వజుగుప్సితాన్।గంధమా
లై ర్యస్సురభిభి రర్చయే ద్దైవపూర్వకం॥ ౨౦౯॥

అట్లుపవసించియున్న శుచులగు బ్రాహ్మణులను సురభిగంధపుష్ప ధూపదీపాదులచే దేవపూర్వకముగ నర్చింపవలయును॥ ౨౦౯॥

మూ॥ తేషా ముదకమానీయ సపవిత్రాం స్తిలానపి।అగ్నౌకుర్యా
దనుజ్ఞాతో బ్రాహ్మణో బ్రాహ్మణైస్సహ॥ ౨౧౦॥

ఆబ్రాహ్మణులకు దర్భతిలయుక్తమగునర్ఘ్యోదకమునిచ్చి బ్రాహ్మణుడు వారిచే ననుజ్ఞాతుడై యగ్నియందు హోమముజేయవలయును అదిస్వగృహ్యోక్తప్రకారముగజేతునని ప్రార్థించినవారు కురువ్వయని కానిఓమని కాని యనుజ్ఞనొసగవలెను॥ ౨౧౦॥

మూ॥ అగ్నేస్సోమయమాభ్యాంచ కృత్వాప్యాయన మాదితః ।
హవిర్దానేనవిధివ త్పశ్చాత్సంతర్పయేత్పితౄన్॥ ౨౧౧

అగ్నికిన్ని సోమయములకున్ను పర్యుక్షణాదివిధిపూర్వకముగ హవిస్సునుహోమముజేసి వారిప్రీణనమయిన యనంతరమన్నాదికముచే పితృదేవతలనుదృప్తినొందింపవలెను॥ సహాదిశబ్దములేకపోవడముచే సోమునకు యమునకు వేరుగ హోమముగావలెను ఎచ్చటసాహిత్యమువివక్షితమో యచ్చటసహాదిశబ్దముచేయుచున్నాడనిమున్ను చెప్పబడెను॥ ౨౧౧॥

మూ॥ అగ్న్యభావేతు విప్రస్య పాణావేవోపపాదయేత్। యో
హ్యగ్నిస్సద్విజోవిప్రై ర్మంత్రదర్శిభిరుచ్యతే॥ ౨౧౨॥

అగ్నిలేకుండిన బ్రాహ్మణహస్తమందాహుతిత్రయముజేయవలయును అగ్నికిన్ని బ్రాహ్మణునకున్ను భేదములేదని మంత్రవేత్తలగు బ్రాహ్మణులుచెప్పిరి గావున

అగ్న్యభావమనుపనీతునకున్ను సమావర్తనమయి వివాహముగాకున్న వానికి న్నినష్టభార్యుడికిన్ని సంభవించును॥ ౨౧౨॥

మూ॥ అక్రోధనాన్ సుప్రసాదాన్ వదంత్యేతాన్ పురాతనాన్।
లోకస్యాప్యాయనేయుక్తాన్ శ్రాద్ధదేవాన్ ద్విజోత్తమాన్॥

క్రోధరహితులు ప్రసన్నముఖులు ప్రవాహానాది పురాతనులు నగ్న్యాప్యాయనాహుతిత్యాద్యుక్తప్రకారముచే లోకోపకర్తలనగు బ్రాహ్మణులను శ్రాద్ధమందు దేవతుల్యులనుగా మన్వాదులు చెప్పుచున్నారు గావుననే వారిహస్తమందు హోమము ప్రశస్తమని పూర్వశ్లోకమునకనువాదము॥ ౨౧౩॥

మూ॥ అపసవ్యమగ్నౌకృత్వా సర్వమావృత్య విక్రమం। అపసవ్యేన హస్తేన నిర్వపేదుదకం భువి॥ ౨౧౪॥

అగ్న్యాకరణమందనుష్ఠానక్రమమపసవ్యముగాను దక్షిణసంస్థముగాజేసి యటుపైని పిండప్రదానముజేసెడిభూమియందుదకమును దక్షిణహస్తముచేజల్లవలెను॥

మూ॥ త్రీంస్తుతస్మాద్ధవిశ్శేషాత్ పిండాన్కృత్వా సమాహితః।
ఔదకేనైవవిధినా నిర్వపేద్దక్షిణాముఖః॥ ౨౧౫॥

ఆశేషాన్నములోనుంచి యన్నముతీసి మూడుపిండములుజేసి సమాహితమనస్కుడగుచు దక్షిణాభిముఖముగా దర్భలయందౌదకవిధిచే దక్షిణహస్తముచేత పిండప్రదానమునుజేయవలయును॥ ౨౧౫॥

మూ॥ న్యుప్యపిండాం స్తతస్తాంస్తు ప్రయతో విధిపూర్వకం। తేషు దర్భేషుతంహస్తం నిమృజ్యా ల్లేపభాగినాం॥ ౨౧౬॥

స్వగృహ్యోక్తప్రకారముగా సాదర్భలయందు పిండములనుంచి నియతచిత్తుడై యాదర్భలమొదళ్లపైని ప్రపితామహపిత్రాదులగులేపభాకులకు దనహస్తములను నిర్లేపముగా గడిగికొనవలెను॥ "స్మృ॥ దర్భమూలేషుకరావఘర్షణ॥" మనెడివచనమువలన॥ ౨౧౬॥

మూ॥ ఆచమ్యోద క్పరావృత్య త్రిరాయమ్య శనైరసూన్। షడృ

తాంశ్చ నమస్కుర్యా త్పిత్నాన్నేవచ మంత్రవిత్॥ ౨౧౭॥

అనంతరము త్తరాభిముఖముగ నాచమించి యథాశక్తిగ ప్రాణాయామత్ర యమొనర్చి వసంతాయనమస్తుభ్య మిత్యాదిమంత్రము లచే నారుబుతువులకును నమస్కరించిన మోవః పితరఇత్యాదిమంత్రముచే దక్షిణాభిముఖుడై పిత్రుదేవతలకు నమస్కరించి జలములచే పిండములకుచుట్టును తిప్పవలెను॥ ౨౧౭॥

మూ॥ ఉదకం నినయేచ్ఛేషం శనైఃపిండాంతికే పునః। అవజిఘ్రేచ్చ తాన్పిండా న్యథాన్యుప్తాన్ సమాహితః॥ ౨౧౮॥

మున్ను పిండస్థానమందు వేయుటకునిచినజలశేషమును ప్రతిపిండ సమీపమందు క్రమముగా విడువవలయును పిండప్రదానమే క్రమమునజేసెనో యాక్రమముచే సమాహితమనస్కుడై పిండములనాఘ్రాణించవలయును॥ ౨౧౮॥

మూ॥ పిండేభ్య స్త్వల్పికాం మాత్రాం సమాదా యానుపూర్వశః। తానేవవిప్రా నాసీనాన్ విధివత్పూర్వమాశయేత్॥ ౨౧౯॥

క్రమముగా ఆపిండములలో కొంచముకొంచమున్నుదీసి పిత్రాద్యర్థక నిమంత్రితబ్రాహ్మణులకు భోజనకాలమందు ముందుగాభుజింపజేయవలయును॥ అది పితృపిండసమానీతమగు నన్నాంశము పితృస్థబ్రాహ్మణునకున్ని ట్లే పితామహప్రపితామహపిండములయొక్క అంశమున్ను పితామహ ప్రపితామహ బ్రాహ్మణులకున్ను బెట్టవలయును॥ ౨౧౯॥

మూ॥ ధ్రియమాణేతు పితరి పూర్వేషా మేవ నిర్వపేత్। విప్రవద్వాపి తంశ్రాద్ధే స్వకంపితర మాశయేత్॥ ౨౨౦॥

తండ్రిజీవించియుండగా చనిపోయిన పితామహాదిత్రయమునకు శ్రాద్ధము చేయుదగినది యెలాగుగాకుంటే పితృవిప్రస్థానమందు తండ్రిచేతనే భుజింపజేయవలయును॥ పితామహప్రపితామహస్థానముల యందిద్దరు బ్రాహ్మణులను భుజింపజేయవలయును రెండుపిండములనే పెట్టవలయును ॥ ఇచ్చట మేధాతిథి గృహ్యసూత్రమువ్రాసెను॥ "సూ॥ యేభ్యఃపితా దద్యాత్తేభ్యః పుత్రోదద్యాత్ పితా ప్రేతాహితాగ్నిస్స్యాదామితి॥" తండ్రిన్ని కొడుకున్ను ఆహితాగ్నులయితే తండ్రి యెవరికిశ్రాద్ధము బెట్టునో కొడుకున్ను వారికే పెట్టవలెను॥ ౧౨౦॥

మూ॥ పితా యస్య తు వృత్తస్స్యా జ్జీవేచ్చాపి పితామహః। పితు
స్సనామసంకీర్త్య కీర్తయేత్ప్రపితామహం॥ ౨౨౧॥

ఇచ్చట నామకీర్తనము శ్రాద్ధోపలక్షణార్థము తండ్రిచనిపోయిపితామహుడు బ్రతికియున్నట్టాయితే పితృప్రపితామహులకు శ్రాద్ధముజేయవలయును గోవిందరాజు. జై తె॥ "సూ ॥ యస్యపితృప్రపితామహౌ ప్రేతౌస్యాతాంస పితృభ్యః పిండంనిధాయ పితామహాత్పరంద్వాభ్యాం దద్యాత్॥" ఎవనికిపితృప్రపితామహులుపోదురో వాడుతండ్రికి పిండముబెట్టి పితామహునిపరమందిద్దరికిజేయవలెను విష్ణువచనమువలన ప్రపితామహునకు నతనితండ్రికిని శ్రాద్ధముజేయవలయుననివ్యాఖ్యానముజేసెను॥

మూ॥ పితామహో వా తచ్ఛ్రాద్ధం భుంజీతేత్య బ్రవీన్మనుః। కా
మం వా స మనుజ్ఞాత స్స్వయమేవ సమాచరేత్॥ ౨౨౨॥

పైశ్లోకమందుజెప్పినట్లు బ్రతికియున్నతండ్రి యెట్లుభోజ్యుడగునో యటులేపితామహుడు జీవించియున్నచో పితామహస్థానమందు పితామహుడేభుజింపవలెను పితృప్రపితామహులకు బ్రాహ్మణులను గూచుండబెట్టవలెను వీరికేపిండదానమును జేయవలెను లేకబ్రతికియున్నపితామహునిచే నాజ్ఞాపించబడినవాడై పితామహునిస్థానమందు గూచుండబెట్టవచ్చును లేదా తనయిచ్ఛచే॥ "సూ॥ పితృపితామహయోశ్శ్రాద్ధద్వయంకుర్యాత్॥" పితృపితామహులనగా ప్రపితామహవృద్ధప్రపితామహులకుశ్రాద్ధద్వయమును జేయవలయునను విష్ణువచనమువలన తనతండ్రికిన్ని ప్రపితామహునకున్ను వృద్ధప్రపితామహునకున్ను శ్రాద్ధత్రయము జేయవలయును॥ ౨౨౨॥

మూ॥ తేషాం దత్త్వా తు హస్తేషు సపవిత్రం తిలోదకం। తత్పిం
డాగ్రం ప్రయచ్ఛేత స్వధైషా మస్త్వితి బ్రువన్॥ ౨౨౩॥

"పిండేభ్య స్త్వల్పికాంమాత్రాం॥" మనుశ్లోకములో పిండములనుండి స్వల్పమన్నమునుదీసియనుదానికాలమిదిగావున నన్నముబెట్టెడువిధినిజెప్పుచున్నాడు॥ ఆబ్రాహ్మణులహస్తములందు సదర్భతిలోదకమునుంచి పిమ్మట నాపిండాగ్రములను "పితౄస్స్వధాస్తు పితామహాయస్వధాస్తు ప్రపితామహాయస్వధాస్తు॥" యనిపలుకుచు క్రమముగా ముగ్గురికినీవలయును॥ ౨౨౩॥

మూ॥ పాణిభ్యాం తూపసంగృహ్య స్వయమన్నస్య వర్ధితం ।
విప్రాంతికే పితౄన్ ధ్యాయన్ శనకై రుపనిక్షిపేత్ ॥ ౨౨౪॥

అన్నముచేబూర్ణమగుఘటము రెండుచేతులనుబట్టి వంటయింటినుండి దెచ్చి పితృదేవతలను ధ్యానించుచు భోక్తలసమీపమందు మెల్లగానుంచవలయును॥

మూ॥ ఉభయోర్హస్తయోర్ముక్తం యదన్నముపనీయతే। త
ద్విప్రలుంపంత్యసురాస్సహసా దుష్టచేతసః॥ ౨౨౫॥

రెండుచేతులనుండని యన్నమేది బ్రాహ్మణసన్నిధికి దేబడెనో దానిని దుష్టబుద్ధులగు రాక్షసులు విచ్ఛిన్నమొనర్తురు గాన నొకచేతితో నన్నపాత్రమును దేగూడను రెండుచేతులతో దెచ్చి వడ్డించవలయును॥ ౨౨౫॥

మూ॥ గుణాంశ్చ సూపశాకాద్యాన్ పయోదధి ఘృతంమధు। వి
న్యసేత్ప్రయతః పూర్వం భూమావేవ సమాహితః॥ ౨౨౬॥

గుణయుక్తములగు సూపశాకాదులనున్ను పాలు పెరుగు నేయి తేనియ యివన్నియున్ను శిలాదారు ఫలకాదులయందుగాకుండ భూమియందే పర్ణపాత్రములయందు సమాహితుడై వడ్డించవలయును॥ ౨౨౬॥

మూ॥ భక్ష్యం భోజ్యంచ వివిధం మూలానిచ ఫలానిచ। హృద్యాని
చైవమాంసాని పానానిసురభీణిచ॥ ౨౨౭॥

మోదకాపూపాదిభక్ష్యములును పాయసాదిభోజ్యములును నానావిధఫలమూలాదులు మనఃప్రియకరములగు మాంసములును పరిమళయుక్తములగు పానీయములును వడ్డించవలెనని పూర్వముతో నన్వయము॥ ౨౨౭॥

మూ॥ ఉపనీయతు తత్సర్వం శనకై స్సుసమాహితః । పరివేష
యేత్ప్రయతో గుణాన్ సర్వాన్ ప్రచోదయన్ ॥ ౨౨౮॥

అన్నాదికమగు నీసర్వమును బ్రాహ్మణసమీపమునకు దెచ్చి శుచియైయవ్యమందు చిత్తముంచనివాడై యిది మధురమిది యామ్లమని వాటి గుణములను జెప్పుచు క్రమముగ వడ్డించవలయును॥ ౨౨౮॥

మూ॥ నాస్రమాపాదయే జ్జాతు నకుప్యే న్నానృతంవదేత్ । నపా

దేన స్పృశే దన్నం న్నత దవధూనయేత్॥ ౨౨౯॥

రోదనమున్ను క్రోధమున్ను మృషాభాషణమును జేయగూడదు పాదముచే నన్నను స్పృశించగూడదు యెత్తియెత్తి పాత్రమెముందు బడవేయగూడదు క్రోధాశ్రుతులు పరుషార్థము లగుటచేను యీనిషేధము శ్రాద్ధాంగములని జ్ఞాపకార్థము॥ ౨౨౯॥

మూ॥ అస్రం గమయతి ప్రేతాన్ కోపోఽరీ నన్నృతం శునః । పాదస్పర్శస్తు రక్షాంసి దుష్కృతీ నవధూననమ్॥ ౨౩౦॥

ఏడ్పువనగు కన్నీళ్లు [illegible] కమును భూతప్రేతాదులనున్ను కోపము శత్రువులనున్ను అసత్యవాక్యము శునకములను పాదస్పర్శము రాక్షసులనున్ను చిమ్మవడ్డించడము పాపకారులనున్ను బొందించును గాని పితృదేవతలకు జెందదది గావున నవాదులను జేయగూడదు॥ ౨౩౦॥

మూ॥ యద్యద్రోచేత విప్రేభ్యస్తత్తద్దద్యాదమత్సరః।బ్రహ్మోద్యాశ్చ కథాః కుర్యాత్పితౄణామేతదీప్సితమ్॥ ౨౩౧॥

బ్రాహ్మణునకే దేదిరుచించునో యన్నశాకాదిక మదికనిపెట్టి యమాత్సర్యముతో వడ్డించుచుండవలయును పరబ్రహ్మనిరూపణములగు వాక్యములనే బలుకవలయును పితృదేవతల కవి యిష్టములు గావున॥ ౨౩౧॥

మూ॥ స్వాధ్యాయం శ్రావయేత్పిత్ర్యే ధర్మశాస్త్రాణి చైవహి। ఆఖ్యానానీతిహాసాంశ్చ పురాణాన్యఖిలానిచ॥ ౨౩౨॥

వేదమును మన్వాదిధర్మశాస్త్రములను సౌవర్ణమైత్రావరుణాద్యాఖ్యానములను భారతాదీతిహాసములను బ్రాహ్మాదిపురాణములను శ్రీసూక్తాదిఖిలసంహితలను "పురాణానిఖిలానిచ" యనియును బాఠాంతరము॥ ౨౩౨॥

మూ॥ హర్షయేద్బ్రాహ్మణాంస్తుష్టో భోజయేచ్చ శనైశ్శనైః। అన్నాద్యేనాసకృచ్చైతాన్ గుణైశ్చ పరిచోదయేత్॥ ౨౩౩॥

తాను సంతోషించుచు బ్రియవచనములచే బ్రాహ్మణులను హర్షింపజేయవలయును త్వరపెట్టక నిమ్మళముగ నన్నమును భుజింపజేయవలయును మృష్టాన్నము

లచేసినది పాయసమతిస్వాదుతరమివి మోదకములు హృద్యములని వస్తువుల గుణము లుగ్గడించుచు భుజింపజేయ వలయును॥ ౨౩౩॥

మూ॥ వ్రతస్థమపి దౌహిత్రం శ్రాద్ధే యత్నేన భోజయేత్ । కు
తపంచాసనం దద్యా త్తిలై శ్చ వికిరేన్మహీమ్॥ ౨౩౪॥

బ్రహ్మచారియైనను దౌహిత్రుని బ్రయత్నముచే శ్రాద్ధమందు భుజింపజేయవలయును అపిశబ్దముచే బ్రహ్మచారికాని దౌహిత్రుడను కల్పవచన పఠితుడే గావున బ్రహ్మచారిశ్రేష్ఠుడని యత్నశబ్దముచే తాత్పర్యము నేపాలకంబలమాసనముగ నీవలయును తిలలనాభూమియందు జల్లవలయును॥ ౨౩౪॥

మూ॥ త్రీణి శ్రాద్ధే పవిత్రాణి దౌహిత్రః కుతప స్తిలాః । త్రీణి
చాత్రప్రశంసంతి శౌచ మక్రోధమత్వరామ్॥ ౨౩౫॥

మున్ను జెప్పబడినవే దౌహిత్రుడు మొదలగు మూడుశ్రాద్ధమందు పవిత్రములని జ్ఞాపకము చేయబడెను శౌచము నక్రోధము నత్వరయు నీమూటిని బ్రశంసింతురు॥ ౨౩౫॥

మూ॥ అత్యుష్ణం సర్వమన్నంస్యా ద్భుంజీరం స్తేచ వాగ్యతాః। న
చ ద్విజాతయో బ్రూయు ర్దాత్రా పృష్టా హవిర్గుణాః॥

ఏవి వేడిగానుంటే భోజనమున కహాకాము యవి వేడిగలవై యన్నిపదార్థములు నుండవలయును ఫలాదులు గాక యని తాత్పర్యము అది గావుననే॥ "శ్లో॥ఉష్ణమన్నం ద్విజాతిభ్య శ్శ్రద్ధయా వినివేదయేత్ । అన్యత్ర ఫలమూలేభ్యః పానకేభ్యశ్చ పండితః॥" ఫలములు పానకములు దప్ప నన్న ముష్ణ ము నిడవలెనని శంఖవచనము- బ్రాహ్మణులు మౌనవంతులై భుజింపవలయు వస్తువుల యొకరుచిసౌష్ఠవమును దాత యడిగిన శిరఃకంపాదికముచే నైన నన్న గుణములను భోక్తలుచెప్పగూడదు॥ ౨౩౬॥

మూ॥ యావదుష్ణం భవ త్యన్నం యావదశ్నంతి వాగ్యతాః।పిత
రస్తావదశ్నంతి యావన్నోక్తా హవిర్గుణాః॥ ౨౩౭॥

ఎంత దనుక నన్నము వేడిగనుండు నెంతపర్యంతము ద్విజులు మౌనముగా భు

జింతు రెంతలో హవిర్గుణములనావిప్రులు ప్రకటించకుందు రంతటి దాకనే పితృదేవతలు శ్రాద్ధమందు భుజింతురు॥ ౨౩౭॥

మూ॥ యద్వేష్టిత శిరాభుఙ్క్తే యద్భుఙ్క్తే దక్షిణాముఖః। సో
పానత్కశ్చ యద్భుఙ్క్తే తద్వై రక్షాంసి భుంజతే॥ ౨౩౮॥

తలనుష్ణీషముండగా నేదిదినునో పాదరక్షలు విడువక నేని దినునో దక్షిణాభిముఖునుగ నేనిం దినునో యది రాక్షసు లపహరించి దిని మెదరుగాని పితృదేవలు దినరు గావున నట్లుభుజించగూడదు॥ ౨౩౮॥

మూ॥ చండాలశ్చవరాహశ్చ కుక్కుటశ్శ్వాతథైవచ। రజస్వ
లాచ షండశ్చ నేక్షేరన్నశ్నతోద్విజాన్॥ ౨౩౯॥

చండాలుడును పందియు కోడి కుక్క రజస్వలాస్త్రీ నపుంసకుడును శ్రాద్ధమందు భుజించుచున్న బ్రాహ్మణులం జూడకుండునట్లు జేయవలయును॥ ౨౩౯॥

మూ॥ హోమేప్రదానే భోజ్యేచ యదేభిరభివీక్ష్యతే। దైవేక
ర్మణి పిత్ర్యేవా తద్గచ్ఛత్యయథాతథమ్॥ ౨౪౦॥

అగ్నిహోత్రాది హోమమందున్ను గోహిరణ్యాదిదానమందున్ను బ్రాహ్మణభోజనమందున్ను దేవకర్మములందున్ను పితృకర్మము లందున్ను పైని చెప్పబడిన చండాలాదులు జూచిరేని యాకర్మము లెందుకైతే చేసిరో యందు కుపయోగించక పోవును॥ ౨౪౦॥

మూ॥ ఘ్రాణేన సూకరోహంతి పక్షవాతేన కుక్కుటః। శ్వాతుదృ
ష్టినిపాతేన స్పర్శేనావరవర్ణజః॥ ౨౪౧॥

హవ్యకవ్యములందు సూకరమన్నాదికము నాఘ్రాణించిన నాఫలమును నశింపజేయును గావున నాఘ్రాణమునకుతగిన స్థలమునందు దానినుండకుండ జేయవలయును కోడి రెక్కలగాలియాయన్నాదికమునకు తగిలినను తత్కర్మఫలముబోవును గాన కుక్కుటపక్షవాతము తగులునట్టి సమీపమందుండకుండా దానిని దోలివేయవలెను శునక మన్నాదికమునుజూచిన నిష్ఫలమగును పైన్లోకమందు శునకముచూడకూడదని జెప్పియున్నను అది అధికదోషమని మరల జెప్పెను యిట్లుగాక

న్న శ్రాద్ధకర్తృభోక్తలయొక్క దృష్టిపథమందవి బడగూడదని కుల్లూకభట్టు వ్రాసెను. శూద్రుడాద్విజుల యన్నాదికమునుముట్టిన నిష్ఫలముగ నొనర్చుననియర్థము॥

మూ॥ ఖంజోవా యదివాకాణో దాతుఃప్రేష్యోపి వాభవేత్।హీ
నాతిరిక్త గాత్రోవా తమప్య పనయేత్పునః॥ ౨౪౨॥

సొట్టవాడైనా నొకకన్నుగుడ్డివాడైనా దాతయొక్కశిష్యుడైనా అపిశబ్దనుచేత నన్యుడైనా వ్రేళ్ళుమొదలగు నవయవములధికములుండిన నల్పములుండిననట్టివానినిన్ని దూరముగ బరిహరింపవలయును॥ ౧౪౨॥

మూ॥ బ్రాహ్మణం భిక్షుకంవాపి భోజనార్థముపస్థితం।బ్రాహ్మ
ణైరభ్యనుజ్ఞాత శ్శక్తితః ప్రతిపూజయేత్॥ ౨౪౩॥

అతిథిగానయిన భిక్షార్థమైనవచ్చిన బ్రాహ్మణునకు నిమంత్రిత బ్రాహ్మణుల యనుమతివడసి శక్తికొలది భోజనమొసగిగాని భిక్షనొసగిగాని వానిపూజించవలెను॥ ౨౪౩॥

మూ॥ సార్వవర్ణికమన్నాద్యం సన్నయాప్లావ్యవారిణా।సము
త్సృజేద్భుక్తవతా మగ్రతో వికిరన్భువి॥ ౨౪౪॥

ఇచ్చట వర్ణశబ్దము ప్రకారవాచకము సర్వప్రకారమగు నన్నాదికము వ్యంజనాదులతోగలపి జలముచే దడపి భుజించినబ్రాహ్మణులయెదుటను దర్భలపైని నివిజల్లవలెను॥ ౨౪౪॥

మూ॥ అసంస్కృత ప్రమీతానాం త్యాగినాం కులయోషితాం।ఉ
చ్ఛిష్టంభాగధేయం స్యాద్దర్భేషు వికిరశ్చయః॥ ౨౪౫॥

సంస్కారానర్హులై మృతులగుబాలులకున్నుకులస్త్రీలుదోషములేనివారైనప్పటికివిడచిన వారికిన్నియీదర్భలయందుంచిన యుచ్ఛిష్టాన్నభాగమయ్యీని యనికుల్లూకభట్టు॥ త్యాగినామనగాగుర్వాదులవిడచినవారికిన్ని కులయోషితామనగాసత్కులమునంబుట్టికన్యకలయ్యేస్వతంత్రలై యున్నస్త్రీలకున్ననిమరికొందరున్ను సామాన్యముగాస్త్రీపురుషవివేచనములేకుండకులధర్మాదులనువిడచినవారికనిచెప్పి విశేషముగా "కులయోషితా" మని మంచికులమందుబుట్టి చెడిపోయినస్త్రీలకున్నని

గోవిందరాజున్నవారీః రి॥ ౨౪౫॥

మూ॥ ఉచ్ఛేషణంభూమిగత మజిహ్మస్యాశఠస్యచ। దాసవర్గస్య తత్పిత్ర్యే భాగధేయం ప్రచక్షతే॥ ౨౪౬॥

భూమిగతమగు నుచ్ఛిష్టము అవక్రత్వమున నలసత్వముగల దాసవర్గమునకు పితృకార్యములందు భాగము మన్వాదులు జెప్పిరి॥ ౨౪౬॥

మూ॥ ఆసపిండ క్రియాకర్మ ద్విజాతేస్సంస్థితస్యతు। అదైవంభోజయేచ్ఛ్రాద్ధం పిండమేకంతు నిర్వపేత్॥ ౨౪౭॥

సపిండీకరణముమట్టుకు నీచొప్పుననగా సంవత్సరాంతసాపిండ్యవిషయము సంవత్సరమందు జేసెడి మాసికములకు విశ్వేదేవస్థానమకరలేకుండ ప్రేతోద్దేశముగనొక బ్రాహ్మణునకు బెట్టవలయును ఏకపవిత్రమేకపిండముగ జేయవలయును॥ శ్లో॥ఏకోద్దిష్టం దైవహీన మేకార్ఘ్యైకపవిత్రకం।ఆవాహనాగ్నౌ కరణరహితంహ్యాపసవ్యవత్॥ యను యాజ్ఞవల్క్యవచనమువలన॥ ౨౪౭॥

మూ॥ సహపిండ క్రియాయాంతు కృతాయామస్యధర్మతః। అనయైవావృతా కార్యం పిండనిర్వపణం సుతైః॥ ౨౪౮॥

ఎవనికి నేకోద్దిష్టము జెప్పబడెనో వానికి సపిండీకరణమయ్యేపర్యంత మేకోద్దిష్టవిధానముచే గావలె నటపైని సపిండీకరణమయినయనంతరమీ యమావాస్యావిధిచే పిండపితృయజ్ఞము మృతాహశ్శ్రాద్ధముచేయ సుతులచేదగినవి॥ ౨౪౮॥

మూ॥ శ్రాద్ధంకృత్వాయ ఉచ్ఛిష్టం వృషలాయప్రయచ్ఛతి।సమూఢోనరకంయాతి కాలసూత్రమవాక్ఛిరాః॥ ౨౪౯॥

ఆశ్రయించియున్న శూద్రులకుచ్ఛిష్టమిడ ప్రసక్తించిన నీనిషేధము॥శ్రాద్ధభోజనోచ్ఛిష్టము నెవడు శూద్రునకు బెట్టునో యామూఢుడు తలక్రిందుగా కాలసూత్రమను నరకమందుబడును॥ ౨౪౯

మూ॥ శ్రాద్ధభుగ్వృషలీతల్పం తదహర్యోధిగచ్ఛతి। తస్యాఃపురీషేతన్మాసం పితరస్తస్య శేరతే॥ ౨౫౦॥

ఇచ్చట వృషలీశబ్దము భర్తను చపలునిగాజేయునది వృషః యని స్త్రీమాత్ర

పరము బ్రాహ్మణపరిణీతయగు బ్రాహ్మణకన్యయున్ను వృషలీయనబడును శ్రాద్ధభోజనమొనర్చి తదహోరాత్రములందు స్త్రీసంగమము చేసినయతని పితృదేవతలా స్త్రీపురీషమందు బరుందురుగావున నట్లు సేయగూడదని సిద్ధాంతము॥ ౨౫౦

మూ॥ పృష్ట్వా స్వదిత మిత్యేవం తృప్తానాచమయే త్తతః। ఆచాంతా
ననుజానీయా దభితో రమ్యతామితి॥ ౨౫౧॥

బ్రాహ్మణులు తృప్తిగా భుజించినట్లు తెలసి "స్వదితం" అని అడిగి యాచమింపజేసి యటపైని "భో అభిరమ్యతాం" అని అనవలయును "అభితః" యని యనుటచేనిచ్చటనైన స్వగృహమందునైన విశ్రమించుటకని తాత్పర్యము॥ ౨౫౧॥

మూ॥ స్వధా స్త్విత్యేవ తం బ్రూయు ర్బ్రాహ్మణా స్తదనంతరం।
స్వధాకారః పరాహ్యాశీ స్సర్వేషు పితృకర్మసు॥ ౨౫౨॥

అనుజ్ఞానానంతరమందు భోక్తలు కర్తను "స్వధాస్తు" యనియనవలయును సకల పితృకర్మములయందును స్వధాకారము ప్రకృష్టమగు నాశీర్వచనముగదా॥

మూ॥ తతో భుక్తవతాం తేషా మన్నశేషం నివేదయేత్। యథా
బ్రూయు స్తథా కుర్యా దనుజ్ఞాత స్తతో ద్విజైః॥ ౨౫౩॥

అనంతరమా భుజించినబ్రాహ్మణుల నన్నశేషమేమిచేయవలయునని యడిగి వారెట్లుచెప్పిన నట్లాకర్తయన్నవినియోగముచేయవలయును॥ ౨౫౩॥

మూ॥ పిత్ర్యేస్వదిత మిత్యేవ వాచ్యం గోష్ఠేతు సుశ్రుతం సంపన్న
మిత్యభ్యుదయే దైవే రుచిత మిత్యపి॥ ౨౫౪॥

ఇప్పుడు ప్రసంగమువలన శ్రాద్ధాంతరములందు విశేషవిధిని చెప్పుచున్నాడు "పిత్ర్యే" యనగా కామ్యముగాక పితృమాతృదేవతాకమగు నేకోద్దిష్టశ్రాద్ధమందు తృప్తిప్రశ్నార్థమై స్వదితమని యనవలయును। సూ॥ "స్వదితమితి పితృప్రశ్నే" యని గోభిలసాంఖ్యాయనులు ఇచ్చట మేధాతిథి గోవిందరాజులు శ్రాద్ధకాలమందువచ్చిన యతిథులును స్వదితమని పల్కవలయునని చెప్పిరి కుల్లూకభట్టువారు చెప్పినదానిని నిరాకరించి యీశ్లోకమును వ్రాసెను" శ్లో॥ శ్రాద్ధే స్వదితమిత్యేత ద్వాచ్యమన్నేన కేచిత్। నానుయుక్తమిదం విద్వాన్ ధ్యైవశ్రద్ధధీరపి॥ శ్రాద్ధమందువచ్చినయతిథు

నిచే నేవనిచేసైన "స్వదితమని" పల్కవలసినదను మాటయే గలదో యది విద్వాంసుల
గు వృద్ధులచే ననుసరించబడలేదు గావున మేము దానిని శ్రద్ధచేయమని వ్రాసెను
"గోష్ఠ్యాంశుద్ధ్యర్థమష్టమ" మని ద్వాదశవిధశ్రాద్ధగణనమందు గోష్ఠీశ్రాద్ధమని వి
శ్వామిత్రునిచే జెప్పబడెనట్టి గోష్ఠీశ్రాద్ధమందు సుశ్రుతమనదగినది వృద్ధిశ్రాద్ధమం
దు సంపన్నమనదగినది దైవశ్రాద్ధమందు రుచితమనదగినది దైవశ్రాద్ధమనగా॥ శ్లో॥
"దేవానుద్దిశ్య యచ్ఛ్రాద్ధం తత్తుదైవికముచ్యతే। హవిష్యేణవిశిష్టేన సప్తమ్యాదిషు
యత్నతః"॥ సప్తమ్యాదులందు ప్రకృష్టములగు హవిస్సులచే దేవోద్దేశముగజేసిన
ది దైవశ్రాద్ధమని భవిష్యపురాణము॥ ౨౫౪॥

మూ॥ అపరాహ్ణస్తథా దర్భా వాస్తుసంపాదనం తిలాః। సృష్టి
ర్మృష్టి ర్ద్విజాత్యగ్ర్యా శ్రాద్ధకర్మసు సంపదః॥ ౨౫౫॥

దర్శశ్రాద్ధము ప్రకృతమగుట నీయపరాహ్ణాదులుదీనికే॥ శ్లో॥ "ప్రాతర్వృద్ధినిమిత్తకం"॥ అని వృద్ధిశ్రాద్ధము ప్రాతఃకాలమందనియుండుటవలన అపరాహ్ణకాలమును దర్భలున్ను గోమయాదికముచే భూమినలుకుటయు తిలలున్ను కృపణవృత్తిలేకుండ నన్నాది సంపాదనమున్ను పదార్థముల సమ్యక్సంపదయున్ను పఙ్క్తిపావనాది బ్రాహ్మణులున్ను దర్శశ్రాద్ధాదులందివి సంపదలగుటవలన శ్రాద్ధాంగములు ప్రకృష్టములు కావలెనని బోధితమాయెను॥ ౨౫౫॥

మూ॥ దర్భాః పవిత్రం పూర్వాహ్ణో హవిష్యాణిచ సర్వశః। పవి
త్రంయచ్చ పూర్వోక్తం విజ్ఞేయాహవ్యసంపదః॥ ౨౫౬॥

మంత్రములున్ను దర్భలున్ను పూర్వాహ్ణకాలమున్ను మున్యన్నములగు హవిష్యములున్ను పైని చెప్పబడిన వాస్తుశుద్ధి మొదలగునవిన్ని దేవకర్మములందు సంపదలు॥ ౨౫౬॥

మూ॥ మున్యన్నాని పయస్సోమో మాంసంయచ్చానుపస్కృతం।
అక్షారలవణంచైవ ప్రకృత్యా హవిరుచ్యతే॥ ౨౫౭॥

వానప్రస్థులకుచితమగు నీవారాదికమున్ను పాలున్ను సోమలతారసమున్ను కంపుకొట్టకుండునట్టి మాంసము కృత్రిమలవణవర్జ్యమనగా సైంధవాదికమున్ను స్వభావముచే నివి హవిస్సులని మన్వాదులచే జెప్పబడెను॥ ౨౫౭॥

మూ॥ విసృజ్య బ్రాహ్మణాం స్తాంస్తు నియతో వాగ్యతశ్శుచిః। ద
క్షిణందిశమాకాంక్షన్ యాచేతేమాన్వరా న్పితౄన్॥ ౨౫౮॥

భోక్తలగు బ్రాహ్మణులను విసర్జించి సావధానమనస్కుఁడును శుచియు మౌనియునై దక్షిణదిక్కునుజూచుచు నీవక్ష్యమాణములగు వరములను పితృదేవతలను యాచించవలయును॥ ౨౫౮॥

మూ॥ దాతారో నోఽభివర్ధంతాం వేదాస్సంతతి రేవచ। శ్రద్ధాచ
నో మావ్యగమద్బహు దేయంచనో స్త్వితి॥ ౨౫౯॥

మాకులమునకిచ్చేదాతలు వృద్ధినొందుదురుగావున వేదాధ్యయన తదర్థజ్ఞాన తదధ్యాపక తాతద్విహితానుష్ఠానములున్ను వేదార్థమందు శ్రద్ధయున్ను పుత్రపౌత్రాదివృద్ధిన్ని మాకు తెంపులేకుండనుండుగావుత యాచకులకీదగిన ధనాదికము మాకు బహుగానుండుగావుతయని యాచించవలయును॥ ౨౫౯॥

మూ॥ ఏవంనిర్వపణం కృత్వా పిండాంస్తాం స్తదనంతరం। గాంవి
ప్ర మజమగ్నింవా ప్రాశయే దప్సువా క్షిపేత్॥ ౨౬౦॥

ఈప్రకారముగ బిండప్రదానమొనర్చి వరయాచనానంతరమునంచా పిండములను గోవునకైన విప్రునకైన మేకకునైనను బెట్టవలయు నగ్నియందైన జలమందునయిన వేయవలయును॥ ౨౬౦॥

మూ॥ పిండనిర్వపణంకేచి త్పరస్తా దేవకుర్వతే। వయోభిఃఖాద
యంత్యన్యే ప్రక్షిపంత్య నలేప్సువా॥ ౨౬౧॥

కొందరాచార్యులు బ్రాహ్మణభోజనానంతరమందు పిండప్రదానము జేయుచున్నారు పిండములను పక్షులకైన వేయవచ్చును జలాగ్నులయందైన వేయవచ్చునని మరలజెప్పడము పక్షులకువేయుటకు వికల్పార్థము॥ ౨౬౧॥

మూ॥ పతివ్రతా ధర్మపత్నీ పితృపూజన తత్పరా। మధ్యమంతుత
తఃపిండ మద్యాత్సమ్యక్సుతార్థినీ॥ ౨౬౨॥

ధర్మార్థములందు త్రికరణశుద్ధిగా బతిపరిచర్యవ్రతముగాగలది పతివ్రత య

ట్టి ధర్మపత్నినుందుగావివాహమయినభార్య పితృపూజయందాసక్తురాలయ్యేనే ని మంచిపుత్రుడుకలుగ గోరికగలదై యాపిండములలో మధ్యమమగు పితామహ పిండమును॥ శ్రు. "ఆధత్తపితరో గర్భమిత్యాది" శ్రుతినిచెప్పి స్వగృహ్యోక్తప్రకార ముగా దినవలయును॥ ౨౬౨॥

మూ॥ ఆయుష్మంతం సుతం సూతే యశోమేధాసమన్వితం। ధన
వంతం ప్రజావంతం సాత్వికం ధార్మికంతథా॥ ౨౬౩॥

అట్లు పిండమును భక్షించుటవలన నాసతి దీర్ఘాయుష్మంతుడు కీర్తివంతుడు మేధగలవాడు ధనవంతుడు సంతానవంతుడు సాత్వికుడు ధార్మికుడునగుకుమారు నిగనును॥ ౨౬౩॥

మూ॥ ప్రక్షాళ్యహస్తావాచమ్య జ్ఞాతిప్రాయం ప్రకల్పయేత్।జ్ఞా
తిభ్యస్సత్కృతిందత్వా బాంధవానపి భోజయేత్॥ ౨౬౪॥

పైని హస్తములను గడుగుకొని యాచమించి జ్ఞాతుల నావశ్యకముగ బ్రాహ్మణులు గావించినదగు నాశేషమగు నన్నమును జ్ఞాతులకు పూజాపూర్వము గబెట్టి మాతృబంధువులకున్ను నన్నమును బెట్టవలెను॥ ౨౬౪॥

మూ॥ ఉచ్ఛేషణంతు తత్తిష్ఠే ద్యావద్విప్రా విసర్జితాః। తతో
గృహబలిం కుర్యా దితిధర్మో వ్యవస్థితః॥ ౨౬౫॥

బ్రాహ్మణ విసర్జనముదేయపర్యంతము తదుచ్ఛిష్టపాత్రములం దీయగూడదటు పై నుచ్ఛిష్టపాత్రలను దీసి స్థలశుద్ధిజేయవలె నిట్లు శ్రాద్ధకర్మమయిన పిమ్మటవైశ్వదేవబలి హోమకర్మనిత్యశ్రాద్ధా తిథిభోజనములు జేయదగును బలిశబ్దము ప్రదర్శనార్థముగావున "శ్లో॥ నివృత్యప్రతిపత్త్యర్థం పర్యుక్ష్యాగ్నించ మంత్రవిత్। వైశ్వదేవంప్రకుర్వీత నైత్యకం విధిమేవచ॥" శ్రాద్ధకర్మమును జేసిన పిమ్మట గృహ్యాగ్నిప్రజ్వలింపజేసి మంత్రవేత్తయగు విప్రుడు వైశ్వదేవము మొదలగు నైత్యకమగు విధిని జేయవలయునని మత్స్యపురాణము॥ ౨౬౫॥

మూ॥ హవిర్యచ్చిరరాత్రాయ యచ్చానంత్యాయ కల్పతే। పితృ
భ్యో విధివద్దత్తం తత్ప్రవక్ష్యామ్యశేషతః॥ ౨౬౬॥

యేయే హవిస్సును పితృదేవతల కొసగిన నెట్టుచిరకాలతృప్తి యగుచునానం త్యమున కగునో దానిని నిశ్శేషముగా జెప్పగలను॥ ౨౬౬॥

మూ॥ తిలై ర్వ్రీహి యవై ర్మాషై రద్భిర్మూల ఫలేనవా। ద
త్తేన మాసం తృప్యంతి విధివ త్పితరో నృణామ్॥ ౨౬౭॥

తిలలు ధాన్యము యవలు మినుములు మూలఫలాదికములు జలము వీటిలో దే నిచేత నైనా విధ్యుక్తముగ శ్రాద్ధమొనర్చిన నరులయొక్క పితృదేవతలొకమా సము దనుక తృప్తులగుదురు॥ "శ్లో॥ కృష్ణ మాషా స్తిలాశ్చైవ శ్రేష్ఠాస్స్యుర్యవశా లయఇతి॥" నల్ల మినుములు నువ్వులు యవలు ధాన్యము పితృయోగ్యములని వాయు పురాణము॥ ౨౬౭॥

మూ॥ ద్వౌ మాసౌ మత్స్యమాంసేన త్రీన్ మాసాన్హారిణేనతు।
ఔరభ్రేణాథచతురః శాకునేనాథ పంచవై ॥ ౨౬౮॥

పాఠీనాదిమత్స్యమాంసములు బెట్టిన పితరులకు రెండుమాసములు తృప్తియ గును లేడిమాంసము బెట్టిన మూడుమాసములు గొర్రెమాంసము బెట్టిన నాల్గు నెలలు ద్విజులకహర్ణములగు పక్షులమాంసము బెట్టిన నైదు మాసములు తృ ప్తులగుదురు॥ ౨౬౮॥

మూ॥ షణ్మాసాన్ ఛాగమాంసేన పార్షతేనచ సప్తవై। అష్టా
వేణస్య మాంసేన రౌరవేణ నవైవతు॥ ౨౬౯॥

మేకమాంసముచే శ్రాద్ధమొనర్చిన నారునెలలును దుప్పిమాంసముచే నేడు నెలలు నేణమాంసముచే నెనిమిదినెలలును మృగమాంసముచేతొమ్మిది నెలలును తృప్తులగుదురు॥ ౨౬౯॥

మూ॥ దశమాసాంస్తు తృప్యంతి వరాహమహిషామిషైః। శశకూ
ర్మయోస్తు మాంసేన మాసానేకాదశైవతు॥ ౨౭౦॥

అడవిపంది కారెనుములు వీటిమాంసములచే పదిమాసములున్ను చెవులపిల్లి తాంబేలు వీటి మాంసములచే పదకొండు నెలలును తృప్తులగుదురు॥ ౨౭౦॥

మూ॥ సంవత్సరంతు గవ్యేన పయసా పాయసేనచ। వార్ధ్రీణ
సస్య మాంసేన తృప్తిర్ద్వాదశ వార్షికీ॥ ౧౭౧॥

గోక్షీరపాయసాదులచే సంవత్సరము తృప్తులగురు. వార్ధ్రీణమాంసముచే పదిరెండువర్షములు తృప్తివార్ధ్రీణసమనగా॥ "శ్లో॥ త్రిపిబంత్వింద్రియక్షీణం శ్వేతంవృద్ధమజాపతిం। వార్ధ్రీణసంతుతంప్రాహు ర్యాజ్ఞికాఃపితృకర్మణీతి॥నద్యాదులయందుదక పానము జేయునప్పుడు రెండు చెవులును జిహ్వయు జేనికిజలము స్పృశించునో యది త్రిపిబమగును అట్టి ఇంద్రియములు క్షీణించిన తెల్లనగు ముసలిమేక వార్ధ్రీణసమని చెప్పబడెనిది పితృకర్మలయందు యోగ్యమని యాజ్ఞికులు జెప్పుచున్నారు॥ ౨౭౧॥

మూ॥ కాలశాకం మహాశల్కాః ఖడ్గలోహాదికం మధు। ఆనం
త్యాయైవ కల్పంతే మున్యన్నానిచ సర్వశః॥ ౨౭౨॥

బొమ్మిడాయి పెద్దమత్స్యములు॥ "శ్లో॥ మహాశల్కలినోమత్స్యా ఇతి" యనువచనము వలన ఖడ్గమృగమాంసము యెఱ్ఱమేకయొక్క మాంసము॥ "సూ॥ సర్వలోహితేనానంత్య"మని పైఠీనసి వచనము వలన తేనియనీవారాదికము న్యన్నము నివియన్నియు ననంతతృప్తికగును॥ ౨౭౨॥

మూ॥ యత్కించిన్మధునా మిశ్రం ప్రదద్యాత్తు త్రయోదశీం।తద
ప్యక్షయమేవస్యా ద్వర్షాసుచ మఘాసుచ॥ ౨౭౩॥

తేనియతో గూడ నేదియైన నన్నాదికము వర్షర్తువునందు మఘానక్షత్రయుక్తత్రయోదశీదినమున పితృోద్దేశముగ బెట్టిన నదియును బితరుల కక్షయమగును॥

మూ॥ అపినస్సకులేజాయా ద్యోనోదద్యా త్త్రయోదశీమ్। పా
యసం మధుసర్పిర్భ్యాం ప్రాక్ఛాయే కుంజరస్యచ॥ ౨౭౪॥

"శ్లో॥ ప్రోష్ఠపద్యామతీతాయాం మఘాయుక్తాం త్రయోదశీమ్। ప్రాప్యశ్రాద్ధంహి కర్తవ్యం మధునాపాయసేనచేతి॥" మఘానక్షత్రయుక్తభాద్రపద కృష్ణత్రయోదశియందు ఘృతమధుయుక్తపాయసముచే శ్రాద్ధము జేయవలయు ననుశంఖవచనముచే పైశ్లోకమందు జెప్పబడిన త్రయోదశియందు పితృదేవతలిట్లు గోరె

దరు ఈచెప్పబడినత్రయోదశియందును మరియేతిథియందైన గజమునీడ తూర్పున కు దిరిగినవేళననగా నపరాహ్ణమందున తేనెయతో నేతితోగూడ బాయసముచే శ్రాద్ధము జేసెడువాడు మనకులమునందు బుట్టవలయునని పితరులు గోరుచుందురు ఇచ్చట త్రయోదశీహస్తిచ్ఛాయలకు సముచ్చయముగాదు- అందుకు విష్ణువచనము॥"శ్లో॥ అపిజాయేతసోఽస్మాకంకులేకశ్చిన్నరోత్తమః। ప్రావృట్కాలే సితేపక్షే త్రయోదశ్యాంసమాహితః। మధుప్లుతేనయశ్శ్రాద్ధం పాయసేనసమాచరేత్। కార్తికంసకలంవాపి ప్రాక్ఛాయేకుంజరస్యచేతి॥" పూర్వోక్తమగు త్రయోదశియందైనను సకలకార్తీకమాసమందున గజమునీడ తూర్పుగా దిరిగినప్పడపరాహ్ణమందునైన మధుయుక్తపాయసముచే శ్రాద్ధముజేయ నెవడు మాకులమునందుబుట్టిన నతడు నరోత్తముడని॥ ౨౭౪॥

మూ॥ యద్యద్దదాతి విధివత్సమ్యక్ఛ్రద్ధాసమన్వితః। తత్తత్పితౄణాంభవతి పరత్రానంత మక్షయమ్॥ ౨౭౫॥

విధ్యుక్తముగ శ్రద్ధతో నేమేమి పితృోద్దేశముగ బెట్టిననది పరలోకమందు నక్షయమగుచున్నది గావున పైనిజెప్పినట్టి శ్రద్ధతో శ్రాద్ధముజేయ వలయునని విధించుచున్నాడు॥ ౨౭౫॥

మూ॥ కృష్ణపక్షే దశమ్యాదౌ వర్జయిత్వా చతుర్దశీం। శ్రాద్ధేప్రశస్తాస్తిథయో యథైతా న తథేతరాః॥ ౨౭౬॥

కృష్ణపక్షమందు దశమిమొదలుకొని చతుర్దశిగాక మిగిలిన తిథులు శ్రేష్ఠమయినది వీటితో శ్రాద్ధవిషయమై మరియేతిథులును నట్టిమహాఫలము నిడజాలవు॥ ౨౭౬॥

మూ॥ యుక్షుకుర్వన్ దినర్క్షేషు సర్వాన్ కామాన్ సమశ్నుతే।
అయుక్షుతు పితౄన్ సర్వాన్ ప్రజాంప్రాప్నోతిపుష్కలాం॥ ౨౭౭॥

ద్వితీయ చతుర్థీ మొదలగు యుగ్మతిథులయందును భరణీ రోహిణ్యాదియుగ్మనక్షత్రములయందును శ్రాద్ధమునుజేయుచున్నవాడు సకలాభీష్టములను పొందును పాడ్యమితదియమొదలగునయుగ్మతిథులయందును అశ్వినీకృత్తికాద్యయుగ్మనక్షత్రములయందును శ్రాద్ధముచే పితృదేవతలనర్చించినవాడు ధనవిద్యాది పరిపూర్ణమయినసంతానమును గాంచును॥ ౨౭౭॥

మూ॥ యథాచైవాపరః పక్షః పూర్వపక్షాత్ప్రశస్యతే। తథాశ్రా
ద్ధస్యపూర్వాహ్ణా దపరాహ్ణో విశిష్యతే॥ ౨౭౮॥

“శ్లో॥ చైత్రసితాద్యామాసాఇతి॥” చైత్రశుక్లప్రతిపదమొదలుకొని మాసము లుప్రవర్తించునని జ్యోతిశ్శాస్త్రనిబంధనమువలన నపరపక్షమనగా కృష్ణపక్షము అది శుక్లపక్షముకంటె యేలాగుపితృయోగ్యమో యట్లు పూర్వాహ్ణముకంటె న పరాహ్ణము శ్రాద్ధయోగ్యము యీచెప్పడము పూర్వాహ్ణమందున్న శ్రాద్ధకర్త వ్యత్వమును బోధించుచున్నది యీశ్లోకమందు శుక్లపక్షముకంటెకృష్ణపక్షముయో గ్యమనిచెప్పకుండా దృష్టాంతముగా చెప్పడమేమని శంకరాగా॥ “శ్లో॥ కృష్ణపక్షే దశమ్యామి”త్యాదికముచేనుతత్ప్రాప్తవిధియందుతత్పర్షను చెప్పుటవలన॥

మూ॥ ప్రాచీనావీతినా సమ్యగపసవ్య మతంద్రిణా। పిత్ర్యమాని
ధనాత్కార్యం విధివ ద్దర్భపాణినా॥ ౨౭౯॥

ప్రాచీనావీతిగాదర్భ పవిత్రములుధరించి యలసుడుగాకుండ బిత్రుతీర్థము చే యథాశాస్త్రముగ సకలపితృసంబంధికర్మములును తననిధనపర్యంతము చే యతగినది యిచ్చట “ఆనిధనాత్॥” అనగా యావజ్జీవమని మేధాతిథిగోవిందరా జులు॥ ౨౭౯॥

మూ॥ రాత్రౌశ్రాద్ధం నకుర్వీత రాక్షసీ కీర్తితాహిసా। సంధ్యయో
రుభయోశ్చైవ సూర్యేచైవా చిరోదితే॥ ౨౮౦॥

రాత్రిశ్రాద్ధమునునశింపజేయు గుణముగలుగుటచే రాక్షసియని మన్వాదులచే జెప్పబడుటవలన రాత్రియందు శ్రాద్ధముజేయదగదు సంధ్యలయందును సూర్యో దయమై మూడుముహూర్తములపర్యంతమును శ్రాద్ధము జేయతగదు॥ “శ్లో॥ రే ఖాప్రభృత్యథాదిత్యేత్రిముహూర్తం గతేరవా। ప్రాతస్తతస్స్మృతఃకాలోభా గస్సోహ్నస్తు పంచమఇతి॥” రేఖామాత్రసూర్యోదయప్రభృతిత్రిముహూర్త ప ర్యంతమనగా పగటిలో నైదవభాగము ప్రాతఃకాలమనిచెప్పబడ్డది॥ అపరాహ్ణ ము శ్రాద్ధాంగముగా విధించుటవలన యీశ్లోకమందు అప్రసక్తప్రతిషేధ మంటి రేని యట్లుకాదు అప్రతిషేధము రాగప్రాప్తమైన దానికైనను విధిప్రాప్తమైన దానికైననగును॥ మొదటిదికాదు దర్శశ్రాద్ధము నిత్యమైనదౌటవలన రాగప్రాప్త

త్వమసంగతము॥ రెండవనిషేధవిషయమై షోడశీగ్రహణములవలె వికల్పమయ్యాని గావున నిషిపర్యుదాసము రాత్ర్యాదిపర్యుదస్తేతరకాలమునందు శ్రాద్ధము చేయవలెను అపరాహ్ణవిధిన్ని ప్రాశస్త్యార్థమది గావున నే॥ "శ్లో॥ యథాశ్రాద్ధస్య పూర్వాహ్ణాదపరాహ్ణోవిశిష్యతఇతి॥" పూర్వాహ్ణముకంటె అపరాహ్ణము శ్రాద్ధమునకు విశేషఫలదమని॥ ౨౮౦॥

మూ॥ అనేన విధినా శ్రాద్ధం త్రిరబ్దస్యేహ నిర్వపేత్। హేమంత
గ్రీష్మవర్షాసు పాంచయజ్ఞికమన్వహం॥ ౨౮౧॥

శ్లో॥ కుర్యాన్మాసానుమాసిక" మని ప్రతిమాసమందును దర్శశ్రాద్ధము విహితమైయుండెను తదసంభవమందీవిధి నాల్గుమాసములొకఋతువు మూడుఋతువులొకసంవత్సరమనుపక్షము నాశ్రయించి చెప్పబడుచున్నది పూర్వోక్తమగు విధానముచే సంవత్సరమధ్యమందు మూడుమాసముల హేమంత గ్రీష్మ వర్షర్తువులలో శ్రాద్ధము జేయదగినది అనిన్ని సమయాచారమువలన కుంభవృషభ కన్యలయందు సూర్యుడుండగనని పంచయజ్ఞాంతర్గతమగు॥ "శ్లో॥ ఏకమప్యాశయేద్విప్ర మితి॥" యొకబ్రాహ్మణునకైన పితృనుద్దేశకముగ బెట్టవలయునని విహితమగునది ప్రత్యహమును జేయవలయునని పూర్వోక్తవాక్యార్థమిచట జెప్పబడెను॥ ౨౮౧॥

మూ॥ న పైతృయజ్ఞియో హోమో లౌకికేగ్నౌ విధీయతే। న దర్శేన
న వినా శ్రాద్ధ మాహితాగ్నే ర్ద్విజన్మనః॥..... ౨౮౨॥

శ్లో॥ "అగ్నేస్సోమయమాభ్యాంచ" యనువిధిచే నగు పిత్ర్యయజ్ఞాంగమగు హోమము శ్రౌతస్మార్తేతరమగు లౌకికాగ్నియందు జేయుటకు విధింపబడలేదు గాన నగ్నౌకరణము లౌకికాగ్నియందు జేయదగదు అగ్నిలేనివానికి "అగ్న్యభావేతు విప్రస్యపాణావితి" యను విధిచే బ్రాహ్మణ హస్తమందగ్నౌకరణము జేయువలయును ఆహితాగ్ని యగు విప్రునకు దర్శవినా కృష్ణపక్షదశమ్యాదులయందు శ్రాద్ధము జేయగూడదు మృతాహశ్రాద్ధ మనియతమగుటచే తద్వ్యతిరేకమను నిషేధములేదు॥ ౨౮౨॥

మూ॥ యదేవ తర్పయత్యద్భిః పితౄన్ స్నాత్వా ద్విజోత్తమః।
తేనైవ కృత్స్నమాప్నోతి పితృయజ్ఞక్రియాఫలం॥ ౨౮౩॥

పంచయజ్ఞాంతర్గత శ్రాద్ధసంభవమందీవిధి ద్విజుడు స్నానానంతరమందు దక్ష

తర్పణము జేసినదేవో దానిచేతనే సర్వశ్రాద్ధఫలమును సమగ్రముగ బొందును “ద్విజోత్తమః” యనునది ద్విజపరము॥ ౨౮౩॥

మూ॥ వసూన్ వదంతి చ పితౄన్ రుద్రాంశ్చైవ పితామహాన్। ప్రపితామహాంస్తథాదిత్యాన్ శ్రుతిరేషా సనాతనీ॥ ౨౮౪॥

ఏమి కారణమున పిత్రాదులు వస్వాదిరూపులని సనాతనియగు శ్రుతిగలదుగావున పితలను వసువులనుగానున్ను పితామహులను రుద్రులనుగానున్ను ప్రపితామహుల నాదిత్యులగానున్ను మన్వాదులు చెప్పిరి దీనిచే పిత్రాదులను వస్వాదిరూపులనుగా ధ్యానించవలెనని విధి కల్పించబడెను అదిగావున॥ సూ॥ “యదిత్వేవం విద్వాన్ పితౄన్ యజతే వసవో రుద్రా ఆదిత్యాశ్చాస్య ప్రీతా భవంతి” యని విద్వాంసుడిట్లు పితృదేవతలనచింతించు వానికి వసువులును రుద్రులునాదిత్యులును ప్రీతులగుచున్నారని పైతీనసి॥ ఇచ్చట మేధాతిథిగోవిందరాజులు పితృద్వేషము కొఱకైనను నాస్తిక్యము చేనైనను శ్రాద్ధకర్మమందు ప్రవర్తించనివానికి ప్రవృత్తిగలుగుటకు దేవతాత్వాధ్యారోపణముచే పితృస్తుతివచనమని పలికిరి॥ ౨౮౪॥

మూ॥ విఘసాశీ భవేన్నిత్యం నిత్యం వామృతభోజనః। విఘసో భుక్తశేషంతు యజ్ఞశేషం తథామృతం॥ ౨౮౫॥

విఘసమనగా బ్రాహ్మణభుక్తశేషము అమృతమనగా యజ్ఞశేషము నిత్యము ద్విజుడు విఘసాశియైనన్ను అమృతాశియుగావలెనని సామాన్యముగ జెప్పినను ప్రకృతమగు శ్రాద్ధమందు విప్రభుక్తశేష భోజనార్థమీవిధి యదిగావున నే॥ శ్లో॥ “భుంజీతాతిథి సంయుక్తః సర్వం పితృనిషేవితం” మనెడి స్మృత్యంతరవచనముచే నతిథ్యాదిపిశేషభోజనముయునప్పై॥ శ్లో॥ “అవశిష్టంతు దంపతీ” యను వచనమువలన విహితమాయెనుఅది యజ్ఞశేషతుల్యమేగావున మరల జెప్పుట స్తుత్యర్థమని గోవిందరాజు॥ ౨౮౫॥

మూ॥ ఏతద్వోఽభిహితం సర్వం విధానం పాంచయజ్ఞికం। ద్విజాతిముఖ్యవృత్తీనాం విధానం శ్రూయతామితి॥ ... ౨౮౬॥

ఇతి శ్రీమానవే ధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాం

సంహితాయాం తృతీయోఽధ్యాయః

ఇది పంచయజ్ఞములయందగు ననుష్ఠానమంతయు జెప్పబడియె పార్వణశ్రాద్ధవ్యవహితములయినను పంచయజ్ఞములచే ముగిపించడమవి పూజ్యములని దెలుపుటకని కుల్లూకభట్టు మంగళార్థమని మేధాతిథి గోవిందరాజులు ఇప్పుడు ద్విజులలో ముఖ్యుడగు బ్రాహ్మణునకు ఋతాదివృత్తులయొక్క యనుష్ఠానమును వినుడని వక్ష్యమాణాధ్యాయైక దేశముపన్యసించెను॥ ౨౮౬॥

ఇతిశ్రీ మహామహీంద్ర శ్రీమహానందగజపతి రాజమహారాజదయాపాత్ర
భారద్వాజసగోత్ర పవిత్ర సుకవిజన విధేయ మండకామేశ్వర
నామధేయ విరచితాంధ్రమన్వర్థదీపికాఖ్యయగు వ్యాఖ్య
యందు తృతీయాధ్యాయము.
శ్రీపరదేవతార్పణమస్తు.

---



శుభమస్తు-అవిఘ్నమస్తు.

---

## చతుర్థాధ్యాయప్రారంభః.

మూ॥ చతుర్థ మాయుషోభాగ ముషిత్వాద్యం గురౌ ద్విజః। ద్వి
తీయ మాయుషోభాగం కృతదారో గృహేవసేత్॥ ౧॥

శ్రాద్ధకల్పానంతరమందు "వృత్తినాంరక్షణంచైవ" యని వ్యక్తముగా ప్రతిజ్ఞచేయబడినవృత్తులు గార్హస్థ్యము వృత్త్యధీనముగావున జెప్పదగినవగుచునుండ బ్రహ్మచర్య పూర్వకమై గార్హస్థ్యమందు వృత్తులు వక్ష్యమాణములని తెలిపెడికొరకు బ్రహ్మచర్యకాలమునున్ను గార్హస్థ్యకాలమును నిందు చెప్పుచున్నాడు॥ ఆయువ్యములో నాలవపాలు మొదటిదని బ్రహ్మచర్యోపలక్షణార్థమ మదియెట్లనిన నాయుష్యమింతయని తెలియబడనిదగుటచే నాయువులో నాలవపాలుదెలియ నశక్యము "శతాయుఃపురుషః" యని పురుషుడు నూరువత్సరములాయువుగలవాడని శ్రుతిచే నాలవపాలిరువదేనేసులనుటయు "షట్త్రింశ దాబ్దికం బ్రహ్మచర్యమితి

ముప్పదియారేండ్లు బ్రహ్మచర్యమును విరోధముచేగాకుండెను నాలుగాశ్రమముల నొందెడు పక్షమునాశ్రయించినవాడు బ్రాహ్మణునకు జెప్పబడిన బ్రహ్మచర్యకాలము జన్మాదిగా మొదటిభాగను యథాశక్తిగా గురుకులమందుండి రెండవచతుర్థాంశమందు గృహస్థధర్మములు జేయవలయును "గృహస్థస్తుయదాపశ్యే" దని యనియతకాలమే గావున నాయుష్యములో రెండవ నాలవపాలునట్లుగా గార్హస్థ్యకాలమున్నది॥ ౧॥

మూ॥ అద్రోహేణైవభూతానామల్పద్రోహేణవాపునః। యావృ
త్తిస్తాంసమాస్థాయవిప్రోజీవేదనాపది॥ ౨॥

పరపీడలేకుండుటయే యద్రోహము యది శిలోంఛాయాచితాదికము ద్రోహమనగా హింసయే గానది నిషిద్ధముగావున భూతద్రోహము లేకుండనట్లు సంభవించనిచో నల్పద్రోహముచేనైన నవృత్తిసంభవించునట్టి వృత్తిని లభించి విప్రుడనాపదయందు జీవించవలయును భార్యాదిభృత్యపోషణపంచయజ్ఞాదికము బ్రాహ్మణుడు నెరవేర్చుకోవలెను క్షత్రియాదులకిట్లుగాదు ఆపదయందైతే వృత్తి దశమాధ్యాయమందు జెప్పబడెను. యదిసామాన్యోపదేశము యాజనాధ్యాపనవిశుద్ధప్రతిగ్రహాది సంగ్రహార్థమైనది కేవలఋతాదివిశేషపరమైతే సంకుచిత స్వరసత్వహానియు యాగాద్యనధికారత్వము వృత్తిప్రకరణానివేశమునయ్యానిగాన దానిచేతనున్న జీవించవలెను॥ ౨॥

మూ॥ యాత్రామాత్రప్రసిద్ధ్యర్థం స్వైఃకర్మభిరగర్హితైః।
అక్లేశేన శరీరస్య కుర్వీతధనసంచయం॥ ౩॥

యాత్రయనగ శాస్త్రీయముగుకుటుంబసంవర్ధన నిత్యకర్మానుష్ఠానపూర్వకప్రాణస్థితి తన్మాత్రమునకు ననగాభోగార్థము గాదనుట తమయొక్క శాస్త్రవిహితార్జనరూపములగు వక్ష్యమాణఋతాదికర్మములచే గాయక్లేశము లేకుండ ధనసంగ్రహమును జేయవలయును॥ ౩॥

మూ॥ ఋతామృతాభ్యాం జీవేత్తు మృతేన ప్రమృతేనవా।సత్యా
నృతాభ్యా మపివా నశ్వ వృత్యాకదాచన॥ ౪॥

[illegible] నాపదియనుపదమనువర్తించును ఆపదలేనప్పుడు ఋతా

దులచే జీవించవలయు నాపత్తియందయిన నెప్పుడును సేవచేజీవించదగదు॥ ४॥

మూ॥ ఋతమంఛశిలంజ్ఞేయ మమృతంస్యాదయాచితం । మృతం
తు యాచితంభైక్షం ప్రమృతం కర్షణంస్మృతం॥ ५॥

అప్రసిద్ధము గావున ఋతాదులను జెప్పుచున్నారు అబాధిస్థానములందును మాగాణము మొదలు కేదారములందును నైన నెచ్చటెచటనోషధులుండు నచ్చటచటతనప్రేళ్ళ "యూ ఏకైకకణసమంఛము ఋత్వా" యనుబౌధాయనవచనమువలననొక్కొకగింజచొప్పున నేరుకొనుటయు ఛమనబడును వెన్నులేరుకొనుటశిలమనబడును రెండును సత్యసమానఫలప్రదములగుటచే ఋతమని చెప్పబడెను అయాచితమప్రయత్నలబ్ధమమృతమువలె సుఖకరమగుందియమృతము యాచింపబడినది భైక్షము సాగ్నికుడగు గృహస్థుడు పక్వపదార్థము భిక్షమెత్తగూడదు పరపక్వము హూమహోమములగా గావున సపక్వములగు తండులాదికమును యాచించి తెచ్చినదిమారణముపలె దుఃఖకరముగావున యాచితము మృతమనబడెను భూగతజంతువులు కర్షణముచే ప్రకర్షణముగ మృతములగుటచేకృషిప్రమృతమనబడెను॥

మూ॥ సత్యానృతంతు వాణిజ్యం తేనచైవాపి జీవ్యతే । సేవాశ్వ
వృత్తిరాఖ్యాతా తస్మాత్తాం పరివర్జయేత్॥ ६॥

తరుచుగా సత్యానృతమిశ్రమగుటావునసత్యానృతమనగా వాణిజ్యము కుసీదమున్ను కుసీదమనగా వృద్ధిజీవనము ఇచ్చటనున్ను అనాపదియని యనువర్తించుట చే నిక్కృషివాణిజ్యాదులు స్వయంకృతములుగావని॥ "సూ॥ కృషివాణిజ్యే స్వయం చాకృతే కుసీదంచ" స్వయముగా జేయబడని కృషివాణిజ్యములును కుసీదమును నని గౌతమవచనమువలన శాస్త్రముచే వాణిజ్యమందు సత్యాదికమనుజ్ఞ చేయబడలేదు॥ "శ్లో॥ తేనచైవాపి జీవ్యతఇతి॥" ఆవాణిజ్యముచేతను జీవనము చేయబడుచున్నదనుచోచకారముచే కృషివాణిజ్యసమశిష్టమై కుసీదమనగావృద్ధిజీవనమున్ను గ్రహించబడెను పూర్వశ్లోకోక్తమకృషి యీశ్లోకమందు వాణిజ్యమున్ను సేవైతదీనదృష్టిసందర్శనస్వామి తజ్జననీచక్ర యాదధర్మయోగమువలనశునకముయొక్క వృత్తివంటిదిగావున శ్వవృత్తియనిచెప్పబడెను దానిని బ్రకృతమగు బ్రాహ్మణుడు త్యజించవలయును॥ ६॥

మూ॥ కుసూలధాన్యకో వాస్యా త్కుంభీధాన్యక ఏవవా। త్ర్యై

త్రైహికో వాపి భవేదశ్వస్తనిక ఏవవా॥ ౭॥

కుసూలమనగా కుసూలోవ్రీహ్యాగారంస్యాదను నిఘంటువువలన ఇష్టకలచేకట్టబడినధాన్యపుకోటు దానినిండ ధాన్యసంచయము గలవాడు కావలెను॥ "శ్లో॥ యస్యత్రైవార్షికంభక్తంపర్యాప్తంభృత్యవృత్తయే। అధికంవాపివిద్యేత ససోమంపాతుమర్హతీతి॥" ఏగృహస్థునకు తనభృత్యులతోగూడ మూడుసంవత్సరములకుగాని అధికముగాగాని జీవనపర్యాప్తమగు ధనధాన్యసంచయముగలుగునో యతడు సోమపానముజేయ నర్హుడని మనువచనమువలన కాలముగ్రహించదగినది దానిచే నిత్యనైమిత్తికధర్మకృత్యవర్గ సహితుడగు గృహస్థునకు మూడుసంవత్సరములకెంతధాన్యాదికము కావలెనో యన్నిధాన్యముగలవాడు కుసూలధాన్యకుడనిచెప్పబడుచున్నాడు ఏకసంవత్సరనిర్వాహోచితధాన్యాదిధనముగలవాడుకుంభీధాన్యకుడు॥ "శ్లో॥ ప్రాక్సౌమికీః క్రియాఃకుర్యాద్యస్యాన్నంవార్షికం భవేదితి॥" ఎవనికి సంవత్సరపర్యాప్తధాన్యముండునో యతడు సోమయాగముకంటె క్రిందనగు నగ్న్యాధానాదికర్మములను జేయవలయునని యాజ్ఞవల్క్య వచనముచే కుంభీధాన్యకుడైన గావలయును - "వానప్రస్థస్యైవ సమానిచయ ఏవేతి॥" వానప్రస్థునకు సంవత్సర పర్యాప్తవస్తు నిచయము గావలయునని మను వచనముచే వానప్రస్థునకే సంవత్సరోచిత సంగ్రహము చెప్పబడుచుండగా బహుపోష్యవర్గముగల గృహస్థునకు సంవత్సరసంచయ ముచితముగదా యిచ్చట భృత్యులతోగూడ మూడుసంవత్సరములకు సరిపడెడు ధాన్యసంగ్రహముగాని అంతవిలవగల బంగారముగాని గలవాడు కుసూలధాన్యకుడనియు ఆరు మాసములకు సరిపడెడు ధాన్యాదినిచయముగల వాడు కుంభీధాన్యకుడనియు మేధాతిథివ్యాఖ్యానముచేసెను- పదిరెండు దినములకు సరిపడెడు ధాన్యముగలవాడు కుసూలధాన్యకుడనియు నారుదినములకు పర్యాప్తమగు ధాన్యాదికముగల్గువాడు కుంభీధాన్యకుడనియు గోవిందరాజు వ్యాఖ్యానము జేసెను- దీని బహువ్యాఖ్యానము జేసి మొదటవ్రాసిన మూడు సంవత్సరములు నొకసంవత్సరమును జీవనార్థముగలవాడు కుసూలధాన్యకుడు కుంభీధాన్యకుడని కుల్లూకభట్టు వ్యాఖ్యానము జేసెను- ఈహ యనగా నిష్టమయినది దానియందగునదిఐహికను త్ర్యహపర్యాప్తమగు నైహికము త్రైహికము అలాగునైనా గావచ్చును దినత్రయనిర్వాహోచితధనులు త్రైహికులు రేపటికి లేని భక్తముగలవాడు అశ్వస్తనికుడు॥ ౭॥

మూ॥ చతుర్ణామపిచైతేషాం ద్విజానాంగృహమేధినామ్। జ్యా
యాన్పరఃపరోజ్ఞేయో ధర్మతోలోకజిత్తమః॥ ౮॥

కుసూలధాన్యకుడు మొదలగు నలుగురు బ్రాహ్మణగృహస్థులలో పూర్వపూర్వునికంటె నుత్తరోత్తరులు శ్రేష్ఠులు వృత్తిసంకోచము వలన ధర్మముచే స్వర్గాదిలోకములు జయించినవాడగుచున్నాడు॥ ౮॥

మూ॥ షట్కర్మైకో భవత్యేషాం త్రిభిరన్యః ప్రవర్తతే। ద్వా
భ్యామేకశ్చతుర్థస్తు బ్రహ్మసత్రేణ జీవతి॥ ౯॥

ఈ గృహస్థులలో నొకడు బహుపోష్యవర్గము గలవాడు శిలోంఛాయాచిత-భైక్ష-కృషి-వాణిజ్య-కుసీదములను నీయారుకర్మములచే జీవించువాడు షట్కర్ముడగుచున్నాడు మరియొకడు కృషివాణిజ్యకుసీదములచే జీవించువాడు త్రికర్ముడగుచున్నాడు మరియొకడు యాజనాధ్యాపనప్రతిగ్రహములగు నీమూడుకర్మములచేతను జీవించెడువాడును జెప్పబడెను వీటిలో ప్రతిగ్రహము విడచి యాజనాధ్యాపనములచే నొకడు జీవించును మరియొకడు బ్రహ్మసత్రముచే ననగా నధ్యాపనమాత్రముచే జీవించెడువాడు యిచ్చట మేధాతిథి యీకుసూలధాన్యాదికులలో కుసూలధాన్యకుడుంఛశిలాయాచితయాచితకృషివాణిజ్యములచే షట్కర్ముడగుచున్నాడు అన్యుడనగా కుంభీధాన్యకుడు కృషివాణిజ్యములు నిందితములుగావున నుంఛశిలాయాచితయాచితములలోనిచ్ఛచే మూడిటిచేతను జీవించువాడగుచున్నాడు॥ త్ర్యైహికుడు యాచితమును విడచి యుంఛశిలాయాచితములలో స్వేచ్ఛచే రెండింటి వలన జీవించెడువాడగుచున్నాడు॥ నాలుగవవాడగు నశ్వస్తనికుడు బ్రహ్మసత్రమనగా శిలోంఛవృత్తులలో నొకటిగలవాడు బ్రాహ్మణునకు సంతతమవ్వేదగుట వలన సత్రమనివ్రాసెను॥ ౯॥

మూ॥ వర్తయంశ్చ శిలోంఛాభ్యామగ్నిహోత్రపరాయణః।
ఇష్టీః పార్వాయనాంతీయాః కేవలా నిర్వపేత్సదా॥ ౧౦॥

శిలోంఛవృత్తులచే జీవించవలెను గావుననే ధనసాధ్యకర్మాంతరానుష్ఠానమందు సామర్థ్యము లేకుండుటచే నగ్నిహోత్రపరుడై దర్శపూర్ణమాసాంతములందును నయనాంతమందగు నాగ్రయణమునేతదాత్మకములగు నిష్టులను మాత్రము

నిత్యముగ జేయవలయును॥ ౧౦॥

మూ॥ నలోకవృత్తం వర్తేత వృత్తిహేతోః కథంచన। అజిహ్మ
మశఠాంశుద్ధాం జీవేద్బ్రాహ్మణ జీవికామ్॥ ౧౧॥

టీ॥ లోకవృత్తమనగా కుజనులకు ప్రియములగు కథలును పరిహాసములు మొదలగు వ్యాపారమును జీవనార్థమై జేయగూడదు వక్రతయసత్యము మొదలగు పాపహేతువులు గానట్టియు దంభాదివర్జితయు వైశ్యాదివృత్తితో సంకీర్ణముగాక శుద్ధమగు బ్రాహ్మణోచితమగు జీవిక నవలంబించి బ్రతుకవలయు॥ ౧౧॥

మూ॥ సంతోషం పరమాస్థాయ సుఖార్థీ సంయతో భవేత్।సం
తోషమూలం హి సుఖం దుఃఖమూలం విపర్యయః॥ ౧౨॥

యథాసంభవమగు భృత్యాత్మప్రాణధారణావశ్యక పంచయజ్ఞాద్యనుష్ఠానమాత్రోచితధనముకంటె నధిక ఫలేచ్ఛ లేకుండుట సంతోషము దీని నుత్కృష్టముగ నవలంబించి యధికధనార్జనమందు నాశలేకుండ నియమము జేయవలయును యేదికారణమున సుఖము సంతోషము హేతువుగా గలదో వ్యగ్రతలేకుండుటచే సత్కర్మానుష్ఠానాదికము లెస్సగా నగుటవలన బరమందు స్వర్గాది సుఖమధికమగును సంతోషము లేకుండిననధికధనార్జనమందు క్లేశము నసంపత్తియగుచో దుఃఖముసగును॥ ౧౨॥

మూ॥ అతో ఽన్యతమయా వృత్త్యా జీవంస్తు స్నాతకో ద్విజః।స్వర్గా
యుష్యయశస్యాని వ్రతానీమాని ధారయేత్॥ ౧౩॥

అబహుభృత్యకావృత్తిచే నిర్వాహమగుచుండ "అన్యతమయా" యని విధించబడుచుండెను- బహుభృత్యునకన్నము గలుగుటకు "షట్కర్మైకో భవత్యేషా" మని విహితమగుటవలన బహుభృత్యుడు షట్కర్ముడు గావచ్చును ఇట్లు గాకున్న రెండింటికి నేకవాక్యత్వమౌటచే నీశ్లోకము వ్రతములను విధించ దౌటవలన వృత్త్యాయని యనువాదమగుట వలన నేకత్వమవివక్షితముగా జెప్పబడిన వృత్తులలో నెద్దానిచే నైన జీవించుచున్న స్నాతకుడగు బ్రాహ్మణుడు వక్ష్యమాణములగు స్వర్గాయుష్యయశస్సులగూర్చెడు వ్రతములను యథాసంభవముగ జేయవలయును- నాచేనిది చేయదగినది చేయరాని దనునట్టి సంకల్పవిశేషము వలన వ్రతము॥ ౧౩॥

మూ॥ వేదోదితం స్వకం కర్మ నిత్యం కుర్యా దతంద్రితః । తద్ధి కుర్వ న్ యథాశక్తి ప్రాప్నోతి పరమాంగతిమ్॥ ౧౪॥

స్నాతకునకున్ను వేదోక్తమే గావున తనయాశ్రమమునకుం దుచితమగు వేదోక్తకర్మమును యావజ్జీవము నలసుడు గాకుండ జేయువలయును యథాశక్తిగా నాకర్మములను జేయుచున్న బ్రాహ్మణుడు మోక్షమునొందును "శ్లో॥ జ్ఞానముత్పద్యతేపుంసాం క్షయాత్పాపస్యకర్మణః । తత్రాదర్శతలేప్రఖ్యే పశ్యత్యాత్మానమాత్మని॥" నిత్యకర్మముచే నగు పాపక్షయము వలన జ్ఞానముత్పన్నమగును దానస ద్దమువలె శుద్ధమగు నంతఃకరణమునం దాత్మను జూచునని మోక్షధర్మము॥ ౧౪॥

మూ॥ నేహేతార్థాన్ ప్రసంగేన నవిరుద్ధేన కర్మణా । నవిద్యమానే ష్వర్థేషు నార్త్యామపి యత స్తతః॥ ౧౫॥

పురుషుడు దేనియందు మిక్కిలి సక్తుడగు నోయట్టి ప్రసంగము గీతవాదిత్రాదికముచే దాని ధనములను సంపాదించగూడదు శాస్త్రనిషిద్ధకర్మముల చేతనన గా నయాజ్యయాజకత్వాదులచేతనున్ను సంపాదించరాదు ధనములు లేమిగలుగుచుండగా నార్తిగలుగుచున్నప్పటికిని పతితాదుల వలన ధనమును గోరకూడదు॥ ౧౫॥

మూ॥ ఇంద్రియార్థేషు సర్వేషు నప్రసజ్యేత కామతః । అతిప్రసక్తించైవేషాం మనసా సన్నివర్తయేత్॥ ౧౬॥

ఇంద్రియార్థము లనగా రూపరసగంధస్పర్శాదులు వీటియందనిషిద్ధములగు స్వదారసురతాదుల యందునను నుపభోగమునకు నత్యంతప్రసక్తికలవాడు కాగూడదు తన్నివృత్త్యుపాయమును చెప్పుచున్నాడు అయ్యతిప్రసక్తిస్వర్గాపవర్గములకు విరోధియగుట నరసి మనసుచే మళ్లించవలెను॥ ౧౬॥

మూ॥ సర్వాన్పరిత్యజే దర్థాన్ స్వాధ్యాయస్య విరోధినః । యథా తథా ధ్యాపయంస్తు సాహ్యస్యకృతకృత్యతా॥ ౧౭॥

స్వాధ్యాయమునకు విరోధులగు సకలార్థముల ననగా ధనవంతులగృహములకు బోయి యుపసర్పించడము కృష్యాదులు నమితముగ నదేపనిగ గల ప్రయోజనములను పరిత్యజించవలెను- అటులైనచో భృత్యాదిపోషణ మెట్లనిన యేదైన నొ

కయుపాయమును స్వాధ్యాయానికి గోధియగు దాని నవలంబించి భృత్యాత్మ జీవనే ము జరుపు కొనుచు నధ్యాపనము జేయుచు నుండిన నాస్వాధ్యాయపరత్వగృహ స్థునకుం గృతకృత్యతగదా॥ ౧౭॥

మూ॥ వయసః కర్మణోర్థస్య శ్రుతస్యాభిజనస్యచ । వేషవా
గ్బుద్ధిసారూప్య మాచరన్ విచరేదిహ॥ ౧౮॥

వయస్సుకును క్రియకును ధనమునకును విద్యకును కులమునకున్ను ననురూపమగు వేషమును మాటలను బుద్ధులను జేయుచు సంచరింపవలెను ఏలాగునంటె యౌవనమందు చందనమాలికాదిధారణము త్రివర్గము ననుసరించెడువారున్ను యిట్లన్నిటను నూహించవలెను॥ ౧౮॥

మూ॥ బుద్ధివృద్ధికరాణ్యాశు ధన్యానిచ హితానిచ । నిత్యంశాస్త్రా
ణ్యవేక్షేత నిగమాంశ్చైవ వైదికాన్॥ ౧౯॥

వేదావిరుద్ధములును శీఘ్రముగ బుద్ధివృద్ధి నొందించునవియు ననగా వ్యాకరణమీమాంసాస్మృతిపురాణ న్యాయాదులను ధన్యములనగా ధనమును గూర్చునట్టి హితములగు బార్హస్పత్యౌశనసాది నీతిశాస్త్రములను సర్వహితమును గూర్చెడి వనగా దృష్టోపకారములగు వైద్యమును జ్యోతిషమునున్ను మరియు వేదార్థావబోధకములగు నిగమగ్రంథములనున్ను పర్యాలోచించుచుండ వలయును॥ ౧౯॥

మూ॥ యథాయథా హి పురుష శ్శాస్త్రం సమధిగచ్ఛతి । త
థాతథా విజానాతి విజ్ఞానం చాస్యరోచతే॥ ౨౦॥

యేయేప్రకారముగ శాస్త్రమును లెస్సగనభ్యసించు నాయాప్రకారముగ శాస్త్రాంతర తాత్పర్యములనున్ను విశేషముగ దెలిసికొనును విశేషజ్ఞానమున్ను వానికి బ్రకాశించునట్టి బలముగలుగును॥ ౨౦॥

మూ॥ ఋషియజ్ఞం దేవయజ్ఞం భూతయజ్ఞంచ సర్వదా। నృయ
జ్ఞం పితృయజ్ఞంచ యథాశక్తి నహాపయేత్॥ ౨౧॥

బ్రహ్మయజ్ఞాది పంచయజ్ఞములను యథాశక్తిగా సేయవలెను గాని పరిత్యజించగూడదు తృతీయాధ్యాయమందు జెప్పిన వీటినిఁగూడ జెప్పడము ముందు విశే

షముగనుపన్యసించుటకివి స్నాతకునకు వ్రతములని తెలియుటకు॥ ౨౧॥

మూ॥ ఏతానేకే మహాయజ్ఞాన్ యజ్ఞశాస్త్రవిదోజనాః । అనీ
హమానాస్సతత మింద్రియేష్వేవ జుహ్వతి॥ ౨౨॥

కొందరు గృహస్థులనగా బాహ్యాభ్యంతర యజ్ఞప్రవర్తక శాస్త్రయజ్ఞులీపంచమహాయజ్ఞములను బహిశ్చేష్టానిరసనముచే నయిదు బుద్ధీంద్రియములందును తత్తద్జ్ఞానసంయమముల జేయుచున్నవారగుచు సంపాదింతురు ఈయజ్ఞములకు హోమములేదుగావున జుహ్వతియనునది సంపాదనార్థకము॥ ౨౨॥

మూ॥ వాచ్యేకే జుహ్వతి ప్రాణం ప్రాణేవాచంచ సర్వదా।వాచి
ప్రాణేచ పశ్యంతో యజ్ఞనిర్వృత్తి మక్షయాం॥ ౨౩॥

కొందరు గృహస్థులనగా బ్రహ్మవేత్తలు వాక్కుయందున్ను ప్రాణవాయువుయందున్ను యజ్ఞనిర్వృత్తి నక్షయఫలమునుగా దెలసినవారై వాక్కుయందు ప్రాణమునున్ను ప్రాణమందు వాక్కునున్ను హోమము జేయుచున్నారు పలుకుచున్న వానిచే "వాచిప్రాణంజుహోమి" యనిన్ని పలకకుండ నిట్టూర్పిచ్చుచున్న వానిచే "ప్రాణేవాచంజుహోమి"యని వ్యాఖ్యానము జేయదగనది దీనిచే॥ శ్రు॥ "యావద్వైపురుషోభాషతేన తావత్ప్రాణితుం శక్నోతి । ప్రాణంతదావాచి జుహోతి। యావద్ధిపురుషః ప్రాణితిన తావద్భాషితుం శక్నోతి।వాచంతథా ప్రాణేజుహోతి। ఏతేనంతేమృతెమృతే।ఆహుతీ జుహోతి।అథవా అన్యాఆహుతయః।అనంతరం అన్యస్తాః కర్మమయ్యోభవంత్యేవంహి।తస్యైతత్పూర్వే విద్వాంసఆహుతిం జుహవాంచక్రిరితి"॥పురుషుడెంతకాలము మాటలాడునంతలో నూర్పివ్వలేడది వాక్కుయందు ప్రాణమునువేల్చుట యెంతకాలంబూర్పిచ్చునంతలో మాటాడలేడని ప్రాణమందు వాక్కును హోమమును జేయుచున్నాడు యీలాగుగాకుంటే బాహ్యాన్యములగు నితరాహుతులు కర్మమయములగుచున్నవి ఈప్రకారము ఇంతకు పూర్వులగు విద్వాంసులగ్నిహోత్రమును హోమమొనర్చిరి- యని కౌషీతకరహస్యబ్రాహ్మణము॥ ౨౩॥

మూ॥ జ్ఞానేనైవాపరేవిప్రా యజంత్యేతైర్మఖైస్సదా । జ్ఞాన
మూలాం క్రియామేషాం పశ్యంతో జ్ఞానచక్షుషా॥ ౨౪॥

మరికొందరు విప్రులుంగా బ్రహ్మనిష్ఠులు బ్రహ్మజ్ఞానముచేతనే యీయజ్ఞము లను జేతురు ఇదెట్లనిన జ్ఞానమనగా, శ్రు. "సత్యంజ్ఞానమనంతంబ్రహ్మే"త్యాదిశ్రుతు లయందు బ్రసిద్ధము అది మూలముగాగల యీజ్ఞానములయొక్క క్రియననగా యు క్తిజ్ఞానమనేవత్తునృచేతను జెలియుచున్నవారౌచున్నారు అట్టివారు పంచయ జ్ఞఫలమును బొందుచున్నారని యర్థము ఈమూడుశ్లోకములచేతను బ్రహ్మనిష్ఠులైై వేదసన్న్యాసులగు గృహస్థులకున్ను నీవిధులగుచున్నవి॥ ౨౪॥

మూ॥ అగ్నిహోత్రంచ జుహుయా దాద్యంతే ద్యునిశోస్సదా।ద
ర్శేనచార్ధమాసాంతే పౌర్ణమాసేన చైవహి॥ ౨౫॥

ఉదితహోమపక్షమందు దినాదియందును నిశాదియందును ననుదితహోమ పక్షమందు దినాంతమందును నిశాంతమందును ఇట్లుగాకున్న నుదితహోమపక్ష మందు దినాద్యంతములయందును ననుదితహోమపక్షమందు నిశాద్యంతములందు ను నగ్నిహోత్రమును జేయవలయు కృష్ణపక్షార్ధమాసాంతమందు దర్శాఖ్యమ గు కర్మముచేతనున్ను శుక్లపక్షార్ధమాసాంతమందు పౌర్ణమాసాఖ్యమగు కర్మ ముచేతనున్ను ఇష్టులను జేయవలయును॥ ౨౫॥

మూ॥ సస్యాంతే నవసస్యేష్ట్యా తథర్త్వంతే ద్విజోధ్వరైః। పశు
నాత్వయనస్యాదౌ సమాంతే సౌమికైర్మఖైః॥ ౨౬॥

పూర్వార్జితధాన్యాదిసస్యము సమాప్తమయిననట"శరదినవానా"మనుసూ త్రకారవచనమువలన నసమాప్తమున్ను నవసస్యముత్పత్తి గలుగుచుండనాగ్రి యణముచే యజించవలయు సస్యక్షయము నియతముగాదుగనుకనున్ను ధనవంతు లకధిక ధాన్యముండుటవలననున్ను నవసస్యాంతమందని చెప్పుటవలననున్ను నవ సస్యఫలము పుట్టడమే యంగీకరించబడెను ప్రతివర్షమున్ను నవసస్యోత్పత్తినియ తముగావున"ఋతుస్సంవత్సర"ఇత్యాదిశ్రుతివలన ఋతుత్రయపక్షాశ్రయణముచే నాల్గుమాసములొక ఋతువుగావునం దదంతమందు చాతుర్మాస్యయాగములుజే యవలయు నుత్తరదక్షిణాయనముల బ్రారంభమందు పశుయాగముజేయవలయు ను జ్యోతిశ్శాస్త్రోక్తచైత్రశుక్ల ప్రతిపదారభ్యావత్సరాంతేయని వసంతర్తువందు సోమరససాధ్యములగు నగ్నిష్టోమాదియాగములం జేయవలయును॥ ౨౬॥

మూ॥ నానిష్ట్వానవసస్యేష్ట్యా పశునాచాగ్నిమాన్ద్విజః।నవాన్న
మద్యాన్మాంసంవా దీర్ఘమాయుర్జిజీవిషుః॥ ౨౭॥

ఆహితాగ్నియగు ద్విజుడు దీర్ఘకాలముజీవించనిచ్ఛగలవాఁడైనయాగ్రయణము జేయకనవాన్నమును పశుయాగము జేయక మాంసమునున్ను దినరాదు॥ ౨౭॥

మూ॥ నవేనానర్చితాహ్యస్య పశుహవ్యేన చాగ్నయః । ప్రా
ణానేవాత్తు మిచ్ఛంతి నవాన్నామిషగర్ధినః॥ ౨౮॥

దోషమునుజెప్పుచు నీరెంటికీనిత్యత్వమును జెప్పుచున్నాడు నవాన్నము చేతనున్ను నామిషము చేతను మున్ను గజేయబడనియాగముగల యగ్నులట్లు జేయక నవాన్నామిషభక్షణతత్పరులగు వారిప్రాణములనుదిననిచ్ఛయించును॥ ౨౮॥

మూ॥ ఆసనాశన శయ్యాభి రద్భిర్మూల ఫలేనవా । నాస్యకశ్చిద్వ
సేద్గేహే శక్తితోఽనర్చితోఽతిథిః॥ ౨౯॥

యథాశక్తిగానాసనము నన్నము శయ్య మూలఫలాదులు వీటిచే నర్చితుడు గాకుండనతిథి యీగృహస్థునింటనుండగూడదు॥ ౨౯॥

మూ॥ పాషండినో వికర్మస్థాన్ బైడాలవ్రతికాన్ శఠాన్। హై
తుకాన్ బక వృత్తీంశ్చ వాఙ్మాత్రేణాపి నార్చయేత్ ॥

పాషండులనగా వేదబాహ్యవ్రతలింగములనుధరించినవారు శాక్య భిక్షుక్షపణకాదులు వికర్మస్థులనగా ప్రతిషిద్ధ కర్మములచే జీవించువారు బైడాలవ్రతికులును బకవృత్తులును ముందుజెప్పబడుదురు శఠులనగా వేదములందు శ్రద్ధలేనివారు హైతుకులనగా వేదవిరోధితర్కములచే వ్యవహరించువారువీరలతిథులుగవచ్చెడికాలమందు వచ్చిరేని మాటమాత్రముచేనైన నర్చించరాదు అన్నము బెట్టుటైతె "శక్తితోఽపచమానేభ్యః" యని పైనియనుజ్ఞ యివ్వబడియెను॥ ౩౦॥

మూ॥ వేదవిద్యా వ్రతస్నాతాన్ శ్రోత్రియాన్గృహమేధినః।పూ
జయేద్ధవ్యకవ్యేన విపరీతాంశ్చ వర్జయేత్॥ ౩౧॥

ద్వితీయాధ్యాయోక్తవేదవిద్యావ్రతోభయస్నాతకులు ముఖ్యరగు శ్రోత్రియులను గృహస్థులునగు వీరలనుహవ్యకవ్యములచే నర్చింపవలయు విపరీతులను వర్జించ

పవలయును॥ ౩౧॥

మూ॥ శక్తితోఽపచ మానేభ్యో దాతవ్యం గృహమేధినా। సంవి
భాగశ్చ భూతేభ్యః కర్తవ్యోనుపరోధతః॥ ౩౨॥

వంటలేనిబ్రహ్మచారి యతిపాషండ్యాదులకు గృహస్థుడు యథాశక్తిగానన్న ము బెట్టవలెనని చెప్పబడినప్పటికిని వంటగలవారికంటే వీరికివిశేషమని దెలుపుట కిచ్చట జెప్పబడెను "భిక్షాంచ భిక్షవే దద్యాద్విధివద్బ్రహ్మచారిణే॥" యని బ్రహ్మచారికిన్ని యతికిన్ని చెప్పబడేయున్నది గాన నిచ్చటపాషండులకుమాత్రమేయనిమేధాతిథిగోవిందరాజులుబలికిరి॥ స్వకుటుంబానుపరోధముగ వృక్షాదిభూతములకన్నింటికిని జలాదికనుచేనైన సంవిభాగముజేయదగును॥ ౩౨॥

మూ॥ రాజతో ధనమన్విచ్ఛే త్సంసీదన్ స్నాతకోద్విజః । యా
జ్యాంతే వాసినోవాపి నత్వన్యత ఇతిస్థితిః॥ ౩౩॥

"నరాజ్ఞః ప్రతిగృహ్ణీయా ద్రాజన్య ప్రసూతితః॥" ఇతి క్షత్రియసంతతిగాని రాజువలన ప్రతిగ్రహించగూడదని నిషేధమువలన నిచ్చటరాజశబ్దముక్షత్రియపరము స్నాతకుడగు విప్రుడు క్షుత్తుచే క్షీణించుచు ద్విజాతిప్రతిగ్రహము సంభవించుచుండినను యథాశాస్త్రముగ ప్రజపాలించుచున్న క్షత్రియజాతియగు రాజువలననగా తనకుయాజ్యుడు శిష్యుడునగురాజువలన ముందుగధనము నభిలషించవలెను రాజులు మహాధనులు గావున పీడలేకుండు .గావునను యాజ్యశిష్యులు ప్రత్యుపకారాభిముఖులగుటవలనను అదిసంభవించనిచో। "శ్లో॥సర్వతః ప్రతిగృహ్ణీయా" దనిచెప్పటయె ధర్మప్రకారముగా నితరద్విజులవలననున్ను ప్రతిగ్రహించవచ్చును॥ యీలాగుమండగా ననాపదయందు ముందుగా క్షత్రియనృపయాజ్య శిష్యులవలన ప్రతిగ్రహించవలెను ప్రతిగ్రహనియమముకొరకీవచనము అదిగావుననే "నత్వన్యత ఇతిస్థితిరితి" ఇతరులవల్లనుండి ప్రతిగ్రహించగూడదని శాస్త్రమర్యాదచెప్పెను "సంసీదన్నని" చెప్పుటవలన నిది యావద్ధర్మవిషయమనదగదు ఆపత్ప్రకరణము కాదుగావున సంసీదన్నను దానికి సిలవధన ములేదనుటయే యర్థమగుటవలన ధనము లేకుండుట యాపత్తిగాదు మరేమంటే ధనములేకున్నతనకు విద్యుక్తమగు నుపాయములేకుండుటయాపత్తి యిట్లుగాకున్న నెప్పటి కప్పుడు కావలసినది మాత్ర

ము సంభవించుటచే మరునాటికి లేనివాడున్ను ఆపత్తిగలవాడే గావలెనుఇదేయాప
ద్వృత్తివిషయమంటే "నత్వన్యతఇతిస్థితిః" అన్యునివలన స్వీకరించరాదని కొనసుచె
ప్పినది "సర్వతఃప్రతిగృహ్ణీయా" దనే యాపద్విషయమందు చెప్పిన దానితో విరో
ధమగును మేకైతె నాపత్ప్రకరణము వలన॥"శ్లో॥సీదద్భిరుప్యమిచ్ఛద్భి ర్ధనంవా
పృథివీపతిః । యాచ్యస్స్యా"దని చెప్పబడినదిశూద్రనృపవిషయము ఇది రాజాది ప్ర
తిగ్రహము సంభవించనియప్పుడు॥ ౩౩॥

మూ॥ నసీదేత్స్నాతకో విప్రః క్షుధాశక్తః కథంచన । నజీర్ణ
మలవద్వాసా భవేచ్చ విభవేసతి॥ ౩౪॥

జ్ఞానము శీలము గలుగుట వలన ప్రతిగ్రహమందు శక్తుడగు స్నాతకుడగుబ్రా
హ్మణుడు ఉక్తరాజన్యప్రతిగ్రహము లభించుచుండగా క్షుత్తుచే నిరసించగూడదు
ధనముండునపుడు మలినవస్త్రములు జీర్ణములును గట్టగూడదు॥ ౩౪॥

మూ॥ క్లప్త కేశన ఖశ్మశ్రు ర్దాంతశ్శుక్లాంబర శ్శుచిః । స్వా
ధ్యాయేచైవ యుక్తస్స్యా న్నిత్యమాత్మహితేషుచ॥ ౩౫॥

క్షౌరకర్మముచే కేశనఖశ్మశ్రువు లుపయోగము ఛేదింపంజేయుచు తపఃక్లేశ
మును సహించువాడును తెల్లనిబట్టలం గట్టుకొనుచు బాహ్యాంతశ్శుద్ధుడును స్వా
ధ్యాయమందును శరీరారోగ్యాదివిషయమై యౌషధాదిగ్రహణమందును యుక్త
డుగావలయును॥ ౩౫॥

మూ॥ వైణవీం ధారయే ద్యష్టిం సోదకంచ కమండలుమ్ । య
జ్ఞోపవీతం వేదంచ శుభే రౌక్మేచకుండలే॥ ౩౬॥

వేణుదండమును జలయుక్తకమండలువున్నుయజ్ఞోపవీతమును దర్భముష్టినిశుభ
కరములగు సువర్ణకుండలములనున్ను ధరించవలయును॥ ౩౬॥

మూ॥ నేక్షేతోద్యంత మాదిత్యం నాస్తంయాంతం కదాచన ।
నోపసృష్టం నవారిస్థం నమధ్యం నభసోగతమ్॥ ౩౭॥

ఉదయించుచున్నట్టియు నస్తమించుచున్నట్టియు నసంపూర్ణసూర్యబింబము

నుజూడ గూడదు గ్రహణము బట్టినప్పుడున్నువస్త్రాద్యుపద్రవములతో గూడినట్టియు జలమందు బ్రతిబింబించినట్టియు నభోమధ్యగతుడగు సూర్యునిజూడగూడదు॥ ౩౭॥

మూ॥ నలంఘయేద్వత్సతంత్రీం నప్రధావేచ్చవర్షతి । నచోద
కే నిరీక్షేత స్వరూపమితి ధారణా॥ ౩౮॥

గోవత్సాదిబంధనరజ్జువును దాట గూడదువర్షము గురియుచుండం బరువెత్త గూడదు జలమందు స్వప్రతిబింబమును జూడగూడదు ఇట్లుశాస్త్రనిర్ణయము॥

మూ॥ మృదంగాం దైవతం విప్రం ఘృతం మధుచతుష్పథమ్ । ప్ర
దక్షిణాని కుర్వీత ప్రజ్ఞాతాంశ్చ వనస్పతీన్॥ ౩౯॥

మార్గమందునడుచుచున్నప్పుడు ఉద్ధృతమగుమృత్తున్ను గోవున్ను శిలాదిదేవతావిగ్రహములున్ను బ్రాహ్మణుడున్ను నెయ్యిన్ని తేనియయున్ను నాలుగుత్రోవలుగలసినచోటున్ను ప్రసిద్ధములగు వనస్పతులున్ను కుడిపైపున నుండునట్లు ప్రదక్షిణముగాను నడచిపోవలయును॥ ౩౯॥

మూ॥ నోపగచ్ఛేత్ప్రమత్తోపి స్త్రియమార్తవదర్శనే । సమా
నశయనే చైవ నశయీత తయాసహ॥ ౪౦॥

కామాతురుడయినప్పటికిని పుష్పిణీస్త్రీనిబొందగూడదు సురతములేకున్న నస్పృశ్యత్వముగలమూడుదినములందు నేకశయ్యయందు బరుండందగదు॥ "శ్లో॥ తాసామాద్యాశ్చతస్రస్తు నిందితాః॥" యనువచనముచే మున్నునిషేధము చెప్పబడియున్నను బ్రాయశ్చిత్తగౌరవార్థము పునర్వచనము॥ ౪౦

మూ॥ రజసాభిప్లుతాంనారీం నరస్య హ్యుపగచ్ఛతః। ప్రజ్ఞా తే
జో బలంచక్షు రాయుశ్చైవ ప్రహీయతే॥ ౪౧॥

రజోదూషితయగు స్త్రీనిబొందినవానికి ప్రజ్ఞయున్ను తేజస్సున్ను బలమున్ను దృష్టిన్ని యాయువున్ను తగ్గిపోవును గావున పుష్పిణినొందగూడదు॥ ౪౧॥

మూ॥ తాంవివర్జయత స్తస్య రజసాసమభిప్లుతాం। ప్రజ్ఞా తేజో
బలంచక్షు రాయుశ్చైవ ప్రవర్ధతే॥ ౪౨॥

రజోదుష్టయగు స్త్రీని వర్జించిన వానికి ప్రజ్ఞాతేజోబలచక్షురాయువులు వృద్ధిబొందును గావున నట్టి స్త్రీని బొందగూడదు॥ ౪౨॥

మూ॥ నాశ్నీయాద్భార్యయాసార్ధం నైనామీక్షేతవాశ్నతీమ్।
క్షువంతీం జృంభమాణాంచ నచాసీనాం యథాసుఖం॥౪౩॥

భార్యతోగూడ నొకపాత్రమందు భుజింపగూడదు భార్యభోజనము జేయుచుండగ తుమ్ముచునుండగ నావలించుచు నుండగ యథేచ్ఛముగ నిరావరణస్థలమున గూర్చుండగ జూడగూడదు॥ ౪౩॥

మూ॥ నాంజయంతీం స్వకే నేత్రే నచాభ్యక్తామనావృతామ్।
నపశ్యేత్ప్రసవంతీంచ తేజస్కామో ద్విజోత్తమః॥ ౪౪॥

తేజస్కాముడగు ద్విజోత్తముడు తనభార్యను నేత్రములందు కాటుక బెట్టుకొను దానినిన్ని తలంటుకొనుచున్న దానినిన్ని వస్త్రమును విసర్జించియున్న దానినిన్ని ప్రసవమగుచునున్న దానినిన్ని జూడగూడదు॥ ౪౪॥

మూ॥ నాన్నమద్యాదేకవాసా ననగ్నః స్నానమాచరేత్। న
మూత్రం పథికుర్వీత నభస్మని నగోవ్రజే॥ ౪౫॥

ఏకవస్త్రుడై యన్నమును భుజించగూడదు నగ్నుడై స్నానము జేయవలదు మార్గమందున్ను భస్మమందున్ను గోష్ఠమందున్ను మూత్రపురీషోత్సర్జనము జేయరాదు మూత్రశబ్దమధఃకాయమలవిసర్జనోపలక్షణము॥ ౪౫॥

మూ॥ నఫాలకృష్టే నజలే నచిత్యాం నచపర్వతే। నజీర్ణదేవా
యతనే నవల్మీకే కదాచన॥ ౪౬॥

దుక్కిదున్నిన భూమియందున్ను జలమందున్ను యాగార్థమగు ఇష్టకాదిసంచయమందున్ను పర్వతమందున్ను జీర్ణదేవాలయమందున్ను పుట్టయందును మూత్రపురీషములు విడువరాదు॥ ౪౬॥

మూ॥ నససత్వేషు గర్తేషు నగచ్ఛన్నాపిచ స్థితః। న నదీతీరమా
సాద్య నచపర్వతమస్తకే॥ ౪౭॥

జంతుయుక్తములగు బిలములందును నడుచుచున్న నిలువబడియు నదీతటము లందును పర్వతశృంగములందును మూత్రపురీషోత్సర్జనము జేయగూడదు. పర్వతములందని జెప్పుటచే తచ్ఛృంగములు నుక్తములే మరల నిచట గిరిశృంగముల నని జెప్పుట వలన శృంగేతరపర్వతస్థలములందు వైకల్పిక మగుచున్నది మిక్కిలియాతురుడగు వానికి పర్వతమాత్రమందు దోషములేదు॥ ౪౭॥

మూ॥ వాయ్వగ్ని విప్రానాదిత్యమపః పశ్యం స్తథైవ గాః। నక
దాచన కుర్వీత విణ్మూత్రస్య విసర్జనమ్॥ ౪౮॥

గాలికభిముఖముగాను నగ్నిని బ్రాహ్మణుని సూర్యుని జలమును గోవును జూచుచు నెప్పుడును మూత్రపురీషోత్సర్జనము జేయగూడదు గాలికి రూపము లేకుండుటచే తత్ప్రేరితతృణకాష్ఠాదికమును జూడకూడదని కుల్లూకభట్టు॥ ౪౮॥

మూ॥ తిరస్కృత్యోచ్చరేత్కాష్ఠ లోష్ట పత్రతృణాదినా। నియ
మ్య ప్రయతో వాచం సంవీతాంగో వగుంఠితః॥ ౪౯॥

తృణకాష్ఠలోష్టాదులచే భూమిని కప్పించి మౌనియై యుచ్ఛిష్టుడు గాకుండ శరీరమంతటను బట్టగప్పుకుని మూత్రపురీషోత్సర్జనము జేయవలయును॥ "శ్లో॥ శుష్కైః స్తృణైర్వా కాష్ఠైర్వా పత్రైర్వేణుదళేనవా। మృణ్మయైర్భాజనైర్వాపి అంతర్ధాయవసుంధరామితి॥" ఎండు పుడకలచే గాని వెదురాకులు మొదలగు వాటిచే గాని కుండముక్కలు మొదలయిన వాటిచే గాని భూమి కప్పించి మూత్రపురీషోత్సర్జనము జేయవలయునని వాయుపురాణ వచనమువలన కాష్ఠపత్రతృణాదులు శుష్కములు గావలయునని తెలియదగును॥ ౪౯॥

మూ॥ మూత్రోచ్చార సముత్సర్గం దివా కుర్యాదుదఙ్ముఖః। ద
క్షిణాభిముఖో రాత్రౌ సంధ్యయోశ్చ యథా దివా॥ ౫౦॥

పగటియందును సంధ్యలందును నుత్తరాభిముఖుడయ్యును రాత్రియందు దక్షిణాభిముఖుడయ్యు మూత్రపురీషములను విడువవలయును- ఈశ్లోకములో ధరణీధరుడు "స్వర్గోనాశాయచేతసః" యని నాలవపాదమును బఠించి బుద్ధియొక్క యది నాశము కొరకని వ్యాఖ్యానించెను గాని యనాదిపరంపరాప్రాప్తమగు పాఠ

మును దప్పించుట నెగదని కుల్లూకభట్టువ్రాసెను॥ ౫౦॥

మూ॥ ఛాయాయా మంధకారేవా రాత్రావహనివాద్విజః । యథాసుఖముఖః కుర్యా త్ప్రాణబాధభయేషుచ॥ ౫౧॥

రాత్రియందు పగలను నంధకారమందును పగటియందును గోష్ఠఛాయాదులందును మంచుమంచుగప్పి చీకటివలె నున్నప్పుడును దిగ్భేదము తెలియకుండు నప్పుడును చోరవ్యాఘ్రాదిబాధవినాశభయములందును యథేష్టముఖుడై మూత్రపురీష ౫౧॥

మూ॥ ప్రత్యగ్నిం ప్రతిసూర్యంచ ప్రతిసోమోదకద్విజాన్ । ప్రతిగాం ప్రతివాతంచ ప్రజ్ఞానశ్యతి మేహతః॥ ౫౨॥

అగ్నికి సూర్యునకు చంద్రునకు జలమునకు బ్రాహ్మణునకు గోవునకు గాలికిన భిముఖముగమూత్రపురీషములు విడచినవానికి ప్రజ్ఞ నశించును పైనివాయ్వాదులను చూచుచుకూడదనిచెప్పె నిప్పుడవికనపడకుండిన నెదురుగాకూడదనిచెప్పెను ప్రతి వాతమనుచో ప్రతిసంధ్యమని పాఠాంతరముకొందరు పఠించుచున్నారు॥ ౫౨॥

మూ॥ నాగ్నిం ముఖే నోపధమే న్నగ్నాం నేక్షేతచ స్త్రియం। నామేధ్యం ప్రక్షిపేదగ్నౌ నచపాదౌ ప్రతాపయేత్॥ ౫౩॥

అగ్నినిముఖముచే నూదగూడదు విసనకర్రమొదలగువాటిచే ప్రజ్వలింపజేయవలయును మైథునవ్యతిరిక్తసమయమందు నగ్నయగుస్త్రీనిజూడగూడదు॥ "సూ॥ మైథునవ్యతిరేకేణ నగ్నాంస్త్రియం నపశ్యే"దనిసాంఖ్యా యనవచనమువలన మలమూత్రములనగ్నియందు విడువగూడదు పాదములను వహ్నియందు గాచగూడదనగా పాదమునెత్తి వహ్నిపైనుంచి కాచదగదు మరేమనిన వస్త్రాదులచే వేడిదగులునటుగాచవచ్చును॥ ౫౩॥

మూ॥ అధస్తా న్నోపదధ్యాచ్చ నచైన మభిలంఘయేత్। నచైనం పాదతః కుర్యా న్నప్రాణాబాధమాచరేత్॥ ౫౪॥

మంచముక్రింద గుంపటిమొదలగు వాటిచే నగ్నియుంచి పరుండదగదు అగ్నిని దా

టగూడదు పరుండినప్పుడు పాదములకు దగ్గరగా నగ్నినుంచగూడదు ప్రాణపీడా కరమగు కర్మనును జేయగూడదు॥ ౫౪॥

మూ॥ నాశ్నీయాత్సంధివేలాయాం న గచ్ఛేన్నాపి సంవిశేత్। న
చైవ ప్రలిఖేద్భూమిం నాత్మనోపహరేత్స్రజం॥ ౫౫॥

సంధ్యలందు భుజించడమును గ్రామాంతరగమనమును నిద్రనున్ను జేయరాదు భూమియందు వ్యర్థముగ రేఖలుగీయగూడదు తానుధరించినమాలికను దానుదీసి వేయగూడదు మరియొకనిచే దీయించవలెను॥ ౫౫॥

మూ॥ నాప్సుమూత్ర పురీషంవా ష్ఠీవనంవా సముత్సృజేత్ ।అమే
ధ్యలిప్తమన్యద్వా లోహితంవా విషాణివా॥...... ౫౬॥

జలమందు మూత్రపురీషాదులను నిష్ఠీవమనుటనే శ్లేష్మము చీమిడి గుళిమిమొదలగువవియును మలమూత్రసంపర్కముగల వస్త్రాదికమునున్ను రక్తమును విషవస్తువులనున్ను వేయగూడదు॥ ౫౬॥

మూ॥ నైకస్సుప్యాచ్ఛూన్యగృహే శయానం నప్రబోధయేత్ ।
నోదక్యయాభిభాషేత యజ్ఞంగచ్ఛేదనావృతః॥ ౫౭॥

పాడై జనశూన్యమగునింట నొంటిగ బరుండదగదు విద్యాధనాదులచే నధికుడగువాడు నిద్రితుడైయున్న నతని మేలొల్పగూడదు పుష్పిణితో సంభాషించరాదు వరణములేకుండయజ్ఞములోనికి వెళ్ళవలదు చూచుటకు వెళ్ళవచ్చును॥సూ॥"దర్శనార్థంకామ"మను గౌతమవచనమువలన॥ ౫౭॥

మూ॥ అగ్న్యాగారే గవాంగోష్ఠే బ్రాహ్మణానాంచ సన్నిధౌ।
స్వాధ్యాయే భోజనేచైవ దక్షిణంపాణి ముద్ధరేత్॥౫౮॥

అగ్నిగృహమందుననున్ను గోవులున్న చోటనున్ను బ్రాహ్మణసన్నిధినిన్ని స్వాధ్యాయకాలమందును భోజనసమయమందున్ను దక్షిణబాహువునెత్తవలెననగా పయినుంచవలెను॥ ౫౮॥

మూ॥ నవారయేద్గాం ధయంతీం నచాచక్షీత కస్యచిత్ । నదివిం

ద్రాయథం దృష్ట్వా కస్యచి ద్దర్శయేద్బుధః॥ ... ౫౯॥

బుద్ధిమంతుడు నీళ్ళు ద్రాగుచున్న గోవునుగాని పాలు ద్రాగుచున్న వత్సనుగాని పాలుకుతుకునట్టి సమయమందుదప్ప వారించగూడదు మరియొకరిదట్లయినం జెప్పదగదు ఆకాశమందింద్రధనువు నన్యునకు జూపించవలదు॥ ౫౯॥

మూ॥ నాధార్మికే వసేద్గ్రామే నవ్యాధిబహులేభృశం। నైకః ప్రపద్యేతాధ్వానం నచిరం పర్వతే వసేత్॥...... ౬౦॥

ధార్మికులు లేనిచోటనున్న దుశ్చికిత్సితరోగములు బహుమందికివచ్చుచున్న స్థలమందున్ను నివసించగూడదు ప్రయాణమొకరుడే వెళ్ళకూడదు పర్వతమందు చిరముండదగదు ౬౦॥

మూ॥ నశూద్రరాజ్యే నివసే న్నాధార్మికజనావృతే। నపాషండిగణాక్రాంతే నోపసృష్టేంత్యజైర్నృభిః॥ ౬౧॥

శూద్రుడు పాలించుచున్న రాజ్యమందును ధర్మశూన్యులచే నాక్రాంతమగు దేవమందును వేదబాహ్యలింగధారి గణమునుండియున్నచోటునను చండాలాద్యంత్యజులచే బాధపెట్టబడుచుండెడిస్థలమందునునివసించగూడదు॥ ౬౧॥

మూ॥ నభుంజీతో ద్ధృతస్నేహం నాతిసౌహిత్య మాచరేత్।నాతిప్రగే నాతిసాయం నసాయంప్రాతరాశితః॥ ౬౨॥

చమురుతీసిన తెలకపిండి మొదలగునవి తినగూడదు రెండుపూటలందునైన నత్యంతతృప్తిగా భుజించవలదు॥శ్లో॥"జఠరంపూరయేదర్థమన్నైర్భాగంజలేనచ। వాయోస్సంచారణార్థంతు చతుర్థమవశేషయేత్" తనకడుపులో సగముభాగమన్నముచేతను నొకభాగము జలముచేతను నిండించి నాలవభాగము వాయుసంచారార్థము విడువవలయునని విష్ణుపురాణమువలన సూర్యోదయసూర్యాస్తమయకాలములలోను భుజించతగదు పగటిభోజనమతితృప్తిగానయినచో రాత్రిభోజనముమానవలెను॥ ౬౨॥

మూ॥ నకుర్వీత వృథాచేష్టాం నవార్యంజలినా పిబేత్।నోత్సంగే భక్షయేద్భక్ష్యా న్నజాతుస్యా త్కుతూహలీ॥ ౬౩॥

ఇహాపరముల కుపయోగించని చేష్టచేయకూడదు రెండుచేతులతో నదకపా ననుజేయరాదు తొడలపైనుంచుకొని భక్ష్యములనుదినరాదు తనకు పనిలేనిచోని జేమియని కుతూహలికాకూడదు॥ ౬౩॥

మూ॥ నన్నృత్యే దథవాగాయే న్నవాదిత్రాణి వాదయేత్। నాస్ఫో
టయేన్నచక్ష్వేడే న్నచరక్తో విరావయేత్॥ ౬౪॥

అశాస్త్రీయమగు నృత్యమును గానమును వాద్యవాదనమును జేయరాదు మల్ల చరువగూడదు నోటితోనవ్యక్తమగు శబ్దముత్ష్వేళనమదిజేయవలదు సరదాచేగాడిదెమొదలగు జంతువులరచినట్లు అవవలదు॥ ౬౪॥

మూ॥ నపాదౌ ధావయేత్కాంస్యే కదాచిదపి భాజనే। నభిన్న
భాండే భుంజీత నభావప్రతిదూషితే॥ ౬౫॥

కంచుపాత్రయందు పాదములను గడుగగూడదు॥ "సూ॥ తామ్రరజత సువర్ణానాంభిన్నమభిన్నంవానదోషఇతి-" రాగివెండిబంగారుపాత్రలు భిన్నములైన దోషములేదనుపైరీనసి వచనమువలన నవితప్ప మిగిలిన పాత్రములు భిన్నములైన వాటిలోభుజించదగదు జేనియందు మనస్సు సందేహముబుట్టునది భావదుష్టమట్టి దానినిదినరాదు॥ ౬౫॥

మూ॥ ఉపానహౌచ వాసశ్చ ధృతమన్యైర్నధారయేత్। ఉపవీ
తమలంకారం స్రజం కరకమేవచ॥ ౬౬॥

పాదరక్షలు వస్త్రము నుపవీతము నలంకారము పుష్పమాలికలు కమండలువు నివియొకరిచే నుపభుక్తములయ్యేనేని వాటినిధరించగూడదు॥ ౬౬॥

మూ॥ నావినీతైర్వ్రజే ద్ధుర్యై ర్నచ క్షుద్వ్యాధిపీడితైః। నభిన్న
శృంగాక్షిఖురై ర్నవాలధివిరూపితైః॥ ౬౭॥

శిక్షితములుగాకుండునది క్షుత్పిపాసావ్యాధిపరిపీడితములును భిన్నములగుచెవులుకన్నులు కొమ్ములు తోకగలవియునగు యెడ్లంబూన్చినబండిపైనేగంజనదు॥ ౬౭॥

మూ॥ వినీతైస్తు వ్రజేన్నిత్య మాశుగై ర్లక్షణాన్వితైః। వర్ణరూ
పోపసంపన్నైః ప్రతోదేనాతుదన్భృశం॥ ౬౮॥

శిక్షితములు శీఘ్రము నడచునవి శుభలక్షణములుగలవి మంచివన్నెగలవి సురూపములుగునవియగు వృషభములను ముల్లుకోలతో బాడవకుండ నడిపించుకుని బోవలయును॥ ౬౮॥

మూ॥ బాలాతపః ప్రేతధూమో వర్జ్యంభిన్నంతథాసనం।నచ్ఛింద్యాన్నఖలోమాని దంతైర్నోత్పాటయేన్నఖాన్॥ ౬౯॥

బాలాతపమనగా లేతయెండ అది యారుగడియలపర్యంతమని మేధాతిథివ్రాసెను కన్యారాశియందుండు సూర్యునియొక్కయని కొందరుఅదిన్ని శవముకాలుచున్నపొగయును చినిగిపోయినయాసనమున్ను వర్జించవలయును గోళ్లనున్ను లోమములనున్ను త్రెంపకూడదు దంతములచే గోళ్లనుగొరకరాదు॥ ౬౯॥

మూ॥ నమృల్లోష్టంవిమృద్నీయా న్నచ్ఛింద్యాత్కరజైస్తృణం।న కర్మనిష్ఫలంకుర్యా న్నాయత్యా మసుఖోదయం॥ ౭౦॥

"సూ॥ నకారణంమృల్లోష్టం మృద్నీయాత్తృణానినచ్ఛింద్యాదితి కారణము లేకనున్ను పెంకులనుచితకగొట్టడము తృణములను ఛేదించడమును గూడదని యాపస్తంబవచనమువలన నట్లుజేయగూడదు॥ "శ్లో॥ నకుర్వీతవృథాచేష్టా"మన్నచోచెప్పబడినప్పటికిని లోష్టమర్దనతృణచ్ఛేదనములు విశేషప్రాయశ్చిత్తీయములనిమరలజెప్పబడెను అదిగావుననే యనంతరశ్లోకమందు లోష్టమర్దీత్యాదికనుచే నిందించగలడు దృష్టాదృష్టఫలశూన్యమగుకర్మను చేయగూడదు నకుర్వీతవృథాచేష్టామను దానిచే దేహచేష్టానిషేధము నిష్ఫలమగు కర్మము చేయగూడదనగా నిష్ఫలముగమనోగ్రాహ్యాదికము సంకల్పముజేయరాదు ముందుసుఖమునుభోగానైడు కర్మమనగా నజీర్ణమందు భోజనాదికమనిజేయరాదు॥ ౭౦॥

మూ॥ లోష్టమర్దీ తృణచ్ఛేదీ నఖఖాదీచయోనరః। సవినాశంవ్రజత్యాశు సూచకోశుచిరేవచ॥ ౭౧॥

లోష్టములను చిదుకగొట్టినవాడును తృణమును ఛేదించువాడును గోళ్లను గొరుకువాడును పరునిదోషములను ప్రకటించువాడును బాహ్యాభ్యంతరశౌచము లేనివాడున్ను శీఘ్రముగచేధనాదులతో నశించును॥ ౭౧

మూ॥ నవిగర్హ్యకథాంకుర్యా ద్బహిర్మాల్యం నధారయేత్। గ
వాంచయానంపృష్ఠేన సర్వథైవవిగర్హితం॥ ౭౨॥

శాస్త్రార్థములందును లౌకికార్థములందు నహంకరించి కథనము జేయరాదు కేశకలాపముకంటే బహిర్మాల్యమును ధరించరాదు అంతరణాదికముంచినప్పటికిని వృషభములపైనెక్కగూడదు "సూ॥ అథగ్వాం ఃహంస్పృష్ఠేనేతి-" వృషభములనీపులపైనెక్కుట యధర్మావహమగుటవలన బళ్ళుమొదలగు వాటికి కట్టిచేసిన యానముచే దోషములేదు॥ ౭౨॥

మూ॥ అద్వారేణచ నాతీయా ద్గ్రామంవా వేశ్మవావృతం। రా
త్రౌచ వృక్షమూలాని దూరతః పరివర్జయేత్॥ ౭౩॥

ఆవరణముగల గృహములందుగాని గ్రామములందుగాని ద్వారమార్గమును విడచి యావరణగోడదాటి ప్రవేశించగూడదు రాత్రియందు వృక్షములమూలము నుదూరముగ బరిహరించవలెను॥ ౭౩॥

మూ॥ నాక్షైఃక్రీడేత్కదాచిత్తు స్వయంనోపానహౌ హరేత్।
శయనస్థో న భుంజీత నపాణిస్థం నచాసనే॥ ౭౪॥

ఒకానొకప్పుడును పరిహాసముచేనైననక్షములచేనాడగూడదు తనపాదరక్షలను దాను చేతబట్టుకునిపోరాదు మంచముమొదలగుశయ్యలందుండియును నాసనమందుపాత్రనుంచియైనను తనయొక్కహస్తమందన్నాదికము నుంచుకొనియును భుజించరాదు॥ ౭౪॥

మూ॥ సర్వంచ తిలసంబంధం నాద్యాద స్తమితేరవౌ। నచనగ్న
శ్శయీతేహ నచోచ్ఛిష్టః క్వచిద్వ్రజేత్॥ ౭౫॥

తిలసంబంధమైన యేవస్తువునైనా సూర్యుడ స్తమించినపైనిభక్షించరాదు దిసమొలతో నిద్రించగూడదు ఉచ్ఛిష్టుడై యెచ్చటికైనంబోవలదు॥ ౭౫॥

మూ॥ ఆర్ద్రపాదస్తు భుంజీత నార్ద్రపాదస్తు సంవిశేత్। ఆర్ద్ర
పాదస్తుభుంజానో దీర్ఘమాయు రవాప్నుయాత్॥ ౭౬॥

కాళ్లుకడుగుకొనిశుద్ధుడై భుజించినశతవర్షములు జీవించును గానన ట్లు జేయ

తలయును తడికాళ్ళతో బరుండగూడదు॥ ౭౬॥

మూ॥ అచక్షుర్విషయం దుర్గం నప్రపద్యేత కర్హిచిత్। నవిణ్మూ
త్రముదీక్షేత నబాహుభ్యాం నదీంతరేత్॥ ౭౭॥

తరుగుల్మాదులచే కానరానియవకాశముగల దుర్గమారణ్యాదికములో సర్ప
చోరాదులుందురేమోయని ప్రవేశించరాదు మూత్రపురీషములను జూడగూడదు
బాహువులచే నదినీదగూడదు॥ ౭౭॥

మూ॥ అధితిష్ఠేన్న కేశాంస్తు నభస్మాస్థి కపాలికాః। నకార్పా
సాస్థి నతుషాం దీర్ఘమాయు ర్జిజీవిషుః॥ ౭౮॥

చిరకాలము బ్రతుకగోరువాడు కేశములను భస్మము కుండ పెంకులనున్ను
కార్పాసాస్థులనగా తద్బీజములనున్ను ఊకనున్ను ముట్టగూడదు॥ ౭౮॥

మూ॥ నసంవిశేచ్చ పతితైర్న చాండాలైర్న పుల్కసైః। నమూ
ర్ఖైర్నావలిప్తైశ్చ నాంత్యైర్నాంత్యావసాయిభిః॥

గ్రామాంతరవాసులైనను పతితులతో గూడనేక తరుచ్ఛాయాదులందు నుండగ్గ
ర వసించగూడదు గావుననే "నాధార్మికే వసేద్గ్రామఇతి॥" యను దానితో భే
దము చాండాలునితోనున్ను పుల్కసునితోనున్ను అంత్యులనగా రజకులతోనున్ను
అంత్యావసాయులతోనున్ను గూడ నివసించగూడదు నిషాదునివలన శూద్రస్త్రీ
యందు బుట్టినవాడు పుల్కసుడు చాండాలునివలన నిషాదస్త్రీయందు బుట్టినవాడం
త్యావసాయి॥ ౭౯॥

మూ॥ నకృతఘ్నైర్నసుహృత్కైర్న మహాపాతకాన్వితైః। పదస్య
థి నాస్తి చిధి నామిత్రైశ్చ కదాచన॥ ౮౦॥

కృతఘ్నులనగా ఉపకారమును మరచినవారు నిరుద్యోగులు మహాపాతకులు
దొంగలు అనుచుబు శత్రువులును వీరితో గూడవసించగూడదు దీనికెవ్వరును వ్యా
ఖ్యానము చేయలేదు॥ ౮౦॥

మూ॥ నశూద్రాయ మతిందద్యాన్నోచ్ఛిష్టం నహవిష్కృతం। న
చాస్యోపదిశేద్ధర్మం నచాస్య వ్రతమాదిశేత॥ ౮౦॥

శూద్రునకునుచ్ఛిష్టమిడరాదనగా ధర్మోపదేశము చేయగూడదని వేరే చెప్పుట వలన నదృష్టార్థోపదేశమని తెలియవలయును దాసుడుగాని శూద్రున కుచ్ఛిష్టము బెట్టగూడదు దాసునకుచ్ఛిష్టము బెట్టవలెనని వక్ష్యమాణము వలన ఉచ్ఛిష్టము బెట్టుటచే దాతకు దోషమైనను యథాసంభవలబ్ధవిషయమనగా ననుచ్ఛిష్టమనగా నుచ్ఛిష్టమిడగూడదని యనుటవలన హోమావశేషమునకు గానున్న హవిస్సునిడరాదు- ధర్మోపదేశము జేయగూడదు॥ "శ్లో॥ తథాశూద్రం సమాసాద్య సదా ధర్మపురస్సరమ్ । అంతరాబ్రాహ్మణం కృత్వా ప్రాయశ్చిత్తం సమాదిశే" దనునాంగిరసవచనము వలన బ్రాహ్మణుని మధ్యనుంచుకుని ప్రాయశ్చిత్తమును జెప్పవలెను గాని శూద్రునకు ప్రత్యక్షముగ ప్రాయశ్చిత్తముపదేశించగూడదు ప్రాయశ్చిత్తపదము స్వధర్మోపలక్షణము: ఉచ్ఛిష్టమనగా భోజనావశిష్టముభుజించినపాత్రినములోనున్నదిన్ని శ్మశ్రుముఖమందేయుండుటవలననవియుచ్ఛిష్టములుగావుమూత్రపురీషాద్యుత్సర్జనానంతరమున నాచమించనివాడుచ్ఛిష్టుడు ఉచ్ఛిష్టపదమునకర్థము మేధాతిథివారిసెను సంవృతనామకమైన తమోగహనమగు నరకమునబడును॥ పూర్వోక్తములగు నైదింటను రెంటినిమాత్రమే జెప్పడము ప్రాయశ్చిత్తగౌరవార్థము॥ ౮౦॥

మూ॥ నసంహతాభ్యాం పాణిభ్యాం కండూయేదాత్మనశ్శిరః।
నస్పృశేచ్చైతదుచ్ఛిష్టో నచాస్నాయాద్వినాతతః॥ ౮౨॥

రెండు హస్తములు కలిపి తలగోకగూడదు: ఉచ్ఛిష్టుడై శిరస్సును ముట్టగూడదు, శిరస్సును తడపకుండ రోగాదిపీడలేనప్పుడు నిత్యనైమిత్తికస్నానములను జేయగూడదు॥ "శ్లో॥ అశిరస్కంభవేత్స్నానం స్నానాశక్తౌతు కర్మణా" యను జాబాలివచనము వలన నశక్తుడుగానివానికీ నిషేధము॥ ౮౨॥

మూ॥ కేశగ్రహాన్ప్రహారాంశ్చ శిరస్యేతాన్ వివర్జయేత్ । శిర
స్స్నాతశ్చ తైలేన నాంగం కించిదపి స్పృశేత్॥ ౮౩॥

కోపముచే కేశగ్రహణమున్ను తలపైని ప్రహారములున్ను గూడదు కోపముచే గావున తనశిరస్సుపైనిన్ని మొత్తుకొనరాదు తైలముచే శిరస్స్నానము జేయునాచమురునించుకనైన నొడలరాయరాదు॥ ౮౩॥

మూ॥ నరాజ్ఞః ప్రతిగృహ్ణీయాదరాజన్యప్రసూతితః । సూనా

చక్రధ్వజవతాం వేశ్యైనైవచ జీవతామ్॥ ౮౪॥

ఇచ్చట రాజన్యశబ్దము క్షత్రియజాతిపరము క్షత్రియజాతియందు బుట్టని రాజు ధనమున్ను సూనావానగా జంతువులను జంపి యామాంసము నమ్ముకొనెడు వాడనగా కటికవాడు చక్రివాడనగా తెలుకులవాడు ధ్వజవాననగా కల్లునమ్ముకొనెడువాడు వేశవాననగా సానిలను పురుషులకు సందర్భము చేసి యాపడుపు ధనముచే జీవించువాడు వీళ్లధనమున్ను ప్రతిగ్రహించదగదు॥ ౮౪॥

మూ॥ దశసూనా సమంచక్రం దశచక్రసమోధ్వజః । దశధ్వజసమోవేశః దశవేశ సమోనృపః॥ ౮౫॥

పదిమంది కటికవాళ్ల దోషమొక తెలుకులవానియందును పదితెలుకులవాళ్లదోషమొకచాండెవానియందును పదిమంది చాండెవాళ్లదోష మొకకుంటెనగానియందును పదిమంది కుంటెనగాళ్లదోష మొకరాజుయందును గలుగును గావున పూర్వపూర్వులధనము కంటె నుత్తరోత్తరుల ధనమందు దోషమెక్కువగాన పూర్వసంభవమందు నుత్తరము విడువుమని యీశ్లోకము గోవిందరాజు "దశవేశ్యాసమోనృపః" యనిపఠించెను బ్రాచీనులందరును "దశవేశసమో" యనేపఠించిరి॥ ౮౫॥

మూ॥ దశసూనా సహస్రాణి యోవాహయతిసౌనికః । తేనతుల్యస్స్మృతోరాజా ఘోరస్తస్యప్రతిగ్రహః॥ ౮౬॥

సూనాయనగా జంతువధస్థానము దానిచే జీవించువాడు సౌనికుడు పదివేల జంతువధస్థానములను నడిపించెడు కటికవానితో రాజు తుల్యుడని మన్వాదులచే జెప్పబడెనుగాన రాజప్రతిగ్రహము నరకహేతువు గావున ఘోరమగుచున్నది క్షత్రియునియొక్క యున్నునని కుల్లూకభట్టువ్రాసెను॥ ౮౬॥

మూ॥ యోరాజ్ఞః ప్రతిగృహ్ణాతి లుబ్ధస్యోచ్ఛాస్త్రవర్తినః। సపర్యాయేణ యాతీమాన్నరకానేకవింశతిమ్॥ ౮౭॥

లుబ్ధుడున్ను శాస్త్రము నతిక్రమించి స్వేచ్ఛగా నడిచెడివాడున్ను నగు రాజుయొక్క ధనమునే బ్రాహ్మణుడు ప్రతిగ్రహించు నతడు పర్యాయముచే నీవక్ష్యమాణములగు నిరువదియొక నరకములం బడును॥ ౮౭॥

మూ॥ తామిస్రమంధతామిస్రం మహారౌరవరౌరవౌ। నరకం
కాలసూత్రంచ మహానరకమేవచ॥ ౮౮॥

పూర్వశ్లోకమందీ నరకములనొందునని సామాన్యముగఁ జెప్పి నిప్పుడా నరకము ల నామములను నిర్దేశించె నీనరకములయొక్క స్వరూపము మార్కండేయాదిపు రాణములలో విస్తరించబడియుండె నవియందు దెలియందగును॥ ౮౮॥

మూ॥ సంజీవనం మహావీచిం తపనం సంప్రతాపనం। సంఘాతం
చ సకాకోలం కుడ్మలం పూతిమృత్తికం॥ ౮౯॥

మూ॥ లోహశంకు మృజీషంచ పంథానం శాల్మలీంనదీం। అసిపత్ర
వనంచైవ లోహదారక మేవచ॥ ౯౦॥

మూ॥ ఏతద్విదంతో విద్వాంసో బ్రాహ్మణా బ్రహ్మవాదినః। న
రాజ్ఞః ప్రతిగృహ్ణంతి ప్రేత్య శ్రేయోభికాంక్షిణః॥ ౯౧॥

ప్రతిగ్రహము నానావిధ నరకప్రాప్తికి కారణమని తెలిసిన బ్రాహ్మణులు ధర్మ శాస్త్రపురాణాదుల నెరిఁగి వేదాధ్యయనపరులును జన్మాంతరమందు శ్రేయస్సును గోరెడువారై రాజువలన బ్రతిగ్రహించరు॥ శ్లో॥ "తస్మాదవిద్వాన్ బిభీయా"దని వ చనమువలన విద్వాంసునకధిక దోషము లేదైనను నిషేధింతురు రాజప్రతిగ్రహ ముతరుచుగాన ప్రత్యవాయజనకమని "విద్వాంసః" యనిన్ని బ్రహ్మవాదినః యనిన్ని చె ప్పబడెను॥ ౯౧॥

మూ॥ బ్రాహ్మే ముహూర్తే బుధ్యేత ధర్మార్థౌ చానుచింతయేత్।
కాయక్లేశాంశ్చ తన్మూలాన్ వేదతత్త్వార్థ మేవచ॥ ౯౨॥

బ్రహ్మముహూర్తమనఁగా రాత్రియొక్క నాలవజాము బ్రహ్మయనఁగా భార తి తత్ప్రబోధ హేతువగు కాలము బ్రాహ్మముహూర్తము యిచ్చట ముహూర్త శబ్దము కాలమాత్రవాచకమా కాలమందు లేవవలెను॥ శ్లో॥ "ప్రదోషపశ్చిమాయా మౌ వేదాభ్యాసేన తౌ నయేత్। ప్రహరద్వయం శయానోహి బ్రహ్మభూయాయ కల్పతే" యని దక్షస్మృతివలన ప్రబోధవిషయము పరిష్కృతమాయెను గోవిందరా జు రాత్రియొక్క చరమముహూర్తమందు లేవవలసినదనివ్రాసెను అప్పుడు ధర్మా ర్థములనఁగా ధర్మార్జనములకున్ను ధనసంపాదన ప్రయోజనములకున్ను పరస్పర

విరోధము లేకుండ నాలోచించవలయును ధర్మార్థములను సంపాదించుటకగు కా
యక్లేశములను విచారించవలెననగా కాయక్లేశమధికమున్ను ధర్మార్థసంపా
దనమల్పమునైనచో నవివిడువవలయును అప్పుడు బుద్ధి నిర్మలముగనుండును గావు
న వేదముయొక్క తత్వార్థమనగా బ్రహ్మరూపకర్మరూపమగు దానిని నిశ్చయిం
చవలెను॥ ౯౨॥

మూ॥ ఉత్థాయావశ్యకం కృత్వా కృతశౌచ స్సమాహితః । పూ
ర్వాం సంధ్యాంజపం స్తిష్ఠే త్స్వకాలే చాపరాంచిరం॥౯౩॥

అట్లుపై నుషఃకాలమందు లేచి వేగనుండె నేని వక్ష్యమాణప్రకారముగ శౌచా
చారమునడపి ప్రాతస్సంధ్యావందనమాచరించి సూర్యోదయమైనపైని గాయత్రీ
జపమాలస్యముగా నిలువబడి జేయవలయును॥సూ॥"ప్రాతస్సంధ్యాయాముక్తఉద
యాదూర్ధ్వమపి ఆయురాదికామఇతి" యని యుండుటచే నిట్లువ్రాయబడెను సా
యంసంధ్యయందుక్తకాలమందుపక్రమించి తారకోదయపర్యంతమును గూర్చుండి
గాయత్రీజపమొనర్చవలెను॥ ౯౩॥

మూ॥ ఋషయోదీర్ఘ సంధ్యత్వా ద్దీర్ఘమాయురవాప్నుయుః।
ప్రజాంయశశ్చ కీర్తించ బ్రహ్మవర్చసమేవచ॥ ౯౪॥

ఆయురాదికాములచే నధికారులగువారికిదియని చెప్పుచున్నాడు ఇచ్చట సం
ధ్యాశబ్దమాకాలమందు జేయు కర్మపరము ఋషులు చిరముగా సంధ్యాదిక్రియలు
జేయుటవలన దీర్ఘాయుష్యమునున్ను సంతానమునున్ను యశస్సునున్ను చనిపో
యినపిమ్మటనగు ఖ్యాతికీర్తియనబడును దానినిన్ని బ్రహ్మవర్చస్సనగా నధ్యయనాది
సంపత్తియుక్తమగు ప్రతిష్ఠనున్ను బొందుదురుగావున నాయురాదికాములుసంధ్యా
దికమును జిరముగ జేయవలయును॥ ౯౪॥

మూ॥ శ్రావణ్యాంప్రోష్ఠ పద్యాంవా ప్యుపాకృత్య యథావిధి।
యుక్తశ్ఛందాంస్యధీయీతమాసాన్విప్రోర్ధపంచమాన్॥౯౫॥

శ్రావణమందునైన భాద్రపదమందునయిన పౌర్ణమాసినాడు పాకర్మమునొనర
ర్చి యుక్తుడై బ్రాహ్మణుడు నాలుగునెలలు పదేనుదినములు వేదమును జదువవల
యును॥ ౯౫

మూ॥ పుష్యేతు ఛందసాం కుర్యా ద్బహిరుత్సర్జనం ద్విజః। మా
ఘశుక్లస్యవా ప్రాప్తే పూర్వాహ్ణే ప్రథమేహని॥ ౯౬॥

పుష్యమందైన మాఘమందైన నాలుగుమాసములునరగావడముతోనే ప్రథమ దివసమందు పూర్వాహ్ణమున స్వగృహ్యోక్త ప్రకారముగ గ్రామమునకు బహిస్థ్సలమందుత్సర్గమను కర్మమును జేయవలయును॥ ౯౬॥

మూ॥ యథాశాస్త్రంతు కృత్వైవ ముత్సర్గం ఛందసాంబహిః।
విరమే త్పక్షిణీంరాత్రిం తదేవైక మహర్నిశం॥ ౯౭॥

ఈచెప్పిన శాస్త్రానుసారముగ గ్రామమునకు బహిఃప్రదేశమున ఛందస్సుల యొక్క యుత్సర్గాఖ్యమగు కర్మమును జేసి రెండుపవళ్లునొకరాత్రియుగల కాలమందు విరమించి యధ్యయనము జేయకుండవలయును దీనిచే నుత్సర్గదినమందు నారాత్రియందును మరునాటి పగటియందు నధ్యయనము జేయదగదు రెండవరాత్రియందైతె చదువవచ్చును యీలాగుగాకున్న నుత్సర్గముజేసిన దినరాత్రుల యందుమాత్ర మనధ్యాయము జేయవలయును విద్యయందు నిపుణతనుగోరువానికీ యహోరాత్రానధ్యాయవిధి॥ ౯౭

మూ॥ అతఊర్ధ్వంతు ఛందాంసి శుక్లేషు నియతఃపఠేత్। వేదాం
గానిచ సర్వాణి కృష్ణపక్షేషు సంపఠేత్॥ ౯౮॥

ఉత్సర్గానధ్యయనానంతరమందు మంత్రబ్రాహ్మణాత్మకమగు వేదమును శుక్లపక్షములందునియతుడై పఠించవలయును కృష్ణపక్షములందు వేదాంగములను బఠించవలయును॥ ౯౮॥

మూ॥ నావిస్పష్టమధీయీత నశూద్రజనసన్నిధౌ। ననిశాంతేపరి
శ్రాంతో బ్రహ్మాధీత్య పునస్స్వపేత్॥ ౯౯॥

స్వరవర్ణాదులచే స్పష్టతలేకున్నట్లుగానున్ను శూద్రసన్నిధియందు నధ్యయనముజేయరాదు రాత్రిచరమయామమందు లేచి యధ్యయనమొనర్చి శ్రాంతుడై మరలనిద్రించగూడదు॥ ౯౯॥

మూ॥ యథోదితేన విధినా నిత్యంఛందస్కృతంపఠేత్। బ్రహ్మ

చ్ఛందస్కృతం చైవ ద్విజో యుక్తో హ్యనాపది॥ ౧౦౦॥

ఉక్తప్రకారవిధిచే నిత్యము ఛందస్కృతమనగా గాయత్ర్యాదిఛందోయుక్తమగు మంత్రమాత్రమును బఠింపవలయును మంత్రములుకమాత్రాంతరంగము లేక వలన నాపదలేనప్పుడు బ్రాహ్మణమును మంత్రజాతమునున్ను యుక్తవిధిచే సమాహితుఁడగుచు ద్విజుఁడుబఠింపవలయును॥ ౧౦౦॥

మూ॥ ఇమాన్నిత్య మనధ్యాయా నధీయానో వివర్జయేత్। అ
ధ్యాపనంచ కుర్వాణ శ్శిష్యాణాం విధిపూర్వకం॥ ౧౦౧॥

ఈజెప్పఁగల యనధ్యాయములను యుక్తవిధిచే నధ్యయనాధ్యాపనముల నొనరుచు బ్రాహ్మణుఁడు దానధ్యయనను జేయరాదు శిష్యులకధ్యాపనమునుగూడదు॥ ౧౦౧॥

మూ॥ కర్ణశ్రవేఽనిలే రాత్రౌ దివా పాంసుసమూహనే। ఏతౌ వ
ర్షాస్వనధ్యాయా వధ్యాయజ్ఞాః ప్రచక్షతే॥ ౧౦౨॥

రాత్రియందుకర్ణములకు వినబడుమాత్రముగుధ్వనిగావాయువు ప్రసరించుచుండె నేనియు నిచ్చటగోవిందరాజు కర్ణములేనివి గావున నిట్లు జెప్పడముచే నధికవాయువులేచుచుండగననిర్వాసేను పగలుపరాగమెగసె నేనియు నీరెండును వర్షకాలములందనధ్యాయములని యధ్యాయజ్ఞులుచెప్పుచున్నారు॥ ౧౦౨॥

మూ॥ విద్యుత్ స్తనితవర్షేషు మహోల్కానాంచ సంప్లవే। ఆ
కాలికమనధ్యాయ మేతేషు మనురబ్రవీత్॥ ౧౦౩॥

మెరుపు నురుము వర్షము నీమూఁడునొకటిమారుగలిగె నేనియు నులాపాతములు బడుచుండెనేనియు ననధ్యాయమని మనువుజెప్పెను॥ ౧౦౩

మూ॥ ఏతాంస్త్వభ్యుదితాన్ విద్యాద్యదా ప్రాదుష్కృతాగ్నిషు।
తదా విద్యా దనధ్యాయ మనృతౌచాభ్రదర్శనే॥ ౧౦౪॥

ఈచెప్పబడినవిద్యుదాదులు హోమార్థమై యప్పుడగ్నులను బ్రజ్వలింపజేతురో ఆ సంధ్యాకాలమందొకటిమారు బాదుర్భవించెనేనివర్షకాలమందనధ్యాయమగును అట్టిసంధ్యాకాలమునకంగువర్షర్తువ్యతిరిక్తసమయములందు మేఘమాత్రదర్శనముచేతననధ్యాయమగును వర్షర్తువం దంతమాత్రముచే ననధ్యాయముగాదు॥

మూ॥ నిర్ఘాతే భూమిచలనే జ్యోతిషాం చోపసర్జనే । ఏతా
నాకాలికాన్విద్యా దనధ్యాయా నృతావపి॥ ౧౦౪॥

అంతరిక్షభవోత్పాతధ్వని పుట్టినప్పుడును భూకంపము సూర్య చంద్రతారాగ
ణములకుపసర్గమయినప్పుడును ననధ్యాయమగును ఇవివర్షకాలమందునున్ను నం.
నియమితశబ్దమువలన తద్వ్యతిరిక్తకాలమందునున్ననియుతర్థము॥ ౧౦౪॥

మూ॥ ప్రాదుష్కృతేష్వగ్నిషుతు విద్యుత్స్తనితనిస్వనే। సజ్యో
తిస్స్యాదనధ్యాయ శ్శేషేరాత్రౌ యథాదివా॥ ౧౦౫॥

హోమార్థమగ్నులను ప్రజ్వలింపించుచుండగా సంధ్యయందు విద్యుద్గర్జిత శ
బ్దములుమాత్రము వర్షములేకున్నను జూపట్టిననాసంధ్యాకాలమున ననధ్యాయ
మగును “నాకాలికః” యనగా నకాలమందగునది ప్రాతస్సంధ్యాకాలమందవిరెం
దుననగా విద్యుద్గర్జితములు రాత్రియందు విద్యుత్స్తనితవర్షములు మూడున్ను
నయిన వర్షమునుగూడనని యేలాగు పగలనధ్యాయమో రాత్రియందుననహా
రాత్రమనధ్యాయమగును॥ ౧౦౫॥

మూ॥ నిత్యానధ్యాయఏవస్యా ద్గ్రామేషునగరేషుచ । ధర్మనైపు
ణ్యకామానాం పూతిగంధేచసర్వదా॥ ౧౦౬॥

గ్రామములందును పట్టణములందును దుర్గంధమనుభూతమగుచుండిన నిత్య
నిత్యానధ్యాయము నైపుణ్యవిషయమిది ధర్మార్థికి ధర్మనైపుణ్యకాములు విద్యా
నైపుణ్యకాములు ననరెండు తెరగులవారికిని యందులోనధ్యయనము ననుసరించి
కొందరుజ్ఞానాతిశయము విషయమైచదివినవేదమువలన బుట్టువుగల యదృష్టరూప
మగుధర్మమునిచ్ఛయించెదు శిష్యులుకొందరు వీరలుధర్మనైపుణ్యకాములు కొం
దరుశిష్యులు మాతనముగ నధ్యయనము జేయుదురు విద్యాతిశయమాత్రార్థులువి
ద్యానైపుణ్యకాములు॥ ౧౦౬॥

మూ॥ అంతర్గతశవే గ్రామే వృషలస్యచ సన్నిధౌ । అనధ్యా
యోరుద్యమానే సమవాయే జనస్యచ॥ ౧౦౭॥

గ్రామమందుశవమున్నప్పుడు తెలిసినను వృషలుడనగా నిచ్చటనధార్మికుడు “న
శూద్రసన్నిధౌ” యని చెప్పబడెనుగాన నధార్మికునిసన్నిధిని రోదనము వినబ

డు దున్నంటినను బహుజుజం మొకచోటికి నెదసికొరంటను చేసిన్తెననన ధ్యాయమగును॥

మూ॥ ఉదకే మధ్యరాత్రేచ విణ్మూత్రస్య విసర్జనే । ఉచ్ఛిష్ట
శ్శ్రాద్ధభుక్చైవ మనసాపి నచింతయేత్॥ ౧౦౯॥

జలమందున్ను రాత్రియొక్క మధ్య నాలుగుముహూర్తములకాలమందున్ను "సూ॥ నిశాయాంచచతుర్ముహూర్తం" మని గౌతమవచనమువలననిచటగోవిందరాజు రాత్రియొక్క మధ్యయామములు రెండుననివ్రాసెను మూత్రపురీషోత్సర్గమందును భోజనాద్యనంతరమందాచమనాదులచే శుద్ధుడుగాని వాడుచ్ఛిష్టుడట్టివాడును శ్రాద్ధమందు నియమించబడినది మొదలొకయహోరాత్రమును మనసులోనైన వేదమునుచింతించగూడదు॥ ౧౦౯॥

మూ॥ ప్రతిగృహ్యద్విజోవిద్వా నేకోద్దిష్టస్యకేతనం। త్ర్యహంనకీ
ర్తయేద్బ్రహ్మ రాజ్ఞోరాహోశ్చసూతకే॥ ౧౧౦॥

ప్రేతశ్రాద్ధమందునిమంత్రణమునుబొందిన్ని దేశాధిపతికిపురుడుమొదలగునవి వచ్చినప్పుడున్ను సూర్యచంద్రగ్రహణములందున్ను మూడుదినములనధ్యాయము॥ ౧౧౦॥

మూ॥ యావదేకానుదిష్టస్య గంధోలేపశ్చతిష్ఠతి। విప్రస్యవిదుషో
దేహే తావద్బ్రహ్మ నకీర్తయేత్॥ ౧౧౧॥

విద్వాంసుడగునే బ్రాహ్మణుడు తనదేహమందలి శరీరోచ్ఛిష్టమైయుంటిన కుంకుమచందనాదిగంధలేపములుండిపన్నివాళ్ళు ననధ్యాయముగావున నధ్యయనముచేయరాదు॥ ౧౧౧॥

మూ॥ శయానఃప్రౌఢపాదశ్చ కృత్వాచైవావసక్థికాం। నాధీయా
తామిషంజగ్ధ్వా సూతకాన్నాద్యమేవచ॥ ౧౧౨॥

శయ్యయందు బరుండియు పాదములు పీఠమందుంచియు తొడమీదపాదముంచుకొనియు మాంసమునున్ను జననమరణాశౌచవంతులయన్నమునున్ను దినియు వేదము జదువరాదు॥ ౧౧౨॥

మూ॥ నీహారేబాణశబ్దేచ సంధ్యయోరేవచోభయోః । అమావా
స్యాచతుర్దశ్యోః పౌర్ణమాస్యష్టకాసుచ॥ ౧౧౩॥

ను కీమంచు గప్పినప్పుడును బాణములనెగయు చప్పుడయినప్పుడును రెండుసంధ్యలందును అమావాస్యాచతుర్దశీపౌర్ణమాస్యష్టములందును వేదమును జదువరాదు॥ అష్టకములు వేరుగ జెప్పబడుటవలన నష్టకాశబ్దమిచ్చట నష్టములనుకోవచ్చును॥ ౧౧౩॥

మూ॥ అమావాస్యాగురుంహంతి శిష్యంహంతిచతుర్దశీ। బ్రహ్మాష్టకాపౌర్ణమాస్యౌ తస్మాత్తాఃపరివర్జయేత్॥ ౧౧౪॥

అమావాస్యగురువ్రునున్ను చతుర్దశిశిష్యునిన్ని జంపును అష్టమీపౌర్ణమాసలు వేదమునువిస్మృతినొందించును గాన నాదినములందధ్యయనము జేయించరాదు॥

మూ॥ పాంసువర్షేదిశాందాహే గోమాయువిరుతేతథా। శ్వఖరోష్ట్రే చరుదతి పఙ్క్తౌచనపఠేద్ద్విజః॥ ౧౧౫॥

పరాగముకమ్మినప్పుడును దిక్కులయందు మంటలగపడినప్పుడును నక్కలు కుక్కలు గాడిదెలు నరుచుచున్నప్పుడును వీటిపజ్క్తిలోనుండియును ద్విజుడు వేదమును జదువరాదు॥ ౧౧౫॥

మూ॥ నాధీయీత శ్మశానాంతే గ్రామాంతే గోవ్రజేపివా। వసిత్వా మైథునంవాస శ్శ్రాద్ధికం ప్రతిగృహ్యచ॥ ౧౧౬॥

శ్మశానప్రాంతమునందును గ్రామసమీపమునందును మైథునసమయధృతవస్త్రమును ధరించియు శ్రాద్ధమగునన్నమును బ్రతిగ్రహించియు నధ్యయనము జేయరాదు॥ ౧౧౬॥

మూ॥ ప్రాణివా యదివాఽప్రాణి యత్కించిచ్ఛ్రాద్ధికంభవేత్। తదాలభ్యా ప్యనధ్యాయః పాణ్యాస్యోహి ద్విజస్స్మృతః॥౧౧౭॥

శ్రాద్ధికమగు నన్నాదికమును దినిన ననధ్యాయమని జెప్పబడెను మరిన్ని గవాశ్వాదులు ప్రాణులు వస్త్రమాల్యాదులప్రాణులు వీటిలో శ్రాద్ధాంగములవేటిని దానముబట్టినను బ్రాహ్మణుడు పాణియె ముఖముగాగలవాడు గావున నతండద్దినమంత దధ్యయనము జేయరాదు॥ ౧౧౭॥

మూ॥ చోరైరుపప్లుతే గ్రామే సంభ్రమేచాగ్నికారితే। అకాలిక

మనధ్యాయం విద్యాత్సర్వా ద్భుతేషుచ॥ ౧౧౮॥

చోరులచే నూరుద్రోచబడినను అగ్నిచే గాల్చబడినను దివ్యాంతరిక్షభౌమములగు నుపద్రవసూచకములగు నద్భుతములు గనపడినననధ్యాయమకాలికమగును॥ ౧౧౮॥

మూ॥ ఉపాకర్మణి చోత్సర్గే త్రిరాత్రం క్షేపణంస్మృతం। అష్ట
కాసు త్వహోరాత్ర మృత్వంతాసురాత్రిషు॥ ౧౧౯॥

ఉపాకర్మోత్సర్గములందు మూడహోరాత్రము లధ్యయనముగూడదు ఉత్సర్గమందు పక్షిణ్యహోరాత్రములు చెప్పబడెను ఇచ్చట ధర్మనైపుణ్య కాముని కై యీత్రిరాత్రోపదేశము మఱియు మార్గశీర్ష కృష్ణాష్టమిమొదలు నాలుగహోరాత్రములు పుష్యకృష్ణ మాఘకృష్ణాష్టములు మొదలుకొని నాలుగేసిదినము లష్టకలివియును ఋత్వంతరాత్రులు ననధ్యాయమగును"పౌర్ణమాస్యష్టకాసుచ" యని చెప్పినచో నష్టమ్యష్టములకురాగా నవిశేషవిధిచే నితరాష్టములున్నవిగావున పునరుక్తిలేదు॥ ౧౧౯॥

మూ॥ నాధీయీతాశ్వమారూఢో నవృక్షంనచ హస్తినం। ననా
వంనఖరం నోష్ట్రం నేరిణస్థో నయానగః॥ ౧౨౦॥

గర్దభమును వృక్షమును గజమును నావమును గాడిదెనుష్ట్రమునునధిష్ఠించియుఊషరక్షేత్రమందుండియు శకటాదియానగుడయ్యును నధ్యయనముజేయరాదు॥

మూ॥ నవివాదే నకలహే నసేనాయాం నసంగరే। నభుక్తమా
మాత్రే నాజీర్ణే నవమిత్వా నసూతకే॥ ౧౨౧॥

వాక్కలహమందున్ను దెబ్బలాటయందున్ను యుద్ధములేనప్పుడైనను సేనయందును యుద్ధమందును భుజించిచెయ్యిగడ్గియారకమునుందున్ను॥సూ॥"యావదార్ద్రపాణిరితి"యని వసిష్ఠస్మృతివలన యజీర్ణమందున్ను వమనముజేసుకొనిన్ని భల్లని తేపులు వచ్చుచుండినను వేదముజదువరాదు॥ ౧౨౧॥

మూ॥ అతిథించా ననుజ్ఞాప్య మారుతేవాతివా భృశం। రుధిరేచ
స్రుతేగాత్రా చ్ఛస్త్రేణచ పరిక్షతే॥ ౧౨౨॥

అధ్యయనమొనర్చెదనని యతిథి యనుజ్ఞాపితుడు కాడో యంతలోగానున్న

అధికముగ వాయువు విసరుచున్నను దేహమువలన రక్తము స్రవించినను రక్తస్రావము లేకున్నను శస్త్రక్షతము గలిగినప్పుడు ననధ్యాయము॥ ౧౨౨॥

మూ॥ సామధ్వనా వృగ్యజుషీ నాధీయీత కదాచన। వేదస్యాధీ
త్యవాప్యంత మారణ్యక మధీత్య చ॥ ౧౨౩॥

సామవేదధ్వని వినిపించేనేని మరి ఋగ్యజుర్వేదముల నధ్యయనము జేయరాదు వేదము కొనగ్రంథమయిన నాడును ఆరణ్యకశాఖను జదివిన పిమ్మట నితరశాఖలను జదువరాదు। ౧౨౩॥

మూ॥ ఋగ్వేదో దేవదైవత్యో యజుర్వేదస్తు మానుషః। సామవే
దస్స్మృతః పిత్ర్యస్తస్మాత్తస్యాశుచిర్ధ్వనిః॥ ౧౨౪॥

సామవేదధ్వని గలుగుచుండ ఋగ్వేదయజుర్వేదములు జదువరాదను దానికి దీనినువాదము ఋగ్వేదము దేవుడు దేవతగాగలది యజుర్వేదము మనుష్యదేవతా కను తరుచుగా మానుషకర్మను నుపదేశించెడిదిగాన నట్లైనను సామవేదము పితృదేవతాకముగాన పిత్ర్యము పితృకర్మ మొనర్చిన జలోపస్పర్శనము జేయుటకు స్మృతి జెప్పుచున్నది గావున నా సామధ్వని యశుచి వంటిదిగాని యశుచేగాదు గావున నది వినబడిన ఋగ్యజుస్సుల నధ్యయనము జేయరాదు॥ ౧౨౪॥

మూ॥ ఏతద్విదంతో విద్వాంసస్త్రయీనిష్కర్ష మన్వహమ్।
క్రమతః పూర్వమభ్యస్య పశ్చాద్వేద మధీయతే॥ ౧౨౫॥

ఈప్రకారముగా వేదత్రయము దేవమానుషపితృదేవతాకమని తెలసిన శాస్త్రజ్ఞులు త్రయీనిష్కర్షమనగా సద్సృతమగు సారము వ్యాహృతిసావిత్ర్యాత్మకము ప్రణవవ్యాహృతిసావిత్రులను ముందుగా క్రమముగా నధ్యయన మొనర్చి పిమ్మట వేదాధ్యయన మొనర్తురు- ఇది ద్వితీయాధ్యాయోక్తమైన ననధ్యాయప్రకరణమందు జెప్పబడెను॥ ౧౨౫॥

మూ॥ పశు మండూక మార్జార శ్వ సర్ప నకులాఖుభిః। అంత
రాగమనే విద్యా దనధ్యాయ మహర్నిశమ్॥ ౧౨౬॥

గురుశిష్యులమధ్యనుంచి గోవులు మొదలగు పశువులును కప్ప పిల్లి కుక్క

పాము ముంగిస యివి నడచి పోయెనేని యొకయహోరాత్ర మనధ్యాయము॥

మూ॥ ద్వావేతౌ వర్జయే న్నిత్య మనధ్యాయౌ ప్రయత్నతః ।
స్వాధ్యాయ భూమించాశుద్ధా మాత్మానం చాశుచింద్విజః॥

ఇప్పుడు విద్యార్థైపుణ్య కాముని గూర్చి పూర్వోక్తానధ్యాయవికల్పము కొరకు చెప్పుచున్నాడు-స్వాధ్యాయము చెప్పెడి ప్రదేశముచ్ఛిష్టమేధ్యాదులతో నశుచిగానుండినను దానశుచిగా నుండినను నివిరెండు ననధ్యాయములుగాన బ్రియత్నముచే నారెంటిని విడువవలయును॥ ౧౨౭॥

మూ॥ అమావాస్యా మష్టమీంచ పౌర్ణమాసీం చతుర్దశీమ్।బ్ర
హ్మచారీ భవే న్నిత్య మప్యృతౌ స్నాతకో ద్విజః॥ ౧౨౮॥

అమావాస్య అష్టమీ ఋతువునందైనను పౌర్ణమాసి చతుర్దశియీనాలుగు తిథులయందును స్నాతకుడగు ద్విజుడు స్త్రీని బొందగూడదు బ్రహ్మచారియే గావలెను॥"శ్లో॥ పర్వవర్జం వ్రజేచ్చైనా"మని చెప్పబడి నప్పటికిని స్నాతకవ్రతలోపప్రాయశ్చిత్తార్థ మచ్చట జెప్పబడెను॥ ౧౨౮॥

మూ॥ నస్నాన మాచరే ద్భుక్త్వానాతురో నమహానిశి। నవాసో
భిస్సహాజస్రం నావిజ్ఞాతే జలాశయే॥ ౧౨౯॥

భోజనమొనర్చి స్నానము జేయరాదు చండాలాదిస్పర్శము లేనప్పుడీనిషేధము॥"సూ॥ ముహూర్తాలర్మపిశక్తివిషయే నాప్రియతస్స్యాత్।"అని ఆపస్తంబవచనము వలన నట్టివిలేనిచో నైచ్ఛికస్నాన విషయమీనిషేధమని తెలియవలయురోగియయ్యేనేని నైమిత్తికస్నానమైనను యథాశక్తిగా జేయవలయు నదియెట్లన్న॥"శ్లో॥ అశిరస్కంభవేత్స్నానం స్నానాశక్తౌచ కర్మిణామ్ । ఆర్ద్రేణ వాససా వాస్యాన్మార్జనం దైహికంవిదురితి॥" యనిజాబాల్యాస్మృత్యుక్తమగుట వలన నశక్తునకు నైమిత్తికస్నానప్రసక్తియందున్న తడిబట్టచే నొడలు దుడచినంబ్రయతుడగును॥"శ్లో॥ మహానిశాత్రవిజ్ఞేయా మధ్యస్థం ప్రహరద్వయం। తస్మిన్ స్నానంనకుర్వీత కామ్యనైమిత్తికాదృతే॥" యను దేవల వచనము వలన మధ్యయామములు రెండు నర్ధరాత్రమందు కామ్యనైమిత్తికములుదప్ప స్నానము జేయరాదు॥ చండాలా

దిస్పర్శకలిగి నప్పుడు దప్ప బహువ స్త్రములతో నసగా కట్టుబట్టలతో నిత్యముగా స్నానము గూడదు తనకు తెలియని యగాధములును మొసళ్లు మొదలగువాటి పీడ గలుగు హ్రదాదులలో స్నానము జేయరాదు॥ ౧౨౯॥

మూ॥ దేవతానాంగురోరాజ్ఞః స్నాతకాచార్యయోస్తథా।నా
క్రామేతాకామతశ్ఛాయాం బభ్రుణోదీక్షితస్యచ॥ ౧౩౦॥

పాషాణాది విగ్రహరూపదేవతలయొక్కయు పిత్రాది గురువులయొక్కయు మూర్ధాభిషిక్తునియొక్కయు స్నాతకునియొక్కయు ప్రధానుడగు నాచార్యుని యొక్కయు కపిలవర్ణముగలవానియొక్కయు దీక్షితునియొక్కయు చశబ్దముచే చండాలాదులయొక్కయు నీడను కామముచే దొక్కగూడదు అకామముచేదోషములేదనుట॥ ౧౩౦॥

మూ॥ మధ్యందినేఽర్ధరాత్రేచ శ్రాద్ధంభుక్త్వాచసామిషం। సం
ధ్యయోరుభయోశ్చైవ నసేవేతచతుష్పథం॥ ౧౩౧॥

మధ్యాదినమందు నర్ధరాత్రమందును సంధ్యలరెంటను మాంసయుక్తముగ శ్రాద్ధభోజనమొనర్చియు చతుష్పథమందు చిరముండరాదు॥ ౧౩౧॥

మూ॥ ఉద్వర్తనమపస్నానం విణ్మూత్రేరక్తమేవచ।శ్లేష్మనిష్ఠ్యూ
తవాంతాని నాధితిష్ఠేత్తుకామతః॥ ౧౩౨॥

ఒడలు నలుగడినపిండి స్నానోదకము మూత్రపురీషములును రక్తము శ్లేష్మము నుమ్మివేసిన తాంబూలాదికము వమనము వీటినికామముచే ముట్టుకనియుండగూడదు॥ ౧౩౨॥

మూ॥ వైరిణంనోపసేవేత సహాయంచైవవైరిణః। అధార్మికంత
స్కరంచ పరస్యైవచయోషితం॥ ౧౩౩॥

శత్రువును వానిమంత్రిని అధార్మికుని దొంగవానిని పరస్త్రీనిన్ని సేవించగూడదు తస్కరుడధార్మికుడైనప్పటికిని మిక్కిలిగహితుడగుటవలన వేరేచెప్పట॥౧౩౩॥

మూ॥ నహీదృశమనాయుష్యం లోకేకించనవిద్యతే। యాదృశంపు

రుషస్యేహ పరదారోపసేవనం॥ ౧౩౪॥

పరదారగమనముతో సదృశమగు ననాయుష్యకరమగునది లోకములో లేదు-గావున నదిజేయరాదు॥ ౧౩౪॥

మూ॥ క్షత్రియంచైవసర్పంచ బ్రాహ్మణంచబహుశ్రుతం। నావమన్యేత వై భూష్ణుః కృశానపికదాచన॥ ౧౩౫॥

వృద్ధినొందనిచ్ఛగలపురుషుడు రాజునున్ను సర్పమునున్ను బహుశ్రుతుడగుబ్రాహ్మణునిన్ని వీరుకృశించియుండిన నవమానించరాదు॥ ౧౩౫॥

మూ॥ ఏతత్త్రియంహిపురుషం నిర్దహేదవమానితం। తస్మాదేతత్త్రియంనిత్యం నావమన్యేతబుద్ధిమాన్॥ ౧౩౬॥

ఈత్రయమవమానితమగుచు నవమానమొనర్చినవాని నశింపజేయునదిగావున నవమానించరాదు క్షత్రియుడును సర్పమున్ను దృష్టశక్తులే బహుశ్రుతబ్రాహ్మణుడాభిచారికాదులచే నశింపజేయును గాన మంచిబుద్ధిగలవాడీత్రయమునవమానించరాదు॥ ౧౩౬॥

మూ॥ నాత్మానమవమన్యేత పూర్వాభిరసమృద్ధిభిః। అమృత్యుశ్రియమన్విచ్ఛేన్నైనాంమన్యేతదుర్లభాం॥ ౧౩౭॥

ముందుగాధనార్జనను ప్రయత్నముజేసినధనమబ్బకున్నదానంబట్టినేను మందభాగ్యుడననితన్నవమానించుకొనరాదు మరేమంటే మరణపర్యంతమును శ్రీసిద్ధికైయుద్యుక్తిజేయవలెను- సంపత్తిదుర్లభమని యూరకుండగూడదు॥ ౧౩౭॥

మూ॥ సత్యంబ్రూయాత్ప్రియంబ్రూయాన్నబ్రూయాత్సత్యమప్రియం। ప్రియంచనానృతంబ్రూయాదేషధర్మస్సనాతనః॥ ౧౩౮॥

తాజూచినది వినినదిన్ని సత్యమదియేపలుకవలె నదిప్రియముగా బలుకవలె సత్యమైనను నీకుసూనియయ్యెనని బలుకరాదు నీకుపుత్రుడుపుట్టెనని జెప్పవలెను ఇది వేదమూలను గావున నిత్యమగుధర్మము॥ ౧౩౮॥

మూ॥ భద్రంభద్ర మితిబ్రూయాద్భద్రమిత్యేవవావదేత్। శుష్క-

వైరంవివాదంచ నకుర్యాత్కేనచిత్సహ॥ ౧౩౯॥

మొదటిభద్రపదమభద్రపరము రెండవది భద్రశబ్దపర్యాయపరము యేదియభద్రమో దానిని భద్రశబ్దపర్యాయమగు పుణ్యప్రశస్తాదిశబ్దములచే జెప్పవలయును అందుకు ఆపస్తంబులు॥ "సూ॥ నాభద్రమభద్రం బ్రూయాత్పుణ్య ప్రశస్తమితి బ్రూయాదితి॥" అభద్రమునభద్రమనరాదు పుణ్యమనిప్రశస్తమని యనవలెనుననీ భద్రమందుభద్రపదముచేతనే పలుకవలెను పనిలేనివిరోధము నెవ్వనితోడనున్నుజేయరాదు॥ ౧౩౯॥

మూ॥ నాతికల్యం నాతిసాయంనాతిమధ్యందినేస్థితే। నాజ్ఞాతేన సమంగచ్ఛే న్నైకోన వృషలైస్సహ॥ ౧౪౦॥

ఉషఃకాలమందును ప్రదోషకాలమందును మధ్యందినమందును తెలియబడని స్వభావముగల పురుషునితోటిన్ని శూద్రులతోటిన్ని కలసిప్రయాణముజేయరాదు తానొకడున్ను వెళ్లగూడదు॥ "శ్లో॥ నైకఃప్రపద్యేతాధ్వాన॥" మనిచెప్పబడియుండినప్పటికిని నిచ్చట॥ "నైకః॥" యనునదిస్నాతకవ్రతలోప ప్రాయశ్చిత్త గౌరవార్థము॥ ౧౪౦॥

మూ॥ హీనాంగానతిరిక్తాంగా న్విద్యాహీనా న్వయోధికాన్। కురూపద్రవ్యహీనాంశ్చ జాతిహీనాంశ్చ నాక్షిపేత్॥౧౪౧॥

హీనాంగులను నధికాంగులను వృద్ధులను కురూపులను దరిద్రులను జాతిలేకుండవాళ్ళను సొట్టవాడాగుడ్డివాడా యనుసీరీతినాక్షేపింపదగదు॥ ౧౪౨॥

మూ॥ నస్పృశేత్పాణినోచ్ఛిష్టో విప్రోగోబ్రాహ్మణానలాన్। నచాపిపశ్యేదశుచిస్స్వస్థో జ్యోతిర్గణాన్దివి॥ ౧౪౨॥

భోజనంబానచిరియుమూత్రపురీషోత్సర్జనము జేసియు నాచమించని వాడుచ్ఛిష్టుడు అట్లుచ్ఛిష్టుడగు విప్రుడుకరముచే గోవును బ్రాహ్మణుని వహ్నిని స్పృశించరాదు అశుచియై స్వస్థముగానున్నవాడు సూర్యనక్షత్రాది జ్యోతిస్సులజూడగూడదు॥ ౧౪౨॥

మూ॥ స్పృష్ట్వైతానశుచిర్నిత్యమద్భిః ప్రాణానుపస్పృశేత్।

గాత్రాణిచైవ సర్వాణి నాభింపాణితలేనతు॥ ౧౪౩॥

అశుచియైగవాదులను స్పృశించెనేని యాచమించి హస్తగతములగునుదకము లచే చక్షురాదీంద్రియములను శిరస్సును నాభిస్థానములను జానువులను పాదములను స్పృశించవలెను యిచ్చటవప్రకరణము నేలనన్ము చెప్పినటువంటి ప్రాణాచ్ఛిత్తాభిధానలాఘవముకొరకు ప్రాయశ్చిత్తప్రకరణమందున్న గవాది గ్రహణము గ్రహించలేనియుండును॥ ౧౪౩॥

మూ॥ అనాతురస్స్వానిఖానిన స్పృశేదనిమిత్తతః। రోమాణిచ
రహస్యాని సర్వాణ్యేవ వివర్జయేత్॥ ౧౪౪॥

రోగికాకనిండ్రియరంధ్రమునున్నగుదకక్షస్థలోమములనున్నిమిత్తముగ స్పృశించరాదు॥ ౧౪౪॥

మూ॥ మంగళాచారయుక్తస్స్యాత్ప్రయతాత్మాజితేంద్రియః జ
పేచ్చజుహుయాచ్చైవ నిత్యమగ్నిమతంద్రితః॥ ౧౪౫॥

ఇష్టార్థసిద్ధిమంగళము దానికిహేతువగు గోరోచనాదిధారణము మంగళము గురుసేవాదికమాచారము వీటియందుద్యుక్తుడుగావలెను బాహ్యాభ్యంతరశుచియు జితేంద్రియుడును గావలెను నిత్యమునతంద్రితుడై గాయత్ర్యాదిజపమున్ను నగ్నియందు హోమమున్ను జేయవలయు నాచారములన్నియు జెప్పినప్పటికిన్ని వినాతనిస్పృత్తికై యిచ్చట మరల నాచారములనేజేయవలయునని చెప్పెను॥ ౧౪౫॥

మూ॥ మంగళాచారయుక్తానాం నిత్యంచప్రయతాత్మనాం। జప
తాంజుహ్వతాంచైవ వినిపాతోనవిద్యతే॥ ౧౪౬॥

మంగళకర్మములతోనాచారముతోనున్నట్టియున్ను నిత్యము శుచులయినట్టియు జపహోమరతులగునట్టివారలకు దైవమానుషోపద్రవములు రాకపోవును॥ ౧౪౬॥

మూ॥ వేదమేవాభ్యసేన్నిత్యం యథాకాలమతంద్రితః। తంహ్యా
స్యాహుఃపరంధర్మ ముపధర్మోన్యఉచ్యతే॥ ౧౪౭॥

నిత్యకృత్యమయినపిమ్మటనున్ను శేషమున్నకు మూలము గావున ప్రణవగాయత్ర్యాదికమునేయములనుమ గాకుండ జపించుచుండవలయును ఎందువలన నదిపరమ

ధర్మమని యునితరములుపధర్మములనియు మన్వాదులుజెప్పిరో వేదాభ్యాసాదికము మున్ను జెప్పబడినప్పటికిని వేదాభ్యాసముచే జాతిస్మరణాదికముగలిగి తద్ద్వారా మోక్షహేతువని చెప్పుటకుగా మరల జెప్పబడెను॥ ౧౪౭॥

మూ॥ వేదాభ్యాసేనసతతం శౌచేనతపసైవచ। అద్రోహేణచ
భూతానాం జాతిస్మరతిపౌర్వికం॥ ౧౪౮॥

ఎల్లప్పుడును వేదాభ్యాసశౌచతపస్సులచేతనున్ను భూతద్రోహములేకుండుట చేతనున్ను పూర్వమందగుజాతినిస్మరించును॥ ౧౪౮॥

మూ॥ పౌర్వికీంసంస్మరన్జాతిం బ్రహ్మైవాభ్యసతేపునః। బ్రహ్మా
భ్యాసేనచాజస్ర మనంతంసుఖమశ్నుతే॥ ౧౪౯॥

పూర్వజాతిననగా ననేకపూర్వజన్మములందగు గర్భవాసాదిదుఃఖములను స్మరించుకుని సంసారమందువిరక్తుడై బ్రహ్మాభ్యాసమునే చేసి శ్రవణమననధ్యానాదులచే స్వస్వరూపసాక్షాత్కారమునొంది బ్రహ్మానందాఖ్యసుఖము నఖండముగ నొందును॥ ౧౪౯॥

మూ॥ సావిత్రాన్ శాంతిహోమాంశ్చ కుర్యాత్పర్వసు నిత్యశః। పి
తౄంశ్చైవాష్టకాస్వర్చే న్నిత్యమన్వష్టకాసుచ॥ ౧౫౦॥

సావిత్రీ దేవతాకములగు హోమములున్ను అనిష్టనివృత్త్యర్థములగు శాంతిహోమములనున్ను పౌర్ణమాస్యామావాస్యలయందు నెల్లప్పుడును జేయవలయును మరియు మార్గశీర్షము మొదలుగా మూడు కృష్ణాష్టములయందష్టకలనున్ను తదనంతరనవములయందన్వష్టకలనున్ను తనపితరులకు శ్రాద్ధములను జేయవలయును॥ ౧౫౦॥

మూ॥ దూరాదావసథాన్మూత్రం దూరాత్పాదావసేచనం। ఉచ్ఛి
ష్టాన్నంనిషేకంచ దూరాదేవసమాచరేత్॥ ౧౫౧॥

“శ్లో॥ నైరృత్యామిషువిక్షేప మతీత్యాభ్యధికంభువ ఇతి-” అగ్నిగృహమునకు నైరుతిదిక్కున బాణపాతముకంటె నధికమగు ప్రదేశమందని విష్ణుపురాణవచనమువలన నట్లుగృహమునకు దూరముగా మూత్రపురీషోచ్ఛిష్టరేతస్సేకాదులను జేయవ

లయును॥ ౧౫౧

మూ॥ మైత్రం ప్రసాధనం స్నానం దంతధావనమంజనం। ఈశ్వరం చైవరక్షార్థం గురూన్ నేవచపర్వసు॥ ౧౫౨॥

మైత్రమనగా మిత్రదేవతాకమగునదిగుదస్థానమందగునది మైత్రమనబడును పురీషశౌచమున్ను అలంకారమున్ను స్నానమున్ను దంతధావనమున్ను అంజనధారణమున్ను దేవతాద్యర్చనమున్ను పర్వములందు గురుపూజయు పూర్వాహ్ణమందునే జేయవలయును పూర్వాహ్ణమనగా రాత్రిశేషదినపూర్వభాగములు వివక్షితములు కృత్యనులుమాత్రమే వివక్షితములు గావున పారక్రమమకర్రలేదు స్నానానంతరమందు దంతధావనముండదుగావున॥ ౧౫౨॥

మూ॥ దైవతా న్యభిగచ్ఛేత్తు ధార్మికాంశ్చ ద్విజోత్తమాన్ । ఈశ్వరంచైవ రక్షార్థం గురూన్ నేవచ పర్వసు॥ ౧౫౩॥

పాషాణాదివిగ్రహరూపదేవతలనున్ను ధర్మప్రధానవిప్రులనున్ను రక్షణార్థమై రాజాదులనున్ను పిత్రాదిగురువులనున్ను యమావాస్యాదిపర్వములందుదర్శించుట కభిముఖముగాబోవలయును॥ ౧౫౩॥

మూ॥ అభివాదయేద్వృద్ధాంశ్చదద్యాచ్చైవాసనంస్వకం।కృతాంజలిరుపాసీత గచ్ఛతః పృష్ఠతోఽన్వియాత్॥ ౧౫౪॥

గురువు లింటికిరాగానే నమస్కరించవలెను తనయాసనము వారి కివ్వవలెను-వారిసన్నిధిని చేతులు జోడించుకొని యుపాసించుకుని యుండవలెను వారువెళ్లుచున్నప్పుడు వారివెనుక నడచి వెళ్ళి యంపకము బెట్టవలెను॥ ౧౫౪॥

మూ॥ శ్రుతిస్మృత్యుదితం సమ్యఙ్నిబద్ధం స్వేషు కర్మసు । ధర్మమూలం నిషేవేత సదాచార మతంద్రితః॥ ౧౫౫॥

శ్రుతిస్మృతులచే లెస్సగ జెప్పబడినట్టియు అధ్యయనాది స్వకర్మములందునంగములుగా నిబద్ధములయినట్టియు ధర్మహేతువులయినట్టియు సాధుజనులయాచారముల ననలసుడై సంతతమాచరింపుచుండవలయు నని సామాన్యముగ నాచారోపదేశము ఫలకథనంబునకై జేయబడెను॥ ౧౫౫॥

మూ॥ ఆచారాల్లభతేహ్యాయు రాచారాదీప్సితాః ప్రజాః । ఆ
చారాద్ధనమక్షయ్య మాచారో హంత్యలక్షణమ్॥౧౫౬॥

ఆచారము వలన వేదోక్తమగు పూర్ణాయుష్యము నభిమతపుత్రపౌత్రదుహితాదిసంతతియు నక్షయమగు ధనమునుం గలుగును అశుభసూచకములగుచిహ్నములను నిష్ఫలముగ నొనర్చును ఆచారధర్మముచే నరిష్టములు మళ్ళిపోవును గావున॥ ౧౫౬॥

మూ॥ దురాచారోహి పురుషో లోకే భవతి నిందితః । దుఃఖ
భాగీచ సతతం వ్యాధితోల్పాయు రేవచ॥ ౧౫౭॥

లోకమందు దురాచారయుక్తుడు నిందితుడు నల్పాయుష్యుడు రోగవంతుడును దుఃఖియు నగును గాన సదాచారయుక్తుడు గావలయును॥ ౧౫౭॥

మూ॥ సర్వలక్షణహీనోపి యస్సదాచారవాన్నరః । శ్రద్దధా
నోనసూయశ్చ శతంవర్షాణి జీవతి॥ ౧౫౮॥

ఎవడు సదాచారసంపన్నుడును శ్రద్ధాయుక్తుడును పరదోషముల నెంచనివాడు నగునో యన్నరుడు మంచిలక్షణములు లేనివాడైనను నూరు వత్సరములు బ్రతుకును॥ ౧౫౮॥

మూ॥ యద్యత్పరవశం కర్మ తత్తద్యత్నేన వర్జయేత్। యద్య
దాత్మవశంతుస్యా త్తత్తత్సేవేత యత్నతః॥ ౧౫౯॥

యేయేకర్మము ధనప్రార్థనాదులచే పరాధీనమో యాయాకర్మమును యత్నముచే త్యజించవలెను యేదేదిస్వవ్యాపారసాధ్యమో బ్రహ్మవిచారాదికము దియత్నముచే జేయవలయును॥ ౧౫౯॥

మూ॥ సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖమ్ । ఏత
ద్విద్యాత్సమాసేన లక్షణం సుఖదుఃఖయోః॥ ౧౬౦॥

పరప్రార్థనాధీనమగు నంతయు దుఃఖహేతువు స్వాధీనమగు నంతయు సుఖహేతువు ఇదే సుఖదుఃఖములకు గారణముగా దెలియవలయును॥ ౧౬౦॥

మూ॥ యత్కర్మ కుర్వతో స్యస్యా త్పరితోషోంతరాత్మనః। త

తృప్తియత్నేన కుర్వీత విపరీతంతు వర్జయేత్॥ ౧౬౧॥

ఏకర్మను జేయుచో నంతఃకరణము మోదించునో యది తప్పక జేయవల యును యేకర్మము జేయుచో మనస్తుష్టి లేకుండునో యదిమానవలయు నిదివిహి తనిషిద్ధేతరకర్మవిషయము వైకల్పికము॥ ౧౬౧॥

మూ॥ ఆచార్యంచ ప్రవక్తారం పితరం మాతరం గురుమ్। నహింస్యాద్బ్రాహ్మణాన్గాశ్చసర్వాంశ్చైవ తపస్వినః॥

ఉపనయనపూర్వకవేదాధ్యాపకుడు ఆచార్యుడు వేదార్థమును జెప్పినయతడు ప్రవక్త తల్లియు యతిఞ్చిత్ చెప్పినవాడు గురువు బ్రాహ్మణులు గోవులు సకలతపస్వులు వీరినందరిని హింసించరాదు ఇచట హింసయనగా ప్రతికూలాచరణము గోవిందరాజు సామాన్యహింసానిషేధము వలన వీరాతతాయుల యినప్పటికిని హింసించరాదనివ్రాసె నదియుక్తముగాదు "గురుంవా బాలవృద్ధౌవా" యను విరోధమువలన ననికుల్లూకభట్టువ్రాసెను॥ ౧౬౨॥

మూ॥ నాస్తిక్యం వేదనిందాంచ దేవతానాంచ కుత్సనమ్। ద్వేషందంభంచ మానంచ క్రోధం తైక్ష్ణ్యంచ వర్జయేత్॥

పరలోకము లేదనుబుద్ధి నాస్తిక్యము వేదదేవతానింద మాత్సర్యముధర్మమందుత్సాహము లేకుండుట యభిమానము కోపము క్రౌర్యము వీటిని పరిత్యజించవలెను॥ ౧౬౩॥

మూ॥ పరస్యదండం నోద్యచ్ఛేత్క్రుద్ధోనైనం నిపాతయేత్। అన్యత్ర పుత్రాచ్ఛిష్యాద్వా శిష్ట్యర్థం తాడయేత్తుతౌ॥౧౬౪॥

పరునికొట్టుటకు దండాదికమును విసరగూడదు పరుని శరీరమందు వేయగూడదు పుత్రశిష్యభార్యాదాసాదులనుదప్ప నానిషేధము వీరినైతే శిక్షకొరకు "రజ్వావేణువిదళేనవేత" యనునట్టిక్రమమున గొట్టవచ్చును॥ ౧౬౪॥

మూ॥ బ్రాహ్మణాయావగుర్యైవ ద్విజాతిర్వధకామ్యయా। శతంవర్షాణి తామిస్రే నరకే పరివర్తతే॥ ౧౬౫॥

తాను ద్విజుడయిన్ని బ్రాహ్మణునివధించుదునని దండాదికమునెత్తుటమాత్రమున

నే కొట్టవకర లేదు ఉద్యుక్తిమాత్రముచే తామిస్రాదినరకమందు నూరుసంవత్స రములుబడును॥ ౧౬౫॥

మూ॥ తాడయిత్వా తృణేనాపి సంరంభా న్మతిపూర్వకం। ఏక
వింశతి మాజాతీః పాపయోనిషుజాయతే॥ ౧౬౬॥

గడ్డి పరక చేతనయినా బుద్ధిపూర్వకముగ క్రోధమువలన బ్రాహ్మణునికొట్టియి రువదియొకజన్మము దనుకశునకాది పాపయోనులందుబుట్టును॥ ౧౬౬॥

మూ॥ అయుధ్య మానస్యోత్పాద్య బ్రాహ్మణస్యా సృగంగతః।
దుఃఖంసుమహ దాప్నోతి ప్రేత్యాప్రాజ్ఞతయానరః॥౧౬౭॥

యుద్ధము జేయని బ్రాహ్మణుని శరీరమందు రక్తమువచ్చేలాగున నజ్ఞతచేనడ చిన పరలోకమందధిక దుఃఖమునొందును॥ ౧౬౭॥

మూ॥ శోణితం యావతః పాంసూన్ సంగృహ్ణాతి మహీతలాత్।
తావతోబ్దానముత్రాన్యై శ్శోణితోత్పాదకోద్యతే॥౧౬౮॥

ఖడ్గాదులచే నెవడు బ్రాహ్మణునినరుకుటవలన రాలిన రక్తముచే నెన్నిభూ రేణువులు తడియు నన్నిసంవత్సరములు పరలోకమందతడు శునకాదులచే భక్షిం చబడును॥ ౧౬౮॥

మూ॥ నకదాచి ద్ద్విజేతస్మా ద్విద్వానవగురేదపి।నతాడయేత్తృ
ణేనాపి నగాత్రా త్స్రావయేదసృక్॥ ౧౬౯॥

అదిగావున బ్రాహ్మణునికొట్ట నుద్యోగించడముమొదలగు వాటియందగుదోష మును దెలిసినవాడు కొట్టుటకు కర్రియెత్తడమును తృణముచేనయినకొట్టుటయు రక్తమువచ్చేలాగు జేయుటయునుంగూడదని పూర్వోక్తనిషేధముల కుపసంహా రము॥ ౧౬౯

మూ॥ అధార్మికో నరోయోహి యస్యచాప్యనృతం ధనం। హిం
సారతశ్చ యో నిత్యం నేహాసౌ సుఖమేధతే॥ ౧౭౦॥

అధర్మముచే వ్యవహరించెడువాడ ధార్మికుడట్టి నరు డెవడనృతసాక్ష్యాదికము

చే ధనమునార్జించునో హింసారతుడగునో యట్టివాడెన్నడును సుఖము నొంద డుగావున నట్లుజేయగూడదనినిందచే నిషేధముకల్పించబడెను॥ ౧౭౦॥

మూ॥ నసీదన్నపి ధర్మేణ మనోఽధర్మే నివేశయేత్। అధార్మికా
ణాం పాపానా మాశుపశ్య న్విపర్యయం॥ ౧౭౧॥

శాస్త్రోక్తప్రకారము సత్కర్మమునాచరించుచు ధనలోపముచే నిరసించియుంటున్నప్పటికి నధర్మమందుబుద్ధిని వెళ్ళనీయరాదు యేమంటే అధర్మశీలురగువారు చౌర్యాదిపాపకృత్యములచే ధనమార్జించి ప్రస్తుతను సంపన్నులయియుందురైనన్నట్టిపాపార్జితద్రవ్యమా పాపాత్ములకునశించిపోయిశీఘ్రకాలములో సేవ్యత్యాసమురావడము చూచుచున్నట్టి యధర్మమందు బుద్ధినిబెట్టరాదనిదుష్టార్థమునుగనుపచేను॥ ౧౭౧॥

మూ॥ నాధర్మశ్చరితో లోకే సద్యఃఫలతిగౌరివ। శనైరావర్త
మానస్తు కర్తుర్మూలాని కృంతతి॥ ౧౭౨॥

శుభాశుభకర్మములు శాస్త్రముచే నియమించబడిన పరిపాకకాలము గలదిగాన లోకమందుచేసిన యధర్మము సద్యఃకాలమందు ఫలించదు ఎట్లంటే "గౌరివ" యనగా భూమివలెను భూమిదున్ని విత్తనము వేసిన సస్యాదికముబుట్టి తత్తత్ఫలకాలమందు శాల్యాదిమంజరీసంపన్నముగునుగాని వెంటనే యెట్లుఫలించదో యని ధేనుపక్షమందు విపరీతదృష్టాంతము ధేనువుమేపబడి పాలుపితుకుకొనినప్పుడె ఫలమిచ్చునట్లధర్మము వెంటనేఫలించదని నుతేమంటే చేసినయధర్మము క్రమముగాఫలకాలమందుచేసిన వానిసమూలమునుగాననగా ప్రాణములను సంపత్తినికూడానశింపజేయును॥ ౧౭౨॥

మూ॥ యదివాత్మని పుత్రేషు నచేత్పుత్రేషు నప్తృషు। నత్వేవతు
కృతోఽధర్మః కర్తుర్భవతి నిష్ఫలః॥ ౧౭౩॥

అధర్మమును జేసినవాడు ధనప్రాణాదులనాశమును స్వయముగ నొందకుండిన వానిపుత్రులయందునైన నావినాశము సంభవించును వారికిగాకుండిన మనమలందునైననట్టి నాశనుసంభవించును గావున నధర్మమును ఫలించకపోదుగాన నదిజేయరాదని తాత్పర్యము ఒకడుచేసినయధర్మమునకు నన్యులు ఫలభాగులు గావడమే

వనిన పుత్రాదినాశమాన్మనాశముకంటె నెక్కుడుగ లోకమందుఁ జలింతురు శా
స్త్రమునందు నట్లు లెయుండును॥ ౧౭౩

మూ॥ అధర్మేణైధతే తావ త్తతో భద్రాణి పశ్యతి। తతస్సప
త్నాన్ జయతి సమూలస్తు వినశ్యతి॥ ౧౭౪॥

అధర్మముచేసనగా ద్రోహాదికముచేసి ధనగ్రామాదులచే వృద్ధినొందు నట
పైని బహుభృత్యగవాశ్వాదిలాభమంగళములనొందు నటపై తనకంటె నల్పులగుశ
త్రువులను జయించునంతట నాయధర్మ పరిపాకముచే ధనప్రాణతనయాదులతో
నిశ్శేషముగ నశించును॥ ౧౭౪॥

మూ॥ సత్యధర్మార్య వృత్తేషు శౌచే చైవారమేత్సదా। శిష్యాం
శ్చ శిష్యా ద్ధర్మేణ వాగ్బాహూదరసంయతః॥ ౧౭౩॥

సత్యమందున్ను ధర్మమందున్ను సదాచారమందున్ను శౌచమందున్ను నాస
క్తుడుగావలెను శాసింపదగిన పుత్రశిష్యభ్రాత్రాదులను శాస్త్రప్రకారముగ శిక్షించవ
లెను యిట్లున్ను శక్తుడైన నాదరార్థము పరుల జెప్పను సత్యభాషియు పరులను
బహుబలముచే పీడజేయనివాడున్ను యథాసంభవమితభోజియుగావలెను॥ ౧౭౫॥

మూ॥ పరిత్యజేదర్థకామౌ యౌ స్యాతాం ధర్మవర్జితౌ। ధర్మం
చాప్యసుఖోదర్కం లోకవిక్రుష్ట మేవ చ॥ ౧౭౬

ధర్మవిరోధులగు నర్థకామములను త్యజించవలయును చౌర్యాదికముచేధన
మార్జించుటయు దీక్షాదినమందు పత్నిఁబొందడమునున్ను నిట్టివిధర్మవిరోధుల
గునర్థకామములని తెలియవలయు నుత్తరకాలమందు సుఖములేనిధర్మమును వి
డువవలయుననగా బహుపుత్రులు గలవాడు సర్వస్వదానముచేయడము సుఖోద
ర్కముగాని ధర్మమిట్టిన్ని మరిన్ని లోకులాక్రోశించెడు ధర్మమనగా మద్యమా
ష్టకాదులయందు కలియుగములో గోవధచేయడము లోకనింద్యమగు ధర్మమిట్టి
దియున వర్జించవలయును॥ ౧౭౬॥

మూ॥ న పాణిపాదచపలో న నేత్రచపలోఽనృజుః। న స్యాద్వాక్చ
పలశ్చైవ న పరద్రోహకర్మధీః॥ ౧౭౭॥

అనుపయుక్తములగు వస్తువులనుపట్టుకోవడము పాణిచాపలము కార్యము లే

నిస్థలములకు వ్యర్థముగనడచిపోవడము పాదచాపలము పరస్త్రీలను దుష్టబుద్ధిచే చూడడము మొదలగునవి నేత్రచాపలములు వక్రప్రవర్తనమున్ను గర్హ్యములగు బహువాక్కులననడము వాక్చాపలము పరులకుహింసనుకలిగించెడుచేష్టలను బుద్ధియునుకలుగడమున్ను ఇవికలవాడుగారాదు॥ ౧౭౭॥

మూ॥ యేనాస్య పితరోయాతాః యేనయాతాః పితామహాః।
తేనయాయాత్సతాం మార్గం తేనగచ్ఛన్నరిష్యతే॥౧౭౮॥

శాస్త్రార్థమనేకవిధములనుండునప్పుడు తనపితృపితామహాదు లేధర్మము నవలంబించిరో యదియే సద్ధర్మము దానిజేయువాడుగావలెను యధర్మముగా హింసనుజేయరాదు॥ ౧౭౮॥

మూ॥ ఋత్విక్పురోహితాచార్యైర్మాతులాతిథిసంశ్రితైః। బాలవృద్ధాతురైర్వైద్యైర్జ్ఞాతిసంబంధిబాంధవైః॥౧౭౯॥

మూ॥ మాతాపితృభ్యాం జామీభిర్భ్రాత్రా పుత్రేణ భార్యయా।
దుహిత్రా దాసవర్గేణ వివాదం నసమాచరేత్॥౧౮౦॥

తనకుయజ్ఞమునుచేయించినవాడు ఋత్విజుడు స్మార్తకర్మములు జేయించినవాడు పురోహితుడు వేదమునుజెప్పినయతండాచార్యుడు మేనమామ అతిథియు తననాశ్రయించినవాడును బాలురు వృద్ధులు రోగులు వైద్యులు పితృపక్షీయులు జ్ఞాతులు సంబంధులనగా భార్యాసోదరుడు మొదలగువారు బాంధవులనగా మాతృపక్షీయులు తల్లియు దండ్రియు జామలనగా అక్కచెల్లెళ్లు కోడళ్లు మొదలగు స్త్రీలు తనసోదరులు పుత్రులు భార్య కొమార్తె దాసదాసులు వీరితో నెప్పుడును వివాదముబొందగూడదనియీరెండుశ్లోకములకునొకటేయన్వయము॥౧౮౦॥

మూ॥ ఏతైర్వివాదాన్ సంత్యజ్య సర్వపాపైః ప్రముచ్యతే।ఏభిర్జితై
శ్చజయతి సర్వాన్లోకానిమాన్గృహీ॥ ౧౮౧॥

ఈఋత్విగాదులతో వివాదమువిడచి యజ్ఞాతపాపములవలన విముక్తుడగును వారువివాదమొనర్చినను సహించి యావివాదమునొందనివాడీసర్వోత్తమములగులోకములను జయించును॥ ౧౮౧॥

మూ॥ ఆచార్యోబ్రహ్మలోకేశః ప్రాజాపత్యే పితా ప్రభుః। అతిథి

స్త్వింద్రలోకేశో దేవలోకస్యచర్త్విజః॥ ౧౮౨॥

ఆచార్యుడు బ్రహ్మలోకాధిపతి యతనితో వివాదముపడకనుండిన నతడు సంతుష్టుడగుటచే బ్రహ్మలోకప్రాప్తియగును గౌణముగు బ్రహ్మలోకేశత్వమున్ను ఇటు తండ్రి ప్రాజాపత్యలోకేశుడతనితో వివాదములేకున్న నతనిసంతుష్టిచే ప్రాజాపత్యలోకప్రాప్తియగు నిట్టులెయతిథి యింద్రలోకప్రభువు గావున నతని తుష్టివలన నింద్రలోకముగలుగును ఈలాగుననే యన్నిలోకములు ప్రాప్తించును ఋత్విజులచే దేవలోకము గలుగును॥ ౧౮౨॥

మూ॥ జామయోప్సరసాంలోకే వైశ్వదేవస్యబాంధవాః। సంబంధినోహ్యపాంలోకే పృథివ్యాం మాతృమాతృకా॥ ౧౮౩॥

మూ॥ ఆకాశేశాస్తువిజ్ఞేయా బాలవృద్ధకృశాతురాః। భ్రాతాజ్యేష్ఠస్సమఃపిత్రా భార్యాపుత్రస్స్వకాతనుః॥ ౧౮౪॥

అప్సరోలోకమందు జాములు బ్రభువులు బాంధవులు వైశ్వదేవలోకమందును సంబంధులు వరుణలోకమందును భూలోకమందు తల్లియు మేనమామయు॥ ౧౮౩॥

బాలురువృద్ధులు కృశులనగా ధనహీనులాశ్రితులు నాతురులు నాకాశలోకమందును జ్యేష్ఠభ్రాత తండ్రితోతుల్యుడు గావున ప్రాజాపత్యలోకమందును బ్రభువులు గానవారివారితుష్టిచే నాయాలోకములనొందును భార్యపుత్రుడున్ను తనశరీరమే గావున తనతో తనకువివాదమసంభవము॥ ౧౮౪॥

మూ॥ ఛాయాస్స్వోదాసవర్గశ్చ దుహితాకృపణంపరం। తస్మాదేతైః పరిక్షిప్తస్సహేతాసంజ్వరస్సదా॥ ౧౮౫॥

దాసవర్గముతనతో వదలకనుండునీడవలెను గానవివాదములేదు పుత్రికమిక్కిలికృపాపాత్రము గావున వీరందరును తన్నధిక్షేపించినను సంతాపమునొందక సహించవలయును॥ ౧౮౫॥

మూ॥ ప్రతిగ్రహసమర్థోఽపి ప్రసంగంతత్రవర్జయేత్। ప్రతిగ్రహేణహ్యస్యాశు బ్రాహ్మంతేజఃప్రశామ్యతి॥ ౧౮౬॥

విద్యాతపోవృత్తసంపత్తిచే ప్రతిగ్రహాధికారమున్నప్పటికిని ప్రతిగ్రహమందు తీసంగమునువిడువవలయును ॥ యేప్రతిగ్రహముచే బ్రహ్మతేజస్సనగా వేదాధ్యయ

నాదికము చేయుచున్నప్రభావమదినశించుచుయాత్రామాత్రసిద్ధికై విహితమైనప్పటికిని ప్రతిగ్రహమును బ్రహ్మతేజోనాశకమనిఫలకథనార్థమీవచనము॥ ౧౮౬॥

మూ॥ నద్రవ్యాణామవిజ్ఞాయవిధింధర్మ్యంప్రతిగ్రహే । ప్రాజ్ఞః
ప్రతిగ్రహంకుర్యాదవసీదన్నపిక్షుధా॥ ౧౮౭॥

ద్రవ్యములప్రతిగ్రహముధర్మయుక్తమగువిధినిగా గ్రాహ్యావస్తు దేవతా ప్రతిగ్రహమంత్రములను దెలియక క్షుత్తుచేనిరసించియుండినను బ్రాహ్మణుడు ప్రతిగ్రహించగూడదు ఆయాపత్తిలేనియప్పుడుగూడదనియేమిజెప్పతగ్గది॥ ౧౮౭॥

మూ॥ హిరణ్యంభూమిమశ్వంగామన్నంవాసస్తిలాన్ఘృతం। ప్రతి
గృహ్ణన్నవిద్వాంస్తుభస్మీభవతిదారువత్॥ ౧౮౮॥

సువర్ణము భూమి గుర్రము గోవు నన్నము నేయి వీటినిశ్రుతాధ్యయనసంపన్నుడుగానివాడు ప్రతిగ్రహించుచువహ్నిసంయోగము చేనెండుకర్రవలెభస్మమైపోవును పునరుత్పత్తినిబొందకబోయీని॥ ౧౮౮॥

మూ॥ హిరణ్యమాయు రన్నంచ గౌర్భూశ్చా ప్యోషత స్తనుమ్ ।
అశ్వశ్చక్షు స్త్వచం వాసో ఘృతం తేజ స్తిలాః ప్రజాః॥౧౮౯॥

అవిద్వాంసుడు ప్రతిగ్రహించెనేని భూమిన్ని గోవున్ను శరీరమును దహించును అశ్వము నేత్రహానినిజేయును సువర్ణము నన్నమున్ను నాయువును క్షీణింపజేయును వస్త్రముత్వగ్రోగమును జేయును ఘృతము తేజస్సును బోగొట్టును తిలలు సంతతికి నష్టము జేయును॥ ౧౮౯॥

మూ। అతపా స్త్వనధీయానః ప్రతిగ్రహ రుచిర్ద్విజః । అంభస్య
శ్మప్లవేనేవ సహ తేనైవమజ్జతి॥ ౧౯౦॥

తపస్సు నధ్యయనమును లేని బ్రాహ్మణుడు ప్రతిగ్రహమం దాసక్తుడయ్యేనేని ప్రతిగ్రహముగాకున్నను బుద్ధిస్థప్రతిగ్రహరుచిచేత నే యర్థము అట్టివాని కనగా న నరకమునకు దాన మిచ్చుట వలన బుట్టిన పాపముగల దాతతో గూడ నరకమందుబడును రాయి తెప్పగాజేసి జలమునుదాట నిచ్ఛయించినవాడా రాతి తెప్పతో గూడ మునిగి నట్లని దృష్టాంతము॥ ౧౯౦

మూ॥ తస్మా దవిద్వాన్ బిభియా ద్యస్మాత్తస్మా త్ప్రతిగ్రహాత్ ।
స్వల్పకే నాప్యవిద్వాన్హి పంకేగౌరివసీదతి॥ ౧౯౧॥

అవిద్వాంసు డల్పద్రవ్యప్రతిగ్రహము వలననున్ను బ్రతిగ్రహదోషమును బోగొట్టి కొనలేనివాడగుటచే గోవుగొంపిలోబడి లేవలేనట్లు నరకమందు బడును గావునసు వక్ష్యమాణదివ్యతిరిక్తసీసాది నిస్సారవస్తు ప్రతిగ్రహము వలననున్ను భయపడవలెను॥

మూ॥ నవార్యపి ప్రయచ్ఛేత్తు బైడాలవ్రతికే ద్విజే । నబకవ్రతికేవిప్రే నావేదవిది ధర్మవిత్॥ ౧౯౨॥

ప్రతిగ్రహించేడివాని ధర్మమునుజెప్పి దాతకు చెప్పుచున్నాడు కాకాదిజంతువులకు బెట్టి దానినైన బైడాలవ్రతికనకు దగదన్నిద్రవ్యాంతరదానమును నిషేధించుచున్నాడు వారిమాత్రమునేగాదు॥"శ్లో॥ పాషండినోవికర్మస్థా" ననుచోట నతిథిపూజవిషయమై బైడాలవ్రతికునకు సత్కారము వలదనినిషేధించెను యిచ్చటధనమివ్వరాదని నిషేధను గావుననే "విధినాప్యార్జితంద్రవ్య" మని జెప్పగల దు వేదవేత్తగాని వానికి ధర్మజ్ఞుడు ధనము నివ్వరాదని వేదవేత్తసంభవించిన నీనిషేధము॥ ౧౯౨॥

మూ॥ త్రిష్వప్యేతేషు దత్తంహి విధినాప్యర్జితం ధనమ్ । దాతుర్భవత్య నర్థాయ పరత్రా దాతురేవచ॥ ౧౯౩॥

బైడాలవ్రతికాదులగు ముగ్గురికిని న్యాయార్జితమగు ధనమిచ్చిన నాదాతకును ప్రతిగ్రహీతకును పరలోకమందు నరకహేతువుగాన ననర్థము కొరకగుచున్నది॥ ౧౯౩॥

మూ॥ యథాప్లవే నౌపలేన నిమజ్జ త్యుదకేతరన్। తథా నిమజ్జతోధస్తా దజ్ఞాదాత్వ ప్రతీచ్ఛకౌ॥ ౧౯౪॥

పాషాణము పడవగా జేసి జలమును దరిరించుచు నెట్లడుగుబట్టునో దాతృప్రతిగృహీతృవిధుల నెరుగనివా రుభయులునధోగతి పాలగుదురు॥"శ్లో॥అతపాస్త్వనధీయానః"యను దానిచె ప్రతిగ్రహించినవానిని బ్రధానముగ జెప్పె నిచ్చటదాతను బ్రధానమున జెప్పుట వలన పునరుక్తిలేదు॥ ౧౯౪॥

మూ॥ ధర్మధ్వజో సదాలుబ్ధ శ్ఛాద్మికోలోకదంభకః । బైడా

లబ్రవతికోజ్ఞేయో హింస్రస్సర్వాభి సంధికః॥ ౧౯౫॥

ఎదిమంచికి దెలియునట్లు ధర్మమును జేయుటయును తాధర్మాత్ముడని స్వయముగానున్ను పరులచేతనున్ను బ్రకటించువాడు ధర్మము చిహ్నము గలవాడు ధర్మధ్వజియనబడును సంతతమును పరద్రవ్యమందభిలాషముగలవాడు లుబ్ధుడు వ్యాజముచే సంచరించువాడు ధార్మికుడు దాచిన సొమ్ము నపహరించుట మొదలగువాటిచే లోకవంచకుడు లోకదంభకుడు పరులను హింసించెడు శీలముగలవాడు హింస్రుడు పరులగుణములయంద సహనము గలుగుటచే పరులనాక్షేపించెడువాడు సర్వాభిసంధకుడు ఇట్టివాడు బిడాలవ్రతికుడనిపించుకొనును పిల్లి యెలుకను బట్టుటకు బహునియతిగానుండును గాన బిడాలవ్రతికశబ్ద మాపచారికము॥౧౯౫॥

మూ॥ అధోదృష్టి ర్నైష్కృతిక స్స్వార్థసాధన తత్పరః । శఠో మిథ్యా వినీతశ్చ బకవ్రతచరో ద్విజః॥ ౧౯౬॥

తనవినయము బ్రతకించుటకు క్రిందిచూపుగలవాడు నైష్ఠుర్యముచే సంచరించెడువాడు పరులకార్యమును బోగొట్టుటచే తనకార్యమును నెరవేర్చుకొనువాడు వంకరచేష్టలుగలవాడు అబద్ధపు వినయముగలవాడు ఇట్టిద్విజుడు బకమనగా కొంగ దాని భంగిగుణముగలవాడుగావున బకవ్రతచరుడని గౌణార్థము తరుచుగా కొంగ ధ్యానించుచున్నట్లు చేపకొరకై కనుపెట్టి యదికనుపడగానే మ్రింగునట్టిగుణముగలవాడు॥ ౧౯౬॥

మూ॥ యేబకవ్రతినో విప్రా యేచమార్జారలింగనః । తేపతంత్యంధతామిస్రే తేన పాపేనకర్మణా॥ ౧౯౭॥

యేబ్రాహ్మణులు బకదచరులును బైడాలవ్రతికులు నగుచున్నారో వారలంధతామిస్రమను నరమందా పాపముచే బడుచున్నారు॥ ౧౯౭॥

మూ॥ నధర్మస్యాపదేశేన పాపంకృత్వా వ్రతంచరేత్ । వ్రతేన పాపం ప్రచ్ఛాద్య కుర్వన్ స్త్రీశూద్ర దంభనం॥ ౧౯౮॥

ధర్మమనెడుమిషచే పాపముజేయువానికి ప్రాయశ్చిత్తము జేసెదననుచు ప్రాజాపత్యాదిరూపమగు నిష్కృతిజేసి యావ్రతముచే పాపమునాచ్ఛాదించి ధర్మార్థమిట్లుజేయుచున్నానని స్త్రీలను మూర్ఖులనజ్ఞులను శూద్రులను వంచించుచుం

డరాదు॥ ౧౯౮॥

మూ॥ ప్రేత్యేహచేదృశావిప్రా గర్హ్యంతే బ్రహ్మవాదిభిః। ఛ
ద్మనాచరితంయచ్చ వ్రతంరక్షాంసి గచ్ఛతి॥ ౧౯౯॥

ఇట్టిబ్రాహ్మణులున్నప్పుడున్ను చనిపోయినపిమ్మటనున్ను బ్రహ్మవాదులచే నిందింపబడుచున్నారు మాయచేజేయువ్రతము రాక్షసప్రీతికగును॥ ౧౯౯

మూ॥ అలింగీలింగివేషేణ యోవృత్తి ముపజీవతి। సలింగినాం హ
రత్యేన స్తిర్యగ్యోనౌచ జాయతే॥ ౨౦౦॥

బ్రహ్మచారిగాని బ్రాహ్మణుడు బ్రహ్మచారిచిహ్నములగు మేఖలాజిన దండాదికమునుధరించి వృత్త్యర్థమై భిక్షాచరణాదికముజేసి బ్రదుకునతండా బ్రహ్మచార్యాదులయొక్క పాపముబొందును శునకాది తిర్యగ్యోనులందుబుట్టునుగాన నట్లు జేయరాదని నిషేధముకల్పించబడెను॥ ౨౦౦॥

మూ॥ పరకీయనిపానేషు నస్నాయాచ్చ కదాచన। నిపానకర్తుః
స్నాత్వాతు దుష్కృతాంశేన లిప్యతే॥ ౨౦౧॥

పరులచేజేయబడిన తటాకాదికమందు స్నానముజేయరాదు జేసెనేని యాపుష్కరిణ్యాదులను జేయించినవాని పాపాంశముననగా వక్ష్యమాణమగు నాలుగవ పాలునొందును దేవఖాతనద్యాదులు సంభవించనిచో పరకృతజలాధారములతో నుంచి నైదుమంటిముద్దలుదీసి పైనివేసిస్నానముజేయవలయును॥శ్లో॥"పంచపిండాననుద్ధృత్యనస్నాయాత్పరవారిషు। ఉద్ధృత్య చతురఃపిండాన్ పారక్యే స్నానమాచరేత్॥స్నాత్వాతుతర్పయేద్దేవాన్ పితౄనపి విశేషతః"॥పరులు తీయించిన జలాధారమందు నయిదుగాని నాలుగుగాని మట్టిముద్దలపైని పారవేసి స్నానముజేసి దేవర్షిపితృతర్పణములను జేయవలయును॥ ౨౦౧॥

మూ॥ యానశయ్యాసనాన్యస్య కూపోద్యానగృహాణిచ। అదత్తా
న్యుపభుంజాన ఏనసస్స్యాత్తురీయభాక్॥ ౨౦౨॥

పరులయొక్క యానములు శయ్యలు నూతులు ఉద్యానవనములు గృహములు హక్కుదారులయనుమతిలేక ననుభవించినవాడా యజమానునిపాపములో నాలవ

పాంసూనాంచను "ఆదత్తాని" యనుటచే నందరినిమిత్తముగా నుత్సృష్టములగు మఠకూపాదులయందు స్నానాదులచే నుపయోగపరుచుకొనినవారికి దోషములేదు॥

మూ॥ నదీషు దేవఖాతేషు తటాకేషు సరస్సుచ। స్నానం సమాచ
రేన్నిత్యం గర్తప్రస్రవణేషుచ॥ ౨౦౩॥

నదులయందును దేవఖాతములగు తటాకములందును సరస్సులందును గర్తములందును సెలయేరులందును నిత్యమును స్నానముజేయవలయును. శ్లో॥ "ధనుస్సహస్రాణ్యష్టౌచ గతిర్యాసాం నవిద్యతే। నతానదీశబ్దవహా గర్తాస్తాః పరికీర్తితాః ఇతి" నాలుగుమూరలపొడవు ధనుఃప్రమాణము అట్టి ధనుస్సులెనిమిదివేలు కొలగల దానికి తక్కువగానుండునవి నదులుగావు గర్తములనియందురు దీనిచే పరకీయోదకాధారముల వ్యావృత్తియగుచునుండిన నిట్లుమరలదిచెప్పుటవలన స్వకృత తటాకాదులందు స్నానార్థమని పునరుక్తిలేదు యదియునునద్యాద్యసంభవమందని తెలియవలయును॥ ౨౦౩॥

మూ॥ యమాన్ సేవేత సతతం ననిత్యం నియమాన్ బుధః। య
మాన్ పతత్యకుర్వాణో నియమాన్ కేవలాన్భజన్॥ ౨౦౪॥

సర్వదా యమములను సేవించవలెనుగాని నియమములనక్కరలేదు నియమములనుమాత్రముజేయుచు యమములను విడిచెనేని పతితుడగుననగా యమభజనగౌరవార్థమీవచనము నియమనిషేధార్థముగాదు యమములనగా॥ శ్లో॥ "బ్రహ్మచర్యం దయా క్షాంతిర్ధ్యానం సత్యమకల్కతా। అహింసాఽస్తేయమాధుర్యే దమశ్చేతి యమాస్స్మృతాః"॥ బ్రహ్మచర్యమున్ను దయయున్ను సహనమున్ను ఈశ్వరధ్యానమున్ను సత్యమున్ను మాలిన్యములేకుండుట హింసాభావము చౌర్యములేకుండుట మధురముగమాటలాడుట ఇంద్రియనిగ్రహము నివియమములని జెప్పబడెను. శ్లో॥ "స్నానం మౌనోపవాసేజ్యాస్వాధ్యాయోపస్థనిగ్రహాః। నియమా గురుశుశ్రూషా శౌచాక్రోధాప్రమాదతా ఇతి" స్నానము మౌనము ఉపవాసము యజ్ఞము స్వాధ్యాయము కామనిగ్రహము గురుసేవ శౌచము క్రోధములేకుండుట యప్రమాదము యివి నియమములని యాజ్ఞవల్క్యులు ఈయమనియమజ్ఞానముచే ఒకప్పుడు స్నానాదినియమములులేకుండినను యమములనువిడువరాదని తాత్పర్యము ఇచ్చట హింసాదిప్రతిషేధార్థకములు యమములు॥ "శ్లో॥ వేదమేవజపేన్నిత్య" మిత్యాద్యనుష్ఠేయరూపములు నియమములని

చెప్పిరి॥"శ్లో॥అహింసాసత్యవచనం బ్రహ్మచర్యమకల్కతా।అస్తేయమితిపంచైతేయ
మావై పరికీర్తితాః॥ అక్రోధో గురుశుశ్రూషా శౌచమాహారలాఘవం।అప్రమా
దశ్చసతతం పంచైతేనియమాస్స్మృతాః॥" అని మేధాతిథిగోవిందరాజులువ్రాసిరి॥

మూ॥ నాశ్రోత్రియ తతేయజ్ఞే గ్రామయాజికృతే తథా। స్త్రి
యాక్లీబేనచహుతే భుంజీత బ్రాహ్మణఃక్వచిత్॥ ౨౦౫॥

శ్రోత్రియుడుకానివాడనగా వేదమురానివాడును బహుమందికి యాజకుడగువాడును స్త్రీలును నపుంసకుడునుజేసెడు యజ్ఞములందగ్నిహోమీయ పశుయాగానంతరమందు భోజనయోగ్యమగునప్పుడైనను బ్రాహ్మణుడుభుజించగూడదు॥౨౦౫

మూ॥ అశ్లీకమేతత్సాధూనాం యత్రజుహ్వత్యమీహవిః। ప్రతీప
మేతద్దేవానాం తస్మాత్తత్పరివర్జయేత్॥ ౨౦౬॥

పైనిజెప్పినబహుయాజకులుమొదలగువారుజేసెడు యాగములు సాధుజనులకశ్లీకమనగాన శ్రీకమనియర్థము ఈహవిస్సుదేవతలకు ప్రతికూలము గావున వీరిచే హోమాదికముజేయించరాదు॥ ౨౦౬॥

మూ॥ మత్తక్రుద్ధాతురాణాంచ నభుంజీత కదాచన। కేశకీటా
వపన్నంచ పదాస్పృష్టంచ కామతః॥ ౨౦౭॥

మత్తులయొక్కయు కోపముపడినవారియొక్కయు రోగులయొక్కయుకేశము చేతను పురుగులచేతనున్న దుష్టమైనట్టియు నిచ్ఛచేపదమున మెట్టినట్టియు నన్నము నెప్పుడునుదినరాదు॥ ౨౦౭॥

మూ॥ భ్రూణఘ్నావేక్షితంచైవ సంస్పృష్టంచాప్యుదక్యయా। ప
తత్రిణావలీఢంచ శునాసంస్పృష్టమేవచ॥ ౨౦౮॥

భ్రూణహత్యచేసినవానిచే ననునది యుపలక్షణముచే గోఘ్నాదులచే జూడబడినట్టియు రజస్వలా స్త్రీచే స్పృశించబడునట్టియు కాకాదిపక్షులచే దినబడినట్టియు శునకముచేముట్టబడినట్టియు నన్నముదినగూడదు॥ ౨౦౮॥

మూ॥ గవాచాన్న ముపఘ్రాతం ఘుష్టాన్నంచ విశేషతః। గణా
న్నం గణికాన్నంచ విదుషాంచ జుగుప్సితం॥ ౨౦౯॥

గోవుచే నాఘ్రాణించబడిన యన్నమున్ను సత్త్రాదులలో నెవరుభుజించెదరోటివా రొకరుండో యనిఘోషించిపెట్టెడియన్నమును విశేషించి యనుట నీయన్నము నుతినిన పాపముచ్చిత్తగౌరవమని జెప్పుటశఠులగు బ్రాహ్మణులు పెద్దగాతి యొక పాకము గాజేసిన యన్నమున్ను వేశ్యయొక్కయన్నమున్ను విద్వాంసులచే జుగుప్సితమగు నన్నమున్ను దినరాదు॥ ౨౦౯॥

మూ॥ స్తేనగాయకయోరన్నం తక్ష్ణోవార్ధుషికస్యచ । దీక్షిత
స్యకదర్యస్య బద్ధస్య నిగదస్యచ॥ ౨౧౦

చోరునియొక్కయు గాయకునియొక్కయు చెక్కడపుపనిచే జీవించెడి వానియొక్కయు వృద్ధిచేజీవించెడివానియొక్కయు నిగళబద్ధుడగువానియొక్కయు నన్నమునుదినరాదు మరియు సంకెళ్ళచేబద్ధుడైనవానియొక్కయు యజ్ఞార్థదీక్షితునియొక్కయునగ్నిషోమీయముకంటెలోపున కృపణునియొక్కయునన్నమును దినరాదు ఇచ్చట గోవిందరాజుబద్ధస్యయనుచో బంధనములేకున్నను మున్నుసంకెళ్లు వేయబడినవాడని వ్యాఖ్యానముచేసెను॥ ౨౧౦॥

మూ॥ అభిశస్తస్య షండస్య పుంశ్చల్యాదాంభికస్యచ । శుక్తం
పర్యుషితంచైవ శూద్రస్యోచ్ఛిష్టమేవచ॥ ౨౧౧॥

ఎవనిమహాపాతకునిగా బహుమంది ప్రకటింతురో వానియన్నమున్ను నపుంసకునియొక్కయు గణికగాని జారిణియొక్కయు డంభముచేసెడు వానియొక్కయు నకైతవ బాలవ్రతికాదులయొక్కయు నన్నమును దినరాదు స్వభావముచే మధురమైన ద్రవ్యాంతరమునుగలసి పులిసినది శుక్తమనదగ్గదియగును నిన్నయును తొలినాటిది మరునాటికియుంచినది పర్యుషితమనదియు శూద్రునియొక్కయు గురువుదప్ప నెవ్వరైన దినగా మిగిలినది యుచ్ఛిష్టమనియును దినరాదు-గోవిందరాజు "శూద్రస్యోచ్ఛిష్ట మేవచ" యనుదానికి శూద్రుడు దినగా మిగిలినదిబిండెలోనున్న యన్నమైన దినరాదనివ్యాఖ్యానముజేసెను॥ ౨౧౧॥

మూ॥ చికిత్సకస్యమృగయోః క్రూరస్యోచ్ఛిష్టభోజనః । ఉగ్రాన్నం
సూతికాన్నంచ పర్యాచాంతమనిర్దశం॥ ౨౧౨॥

వైద్యముచే బ్రతికెడి వానియొక్కయు జీవనార్థమై మాంసమమ్ముకొనుటకు

మృగవధ జేయువానియొక్కయు సన్న్యాసియొక్కయు సిద్ధములగు నుచ్ఛిష్టములను దినెడువానియొక్కయు నన్నమును దినరాదు ఉగ్రుడనగా దారుణ కర్మములు జేయువాడు వానియన్నమున్ను దినరాదు ప్రసవమైన స్త్రీనుద్దేశించిపది దినములలో బెట్టినయన్నము శత్రువులయన్నము దినరాదు ఏకపఙ్క్తియందు నన్యుల నవమానించి వేయన్నము దినబడదగునుండ నొకడాచమించునది పర్యాచాంతను నుంపతొందరు భుజించిలేచి యాచమనమొనర్చినపిమ్మట నాయన్నము దినరాదు పదిరోజులలో పురిటివాళ్లయన్నమిదినుందు జెప్పినదిన్ని దినరాదు-గోవిందరాజు ఉగ్రుడనగా రాజనివ్రాసె నందుకు కుల్లూకభట్టాక్షేపించి వ్రాసిన శ్లోకను॥ "శ్లో॥ గోవిందరాజో మంజర్యా ముగ్రం రాజాననుక్తవాన్ । అనువృత్త్యాచ శూద్రాయాం క్షత్రియోత్పన్నభ్యధాత్॥ భేదో క్తైర్యాజ్ఞవల్క్యోమె నోగ్రోరాజేతివావదత్। ఆశ్చర్యమిదమేతస్య స్వకీయహృదిభూషణం॥" గోవిందరాజు మంజరియను దనవ్యాఖ్యానమందుగ్రుడనగా రాజనిచెప్పెనుతోడుతోనే క్షత్రియునకుశూద్రస్త్రీయందు బుట్టినవాడైనాయనిన్ని వ్రాసెను యాజ్ఞవల్క్యశాస్త్రమందు భేదోక్తి ఉగ్రుడనగా రాజుగాడనిచెప్పెను అట్టిమిదియతని హృదయమందలంకారమాయెనని॥ ౨౧౨॥

మూ॥ అనర్చితంవృథామాంస మవీరాయాశ్చయోషితః । ద్విషదన్నంనగర్యన్నం పతితాన్నమవక్షుతం॥ ౨౧౩॥

అవమానించి గసరుచుబెట్టిన యన్నమున్ను దేవపిత్రుకార్యములందుగానిమాంసమున్ను అవీరయనగా పతిపుత్రహీనురాలగు స్త్రీ దానియన్నమున్ను శత్రునియన్నమున్ను నగర్యన్నము పతితునియన్నము వేయన్నముపైని తుమ్మునో యాయన్నమున్ను దినరాదు॥ ౨౧౩॥

మూ॥ పిశునానృతినోశ్చాన్నం కతువిక్రయిణస్తథా। శైలూషతున్నవాయాన్నం కృతఘ్నస్యాన్నమేవచ॥ ౨౧౪॥

కొండెము జెప్పెడువాడు కూటసాక్ష్యాద్యనృతవాదియజ్ఞఫలము నమ్ముకొనినవాడు నటుడు కుట్టుపనివాడు ఉపకారికపకారకర్తకృతఘ్నుడు వీరలయన్నమును దినరాదు॥ ౨౧౪॥

మూ॥ కర్మారస్యనిషాదస్య రంగావతారకస్యచ। సువర్ణకర్తుర్వై

ణస్య శస్త్రవిక్రయిణ స్తథా॥ ౨౧౫॥

లోహకారుడు నిషాదుడు నటగాయనవృత్తిచే జీవించువాడు బంగారు పనివాడు వెదుళ్లుబద్దలుకొట్టుకొనియమ్ముకొనిబ్రతికెడువాడు శస్త్రముననగానినను దానినమ్ముకొనెడువాడు వీరియన్నము దినరాదు॥ ౨౧౫॥

మూ॥ శ్వవతాంశౌండికానాంచ చేలనిర్ణేజకస్యచ । రంజకస్య నృశంసస్య యస్యచోపపతిర్గృహే॥ ౨౧౬॥

వేటనిమిత్తమై కుక్కలను బెంచువాడు కల్లమ్మువాడు చాకలివాడు వస్త్రములకు కుసుంబాదిరంగులను వేసెడువాడు దయలేనివాడు తనకుదెలియకుండ జారపురుషుడింటనుండినవాడు వీరలయన్నమును దినరాదు॥ ౨౧౬॥

మూ॥ మృష్యంతియేచోపపతిం స్త్రీజితానాంచసర్వశః। అనిర్దశంచప్రేతాన్న మతుష్టికర మేవచ॥ ౨౧౭॥

తనగృహమందున్న భార్యాజారుని యెరిగియు సహించిన వాని యన్నము దినరాదు దీనిచే బహిష్కృతురాలగు భార్యయొక్క జారునిసహించినవానియొక్క యన్నమునకు దోషములేదు అన్నిపనులయందు స్త్రీపరతంత్రుల యన్నము పది దినములు దాటకుండిన ప్రేతాన్నమును నతుష్టికరమగు నన్నమును దినరాదు॥

మూ॥ రాజాన్నం తేజ ఆదత్తే శూద్రాన్నం బ్రహ్మవర్చసం। ఆయుస్సువర్ణకారాన్నం యశశ్చర్మావకర్తినః॥౨౧౮॥

రాజాన్నము తేజస్సును శూద్రాన్నము బ్రహ్మవర్చస్సును బంగారు పనివాని యన్నమాయుస్సును చర్మకారుని యన్నముఖ్యాతినిన్ని నశింపజేయును ఇట్లుఫల ప్రదర్శనముచే తత్తదన్నముల నిషేధములను కల్పించవలెను॥ "శ్లో॥ నాద్యాచ్ఛూద్రస్యపక్వాన్న"మనుచుముందు నిషేధించగలడందు కిదిఫలముగా జెప్పబడెను॥

మూ॥ కారుకాన్నం ప్రజాం హంతి బలంనిర్ణేజకస్యచ। గణాన్నంగణికాన్నంచ లోకేభ్యః పరికృంతతి॥ ౨౧౯॥

సూపకారాదుల యన్నము సంతతినిన్ని నిర్ణేజకునియన్నము బలమును గణగణికాన్నములు పుణ్యలోకములను నశింపజేయును॥ ౨౧౯॥

మూ॥ ప్రాయం చికిత్సకస్యాన్నం పుంశ్చల్యా స్త్వన్నమింద్రియమ్ ।
విష్ఠావార్ధుషికస్యాన్నం శస్త్రవిక్రయిణోమలమ్॥ ౨౨౦॥

చికిత్సకుని యన్నము దినిన పూయభక్షణదోషము నొందును జారిణియన్నము దినిన శుక్లముభక్షించిన దోషమగును వడ్డి బేరగాని యన్నము విష్ఠాసమమది దినిన దోషమగును లోహమునమ్మికొనిన వానియన్నము దినిన మలమనగా విష్ఠావ్యతిరిక్తశరీరమలికము దినిన దోషము నొందును ఇచట-గోవిందరాజుపూయాదులను భక్షించు జాతులయందు బుట్టునని చెప్పెను॥ ౨౨౦॥

మూ॥ య ఏభ్యోఽన్యేత్వభోజ్యాన్నాః క్రమశః పరికీర్తితాః। తే
షాంత్వగస్థి రోమాణి వదంత్యన్నం మనీషిణః॥ ౨౨౧॥

ఈచెప్పబడిన వారికంటె నితరులగు నిషిద్ధాన్నులయొక్క యన్నము దినెనేని వానివానియొక్క చర్మము నెముకలు రోమములు దినినదోషమునొందును॥ ౨౨౧॥

మూ॥ భుక్త్వాఽతోఽన్యతమస్యాన్నమమత్యా క్షపణం త్ర్యహం ।
మత్యాభుక్త్వాచరేత్కృచ్ఛ్రం రేతోవిణ్మూత్రమేవచ॥ ౨౨౨॥

ఈచెప్పబడిన వారిలో నెవ్వరిదేని యన్నమునెరుక లేక దినిన త్రిదినోపవాసము జేయవలయును జ్ఞానపూర్వకముగదినిన కృఛ్రముజేయవలయును ఈలాగుప్రాయశ్చిత్తము సంసర్గదుష్టమగు కేశకీటావపన్నాదికమున్ను కాలదుష్టమగుపర్యుషితాన్నాదులకున్ను నిమిత్తదుష్టములగు ఘుష్టాదులకును నీప్రాయశ్చిత్తములేదు ఒక ప్రకరణములో జెప్పడమున్ను వీరికి స్నాతకవ్రతలోప ప్రాయశ్చిత్తమునకై జ్ఞాపకార్థము వీటికి ప్రాయశ్చిత్తము పదొకొండవ యధ్యాయమందు జెప్పగలదు అన్నింటికి నిదే ప్రాయశ్చిత్తమేమైనన్నైతె "భుక్త్వాఽతోఽన్యతమస్యాన్నమదుష్ట" మనె చెప్పును అన్యతమునియొక్క-యేయని చెప్పకపోవును గావున నొకప్రకరణను వలన మేధాతిథి ప్రాయశ్చిత్తమిది యుక్తమె శుక్తాదుల యందు సుందరముగాదని చెప్పెను ఆప్రకరణమందు ప్రాయశ్చిత్తను జెప్పడములాఘవార్థము అచ్చట వ్యాఖ్యచేసెడిచో మత్తాదులను మరల జెప్పవలసివచ్చును॥ ౨౨౨॥

మూ॥ నాద్యాచ్ఛూద్రస్య పక్వాన్నం విద్వానశ్రాద్ధినోద్విజః।ఆద
దీతామమేవాస్మాదవృత్తావేకరాత్రికం॥ ౨౨౩॥

విశేషములేకుండ నిషిద్ధమగు శూద్రాన్నము నిప్పుడు దానివిశేషముగూడ జెప్పు చున్నాడు శ్రాద్ధాదిపంచయజ్ఞరహితుడగు శూద్రునిపక్వాన్నమును శాస్త్రవేత్త యగు ద్విజుడు తినరాదు మరేమంచేనన్నాంతరములేనప్పుడొకరాత్రికి మాత్రమా మముబుచ్చికొనవచ్చును పక్వాన్నముగూడదు॥ ౨౨౩॥

మూ॥ శ్రోత్రియస్య కదర్యస్య వదాన్యస్యచవార్ధుషేః। మీమాంసిత్వోభయం దేవా స్సమమన్నమకల్పయన్॥ ౨౨౪॥

ఒకడు వేదము చదివినవాడుగాని కృపణుడు మరొకడు దాతయు వృద్ధిజీవియు నీయన్నము గుణదోషతారతమ్యమునరసి దేవతలు వీరలయన్నమును సమమనినిర్ణయించిరి॥ ౨౨౪॥

మూ॥ తాన్ప్రజాపతిరాహైత్య మాకృధ్వంవిషమం సమం। శ్రద్ధాపూతంవదాన్యస్య హతమశ్రద్ధయేతరత్॥ ౨౨౫॥

ఆదేవతలనుగూర్చి బ్రహ్మవచ్చిపలికెను విషమమగుదానిని సమముగ జేయవలదు విషమసమీరణముచితనుగాదు మరియీరెంటిలో విశేషమేమనిన బ్రహ్మ చెప్పుచున్నాడు దానశీలుడగువార్ధుషికునియన్నము శ్రద్ధచేపవిత్రమగుచున్నది కృపణునియన్నమశ్రద్ధచేదూషితముగానధమము మున్నురెంటికిన్ని నిషేధము ప్రాప్తమగుచుండినప్పటికిని శ్రద్ధచే దత్తమగువిద్వద్వార్ధుషికునియన్న శుద్ధినిబోధించుచున్నదీవచనము॥ ౨౨౫॥

మూ॥ శ్రద్ధయేష్టంచ పూర్తంచ నిత్యంకుర్యాదతంద్రితః। శ్రద్ధాకృతేహ్యక్షయే తే భవతస్స్వాగతైర్ధనైః॥ ౨౨౬॥

అదిగావుననే చెప్పుచున్నాడు ఇష్టమనగా నంతర్వేదికమగు యజ్ఞాదికము పూర్తమనగా తటాకకూపతటాకారామాదిస్థాపనము ఈరెంటినలసుడు గాకుండననుష్ఠించవలయుననగా శ్రద్ధాయుక్తముగ న్యాయార్జితద్రవ్యముచే నైహికాముష్మికఫలాపేక్ష లేకుండంజేసిన నక్షయమగు మోక్షమునకవియగును॥ ౨౨౬॥

మూ॥ దానధర్మం నిషేవేత నిత్యమైష్టికపౌర్తికం। పరితుష్టేనభావేన పాత్రమాసాద్య శక్తితః॥ ౨౨౭॥

దానధర్మమున్ను ఇష్టాపూర్తములున్ను విద్యాతపోయుక్తుడగు బ్రాహ్మణుడు సంభవించునపుడెల్లప్పుడును ఖరీతుష్టాంతఃకరణుండగుచు యథాశక్తిగా జేయవలయును॥ ౨౨౭॥

మూ॥ యత్కించిదపి దాతవ్యం యాచితేనానసూయయా । ఉత్పత్స్యతేహి తత్పాత్రం యోతారయతి సర్వతః॥ ౨౨౮॥

యాచింపబడి పరులగుణములయందు మాత్సర్యము లేనివాడై యెంతమాత్రమన్నమైననొసగవలయును దానశీలున కొకానొకప్పుడు తనసమస్తపాపఫలరూపనరకములవల్ల నుద్ధరించదగిన పాత్రభూతుడు సంభవించును॥ ౨౨౮॥

మూ॥ వారిదస్తృప్తిమాప్నోతి సుఖమక్షయ మన్నదః । తిలప్రదః ప్రజామిష్టాం దీపదశ్చక్షురుత్తమం॥ ౨౨౯॥

జలమునిచ్చినవాడు క్షుత్పిపాసలులేని తృప్తినిబొందు నన్నదాత యక్షయ సుఖమునొందును తిలలనిచ్చువాడు తనకిష్టమగు సంతానముగలవాడగును దేవ బ్రాహ్మణాదులకుపయోగముగ దీపంబిడినవాడు త్తమములగు చక్షుస్సుల నొందును॥

మూ॥ భూమిదోభూమి మాప్నోతి దీర్ఘమాయు హిరణ్యదః। గృహదోగ్ర్యాణి వేశ్మాని రూప్యదోరూపముత్తమం॥ ౨౩౦

భూదాతభూపతియగును సువర్ణమునిచ్చువాడు దీర్ఘాయుష్యము నొందును గృహప్రదుడు మంచిగృహములుగలవాడగును వెండినిచ్చినయతం డందరికంటె నెక్కుడు సౌందర్యముగలవాడగును॥ ౨౩౦॥

మూ॥ వాసోదశ్చంద్రసాలోక్య మశ్విసాలోక్యమశ్వదః । అనడుత్ప్రదశ్శ్రియం పుష్టాం గోదోబ్రధ్నస్య విష్టపం॥ ౨౩౧॥

వస్త్రదాత చంద్రలోకమును గుర్రమునిచ్చినవా డశ్వినీదేవతలలోకమును యెద్దునిచ్చేనేని సంపూర్ణమగుసంపత్తిని గోవునిచ్చినయతండు సూర్యలోకమును బొందును॥ ౨౩౧॥

మూ॥ యానశయ్యా ప్రదోభార్యా మైశ్వర్య మభయప్రదః। ధా

న్యదశ్వాన్వతంసౌఖ్యం బ్రహ్మదో బ్రహ్మసాష్టితాం॥౨౩౨॥

రథాదియానములు శయ్యలు నొసగినవానికి భార్యాలాభమగును ప్రాణులక భయమిచ్చువతడు ప్రాణిహింసచేయనివాడు గొప్పనైశ్వర్యమును బొందును ధాన్యముననగా శాలియవగోధూమాదుల నిచ్చువాడు శాశ్వతసుఖమునొందును వేదమును జెప్పినను తదర్థమును దెలిపినను బ్రహ్మలోకముననగా ముక్తుడగును॥౨౩౨॥

మూ॥ సర్వేషామేవ దానానాం బ్రహ్మదానం విశిష్యతే। వార్యన్న
గోమహీవాస స్తిలకాంచన సర్పిషాం॥ ౨౩౩॥

అన్నోదక గోమహీతిలకాంచనాది దానములేవిగలవో వీటిన్నింటిలోను వేద దానముత్కృష్టఫలప్రదమగు నుత్తమము॥ ౨౩౩॥

మూ॥ యేనయేనతు భావేన యద్యద్దానం ప్రయచ్ఛతి। తత్తత్తేనై
వభావేన ప్రాప్నోతి ప్రతిపూజితః॥ ౨౩౪॥

ఎవడు యేయే అభిప్రాయముచే స్వర్గాద్యపేక్షచేగాని ముముక్షువై లేని షాంఛమనచేగాని యేదియేది దానముజేయునో యాభావముచే నాయాయి దానములఫలముగా జన్మాంతరమందు పూజితుడై దాని దానిబొందును॥ ౨౩౪॥

మూ॥ యోఽర్చితం ప్రతిగృహ్ణాతి దదాత్యర్చితమేవచ। తావుభౌ
గచ్ఛతస్స్వర్గం నరకంతు విపర్యయే॥ ౨౩౫॥

ఎవడు పూజాపూర్వకముగ నిచ్చునో పూజాపూర్వకమగుదాని నెవడు ప్రతిగ్రహించునో వారుభయులును స్వర్గమునుబొందుదురు అట్లుగాకున్న నరకగాములగుదురు పురుషార్థవిషయమై యనర్చితమునే బ్రతిగ్రహించెదనని నియమముజేసెనేని మంచిదే దీనితోవిరోధించదు॥ ౨౩౫॥

మూ॥ నవిస్మయేత తపసా వదేదిష్ట్వాచ నానృతం। నార్తోఽప్య
పవదే ద్విప్రాన్ నదత్వా పరికీర్తయేత్॥ ౨౩౬॥

చాంద్రాయణాది తపస్సులొనర్చి యిట్టిదుష్కరమగు తపమునే జేసితినని యాశ్చర్యపడరాదు యజ్ఞమొనర్చి యనృతమాడరాదు మున్ననృతమాడరాదని పురుషార్థమునకై నిషేధమయినదగుచుండనిది యజ్ఞార్థమాపునర్నిషేధము బ్రా

హ్మణులచేపీడితుడైనను వారలనిందించరాదు. దానాదిదానములొనరిచి యొకనితో చెప్పిపొగుడుకొనగూడదు॥ ౨౩౬॥

మూ॥ యజ్ఞోఽనృతేన క్షరతి తపః క్షరతి విస్మయాత్। ఆయుర్విప్రాపవాదేన దానంచ పరికీర్తనాత్॥ ౨౩౭॥

యజ్ఞమనృతముచే నశించుననగా సత్యముచేతనే ఫలించును ఇట్లు తపోదానంబులును విస్మయముచే తపంబునుపొగుడుకొనుటచే దానమును బ్రాహ్మణునిపై నపవాదబెట్టుటచే నాయువునుక్షయించును॥ ౨౩౭॥

మూ॥ ధర్మంశనైః సంచినుయా ద్వల్మీకమివ పుత్తికాః। పరలోకసహాయార్థం సర్వభూతాన్యపీడయన్॥ ౨౩౮॥

భూతపీడలేకుండ పరలోకసహాయార్థమై ధర్మమును చెదపురుగులు పుట్టబెట్టినట్లు మెల్లమెల్లనగా వృద్ధినొందించవలెను॥ ౨౩౮॥

మూ॥ నాముత్రహి సహాయార్థం పితామాతాచతిష్ఠతః। నపుత్రదారం నజ్ఞాతి ధర్మస్తిష్ఠతి కేవలః॥ ౨౩౯॥

పరలోకమందుసహాయులు తల్లి-తండ్రి- భార్య-పుత్రుడు-జ్ఞాతి వీరెవ్వరునుగారు ధర్మమొకటియె పరలోక సహాయమైయుండును గాన పుత్రాదులకంటె నుపకారియగు ధర్మమునాచరించవలెను॥ ౨౩౯॥

మూ॥ ఏకఃప్రజాయతే జంతు రేకఏవ ప్రలీయతే। ఏకోఽనుభుంక్తే సుకృత మేకఏవచ దుష్కృతం॥ ౨౪౦॥

ప్రాణియొక్కడే పుట్టుచున్నాడు తనతోనందరు బంధువులు పుట్టలేదొకండే చచ్చును సుకృతఫలమగు స్వర్గసుఖమొకడే యనుభవించును దుష్కృతఫలమగునరకమం దొకడేపడును॥ ౨౪౦॥

మూ॥ మృతంశరీర ముత్సృజ్య కాష్ఠలోష్ఠసమంక్షితౌ। విముఖాబాంధవాయాంతి ధర్మ స్తమనుగచ్ఛతి॥ ౨౪౧॥

మృతకళేబరమును కాష్ఠలోష్ఠాదికమువలె నిశ్చేతనమగుదాని విడచి పరాఙ్ముఖులై బంధువులువెళ్ళిపోదురు ధర్మమునుమాత్రము మృతజీవునితో గూడ జనును॥

మూ॥ తస్మాద్ధర్మం సహాయార్థం నిత్యం సంచినుయాచ్ఛనైః।
ధర్మేణహి సహాయేన తమస్తరతి దుస్తరం। ౨౪౨॥

ధర్మసహాయముచే దుస్తరమైన నరకము నతిక్రమించును గాన ధర్మసహాయార్థమై నిత్యమున్ను మెల్లమెల్లగ ధర్మమును వృద్ధిఁబొందించవలయును॥

మూ॥ ధర్మప్రధానం పురుషం తపసాహతకిల్బిషమ్। పరలో
కంనయత్యాశు భాస్వంతం ఖశరీరిణం। ౨౪౩॥

ప్రాజాపత్యాదితపస్సుచేత పోయిన పాపములు గల ధర్మప్రధానుఁడగు పురుషుని నిష్పాపుఁడగుటచే దీప్తిమంతునిగానున్ను బ్రహ్మస్వరూపునిగాను పొందిన ప్రఖ్యాతముగు ధర్మము శీఘ్రముగ పరలోకము నొందించును వినాశించగా లింగశరీరముతోఁ జను జీవుఁడు బ్రహ్మాంశస్వరూపుఁడు గావున ఖశరీరియనఁగా। "శ్రు॥ ఖంబ్రహ్మే" యనెడు శ్రుతిచే ఖశబ్దము బ్రహ్మార్థకమగుట వలన బ్రహ్మస్వరూపుఁడనుట యుక్తమేను॥ "శ్లో॥ నహి వేదాస్త్వధీతాశ్చ శస్త్రాణి వివిధానిచ। తత్రగచ్ఛంతి యత్రాసౌ ధర్మ ఏకోనుగచ్ఛతి॥ ౨౪౩॥

మూ॥ ఉత్తమైరుత్తమైర్నిత్యం సంబంధానాచరేత్సహ। నినీ
షుః కులముత్కర్ష మధమానధమాం స్త్యజేత్॥ ౨౪౪॥

తనకులమున నుత్కర్షమును సంపాదించ నిచ్ఛగలిగెనేని విద్యాభిజన్మాదులచే నుత్కృష్టులగు వారితోఁ కన్యాదానాదిసంబంధములు గలుగఁ జేయవలయును నికృష్టవారితో సంబంధములనువిడువవలయునని ఉత్తములతో సంబంధము మంచియని చెప్పుటవలననే యధములవిడుచుట సంభవించగా మరలనేల చెప్పెననిన ఉత్తములు సంభవించనిచోసములతో గావలెననుటకై యధముల విడువుమనుట॥

మూ॥ ఉత్తమానుత్తమాన్గచ్ఛన్ హీనాన్హీనాంశ్చ వర్జయన్।
బ్రాహ్మణ శ్శ్రేష్ఠతామేతి ప్రత్యవాయేన శూద్రతాం॥ ౨౪౫॥

ఉత్తముల సంబంధము వలన బ్రాహ్మణుఁడు శ్రేష్ఠ్యమునుబొందును విపరీతాచారముచేతనున్ను హీనసంబంధముచేతనున్ను జాతితగ్గుట వలన శూద్రతుల్యత సంభవించును॥ ౨౪౫॥

మూ॥ దృఢకారీ మృదుర్దాంతః క్రూరాచారై రసంవసన్ । అ
హింస్రోదమదానాభ్యాం జయేత్స్వర్గం తథావ్రతః॥ ౨౪౬॥

దృఢకారియనగా పట్టినపని కొనముట్టజేసిన యతడున్ను నైష్ఠుర్యము లేని వాడున్ను దమమనిచెప్పుటచే దాంతుడనగా నిచ్చట శీతాతపాదిద్వంద్వములను సహించేవాడున్ను అనిచెప్పవలెను క్రూరాచారములు గలవారితో సాంగత్యము విడిచినవాడున్ను పరహింసచేయనివాడున్ను అట్టివ్రతముగలవాడు దానముచే నింద్రియనిగ్రహముచేతనున్ను స్వర్గమును బొందును॥ ౨౪౬॥

మూ॥ ఏధోదకం మూలఫలమన్నమభ్యుద్యతంచ యత్ । సర్వతః ప్ర
తిగృహ్ణీయా న్మధ్వథా భయదక్షిణామ్॥ ౨౪౭॥

వంటచెరుకు జలము మూలము ఫలము తేనెయివియును యాచించకుండబొ ప్పించిన యన్నమునున్ను అభయదక్షిణనున్ను నందరి వలనను బ్రతిగ్రహించవచ్చును॥ "శ్లో॥ అన్యత్రకులటాషండ పతితేభ్య స్తథా ద్విషఇతి" జారిణి నపుంసకుడు పతితుడు శత్రువు వీరుదప్పనని యాజ్ఞవల్క్యావచనము వలన వీరు దప్పనని దెలియవలయును॥ ౨౪౭॥

మూ॥ ఆహృతాభ్యుద్యతాం భిక్షాం పురస్తా దప్రచోదితామ్ ।
మేనే ప్రజాపతి గ్రాహ్యా మపిదుష్కృతకర్మణః॥ ౨౪౮॥

మున్ను దనచేగాని పరులచేగాని యాచించబడనిదిన్ని దాతచే నీకిదియివ్వబడునని నిర్ణయించబడనిదిన్ని దాన మిచ్చుచోటికి దెచ్చి యాభిముఖ్యముగ నుంచబడిన హిరణ్యాదిభిక్షనన్నము గాని దాని పతితాదులు దప్పనేదుష్కృతులచేనైన నివ్వబడినది గ్రహించవచ్చునని బ్రహ్మాదలచెను॥ ౨౪౮॥

మూ॥ నాశ్నంతి పితర స్తస్య దశవర్షాణి పంచచ । నచహ
వ్యం వహత్యగ్ని ర్యస్తా మభ్యవమన్యతే॥ ౨౪౯॥

పయిని చెప్పిన ప్రకారమగు భిక్ష నెవడు స్వీకరించడోవాడు చేసిన శ్రాద్ధమందు కవ్యమును వాని పితృదేవతలు పదైదు వర్షములు దనుకగ్రహించరు వాని యజ్ఞమందగు హవ్యము నగ్నిదేవతలకై వహించడు॥ ౨౪౯॥

మూ॥ శయ్యాం గృహాన్ కుశాన్ గంధా నపః పుష్పం మణీన్ దధి।
ధానామత్స్యాన్ పయోమాంసం శాకం చైవ ననిర్ణుదేత్॥

శయ్య గృహములు కుశలు కర్పూరాది సుగంధద్రవ్యములు జలము పుష్పములు రత్నములు పెరుగు వేపుళ్లనుత్యములు మాంసము శాకము వీటి నయాచితముగ సంభవించినం బరిహరించరాదు॥ పూర్వశ్లోకోక్తములు దాన ప్రదేశమునకు వచ్చినవని వీటిని దాతయొక్క గృమందున్న వాటిని చ్ఛేదననిన బరిహరించ రాదని భేదము॥

మూ॥ గురూన్ భృత్యాంశ్చో జ్జిహీర్షన్ న్నర్చిష్య న్దేవతాతిథీన్।
సర్వతః ప్రతిగృహ్ణీయా న్నతుతృప్యే త్స్వయంతతః॥ ౨౫౦॥

పితృమాత్రాదిగురువులనున్ను భార్యాపుత్రాదిభృత్యులనున్నొకట నీరసించకుండ జేయవలచువాడు పతితాదులు దప్ప మిగిలిన శూద్రుల లో నెవ్వరివలననైన ధనమును బ్రతిగ్రహించవచ్చును తనమాత్రజీవనమునకైతే నట్లుగూడను॥ ౨౫౧॥

మూ॥ గురుషుత్వభ్య తీతేషు వినావా తై గృహేవసన్। ఆత్మ
నోవృత్తిమన్విచ్ఛన్ గృహ్ణీయాత్సాధుత స్సదా॥ ౨౫౨॥

పిత్రాదిగురువులు పరలోకగతులైనను దానున్నచో గాక నన్యస్థలమందుండిన ను తాను వేరే గృహమందుండి జీవనార్థము సాధుల వలనసర్వదా పరిగ్రహించ వచ్చును॥ ౨౫౨॥

మూ॥ అర్ధికః కులమిత్రంచ గోపాలో దాసనాపితౌ। ఏతేశూ
ద్రేషు భోజ్యాన్నా యశ్చాత్మానం నివేదయేత్॥ ౨౫౩॥

తనభూమిని దున్నెడువాడును తనపిత్రాదిపరంపరతో మైత్రిగలకులమువాడు ను తనపశువులను గాచెడివాడును తనదాసుడును యింటిమంగలివాడును నేనునీ వాడను నన్నురక్షించుమని తననుసమర్పించుకొనినవాడును వీరందరును శూద్రుల లో భోజ్యాన్నులగుచున్నారు॥ ౨౫౩॥

మూ॥ యోన్యథా సంత మాత్మాన మన్యథా సత్సుభాషతే। సపా
పకృత్తమోలోకే స్తేనఆత్మాప హారకః॥ ౨౫౪॥

యేశూద్రులు తనకుల శీలాదులనున్నట్టివిగా జెప్పక నన్యప్రకారముగ సాధుల

తో కపటముగ చెప్పిన వాడాత్మాపహారకుడగు చోరుడు ద్రవ్యాంతరమునపహరిం చిన చోరునికంటే సర్వప్రధానమాత్మగావున తత్సహజమైనస్వరూపమును చెప్ప కుండుట నాత్మాపహారకు డనబడును॥ ౨౫౪॥

మూ॥ వాచ్యర్థా నియతా స్సర్వే వాఙ్మూలా వాగ్వినిస్సృతాః।
తాంతు యస్స్తేనయేద్వాచం సపర్వస్తేయకృన్నరః॥౨౫౬॥

సకలార్థములను వాక్కులచే నియతముగ జెప్పదగినవి శబ్దములన్నియు వా ఙ్మూలములు వాటియొక్క యథార్థజ్ఞానముగలుగుచుండిన నయ్యర్థములు ప్రతీయ మానములగుచున్నవి ప్రతీతివలననే వాటికి శబ్దమూలత్వము శబ్దములచేతనే తెలు సుకొని కార్యములు చేయబడుచున్నవిగాన సర్వార్థములును వాఙ్నిర్గతములు గావుననే "వేదశబ్దేభ్యఏవాదౌ" వని బ్రహ్మమొదటను వేదశబ్దమూలముగనే సృష్టి జేసె నందువలన నేవడావాక్కు నపహరించుననగా యథార్థముగ బలుకకుం డునో యతండన్నింటిని దొంగిలించినవాడగుచున్నాడు॥ ౨౫౬॥

మూ॥ మహర్షి పితృదేవానాం గత్వానృణ్యం యథావిధి। పుత్రే
సర్వం సమాసజ్య వసేన్మాధ్యస్థ్య మాశ్రితః॥ ౨౫౭॥

గృహస్థునకే సన్యాసప్రకారమిది చెప్పుచున్నాడు స్వాధ్యాయముచే మహ ర్షులయొక్కయు పుత్రులంగని పితరులయొక్కయు యజ్ఞములచే దేవతలయొ క్కయు ఋణములవలనముక్తుడై తెలివిగలవాడు పుత్రునియందు గృహకృత్యభార మునుంచి యుదాసీనత్వము నవలంబించియనగా పుత్రదారాదులందు మమత్వబు ద్ధివిడిచి సర్వమందును బ్రహ్మభావనచే సమదర్శియగుచు గృహమందునే నివసిం చవలెను॥ ౨౫౭॥

మూ॥ ఏకాకీ చింతయేన్నిత్యం వివిక్తేహితమాత్మనః।ఏకాకీ చిం
తయానోహి పరం శ్రేయోనుగచ్ఛతి॥ ౨౫౮॥

కామ్యకర్మములను ధనార్జనమునున్నువిడిచి పుత్రునిచే జేయించబడిన జీవన ముగలవాడై పక్షాధ్యాయోక్తలక్షణములుగలవాడై వివిక్తస్థలమందొక్కరుడును తనహితమును వేదాంతోక్తమగు జీవబ్రహ్మైక్యభావము నిత్యముధ్యానించవలయు నట్లుధ్యానించుటచేనగు బ్రహ్మసాక్షాత్కారరూపమగు నధిక శ్రేయస్సునొందును॥

మూ॥ ఏషోదితా గృహస్థస్య వృత్తిర్విప్రస్య శాశ్వతీ। స్నాతక
వ్రతకల్పశ్చ సత్త్వశుద్ధి కరశ్శుభః॥ ౨౫౯॥

ఇది యధ్యాయార్థమును ముగిపించుచున్నాడు ఈచెప్పబడిన యుంఛాదివృత్తి గృహస్థుడగుబ్రాహ్మణునకు జెప్పబడినది నిత్యయగునది యాపదయందువృత్తినిముందుజెప్పను స్నాతకవ్రతశుద్ధి పత్త్వగుణవృద్ధికరమగునది ప్రశస్తమైనది జెప్పబడెను॥ ౨౫౯॥

మూ॥ అనేన విధివృత్తేన వర్తయన్ వేదశాస్త్రవిత్।వ్యపేదకల్మ
షోనిత్యం బ్రహ్మలోకె మహీయతె॥ ౨౬౦॥

ఇతి శ్రీమానవే ధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాం
సంహితాయాం చతుర్థోధ్యాయః.

చెప్పబడిన దానియంతకును ఫలకథనమిది ఈచెప్పబడిన శాస్త్రోక్తాచారముచే బ్రవర్తించుబ్రాహ్మణుడు నిత్యకర్మానుష్ఠానముచే క్షీణపాపుడగుచు బ్రహ్మజ్ఞానప్రకర్షముచే బ్రహ్మమనెడి లోకమందు లీనుడగును సర్వోత్కృష్టమగు మహిమ నొందును॥ ౨౬౦॥

ఇది శ్రీమన్మహామహీబిడౌజ శ్రీముదానంద గజపతిరాజమహారాజ
దయాపాత్ర భారద్వాజసగోత్ర పవిత్ర సుకవిజనవిధేయ
మండకామేశ్వరనామధేయ విరచితాంధ్ర మన్వర్థ
దీపికాఖ్యయగు వ్యాఖ్యయందు
జతుర్థాధ్యాయము.





శ్రీరస్తు.

# ఆంధ్రమన్వర్థదీపికాసహిత.

## మనుస్మృతి * పంచమాధ్యాయము.

మూ॥ శ్రుత్వైతానృషయోధర్మాన్ స్నాతకస్యయథోదితాన్। ఇద
మూచుర్మహాత్మాన మనలప్రభవంభృగుం॥ ౧॥

ఋషులుశాస్త్రోక్తములగుస్నాతకధర్మములనుమహాత్ముడునగ్నిసంభవుడగుభృగుమహామునితోనివక్ష్యమాణమగువాక్యమునుపలికిరి ప్రథమాధ్యాయమందు "భృగుంనారదమేవచ॥" యని దశప్రజాపతులలో జెప్పబడినప్పటికిని కల్పభేదముచే భృగువలన ప్రభవుడనిగలదు యిందుకుశ్రుతి॥ "తస్యయద్రేతసః ప్రథమందేదీప్యతె తదసావాదిత్యోభవత్ యద్ద్వితీయమాసీద్భృగురితి॥" వహ్నియొక్క రెండవరేతస్సుభృగుండయ్యెనని ఛాప్తమగురేతస్సువలన గాభృగుండయ్యెనని॥ ౧॥

మూ॥ ఏవంయథోక్తం విప్రాణాం స్వధర్మమనుతిష్ఠతాం। కథం
మృత్యుఃప్రభవతి వేదశాస్త్రవిదాం ప్రభో॥ ౨॥

ఓభృగుమహామునీ శాస్త్రోక్తముగ పూర్వోక్తాగ్నిహోత్రాది ధర్మములను జేయువెదశాస్త్రవేత్తలగుబ్రాహ్మణులకు మృత్యువెటులు సంభవించుచున్నది సకలసంశయములు దీర్ప సమర్థుండుగాన ప్రభోయని సంబోధనము॥ ౨॥

మూ॥ సతానువాచ ధర్మాత్మా మహర్షీన్మానవోభృగుః శ్రూ
యతాంయేన దోషేణ మృత్యుర్విప్రాన్ జిఘాంసతి॥ ౩॥

సకలధర్మస్వరూపుడగు భృగుమహాముని మహర్షులనుగూర్చి యేదోషముచేత మృత్యువు విప్రులనుజంపుచున్నదో దానినివినుండని పలుకుచున్నాడు॥ ౩॥

మూ॥ అనభ్యాసేన వేదానా మాచారస్యచవర్జనాత్।ఆలస్యా
దన్నదోషాచ్చ మృత్యుర్విప్రాన్ జిఘాంసతి॥ ౪॥

వేదాభ్యాసములేకుండుటవలననున్ను స్వవిహితాచారమువర్జించుటవల్లనున్ను

కితకర్తవ్యములగుకర్మములను జేయుటలో నలసతవలనను న్ను అభక్ష్యభక్షణమువల నన్ను మృత్యువు బ్రాహ్మణులనుజంపనిశ్చయించును వేదాభ్యాసమును మానుటమొదలగువాటిచేబుట్టిన పాపముచే నాయువు క్షీణించునని తాత్పర్యము॥ ౪॥

మూ॥ లశునం గృంజనంచైవ పలాండుం కవకానిచ। అభక్ష్యాణిద్విజాతీనా మమేధ్యప్రభవాణిచ॥ ౫॥

ఈచెప్పబడినదోషములలో వేదాభ్యాసాదులు చెప్పబడినవేగావున నను క్తముగునన్నదోషము చెప్పుచున్నాడు వెల్లుల్లి గాజరగడ్డ యెర్రవుల్లి పుట్టకొక్కు అమేధ్యస్థలములందుబుట్టిశిలీంధ్రకూర మొదలగునవి ద్విజులకభక్ష్యములు ద్విజశబ్దము చేశూద్రులకీనిషేధము లేదనుట॥ ౫॥

మూ॥ లోహితాన్వృక్షనిర్యాసాన్ వ్రశ్చన ప్రభవాంస్తథా। శేలుంగవ్యంచ పీయూషం ప్రయత్నేన వివర్జయేత్॥ ౬॥

చెట్లవలనబుట్టిన యెర్రనిబంకలనున్ను వృక్షాదులనునరుకుటవలనబుట్టినవి యెర్రనివిగాకుండినవిన్ని శేలువలనగా బహువారకఫలము ఈనిన పదిదినములలో నిగోవులపాలగ్ని సంస్కారముచేగట్టిపడునదియున్ను "అనిర్దశాయా గోక్షీర"మని నిషేధించినప్పటికిని మరలజెప్పుట ప్రాయశ్చిత్తగౌరవమునకు ఇవియన్నియును ప్రయత్నముచేవిడువవలయును॥ శ్రు॥ అధోఖలుయఏషలోహితోయోవావ్రశ్చనాన్నిర్యేషతితస్యనాశ్యంకామమన్యస్యేతి॥ యెర్రనిబంకయును నరుకువలనబుట్టినదిన్ని దినరాదితతముల నిచ్ఛాప్రకారమని శ్రుతి॥ ౬॥

మూ॥ వృథాకృసరసంయావం పాయసాపూప మేవచ। అనుపాకృతమాంసాని దేవాన్నాని హవీంషిచ॥ ౭॥

దేవతా నివేదనాద్యుద్దేశశూన్యముగ దనకిష్టమని పచనమొనర్చినవివృథాయనియర్థము వృథాగాచేసినకృసరమనగా నువ్వులపప్పుతో బియ్యము కలిపిచేసినదిన్ని సంయావమనగా పాలుమరిగించి గోధుమపిండిబెల్లము కలిపిచేసినది పరమాన్నము అప్పములుమొదలగుభక్ష్యములు దేవపిత్రాద్యర్థముమంత్రములచేసంస్కరించని మాంసములు దేవతోద్దేశముగజేసిన వస్తువులట్లు నివేదితములుగాకుండునప్పటివి హోమముకంటెముందుగ పురోడాశాదిహవిస్సులు నవియన్నియుంది

నరాదు॥ 2॥

మూ॥ అనిర్దశాయాగోక్షీర మౌష్ట్ర మైక శఫంతథా। ఆవికం సంధినీక్షీరం వివత్సాయాశ్చ గోపయః॥ ౮॥

ఈనినపదిదినములలోని గోక్షీరము ఉపలక్షణమువలనఅజామహిష్యాదుల జున్నున్ను దినరాదు॥ "శ్లో॥ అనిర్దశాయాగోక్షీర మాజంమాహిషమేవచ॥" యను నియమస్మృతివలన ఉష్ట్రములపాలున్ను ఒంటిడెక్క(గుఱ్ఱము మొదలగునట్టి వాటిపాలున్ను గొఱ్ఱెపాలున్ను సంధినీయనగా ఆవుపోతసమయమందు వెద్దును గోరునప్పు డదిపుష్పిణియగునట్టి గోవుపాలున్ను॥ "సూ॥ సంధినీవృషస్యంతీత స్యాః పయోనపిబేత్ ఋతుమతీభవతి॥" యనుహారీతస్మృతివలన పెయ్య చనిపోయినను దగ్గిరనుండకున్నను గోవునుపితికినపాలు ఇవన్నియు వర్జించవలెను గో శబ్ద మరలజెప్పడముచే నజామహిష్యాదులకు వత్సలేనిదోషములేదు॥ ౮॥

మూ॥ ఆరణ్యానాంచసర్వేషాం మృగాణాంమాహిషంవినా। స్త్రీక్షీరంచైవవర్జ్యాని సర్వశుక్తానిచైవహి॥ ౯॥

గేలుదప్పనితరములగుగజాద్యరణ్యమృగములపాలున్ను స్త్రీలపాలున్ను స్వభావముచే మధురములయి జలాదిసంపర్కమువలనకాలవశముచేపులిసినవిశుక్తములివన్ని వర్జించవలెను"శుక్తంపర్యుషితంచైవ"యని చతుర్థాధ్యాయమందు జెప్పియుమరలనిచట చెప్పడము దధ్యాదులకీనిషేధములేదనుటకు॥ ౯॥

మూ॥ దధిభక్ష్యంచశుక్తేషు సర్వంచ దధిసంభవం। యానిచైవాభిషూయంతే పుష్పమూలఫలైశ్శుభైః॥ ౧౦॥

శుక్తములలో పెరుగున్ను దానివలనబుట్టిన మజ్జిగ మొదలయినవన్ని భక్ష్యములగును పుష్ప మూల ఫలాదులచేబుట్టినవిశుక్తములైనను గ్రాహ్యములగును॥ "శ్లో॥ అవికారిభవేద్భక్ష్యమభక్ష్యం యద్వికారకృత్"వికారశూన్యములగునవిభక్ష్యములు వికారమును జేసెడివివర్జించవలెను॥ ౧౦॥

మూ॥ క్రవ్యాదాఞ్ఛకునీన్సర్వాం స్తథాగ్రామనివాసినః। అనిర్దిష్టాంశ్చైకశఫాంష్టిట్టిభాంశ్చవివర్జయేత్॥ ౧౧॥

పచ్చిమాంసమును దినుపక్షులనుగ్రద్దలుమొదలగువాటినివర్జించవలెను గ్రామ

నులందుండెడు పారావతములు మొదలగువాటినిన్ని "అనిర్దిష్టా"ననగా వేదమం
దు॥ శ్రు॥ "ఏ ధాభ్యోష్ట్రిబాడబమాలభేత తస్యమాంస మశ్నీయాదితి" యని చెప్పబ
డినపియుష్ట్రాదులు నిర్దిష్టము లివిగానివనిర్దిష్టములు గవలభాదులగు వాటినిన్ని
యజ్ఞాంగములుగా నిర్దిష్టములైనను వాటినియజ్ఞములందేగాని సర్వదా ఏకశఫ
ములగువాటినిన్ని టిట్టిభములనున్ను భక్షించరాదు॥ ౧౧॥

మూ॥ కలవింకం ప్లవం హంసం చక్రాంగం గ్రామకుక్కుటం।
సారసం రజ్జువాలంచ దాత్యూహం శుకశారికే॥ ౧౨॥

పిచ్చుక యిది గ్రామ్యము నారణ్యమునున్ను జాతినిషేధముగావున ప్లవమనె
పక్షినిన్ని హంసము చక్రవాకము గ్రామకుక్కుటమును గ్రామశబ్దముచే నారణ్య
ము భక్ష్యమగునుగాని యిదిగాక మిగిలినగ్రామ్యము భక్ష్యములనిగాదు సారసప
క్షి హంస సారసచక్రాంగములు జాలపాదానను వక్ష్యమాణముచే నుక్తార్థము
లయినను పునర్వచనముచే నివిదప్ప తక్కినజాలపాదముల కాపదయందు వికల్ప
మున కనాపదయందున్ని జాలపాదములున్నని రాగమువలన బ్రాప్తిచే వికల్పవ్యా
వస్థ రజ్జువాలమనెడి పక్షిన్ని దాత్యూహమున్ను చిలుక గోరపిట్ట యునన్నియునభ
క్ష్యములు॥ ౧౨॥

మూ॥ ప్రతుదాన్ జాలపాదాంశ్చ కోయష్టి నఖవిష్కిరాన్। నిమ
జ్జతశ్చ మత్స్యాదాన్ సౌనం వల్లూరమేవచ॥ ౧౩॥

ముక్కునబొడుచుకొని తినెడి పక్షులు దార్వాఘాటాదులు జాలాకారముల
గు పాదములుగల పక్షులు కోయష్టికపక్షులు కాళ్ళచేదువ్వికొనితినెడి పక్షులు
ననుమతించబడిన యారణ్యకుక్కుటాది వ్యతిరిక్తమును డేగలుమొదలగునవినీటిలో
మునిగి చేపలనుతినేపక్షులు మద్గుప్రభృతులు కటికదుకాణమందగు మాంసము భ
క్ష్యమైన నచ్చటిశుష్కమాంసము నివియన్నియు నభక్ష్యములు॥ ౧౩॥

మూ॥ బకంచైవ బలాకాంశ్చ కాకోలం ఖంజరీటకం। మత్స్యా
దాన్విడ్వరాహాంశ్చ మత్స్యానేవచ సర్వశః॥ ౧౪॥

కొంగ బెగ్గారు బొండుకాకి వేటిరింత చేపలనుతినేపక్షులున్న మునక్కు
మొదలగునవి "విడ్వరాహ"మనగా నూరబంది విట్టుపశేషముచే నడిపిపందికభ్యస

జ్ఞ సకలమత్స్యములున్ను వీటిని భక్షించరాదు॥ ౧౪॥

మూ॥ యో యస్యమాంస మశ్నాతి సతన్మాంసాద ఉచ్యతే। మ
త్స్యాదస్సర్వ మాంసాద స్తస్మాన్మత్స్యాన్వివర్జయేత్॥౧౫॥

మత్స్యనిషేధమును చెప్పుచున్నాడు- ఏనిమాంసము నేదిదినునో యది తన్మాంసమును దినునదియని జెప్పబడెను మత్స్యములను దినినవాడన్ని మాంసములను దిని నవాడేగాన మత్స్యములను దినరాదు॥ ౧౫॥

మూ॥ పాఠీన రోహితా వాద్యౌ నియుక్తౌ హవ్యకవ్యయోః। రా
జీవాన్ సింహతుండాంశ్చ సశల్కాంశ్చైవ సర్వశః॥౧౬॥

ఇప్పుడు భక్ష్యమత్స్యములను చెప్పుచున్నాడు పాఠీనరోహితములనెడు మత్స్యములు భక్షణీయములు హవ్యకవ్యములందు నియుక్తములు ఇట్లుచెప్పుట సమస్తవక్ష్యమాణభక్షణ నిషిద్ధోపలక్షణార్థము గావున ప్రాణాత్యయాదికమందు దోషములేదు రాజీవాఖ్యములు సింహతుండాఖ్యములు సశల్కములున్న వక్ష్యమాణలక్షణములుగలవి యన్నియును భక్షణీయములు మేధాతిథి గోవిందరాజులయితే పాఠీనరోహితములను దైవపిత్రాదికర్మములందు నియుక్తములగునవియై దినదగినవిగాని మరొకప్పుడు దినరాదు రాజీవ సింహతుండశల్కములనెడి మత్స్యములు హవ్యకవ్యములకంటె నితరసమయములందు భక్షించదగినవని చెప్పిరి అదిబాగుండలేదని కుల్లూకభట్టు చెప్పుచున్నాడు పాఠీనరోహితములు శ్రాద్ధనియుక్తములుగాన శ్రాద్ధభోక్తకే భక్ష్యములుగాని వీటిని శ్రాద్ధకర్తయైనం దినరాదు రాజీవాదులు హవ్యకవ్యములేనప్పుడును దినవచ్చుననునది యప్రమాణము ఇతరమునులును రోహితపాఠీన రాజీవాదులు తుల్యములని చెప్పిరిగాన ఇందుకు శంఖవచనము॥ శ్లో॥ "రాజీవాస్సింహతుండాశ్చ సశల్కాశ్చ తథైవచ। పాఠీనరోహితౌచాపి భక్ష్యా మత్స్యేషు కీర్తితాః"॥ రాజీవసింహతుండ సశల్క పాఠీన రోహితములు మత్స్యములందు భక్ష్యములని మరియు నిందుకు యాజ్ఞవల్క్య "భక్ష్యాః పంచనఖాశ్శ్వావిద్గోధా కచ్ఛపశల్యకాః। శశశ్చమత్స్యేష్వపితు సింహతుండకరోహితాః। తథా పాఠీనరాజీవ సశల్కాశ్చ ద్విజాతిభిః" పంచనఖములలో ఆలుగు-ఉడుము-తాబేలు యేదుబంది-కుందేలు-మత్స్యములలో సింహతుండరోహిత-పాఠీన-రాజీవ- సశల్కము-లివి ద్విజులకు భక్ష్యములనిచెప్పెను హారీతుడున్ను॥ సూ॥ "సశల్కాన్మాయో

పపన్నా న్భక్షయేత్" అని చెప్పెను ఇటులుండగా "భోక్తృత్వాద్వా నక త్రోపి శాస్త్రైపాఠీన రోహితా। రాజీవా ద్యా స్తథా నేతి వ్యాఖ్యానమను సంస్మృతా" యని కుల్లూకభట్టు మేధాతిథి గోవిందరాజుల నాక్షేపించెను॥ ౧౬॥

మూ॥ నభక్షయే దేకచరా నజ్ఞాతాంశ్చ మృగద్విజాన్। భక్ష్యే
ష్వపి సముద్దిష్టాన్ సర్వాన్పంచ నఖాంస్తథా॥ ౧౭॥

ఏవిజాతినామభేద విభాగముతో నొంటిగా సంచరించునో పాములు మొదలగు వి ప్రాజ్ఞులచేతనున్న పక్షులు మృగములు నేవి తెలియబడనివో యవి సామాన్యవి శేషనిషేధము లేనందున భక్ష్యములుగా నిర్దిష్టములయినను వానిని వానరాది పంచనఖములన్నింటిని భక్షించరాదు॥ ౧౭॥

మూ॥ శ్వావిధం శల్యకంగోధా ఖడ్గకూర్మ శశాంస్తథా। భక్ష్యాన్
పంచనఖేష్వాహు రనుష్ట్రాం శ్చైకతోదతః॥ ౧౮॥

నిషేధమునకు నిషేధమును చెప్పుచున్నాడు ఆలుగు ఏదుబంది ఉడుము ఖడ్గమృగము తాబేలు చెవులపిల్లి అయిదుగోరులుగలజంతువులలో నివిభక్ష్యములు ఒంట్రెముగాక నొకటేపలువరసగలవన్ని భక్ష్యములు॥ ౧౮॥

మూ॥ ఛత్రాకం విడ్వరాహంచ లశునం గ్రామకుక్కుటం । ప
లాండుం గృంజనంచైవ మత్యాన్జగ్ధ్వా పతేద్ద్విజ ౧౯॥

పుట్టగొడుగు ఊరబంది తెల్లవుల్లి ఊరకోడి యెర్రవుల్లి గాజరగడ్డ మత్స్యములను నెరుగకదినినగురుప్రాయశ్చిత్తను జెప్పుటవలన నభ్యాసముచేదినినపతితుడగును గాన పతితప్రాయశ్చిత్తముజేసుకోవలెను॥ "శ్లో॥ గర్హితాన్నాదనం తథా జగ్ధిస్సురాపానసమానిషట్॥" యని నిందితములనుటయు సురాపానసమమని చెప్పుటవలన॥

మూ॥ అమత్యైతాని షడ్జగ్ధ్వా కృచ్ఛ్రంసాంతపనం చరేత్ యు
దిచాంద్రాయణంవాపి శేషేషూ పవసేదహః॥ ౨౦॥

పుట్టగొడుగు మొదలగు నాయారింటిని నబుద్ధిపూర్వకముగ దినిన నేకాదశాధ్యాయోక్తసప్తాహసాధ్యమగుసాంతపనమైన చాంద్రాయణమైనం జేయవలయును ఇదిగాక యెర్రబంక మొదలగువాటిని దినిన నొకదినముపవాసము చేయవలయు॥ ౨౦

మూ॥ సంవత్సరస్యైకమపి చరేత్కృచ్ఛ్రం ద్విజోత్తమః। అజ్ఞాత
భుక్తశుద్ధ్యర్థం జ్ఞాతస్యతు విశేషతః॥ ౨౧॥

"ద్విజోత్తమః॥" యనివను ద్విజులనే యర్థము "ఏతదుక్తం ద్విజాతీనా॥" మని యనినందువలన సంవత్సరమునకొకమారజ్ఞాతభక్షణప్రాయశ్చిత్తముగా ప్రాజాపత్యాఖ్యమగు కృచ్ఛ్రముఁజేయవలెను జ్ఞానపూర్వముగ నభక్ష్యభక్షణమొనరించిన నేని శాస్త్రోక్తప్రాయశ్చిత్తము కర్తవ్యమెనో దానికది జేయవలయును॥ "శ్లో॥ త్రీణి దేవాః పవిత్రాణి బ్రాహ్మణానామకల్పయన్ । అదృష్టమద్భిర్నిర్ణిక్తం యచ్చవాచాప్రశస్యతే॥" ఇతి దేవతలు బ్రాహ్మణులకు పవిత్రములు మూఁటిని కల్పించిరి అవేవని కనఁబడనిది జలప్రక్షాళితమయినది యేది వాక్కుచే ప్రశస్తమగునో యది ద్విజాదిద్రవ్యశుద్ధిప్రకరణంబున జెప్పంబడెనను ప్రాయశ్చిత్తముగలవాటికి వ్యతిరిక్తములగు ద్రవ్యములశుద్ధివిశేషవిషయమై యగుచున్నది॥ ౨౧॥

మూ॥ యజ్ఞార్థం బ్రాహ్మణైర్వధ్యాః ప్రశస్తా మృగపక్షిణః। భృత్యానాంచైవ వృత్త్యర్థ మగస్త్యోహ్యాచరత్పురా॥ ౨౨॥

ఇప్పుడు భక్షణప్రసంగముచే యాగార్థము హింసకనుజ్ఞ నిచ్చుచున్నాడు యజ్ఞార్థమై బ్రాహ్మణులు శాస్త్రోక్తములగు మృగములను పక్షులను వధించవచ్చును మున్ను అగస్త్యమహాముని మాతృపితృపరిముఖ్యావశ్యభరణీయ సంరక్షణమునకై యజ్ఞానదేనుగదా ప్రకృతరూపమేయాయనువాదము॥ ౨౨॥

మూ॥ బభూవుర్హి పురోడాశా భక్ష్యాణాం మృగపక్షిణాం।
పురాణేష్వపి యజ్ఞేషు బ్రహ్మక్షత్రసవేషుచ॥ ౨౩॥

ఏ హేతువుచే ప్రాచీనఋషికర్తృకయజ్ఞములందు భక్ష్యములగు మృగములయొక్కయు పక్షులయొక్కయు మాంసముచే పురోడాశములాయెనో యది కారణముగ నిప్పటియజ్ఞములందును నట్లు మృగపక్షులు వధ్యములుగావచ్చును॥ ౨౩

మూ॥ యత్కించిత్స్నేహసంయుక్తం భక్ష్యంభోజ్యమగర్హితం।
తత్పర్యుషితమప్యాద్యం హవిశ్శేషంచ యద్భవేత్॥ ౨౪॥

ఇప్పుడు పర్యుషితనిషేధమునకు నిషేధమును జెప్పుచున్నాడు యేదైనా నెయ్యి మొదలైనదానితోకూడిన భక్ష్యమున్ను పాయసాదిభోజ్యమున్ను తొలినాటిదయినప్పటికిని యితర సం

షట్కానులచే నవిశాడకుండెనేని ఘృతతైల దధ్యాదులనుగలిపికొనినం దినవచ్చును గర్హితములుగావు ఓయీ ముందుగాస్నేహయుక్తములై పర్యుషితనులగు వాటిని దినవచ్చునని వ్యాఖ్యానమేలచేయరాదనిన యట్లయితే హవిశ్శేషమున్ను పర్యుషితముదినవచ్చునని మరలనేల జెప్పవలెను హవిశ్శేషమెల్లను స్నేహయుక్తమే యగుచుండుటచే నట్లుజెప్పినది నిరర్థకమగును ఇదియుగాక స్మృత్యంతరమందును భక్షణకాలమందునే యభిఘారణముపదేశించబడుచున్నది॥ శ్లో॥ "మసూరమాష సంయుక్తం తథాపర్యుషితంచయత్। తత్తు పశ్చాన్నిశం కృత్వా భుంజీతహ్యాభిఘారితే"మని యమస్మృతి హవిశ్శేషమనగా పురోడాశాదికము భోజనకాలమం దభిఘారణమక్కరలేకుండనే దినవలెను వేరేదీనిచెప్పటవలన॥ ౨౪॥

మూ॥ చిరస్థిత మపిత్వాద్య మస్నేహాక్తం ద్విజాతిభిః। యవగోధూమజం సర్వం పయసశ్చైవ విక్రియాః॥ ౨౫॥

అనేకరాత్రులు మధ్యను వెళ్ళినను చిరస్థితమైనదైననను యవగోధూమ క్షీర కృతములగునవి స్నేహసంయోగశూన్యములయినను భక్షించవచ్చును॥ ౨౫॥

మూ॥ ఏతదుక్తం ద్విజాతీనాం భక్ష్యాభక్ష్య మశేషతః। మాంస స్యాతః ప్రవక్ష్యామి విధిం భక్షణవర్జనే॥ ౨౬॥

ద్విజులకిట్లు భక్ష్యాభక్ష్యనిర్ణయను జెప్పబడియె నింక మాంసవిషయిక భక్షణవర్జనములను నిశ్శేషముగ జెప్పుచున్నాను॥ ౨౬॥

మూ॥ ప్రోక్షితం భక్షయే న్మాంసం బ్రాహ్మణానాంచ కామ్యయా। యథావిధి నియుక్తస్తు ప్రాణానామేవ చాత్యయే॥ ౨౭॥

శ్లో॥ "ప్రోక్షితం భక్షయేన్మాంస"మనగా మంత్రసంస్కృతమగు మాంసమును దినవలెనని పరిసంఖ్యావిధిగాని నియమవిధిగానిఅయ్యాని అపరిసంఖ్యా విధియందు ప్రోక్షితముగాని మాంసమును దినరాదని వాక్యార్థమగును అది యనుపాకృత మాంసానియనెడు శ్లోకముచేతనే నిషేధించబడెను ఇదియంతయు మంత్రముచే ప్రోక్షితమనెడి సంస్కారముగల యజ్ఞాంగమాంసభక్షణవిషయము విధించబడెను అదిగావుననే "అసంస్కృతాన్ పశూన్మంత్రైః" యనెడివచనము చెప్పగలదు బ్రాహ్మణులకెప్పుడు కోరుకబుట్టినప్పు డవశ్యముగ మాంసమును భక్షించవచ్చున

యుండెడి వదియును నియమమువలన నొకటిమారే తినవలెను॥ శ్లో॥ "సకృద్బ్రాహ్మణ కామ్యయేతి" బ్రాహ్మణులకామనచే నొకటిమారు దినవలెనని యమవచనమువలన॥ శ్లో॥ "శ్రాద్ధేచ మధుపర్కేచ మాంసో మధుపర్క ఇతి" శ్రాద్ధమందున్ను మాంసయుక్తమగు మధుపర్కమందున్ను నని గృహ్యావచనమువలననున్ను నియోగించబడినవాడు నియమముగ మాంసమును దినవలెనని యదిగావుననే॥ శ్లో॥ "నియుక్తస్తుయథాన్యాయః" మని చెప్పగలడు ప్రాణాత్యయమందనగా నాహారాంతరము లేనప్పుడును రోగము నిమిత్తముగానయినప్పుడును మాంసమును నియమముగ భక్షించవచ్చును॥ ౨౭॥

మూ॥ ప్రాణస్యాన్న మిదం సర్వం ప్రజాపతి రకల్పయత్। స్థావ
రం జంగమంచైవ సర్వంప్రాణస్య భోజనం॥ ౨౮॥

ప్రాణాత్యయమందు మాంసము భక్షించుట కనువాదమును చెప్పుచున్నాడు "ప్రాణితీతి ప్రాణః" బ్రతికేదికాగా ప్రాణము శరీరాంతర్గతుడగు భోక్త జీవుడు వానికి భక్షణీయముగా నిదియెల్లను బ్రహ్మనిర్మించెను ఇదియేవనగా జంగమముపశ్వాదికము స్థావరము వ్రీహియవాదికము యీసమస్తము తనకి భోజనమిదిగాన జీవుడు ప్రాణధారణార్థమై మాంసమును భక్షించవలెను॥ ౨౮॥

మూ॥ చరాణామన్నమచరా దంష్ట్రిణామప్య దంష్ట్రిణః। అహ
స్తాశ్చ సహస్తానాం శూరాణాంచైవ భీరవః॥ ౨౯॥

ఇదియంతయు ప్రాణమున కన్నమని నదివిస్తరించుచున్నాడు చరములగు హరిణాదుల కచరములగు తృణాదులును కోరలుగల్ల పులులు మొదలగు వాటికి కోరలులేని హరిణాదులున్ను హస్తములుగల మనుష్యులకు హస్తములులేని మత్స్యాదులును శౌర్యముగల సింహాదులకు భీరువులగు గజాదులును భక్ష్యము లగుచున్నవి ఇట్టిది విధాతసృష్టి॥ ౨౯॥

మూ॥ నాత్తాదుష్య త్యదన్నాద్యాన్ ప్రాణినో హన్య హన్యపి।
ధాత్రైవసృష్టా హ్యాద్యాశ్చ ప్రాణినోత్తార ఏవచ॥ 30॥

భక్షణార్హములగు వాటిని ప్రతిదినమునందును దిననివారు దోషము నొందరు ఏహేతువచే బ్రహ్మచేతనే తినేవితినబడేవిన్ని సృజించబడెనో ఈమూడు శ్లో

కము లున్న ప్రాణాత్యయమందు మాంసభక్షణస్తుతి చేయబడెను॥ 30॥

మూ॥ యజ్ఞాయ జగ్ధి ర్మాంసస్యే త్యేష దైవో విధిస్స్మృతః। అ
తోన్యథా ప్రవృత్తిస్తు రాక్షసో విధిరుచ్యతే॥ 31॥

ప్రోక్షితమే భక్షించుమని నియమార్థము చెప్పుచున్నాడు యజ్ఞసంపత్తికై తే దంగభూతమగు మాంసమును భక్షించుట దైవానుష్ఠానము తద్వ్యతిరిక్తముగ స్వార్థమై పశువును జంపి మాంసమును భక్షించుట రాక్షసోచితమని యుక్తార్థమందు వృధామాంసభక్షణ నివృత్తికనువాదను॥ 31॥

మూ॥ క్రీత్వాస్వయంవా ప్యుత్పాద్య పరోపకృతమేవవా। దే
వాన్పితౄంశ్చార్చయిత్వా ఖాదన్మాంసం నదుష్యతి॥ 32॥

కొనినదైన దాను సంపాదించినదైన బరులు చంపి తెచ్చియిచ్చినదైన దేవతలకు పితరులకును వినియోగపరిచి శేషమును భక్షించినం దోషము నొందడు ఇదిగావున ప్రోక్షితాదులు నాలుగుననగా ప్రోక్షితము బ్రాహ్మణకామనచేతన యినది శ్రాద్ధములందు నియుక్తుడగువాడుదినేది ప్రాణాత్యయమందుభక్షించుమను నదిన్ని ఈచతుష్టయమువలె నిది నియతముగాదు నదుష్యతియని చెప్పుటవలన మరేమంటే వర్షేవర్షేశ్వమేధేన యనునది మొదలుగా చెప్పబోయెడిమాంసవర్జనవిధిన్ని యీవిషయమే విరోధములేకుండుటవలన॥ 32॥

మూ॥ నాద్యా దవిధినా మాంసం విధిజ్ఞో నాపదిద్విజః। జగ్ధ్వా
హ్యవిధినా మాంసం ప్రేత్య తైరద్యతే ఽవశః॥ 33॥

మాంసభక్షణానుష్ఠాన దోషజ్ఞుడగు ద్విజుండు ప్రాణాపత్తిలేనప్పుడు తత్తద్దేవతాద్యర్చనములేకుండ మాంసమును దినరాదు విధినిదప్పి యెవడుమాంసమునుదినునతండు పరలోకంబున నే జంతువులమాంసము నిచ్చుటదినియెం నామృగంబులచే నవశంబుగ భక్షింపబడునని సకలశ్లోకములకు ననువాదము॥ 33॥

మూ॥ నతాదృశం భవేదేనో మృగహంతు ర్ధనార్థినః। యాదృ
శం భవతి ప్రేత్య వృథా మాంసాని ఖాదతః॥ 34॥

దేవపితృశేషముగాని మాంసమును భక్షించినవానికి పరలోకమందు పాపమె

ట్టిదగునట్టి పాపము ధనార్థియై మృగములఁ జంపు వ్యాధునికిన్ని కానేరదని యీ దియు ననువాదము॥ 38॥

మూ॥ నియుక్తస్తు యథాన్యాయం యోమాంసం నాత్తిమానవః।
సప్రేత్య పశుతాం యాతి సంభవానేక వింశతిం॥ 35॥

శ్రాద్ధమందు మధుపర్కమందును యథాశాస్త్రముగ నియోగించబడి యెవఁడు మాంసమును భక్షించఁడో వాఁడిరువదియొక జన్మములందు మృగమగును "యథాన్యాయంనియుక్తః" యను నీనియమాతిక్రమ ఫలవిధానమిది॥ 35॥

మూ॥ అసంస్కృతాన్ పశూన్ మంత్రై ర్నాద్యాద్విప్రః కదాచన।
మంత్రైస్తు సంస్కృతా నద్యా చ్ఛాశ్వతంవిధిమాస్థితః॥ 36॥

వేదవిహితమంత్రవ త్ప్రోక్షణాది సంస్కారములేని పశువులను విప్రాదులెప్పుడును దినరాదు శాశ్వతమనగా ప్రవాహమువలెననాదిగావున నిత్యమగు పశుయాగాది విధిని వదలక మంత్రసంస్కృతములగు మాంసములను భక్షించవలెను॥ శ్లో॥ "ప్రోక్షితంభక్షయేన్మాంస" మనుదాని కనువాదమిది॥ 36॥

మూ॥ కుర్యాద్ఘృత పశుంసంగే కుర్యాత్పిష్టపశుం తథా।న త్వేవతు వృథా హంతుం పశుమిచ్ఛేత్ కదాచన॥ 37॥

సంగమనగా నాసక్తి పశుభక్షణానురాగముండిన ఘృతమయపిష్టమయపశువులను జేసి తినరాదు దేవతాద్యుద్దేశము లేకుండ పశువు నెప్పుడును జంపదలచరాదు॥ 37॥

మూ॥ యావంతి పశులోమాని తావత్కృత్వోహ మారణం। వృథాపశుఘ్నః ప్రాప్నోతి ప్రేత్య జన్మని జన్మని॥ 38॥

దేవతాద్యుద్దేశము లేకుండ నాత్మార్థమై పశువునెవఁడుజంపునో యతండు వృథాపశుఘ్నుఁడు వాఁడువచ్చి ఆపశులోమము లెన్నిగలవో యన్నిజన్మములందట్టి మరణమునొందును గావున వృథా పశువునుదినరాదు ఇందు ఇహశబ్దార్థకము గు హాశబ్దమాగమ ప్రసిద్ధము॥ 38॥

మూ॥ యజ్ఞార్థం పశవ స్సృష్టా స్స్వయమేవ స్వయంభువా।య

వస్తువు సంకల్పమును జేయును గావున నే "ఆత్మానంచ పశూంశ్చైవ" యని చెప్పెను యజమానవ్యాపారముచేతనే పశువునకున్ను ఫలసిద్ధియగును॥ ౪౨॥

మూ॥ గృహే గురావరణ్యే వా నివసన్నాత్మవాన్ద్విజః । నావేద
విహితాం హింసాం నాపద్యపి సమాచరేత్॥ ౪౩॥

గృహస్థుడుగానీ బ్రహ్మచారిగానీ వానప్రస్థుడుగానీ వేదవిహితముగానిహింస నుప్రశస్తమగు హృదయముగలవాడాపదయందైనను జేయరాదు॥ ౪౩॥

మూ॥ యావేదవిహితా హింసా నియతాస్మిన్ చరాచరే । అ
హింసామేవ తాం విద్యాద్వేదాద్ధర్మోహి నిర్బభౌ॥ ౪౪॥

అయితే వైదికదీక్షాది పశుహింస అధర్మముకొరకెట్లుగాదనిన చెప్పుచున్నాడు. ఏది వేదవిహితకర్మణము జేశకాలాది నియమముగల హింసస్థావరమందును జంగమమందు నగుచున్నదో దానినహింసనుగా దెలియవలయు నాహింసవలనన ధర్మము బుట్టదుగావున వైదికపశుహననమధర్మము ప్రాణిహింసగావున బ్రాహ్మణహననమువలెనని యీయనుమానముపజీవ్యమగు శాస్త్రబాధవలననే బ్రవర్తించదు దృష్టాంతమగు బ్రాహ్మణహననమున్ను అధర్మమగుటకు శాస్త్రమే యుపజీవ్యము వేదమువలననే ధర్మముప్రకాశించెను ధర్మమునకు వేదాన్యము ప్రకాశముగాదు వేదముచేతనే నిశ్శేషముగ బ్రకాశతనొందెను॥ ౪౪॥

మూ॥ యోహింసకాని భూతాని హినస్త్యాత్మసుఖేచ్ఛయా । సజీ
వంశ్చ మృతశ్చైవ నక్వచిత్ సుఖమేధతే॥ ౪౫॥

ఎవడు హింసకములగు మృగములవనగా ప్రాణులను స్వసుఖార్థమై హింసించునతడు బ్రతికియుండియు మృతప్రాయుడగునట జచ్చియు నెచ్చటనయినసుఖమునొందడు॥ ౪౫॥

మూ॥ యోబంధనవధక్లేశాన్ ప్రాణినాం నచికీర్షతి । ససర్వ
స్యహితప్రేప్సుస్సుఖమత్యంత మశ్నుతే॥ ౪౬॥

ఎవడు బంధనమారణాది క్లేశములను బ్రాణులకు జేయనొల్లడో యతడుసర్వహితప్రాప్తి నిచ్ఛయించువాడుగాన ననంతసుఖమునొందును॥ ౪౬॥

మూ॥ యద్ధ్యాయతి యత్కురుతే ధృతిం బధ్నాతి యత్ర చ। త
దవాప్నోత్యయత్నేన యో హినస్తి న కించన॥ ౪౭॥

మరియు ధర్మాదికమును దేనిని చింతించునో పరమశ్రేయస్సాధనమగు కర్మము ను దేనిని జేయునో పరమాత్మధ్యానాదికమగు దేనియందు స్థిరతనొందునో యది యెల్ల నక్లేశముగ వానికి లభించు నెవ్వడైతే దోమలను చీమలనయిన హింసించడో॥

మూ॥ నాకృత్వా ప్రాణినాం హింసాం మాంసముత్పద్యతే క్వచిత్।
నచ ప్రాణివధస్స్వర్గ్యః తస్మాన్మాంసం వివర్జయేత్॥౪౮॥

మాంసభక్షణప్రసంగముచే నహింసాప్రశంసచేసి మరలమాంసభక్షణనిషేధ ముచెప్పుచున్నాడు ప్రాణహింసలేకుండ మాంసము సంభవించదు హింసస్వర్గ మునకు ప్రతిబంధకము గావున మాంసభక్షణము మానవలయును॥ ౪౮॥

మూ॥ సముత్పత్తించ మాంసస్య వధబంధౌచ దేహినాం । ప్ర
సమీక్ష్య నివర్తేత సర్వమాంసస్య భక్షణాత్॥ ౪౯॥

మాంసోత్పత్తి శుక్లశోణిత సంబంధమువలన నయినదనియు ప్రాణులవధబం ధములు క్రూరకర్మములని తెలిసి విధ్యుక్తమాంస భక్షణమువలననయిన మర్లవలె ను అశాస్త్రీయమాంసభక్షణము వలనని చెప్పనేల॥ ౪౯॥

మూ॥ నభక్షయతి యో మాంసం విధింహిత్వా పిశాచవత్।సలో
కే ప్రియతాం యాతి వ్యాధిభిశ్చ నపీడ్యతే॥ ౫౦॥

విధిరహితమగు మాంసమునెవడు పిశాచమువలెతినడో వాడు లోకమునకు ప్రియుడగును రోగములచేత పీడితుడుగాకుండ నశాస్త్రీయమాంసభక్షణమువ్యా ధికరమనిచెప్పెను॥ ౫౦॥

మూ॥ అనుమంతా విశసితా నిహంతా క్రయవిక్రయీ।సంస్కర్తా
చోపహర్తాచ ఖాదకశ్చేతి ఘాతకాః॥ ౫౧॥

ఎవని యనుమతిలేక మృగాదిహననముకాదో వాడనుమంతకర్త మొదలగు వా టిచే నవయవములను వేర్వేరుగా నరుకువాడు [illegible] చంపెడువాడు కొనెడువాడు

నమ్మెడువాఁడు వంటచేసెడువాఁడు దానిని సిద్ధపరచిపెట్టెడువాఁడు తినెడువాఁడు వీరునుఘాతకులే యనఁగా నసుమంత మొదలగువారికందఱకిని శాస్త్రీయముకాదు గాన ననుమత్యాదులు చేయరాదని యర్థము శాస్త్రము విధినిషేధపరము గావున ఖాదకాదులకు ప్రాయశ్చిత్తార్థము గోవిందరాజు క్రయవిక్రయి యనుచో మాంసమును గాని యమ్మెడివాఁడని యొకని కేచని చెప్పె నదిగాదు॥ శ్లో॥ "హనానేన తథాహంతా ధనేన క్రయికస్తథా। విక్రయీచ ధనాదానాత్। సంస్కర్తా తత్ప్రవర్తనాత్" అని యమస్మృతిలో వేర్వేరు చెప్పుటవలననని కుల్లూకభట్టు॥ ౫౧॥

మూ॥ స్వమాంసం పరమాంసేన యోవర్ధయితుమిచ్ఛతి। అన
భ్యర్చ్య పితౄన్ దేవాన్ తతోన్యోనాస్త్యపుణ్యకృత్॥ ౫౨॥

దేవపిత్రాద్యర్చనములేక పరమాంసముచే దనమాంసము నెవఁడు వృద్ధినొందించదలంచు నంతకంటె పాపాత్ముఁడు లేఁడని మాంసభక్షణనిందానువాదము॥ ౫౨॥

మూ॥ వర్షే వర్షేఽశ్వమేధేన యోయజేత శతంసమాః। మాం
సానిచ నఖాదేద్య స్తయోః పుణ్యఫలం సమం॥ ౫౩॥

ఇప్పుడు అవిహితమయిన నప్రతిషిద్ధమైనను మాంసమును దిననివాని ఫలమును చెప్పుచున్నాఁడు నూరువత్సరములు ప్రతివర్షము నశ్వమేధమును జేసినవానికిన్ని యావజ్జీవమును మాంసమును దిననివానికిని స్వర్గాదిఫలము తుల్యము॥ ౫౩॥

మూ॥ ఫలమూలాశనైర్మేధ్యైర్మున్యన్నానాంచ భోజనైః। న
తత్ఫలమవాప్నోతి యన్మాంసపరివర్జనాత్॥ ౫౪॥

విహితానిషిద్ధ మాంసభక్షణమును వర్జించిన నేమిఫలమగునది పవిత్రకందమూల ఫలాదులచేతనున్ను నీవారాది మున్యన్నములచేతనున్ను బ్రదుకువానికైన నాఫలము రాదు॥ ౫౪॥

మూ॥ మాంసభక్షయితాముత్ర యస్యమాంసమిహాద్మ్యహం।
ఏతన్మాంసస్య మాంసత్వం ప్రవదంతి మనీషిణః॥ ౫౫॥

ఈలోకమందు ఎవని మాంసమును నేనుభక్షింతునో పరలోకమం దదిననుదినునని వ్యుత్పత్తిగలది మాంసశబ్దమని విద్వాంసులు చెప్పుచున్నారు ఇదివిధివర్జితమాం

సభక్షణ పాపఫలకథనార్థము॥ ౫౫॥

మూ॥ నమాంస భక్షణే దోషో నమద్యేనచ మైథునే। ప్రవృత్తి
రేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలా॥ ౫౬॥

బ్రాహ్మణాది వర్ణములు వారికి యథాధికారముగ నవిహితాప్రతిషిద్ధభక్షణ ము వలన దోషములేదు- ఏ హేతువచే ప్రాణులకు భక్షణపానమైథునాదిక మందు ప్రవృత్తియగా స్వాభావికమీ ప్రవృత్తియందు అవిమానడము వలన మహాఫలమగును- అ ... షిద్ధమద్య మైథున నివృత్తివలన మహాఫలమగుననుట కీ చెప్పబడిన మ... ము చేసిన మహాఫలమున కనువాదము॥ ౫౬॥

మూ॥ ప్రేతశుద్ధిం ప్రవక్ష్యామి ద్రవ్యశుద్ధిం తథైవచ। చతుర్ణా
మపి వర్ణానాం యథావదను పూర్వశః॥ ౫౭॥

బ్రాహ్మణాది నాలుగు వర్ణముల వారికి పిత్రాదుల మరణమందు ప్రేతశుద్ధిని బ్రాహ్మణాదిక క్రమముగ నెవరి కెన్నిదినములో యదెన్ని రాగ యిత్తడి మొదలగు పా ... శుద్ధిని చెప్పదలచుచు శుద్ధికశుద్ధిసాపేక్షకలదు గావున దాని నీవక్ష్యమా ణముచే నిరూపించుచున్నాడు॥ ౫౭॥

మూ॥ దంతజాతే నుజాతేచ కృతచూడేచ సంస్థితే। అశ్యాక్సం
చ... స్థ్నాం త్ర్యహమేకాహ మేవచ॥ ౫౮॥

ద... ము లున్న పైన వాడున్న ఆ పైని చూడాకర్మము జరిగిన పైవాడు ను ఆ క్రమముగానే చకారము వలన నుపనీతుడునుచనిపోతేఅస్థిసంచయనమునకుపూ ర్వము సపిండులు స... నోదకు లనగా నేదుతరములలోవారు మూడుదినముల శుద్ధులగు చున్నారు వయోవిభాగముచే నుద్దేశమాత్రమిదివక్ష్యమాణ శౌచకాల భేదాదులు సుఖముగ దెలియుటకు॥ ౫౮॥

మూ॥ దశాహం శావమాశౌచం సపిండేషు విధీయతే। అర్వా
క్సంచయనా దస్థ్నాం త్ర్యహమేకాహ మేవచ॥ ౫౯॥

సప్తపురుషపర్యంతము నీలోపలివారు సపిండులు వీరికి శావనిమిత్తమగు నా శౌచము బ్రాహ్మణులకు పదిదినములు॥"శ్లో॥ శుద్ధ్యే ద్విప్రో దశాహేన" యని చె

ప్పుగలడుగాన అస్థిసంచయనమునకు పూర్వమందు దినత్రయమైన నేకాహారాత్రమైన నని చెప్పుట చతురహాశౌచపక్షణము॥ "సూ॥ చతుర్థే దివసే అస్థిసంచయనం కుర్యాత్" నాలవదినమున నస్థిసంచయనము జేయవలయునని విష్ణువచనము వలన ఇది అగ్నివేదాదిగుణాపేక్షచే వ్యవస్థచే వికల్పమెట్లనిన॥ "శ్లో॥ ఏకాహాచ్ఛుధ్యతే విప్రో యోగ్నివేద సమన్వితః। హీనేహీనం భవేచ్చైవ త్ర్యహస్చతురహస్తథేతి" యనుదక్షవచనము వలన శ్రౌతాగ్నిహోత్రియు మంత్రబ్రాహ్మణాత్మక కృత్స్నశాఖాధ్యాయియు నగు విప్రునకొకదినమాశౌచము శ్రౌతాగ్నివేదాధ్యయనములలోనొకగుణము తక్కువగలవాడు హీనుడు వానికి మూడు దినములు ఉభయగుణరహితుడై స్మార్తాగ్నిమాత్రముగలవాడు హీనతరుడు వానికి నాలుగుదినములు యేగుణమును లేనివానికి పదిదినములాశౌచము॥ "శ్లో॥ నిర్గుణోదశభిర్దినైః" స్వాధ్యాయాది గుణశూన్యునకు పదిదినములకు శుద్ధియగునని పరాశరుడు॥ ౫౯॥

మూ॥ సపిండతాతు పురుషే సప్తమే వినివర్తతే। సమానోదకభావస్తు జన్మనామ్నో రవేదనే॥ ౬౦॥

సపిండలక్షణమును చెప్పుచున్నాడు ఏపురుషుని మొదలుకునివాడు వాని తండ్రి వాని తాత యిట్లేషుగురిదనుక సపిండు లనబడుదురనగా తానుగాక పైవారారుగురు ఏడవవానితో నీమొదటివానికి సపిండతనివర్తించును ఈప్రకారముగనే పుత్రపౌత్రాదుల యందున్ను సాపిండ్యమును దెలియవలయును పిండ సంబంధినిబంధనయీసపిండత అదియెట్లనిన పితృపితామహప్రపితామహులకు పిండదానము ప్రపితామహుని తండ్రిమొదలుకొని మగ్గురు పిండలేపభుజులు అటపై దానికి పిండసంబంధము లేదుగాన నీయారుగురును సపిండులు ఈమొదటివాడే యారుగురికిని సపిండుడు పిండదాతృత్వసంబంధము వలన నదిగావున నేడుగురు పురుషులు గల దీసపిండత ఇందుకు మత్స్యపురాణము॥ "శ్లో॥ లేపభాజశ్చతుర్థాద్యాః పిత్రాద్యాః పిండభాగినః। పిండదస్సప్తమస్తేషాం సాపిండ్యం సాప్తపౌరుష"మని తనతండ్రినుంచి నాలవవాడు మొదలుకుని ముగ్గురు లేపభాగులు తండ్రిమొదలగు ముగ్గురు పిండభాగులు వారికి పిండములను బెట్టెడువాడేడవవాడు ఈసాపిండ్యమేడుగురు పురుషులు గలదియని ఇచ్చట గోత్రముచేతనే సపిండత అదిగనుకనే శంఖలిఖితు

ఋ॥ "శ్లో॥ సపిండతాతుసర్వేషాం గోత్రతస్సాప్తపౌరుషీ" యందరికిని గోత్రము చేతనే సపిండత సాప్తపౌరుషియని-దానిచే మాతామహాదుల కొక పిండసంబంధముండినను సపిండత్వములేదు సమానోదకత్వమయితే నావంశమందీ పేరుగలవాడు పుట్టెనని జన్మమునామము తెలియనియప్పుడు నివర్తించును॥ ౬౦॥

మూ॥ యథేదం శావ మాశౌచం సపిండేషు విధీయతే।జననేప్యే
వ మేవస్యాన్నిపుణాం శుద్ధిమిచ్ఛతా॥ ౬౧॥

ఏప్రకారముగ శావాశౌచను సపిండులకు దశాహాశావమాశౌచమని చెప్పబడెనో జననాశౌచమున్ను సమ్యక్‌శుద్ధినిగోరెడువానికర్మానుష్ఠానానర్హ లక్షణముగుసూతకమగును॥ ౬౧॥

మూ॥ సర్వేషాం శావ మాశౌచం మాతాపిత్రోశ్చ సూతకం।సూ
తకం మాతురేవస్యా దుపస్పృశ్య పితాశుచిః॥ ౬౨॥

నిర్దేశములేకుండా తుల్యత్వము ప్రాప్తమౌచుండ విశేషమునుచెప్పుచున్నాడు మరణనిమిత్తమయిన యస్పృశ్యత్వలక్షణమగు నాశౌచను సపిండులకందరికిసమానము జననినిమిత్తమగు నాశౌచమయితే తలిదండ్రులకుమాత్రమే యగుచున్నది యందులోనిది విశేషము జననిమిత్తాస్పృశ్యత్వము తల్లికే దశరాత్రములు తండ్రియైతే స్నానమాత్రమువలన స్పృశ్యుడగుచున్నాడు యీసంబంధను సంవర్తుని చే వ్యక్తముగ జేయబడెను శ్లో॥ "జాతేపుత్రే పితుస్స్నానం సచేలంతువిధీయతే। మాతాశుధ్యేద్దశాహేన స్నానాత్తుస్పర్శనంపితురితి" పుత్రుడు జనితుడగుచుండ దండ్రి సచేలస్నానము జేయవలయును దానిచే నతడు స్పృశ్యుడగును తల్లిపదిదినములచే శుద్ధురాలగును॥ ౬౨॥

మూ॥ నిరస్యతు పుమాఞ్ఛుక్ర ముపస్పృశ్యైవ శుధ్యతి। బైజి
కాదభి సంబంధా దనురుంధ్యా దఘంత్ర్యహం॥ ౬౩॥

శ్లో॥ "స్నానంమైథునస్స్మృత" మని మైథునమగుచుండ స్నానము విధించగలదుగావున మైథునవ్యతిరిక్తముగా కామముచే రేతస్ఖలనమగుచుండ స్నానముజేసి శుద్ధుడగుచున్నాడు కామమువలనగాక స్వప్నాదికమందు రేతఃపతనమాయెనేని॥సూ॥ "మూత్రవద్రేతసఉత్సర్గ ఇతి" రేతోత్సర్గను మూత్రోత్సర్గమువంటి

జేయని యాపస్తంబవచనమువలన స్నానము జేయకుండిన గృహస్థునకు శుద్ధియాగు
ను బ్రహ్మచారికైతే కామమువలనగాకుండ స్వప్నాదికమందు॥ శ్లో॥ "స్వప్నే సిక్త్వా
బ్రహ్మచారీ" యనువచనముచే స్నానాదికమువలన శుద్ధి జెప్పబడెను బైజికసంబం
ధము గలుగుచుండ నొకనిభార్యయందు తన రేతఃపాతమువలన సంతానోత్పత్తియ
గుచుండ మూడుదినములాశౌచమగుచున్నది యిందుకువిష్ణువచనము॥ సూ॥ "పరపూ
ర్వభార్యాసుత్రిరాత్రం రేతఃపాతనఇతి" యనిఆశౌచము ప్రకృతమైనను జననప్రకరణ
మందు ప్రసంగము వలన తదను గుణముగ జెప్పబడెను ఎచ్చట రేతఃపాతమా
త్రమునకు స్నానముచితమో యచ్చట సంతానము బుట్టెనేని త్రిరాత్రముచితము॥

మూ॥ అహ్నా చైకేన రాత్ర్యా చ త్రిరాత్రైరేవచ త్రిభిః । శవ
స్పృశో విశుధ్యంతి త్ర్యహాదుదకదాయినః॥ ౬౪॥

ఒకపగలు నొకరాత్రి కలసి యేకదినమాయెను మూడుత్రిరాత్రములగా తొ
మ్మిదిదినములు కలసి పదిదినములని చమత్కారముగా జెప్పెనుపదిదినములనేటిచో
నింతవాగ్విస్తారమేల ననిన జెప్పెద॥ "శ్లో॥ బహ్వాయసేంలఘిష్ఠాం వాగరంనిమాంతి
తివాగ్మినః । నచావశ్యత్వమేతేషాం లఘూక్త్యైవ నియమ్యతే॥" వక్తలు బహూక్తు
లుగలదియైనలఘూక్తులుగలదైన వాక్కును నిర్మింతురు లఘూక్తులుగల వాక్కు
చేతనే చెప్పవలెనని వారికావశ్యకత లేదు గావున నిట్లుజెప్పిరిది వైదగ్ధ్యము స్వా
ధ్యాయాదిగుణయోగముచే- నేసపిండు లేదినముచే శుద్ధులో వారు స్నేహముచే శ
వస్పర్శమొనర్చిరేని వారుపదిదినములచే శుద్ధులగుదురు చెప్పెదను॥ ౬౪॥

మూ॥ గురోః ప్రేతస్య శిష్యస్తు పితృమేధంసమాచరన్ । ప్రేత
హారైస్సమం తత్ర దశరాత్రేణ శుధ్యతి॥ ౬౫॥

ఆచార్యులు మొదలగు గురువులకు పితృమేధమొనర్చిశిష్యుడు ప్రేతమునుమోయు
సపిండులతో పదిదినములచే శుద్ధుడగును॥ ౬౫॥

మూ॥ రాత్రిభి ర్మాసతుల్యాభి ర్గర్భస్రావేవిశుధ్యతి । రజ
స్యుపరతేసాధ్వీ స్నానేన స్త్రీరజస్వలా॥ ౬౬॥

ఆరుమాసముల పర్యంతమే ఇందుకాదిపురాణము "శ్లో॥ షణ్మాసాభ్యంతరం
యావద్గర్భస్రావోభవేద్యది। తథామాససమైస్తాసాం దివసైశ్శుద్ధిరుచ్యతే। అత

రెండేండ్లు నిండక చూడాకర్మలేకపోయిన బాలునకు నగ్నిసంస్కారము నుదకదానమును లేదు. పీనుగుచే తమ్ము రక్ష్యము లేకైనను చేయవలదు అరణ్యమందొక కర్రబారవేసినట్లు పారవేయవలెను దీనికార్థమువలె పారవేయుమనుటచేదుఃఖింపవలదని తాత్పర్యము బంధువులు మూడుదినములాశౌచము బట్టవలెను చూడాకర్మమునకు పూర్వము గతించిన శిశువున కొకదినమాశౌచమని మున్నుచెప్పి యిప్పుడు త్ర్యహాశౌచమనుటచే వ్యవస్థితవికల్పము. అది వేదాగ్నిహోత్రాది సంపన్నుడొకడను ముచేతనున్న నితరులకు మూడుదినములని వ్యవస్థ మనువైతే కార్ఠమువలె నరణ్యమందు పారవేయుమనిచెప్పెను॥ సూ॥ "ఊనద్వివార్షికంనిఖనేత్" దనుయాజ్ఞవల్క్యవచనముచే ఖననమే చేయవలయునని వ్యాఖ్యానముచేయవలెను॥ ౬౯॥

మూ॥ నాత్రివర్షస్య కర్తవ్యా బాంధవైరుదకక్రియా । జాత
దంతస్యవా కుర్యు ర్నామ్నివాపి కృతేసతి॥ ౭౦॥

మూడుసంవత్సరములుకాని వానికుదకదానములేదని పూర్వముచెప్పినదానికనువాదము దంతములు వచ్చినవానికిన్ని నామకరణమయినవానికిన్ని యుదకదానాదికమున కనుజ్ఞ యివ్వబడెనుగాని చేసిరేని యాప్రేతకుపకారమగును చేయకుండిన ప్రత్యవాయము లేదు ఇట్లు తోచుచున్నది॥ ౭౦॥

మూ॥ సబ్రహ్మచారిణ్యేకాహ మతీతే క్షపణం స్మృతం।జన్మన్యే
కోదకానాంతు త్రిరాత్రాచ్ఛుద్ధి రిష్యతే॥ ౭౧॥

సహాధ్యాయి మరణమందొక దినమాశౌచము సమానోదకులకు జననాశౌచము మూడుదినములు "త్ర్యహానుదకదాయినా"మని మరణాశౌచము జెప్పబడెను॥

మూ॥ స్త్రీణామసంస్కృతానాంతు త్ర్యహాచ్ఛుధ్యంతి బాంధవాః।
యథోక్తేనైవ కల్పేన శుధ్యంతిహి సనాభయః॥ ౭౨॥

వివాహమును గాలేదుగాని వాగ్దానముమాత్రమయిన స్త్రీలకు బాంధవులు భర్తయును త్రిరాత్రాశౌచముబట్టవలెను వాగ్దానములేనిదానికి భర్తృసంబంధము లేదుగావున ఇచ్చెదనని ప్రతిజ్ఞచేయబడినను వాగ్దానాంతపర్యంతము తెలియదగును వాగ్దానానంతరమందును వివాహానంతరమందును సనాభులనగా పితృపక్షీయులకు పూర్వోక్తప్రకారము మూడుదినములాశౌచము॥ శ్లో॥ "ఆజన్మనస్తుచూ

దాంతం యత్రకన్యావిపద్యతే। సద్యశ్శౌచం భవేత్తత్ర సర్వవర్ణేషు నిత్యశః। తతో వాగ్దానపర్యంతం యావదేకాహమేవహి। అతఃపరం ప్రవృద్ధానాం త్రిరాత్రమితి నిశ్చయః। వాగ్దానేచకృతే తత్ర జ్ఞేయంచోభయతస్త్ర్యహం। పితుర్వరస్యచతతో దత్తానాం భర్తురేవహి। స్వజాత్యుక్తమశౌచంస్యాత్ సూతకే సూతకేపిచేతి" పుట్టినది మొదలుకొని చూడాకర్మము యొక్కయిట్టుకు కన్యచనిపోతె అన్నివర్ణములవారికిని సద్యశ్శౌచమగును ఆపైని వాగ్దానముదనుక నొకదినమాశౌచము ఆపైని మూడుదినములాశౌచము వాగ్దానమయినపిమ్మట భర్తకును పితృకులకును మూడుదినములు కన్యాదానమయినపిమ్మట భర్తృకులమువారికేజాతిప్రయుక్తాశౌచములు తజ్జాత్యుక్తప్రకారమాశౌచమని యాదిపురాణము మేధాతిథి గోవిందరాజులు"యస్తాత్రైవకల్పెన"యనుచో"నృణామకృతచూడానా"మనెడువిధిచేతనైనులగుచున్నారని వ్యాఖ్యజేసిరి ఈవ్యాఖ్యానమందు పుత్రునకుంబలెకన్యకకున్ను చూడాకర్మయయిన పిమ్మటమరణమందు మూడుదినములాశౌచమయ్యెనిఅది ఆదిపురాణాద్యనేకవచనవిరుద్ధము ౭౨॥

మూ॥ అక్షారలవణాన్నాస్స్యుర్నిమజ్జేయుశ్చ తే త్ర్యహం। మాంసాశనంచ నాశ్నీయుః శయీరంశ్చ పృథక్ క్షితౌ॥ ౭౩॥

అక్షారలవణమనగా కృత్రిమలవణము వంటి యుప్పుతప్రహితముగ భుజించవలెను మూడుదినములున్ను నద్యాదులందు స్నానము జేయవలయును మాంసమున్ను భక్షించరాదు భూమియందొక్కొక్కరె పరుండవలెను॥ ౭౩॥

మూ॥ సన్నిధావేష వైకల్పశ్శావాశౌచస్య కీర్తితః। అసన్నిధావయంజ్ఞేయో విధిసంబంధిబాంధవైః॥ ౭౪॥

మృతుని సన్నిధియనగా నొకటచో నుండుటవలన సహాపరిజ్ఞానమందు శావాశౌచముయొక్క విధిచెప్పబడెను దేశాంతరమందు మరణమైనచో దెలియనియప్పుడు ఈవక్ష్యమాణమగు విధిసంబంధిబాంధవులచే దెలియదగును సంబంధులనగా సపిండులు బాంధవులనగా సమానోదకులు॥ ౭౪॥

మూ॥ విగతంతు విదేశస్థం శృణుయాద్యోహ్యనిర్దశం। యచ్ఛేషం దశరాత్రస్య తావదేవాశుచిర్భవేత్॥ ౭౫॥

దేశాంతరమందు మృతుడైన వార్త దశరాత్రములలో వినిన శేషరాత్రులయందు శుచి యగును ఇది జననశౌచమున కుపలక్షణము॥ ౭౫॥

మూ॥ అతిక్రాంతే దశాహేచ త్రిరాత్రమశుచి ర్భవేత్ । సంవ
త్సరే వ్యతీతేతు స్పృష్ట్వైవాపో విశుధ్యతి॥ ౭౬॥

"శ్లో॥ నాశౌచం ప్రసవస్యాస్తి వ్యతీతేషు దినేష్వపి। జననాశౌచము పదిదినములు దాటిన వెనుక వినినది లేదని దేవలవచనము వలన నతిక్రాంతాశౌచము మరణ విషయము యనే తెలియవలెను సపిండుని మృతియగుచుండ దశదినము లతిక్రమించిన పైని దెలసిన మూడుదినము లాశౌచము సంవత్సరమతిక్రమించిన స్నానమాత్రముననే శుద్ధియగును ఇది విశేషము లేకుండ జెప్పుట వలన సర్వవర్ణములవారికి నని దెలియవలెను॥ ౭౬॥

మూ॥ నిర్దశం జ్ఞాతిమరణం శ్రుత్వాపుత్రస్య జన్మచ । సవాసా
జలమాప్లుత్య శుద్ధో భవతి మానవః॥ ౭౭॥

పదిదినములు యాశౌచమతిక్రమించిన నటుపై వినినత్ర్యహాశౌచము కమాన హాలక్షణ మేదిజెప్పబడెనో తదంగాస్పర్శవిషయమైన పదిదినము లతిక్రమించిన పైని జ్ఞాతిమరణము వినియు పుత్రజన్మము వినియు సచేలస్నాన మొనరించి స్పృశ్యుడగును॥ ౭౭॥

మూ॥ బాలే దేశాంతరస్థేచ పృథక్ పిండేచ సంస్థితే। సవాసాజల
మాప్లుత్య సద్య ఏవ విశుధ్యతి॥ ౭౮॥

దంతములు వచ్చి చూడాకర్మము కానివాని కొకయహోరాత్రము చెప్పెను గావున నిచ్చట బాలుడనగా దంతములు రానివాడు మృతుడైనను పూర్వశ్లోకమందు దశాహాశౌచికి త్ర్యహాశౌచవిధానమువలన నేకాశౌచి దేశాంతరస్థుడైన మృతుడైనను పృథక్పిండుడనగా సమానోదకుడు వీనికి త్రిరాత్రాశౌచము చెప్పబడెను గాన నామూడు నాళ్లుంతిక్రమించెనేని స్నానముచేనందరికిని శుద్ధియగును॥

మూ॥ అంతర్దశాహే స్యాతాంచే త్పునర్మరణ జన్మనీ। తా
వత్స్యా దశుచి ర్విప్రో యావత్తత్స్యా దనిర్దశః॥ ౭౯॥

పురుషులో పురుషుడు శావములో శావము దశాహమధ్యను సంభవించెనేని పూర్వాశౌచముయొక్క శుద్ధితోనే ద్వితీయాశౌచము వలననున్ను శుద్ధులగుదురు పునఃయంటచే సమానులలోనె యీ శౌచము లేదని॥ ౭౯॥

మూ॥ త్రిరాత్రమాహు రాశౌచ మాచార్యే సంస్థితే సతి । తస్య
పుత్రేచ పత్న్యాంచ దివా రాత్రమితిస్థితిః॥ ౮౦॥

ఆచార్యమరణమయినచో శిష్యునకు మూడు దినములాశౌచము అతనిపుత్రుడు పత్నియేని మృతులైన నేకాహోరాత్రముచే శుద్ధియగునని శాస్త్రమర్యాద॥

మూ॥ శ్రోత్రియే తూపసంపన్నే త్రిరాత్రమశుచి ర్భవేత్ । మా
తులే పక్షిణీం రాత్రిం శిష్యర్త్విగ్బాంధవేషుచ॥ ౮౧॥

వేదశాస్త్రాధ్యయనముగలవాడుపసంపన్నుడగుచుండెనేని యనగా మైత్రిచేసమీపవర్తియు స్వగృహనివాసియునై మృతినొందిన త్రిరాత్రాశౌచము మేనమామ శిష్యుడు ఋత్విక్కులును బాంధవులును మృతులైరేని పక్షిణ్యాశౌచము అనగా రెండు పగళ్ల మధ్యనున్న రాత్రియని॥ ౮౧॥

మూ॥ ప్రేతే రాజని సజ్యోతి ర్యస్యస్యా ద్విషయే స్థితిః । అశ్రోత్రి
యే త్వహః కృత్స్న మనూచానే తథాగురౌ॥ ౮౨॥

ఏదేశమందు బ్రాహ్మణాదులు నివసింతురో దేశాధిపతి మూర్ధాభిషిక్తుడగు క్షత్రియుడు మృతుడైన సజ్యోతియనగా పగలైతే సూర్యాస్తమానమయ్యే పర్యంతమున్ను రాత్రియైతే నక్షత్రములు కనపడకపోయె మట్టుకు నాశౌచము శ్రోత్రియునకు మూడు దినములు చెప్పబడెను గాన నశ్రోత్రియుడా గృహమందు బోయిన నాపగలు మాత్రమాశౌచము కృత్స్నశాఖాధ్యాయికిన్ని గురువునకున్ను పగలైతే పగలుమాత్రము రాత్రియైతే రాత్రిమాత్రమాశౌచము॥ ౮౨॥

మూ॥ శుద్ధ్యే ద్విప్రో దశాహేన ద్వాదశాహేన భూమిపః । వై
శ్యః పంచదశాహేన శూద్రో మాసేన శుద్ధ్యతి॥ ౮౩॥

ఉపనీతుడగు సపిండుడు మృతుడాయెనేనియు సంపూర్ణకాలీన జననమందున్ను వృత్తస్వాధ్యాయాదిరహితుడగు బ్రాహ్మణుడు పదిదినములతో శుద్ధుడగును

క్షత్రియుఁడు పదిరెండుదినములకున్ను వైశ్యుఁడు పదేనుదినములకున్ను శూద్రునకు పసయస్థానీయము వివాహము గావున వివాహమైన శూద్రుఁడు నెలకును శుద్ధులగుదురు॥ ౮౩॥

మూ॥ నవర్ధయే దఘాహాని ప్రత్యూహే న్నాగ్నిషు క్రియాః।న
చ తత్కర్మ కుర్వాణ స్సనాభ్యోప్య శుచి ర్భవేత్॥ ౮౪॥

వృత్తస్వాధ్యాయాదులను పట్టి అస్థిసంచయనమునకు పూర్వమందును చెప్పబడిన యాశౌచసంకోచము కర్మలేకుండ సుఖముగ నుండవచ్చునని దశాహాద్యాశౌచము నవలంబించి యాశౌచదినములను వృద్ధినొందించ గూడదు సంకుచితాశౌచదినము లందున్ను అగ్నిషు యని బహువచనముచే శ్రౌతాగ్నిహోత్రహోమముల విఘాతము జేయరాదు స్వయము జేయవలయు నశక్తివిషయమందు పుత్రాదులచే జేయించ వచ్చును ఇచ్చటనే హేతువును చెప్పుచున్నాఁడు- ఏహేతువచే యాకర్మము నగ్నిహోత్రరూపమగు దానిని జేయుచున్న పుత్రాదు లశుచులు గారు "నిత్యానివినివర్తంతే వైతానవర్జమితి" వైతానమనగా శ్రౌతాగ్నిహోమము గార్హపత్యకుండమందగు నగ్నుల నాహవనీయాదులందు విహరించిహోమమొనర్చుట యదిగాక ఘిగిలిన నిత్యకర్మము లాశౌచమందు లేవని పారస్కరుండు॥ "సూ॥ అగ్నిహోత్రార్థం స్నానోపస్పర్శనాచ్ఛుచిరితి" అగ్నిహోత్రార్థము స్నానాచమనములచే శుచియగునని శంఖలిఖితులు॥ శ్లో॥ జన్మహానౌ వితానస్య కర్మలోపోనవిద్యతే। శాలాగ్నౌ కేవలో హోమః కార్యఏవాన్యగోత్రజైరితి" జాతమృతాశౌచములందు శ్రౌతాగ్నిహోత్రలోపము గూడదు స్మార్తాగ్నియం దన్యగోత్రునిచే హోమమాత్రము జేయించ వలెనని జాబాలివచనము॥ "శ్లో॥ మృతకే కర్మణాం త్యాగ స్సంధ్యాదీనాం విధీయతే। హోమశ్శ్రౌతేషు కర్తవ్యశ్శుష్కాన్నేనాపివాఫలై రితి" మృతాశౌచమందు సంధ్యాదికర్మములకు త్యాగము విధించబడెను శ్రౌతాగ్నిహోమము శుష్కాన్నముచేనైన ఫలములచేనైన జేయవచ్చునని ఛందోగపరిశిష్టము అదిగావున నేకాహత్ర్యహాద్యాశౌచసంకోచమందు సంధ్యాదులకు త్యాగమున్ను శ్రౌతాగ్నికి త్యాగమున్ను జెప్పబడెను ఏకాహత్ర్యహాద్యాశౌచమునివర్తించినపిమ్మట సంధ్యావైశ్వదేవ పంచమహాయజ్ఞాదులను జేయవచ్చును మేధాతిథి గోవిందరాజు లిచ్చట నేకాహత్ర్యహాద్యాశౌచసంకోచము హోమస్వాధ్యాయమాత్రవిషయము సంధ్యోపాసనాదికమయితే యెట్టివాఁడు

న్ను పదిదినములున్ను మానవలెనని చెప్పితి యిదినిష్ప్రమాణమని కుల్లూకభట్టుగ్రా
సెను॥ సూ॥ "రాజ్ఞాంచకర్మణివిరోధా బ్రాహ్మణస్య స్వాధ్యాయనివృత్త్యర్థమి
తి" రాజులకుపాలన కర్మమునకు విరోధముగావునను బ్రాహ్మణులకు స్వాధ్యా
యాదినివృత్తికిని యాశౌచసంకోచమని గౌతముడు యాజ్ఞవల్క్యుని చేతనున్ను॥
శ్లో॥ "ఋత్విజాం దీక్షితానాంచ" యనునది మొదలుకొని సద్యశ్శౌచముచెప్పబడెను
దశాహాద్యాశౌచము గలవారికందరికిని తత్తత్కర్మవిషయమున్ను నైతేనుభ
యమువందున్ను॥ శ్లో॥ "దశాహానికులస్యాన్నం నభుంజీత" యనునది మొదలుగాతత్త
త్కర్మ విశేషవచనములు దశాహాశౌచములని విరోధమేమియులేదు అదిగావున
హీనామమస్వాధ్యాయమాత్రార్థమే గుణవంతునకాచారలాఘవము సంధ్యోపాస
నార్థముగాదనునది నిష్ప్రమాణము॥ ౮౪॥

మూ॥ దివాకీర్తిముదక్యాంచ పతితం సూతికాం తథా। శవంత
త్స్పృష్టినం చైవ స్పృష్ట్వాస్నానేన శుధ్యతి॥ ౮౫॥

చండాలుని రజస్వలను పతితుని పురిటిదానిని శవమును శవస్పర్శ మొనర్చిన
వానిని స్పృశించెనేని స్నానముచేశుద్ధుడగును కొందరుతత్స్పృష్టిన మనునదిచండా
లాదులను స్పృశించినవానిని యందరితోటి సంబంధింపజేసిరి గోవిందరాజు శవ
స్పర్శముగలవానినే తత్స్పృష్టిననుచో జెప్పెనుగాని యుదక్యాదులను జెప్పలేదు అ
ట్టిచో నాచమనమునసే శుద్ధిగావున॥ శ్లో॥ "ఉదక్యాశుచిభిస్స్నాయా త్సంస్పృష్ట
స్తైరుపస్పృశేదితి" ఉదక్యాద్యాశౌచులచేతను స్పృశించబడిస్నానమున్ను ఉదక్యా
దిస్పృష్టస్పృష్టులకాచమనమున్ను నని యజ్ఞవల్కుడు జెప్పెను॥ ౮౫॥

మూ॥ ఆచమ్య ప్రయతో నిత్యం జపేదశుచి దర్శనే। సౌరాన్మం
త్రాన్యథోత్సాహం పావమానీశ్చ శక్తితః॥ ౮౬॥

శ్రాద్ధదేవపూజాదులను జేయదలచి స్నానాదులచే శుద్ధుడైనవాడుదక్యాద్య
శుచులను జూచెనేని యాచమనమొనర్చి యుదుత్యమిత్యాది సౌరమంత్రములను
న్ను పావమానీమంత్రములనున్ను బఠించి శుద్ధుడగును॥ ౮౬॥

మూ॥ నారం స్పృష్ట్వాస్థిసస్నేహం స్నాత్వా విప్రోవిశుధ్యతి।
అచమ్యైవతు నస్నేహం గామాలభ్యార్కమీక్ష వా॥ ౮౭॥

మనుష్యాస్థి పచ్చిది ముట్టెనేని ద్విజుడు స్నానముచేతను న్నిస్నేహము గు మనుష్యాస్థిని ముట్టిన నాచమించి గోవును ముట్టియైన నర్కునిజూచియైన శుద్ధుడగును॥ ౮౭॥

మూ॥ ఆదిష్టినోదకం కుర్యా దావ్రతస్య సమాపనాత్ । సమాప్తే తూదకం కృత్వా త్రిరాత్రేణైవ శుద్ధ్యతి॥ ౮౮॥

ఆదిష్టనునగా బ్రహ్మచర్యవ్రతము అదిసమాప్తమయ్యేపర్యంతము ప్రేతోదకదానము చేయగూడదు ఆవ్రతము సమాప్తమయినపిమ్మట నుదకమునిచ్చి మూడు దినములకు శుద్ధుడగును ఉదకమనునది షోడశశ్రాద్ధాది ప్రేతకర్మమునకంతకును ఉపలక్షణము ఇదిన్ని మాతృపితాచార్య వ్యతిరిక్తవిషయము॥సూ॥ "బ్రహ్మచారిణశ్శవకర్మణా వ్రతాన్నివృత్తిరన్యత్ర మాతాపిత్రోర్గురోర్వా శవకర్మణేతి" శవకర్మమనగా పితృమాతాచార్యుల శవనిమిత్తమగు దహనాది సపిండాంతకర్మములచేగాక నితరులశవకర్మములచే బ్రహ్మచర్యవ్రతనివృత్తియగునని వసిష్ఠవచనము॥శ్లో॥"ఆచార్యంస్వముపాధ్యాయ"మని చెప్పగలడు॥ ౮౮॥

మూ॥ వృథా సంకరజాతానాం ప్రవ్రజ్యాసుచ తిష్ఠతాం। ఆత్మనస్త్యాగినాంచైవ నివర్తేతోదకక్రియా॥ ౮౯॥

వృథాసంకరజాతానా మనగా జాతశబ్దము ప్రత్యేకముసంబంధించును వృథాజాతులనగా బాహుళ్యముగవిడువబడిన స్వజాతిధర్మములుగలవారికిన్ని సంకరజాతానామనగా హీనజాతిపురుషులవలన నుత్తమజాతస్త్రీలయందు బుట్టినవానికిన్ని వేదోక్తములుగాక వేదబాహ్యములగు కాయాదిధారణముగల వెలిగందులసన్యాసులుమొదలయిన సన్యాసముగలవారికిన్ని అశాస్త్రీయముగ విషశస్త్రోద్బంధనాదులచే జచ్చినవారికిన్ని యుదకదానాది ప్రేతకృత్యము చేయనక్కరలేదనగా నర్హతలేదని॥ ౮౯॥

మూ॥ పాషండమాశ్రితానాంచ చరంతీ నాంచకామతః । గర్భభర్తృద్రుహాంచైవ సురాపీనాంచ యోషితాం॥ ౯౦॥

వేదబాహ్యములగు రక్తవస్త్రమౌంజీధారణము పాషండము దానినాశ్రయించినట్టిన్ని స్వేచ్ఛచే నొకనితోగాని యనేకమందితోగాని వ్యభిచరించినట్టియు గ

భర్తృపాతకభర్తృవధాదికములను జేసి స్త్రీయు సురాపానము చేసిన ద్విజస్త్రీ
లకు ప్రేతకర్మము నివర్తించవలెనని తొలిశ్లోకముతో నన్వయము॥ ౯౦॥

మూ॥ ఆచార్యం స్వముపాధ్యాయం పితరం మాతరం గురుం। ని
ర్హృత్యతు వ్రతీ ప్రేతాన్ న వ్రతేన వియుజ్యతే॥ ౯౧॥

తనకు ఉపనయనాదిగా వేదమొకశాఖను సమగ్రముగ జెప్పిన యతండాచా
ర్యుడు వేదమందు కొంతభాగమునుకున్నైన వేదాంగమునైన జెప్పిన యతండుపా
ధ్యాయుడు వేదములో కొంతభాగమునైన నర్థమును జెప్పిన నతండు గురువు త
ల్లి తండ్రి వీరైదుగురికి ప్రేతకృత్యము దహనాదిసహపిండాంతరముగ జేసినను బ్ర
హ్మచర్యవ్రతములోపించదు ఈచెప్పటచే నితరులకు ప్రేతకృత్యము చేసిన వ్రత
ము చెడునని గమ్యమానమగుచున్నది॥ "శ్లో॥ గురోర్గురౌ సన్నిహితే గురువద్వృ
త్తిమాచరే"దని చెప్పుటవలన నాచార్యాచార్యుడుపాధ్యాయోపాధ్యాయుడు వి
రికి చెయ్యవలెనాయంటే స్వశబ్దమందరితో సంబంధించుట వలన నట్లాచార్యాచా
ర్యాదులకు ప్రేతకృత్యమాచరించేనేని వ్రతము చెడును॥ ౯౧॥

మూ॥ దక్షిణేన మృతం శూద్రం పురద్వారేణ నిర్హరేత్। పశ్చి
మోత్తర పూర్వైస్తు యథాయోగం ద్విజన్మనః॥ ౯౨॥

అపకృష్టుడు గావున దక్షిణద్వారమునుంచి శూద్రశవమునున్ను పశ్చిమద్వా
రమునుంచి వైశ్యునిన్ని ఉత్తరద్వారమునుంచి క్షత్రియునిన్ని పూర్వద్వారమునుంచి
బ్రాహ్మణునిన్ని శ్మశానమునకు తీసుకుని పోవలయును॥ ౯౨॥

మూ॥ న రాజ్ఞా మఘదోషోస్తి వ్రతినాం న సత్రిణాం తథా। ఐం
ద్రంస్థాన ముపాసీనా బ్రహ్మభూతాహితే సదా॥ ౯౩॥

మూర్ధాభిషిక్తులగు క్షత్రియులకు సపిండమరణమందాశౌచ దోషములేదు అ
భిషేకగుణముచే నింద్రాసనము నధిష్ఠించినవారు గావున బ్రహ్మచారులకను చాం
ద్రాయణాదివ్రతస్థులకును యజ్ఞాదిదీక్షాయుక్తులకున్ను వీరు బ్రహ్మభావమును
పొందినవారు గావున విరికి నాశౌచములేమి॥ "సూ॥ ఆశౌచం న రాజ్ఞాం రాజకర్మ
ణి నవ్రతినాం వ్రతే న సత్రిణాం సత్రేఇతి॥" రాజకర్మ మనగా పాలనము శాంతి
హోమాదికమగు కర్మమందు రాజులకును వ్రతస్థులకు వ్రతమందును యాగ

కర్తలకా యజ్ఞకర్మమందును నాశౌచము లేదని విష్ణుస్మృతి॥ ౯౩॥

మూ॥ రాజ్ఞాం మహాత్మికే స్థానే సద్యశ్శౌచం విధీయతె। ప్రజా
నాం పరిరక్షార్థ మాసనంచా న్నకారణం॥ ౯౪॥

మహాత్ములయొక్క స్థానము గావున మహాత్మికమగు స్థానము సర్వపాలకులగు రాజులకు మహారాజ్యపదమందున్న వారికి సద్యశ్శుద్ధివిధించబడుచున్నది ఆయాసనము ప్రజారక్షార్థ మదెట్లన్న దుర్భిక్షమందు నన్నదానముచేతను న్యాయనిరూపణముచేతను ఉపద్రవములు గనబడెనేని శాంతిహోమాదికము చేతనున్ను అట్టిరాజక్షత్రియేతరబ్రాహ్మణ వైశ్యశూద్రులయిన ననియీశ్లోకములో కనబడుచున్నది గావున జాతివివక్ష లేదు॥ ౯౪॥

మూ॥ డింభాహవ హతానాంచ విద్యుతా పార్థివేనచ। గోబ్రా
హ్మణస్య చైవార్థే యస్యచే చ్ఛతిపార్థివః॥ ౯౫॥

డింభాహవమనగా రాజులేనియుద్ధము దానియందును పిడుగుచేతనున్ను వధార్హాపరాధమందు రాజుచేతనున్న గోబ్రాహ్మణరక్షణార్థమున్నుయుద్ధము లేకుండ జలాగ్నివ్యాఘ్రాదులచేతనున్ను హతులయిన వారికిన్ని రాజాజ్ఞచే కార్యముల నొనచుపురోహితాదుల కాశౌచముండరాదని రాజేచ్ఛచేవారికిన్ని సద్యశ్శౌచము॥ ౯౫॥

మూ॥ సోమాగ్న్యర్కా నిలేంద్రాణాం విత్తా ప్పత్యో ర్యమస్యచ।
అష్టానాం లోకపాలానాం వపుర్ధారయతెన్నపః॥ ౯౬॥

చంద్రాగ్ని రవి సమీరేంద్ర కుబేర వరుణ యములయొక్కయు మరియు నున్న లోకపాలురయొక్క యంశములచే రాజు దేహధారియగును॥ ౯౬॥

మూ॥ లోకేశాధిష్ఠితో రాజా నాస్యాశౌచం విధీయతే। శౌచా
శౌచంహి మర్త్యానాం లోకేశప్రభవాప్యయం॥ ౯౭॥

దిక్పాలకుల యంశములతో రాజుబుట్టును గాన వీనికాశౌచమిటపై లేదనుచు నుపదేశించునేది మనుష్యులకాశౌచమైన శౌచమైననది లోకులకు ప్రభవించును నశించును ఇట్లాక యాశౌచము నుడువుటకును నడుపుటకు నధికారియగు ప్రభువు నకాశౌచము లేదని చెప్పనేల॥ ౯౭॥

మూ॥ ఉద్యతైరాహవే శస్త్రైః క్షత్రధర్మహతస్యచ । సద్య
స్సంతిష్ఠతే యజ్ఞస్తథా శౌచమితిస్థితిః॥ ౯౮॥

ఎత్తబడిన శస్త్రములుగల యుద్ధమందు క్షత్రధర్మముచే ననగా వెనుకదీయ కుండ కరచిలనే రాళ్లచేగాక శస్త్రముచే హతుడగువాని కప్పుడు యజ్ఞముసిద్ధమై సమాప్తమైనచో యాఫలము గల్గునని యర్థము అశౌచమున్నప్పుడే సమాప్తమగు నిదిశాస్త్రమర్యాద॥ ౯౮॥

మూ॥ విప్రశ్శుధ్య త్యపస్స్పృష్ట్వా క్షత్రియోవాహనాయుధమ్।
వైశ్యఃప్రతోదంరశ్మీన్వా యష్టింశూద్రఃకృతక్రియః॥ ౯౯॥

ప్రేతకర్మమంతయును జేసి బ్రాహ్మణుడు జలమునున్ను క్షత్రియుడు వాహనమునైన నాయుధమునైనను వైశ్యుడు వృషభములనైన ముసికోలనైనను శూద్రుడు వేణుదండమునున్ను కుడిచేతను స్పృశించి శుద్ధులగుదురు॥ ౯౯॥

మూ॥ ఏతద్వోఽభిహితం శౌచం సపిండేషు ద్విజోత్తమాః । అస
పిండేషు సర్వేషు ప్రేతశుద్ధిం నిబోధత॥ ౧౦౦॥

ఓ బ్రాహ్మణులారా సపిండుల కాశౌచము చెప్పబడెను ఇంకనసపిండాశౌచమును జెప్పెద వినుండు॥ ౧౦౦॥

మూ॥ అసపిండం ద్విజం ప్రేతం విప్రోనిర్హృత్య బంధువత్ । వి
శుధ్యతి త్రిరాత్రేణ మాతురాప్తాంశ్చ బాంధవాన్॥౧౦౧॥

అసపిండుండగు బ్రాహ్మణుని బంధుకృత్యముచే ననగా స్నేహముచేతను పరమార్థబుద్ధిచే గాదని తోచబడెను మాతృబాంధవులనగా మాతులమాతృభగిన్యాదులనున్ను బ్రాహ్మణుడు మోసెనేని మూడు దినములకు శుద్ధుడగును॥౧౦౧॥

మూ॥ యద్యన్నమత్తి తేషాంతు దశాహేనైవ శుధ్యతి । అనద
న్నన్నమహ్నైవ నచేత్తస్మిన్గృహేవసేత్॥ ౧౦౨॥

ఆశవదాహకుడు మృతసపిండులయన్నమును తినెనేని పైనిచెప్పిన మూడుదినములేగాదు పదిదినములకుగాని శుద్ధుడుగాడు వారియన్నమును దినకుండ వారింటనుండెనేని మూడుదినములు ఆశవవాహకుడుమాత్రమై వారియన్నమును దినక

వారి-టవసించకుండిన నేకాహోరాత్రముచే శుద్ధుడగును॥ ౧౦౨॥

మూ॥ అనుగమ్యేచ్ఛయా ప్రేతం జ్ఞాతిమజ్ఞాతి మేవవా।స్నాత్వా
సచేలం స్పృష్ట్వాగ్నిం ఘృతంప్రాశ్య విశుద్ధ్యతి॥ ౧౦౩॥

జ్ఞాతియైన నజ్ఞాతియైన శవముతోగూడ శ్మశానంబునకు నిచ్ఛచేతంజనిన సచేలస్నానంబొనర్చి యగ్నినిస్పృశించి యాపైని ఘృతప్రాశనంబొనర్చిన ననుగమననిమిత్త శవ్చుచముపలన శుద్ధుడగును॥ ౧౦౩॥

మూ॥ నవిప్రస్వేషు తిష్ఠత్సు మృతంశూద్రేణ నాయయేత్।అస్వ
ర్గ్యా హ్యాహుతిస్సాస్యా చ్ఛూద్రసంస్పర్శ దూషితా॥౧౦౪॥

బ్రాహ్మణాదిశవమును సజాతీయులుంచుండగా శూద్రులచే మోయించరాదు శూద్రస్పర్శచే దుష్టమగు నాశరీరాహుతి యామృతునకు స్వర్గప్రాపకముగాదు "స్వేషుతిష్ఠత్సు"యనియనుటచే బ్రాహ్మణశవమును బ్రాహ్మణులులేకుండిన క్షత్రియులచేతను వారులేకుండిన వైశ్యులచేతను వారున్నులేకుండిన శూద్రుల చేతనున్ను మోయించవచ్చును పూర్వపూర్వులులేకుండిన నుత్తరోత్తరులవహణలు స్వీయయుండగా శూద్రులువాహకులై తేనే యదియస్వర్గ్యమని కుల్లూకభట్టు వ్రాసె స్వేషుతిష్ఠత్సుయనునది యవివక్షితమని గోవిందరాజువ్రాసిన దానినిరాకరించెను॥ ౧౦౪

మూ॥ జ్ఞానం తపోగ్నిరాహారో మృన్మనోవా ర్యుపాంజనం। వా
యుఃకర్మార్క కాలౌచ శుద్ధేఃకర్తౄణి దేహినాం॥౧౦౫॥

జ్ఞానాదులు దేహధారులశుద్ధికి సాధనములదియెట్లన్నను॥శ్లో॥" బుద్ధిర్జ్ఞానేన శుధ్యతి"యని బుద్ధికిజ్ఞానము శుద్ధిసాధనము "తపసా వేదవిత్తమః"యని తపస్సుచే వేదవేత్తశుద్ధుడగునని "పునఃపాకేనశుధ్యతిమృణ్మయం"కుండమరలగాల్చిన శుద్ధమగునని యగ్నిశుద్ధిసాధనము"హవిష్యేణయవాగ్వావా"హవిస్సునుగాని గంజిగాని పుచ్చుకుని వ్రతముసేయుమని యాహారముశుద్ధికరము "మృద్వార్యాదేయ మర్థవత్"మన్ను నీరున్ను యివ్వవలెనని బాహ్యశుద్ధిసాధనములుమృద్వారులు"మనఃపూతంసమాచరేత్"మనస్సుకు సరిపడేలాగు చెయ్యుమని మనస్సున్ను శుద్ధిసాధనము సంకల్పవికల్పాత్మకముమనస్సు నిశ్చయాత్మికబుద్ధి యిది మనోబుద్ధులకుభేదము"వా

ణనోపాంజనై ర్వేశ్మ"తుడిచి యలికినయిల్లు శుద్ధమగునని యుపాంజనమనగ నలుకుట శుద్ధిహేతువు"యదేద్వాశ్వమేధేనే"త్యాది అశ్వమేధమైనంజేసిన బ్రహ్మహత్యాపోవునని కర్మముశుద్ధికరము"గామాలభ్యార్కమీక్ష్యవా"గోవునుస్పృశించి సూర్యుని చూచిన నస్పృశ్యస్పర్శనాదులవలన శుద్ధుడగునని సూర్యుడు శుద్ధిసాధనము."శుధ్యేద్విప్రోదశాహేన"పదిదినములచే బ్రాహ్మణుడు శుద్ధుడగునని కాలము శుద్ధిసాధనము"పంథానశ్చవిశుధ్యంతి సోమసూర్యాంశుమారుతైః" చంద్రునిచే సూర్యకిరణములచే వాయువుచే మార్గములుశుద్ధములగునని విష్ణువచనముచే వాయువున్ను శుద్ధిహేతువు॥ ౧౦౫॥

మూ॥ సర్వేషామేవ శౌచానా మర్థశౌచం పరంస్మృతం।యోఽ
ర్థేశుచిర్హిస శుచి నమృద్వారి శుచిశ్శుచిః॥౧౦౬॥

మృద్వార్యాది బాహ్యాంతశ్శుద్ధులన్నిటిలోనున్ను అర్థశుద్ధియనగా న్యాయార్జనధనముగా నుండుట పరమశుద్ధి యట్టియర్థశుద్ధుడేశుద్ధుడు మృద్వార్యాదులచే శుద్ధుడు శుద్ధుడు గాడని మన్వాదులచే జెప్పబడెను॥ ౧౦౬॥

మూ॥ క్షాంత్యాశుధ్యంతి విద్వాంసో దానేనా కార్యకారిణః।
ప్రచ్ఛన్న పాపాజప్యేన తపసా వేదవిత్తమాః॥ ౧౦౭॥

తనకు పరులపకారమునచేసినను ప్రత్యపకారముదలపకుండుట క్షమ దీనిచే పండితులున్ను అకార్యములుజేసినవారు దానముచేతనున్ను ప్రచ్ఛన్నపాపులు జపముచేతనున్ను తపస్సుచే వేదవేత్తలున్ను శుద్ధులగుదురు వీటికిప్రమాణము లేకాదశాధ్యాయమందు జెప్పగలదు॥ ౧౦౭॥

మూ॥ మృత్తోయైశ్శుధ్యతే శోధ్యం నదీ వేగేన శుధ్యతి। రజసా
స్త్రీ మనోదుష్టా సన్న్యాసేన ద్విజోత్తమః॥ ౧౦౮॥

మలాదులచే నపవిత్రమగునట్టిది మృజ్జలాదులచేతనున్ను శ్లేష్మాదిదూషితమగు నది వేగముచేతనున్ను పరపురుషసంభోగేచ్ఛచే దుష్టమానసయగుస్త్రీ నెలనెలకు రజస్వలయగుటచేతనున్ను బ్రాహ్మణుడు షష్ఠాధ్యాయోక్తకర్మ సన్న్యాసముచేతనున్ను శుద్ధులగుదురు॥ ౧౦౮॥

మూ॥ అద్భిర్గాత్రాణి శుధ్యంతి మనస్సత్యేన శుధ్యతి। విద్యా
తపోభ్యాం భూతాత్మా బుద్ధిర్జ్ఞానేన శుధ్యతి॥ ౧౦౯॥

చెమట మొదలగువాటిచే మలినగాత్రములనగా నవయవములు జలప్రక్షాళనముచేతనున్ను పరద్రోహాదిచింతనముచే దుష్టమనస్సు సత్యప్రవణతచేతనున్ను అజ్ఞానముచే నిష్ప్రకాశమైనట్లున్న లింగశరీరావచ్ఛిన్నమగు నాత్మ తపంబుననున్ను జ్ఞానముచేతనున్ను బుద్ధి నిశ్చయాత్మకమగు నిష్ఠచేతనున్ను శుద్ధములగును॥ ౧౦౯॥

మూ॥ ఏష శౌచస్యవః ప్రోక్తః శారీరస్య వినిర్ణయః । నానావి
ధానాం ద్రవ్యాణాం శుద్ధేశ్శృణుత నిర్ణయం॥ ౧౧౦॥

ఇది శారీర శౌచనిశ్చయము మీకు జెప్పబడెను ఇప్పుడు నానా ప్రకారములగు ద్రవ్యముల శుద్ధినిర్ణయమును వినుండు॥ ౧౧౦॥

మూ॥ తైజసానాం మణీనాంచ సర్వస్యాశ్మమయస్యచ।భస్మనా
ద్భిర్మృదాచైవ శుద్ధిరుక్తా మనీషిభిః॥ ౧౧౧॥

సువర్ణాదులయొక్కయు మరకతాదిమణులయొక్కయు పాషాణమయములగు వాటియొక్కయు శుద్ధిభస్మముచేతనున్ను మన్నుచేతనున్ను నీళ్ళచేతనున్ను నగునని మన్వాదులచేజెప్పబడెను నిర్లేపములకు జలముచేత నేయని చెప్పగలదుగావున నిది యుచ్ఛిష్టఘృతాదిలిప్తవిషయము మృత్తున్ను భస్మమున్ను జిడ్డున్ను వాసనయున్ను వదలుటకీరెంటను వికల్పముదకము రెంటికిగావలసినదే॥ ౧౧౧॥

మూ॥ నిర్లేపం కాంచనం భాండ మద్భిరేవ విశుధ్యతి।అబ్జమశ్మ
మయంచైవ రాజతం చానుపస్కృతం॥ ౧౧౨॥

ఉచ్ఛిష్టాదిలేపరహితమగు సువర్ణభాండమున్ను శంఖముక్తాది జలభవమున్ను పాషాణమయమున్ను గీట్లు మొదలయినవాటిలో మాలిన్యముండునుగాన నట్టివన్నెలులేని రజతమాత్రమున్ను వీటికి భస్మాదులకర్రలేకుండ జలమాత్రముచేతనే శుద్ధియగును॥ ౧౧౨॥

మూ॥ అపామగ్నేశ్చ సంయోగా ద్ధైమరూప్యంచ నిర్బభౌ।తస్మా
త్తయో స్స్వయోన్యైవ నిర్ణేకో గుణవత్తరః॥ ౧౧౩॥

శ్రు॥ "అగ్నేర్వై వరుణాదీ నాహ మయత ఇత్యాది । తథాగ్నేస్సువర్ణమింద్రి
యం వరుణాదీనాం రజతమిత్యాది" అగ్నియొక్కయింద్రియము సువర్ణము వర
ణాదులయింద్రియము రజతమని వేదమువలన జలాగ్నులసంయోగమువలన సువ
ర్ణమున్ను రజతమున్నుబుట్టె నదిగాన వాటికి కారణములగు జలాగ్నులుశుద్ధి హే
తువులు సాధారణశుద్ధిజలముచేతనే విశేషముగ మయిలగలిగనేని యగ్నిచేతను ౧౧౩॥
న్ను ననివ్యవస్థ యిట్టు శుద్ధిప్రశస్తతరను॥

మూ॥ తామ్రాయః కాంస్యరైత్యానాం త్రపుణ స్సీసకస్యచ।శౌ
చం యథార్హం కర్తవ్యం క్షారామ్లోదక వారిభిః॥ ౧౧౪॥

రాగి ఇనుము కంచు యిత్తడి తగరము సీసము నీటిపాత్రము క్షారామ్లోదక
ములున్ను కేవలోదకమున్ను వీటిలో దేనికేదియర్హమో దానిచే నదిశుద్ధమగును
శ్లో॥ "అంభసా హేమరౌప్యాయః కాంస్యంశుధ్యతి భస్మనా।అమ్లైస్తామ్రంచరై
త్యంచ పునఃపాకేనమృణ్మయం" జలముచే స్వర్ణరజతలోహములున్ను కంచు భ
స్మముచేతనున్ను ఆమ్లములచే రాగి యిత్తడిన్ని శుద్ధములగునని బృహస్పతి వచన ౧౧౪॥
మువలన విశేషము దెలియవలెను॥

మూ॥ ద్రవాణాంచైవ సర్వేషాం శుద్ధిరుత్ప్లవనంస్మృతం।ప్రోక్ష
ణం సంహతానాంచ దారవాణాంచ తక్షణం॥ ౧౧౫॥

నెయి నూనియ మొదలగు ద్రవ్యములు కాకాద్యుపఘాతములయ్యేనేని ప్రా
దేశమాత్రములగు దర్భలచే నుత్ప్లవనం బొనర్చిన శుద్ధములగును పరుపులు మొ
దలగునవి మయిలబడెనేని జలప్రోక్షణముచే శుద్ధియగును దారుపాత్రము లత్యం ౧౧౫॥
తోపహతములైన చెక్కించిన శుద్ధిగలుగును॥

మూ॥ మార్జనం యజ్ఞపాత్రాణాం పాణినాంయజ్ఞకర్మణి ।
చమసానాం గ్రహాణాంచ శుద్ధిః ప్రక్షాళనేనతు॥ ౧౧౬॥

చమసలు గ్రహములు మొదలగు యజ్ఞపాత్రములు హస్తముచే నుదకముజల్లి
యజ్ఞకర్మము ప్రవర్తించు నపుడు కడిగి చేసిన శుద్ధములగును॥

మూ॥ చరుణాంస్రుక్స్రువాణాంచ శుద్ధిరుష్ణేన వారిణా । స్ఫ్య
శూర్పశకటానాంచ ముసలోలూఖలస్యచ॥ ౧౧౭॥

చరుహోమము జేసినందున జిడ్డుగల స్రుక్స్రువాది పాత్రములు వేడినీళ్ల గడిగిన శుద్ధియగును స్నేహాక్తములుగాని శకట ముసలోలూఖలప్రముఖ యజ్ఞపాత్రములకు జలప్రక్షాళనముచే శుద్ధియగును॥ ౧౧౭॥

మూ॥ అద్భిస్తు ప్రోక్షణం శౌచం బహూనాం ధాన్యవాససామ్।
ప్రక్షాళనేన త్వల్పానా మద్భిశ్శౌచం విధీయతే॥ ౧౧౮॥

విస్తారము ధాన్యము బట్టలు మొదలగు వాటికి జలప్రోక్షణముచే శుద్ధియగును అవి కొంచమైతె నీళ్ళచే గడిగిన శుద్ధియగును॥ ౧౧౮॥

మూ॥ చేలవచ్చర్మణాంశుద్ధిః వైదలానాం తథైవచ। శాక
మూలఫలానాంచ ధాన్యవచ్ఛుద్ధిరిష్యతే॥ ౧౧౯॥

స్పృశించనర్హములగు చర్మములకును వెదురుచాపలు మొదలగు వాటికిని వస్త్రములకునుం బలెనున్ను శాకమూలఫలాదులకు ధాన్యమునకునుంబలె శుద్ధియగును॥ ౧౧౯॥

మూ॥ కౌశేయావికయో రూషైః కుతపానా మరిష్టకైః। శ్రీఫ
లై రంశు పట్టానాం క్షౌమాణాం గౌరసర్షపైః॥౧౨౦॥

పౌత్రిబట్టలు ధావళీలు ఉప్పుమన్నుచే శుద్ధములగును నేపాళకంబళములకు అరిష్టచూర్ణములచేనున్ను పట్టుబట్టలకు మారేడు పళ్ళరసముచేతనున్ను క్షౌమవలలాదులకు తెల్లావాలపిండిచే ప్రక్షాళనము వలన శుద్ధియగును॥ ౧౨౦॥

మూ॥ క్షౌమవచ్ఛంఖశృంగాణా మస్థిదంతమయస్యచ। శుద్ధిర్వి
జానతా కార్యాగో మూత్రేణోదకే నవా॥ ౧౨౧॥

శంఖమునకున్ను పశుశృంగములకున్ను స్పృశ్యపశ్వస్థికృతములకున్ను గజదంతమయములకున్ను క్షౌమమునకుంబలె శ్వేతసర్షపపిష్టను గోమూత్రముతోనైన నుదకలముతోనైన గలిపి కడిగవేసిన శుద్ధియగును॥ ౧౨౧॥

మూ॥ ప్రోక్షణా త్తృణకాష్ఠంచ పలాలంచైవ శుధ్యతి। మార్జ
నోపాంజనై ర్వేశ్మ పునః పాకేన మృణ్మయమ్॥ ౧౨౨॥

గద్దెయును కర్రలును పొల్లయును జలప్రోక్షణముచే శుద్ధము రజస్వలాదినివా
సముచే దుష్టమగు గృహము తుడవడము నలుకడము చేయుటనున్నూ మైలబడినకుండ
మరలకాల్చుటచేతనున్నూ శుద్ధములగును॥ ౧౨౨.

మూ॥ మద్యై ర్మూత్రైః పురీషైర్వా ష్ఠీవనైః పూయశోణితైః।
సంస్పృష్టం నైవ శుధ్యేత పునఃపాకేన మృణ్మయం॥౧౨౩॥

కల్లు మూత్రపురీషములు నిష్ఠీవనము చీము రక్తము పీటిచే సంస్పృష్టమగు
కుండ పునఃపాకముచే శుద్ధినొందదు॥ ౧౨౩.

మూ॥ సమ్మార్జనోపాంజనేన సేకేనోల్లేఖనేనచ। గవాంచప
రివాసేన భూమి శ్శుధ్యతిపంచభిః॥ ౧౨౪॥

చీపురుచేత తుడవడము గోమయముచే నలుకడము గోమూత్రము జల్లడము
గోవులనొక యహోరాత్రము కట్టడము పైపొరమన్ను చెక్కి వేయడమీయైదిం
టిచే భూమిశుద్ధి నొందును మూత్రపురీషాది సంబంధచండాలనివాసాదులచేనగు
శుద్ధ్యభావమెంతో దానింబట్టి యీయయిదింటిలో కొన్నిటిచేగాని యన్నిటిచేగా
ని యశుచిత్వగౌరవలాఘవముల నూహించి చేయవలయును॥ ౧౨౪॥

మూ॥ పక్షిజగ్ధం గవాఘ్రాత మవధూత మవక్షుతం। దూషితం
కేశకీటైశ్చ మృత్ప్రక్షేపేణ శుధ్యతి॥ ౧౨౫॥

భక్ష్యోపక్షిచే కొంత తినబడినట్టియు గోవుచే నాఘ్రాణించ బడినట్టియు పా
దముచే మెట్టబడినట్టియు పైనితుమ్మబడినట్టియు కేశకీటాదులచే దూషితమగునన్న
ము కొంచమైతే త్యజింపవలెను రాశియైన కొంచెము మృత్ప్రక్షేపముచేసిన శు
ద్ధమగును॥ ౧౨౫॥

మూ॥ యావన్నాపైత్యమేధ్యాక్తా ద్గంధో లేపశ్చతత్కృతః। తా
వన్మృద్వారి చాదేయం సర్వాసు ద్రవ్యశుద్ధిషు॥ ౧౨౬॥

విష్ఠాదిసంపర్కము వలననైన కంపున్నూ తల్లేపమున్నూ యెంతసేపు పోవునో
యంతమట్టుకు మృజ్జలాదులచే కడగవలెను అన్ని ద్రవ్యశుద్ధులకు నిదియే చెప్ప
బడెను॥ ౧౨౬॥

మూ॥ త్రీణిదేవాః పవిత్రాణి బ్రాహ్మణానామకల్పయన్ । అ
దృష్టమద్భిర్నిర్ణిక్తం యచ్చ వాచా ప్రశస్యతే॥ ౧౨౭॥

ద్రవ్యములకేమే ఉపఘాతము తెలియకనుండుటదియదృష్టము దుస్సంపర్కముచే నపవిత్రమయ్యెనని తెలియబడినది జలముచే బ్రక్షాళితమును, "సూ॥ యద్యస్థి మాంసానాం త్తదద్భిస్సు ప్రక్షాల్యచ్ఛుద్ధిర్భవతి" యేదేని యపవిత్రమయ్యెనని దోచునది నీళ్ళచే గడిగిన శుద్ధియగునని హారీతుడు ఉపహతమయ్యెనని శంకయందుపవిత్రమయ్యెనని బ్రాహ్మణవచనముచే ప్రశంసింపబడెనని మూడు పవిత్రములుగా దేవతలు బ్రాహ్మణులకు గల్పించిరి॥ ౧౨౭॥

మూ॥ ఆపశ్శుద్ధా భూమిగతా వైతృష్ణ్యం యాసు గోర్భవేత్।
అవ్యాప్తాశ్చేదమేధ్యేన గంధవర్ణరసాన్వితాః॥ ౧౨౮॥

ఎంత జలము భూమియందుండిన నది గోవునకు దప్పిదీర నుపయోగించునది యమేధ్యసంపర్కము లేక గంధవర్ణరసములు గడిగి శుద్ధియగును భూమిగతమనుటమంచి భూమియందని॥ ౧౨౮॥

మూ॥ నిత్యంశుద్ధః కారుహస్తః పణ్యం యచ్చప్రసారితం । బ్ర
హ్మచారిగతం భైక్షం నిత్యం మేధ్యమితి స్థితిః॥ ౧౨౯॥

కారుహస్తః యనగా పుష్పమాల్యాదులను రచించెడువాని హస్తము దేవబ్రాహ్మణాదుల కొనంగుటకుగాని ధనార్థమమ్ముకొనుటకుగాని మాలాదుల జేసెడిచో వానిహస్తము శుద్ధము వానికి జననాద్యాశౌచ మున్నప్పుడును స్వనియతకార్యమందుమాత్రము శుద్ధిగలుగును॥ "సూ॥ నత్వశౌచంకారూణాంకారుకర్మణి" యను వచనమువలన బజారులో నెల్లరుం గొనుటకు నుంచబడిన ద్రవ్యము లెవ్వరు ముట్టినను శుద్ధములే యగుచున్నవి "నాపణీయమన్నమశ్నీయాత్" బజారులోన న్నమనయన్నము దినరాదనుశంఖవచనము వలన పక్వాన్నము బజారులోది దినరాదు- బ్రహ్మచారి తెచ్చినభిక్షాన్నమాచాంతులుగాని స్త్రీలచే బెట్టబడినను వీధులం టదిరిగి తెచ్చినను నిత్యముగ శుద్ధమని శాస్త్రమర్యాద॥ ౧౨౯॥

మూ॥ నిత్యమాస్యం శుచి స్త్రీణాం శకునిః ఫలపాతనే। ప్రస్ర
వేచశుచిర్వత్సః శ్వామృగగ్రహణేశుచిః॥ ౧౩౦॥

స్త్రీలయొక్క ముఖము నిత్యశుచియైనది కాకాదిపక్షులు ఫలములను ముక్కుచే పొడిచి పడవేయుటయందును వత్సము పాదుగునుంచి పాలుచేపుటకు గుడుచునప్పుడును శునకము వేటలో మృగములను గరచునపుడును శుచులగుచున్నవి॥౧౩౦॥

మూ॥ శ్వభిర్హతస్య యన్మాంసం శుచితన్మనురబ్రవీత్। క్రవ్యాద్భిశ్చ హతస్యాన్యై శ్చండాలాద్యైశ్చ దస్యుభిః॥ ౧౩౧॥

కుక్కల చేతనున్ను ఇతరములగు పచ్చిమాంసమును తిను వ్యాఘ్ర శ్యేనాదులచేతనున్ను మృగవధజీవులగు వ్యాధాదులగు దస్యులచేతనున్ను జంపబడిన జంతువుల మాంసము దేవపితృ అతిథికార్యములందైనను శుచి గ్రాహ్యము॥ ౧౩౧॥

మూ॥ ఊర్ధ్వంనాభేర్యానిఖాని తానిమేధ్యానిసర్వశః। యాన్యధస్తాన్యమేధ్యాని దేహాచ్చైవ మలాశ్చ్యుతాః॥ ౧౩౨॥

నాభికంటె పైనుండెడు రంధ్రములు పవిత్రములందువలన జారిన మలస్పర్శముచే నశుచిత్వము లేదు క్రిందుగ నుండిన యింద్రియములందునుండియు దేహమువలన స్రవించెడు మలములన్నియు నపవిత్రములు॥ ౧౩౨॥

మూ॥ మక్షికా విప్రుషశ్ఛాయా గౌరశ్వః సూర్యరశ్మయః। రజోభూర్వాయురగ్నిశ్చ సర్వే మేధ్యానిసదిశేత్॥ ౧౩౩॥

అమేధ్యస్పర్శగలిగిన నైనప్పటికిని యీగలున్ను ముఖమునుంచిబడు తుంపరలున్ను పతితాదులసంబంధమయినదైన ఛాయయున్ను గోవు అశ్వము సూర్యరశ్ములు పరాగము భూమి వాయువు నగ్నియు నివన్నియు చండాలాదిస్పర్శగలిగినప్పటికిని శుద్ధములేయగుచున్నవి॥ ౧౩౩॥

మూ॥ విణ్మూత్రోత్సర్గ శుద్ధ్యర్థం మృద్వార్యా దేయ మర్థవత్। దైహికానాంమలానాంచశుద్ధిషు ద్వాదశస్వపి॥ ౧౩౪॥

మలమూత్రములను విడిచెడి స్థలములశుద్ధికై గంధలేపరహితమైనదనుక మన్నుచేతను నీళ్ళచేతనున్ను గడుగవలయును శరీరసంబంధములగు మలములు పండ్రెండింటియొక్క గంధలేపక్షయముకొరకున్ను మన్నును జలమున్ను గ్రహింపవలెనని ఇతరశాస్త్రములవలన పూర్వపక్షమందు మృజ్జలగ్రహణము ...

దు జలమాత్రమే యిందుకు బోధాయనవచనము- శ్లో॥ ఆదదీతమృదోపశ్చ షట్సు పూర్వేషుశుద్ధయే। ఉత్తరేషుచషట్స్వద్భిః కేవలాభిర్విశుధ్యతి॥" దీనియర్థమున్రా యుబడెను అందువలన ద్వాదశస్వపిఅని మానవవచనములో మృద్వారిగ్రహణ ముస్వరూపస్థచే విరోధించలేదు గోవిందరాజు మనుబోధాయనవచనములను జూచి యుత్తర షట్కమందున వికల్పమును జెప్పెను వ్యవస్థితమగునదిన్ని దేవపిత్రాద్య నుష్ఠానకర్మమందు ప్రవర్తించెదు వానివిషయమై యుత్తరషట్కమందును మృత్తు నుస్వీకరించవలెనని తమలకు కారలేదు. ౧౩౪॥

మూ॥ వసాశుక్రమసృఙ్మజ్జా మూత్రవిట్కర్ణవిణ్నఖాః। శ్లేష్మా
శ్రుదూషికాస్వేదా ద్వాదశైతేనృణాంమలాః॥ ౧౩౫॥

వసయనగా దేహమందుమబ్బట్టే చమురులాటిజిడ్డు శుక్రమనగా రేతస్సుఅసృక్ అనగా రక్తము మజ్జయనగా చుండు మూత్రము పురీషము గులిమి గోళ్ళు శ్లేష్మ ము కన్నీళ్ళు దూషికయనగా పుసి స్వేదమనగా చెమట యీపదిరెండును శరీరజ ములగుమలములు॥ ౧౩౫॥

మూ॥ ఏకాలింగేగుదేతిస్ర స్తథైకత్రకరేదశ। ఉభయోస్సప్తదా
తవ్యాం మృదశ్శుద్ధిమభీప్సతా॥ ౧౩౬॥

మూత్రమలవిసర్జనానంతరశుద్ధికి జలసహితమగుమృత్తు లింగమందొకటి గు దమందుమూడు వామహస్తమందు పది॥ శ్లో॥ "శౌచవిద్దక్షిణం హస్తం నాధశ్శౌ చేనియోజయేత్। తత్రైవవామహస్తేన నాభేరూర్ధ్వం నశోధయేత్॥" శౌచము ను తెలిసినవాడు కుడిచేతనధశ్శౌచమునున్ను యెడమచేత నాభికంటే నూర్ధ్వభాగ శోధనమునున్ను జేయరాదని దేవలవచనమువలన నొకచేతియందనగా వామహ స్తమందె పదిమట్టిమన్నచే దుగవలెను. అటుపైని రెండుచేతులచే నేదుమృత్తు లుంచికనుగవలెను శుద్ధిగోరువాడు గంధలేపక్షయమగునంతకు నింతకంటే నధి కముగానైన మృత్తులనిడవలెను మునులమతములలో నెక్కువగనపడుటకు హేతు వి నేమో శ్లో॥ "లింగేపమృత్సమాఖ్యాతా త్రిపుర్వేపూర్యతేయయా । ద్వితీయాచ తృతీయాచ తదర్ధార్ధాప్రకీర్తితా॥" లింగమందొకమృత్తుజెప్పబడెను అది శ్లో కావమునున్నుగావలెను రెండవమూడు మూడవమూడును అకొంతెవేదులో సగమైన ...నుగముయు గావలెనని చెప్పబడెను ఒకప్పుడు పైని చెప్పబడిన సఙ్ఖ్యకంటే

తైకులవలోనే గంధలేపక్షయమైనప్పటికిని సంఖ్యావాగారంభసామర్థ్యముచేనా సంఖ్యాదప్పగూడదు॥ ౧౩౬॥

మూ॥ ఏతచ్ఛౌచం గృహస్థానాం ద్విగుణం బ్రహ్మచారిణాం। త్రిగుణం స్యాద్వనస్థానాం యతీనాంతు చతుర్గుణం॥౧౩౭॥

ఏకాలింగేయనునట్టి శౌచము గృహస్థులకే దీనిద్విగుణము బ్రహ్మచారికి త్రిగుణమువనస్థునకు చతుర్గుణము యతికిని॥ ౧౩౭

మూ॥ కృత్వా మూత్రం పురీషంవా ఖాన్యాచాంత ఉపస్పృశేత్। వేదమధ్యేష్యమాణశ్చ అన్నమశ్నంశ్చ సర్వదా॥ ౧౩౮॥

మూత్రపురీషోత్సర్గమొనరించి యథోక్త శౌచానంతరమందును వేదపఠనారంభమందును భుజించియును నాచమించి శిరస్థలమగు నింద్రియనములను సజలకరుడగుచు స్పృశించవలెను ద్వితీయాధ్యాయమందు "అధ్యేష్యమాణస్త్వాచాంతః" యనిచెప్పినది బ్రహ్మచర్యవ్రతాంగము నిప్పటిది నైత్యకశౌచవిషయము గాన పునరుక్తిలేదు॥ ౧౩౮॥

మూ॥ త్రిరాచామే దపః పూర్వం ద్విః ప్రమృజ్యా త్తతోముఖం। శారీరం శౌచమిచ్ఛన్‌హి స్త్రీశూద్రస్తు సకృత్సకృత్॥ ౧౩౯॥

"ఆచాంతః" యనిచెప్పినదానికి విశేషమునుచెప్పుచున్నాడు మున్మూరుదకమును త్రావి రెండుమారులు ముఖమునుదుడువవలయును స్త్రీలును శూద్రులునొకమారుదకము నుత్రావవలెను॥ ౧౩౯

మూ॥ శూద్రాణాం మాసికం కార్యం వపనం న్యాయవర్తినాం। వైశ్యవ చ్ఛౌచకల్పశ్చ ద్విజోచ్ఛిష్టంచ భోజనం॥ ౧౪౦॥

యథాశాస్త్రముగ బ్రవర్తించెడు శూద్రులు ద్విజశుశ్రూషజేయుచు నెలకొకమారు క్షౌరము వైశ్యునకుంబలె శౌచవిధానము ద్విజోచ్ఛిష్టము భోజనముగావలయును॥ ౧౪౦॥

మూ॥ నోచ్ఛిష్టం కుర్వతే ముఖ్యా విప్రుషోంగం పతంతియాః। న శ్మశ్రూణి గతాన్యాస్యం నదంతాంతర ధిష్ఠితం॥ ౧౪౧॥

శ్లో॥ "నిష్ఠీవ్యోక్త్వా నృతానిచ" యని ఉమ్మివేసియాచమించుమని చెప్పబడుట తుంపరలుగూడ నుమ్మితో సమముగ వ్రాయుసిన దీనికపవాదమును చెప్పుచున్నాడు ముఖమునుండి బడెడు తుంపరలు దేహమందుబడినను శ్మశ్రువులందును దంతమధ్యమందుజిక్కినదియు నుచ్ఛిష్టములుగావు ఇచ్చట గౌతములు విశేషము చెప్పిరి॥ సూ॥ "దంతాశ్లిష్టేషు దంతవదన్యత్ర జిహ్వాభిమర్శనాత్ ప్రాక్చ్యుతేరిత్యేకే। చ్యుతేష్వాస్రావద్విద్యాన్నిగిరన్నేవ తచ్ఛుచిరితి" దంతములందు జిక్కిన యన్నావయవము దంతములవంటిదే జిహ్వకు తగలకుండినదని కొందరిమతము అట్టిది మింగివేసి శుచి యగునని గౌతములు॥ ౧౪౧॥

మూ॥ స్పృశంతి బిందవః పాదౌ య ఆచామయతః పరాన్। భౌమి
కైస్తే సమాజ్ఞేయా న తైరప్రయతో భవేత్॥ ౧౪౨॥

ఒకడాచమించినచో భూమిపై బడినజలము పాదములచేదొక్కినవాడప్రయతుడుకాడు మరియు నాజలము భూమినువంటిదేగావున నాస్థలమందుబడిన ద్రివ్యమున్ను యశుచిగాదు। ౧౪౨॥

మూ॥ ఉచ్ఛిష్టేన తు సంస్పృష్టో ద్రవ్యహస్తః కథంచన। అనిధాయై
వ తద్ద్రవ్య మాచాంత శ్శుచితామియాత్॥ ౧౪౩॥

ద్రివ్యహస్తుడనగా తనశరీరమందు ద్రవ్యమునుధరించినవాడని తాత్పర్యము అటులగాకున్న "ఆమణిబంధాత్పాణీ ప్రక్షాల్యాచమేత్" అనువిధిచే హస్తమందుద్రవ్యముండిన నాచమనము సంభవించకపోవును గాన స్కంధాదికమందుద్రవ్యమును ధరించి వాడుచ్ఛిష్టస్పృష్టుడయ్యేనేని యాద్రవ్యమునుదింపకుండ నాచమించినశుద్ధుడగు నాద్రివ్యమున్ను శుద్ధమగును॥ ౧౪౩॥

మూ॥ వాంతో విరిక్త స్స్నాత్వాతు ఘృతప్రాశన మాచరేత్।
ఆచామేదేవ భుక్త్వాన్నం స్నానం మైథునినస్స్మృతం॥ ౧౪౪॥

వమనమయినను విరేచనమయినను స్నానముచేసి ఘృతప్రాశనమును జేయవలయును వదివిరేచనములయినవాడు విరిక్తుడు వానికి ఘృతప్రాశనమని గోవిందరాజు వ్రాసెను భోజనానంతరమందేవాంతుడయ్యేనేని యాచమనమాత్రమే జేయవలయును స్నానఘృతప్రాశనము లక్కరలేదు మైథునమయినచో స్నానము జేయవ

అయును యిది ఋతుమతీవిషయమని కల్లూకభట్టు॥ ౧౪౪॥

మూ॥ సుప్త్వా క్షుత్వాచ భుక్త్వాచ నిష్ఠీవ్యోక్త్వా నృతానిచ ।
పీత్వాపో ధ్యేష్యమాణశ్చ ఆచామే త్ప్రయతో పిసన్ ॥౧౪౫॥

నిద్రించియు తుమ్మియు భుజించియు నుమిసియు నసత్యములాడియు జలపాన మొనర్చియు నధ్యయన మొనర్చుటకు ముందుగను శుచియయ్యు నాచమించవలను యేనైతే "భుక్త్వాచోపస్పృశేత్సమ్య"గనియు "అధ్యేష్యమాణస్త్వాచాంతః" అనియు దృతీయాధ్యాయమందు జెప్పబడెనో యది బ్రహ్మచర్యవ్రతాంగమగుటచే నిచ్చట గృహస్థాదులకున్ను కర్తవ్యమైనందున పునరుక్తిలేదు॥ ౧౪౬॥

మూ॥ ఏత చ్ఛౌచ విధిః కృత్స్నో ద్రవ్యశుద్ధి స్తథైవచ । ఉక్తో
వ స్సర్వవర్ణానాం స్త్రీణాం ధర్మాన్నిబోధత॥ ౧౪౬॥

ఇది సర్వవర్ణముల వారికిని జననమరణాదులయందు దశరాత్రాశౌచవిధియు నై జలాదిపాత్రవస్త్రాదుల శుద్ధియు సమగ్రముగ మీకు నాచే చెప్పబడె నింక స్త్రీలకు జేయదగిన ధర్మమును జెప్పెదను వినుండు॥ ౧౫౬॥

మూ॥ బాలయా వా యువత్యావా వృద్ధయా వా పియోషితా।న
స్వాతంత్ర్యేణ కర్తవ్యం కించి త్కార్యం గృహేష్వపి॥

బాల్యమందైన యౌవనమందైన వృద్ధత్వమందైన స్త్రీకి భర్త్రాదుల యనుమతి లేకుండ గృహకృత్యమందునైన నించుక కార్యంబైనను జేయుటకు స్వాతంత్ర్యము లేదు॥

మూ॥ బాల్యే పితృవశే తిష్ఠే త్పాణిగ్రాహస్యయౌవనే। పుత్రా
ణాం భర్తరిప్రేతే నభజే త్స్త్రీస్వతంత్రతామ్॥ ౧౪౮॥

బాల్యమందు తండ్రివశమందున్ను యౌవనమందు భర్తృవశమందున్ను భర్తమృతుడైన పిమ్మట పుత్రులవశమందున్ను స్త్రీ ప్రవర్తించవలయునుగాని స్త్రీకి స్వాతంత్ర్య మెప్పుడును లేదు వీరెవ్వరును లేకుండెనేని॥ "శ్లో॥ తత్సపిండేషు చాసత్సు పితృపక్షః ప్రభుస్త్రియాః । పక్షద్వయావసానేతు రాజాభర్తా స్త్రియామతః॥" భర్తృసపిండుల వశమై యుండవలయును వారును లేకుండిన పితృపక్షమువా

గుసు ఉభయపక్షస్థులు లేకుండిన రాజున్ను స్త్రీకిసంరక్షకులు గావలెను అనినా రదవచనము వలన స్త్రీకిస్వాయత్తత లేదు॥

మూ॥ పిత్రా భర్త్రా సుతైర్వాపి నేచ్ఛేద్విరహమాత్మనః। ఏషాం

హి విరహేణ స్త్రీ గర్హ్యే కుర్యాదుభే కులే॥ ౧౪౯॥

స్త్రీ తండ్రినిగాని భర్తనుగాని పుత్రులనుగాని వదలి స్వతంత్రముగనుండకూడదు అట్లుండెనేని యది నింద్యతనుబొంది పతిపితృకులములను నింద్యములుగా జేయును॥ ౧౪౯॥

మూ॥ సదా ప్రహృష్టయా భావ్యం గృహకార్యేషు దక్షయా। సు

సంస్కృతోపస్కరయా వ్యయే చాముక్తహస్తయా॥౧౫౦॥

భర్త ప్రతికూలుడయ్యుండినను స్త్రీ ప్రసన్నముఖియు గృహకర్మములయందు సమర్థురాలు గృహభాండాది పరిశుద్ధిచతురయు వ్యయము చేయుటయందు బహుప్రదకానిదియు గావలయును॥ ౧౫౦॥

మూ॥ యస్మై దద్యాత్ పితా త్వేనాం భ్రాతా వానుమతే పితుః।

తం శుశ్రూషేత జీవంతం సంస్థితం చ న లంఘయేత్॥౧౫౧॥

తండ్రికాని తండ్రియనుమతిచే సోదరుడుగాని యేపురుషునకు కన్యకనిచ్చివివాహముచేతురో యాపురుషుడు జీవించియుండునంతమట్టుకు స్త్రీ యతనిననువర్తించవలయును ననగా నతని యిష్టప్రకారముగా పరిచర్యజేయవలయును భర్తమృతుడయ్యేనేనియు నతిక్రమించకూడదు అనగా నవ్యభిచారముచేతను శ్రాద్ధతర్పణాదికముచేతను తత్పరురాలై యుండవలయును॥ ౧౫౧॥

మూ॥ మంగళార్థం స్వస్త్యయనం యజ్ఞశ్చాసాం ప్రజాపతేః।

ప్రయుజ్యతే వివాహేషు ప్రదానం స్వామ్యకారణం॥౧౫౨॥

ఎప్పుడు యాస్త్రీలకు మంగళార్థమయి శాంత్యనువచనరూపముగా ప్రజాపత్యుద్దేశమగు ఆజ్యహోమరూపమయిన యాగము యేది చేయబడునో యైతే ముందుగా వాగ్దానాత్మకమగు అనగా కన్యకనీవరునకు నిచ్చెదనవబడునో యావేయూభర్తకు ఆస్త్రీయంధు స్వామిత్వకారణమది మొదలుగా స్త్రీ భర్తృపరతం

త్రియగుసదిగావున నతని నాశ్రయించవలెనని పూర్వోక్తమునకంటె విశేషము॥ శ్లో॥ "తేషాంనిష్ఠాతువిజ్ఞేయా విద్వద్భిః స్పష్టమేపదే" యని నవమాధ్యాయమందేదిచెప్పగలడో యది భార్యాత్వసంస్కారార్థమని విరోధములేదు॥ ౧౫౨॥

మూ॥ అనృతావృతుకాలేచ మంత్రసంస్కారకృత్పతిః। సుఖస్య
నిత్యం దాతేహ పరలోకేచ యోషితః॥ ౧౫౩॥

ఏహేతువుచేత మంత్రసంస్కారరూపమగు వివాహముచేసుకొనినభర్త ॥సూ॥ "ఋతావుపేయాత్సర్వత్రవా ప్రతిషిద్ధవర్జంఇతి" ఋతుకాలమందును పర్వాదివర్జముగ నితరకాలమందును స్త్రీనిపొందవలెనని గౌతమవచనమువలన యీలోకమందు యెల్లప్పుడును భర్త స్త్రీకిసుఖమిచ్చును తద్భర్తృసేవచే పరలోకమందును సుఖకరుడగుచున్నాడు అదిగావుననే॥ ౧౫౩॥

మూ॥ విశీలః కామవృత్తోవా గుణైర్వా పరివర్జితః। ఉపచర్యః
స్త్రియాసాధ్వ్యా సతతం దేవవత్పతిః॥ ౧౫౪॥

సదాచారశూన్యుడైనను మరియొకస్త్రీయందాసక్తుడైనను విద్యాగుణరహితుడైనను పతివ్రతయగుస్త్రీకి దేవతుల్యముగా భర్తయెల్లప్పుడు నారాధనీయుడు॥

మూ॥ నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో నవ్రతం నాప్యుపోషితం। పతిం
శుశ్రూషతే యేన తేనస్వర్గే మహీయతే॥ ౧౫౫॥

ఏలాగునయితే యొకభార్య పుష్పిణియైయుండిన రెండవభార్యతో భర్త కర్మకలాపము జేయదగునో యట్లు స్త్రీకి భర్తవినాగా కర్మాధికారములేదు భర్తాజ్ఞ లేకుండ వ్రతోపవాసాదికమున్ను జేయరాదు భర్తృపరిచర్యచేతనే స్త్రీ స్వర్గమందు పూజ్యతనొందును॥ ౧౫౫॥

మూ॥ పాణిగ్రాహస్య సాధ్వీస్త్రీ జీవతోవా మృతస్యవా। పతి
లోకమభీప్సంతీ నాచరేత్కించిదప్రియం॥ ౧౫౬॥

భర్తతోగూడ ధర్మాచరణముచే పరలోకమునుగోరుచున్న స్త్రీ భర్త జీవించియుండినను మృతుడైనను పతివ్రతగావున వానికప్రియము నించుకయైన జేయరాదు మృతుడగువానికప్రియమనగా వ్యభిచారము శ్రాద్ధాభావము మొదలగునవి॥ ౧౫౬॥

మూ॥ కామంతు క్షపయేద్దేహం పుష్పమూలఫలైశ్శుభైః। నతు

నామాపి గృహ్ణీయాత్ పత్యౌ ప్రేతే పరస్యతు॥ ౧౫౭॥

భర్తమృతుడయ్యెనేని స్త్రీ పవిత్రములగు పుష్పమూలఫలాదులచే మిక్కిలి శరీరమును కృశింపజేయుచు వ్యభిచారబుద్ధిచే నన్యపురుషునియొక్క నామమునయిన దలంపగూడదు ఇటులగుచుండెనేని॥ ౧౫౭॥

మూ॥ ఆసీతామరణాత్క్షాంతా నియతా బ్రహ్మచారిణీ। యో
ధర్మ ఏకపత్నీనాం కాంక్షంతీ త మనుత్తమం॥ ౧౫౮॥

క్షమగలిగి నియమవంతురాలై పతివ్రతలయొక్క ప్రకృష్టమగుధర్మమునుగోరుచు మధుమాంసమైథునములనుగోరక బ్రహ్మచర్యముగలిగి మరణాంతముదనుకనా భర్తను స్మరించుచునుండవలయును తానుపుత్రవతిగాకపోయిన నాచింతవిడచి పతిభక్తిచేతనే యుండవలయును॥ ౧౫౮॥

మూ॥ అనేకాని సహస్రాణి కుమారబ్రహ్మచారిణాం। దివంగ
తాని విప్రాణాం అకృత్వా కులసంతతిం॥ ౧౫౯॥

ఆబాల్యబ్రహ్మచారులగు సనకవాలఖిల్యాది బ్రాహ్మణులు వేలకొలది సంతతి లేకుండిన శాశ్వతస్వర్గమును బొందిరి॥ ౧౫౯॥

మూ॥ మృతేభర్తరి సాధ్వీస్త్రీ బ్రహ్మచర్యే వ్యవస్థితా। స్వర్గం
గచ్ఛత్య పుత్రాపి యథాతే బ్రహ్మచారిణః॥ ౧౬౦॥

భర్తమృతుడగుచుండ స్త్రీ పతివ్రతయగుచు బ్రహ్మచర్యవ్రతమందుండె యనగా పురుషాంతరసంపర్కము లేనిదై పుత్రవతిగాకుండెను సదాచారముగలది గావున సనకవాలఖిల్యాదులనుంబోలె శాశ్వతమగు స్వర్గమునొందును॥ ౧౬౦॥

మూ॥ అపత్యలోభాద్యాతుస్త్రీ భర్తారమతివర్తతే। సేహనిం
దామవాప్నోతి పరలోకాచ్చ హీయతే॥ ౧౬౧॥

పుత్రుడునాకు గలుగుగావున వానిచేతనే నాకు స్వర్గముగలుగునని యపత్యలోభముచేతనే స్త్రీ భర్తనతిక్రమించి వర్తించునో యనగా వ్యభిచరించునో యా స్త్రీ యీలోకమందు నింద్యురాలై పరలోకమందు నాపుత్రునిచే స్వర్గమునున్ను బొందదు॥ ౧౬౧॥

మూ॥ నాన్యోత్పన్నా ప్రజాస్త్రీహ సచాప్యన్యపరిగ్రహేద్వి

తీయశ్చ సాధ్వీనాం క్వచిద్భర్తోపదిశ్యతే॥ ౧౬౨॥

ఈవిషయమునకు హేతువును చెప్పుచున్నాడు- ఏహేతువుచే నన్యపురుషునిచే పుట్టింపబడిన సంతానమా స్త్రీ శాస్త్రీయమయినది కానేరదు ఒకని భార్యయందు పుట్టింపబడిన సంతానమూ పుట్టించినవానికిన్ని సంతానముకాదు- ఇది నియోగము లేకుండ జరిగిన విషయము లోకములో ననేక భర్తలుగలది స్త్రీయని ప్రసిద్ధివల్లనైన రెండవభర్తచే పుట్టించబడిన వాని వృత్తుడనునదియు నసిద్ధమని చెప్పుచున్నాడు లోకమందు నిందచే ప్రసిద్ధిగలిగ నప్పటికిని శాస్త్రముచే సాధ్వికి రెండవభర్తయని చెప్పబడలేదు ఇటులైతే పునర్భూయన మారుమనువుదేయుటయని ప్రసిద్ధమగుచున్నది॥ ౧౬౨॥

మూ॥ పతింహిత్వాపకృష్టం స్వముత్కృష్టం యానిషేవతే।నిం
ద్యైవసా భవేల్లోకే పరపూర్వేతి చోచ్యతే॥ ౧౬౩॥

తనభర్తనపకృష్టుని క్షత్రియాదికుని విడచి యుత్కృష్టుని బ్రాహ్మణాదికుని యే స్త్రీపొందునో అదిలోకమందు నింద్యురాలగుచున్నది యీ స్త్రీకిమునుపటి మగము యిప్పటి మగడు అని లోకములోనందురు॥ ౧౬౩॥

మూ॥ వ్యభిచారాత్తు భర్తుఃస్త్రీ లోకే ప్రాప్నోతి నింద్యతాం।
సృగాలయోనిం ప్రాప్నోతి పాపరోగైశ్చ పీడ్యతే॥ ౧౬౪॥

వ్యభిచారఫలమును చెప్పుచున్నాడు పరపురుషునితో పోయినస్త్రీ లోకమందు నిందను బొందడమేగాక చచ్చి నక్కయై బుట్టునుకుష్ఠాదిరోగము ననుభవించును॥

మూ॥ పతింయానాభిచరతి మనో వాగ్దేహ సంయతా । సాభ
ర్తృ లోక మాప్నోతి సద్భి స్సాధ్వీతి చోచ్యతే॥ ౧౬౫॥

మనోవాక్కాయకర్మములచే నెల్లప్పుడు నేస్త్రీభర్తనే సేవించుచు నతిక్రమించకయుండునో యదియట్టినియమముచే పుణ్యలోకమును భర్తతోగూడ నొందును లోకములో సజ్జనులచే నివిపతివ్రతయని యెన్నబడును॥ ౧౬౫॥

మూ॥ అనేన నారీవృత్తేన మనో వాగ్దేహ సంయతా । ఇహా
గ్ర్యాం కీర్తిమాప్నోతి పతిలోకం పరత్రచ॥ ౧౬౬॥

ఈ చెప్పిన సదాచారప్రకారముగ స్త్రీమనోవాక్కాయములచే నియతురాలైభ

స్త్రీ శుశ్రూష చేయునో యది యీలోకమందు కీర్తిని పరలోకమందు భర్తతో గూడ పుణ్యలోకమునున్ను బొందునని ప్రకరణమును ముగించుచున్నాడు॥

మూ॥ ఏవం వృత్తాం సవర్ణాం స్త్రీం ద్విజాతిః పూర్వ మారిణీం ।
దాహయే దగ్నిహోత్రేణ యజ్ఞపాత్రైశ్చ ధర్మవిత్॥౧౬౭॥

ఈప్రకారముగ బ్రవర్తించిన సజాతీయయగు భార్యముందు చనిపోయె నేని ధర్మజ్ఞుడగు ద్విజుడు శ్రౌతస్మార్తాగ్నులచే యజ్ఞపాత్రలతో కూడ దహనము చేయవలెను॥ ౧౬౭॥

మూ॥ భార్యాయై పూర్వమారిణ్యై దత్వాగ్నీ నంత్యకర్మణి ।
పునర్దారక్రియాం కుర్యాత్పున రాధాన మేవచ॥ ౧౬౮॥

తనకంటె ముందుగా చనిపోయిన భార్య నగ్నులచే దహించి యంత్యకర్మములనొనర్చి సపుత్రకుండైనను గాకుండినను మరల వివాహమై స్మార్తాగ్నిని గాని తిరుగ నాధానము జేయవలయును॥ ౧౬౮॥

మూ॥ అనేన విధినానిత్యం పంచయజ్ఞాన్న హాపయేత్ । ద్వితీయ మాయుషోభాగం కృతదారో గృహేవసేత్॥ ౧౬౯॥

ఇతి మానవే ధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాం సంహితాయాం
పంచమోధ్యాయః.

ఈ విధిచేననగా తృతీయాధ్యాయము మొదలుకొని చెప్పబడిన ప్రకారము న పంచయజ్ఞములను త్యజింపరాదు తనయాయుష్యములో రెండవపాలులో గృహస్థులకు విహితములగు ధర్మములను నడపవలెను గృహస్థులధర్మములే యైనప్పటికిని పంచయజ్ఞములు ప్రకృష్టములు గావున మరల వేరె జెప్పబడెను॥

ఇది శ్రీమహామహీంద్ర మహారాజ శ్రీమదానందగజపతిరాజ మహారాజ
దయాపాత్ర భారద్వాజ సగోత్ర పవిత్ర సుకవిజన విధేయ
మండకామేశ్వర నామధేయ విరచితాంధ్ర
మన్వర్థదీపికాఖ్యయగు వ్యాఖ్యయందు
పంచమాధ్యాయము.



శుభమస్తు.

ఆంధ్ర మన్వర్థదీపికాసహిత

# మనుస్మృతి ॰ షష్ఠాధ్యాయప్రారంభము.

మూ॥ ఏవం గృహాశ్రమే స్థిత్వా విధివత్స్నాతకో ద్విజః । వనే
వసేత్తు నియతో యథావద్విజితేంద్రియః॥ ౧॥

ద్విజుడు సమావర్తనము మొదలు యథాశాస్త్రముగ గృహస్థాశ్రమధర్మ ములను నడపి నియతుడై ముందు చెప్పబోయెడి ప్రకారముగ నింద్రియములను జయించి యథార్థముగ వానప్రస్థాశ్రమమందు బ్రవేశించి యాధర్మములను జేయవలయును ౧॥

మూ॥ గృహస్థస్తు యదా పశ్యేద్వలీపలితమాత్మనః। అపత్యస్యై
వచాపత్యం తదారణ్యం సమాశ్రయేత్॥ ౨॥

గృహస్థాశ్రమమందుండి తనదేహమందు తలనెరియడం మొదలగువార్ధకచి హ్నములను జూచి తన సంతానమునకు సంతానము బుట్టిన నటుపైని వనమాశ్రయించవలయును॥ ౨॥

మూ॥ సంత్యజ్య గ్రామ్య మాహారం సర్వంచైవ పరిచ్ఛదం । పు
త్రేషు భార్యాం నిక్షిప్య వనంగచ్ఛే త్సహైవవా॥ ౩॥

గ్రామ్యములగు వ్రీహియవాదికభక్ష్యమును గవాశ్వశయ్యాదిపరిచ్ఛదమఖిలమును బరిత్యజించి భార్యకు వనగమనేచ్ఛ లేకుండిన పుత్రులయొద్దనుంచియైన దనతో గూడ రానిచ్ఛయించిన వెంటబెట్టుకొనియైన వనమునకు బోవలయును॥ ౩॥

మూ॥ అగ్నిహోత్రంసమాదాయ గృహ్యంచాగ్నిపరిచ్ఛదం। గ్రా
మాదరణ్యం నిస్సృత్య నివసేన్నియతేంద్రియః॥ ౪॥

ఆవసథ్యాది శ్రౌతాగ్నులనున్ను స్రుక్స్రువాద్యుపకరణములనున్ను పట్టుకొని గ్రామమునుంచి యరణ్యమునకుబయలుదేరిని యతేంద్రియుడై వనమందుండవలెను॥

మూ॥ మున్యన్నై ర్వివిధై ర్మేధ్యై శ్శాకమూలఫలేనవా। ఏతానేవ
మహాయజ్ఞా న్నిర్వపేద్విధిపూర్వకం॥ ౫॥

నీవారాదిమున్యన్నములచేతనున్ను పవిత్రములగు వన్యశాకమూలఫలాదులచేతనున్ను పూర్వోక్తగృహస్థకృత్యపంచమహాయజ్ఞములను యథాశాస్త్రముగ జేయవలయును॥ ౫॥

మూ॥ వసీతచర్మచీరంవా సాయంస్నాయాత్ప్రగేతథా। జటాశ్చ
బిభృయాన్నిత్యం శ్మశ్రులోమనఖానిచ॥ ౬॥

మృగాదిచర్మములను వృక్షములనారనైనకట్టుకొనవలయును హారీతునిచే- సూ॥ "వల్కలశాణచర్మచీరకుశముంజఫలకవాసా ఇతి-" యని వల్కలాదికమునకు యనుజ్ఞ చేయబడెను సాయంప్రాతఃకాలములయందు స్నానము జేయవలయును జటలను శ్మశ్రులోమనఖములను ధరించవలయును॥ ౬॥

మూ॥ యద్భక్ష్యం స్యాత్తతో దద్యా ద్బలింభిక్షాంచ శక్తితః। అ
మ్మూలఫలభిక్షాభి రర్చయేదాశ్రమాగతాన్॥ ౭॥

తానేమితినునో యథాశక్తిగా దానిచే బలిభిక్షాదికమును జేయవలయునుదీనిచే వైశ్వదేవసిద్ధ్యర్థములును॥ శ్లో॥ "ఏతానేవమహాయజ్ఞా"నని చెప్పబడుటవలన జేయవలయు నాశ్రమాగతులకు జలఫలమూలభిక్షాదానపూర్వక పూజజేయవలయును॥ ౭॥

మూ॥ స్వాధ్యాయేనిత్యయుక్తస్స్యాద్దాంతో మైత్రస్సమాహితః।
దాతానిత్యమనాదాతా సర్వభూతానుకంపకః॥ ౮॥

నిత్యమును వేదాభ్యాసము జేయవలయును శీతాతపాదిద్వంద్వములను సహించుచు సర్వోపకారకుడును నియతచిత్తుడును దాతయు నప్రతిగ్రహీతయు భూతదయాళుడును గావలయును॥ ౮॥

మూ॥ వైతానికంచజుహుయా దగ్నిహోత్రం యథావిధి। దర్శ
మస్కందయ న్పర్వ పౌర్ణమాసంచయోగతః॥ ౯॥

గార్హపత్యకుండస్థములగు నగ్నుల నాహవనీయదక్షిణాగ్నికుండములందు వి

హోమించడను వితానము దానియందగు నగ్నిహోత్రము కై తానికమగ్నిహోత్రము యథాశాస్త్రముగ జరపవలయును దర్శపౌర్ణమాసపర్వములను జేయు నిష్ట్యాదుల నాయాకాలమందు విడువక జేయవలయును॥ ౯॥

మూ॥ ఋక్షేష్ట్యాగ్రయణంచైవ చాతుర్మాస్యానిచాహరేత్। ఉ
త్తరాయణంచక్రమశో దాక్షస్యాయనమేవచ॥ ౧౦॥

నక్షత్రేష్టి ఆగ్రయణము శ్రౌతకర్మములగు నుత్తరాయణ దక్షిణాయనములం దు జేయదగిన చాతుర్మాస్యలును ఋచ్చట కొందరిచే నీటంతయున్ను శ్రౌతమగు దర్శపూర్ణమాసాదికర్మమున్ను వానప్రస్థునకుస్మృత్యర్థమని చెప్పబడు చున్నది యీకర్మములు గ్రామ్యములగు వ్రీహ్యాదిసాధ్యములుగావున నీతనికిజేయద గియుండవు శ్రౌతాంగబాధనమందు స్మృతిసమర్థముగాదనిరి అది మంచిగాదని కుల్లూకభట్టు॥ "వాసంతశారదైః-" యని యుత్తరశ్లోకమందు మున్యన్నములగు నీవారాదులచే వానప్రస్థవిషయముగ స్పష్టమైన చరుపురోడాశాదివిధియొక్క బాధనమశక్యముగావున యనిత్రాసెను గోవిందరాజై తేఆరణ్యములగువ్రీహ్యాదులచేత నే యేలాగునై ననీకర్మములను జేయవలయునని చెప్పెను॥ ౧౦॥

మూ॥ వాసంతశారదైర్మేధ్యై ర్మున్యన్నైః స్వయమాహృతైః।
పురోడాశాంశ్చరూంశ్చైవవిధివన్నిర్వపేత్పృథక్॥ ౧౧॥

వసంతర్తుజాతములు శరదృతుజాతములును యాగాంగములు నగునీవారాది మున్యన్నములు స్వయముగా దెచ్చి పురోడాశములను చరువులను యథాశాస్త్రము గ లెత్తద్యాగాదిసిద్ధికై సంపాదించవలెను॥ ౧౧॥

మూ॥ దేవతాభ్యస్తుతద్ధుత్వా వన్యంమేధ్యతరంహవిః। శేషమా
త్మనియుంజీతలవణంచస్వయంకృతం॥ ౧౨॥

ఆవన్యనీవారాదిసాధితమగు యాగార్థమైనహవిస్సును దేవతలకొరకువినియో గపరచి శేషాన్నమునుదినవలెను ఉప్పునున్ను చేస్వయముగ జేసికొనిన లవణముగా వలెను॥ ౧౨॥

మూ॥ స్థలజౌదకశాకాని పుష్పమూలఫలానిచ। మేధ్యవృక్షోద్భవా

స్యాద్యాత్స్నే హాంశ్చవనసంభవాన్॥ ౧౩॥

స్థలజములు జలజములునగుశాకములను పుష్పమూలఫలములను ఆరణ్యయజ్ఞీయవృక్షభవములనున్ను గారసూనె మొదలగుచమురునున్ను తినవలెను॥ ౧౩॥

మూ॥ వర్జయేన్మధుమాంసానిభౌమానికవకానివ।భూస్తృణం
శిగ్రుకంచైవ శ్లేష్మాతకఫలానిచ॥ ౧౪॥

తేనెయు మాంసము భూమియందుబుట్టిన పుట్టకొకుర్లు భూస్తృణమనగా మాళవదేశమందుప్రసిద్ధమగుశాకముశిగ్రుకమనగాబాహ్లీకదేశమందు ప్రసిద్ధమగు శాకమనికుల్లూకభట్టువ్రాసెను తెనుగుదేశమందుశిగ్రుయనగములగచెట్టుఇవిన్ని సంస్కృతమేనుకరకపిందెలునువర్జించవలెనుగోవిందరాజు భౌమానికవకానియనుట నిదిఅన్యవ్యవచ్ఛేదకమగుటచే నేలయందుబుట్టినపుట్టకొక్కులకునిషేధముగా నివృక్షములందుబుట్టినవిభక్షించదగునని చెప్పెనుఅదియు క్తముగాదుద్విజులకుకవకమాత్రనిషేధమువలన వనస్థునకు నియమాతిశయమనుచితముగావున కుల్లూకభట్టు వ్రాసెను॥ శ్లో॥"భూమిజం వృక్షజంవాపి ఛత్రాకం భక్షయంతియే।తాన్‌బ్రహ్మఘ్నాన్‌విజానీయాత్ బ్రహ్మవాదిషు గర్హితానితి"భూమియందును వృక్షమందును బుట్టిన పుట్టకొకుర్లదినినవారు బ్రహ్మఘ్నులగుచున్నారు బ్రహ్మహత్యజేసిన మహాపాతకులలో నిందితులగుదురని యమస్మృతి వృక్షజమగు కవకము విశేషనిషేధమనిచెప్పెను మేధాతిథియైతే భౌమాని యనుపదమును స్వతంత్రముగాజేసి గోజిహ్వక యను నొకానొక పదార్థము వనచరులలో ప్రసిద్ధమని దానినినిషేధించెనుగాని వేని ఘంటులందును నీవస్తువు ప్రసిద్ధముగానుండలేదు గావున విశ్వసించతగదు పుట్టకొకుర్లు ద్విజమాత్రునకు నిషేధమని యుండగ వనస్థునకునిషేధమని భూస్తృణాదికముతో సమప్రాయశ్చిత్త విధానార్థము॥ ౧౪॥

మూ॥ త్యజే దాశ్వయుజే మాసె మున్యన్నం పూర్వసంచితం ।
జీర్ణానిచైవ వాసాంసి శాకమూలఫలానిచ॥ ౧౫॥

ఆశ్వయుజమాసమందు పూర్వసంచితములగు నివారధాన్యముశాకమూలఫలాదులు జీర్ణవస్త్రములు వీటిని త్యజించవలెను॥ ౧౫॥

మూ॥ నఫాలకృష్ట మశ్నీయా దుత్సృష్టమపి కేనచిత్ । నగ్రామ

జాతాన్యాత్తోఽపి మూలానిచ ఫలానిచ॥ ౧౬॥

దున్నినభూమిలో పండినది తత్స్వామిచే నివ్వబడినదైనను ధాన్యము మొదలగు పదార్థమునున్ను గ్రామజములు దున్నని భూమిలో పుట్టినవైనను లతయొక్కయు వృక్షములయొక్కయు మూలఫలాదులను ఆకలిచే పీడితుడైనను దినరాదు॥ ౧౬॥

మూ॥ అగ్నిపక్వాశనోవాస్యా త్కాలపక్వభుగేవవా । అశ్మకుట్టో భవేద్వాపి దంతోలూఖలికోపివా॥ ౧౭॥

అగ్నిపక్వమైన నీవారాదిమున్యన్నమునున్ను కాలపక్వమైన ఫలాదికమునున్ను రోలున్ను రోకలిన్ని మానివేసి రాళ్లతో చితకగొట్టబడిన చూర్ణాదికమునైనను దంతములే రోలుగా చేసుకొని మెత్తగా నమిలినదైనను జీవించవలెను॥ ౧౭॥

మూ॥ సద్యః ప్రక్షాళకోవాస్యా న్మాససంచయికోపివా । షణ్మాసనిచయోవాస్యా త్సమానిచయ ఏవవా॥ ౧౮॥

ఏదినమున కాదినమే సరిపడేటట్టైన నెలకు సరిపడేటి పదార్థములనైనను ఆరునెలలకుసరిపడినట్టిదైనను సంవత్సరమునకుపూర్ణముగా నుట్టిదిదైనను సంగ్రహించుకొనవచ్చును పైపైవానికంటె మొదటిమొదటివాడుత్కృష్టుడు॥ ౧౮॥

మూ॥ నక్తంచా న్నంసమశ్నీయా ద్దివావాహృత్య శక్తితః । చతుర్థకాలికోవాస్యా త్స్యాద్వాప్యష్టమ కాలికః॥ ౧౯॥

యథాశక్తిగా పగలుసంపాదించిన దానిని రాత్రియందు తినవలెను పగలైతే నాలవజాముయందునైన మూడురోజు లుపవసించి నాలవనాటి రాత్రియందైనను భుజించవలెను॥ ౧౯॥

మూ॥ చాంద్రాయణ విధానైర్వా శుక్లే కృష్ణేచ వర్తయేత్ । పక్షాంతయో ర్వాప్యశ్నీ యాద్యవాగూం క్వథితాంసకృత్॥ ౨౦॥

“శ్లో॥ శుక్లకృష్ణయోరేకైకం హ్రాసయేత్పిండంశుక్లేకృష్ణేచవర్ధయేత్” అనునది మొదలుగ నేకాదశాధ్యాయమందు జెప్పగల చాంద్రాయణములచేనైనను పతితించవలెను పౌర్ణమాసియందు నమావాస్యయందును మరిగించిన గంజనైనను ద్రాగవలెను “సకృత్” అనిచెప్పటవలన సాయంకాలమందైనను ప్రాతఃకాలమం

ధైన నొకరీతి మారే॥

మూ॥ పుష్పమూలఫలైర్వాపి కేవలైర్వర్తయే త్సదా । కాల
పక్వైః స్వయంశీర్ణై ర్వైఖానసమతే స్థితః॥ ౨౧॥

కాలపక్వములగు పుష్పమూలఫలాదులచేననగ కాలపక్వములైన వాటియంతే టనవి రాలినవాటిని మాత్రమైన భక్షించవలెను వైఖానసమనగా వానప్రస్థవిధి శాస్త్రము తదుక్తప్రకారమునగనైన నితరవైఖానసవ్రతము నవలంబించి వర్తించవలెను॥ ౨౧॥

మూ॥ భూమౌ విపరివర్తేత తిష్ఠేద్వా ప్రపదైర్దినం । స్థానా
సనాభ్యాం విహరే త్సవనేషూప యన్నపః॥ ౨౨॥

కేవల భూమియందు పరుండి దొర్లుచు గతాగతములను జేయవలయును స్థానాసనాదులయందు గూర్చుండవలెను ఆవశ్యకమైన స్నానభోజనాదికాలములను విడచి యీనియమములేక తిరుగుచుండవలెను పగలెల్లా పాదాగ్రములచే నిలవబడవలెను గాని కొంతకాలముకూర్చునియు కొంతకాలము నడచియుగొంతకాలము నిలవబడియు నిటులనుండరాదు ప్రాతర్మధ్యాహ్న సాయంకాలములయందు స్నానము జేయవలయును మున్ను జెప్పిన దానిచే దీనికివికల్పము॥ ౨౨॥

మూ॥ గ్రీష్మే పంచతపాస్తుస్యా ద్వర్షాస్వభ్రావకాశకః । ఆ
ర్ద్రవాసాస్తు హేమంతే క్రమశోవర్ధయం స్తపః॥ ౨౩॥

తన తపస్సుయొకటి వృద్ధికై గ్రీష్మఋతువందు నాలుగువైపుల నగ్నులనుంచి సూర్యునిచూచుచున్నట్లు తపించవలెను వర్షఋతువందు ఛత్రాద్యావరణములేకుండ బట్టబయిలునవర్షధారలచే నానుచునుండ వలెను హేమంతఋతువునందు తడిబట్టలు కట్టుకుని తపస్సును జేయవలయు నిది ఋతుత్రయపక్షము నాశ్రయించి యొకసంవత్సర మట్లు నిష్ఠ జేయవలయును॥ ౨౩॥

మూ॥ ఉపస్పృశం స్త్రిషవణం పితౄంర్దేవాంశ్చ తర్పయేత్ । త
పశ్చరంశ్చోగ్రతరం శోషయే ద్దేహమాత్మనః॥ ౨౪॥

త్రిషవణస్నానముచేయుచునప్పటికిని దేవాదితర్పణము మూడుకాలములందును

జేయుటకై యిట్లు విధింపబడుచున్నది నిత్యమును కాలత్రయమందును స్నానసంధ్యానచింతన దేవర్షి పితృతర్పణము మొదలగువానిజేయవలయును మరియు వక్ష్యమాణోపవాసాదికముచే నుగ్రతరమగు తపస్సును జేయవలయును॥ "శ్లో॥ పక్షోపవాసినః కేచిత్కేచిన్మాసోపవాసినః॥" కొందరు పక్షమునకొకమారును కొందరు మాసమున కొకమారును భుజింతురను యమస్మృతివలన దేహమును శోషింపజేయవలయును।

మూ॥ అగ్నీనాత్మని వైతానాన్ సమారోప్య యథావిధి। అన
గ్నిరనికేతస్స్యాన్ముని ర్మూలఫలాశనః॥ ౨౫॥

వైఖానసవ్రతవిధానముచే శ్రౌతాగ్నులను భస్మపానముచే నాత్మారోపణ మొనరించి లౌకికాగ్నిగృహశూన్యుడై "వృక్షమూలనికేతనః॥" యని వక్ష్యమాణ ప్రకారముగ చెట్టుమొదటనే నివసించుచు మౌనవ్రతమునవలంబించి నీవారాదులను విడచి ఫలమూలాదులచేత జీవనమునడుపుచు॥ "సూ॥ షణ్మాసేభ్య ఊర్ధ్వ మనగ్నిరనికేతనః॥" యనునపస్తంబవచనమువలన నారునెలలపైని గృహమునగ్నిని విడచి యుండవలయును॥ ౨౫॥

మూ॥ అప్రయత్నస్సుఖార్థేషు బ్రహ్మచారీ ధరాశయః। శరణే
ష్వమమశ్చైవ వృక్షమూలనికేతనః॥ ౨౬॥

స్వాదుఫలభక్షణాదిసుఖప్రయోజనములందప్రయత్నుడును స్త్రీసంభోగశూన్యుడును నేలపరుండుటయు వృక్షమూలాదులందున్న మమత్వశూన్యుడును గావలయును॥ ౨౬॥

మూ॥ తాపసేష్వేవ విప్రేషు యాత్రికం భైక్షమాహరేత్ । గృ
హమేధిషు చాన్యేషు ద్విజేషు వనవాసిషు॥ ౨౭॥

ఫలమూలములు దొరకనప్పుడు వానప్రస్థులగు విప్రులవలన ప్రాణయాత్రామాత్రమును భైక్షమును బుచ్చికొనవచ్చును అట్లు సంభవించనిచో వనమందుండిన గృహస్థులవలన భైక్షమును గొనవచ్చును॥ ౨౭॥

మూ॥ గ్రామాదాహృత్య వాశ్నీయా దష్టౌ గ్రాసాన్ వనే వసన్ ।
ప్రతిగృహ్య పుటేనైవ పాణినా శకలేన వా। ౨౮ ॥

అట్లుసంభవించనిచో గ్రామమువలన పర్ణపుటికచేనైన పాణిచేనైనభిక్షమెత్తు కొని యెనిమిదికబళములనువానప్రస్థుడు భక్షించవలెను॥ ౨౮॥

మూ॥ ఏతాశ్చాన్యాశ్చ సేవేత దీక్షా విప్రోవనేవసన్ । వివిధా
శ్చౌపనిషదీ రాత్మసంసిద్ధయేశ్రుతీః॥ ౨౯॥

ఈచెప్పబడినట్టియు నింకనున్నట్టినియమములను జేయుచు వనమందుండి విప్రు డుపనిషన్మంత్రములనుబ్రహ్మత్వసిద్ధికొరకు నర్థవిచారణ పూర్వకముగ నభ్య సించవలయును॥ ౨౯॥

మూ॥ ఋషిభిర్బ్రాహ్మణైశ్చైవ గృహస్థైరేవ సేవితాః। విద్యా
తపో వివృద్ధ్యర్థం శరీరస్యచ శుద్ధయే॥ ౩౦॥

ఋషులు బ్రాహ్మణులు గృహస్థులు జ్ఞానపూర్వకమగు తపస్సుయొక్క వృద్ధికొ రకున్ను శరీరశుద్ధికొరకున్ను నేయేయుపనిషచ్ఛ్రుతులను సేవించిరో వాటి నభ్య సించవలెనని యనువాదము॥ ౩౦॥

మూ॥ అపరాజితాం వాస్థాయ వ్రజేద్దిశమజిహ్మగః । ఆనిపా
తాచ్ఛరీరస్య యుక్తోవార్యనిలాశనః॥ ౩౧

అచికిత్సితరోగాదికముబుట్టినేని యీశానదిక్కుగా యోగయుక్తుడై జలాని లాశనుడై వక్రగతిలేకుండ శరీరముపడేపర్యంతమునడచిపోవలెను మహాప్రస్థాన మందిదియుచితము శాస్త్రీయమగుప్రస్థానమరణమనిషిద్ధము శాస్త్రీయము నిషిద్ధ ముగాదు॥ ౩౧॥

మూ॥ ఆసాం మహర్షిచర్యాణాం త్యక్త్వాన్యతమయాతనుం। వీ
తశోకభయోవిప్రో బ్రహ్మలోకే మహీయతే॥ ౩౨॥

ఈచెప్పబడినయనుష్ఠానములలో దేనిచేతనైన కాలముగడిపి శరీరము విడచిన విప్రుడుశోకభయాదులులేనివాడై బ్రహ్మలోకమందు పూజ్యుడగును ముక్తుడగును జ్ఞానమువలననే కదా ముక్తి వీనికికర్మములచేముక్తియగునాయనవద్దు॥ "శ్లో॥ వి విధాశ్చౌపనిషదీరాత్మసంశుద్ధయేశ్రుతీః॥" యనుటచే జ్ఞానముదీనికిలేదన్న మాట లేదు॥ ౩౨॥

వజముగా పుత్రులనుగని యథాశక్తిగా జ్యోతిష్టోమాదియాగములనొనర్చి మోక్షార్థమై సన్యసింపవలెను॥ 36॥

మూ॥ అనధీత్య ద్విజో వేదా ననుత్పాద్య తథాసుతాన్। అనిష్ట్వా
చైవ యజ్ఞైశ్చ మోక్షమిచ్ఛన్ వ్రజత్యధః॥ 37॥

వేదములనుజదువక పుత్రునిగనక యజ్ఞములనొనర్పక మోక్షమును గోరెనేని నరకమునంబడును॥ 37॥

మూ॥ ప్రాజాపత్యాం నిరూప్యేష్టిం సర్వవేదసదక్షిణాం। ఆత్మ
న్యగ్నీన్ సమారోప్య బ్రాహ్మణః ప్రవ్రజేద్గృహాత్॥ 38॥

యజుర్వేదీయోపాఖ్యాన గ్రంథోక్తమును సర్వస్వదక్షిణగలదియునగు ప్రజాపతి దేవతాకమగు నిష్టినిజేసి విధ్యుక్తముగ నగ్నులనాత్మారోపణమొనర్చి గృహదనుటచే వానప్రస్థాశ్రమమువలననునున్న వాల్గవయాశ్రమమున బ్రవేశింపవలెను ఇట్లు మనువుచే నాల్గాశ్రమములున్న చెప్పబడెను శ్రుతిసిద్ధములేగావున॥శ్రు॥"ఏకద్విత్రిచతురాశ్రమాణాంసముచ్చయా వికల్పితాః"ఒకటిరెండు మూడు నాల్గాశ్రమములుసముచ్ఛితములును వికల్పితములును యని॥సూ॥"బ్రహ్మచర్యంసమాప్య గృహీభవేత్ గృహీభూత్వావనీభవేత్ వనీభూత్వా ప్రవ్రజేత్ ఇతరథాబ్రహ్మచర్యా త్ప్రవ్రజేద్గృహాద్వావనాద్వేతి"బ్రహ్మచర్యమును సమాప్తినొందించిగృహస్థుడయియందునుండెవనిమైౖ యందునుండిసన్యసింపవలెను లేదావిరక్తిగలిగెనేనియే ఆశ్రమమునుండిమైన సన్యసింపవచ్చునని జాబాలివచనము॥ 38॥

మూ॥ యోదత్వా సర్వభూతేభ్యః ప్రవ్రజత్యభయం గృహాత్।
తస్య తేజోమయా లోకా భవంతి బ్రహ్మవాదినః॥ 39॥

ఎవడు స్థావరజంగమభూతములకభయమిచ్చి గృహమువలన సన్యసించునో బ్రహ్మప్రతిపాదకోపనిషన్నిష్ఠుడగు నతండు సూర్యాది తేజములకరిర లేకుండ స్వయముగాప్రకాశించు తేజోమయములగు ప్రాజాపత్యాది లోకములనొందును॥

మూ॥ యస్మాదణ్వపి భూతానాం ద్విజాన్నోత్పద్యతే భయం।త
స్య దేహా ద్విముక్తస్య భయంనాస్తి కుతశ్చన॥ 40॥

ఏవిప్రునివలన యించుకంతైన భూతములకు భయములేకుండెనతండు దేహంను విడచ్చి యెందువలననయిన భయమునొందడు॥ ౪౦॥

మూ॥ అగారాదభినిష్క్రాంతః పవిత్రోపచితో మునిః। సముపో
ఢేషు కామేషు నిరపేక్షః పరివ్రజేత్॥ ౪౧॥

గృహమువలన బయలుకేరి పవిత్రములగు దండకమండల్వాదుల నవలంబించి మౌనియై స్వాదుభోజనాదులందు నిరపేక్షుడై కోరికలన్నియు నివర్తింపసన్యసించవలెను పవిత్రైరనుచో పావనమంత్రజపోపాసనాకృచ్ఛ్రాది వ్రతములోనని మేధాతిథివ్రాసెను॥ ౪౧।

మూ॥ ఏకఏవచరేన్నిత్యం సిద్ధ్యర్థమసహాయవాన్। సిద్ధిమేకస్యసం
పశ్యన్ నజహాతినహీయతే॥ ౪౨॥

ఒకడే సర్వసంగరహితుడైన వానికి మోక్షావాప్తియగునని దెలసి రెండవ వాడు సహాయములేకుండననుటచే వియోగాది దుఃఖమును పూర్వాశ్రమపుత్రాది సంబంధము లేకుండిన మమత్వశూన్యుడగునని తాత్పర్యము నిస్సంగుడై ముక్తుడగును॥ ౪౨॥

మూ॥ అనగ్నిరనికేతస్స్యాద్గ్రామమన్నార్థమాశ్రయేత్। ఉపే
క్షకోసంకుసుకో మునిర్భావసమాహితః॥ ౪౩॥

అనగ్నిః యనగా శ్రౌతాగ్నియున్ను గాసమారోపితమాయెను గావున నిచ్చట లౌకికాగ్నియున్ను లేనివాడై గృహమున్ను లేనివాడై శరీరరోగాదికము నుపేక్షించువాడై యనగా వ్యాధ్యాదిప్రతికారము చేయనివాడై "అసంకుసుకః" యనగా స్థిరమయినబుద్ధిగలవాడై యని "అసంచయికః" యని పాఠాంతరము వస్తుసంగ్రహము లేనివాడైయని "మునిః" యనగా మౌనము పూర్వముచెప్పబడెను గాన బ్రహ్మమననశీలుడునై భావముచే బ్రహ్మమందు సమాహితుడై బ్రహ్మానుసంధానపరుడైయని యర్థము అరణ్యమందే దివారాత్రములుండి భిక్షార్థము మాత్రము గ్రామమునకు రావలెను॥ ౪౩॥

మూ॥ కపాలం వృక్షమూలాని కుచేలమసహాయతా। సమతాచై

వ పర్వస్మి న్నేతస్మా క్షస్యలక్షణం॥ ౪౪॥

భిక్షనెత్తుకొనుటకు మంటికుండ పెంకున్ను నివాసమునకు వృక్షమూలమునులుము తకదిచింపిదిబట్టకౌపీనము చలికోకబొంత సహాయములేకుండ నొకడే యుండు ట పర్వము బ్రహ్మమనుభావనచేశత్రుమిత్రాదులులేకుండుటచేసమదృష్టిఇవన్నియు ముక్తిసాధనములు గావున ముక్తలింగమిది॥ ౪౪॥

మూ॥ నాభినందేతమరణం నాభినందేతజీవితం। నాలమేవప్రతీక్షే త నిర్దేశం భృతకోయథా॥ ౪౫॥

బ్రతుకునకుగాని మరణమునకుగాని కోరక కర్మాధీనమైయగునని ప్రతీక్షించవ లెను అదియట్లన్న భృతకుడు నిర్ణయించబడిన జీతమునుగూర్చి తత్కాలమును కనిపెట్టినట్లు॥ ౪౫॥

మూ॥ దృష్టిపూతంన్యసేత్పాదం వస్త్రపూతంజలంపిబేత్। సత్య పూతాంవదేద్వాచం మనఃపూతం సమాచరేత్॥ ౪౬॥

కేశములు నెముకలు మొదలగువాటిని మెట్టకుండుటకునడిచినప్పుడు త్రోవచూ చుకుని నడువవలయును చిన్నపురుగులు జలమందుండును గావున వడపోసిన నీళ్ళ నేత్రాగవలెను సత్యమగుమాటనే పలుకవలయును ఇదిమానముతో వికల్పముసం కల్పశూన్యముగ మనస్సును పూతముగజేసుకుని వర్తించవలెను॥ ౪౬॥

మూ॥ అతివాదాం స్తితిక్షేత నావమన్యేతకంచన। నచేమందేహ మాశ్రిత్య వైరంకుర్వీత కేనచిత్॥ ౪౭॥

ఎవ్వడైనతననుమించనాడిన సహించవలెను ఎవ్వనికైన పరాభవముజేయరా దు ఈదేహము రోగభూయిష్ఠమస్థిరము గావున దీనినిబట్టి యెవ్వనితోనైనవైర ముజేయరాదు॥ ౪౭॥

మూ॥ క్రుధ్యంతం నప్రతిక్రుధ్యే దాక్రుష్టః కుశలం వదేత్। స ప్త ద్వారావకీర్ణాంచ నవాచమనృతాం వదేత్॥ ౪౮॥

తనమీదకోపము బడినవానిపైనిదాకోపము నొందరాదు మరేమంటెతిట్టినవా నికిభద్రమగువాక్యమేపలుకవలెను సప్తద్వారావకీర్ణాయనగా శ్రోత్రాదీంద్రియ

ములుఅయినను స్సున్నమనస్సుబుద్ధిరెండున్ను గలసి యేడుద్వారములనగా వీటినిబట్టిగదా
యేవాక్కులయినానడుచును గాన వీటిచేవిక్షిప్తమగువాక్కుబలుకరాదు బ్రహ్మవిషయ
మైనవాక్కునేబలుకవలెను.ఓయీమనస్సుచేతనేగదా బ్రహ్మముపాసనజేయబడునుగ
మనస్సుచేతనేగదా బ్రహ్మవిషయమగువాక్కును బలుకబడును అట్టిచో సప్తద్వారావ
కీర్ణత్వమెట్లగునువానినిబరిహరించిబ్రహ్మవిషయమగువాక్కునేబలుకుమనుటయెట్లనిన
కరాగా చెప్పబడెను అదిగనుకనే "యనృతా" యనివిశేషణమిచ్చెను అనృతమనగా
ననత్యము వినాశశీలమని యర్థము గావున వినాశికార్యవిషయమగు పలుకును బ
లుకరాదు అవినాశియగు బ్రహ్మవిషయమగువాక్కులను బలుకవలెననియనగా బ్రహ్మ
వమునుపనిషత్తులు నిరూపమగువాక్కులనే బలుకవలెనని కుల్లూకభట్టువ్రాసెను గో
విందరాజయితే ధర్మము అర్థము కామము ధర్మార్థములు ధర్మకామములు
అర్థకామములు ధర్మార్థకామములు నీయేడును వాగ్విషయములగుటవలన ఏవా
క్కులయినా ప్రవర్తించునపుడివి ద్వారములవుటచే వీటివలన విక్షిప్తమగునది యస
త్యరూపమగుదానిని బలుకరాదనివ్రాసెను ఇతరవ్యాఖ్యాతలు ఏడుభువనములు వా
గ్విషయములుగావున తద్విషయమగువాక్కులసత్యరూపములగునుగాన వాటినిబ
లుకరాదు కేవలబ్రహ్మవిషయమగు వాక్కులనే పలుకవలెననివ్రాసిరి॥ ౪౮॥

మూ॥ అధ్యాత్మరతి రాసీనో నిరపేక్షో నిరామిషః। ఆత్మనైవ స
హాయేన సుఖార్థీ విచరేదిహ॥ ౪౯॥

పరమాత్మనధికరించిన రతియనగా నాసక్తియదిగలవాడున్ను స్వస్తికాదుల
లో నొకయాసనముచేగూర్చుండినవాడున్ను దండకమండల్వాదులయందున్ను నిర
పేక్షుడున్ను విషయాభిలాషలేనివాడున్ను దేహమే సహాయముగాగలవాడున్ను స
యి యీసంసారములోనుండవలెను॥ ౪౯॥

మూ॥ నచోత్పాత నిమిత్తాభ్యాం ననక్షత్రాంగ విద్యయా। నాను
శాసన వాదాభ్యాం భిక్షాంలిప్సేత కర్హిచిత్॥ ౫౦॥

భూకంపచక్షుస్స్పందాది నిమిత్తఫలకథనముచేతనున్ను నీతిశాస్త్రమనుసరించి
చి ఫలకథనముచేతనున్ను మరి యున్నున్న శాస్త్రార్థముచేతనున్ను భిక్షనుసంపా
దించ నిచ్ఛయించకూడదు॥ ౫౦॥

మూ॥ న తాపసైర్బ్రాహ్మణైర్వా వయోభిరపి వాశ్వభిః । ఆకీ

ణం భిక్షుకై ర్వాన్యై రాగారముప సంవ్రజేత్॥ ౫౧॥

వానప్రస్థులచేతనున్ను ఇతరులగు బ్రాహ్మణులచేతనున్ను కుక్కలచేతనున్ను వ్యాప్తమగునింటికి భిక్షార్థము బోరాదు॥ ౫౧॥

మూ॥ క్లృప్తకేశనఖశ్మశ్రు పాత్రీదండీ కుసుంభవాన్। విచరేన్ని యతో నిత్యం సర్వభూతాన్య పీడయన్॥ ౫౨॥

క్లృప్తములగు కేశములు నఖములు ముఖలోమములున్ను గలవాడై భిక్షాపాత్రము దండమున్ను కమండలువున్ను కాషాయవస్త్రములున్ను గలవాడై భూతపీడ లేకుండ దిరుగవలెను॥ ౫౨॥

మూ॥ అతైజసాని పాత్రాణి తస్యస్యు ర్నిర్వ్రణానిచ। తేషామ ద్భి స్స్మృతం శౌచం చమసానా మివాధ్వరే॥ ౫౩॥

సువర్ణరజతాది లోహపాత్రములందు భిక్షనెత్తరాదు॥శ్లో॥ "సువర్ణరౌప్య పాత్రేషు తామ్రకాంస్యాయసేషుచ। గృహ్ణన్ భిక్షాం నధర్మోస్తి గృహీత్వా నరకం వ్రజేత్" సువర్ణరజత తామ్రకాంస్యాది లోహపాత్రములందు భిక్షాగ్రహణమధర్మమట్లు జేసిన నరకము నొందునని యమవచనము తద్వ్యతిరిక్తాలాబూదార్వాదిపాత్రములశుద్ధి యజ్ఞమందు చమసలకునుంబలె జలముచేత నేయగును॥ ౫౩॥

మూ॥ అలాబుం దారు పాత్రంచ మృణ్మయం వైదలంతథా। ఏ తాని యతిపాత్రాణి మనుస్స్వాయంభువో బ్రవీత్॥ ౫౪॥

ఆనబతుంబ కర్రచేచెక్కబడిన పాత్రము మట్టిపాత్రము వెదురుబొంగు గుంపువద్దిక్కోసినముక్క ఇవియతులకుపాత్రములని స్వాయంభువమనువుచెప్పెను వైదలమనగా చెట్టుత్వక్కుచే జేయబడినపాత్రమని గోవిందరాజువ్రాసెను॥ ౫౪॥

మూ॥ ఏకకాలంచరేద్భైక్షం నప్రసజ్జేత విస్తరే। భైక్షే ప్రసక్తోహియతి ర్విషయేష్వపి సజ్జతి॥ ౫౫॥

ప్రాణధారణమాత్రార్థమొక్క పూటయందే భిక్షమెత్తవలె నధికము భక్షించరాదట్లయిన ధాతువృద్ధిచే స్త్రీవిషయమందు బ్రసక్తిగలుగును॥ ౫౫॥

మూ॥ విధూమే సన్నముసలె వ్యంగారే భుక్తవజ్జనే। వృత్తేశరావ
సంపాతే భిక్షాంనిత్యం యతిశ్చరేత్॥ ౫౬॥

వంటచేసినవహ్నియొక్క ధూమములేకుండునప్పుడును నియ్యము దంపు మొదలగునవిమైనపిమ్మట సంవరును భుజించి పాత్రములశుద్ధియగు వేళను నిత్యము, గృహస్థులయిండ్లకు భిక్షార్థము యతిబోవవలెనుదీనిచే సాయాహ్నమందు భిక్షుకుఁబోవలెను॥ "శ్లో॥ అప్రమత్తశ్చరేద్భైక్షం సాయాహ్నేనాభిసంధితః-" ప్రమత్తుఁడుగాకుండ అధికభిక్షాపేక్షలేకుండ సాయాహ్నమందు భిక్షుకుఁబోవలెనని యాజ్ఞవల్కి॥

మూ॥ అలాభే నవిషాదీస్యాల్లాభేచైవనహర్షయేత్। ప్రాణ
యాత్రికమాత్రస్స్యాన్మాత్రాసంగాద్వినిర్గతః॥ ౫౭॥

భిక్షాన్నము తక్కువదొరికెనని దుఃఖమున్ను చాలాదొరికెనని హర్షమున్ను బొందరాదు ప్రాణము నిలవపడుమాత్రమన్నము గొనవలెను దండకమండలు పాత్రములందునైన సక్తిలేకుండ విడువ నుపేక్షగలిగి యుండవలెను గాని చిరకాలగృహీతములని యాసక్తితగదు॥ ౫౭॥

మూ॥ అభిపూజితలాభాంస్తు జుగుప్సేతైవసర్వశః। అభిపూజితలా
భైశ్చ యతిర్ముక్తోపి బధ్యతే॥ ౫౮॥

పూజాపూర్వక భిక్షాలాభమందాసక్తిచే సర్వకాలమందును స్వీకరించరాదు పూజాపూర్వకభిక్షయందు సంగము గలిగెనేని యాపూజకులయందు సక్తిగల్గుటచే నాసన్నముక్తుడైనను బద్ధుడగును॥ ౫౮॥

మూ॥ అల్పాన్నాభ్యవహారేణ రహస్థ్సానాసనేనచ। హ్రియమాణా
నివిషయై రింద్రియాణి నివర్తయేత్॥ ౫౯॥

స్వల్పాహారము చేతనున్ను నిర్జనస్థానమందుండుట చేతనున్ను విషయములచే నాకర్షింపబడెడి యింద్రియములను మళ్ళింపవలెను॥ ౫౯॥

మూ। ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేషక్షయేణచ। అహింస
యాచభూతానా మమృతత్వాయకల్పతే॥ ౬౦॥

ఇంద్రియ నిగ్రహముచేతనున్ను రాగద్వేషములు లేకుండుటచేతనున్ను ప్రాణి

హింసా౽భావముచేతనున్ను ముక్తికి యోగ్యుడగును॥ ౬౦॥

మూ॥ అవేక్షేతగతీర్నౄణాం కర్మదోషసముద్భవాః।నిరయేచై
వపతనం యాతనాశ్చయమాలయే॥ ౬౧॥

ఇప్పుడు ఇంద్రియనిగ్రహోపాయమున్ను సంసారతత్వచింతన పూర్వకము విషయవిరాగమునకు ఉపాయమును చెప్పుచున్నాడు విహితకర్మములనుమానడమును నిషిద్ధములను చెయ్యడము చేశ్వసూకరాదియోనులందు బుట్టుటయున్ను నరకపతనమును అచ్చట యమభటులచేనగు యాతనలనున్ను స్మృతిపురాణాదులజూడవలెను॥౬౧॥

మూ॥ విప్రయోగం ప్రియైశ్చైవ సంయోగంచ తథాప్రియైః। జ
రయాచాభిభవనం వ్యాధిభిశ్చోపపీడనం॥ ౬౨॥

ఇష్టులగు పుత్రాదివియోగమున్ను తనకు హింసకులగు వారితో సంయోగమున్ను ముదిమిచేనవశుడగుటను రోగాదులచేనగుపీడనున్ను కర్మదోషమువలనబుట్టునని తెలియవలెను॥ ౬౨॥

మూ॥ దేహాదుత్క్రమణంచాస్మాత్పునర్గర్భేచ సంభవం। యో
నికోటిసహస్రేషు సృతీశ్చాస్యాంతరాత్మనః॥ ౬౩॥

ఈదేహమువలన జీవాత్మునకుత్క్రమణమగుచో శ్లేష్మాద్యుద్బంధనమున్ను పునఃగర్భమందు దుఃఖము ననుభవించడమున్ను శ్వసృగాలాది యోనికోట్లయందు ప్రవాహరూపముగ బుట్టుచు వచ్చుచు నున్నదిన్ని ఇట్లు కర్మబంధమును జింతించవలయును॥ ౬౩॥

మూ॥ అధర్మప్రభవంచైవ దుఃఖయోగం శరీరిణాం। ధర్మార్థ
ప్రభవంచైవ సుఖసంయోగమక్షయం॥ ౬౪॥

ప్రాణులయొక్క అధర్మమువలననగు దుఃఖయోగమున్ను ధర్మముచేనగుజ్ఞానముచే మోక్షానందము నక్షయమగు దానిన్ని చింతజేయవలయును॥ ౬౪॥

మూ॥ సూక్ష్మతాంచాన్వవేక్షేత యోగేన పరమాత్మనః। దేహే
షుచ సముత్పత్తి ముత్తమేష్వధమేషుచ॥ ౬౫॥

విషయాంతరములందు చిత్తవృత్తిపోకుండ మళ్ళించుటచే స్థూలదేహాదివ్యతిరిక్తనిరవయవసూక్ష్మాంతర్యామియొక్క ఇంద్రియాగోచరత్వమునున్ను అట్టిజ్ఞానములేకుండుటచే కర్మభేదముచే నుత్కృష్టాపకృష్టదేవపశ్వాదియోనులందు బుట్టుటనున్ను చింతించవలయును॥ ౬౫॥

మూ॥ దూషితోపి చరేద్ధర్మం యత్ర తత్రాశ్రమేరతః । సమస్సర్వేషు భూతేషు నలింగం ధర్మకారణం॥ ౬౬॥

ఏ యాశ్రమమందుండినను తత్తదాశ్రమలింగరహితుడై దూషితుడైనను సర్వభూతములందును బ్రహ్మబుద్ధిచే సమదృష్టి గలిగి పరమధర్మమును జేయవలయును దండాదిలింగములను ధరించడము ధర్మమునకు కారణముగాదు విహితానుష్ఠానము ముఖ్యము ఇదిన్ని ధర్మము ప్రధానమనిగాని దండాదిధారణ నిషేధపరము గాదు॥ ౬౬॥

మూ॥ ఫలంకతక వృక్షస్య యద్యప్యంబుప్రసాదకం । ననామగ్రహణాదేవ తస్య వారిప్రసీదతి॥ ౬౭॥

విచారించగా నిండువృగాయకలుషజలమును నిర్మలమునుగా జేసేదగును యైన ప్పటికిని దాని పేరు చెప్పిన మాత్రముచే జలము నిర్మలముగాదు ఆకాయనరగదీయవలె నారీతినే దండాదిలింగధారణమాత్రము ధర్మకారణముగాదు మరేమనిన విహితానుష్ఠానము గావలెను॥ ౬౭॥

మూ॥ సంరక్షణార్థం జంతూనాం రాత్రావహని వాసదా।శరీరస్యాత్యయేచైవ సమీక్ష్య వసుధాం చరేత్॥ ౬౮॥

తన శరీరమునకు పీడయైనను సూక్ష్మములగు పిపీలికాదుల ప్రాణరక్షణముకొరకు రాత్రియందును పగలయందును భూమినిచూచి సంచరించవలెను మున్ను దృష్టిపూతంన్యసేత్పాదమని చెప్పినది కేశాస్థిప్రముఖములను మెట్టకుండనని చెప్పుటవలన పునరుక్తిలేదు॥ ౬౮॥

మూ॥ అహ్నారాత్ర్యాచ యాన్ జంతూన్ హినస్త్యజ్ఞానతో యతిః । తేషాం స్నాత్వా విశుద్ధ్యర్థం ప్రాణాయామాన్ షడాచరేత్॥ ౬౯॥

ఇందుకు ప్రాయశ్చిత్తమును చెప్పుచున్నాడు యతియజ్ఞానముచే రాత్రియందుగాని పగటియందుగాని సూక్ష్మజంతుహననమగుదానికి స్నానంబొనర్చి యాఱు ప్రాణాయామముల నొనర్పవలెను ప్రాణాయామమనగా॥ "శ్లో॥ సవ్యాహృతింసప్రణవాం గాయత్రీంశిరసాసహ । త్రిఃపఠేదాయతప్రాణః ప్రాణాయామస్స ఉచ్యతే॥" ప్రాణవాయువును నిలిపి వ్యాహృతిప్రణవసహితముగ శిరస్సుతో గూడ గాయత్రిని మూడుమారులు బఠించిన ప్రాణాయామమని చెప్పబడెనని వసిష్ఠోక్తి జూడదగినది॥ ౬౯॥

మూ॥ ప్రాణాయామా బ్రాహ్మణస్య త్రయోఽపి విధివత్కృతాః ।
వ్యాహృతిప్రణవై ర్యుక్తం విజ్ఞేయం పరమంతపః॥ ౭౦॥

బ్రాహ్మణజాతికని గాని యతికిమాత్రమేగాదు ఏడువ్యాహృతులతోనున్ను పదిప్రణవములతోనున్ను శిరస్సుతోగూడ గాయత్రిని పూరకకుంభకరేచకవిధిచేజేసిన నదిబ్రాహ్మణునకు ప్రాణాయామమిదిపరమతపస్సు పూరకాదుల నితరస్మృతులచే దెలియవలయు॥ "శ్లో॥ నాసికోత్కృష్టఉచ్ఛ్వాసో ధ్మాతఃపూరకఉచ్యతే।కుంభకోనిశ్చలశ్వాసో ముచ్యమానస్తురేచకఇతి॥" ముక్కున వాయువు నెగబీర్చుటపూరకమది నిలిపి చలనము లేకుండనుంచుట కుంభకమావాయువును విడుచుట రేచకమనియోగయాజ్ఞవల్క్య- ఇట్లుమున్మారనుటచే నట్లుగావలె నెన్ని ప్రాణాయామములైతే నంతపాపక్షయమగును॥ ౭౦॥

మూ॥ దహ్యంతే ధ్మాయమానానాం ధాతూనాంహి యథామ
లాః । తథేంద్రియాణాం దహ్యంతే దోషాః ప్రాణస్య ని
గ్రహాత్॥ ౭౧॥

సువర్ణరజతాదులు మూషలోనుంచి యగ్నిబెట్టి యూదగా వాటియందుగల లోహాంతరసంసర్గజ దోషము లెట్లులు కాలిపోవునో యట్టులింద్రియములు విషయాభిముఖములగుటనగు దోషములున్ను మనస్సుయొక్క రాగాదిదోషములున్ను ప్రాణాయామములచే నశించును॥ ౭౧॥

మూ॥ ప్రాణాయామైర్దహేద్దోషాన్ ధారణాభిశ్చ కిల్బిషం ।
ప్రత్యాహారేణ సంసర్గాన్ ధ్యానేనానీశ్వరాన్గుణాన్॥

ప్రాణాయామములచే రాగాది దోషములను దహించవలెను బ్రహ్మాదిధ్యేయము లందు మనస్సును నిలుపుట ధారణ వాటిచే పాపమును నశింపజేయవలెను విషయముల వలన నింద్రియములను మరలమరల మళ్లించుట ప్రత్యాహారము వీటిచేవిషయసంపర్కములను వారించవలెను సోహమనియనగా పూర్ణమగు బ్రహ్మమే నేనని ధ్యానించుట ప్రవాహరూపముగ నెడతెగకుండునట్లు జేయుట ధ్యానమందుచే ననీశ్వరగుణములనగా క్రోధాదులు వాటినినివారించవలయును॥ ౭౨॥

మూ॥ ఉచ్చావచేషు భూతేషు దుర్జ్ఞేయామకృతాత్మభిః । ధ్యా
నయోగేన సంపశ్యేత్ గతిమస్యాంతరాత్మనః॥ ౭౩॥

ఈజీవునకుత్కృష్టాపకృష్టములగు దేవపశ్వాదులందు జన్మప్రాప్తి శాస్త్రము తెలియనందున మూఢమగునంతఃకరణముగలవారిచే దెలియబడనిది యేదో యట్టిదానిని సకారణముగ ధ్యానాభ్యాసముచే దెలియవలయు నందువలన నవిద్యచేనగు కామ్యనిషిద్ధకర్మములచే నీగతినిర్మించబడెనని తెలిసి బ్రహ్మజ్ఞాననిష్ఠుడగునని తాత్పర్యార్థము॥ ౭౩॥

మూ॥ సమ్యగ్దర్శనసంపన్నః కర్మభిర్నసబధ్యతే । దర్శనేనవి
హీనస్తు సంసారం ప్రతిపద్యతే॥ ౭౪॥

అందువలన బ్రహ్మసాక్షాత్కారముగలవాడై కర్మములచే బద్ధుడుగాడు కర్మములచే మరలవానికి జన్మములురావు పూర్వార్జిత పాపపుణ్యములు బ్రహ్మజ్ఞానముచేనశించు నిందుకుశ్రుతి॥ "తద్యథాఇషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదహ్యేత ఏవం హాస్యసర్వే పాప్మానః ప్రదూయంతఉభౌ బ్రహ్మైవైష భవతీతి" ఇషీక యనగా తృణవిశేషమాగడ్డిసంబంధనుగు దూదివహ్నియందు వేల్చబడిన భస్మమయినట్లుబ్రహ్మజ్ఞానముగలవాని పాపపుణ్యములాజ్ఞానాగ్నియందు వేల్చబడునని శ్రుతి॥ "శ్రు॥ క్షీయంతేచాస్యకర్మాణి తస్మిన్దృష్టే పరావర ఇతి॥" యను విశేషశ్రుతిచేతనున్ను పుణ్యపాపములు బ్రహ్మజ్ఞానికినశించును అట్టిజ్ఞానమైన పిమ్మటనున్ను దైవాత్తుఅనగా నవశముగా పాపకర్మనుజేయబడినను నదివానికి స్పృశించదు ఇందుకుశ్రుతి॥ "పుష్కరపలాశమాపోనశ్లిష్యంతఏవమేవం దేహే పాపకర్మనశ్లిష్యత ఇతి॥" తామరాకున నీళ్ళంటనట్లు బ్రహ్మజ్ఞానిని పాపమంటదని దేహముకలుగజేసెడి పాపపుణ్యకర్మసంబంధముముఖ్యముగనశించునని ఈయర్థ

మేబ్రహ్మమీమాంసయందు॥ సూ॥ "తదధిగమఉత్తరపూర్వార్థయోరశ్లేషవినాశౌతద్వ్యపదేశాదితి॥" అట్టిబ్రహ్మప్రాప్తిగలుగుచునుండిననప్పటికి పూర్వమందగు కర్మమునశించు నుత్తరమందగుకర్మమంటకుండు ననియాయుపదేశమువలన నని వ్యాసమహర్షి మతము బ్రహ్మసాక్షాత్కారశూన్యుడు జన్మబంధమునొందును॥ ౭౪॥

మూ॥ అహింసయేంద్రియాసంగై ర్వైదికైశ్చైవ కర్మభిః। త
పసశ్చరణైశ్చోగ్రై స్సాధయంతీహ తత్పదం॥ ౭౫॥

నిషిద్ధమగు హింసనువర్జించుటచేతనున్ను ఇంద్రియజయముచేతనున్ను కామ్య కర్మములు బంధహేతువులుగావున నవిమాని నిత్యకర్మములుతప్పక చేయడము చేతనున్ను యథాసంభవముగనుపవాస కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములచేత నున్ను ఈలోకమందుండగానే బ్రహ్మత్వంతికలయలక్షణమగుపదమును బొందుదు రు పూర్వశ్లోకమందు బ్రహ్మదర్శనము మోక్షహేతువని జెప్పబడెను ఈశ్లోకము చేదానికిసహకారిగా కర్మమున్ను జెప్పబడెను॥ ౭౫॥

మూ॥ అస్థిస్థూణం స్నాయుయుతం మాంసశోణితలేపనం। చ
ర్మావనద్ధందుర్గంధి పూర్ణంమూత్ర పురీషయోః॥ ౭౬॥

ఇప్పుడు మోక్షమున కంతరంగియగు వైరాగ్యమునకు హేతువుగావున దేహ స్వరూపమును రెండుశ్లోకములచే వ్యక్తపరచుచున్నాడు ఎముకలు స్తంభాదిగృహ దారువులుగాగలదియు నరములనేత్రాళ్ళచేగట్టబడినట్టియు మాంసరక్తాదులచే పూయ్యబడినట్టియు చర్మముచే నాచ్ఛాదించబడునట్టియు మూత్రపురీషములచేపూ ర్ణమైనట్టియు గావుననే దుర్గంధముగలది॥ ౭౬

మూ॥ జరాశోక సమావిష్టం రోగాయతనమాతురం। రజస్వల
మనిత్యంచ భూతావాసమిమంత్యజేత్॥ ౭౭॥

ముదిమిచేతనున్ను ఉపతాపములనగా తత్కృత శోకాదులచే నాక్రాంతమ యినట్టియు నానావిధరోగములకు నాశ్రయమయినట్టియు క్షుత్పిపాసా శీతోష్ణా దులచే పీడితమగుచున్నట్టియు తరుచుగా రజోగుణయుక్తమగునట్టియు నశించేస్వ భావముగల గృహమనగా పృథివ్యాదిభూత నిర్మితమగుజీవునికనిలయముగానిరూ పించబడినదీదేహముదీనినివిడువవలెననగాతిరిగియీదేహమెట్లు రాకుండునట్టిబ్రహ్మ

దగనవి శాస్త్రముచే సంక్రమించును ఇచ్చట మేధాతిథి గోవిందరాజులు ఎవనిచే తనయి● తనకు ప్రియములు జేయబడుచుండిన నందుకు కారణము తనసుకృతమే యని ధ్యానాభాసముచే దెలిసికొని యటులే తనకప్రియము లెవనిచేనయిన జేయబడిన నందుకు తనపూర్వజన్మదుష్కృతమే కారణమని దెలిసికొని తనరాగద్వేషాఖ్యులగు పురుషులనువిడిచి నిత్యమగు బ్రహ్మమునొందుననివ్రాసిరి ఇదివ్యాసమతము నకువిరుద్ధమని కుల్లూకభట్టు మొదటవ్రాసినప్రకారముగవ్రాసెను॥ ౭౯॥

మూ॥ యదాభావేన భవతి సర్వభావేష నిస్పృహః। తదాసుఖ
మవాప్నోతి ప్రేత్యచేహచ శాశ్వతం॥ ౮౦॥

ఎప్పుడు తత్వముచే విషయములయందు దోషతాత్పర్యముచే సర్వవిషయములయందున్ను నిస్పృహుడగునో యప్పుడిహలోకమందు సంతోషజన్య సుఖమునున్ను పరలోకమందు శాశ్వతమగు మోక్షానందమునన్ను బొందును॥ ౮౦॥

మూ॥ అనేన విధినా సర్వాం స్త్యక్త్వా సంగాన్ శనైశ్శనైః।స
ర్వద్వంద్వ వినిర్ముక్తో బ్రహ్మణ్యేవావతిష్ఠతే॥ ౮౧॥

దారాపుత్రాదులయందు మమకారరూపములగు సకలసంగములనున్ను క్రమముగావిడిచి మానావమానాది ద్వంద్వములవలన విముక్తుడై పూర్వోక్తమగుజ్ఞానకర్మానుష్ఠానముచే బ్రహ్మమందు నాత్యంతికమగు లయమునొందును॥ ౮౧॥

మూ॥ ధ్యానికం సర్వమేవైతద్యదేత దభిశబ్దితం। నహ్యనధ్యా
త్మ విత్కశ్చి త్క్రియాఫల ముపాశ్నుతే॥ ౮౨॥

యదేతదనుటచే సన్నిహితమగు పూర్వశ్లోకోక్తము పరామర్శించబడుచున్నది యేదైతే యీపుత్రాది మమత్వత్యాగమున్ను మానావమానాదిహానియు బ్రహ్మమందేనిష్ఠయు నిదియంతయు ధ్యానికము అనగా తననుపరమాత్మనుగా ధ్యానముగుచుండనగుచున్నది ఎప్పుడుతనను పరమాత్మను గా దెలుసుకొనుచున్నాడో యప్పుడు సర్వసత్వముకంటెనున్ను విశేషించడు అటువంటిజ్ఞానమువలన నెచ్చటనయిన మమత్వమైనను మానావమానములయినను బుట్టునాయనగా బుట్టదనుట మరిన్ని బ్రహ్మాత్మకమున్ను నగుచున్నది ధ్యానికవిశేషమువలన ధ్యేయవిశేషములయొక్క లాభమగుచుండగా పరమాత్మ ధ్యానముయొక్క ప్రయోజనమును చెప్పుచు

వ్వాడు ఏవికారశూన్యమువలన నాత్మయనగా జీవునియుద్దేశించి యేదిచెప్పబడెనో వానియొక్క యాపరమాత్మత్వము నెవ్వడెఱుంగడో యనగా ధ్యానముజేయడో వాడు ప్రకృతమగు ధ్యానక్రియాఫలమైనట్టి మమస్వత్యాగమును మానావమానాదిహానిని మోక్షమునున్ను బొందడు॥ ౮౨॥

మూ॥ అధియజ్ఞం బ్రహ్మజపే దాధిదైవిక మేవచ। ఆధ్యాత్మికం
చ సతతం వేదాంతాభిహితంచ యత్॥ ౮౩॥

బ్రహ్మధ్యాన స్వరూపోపాసనము మందుగా జెప్పబడె నిప్పుడు దానికంగము గా వేదజపమును జెప్పుచున్నాడు ఇందుకుశ్రుతి "తమేతం వేదాంతవచనేనవివిదిషంతి విద్యాంగతయా వేదజపముపదిశతి" ఆపరమాత్మనియుపనిషద్వచనములచే తెలియ నిచ్ఛయించుచున్నారు జ్ఞానమునకంగముగా వేదజపమునుపదేశించుచున్నారని శ్రుతి యజ్ఞమునధికరించి ప్రవృత్తమగునది యాధిదైవికము ఆత్మయనగా జీవుని యధికరించి ప్రవృత్తమగునది యాధ్యాత్మికము అట్లువేదాంతములందు జెప్పబడెను॥ "శ్రు॥ సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ॥" త్రికాలాబాధ్యమున్స్వయంప్రకాశముదేశకాలానవచ్ఛిన్నము ఇట్టిలక్షణములుగలదిబ్రహ్మము తైత్తిరీయోపనిషత్తు ఇత్యాది బ్రహ్మప్రతిపాదకములగు వేదమునెల్ల నెప్పుడును జపించవలెను॥ ౮౩॥

మూ॥ ఇదంశరణ మజ్ఞానా మిదమేవ విజానతాం। ఇదమన్విచ్ఛ
తాం స్వర్గ మిదమానంత్య మిచ్ఛతాం॥ ౮౪॥

ఈవేదాఖ్యమగు బ్రహ్మము దానియర్థముతెలుగని వారికిని యెఱిగినవారికినిస్వర్గాపవర్గములనుగోరెడువారికిని శరణమగుచున్నది పాఠమాత్రము చేతనున్ను పాపక్షయకరము అర్థజ్ఞానముచేతదుపాయోపదేశము వలన స్వర్గాపవర్గప్రాప్తి హేతువుగావునని దేశరణము॥ ౮౪॥

మూ॥ అనేనక్రమయోగేన పరివ్రజతియోద్విజః। సవిధూయేహ
పాప్మానం పరంబ్రహ్మాధిగచ్ఛతి॥ ౮౫॥

ఈచెప్పబడినయనుష్ఠానక్రమముచే నెవడు సన్యసించునో యతండీలోకమందే పాపమునువిడిచి పరబ్రహ్మమందుగలయును బ్రహ్మనాత్మైకతాజ్ఞానముచేను పాధికకృతనాశనమయినపిమ్మట బ్రహ్మైక్యము నొందును॥ ౮౫॥

మూ॥ ఏషధర్మోఽనుశిష్టోవో యతీనాం నియతాత్మనాం। వేదసన్న్యాసికానాంతు కర్మయోగం నిబోధత॥ ౮౬॥

నియతాత్ములగుయతులకు కుటీచర బహూదక హంస పరమహంసలనెడు నలుగురికిన్ని సాధారణధర్మము చెప్పబడెను ఇప్పుడు కుటీచరాదివిశేష యతిధర్మములన్నవగా దవిహోత్రాదికర్మయోగుల యొక్కయు నసాధారణవక్ష్యమాణములగు "పుత్రైశ్వర్యేసుఖంవసే" దనుప్రకారముగల కర్మసంబంధముగలధర్మము ను వినుండు భారతమందు సన్న్యాసులు నాలుగువిధములవారుగా జెప్పబడిరి॥ "శ్లో॥ చతుర్ధాభిక్షవస్తుస్యుః కుటీచర బహూదకౌ। హంసఃపరమహంసశ్చ యోయఃపశ్చాత్సఉత్తమఇతి॥" కుటీచరబహూదకహంసపరమహంసలని భిక్షులు నాలుగువిధములిందులోను త్తరోత్తరుడు త్తముడని చెప్పబడెను ఇది కుటీచరునకు పుత్రభిక్షాచరణరూపమగు ధర్మోపదేశము గోవిందరాజు వేదోక్తాగ్నిహోత్రాదికర్మత్యాగియగు గృహస్థవిశేషుని జ్ఞానమాత్రవైదికకర్మునిగా వేదసన్న్యాసిని జెప్పెను॥ మేధాతిథి నిరాశ్రముడగువాని వేదసన్న్యాసినిగా జెప్పెను ఆహితాగ్నియగు గృహస్థుడంత్యేష్టి జేసి యగ్నుల నాత్మారోపణమొనర్చకున్న నగ్నులకు త్యాగమగునని గోవిందరాజువ్యాఖ్యానము అనాశ్రమియైతే మనువుచే చెప్పబడిన చాతురాశ్రమ్యమెట్లగునని మేధాతిథివ్యాఖ్యానము ఖండించి కుల్లూకభట్టువ్రాసెను॥ ౮౬

మూ॥ బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థో యతిస్తథా। ఏతేగృహస్థప్రభవా శ్చత్వారః పృథగాశ్రమాః॥ ౮౭॥

ఇప్పుడు వేదసన్న్యాసికునకు ప్రజ్ఞాతకర్మత్యాగానంతరమం దైదవయాశ్రమముగలవాడో నిరాశ్రముడో చెప్పవలగయున్నది నాలుగే ఆశ్రమములని చెప్పబడియున్నది దానినిచూపించుటకు చెప్పబడిన యాశ్రమములననువదించుచున్నాడు బ్రహ్మచర్యాద్యాశ్రమములునాలుగు వేరువేరుగా చెప్పబడినవిగాని యీనాలుగున్ను గృహస్థాశ్రమజన్యములచే యగుచున్నవి॥ ౮౭॥

మూ॥ సర్వేపి క్రమశస్త్వేతే యథాశాస్త్రం నిషేవితాః। యథోక్తకారిణంవిప్రం నయంతి పరమాంగతిం॥ ౮౮॥

ఈచెప్పబడినయాశ్రమములు నాలుగున్ను క్రమముగా శాస్త్రరీతితప్పకసేవి

ఛబడిన వేని యపిశబ్దముచే మూడైన రెండైననొకటియైన యథోక్తముగ నడిచిన వాని పరమగతినొందించును॥ ౮౮॥

మూ॥ సర్వేషామపి చైతేషాం వేదస్మృతి విధానతః । గృహస్థ
ఉచ్యతే శ్రేష్ఠ స్సత్రీనేతాన్ బిభర్తిహి॥ ౮౯॥

ప్రకృత వేదసన్యాసికునకు గృహమందె ప్రవృత్తి ఐశ్వర్యమందువాసనను జెప్పగలడు అందుకు గృహస్థోత్కర్షమును జెప్పుచున్నాడు. ఈ బ్రహ్మచర్యాద్యాశ్రమములలో గృహస్థుడాశ్రయమగుటచేతనున్నతరుచు గానగ్నిహోత్రాదివిధానము వలననున్ను గృహస్థుడు శ్రేష్ఠుడని మన్వాదులచే జెప్పబడెను బ్రహ్మచారి వానప్రస్థయతులనుభిక్షాదానముచే పోషించడముచేతనున్ను శ్రేష్ఠుడు॥ "శ్లో॥ యస్మాత్త్రయో ప్యాశ్రమిణో జ్ఞానేనాన్నేన చాన్వహమితి" యనే హేతువుచే మూడాశ్రమములవారికిన్ని నిత్యమును జ్ఞానమును నన్నమును నొసగునో యందుచే గృహస్థుడని చెప్పబడెను॥

మూ॥ యథానదీ నదాస్సర్వే సాగరే యాంతిసంస్థితిం । తథై
వాశ్రమిణస్సర్వే గృహస్థేయాంతి సంస్థితిం॥ ౯౦॥

ఏలాగు గంగాశోణాదినదీనదములన్నియు సముద్రమందు సంస్థితిని బొందునో ఆలాగునే గృహస్థవ్యతిరిక్తులగు మూడాశ్రమములవారున్ను గృహస్థాధీనజీవనులు గావున నతని కడను సంస్థితిని బొందుచుందురు॥ ౯౦॥

మూ॥ చతుర్భిరపి చైవైతై ర్నిత్యమాశ్రమిభి ర్ద్విజైః । దశలక్ష
ణకోధర్మ స్సేవితవ్యః ప్రయత్నతః॥ ౯౧॥

ఈ బ్రహ్మచర్యాదికాశ్రమములవారు నలుగురు ద్విజులున్ను వక్ష్యమాణమగు పదిలక్షణములుగల ధర్మము ప్రయత్నముచే సేవించవలెను॥ ౯౧॥

మూ॥ ధృతిఃక్షమాదమోఽస్తేయం శౌచమింద్రియ నిగ్రహః । ధీ
ర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణం॥ ౯౨॥

ధృతియనగా సంతోషము క్షమయనగా నపకారమొనర్చిన వానికి ప్రత్యపకారము చేయకపోవడము దమమనగా వికారహేతు సన్నిధినిన్ని నిర్వికారముగ నుండుట "మనసోదమనం దమ ఇతి" మనస్సును దపింపజేయుట దమమనిసనందన వచ

నము వలన శీతాతపాదిద్వంద్వములను సహించడము దమమని గోవిందరాజు అ
స్తేయమనగా నన్యాయముచే నొకని సొమ్మునపహరించకుండుట శౌచమనగా మృ
జ్జలాదులచే యథాశాస్త్రముగ గడుగుకొనుట ఇంద్రియనిగ్రహమనగా విషయ
ముల వలన చక్షురాదులను మళ్లించుట ధీయనగా శాస్త్రాది తత్వజ్ఞానము విద్యయ
నగ నాత్మజ్ఞానము సత్యమనగా యథార్థముగ జెప్పుట అక్రోధమనగా కోప
మునకు హేతువున్నప్పటికిని క్రోధమును బొందకుండుట యీపదిలక్షణములు కల
దిధర్మస్వరూపము॥ ౯౨॥

మూ॥ దశలక్షణాని ధర్మస్య యేవిప్రాః సమధీయతే । అధీత్య
చానువర్తంతే తేయాంతి పరమాంగతిం॥ ౯౩॥

ఏవిప్రులు ధర్మముయొక్క దశలక్షములను బఠించి తదనుష్ఠానమొనర్తురో
వారుబ్రహ్మజ్ఞాన సముత్కర్షమువలన పరమగతిని పొందుదురు॥ ౯౩॥

మూ॥ దశలక్షణకంధర్మ మనుతిష్ఠన్ సమాహితః । వేదాంతం
విధివచ్ఛ్రుత్వా సన్న్యసే దనృణోద్విజః॥ ౯౪॥

ద్విజుడు చెప్పబడిన దశలక్షణకమైన ధర్మమును నియతచిత్తుడై చేయుచును
ఉపనిషదాద్యర్థమును గృహస్థాశ్రమమందే గురుముఖముగా నభ్యసించి ఋణత్ర
యవిముక్తుడై సన్న్యసించవలెను॥ ౯౪॥

మూ॥ సన్న్యస్య సర్వకర్మాణి కర్మదోషా నపానుదన్ । నియ
తో వేదమభ్యస్య పుత్రైశ్వర్యే సుఖంవసేత్॥ ౯౫॥

సమస్తమైన యగ్నిహోత్రాదిగృహస్థధర్మములను విడిచి యజ్ఞానముచే జ
రిగిన జంతువధాదిజనితములగు పాపములను ప్రాణాయామాదికముచే పోగొట్టు
చు జితేంద్రియుడై ఉపనిషత్తులను గ్రంథము బఠించుచు నర్థము నెరుంగుచు పు
త్రగృహమందే పుత్రోపకల్పితభోజనాచ్ఛాదనములు గలవాడగుచు వృత్తిచింతా
రహితుడై సుఖముగ నుండవలెను కుటీచరునకిదే యసాధారణధర్మము చెప్పబ
డెను ఇదే చెప్పుటకు "వేదసన్న్యాసికానాంతు" యని మున్ను జెప్పబడెను॥ ౯౫॥

మూ॥ ఏవం సన్న్యస్య కర్మాణి స్వకార్యపరమోఽస్పృహః । స

న్యాసే నాపహత్యేనః ప్రాప్నోతి పరమాం గతిం॥ ౯౬॥

ఈ చెప్పబడిన ప్రకారముగా గృహస్థధర్మములను విడిచి ఆత్మసాక్షాత్కారదస్వరూపస్వకార్యమందు జాగరూకుడై స్వర్గాదికనుగూడ బంధహేతువుగా భావించి నిస్పృహుడై సన్యాసముచే పాపములను నశింపజేసి బ్రహ్మసాక్షాత్కారమంచే ముక్తినిపొందుచున్నాడు॥ ౯౬॥

మూ॥ ఏషవోఽభిహితో ధర్మో బ్రాహ్మణస్య చతుర్విధః। పుణ్యో
క్షయఫలః ప్రేత్య రాజాం ధర్మం నిబోధత॥ ౯౭॥

ఇతిమానవే ధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాం సంహితాయాం
షష్ఠోఽధ్యాయః.

ఋషులనుగూర్చి సంబోధనమొనర్చి చెప్పబడుచున్నది మీకీబ్రాహ్మణసంబంధమగు కర్మకలాపరూపమైన చతుర్విధమగు ధర్మమనగా బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థాదిరూపమగునది పరమంబక్షయఫలప్రదము చెప్పబడెను ఇప్పుడు రాజసంబంధమగు ధర్మమును వినుండు ఈశ్లోకమందు బ్రాహ్మణునకు నాలుగాశ్రమములధర్మములనుపదేశించుటవలన "బ్రాహ్మణః ప్రవ్రజేత్" బ్రాహ్మణుడు సన్యసించవలసినదని ముందుగా చెప్పడమువలననున్ను ఇటుపైని రాజధర్మములు వక్ష్యమాణములగుచున్నవని తెలియుటకై రాజధర్మములను వినుండనిచెప్పడము॥ ౯౭॥

ఇది శ్రీమన్మహామహీంబిడౌజ శ్రీమదానందగజపతిరాజ మహారాజ
దయాపాత్రభారద్వాజ సగోత్రపవిత్ర సుకవిజనవిధేయ
మండకామేశ్వరనామధేయకృతమన్వర్థదీపికాఖ్య
యగు వ్యాఖ్యయందు షష్ఠాధ్యాయము.
శ్రీపరదేవతామణిపాదుకార్పణమస్తు.



శుభమస్తు.

# ఆంధ్రమన్వర్థదీపికాసహిత

# మనుస్మృతి*సప్తమాధ్యాయః ప్రారంభము.

మూ॥ రాజధర్మాన్ ప్రవక్ష్యామి యథావృత్తో భవేన్నరః। సంభ
వశ్చ యథాతస్య సిద్ధిశ్చ పరమాయథా॥ ౧॥

పూర్వమందారధ్యాయములచే బ్రాహ్మణునియొక్క ముఖ్యధర్మములను జెప్పి రాజధర్మములను అనగా రాజున కసాధారణధర్మములను జెప్పుచున్నాడు ఇచట నాశ్రమధర్మములను జెప్పి తదధికారియగు రాజుయొక్క ధర్మములను జెప్పుచున్నాడని కొందరవతారికను లిఖించిరి రాజధర్మాన్ యిచట రాజశబ్దముక్షత్రియమాత్రపరముగాదు మరియు ప్రజాపాలనకర్తయగు పురుషుని జెప్పును అట్టి రాజుయొక్క ధర్మములను అనగా దృష్టాదృష్టరూపములగు షాడ్గుణ్యాగ్నిహోత్రాదిరూపములగు ధర్మములను జెప్పగలను ఇంకరాజెట్టివ్యాపారము గలవాడై యుండవలయునో యట్టియనుష్ఠేయములను సృష్ట్యాదియందగు రాజుయొక్కయుత్పత్తిప్రకారమును అదృష్టాదృష్టములయొక్క యుత్కృష్టమగు సిద్ధియును జెప్పెదనని తాత్పర్యము॥ ౧॥

మూ॥ బ్రాహ్మం ప్రాప్తేనసంస్కారం క్షత్రియేణ యథావిధి। స
ర్వస్యాస్యయథాన్యాయం కర్తవ్యం పరిరక్షణం॥ ౨॥

శాస్త్రోక్తప్రకారముగ వేదాధ్యయనాద్యుపయోగమగు సంస్కారమును అనగా ఉపనయనాదిసంస్కారమనుట అట్టిసంస్కారసంపన్నుడగు క్షత్రియునిచే నీజగద్రక్షణము న్యాయము తప్పకుండ జేయదగును ఇచ్చట క్షత్రియపదముత్తమక్షత్రియునికే రాజ్యార్హతను దెలియజేయుచున్నది ఇతరులకు గౌణమని యెరుంగునది యేమనిన బ్రాహ్మణునకాపద్ధర్మములయందు క్షత్రియధర్మమును జెప్పుటను శూద్రధర్మమును నిషేధించుటవలన నుత్తమక్షత్రియవాచకమనుట న్యాయమనగా ధ

ర్మశాస్త్రావిరుద్ధమగు నీతిశాస్త్రము॥ ౨

మూ॥ అరాజకేహి లోకేస్మిన్ సర్వతో విద్రుతే భయాత్। రక్షా
ర్థమస్య సర్వస్య రాజాన మసృజత్ప్రభుః॥ ౩॥

ఈలోకము రాజులేకపోవుటచే సమస్తమైన భయమువలననగా దైవికమానుషాత్మకమగు భయమువలన ననుట అతిభయమువలన పీడితమైయుండగా చరాచరాత్మకమగు లోకముయొక్క రక్షణార్థమై సమర్థుడగు ప్రజాపతి రాజును సృజించెను గాన నీరాజు లోకమును రక్షింపవలయుననుట॥ ౩॥

మూ॥ ఇంద్రానిలయమార్కాణా మగ్నేశ్చవరుణస్యచ। చంద్రవి
త్తేశయోశ్చైవ మాత్రానిర్హృత్య శాశ్వతీః॥ ౪॥

కిందటిశ్లోకముచె రాజును సృజించెనని జెప్పి ఎట్లుసృజించెనని రెండుశ్లోకములచే జెప్పుచున్నాడు ఇంద్రునియొక్కయు చంద్రునియొక్కయు వాయువుయొక్కయు యమునియొక్కయు సూర్యునియొక్కయు అగ్నియొక్కయు వరుణునియొక్కయు కుబేరునియొక్కయు సారభూతములగు నంశములను దీసి రాజును సృజించెనని యన్వయము ఇచ్చట నంశములనగా నింద్రుని ఐశ్వర్యాంశమును వాయువు బలాంశమును ఇటులనే ఆయాదేవతలయొక్క స్వాభావికాంశలనని నందనుడను వ్యాఖ్యాతవ్రాసెను॥ ౪॥

మూ॥ యస్మాదేషాం సురేంద్రాణాం మాత్రాభ్యోనిర్మితోనృపః।
తస్మాదభిభవత్యేష సర్వభూతాని తేజసా॥ ౫॥

ఏహేతువచే నింద్రాది సురశ్రేష్ఠులయంశములచే రాజుసృజించబడెనో యాహేతువను ఈరాజు సమస్తమయిన ప్రాణులను బలముచే తిరస్కరించుచున్నాడు॥

మూ॥ తపత్యాదిత్యవచ్చైష చక్షూంషిచ మనాంసిచ। నచైనం
భువిశక్నోతి కశ్చిదప్యభివీక్షితుం॥ ౬॥

ఈరాజును సూర్యునివలె చక్షుస్సులను మనస్సులను చూచువారలకు తపింపజేయుచున్నాడుగనుక నిందువలన నెవ్వడైనను రాజును చూచుటకు సమర్థుడుకాడు॥

మూ॥ సోగ్నిర్భవతి వాయుశ్చ సోర్కః సోమస్సధర్మరాట్। స
కుబేరస్సవరుణస్సమహేంద్రః ప్రభావతః॥ ౭॥

ఆరాజు తనప్రభావమువలన నగ్నియై వాయువై సూర్యుడై యముడై చంద్రుడై కుబేరుడై వరుణుడైయగుచున్నాడు- అనగా నగ్న్యాది పూర్వోక్తదేవాంశసంభవుడగుటను తత్తత్కర్మకారియగుటచే శక్త్యాదులచే నగ్న్యాది స్వరూపుడగుచున్నాడనుట॥ ౭॥

మూ॥ బాలోపి నావమంతవ్యో మనుష్యఇతి భూమిపః। మహతీ
దేవతాహ్యేషా నరరూపేణ తిష్ఠతి॥ ౮॥

పరిపాలకుడగురాజు చిన్నవాడైనను మనుష్యుడనుబుద్ధిచే దిరస్కరించదగదు. ఏపనిన ఒకానొకగొప్పదేవత మానుషరూపమున నీరాజై యవతరించి యుండుటవలన నతనిదిరస్కరించుట ప్రత్యవాయజనకము॥ ౮॥

మూ॥ ఏకమేవ దహత్యగ్ని నరం దురుప సర్పిణం।కులం దహతి
రాజాగ్నిః సపశు ద్రవ్యసంచయం॥ ౯॥

రాజునుతిరస్కరించిన దృష్టదోషమునుగలదని చెప్పుచున్నాడు దుష్టుడయినను నుపసర్పణముగలనరుని అనగా హస్తాదులనుముట్టిననరుని నగ్నిస్పృశించు నరునిమాత్రిమె దహించును రాజను నగ్నియయితే అట్టిదుష్టమయిన యుపసర్పణగలపురుషుని పుత్రపౌత్రపశ్వాదులతోదహించును గనుక రాజు తిరస్కారార్హుడుగాడనుట॥ ౯॥

మూ॥ కార్యంసోవేక్ష్య శక్తించ దేశకాలౌచ తత్త్వతః। కురుతే ధ
ర్మసిద్ధ్యర్థం విశ్వరూపం పునఃపునః॥ ౧౦॥

ఆరాజు కార్యమునున్ను తనయొక్కబలమునున్ను దేశకాలములనున్ను యథార్థముగా తెలుసుకొని కార్యసిద్ధికొరకు మాటిమాటికి ననేకరూపములను జేయుచున్నాడు అనగా రాజుకార్యగౌరవమునుబట్టి దూరసామీప్యాదిరూపమగు దేశమును సుభిక్షదుర్భిక్షాదిరూపమగు కాలమునననుసరించి తనకార్యమెటుల సిద్ధించునో యటుల శత్రుమిత్రోదాసీనరూపములనుబొందుచున్నాడు గాన యథార్థముగు శత్రుమిత్రాదిభావములేకపోవుటను రాజవల్లభుడని రాజును తిరస్కరించకూడదు॥ ౧౦

మూ॥ యస్య ప్రసాదే పద్మా శ్రీ ర్విజయశ్చ పరాక్రమే। మృత్యుశ్చ
వసతి క్రోధే సర్వతేజో మయో హి సః॥ ౧౧॥

ఎవనియొక్క యనుగ్రహమందు లక్ష్మియు పరాక్రమమందు విజయమును క్రోధమందు మృత్యువయును నివసించియుండును అట్టిరాజు సమస్తమయినదేవతలయొక్క తేజోమయుడౌటను అనగా రాజు ప్రసన్నుడైన లక్ష్మియును తనకు శత్రుజయమున్ను సిద్ధించును రాజునకు కోపమును పుట్టించిన మృత్యువగును గాన నతనికి కోపమును పుట్టించకూడదు- ఇచట పద్మా-శ్రీ-యని లక్ష్మిపర్యాయపదముల ప్రయోగించుటను అతిశయార్థకమని కుల్లూకభట్టువ్రాసెను- "సర్వతేజోమయః" యను నపుడు ఇంద్రాగ్ని యములని కొందరు సూర్యాగ్నిసోములని కొందరు వ్రాసిరి॥

మూ॥ తం యస్తు ద్వేష్టి సంమోహాత్స వినశ్యత్యసంశయం । తస్య
హ్యాశు వినాశాయ రాజా ప్రకురుతే మనః॥ ౧౨॥

ఎవడైన నజ్ఞానము వలన ద్వేషించునో యతడు నిస్సంశయముగ నశించును- ఏమనగా నారాజు వానివినాశనము కొరకు ప్రయత్నించును గాన రాజుతో ద్వేషించకూడదనుట॥ ౧౨॥

మూ॥ తస్మాద్ధర్మం యమిష్టేషు సంవ్యవస్యే న్నరాధిపః। అ
నిష్టం చాప్యనిష్టేషు తం ధర్మం నవిచాలయేత్॥ ౧౩॥

రాజు సర్వతేజోమయుడౌట వలననిష్టులయందిష్టమైనట్టియు అనిష్టులయందనిష్టమైనట్టియునే ధర్మమును నిశ్చయించునో యాధర్మమును జనులచే నతిక్రమించదగదనుట అనగా ధర్మశాస్త్రవిరుద్ధమని తెలియవలెను॥ ౧౩॥

మూ॥ తస్యార్థే సర్వభూతానాం గోప్తారం ధర్మమాత్మజం।
బ్రహ్మతేజో మయం దండ మసృజ త్పూర్వ మీశ్వరః॥ ౧౪॥

ఆరాజు కొరకు బ్రహ్మదేవుడు సకలభూతములకు రక్షకమైనట్టియు తనవుసంతానమైనట్టియు ధర్మాంశోద్భవమైనట్టియు గనుకనే బ్రహ్మతేజోమయమైనట్టియు దండమును అనగా శిక్షయనుట మున్ను సృజించెను అనగా బ్రహ్మదేవుడు పూర్వకాలమందు రక్షాదివ్యాపారము నడుపుటకై ధర్మస్వరూపమగు దండ

మనః సృజించిచెన్ని భావము॥ ౧౪॥

మూ॥ తస్య సర్వాణి భూతాని స్థావరాణి చరాణిచ । భయా ద్భోగాయ కల్పంతే స్వధర్మాన్న చలంతిచ॥ ౧౫॥

ఆదండనముయొక్క భయము వలన స్థావరజంగమాత్మకములగు భూతములు పరస్పరబాధలం దొలంగుటచే భోగములు గలిగియుండును ఇంక స్వస్వధర్మములనుకూడ విడువకయుండును- ఇక్కడ మేధాతిథి యీభూతములు ఛాయాదిప్రదానమువలన రాజభోగమున కగుననివ్రాసెను॥ ౧౫॥

మూ॥ తం దేశకాలౌ శక్తించ విద్యాంచావేక్ష్య తత్వతః। యథార్హత స్సంప్రణయే న్నరేష్వన్యాయవర్తిషు॥ ౧౬॥

అట్టి దండమును- అపరాధులయందు దేశకాలములను శక్తిని విద్యను పరిశీలనజేసి యథాయోగ్యముగా ప్రయోగించవలయును॥ ౧౬॥

మూ॥ సరాజా పురుషోదండ స్సనేతా శాసితాచసః । చతుర్ణా మాశ్రమాణాంచ ధర్మస్య ప్రతిభూస్స్మృతః॥ ౧౭॥

అందరు వశ్యులై యుండుటను ప్రజలు స్త్రీలవలె నస్వతంత్రులై దీనిచే చేయబడియుండుటను ఆదండము రాజు ఇంక పురుషుడు- అదియె యీసమస్తమునకు రక్షకము యింకశిక్షకము మరియు నాశ్రమచతుష్టయ ధర్మమునకు జామీనుదారుడై మునులచె జెప్పబడెను॥ ౧౭॥

మూ॥ దండశ్శాస్తి ప్రజా స్సర్వాః దండ ఏవాభిరక్షతి। దండస్సుప్తేషు జాగర్తి దండం ధర్మం విదుర్బుధాః॥ ౧౮॥

దండము సమస్తమైన ప్రజలను శిక్షించు నటులనె రక్షించు నిద్రావస్థయందును జాగ్రతజేయును గనుక దండమునే ధర్మముగా పెద్దలు జెప్పుదురు అనగా ప్రజలను ఆజ్ఞాపించుటచే రక్షించుటచేతను మీదజెప్పినప్రకారము దండమే రాజశాసకమనుమాటనిజమనుట ఇకనిద్రాదులయందు చోరాదిబాధలు లేకుండునట్టుల జేయునుగాన ధర్మమె దండమనుట॥ ౧౮॥

మూ॥ సమీక్ష్య సధృత స్సమ్య క్సర్వా రంజయతి ప్రజాః । అస

మీక్ష్య ప్రణీతస్తు వినాశయతి సర్వతః॥ ౧౯॥

అట్టిదండము శాస్త్రోక్తప్రకారముగ నపరాధము ననుసరించి దేహధనాదుల యందు ప్రయోగించబడినదై సమస్తమైన ప్రజలను అనురాగము కలవారినిగ జేయును ఆలాగు గాకవిచారించకలోభాదులచే ప్రయోగించబడిన అనగా బాహ్యములగు ధనపుత్రాదులను నశింపజేయునదైతె సర్వమును నశింపజేయుననుట॥౧౯॥

మూ॥ యదిన ప్రణయేద్రాజా దండం దండ్యేష్వతంద్రితః। శూలె మత్స్యానివాపక్ష్యన్ దుర్బలాన్ బలవత్తరాః॥ ౨౦॥

రాజు అలసుడై దండార్హులయందు దండమును ప్రయోగించనియెడల శూలమునుగుచ్చి చేపలనుకాల్చినట్టు బలహీనులనుబలవంతులుపీడింతురు ఇకరండజలమందు మత్స్యములనువలె దుర్బలులను బలవంతులు భక్షింతురని మాత్స్యన్యాయమని మేధాతిథిగోవిందరాజులు వ్రాసిరిఅప్పుడు "జలెమత్స్యా" నని పాఠాంతరమని తెలియవలెను॥ ౨౦॥

మూ॥ అద్యాత్కాకః పురోడాశం శ్వాచలిహ్యాద్ధవిస్తథా।స్వామ్యంచ నస్యాత్కస్మింశ్చిత్ప్రవర్తేతాధరోత్తరం॥౨౧

రాజు క్రమముగాదండమును ప్రయోగించనియెడల హవిస్సుకర్హముగాని కాకము పురోడాశమునుభక్షించును ఇటులనేవాయసాది హవిస్సును కుక్కభక్షించును బ్రాహ్మణాదులకన్న శూద్రులకుప్రాబల్యమగును అనగావారెపరిధానులగుదురనుట॥ ౨౧॥

మూ॥ సర్వోదండజితోలోకో దుర్లభోహి శుచిర్నరః। దండస్యహి భయాత్సర్వం జగద్భోగాయ కల్పతె॥ ౨౨॥

సమస్తమైనలోకమున్ను దండభయమువలననే నియమముగసంచరించును గాని స్వభావముచేనియమముగల మనుష్యుడు దుర్లభుడు గాన దండభయమువల్లనే సమస్తమైనలోకమున్ను ఆవశ్యకములగుభోజనాదిరూపములగు భోగముల కొరకగును॥ ౨౨॥

మూ॥ దేవదానవ గంధర్వా రక్షాంసిపతగోరగాః। తేపి భో

గాయ కల్పంతె దండేనైవ నిపీడితాః॥ ౨౩॥

దండమునకు భోగసంపాదకత్వమును దృఢపరచుచున్నాడు దేవత లనగా నింద్రాదులు దానవులు గంధర్వులు రాక్షసులు పక్షులు సర్పములున్ను యీదండభయమువలననె భోగముకొరకగుచున్నవి అనగా వర్షాదికములచే కాలమందుపభోగమును కల్పింతురనుట॥ ౨౩॥

మూ॥ దుష్యేయుః సర్వవర్ణాశ్చ భిద్యేరన్ సర్వసేతవః। స
ర్వలోకప్రకోపశ్చ భవేద్దండస్య విభ్రమాత్॥ ౨౪॥

ఇంకనీదండము చేయకపోయినను అనుచితముగ జేసినను సమస్తమగు బ్రాహ్మణాదివర్ణములు పరస్పరస్త్రీగమననుచే సంకీర్ణమగును సమస్తములగు శాస్త్రములయొక్క నియమములున్ను అనగా ధర్మార్థకామమోక్షములున్ను నశించును చౌర్యాదులచే జగత్సంక్షోభమునగును గనుక దండము నేమరకుండ నుండవలయుననుట॥ ౨౪॥

మూ॥ యత్ర శ్యామో లోహితాక్షో దండ శ్చరతి పాపహా। ప్ర
జాస్తత్ర న ముహ్యంతి నేతా చే త్సాధు పశ్యతి॥ ౨౫॥

ఎచ్చటనుశాస్త్రోక్తప్రకారమగు శ్యామరూపమును యెఱ్ఱని నేత్రములునుగల యధిష్ఠానదేవతగలదండను సమస్తములగుపాపములను హరించునదియై చరించునో రాజున్ను యుక్తాయుక్తములను తెలిసినవాడగునో యచటప్రజలు మోహము గలవారుకారు అనగా నెమ్మదిగనుందురనుట॥ ౨౫॥

మూ॥ తస్యాహుః సంప్రణేతారం రాజానం సత్యవాదినం। సమీ
క్ష్యకారిణం ప్రాజ్ఞం ధర్మకామార్థకోవిదం॥ ౨౬॥

అట్టిదండముప్రయోగించురాజును సత్యవాదినిగాను తత్త్వాతత్త్వములను గ్రహించి పనిజేయువానిగాను ప్రాజ్ఞునిగాను ధర్మార్థకామములను తెలిసిన వానిగాను మన్వాదులు చెప్పుదురని యర్థము॥ ౨౬॥

మూ॥ తం రాజా ప్రణయన్ సమ్యక్ త్రివర్గేణాభివర్ధతే। కా
మాత్మా విషమః క్షుద్రో దండేనైవ నిహన్యతే॥ ౨౭॥

అట్టిదండనును తెస్సగ ప్రయోగించు రాజు ధర్మార్థకామములచే వృద్ధిబొందును ఆలాగుగాక విషయాసక్తచిత్తుడై క్రోధస్వభావుడై యేదైననొకమిషను వెతుకువాడైయుండినయెడల ఆదండముచేతనే యనగా మంత్రులకోపముచేగాని యుద్ధముచేగాని నశింపజేయబడును॥ ౨౭॥

మూ॥ దండోహి సుమహత్తేజో దుర్ధరశ్చాకృతాత్మభిః । ధ
ర్మాద్విచలితం హంతి నృపమేవ సబాంధవం॥ ౨౮॥

అట్టిదండము ప్రకృష్టమగు తేజోరూపముగాన శాస్త్రాదులచే నశిక్షితులగువారికి ప్రయోగించనలవడనిదైనది గావున నధర్మపరుడగు రాజునుబంధుసహితముగనశింపజేయును గాననవహితుడై దండమును ప్రయోగించవలెనను॥ ౨౮॥

మూ॥ తతోదుర్గంచ రాష్ట్రంచ లోకంచ సచరాచరం। అంత
రిక్షగతాంశ్చైవ మునీన్దేవాంశ్చ పీడయేత్॥ ౨౯॥

ఇంకనట్టిదండము బంధుసహితముగ రాజును నశింపజేయుటయెగాక దుర్గమును దేశమును స్థావరజంగమాత్మకమగు నీలోకమును యజ్ఞయాగాదులు నశించుటచే హవిర్లేకజీవనులగు దేవతలను మునులనుగూడపీడించును॥ ౨౯॥

మూ॥ సోఽసహాయేన మూఢేన లుబ్ధేనాకృతబుద్ధినా । నశక్యో
న్యాయతో నేతుం సక్తేన విషయేషుచ॥ ౩౦॥

ఆదండము మంత్రిపురోహితాదిసహాయములేనట్టియు మూర్ఖుడైనట్టియు లోభుడైనట్టియు శాస్త్రాభ్యాసములేనట్టియు విషయాసక్తుడైనట్టియు నగు రాజుచే న్యాయముగ ప్రయోగించుటకుశక్యముగాదని యర్థము॥ ౩౦॥

మూ॥ శుచినా సత్యసంధేన యథాశాస్త్రానుసారిణా। ప్రణేతుం
శక్యతే దండస్సుసహాయేన ధీమతా॥ ౩౧॥

శుచియనగా లోభరహితుడు అట్టియు సత్యప్రతిజ్ఞుడైనట్టియు శాస్త్రమునను సరించినట్టియు మంచిసహాయముగలిగినట్టియు తత్వజ్ఞుడైనట్టియు వానిచేదండము ప్రయోగించుటకు శక్తుడగును॥ ౩౧॥

మూ॥ స్వరాష్ట్రే న్యాయవృత్తస్స్యాద్భృశదండశ్చ శత్రుషు।సు

వృత్తస్స్వజిహ్మస్స్నిగ్ధేషు బ్రాహ్మణేషు క్షమాన్వితః॥ ౩౨॥

స్వదేశమందు యథాశాస్త్రవ్యవహారము గలవాడై శత్రువులయందు తీక్ష్ణమైన దండముగలవాడై మిత్రులయందు కౌటిల్యములేనివాడై బ్రాహ్మణులయందు అల్పాపరాధముగలవారైనను సహనముకలవాడై యుండవలయును॥ ౩౨॥

మూ॥ ఏవంవృత్తస్య నృపతే శ్శిలోంఛేనాపి జీవతః। విస్తీర్యతే యశోలోకే తైలబిందు రివాంభసి॥ ౩౩॥

స్వల్పధనముగలవాడైనప్పటికిని మీదచెప్పినప్రకారము మంచివ్యాపారముగల రాజునకుకీర్తి నీటబడిననూనె చుకవలె నీలోకమును వ్యాపించును। ౩౩॥

మూ॥ అతస్తు విపరీతస్య నృపతే రజితాత్మనః।సంక్షీయతే యశో లోకే ఘృతబిందు రివాంభసి॥ ౩౪॥

ఉక్తాచారముకన్న విపరీతమగు నాచారముకలిగి ఇంద్రియనిగ్రహములేనిరాజు యొక్క కీర్తినీటియందగు నేతిచుకవలె క్షీణించును॥ ౩౪॥

మూ॥ స్వేస్వేధర్మేనివిష్టానాం సర్వేషా మనుపూర్వశః। వర్ణానామాశ్రమాణాంచ రాజా సృష్టోభిరక్షితా॥ ౩౫॥

క్రమముగా తమతమ ధర్మములను తప్పకనడుచు సమస్తములగు బ్రాహ్మణాదివర్ణములయొక్కయు బ్రహ్మచర్యాద్యాశ్రమములయొక్కయు రక్షించుటకై బ్రహ్మ రాజునుసృజించెను అనగా నియమము తప్పక నడుచువర్ణములను రక్షించనిరాజునకు ప్రత్యవాయమగును అట్టినియమములేనివారలను రక్షించకపోయినను అంతప్రత్యవాయములేదని భావమని కుల్లూకభట్టుమొదలగు వ్యాఖ్యాతలువ్రాసిరి॥

మూ॥ తేన యద్యత్సభృత్యేన కర్తవ్యం రక్షతా ప్రజాః। తత్త ద్వోహం ప్రవక్ష్యామి యథావ దనుపూర్వశః॥ ౩౬॥

ప్రజలను రక్షించు మంత్రులతోగూడిన రాజు చేయవలసినదానిని క్రమముగా నేనుజెప్పెదనని చెప్పబోవునర్థమును కంతరమని యెరుంగునది॥ ౩౬॥

మూ॥ బ్రాహ్మణాన్పర్యుపాసీత ప్రాతరుత్థాయపార్థివః। త్రైవి

ద్యవృద్ధా న్విదుష స్తిష్ఠే త్తేషాంచ శాసనే॥ ౩౭॥

ఆకర్తవ్యమును చెప్పుచున్నాడు రాజు ప్రొద్దుటలేచి వేదత్రయవృద్ధులగు విద్వాంసులగు బ్రాహ్మణులనుపాసనచేయవలయును వారిసన్నిధానమున సంచరించవలెననుట ఇంక వారియాజ్ఞను చేయవలెను వారు చేయుమనుచున్న ఫలములను వానిననుమోదించవలెననుట॥ ౩౭॥

మూ॥ వృద్ధాంశ్చ నిత్యం సేవేత విప్రాన్వేదవిదశ్శుచీన్। వృద్ధసేవీ
హి సతతం రక్షోభిరపి పూజ్యతే॥ ౩౮॥

నిత్యమున్ను వేదార్థవేత్తలును వయస్సుచేతను తపస్సుచేతను వృద్ధులును శౌచాచారసంపన్నులగు బ్రాహ్మణులను సేవించవలయును అటులవృద్ధులను సేవించువాని రాక్షసులును యెల్లప్పుడు పూజింతురు॥ ౩౮॥

మూ॥ తేభ్యోఽధిగచ్ఛే ద్వినయం వినీతాత్మాపి నిత్యశః। వినీతాత్మా
హి నృపతి ర్నవినశ్యతి కర్హిచిత్॥ ౩౯॥

రాజు తానెంతబుద్ధిమంతుడైనను ఆ బ్రాహ్మణులవలన వినయమును గ్రహించవలయును ఆలాగు వినీతాత్ముడగు రాజెప్పటికిని నశించడు ఆ రాజు తానెంత తెలిసినవాడైనను పండితులవలన తెలుసుకొని నడచినతనబుద్ధిప్రసిద్ధినొందుటయేగాక సంపత్సమృద్ధియుగలుగుననుట॥ ౩౯॥

మూ॥ బహవోఽవినయాన్నష్టా రాజానస్సపరిచ్ఛదాః। వనస్థా
అపి రాజ్యాని వినయాత్ప్రతిపేదిరే॥ ౪౦॥

అవినీతులగు రాజులు సపుత్రబాంధవముగ నవినయమువలననేకులు నశించిరి అటులనే వినయమున నడచినుండినను రాజ్యమునొందిరనిభావము॥ ౪౦॥

మూ॥ వేనో వినష్టోఽవినయా న్నహుషశ్చైవ పార్థివః। సుదా
సోయవనశ్చైవ సుముఖో నిమి రేవచ॥ ౪౧॥

పైనిచెప్పినరీతికి రెండుశ్లోకములచే దృష్టాంతమునిచ్చుచున్నాడు అవినయమువలన వేనుడను రాజునునహుషుడను రాజును పైజవనపుత్రుడగు సుదాసుడనువాడును సుముఖుడు

డును నిమియును నశించిరి॥ ౪౧॥

మూ॥ పృథుస్తు వినయాద్రాజ్యం ప్రాప్తవాన్మనురేవ చ। కుబే
రశ్చ ధనైశ్వర్యం బ్రాహ్మణ్యం చైవ గాధిజః॥ ౪౨॥

వినయమువలన పృథుచక్రవర్తియును మనువును రాజ్యమును బొందెను కుబేరుడును ధనాధిపత్యమును బొందెను విశ్వామిత్రుడును బ్రాహ్మణ్యమును బొందెను యిక్కడ బ్రాహ్మణ్యప్రాప్తి ప్రస్తుతము కాకపోయినను వినయమునకాధిక్యమును జెప్పుటకని దెలియవలయును॥ ౪౨॥

మూ॥ త్రైవిద్యేభ్యస్త్రయీం విద్యాం దండనీతించ శాశ్వతీం। ఆన్వీ
క్షికీం చాత్మవిద్యాం వార్తారంభాంశ్చ లోకతః॥ ౪౩॥

ఇటుల వేదత్రయవేత్తలవలన వినయమునభ్యసించవలయునని జెప్పి వారివలననే యా వేదత్రయమునభ్యసించవలయునని జెప్పుచున్నాడు వేదత్రయవేత్తలవలననే వేదత్రయమును స్వాధ్యాయాదిపరంపరచే లభించినచోట నిత్యమగుదండనీతిని అనగాచాణక్యాదిప్రణీతమగు నీతిశాస్త్రమనుట భూతప్రవృత్తి ప్రియాను కూల్యప్రయోగమగు నాన్వీక్షికిని అనగా తర్కశాస్త్రమనుట అభ్యుదయమున హర్షమును వ్యసనమందు విషాదమును శమింపజేయు యాత్మవిద్యను అనగా వేదాంతశాస్త్రమనుట ధనసంపాదనోపాయముల కృష్యాదులను లోకమువలన నేర్చుకోవలయును అనగా నానాయా శాస్త్రములను ఆయాశాస్త్రములను తెలియువారివలన నభ్యసించవలయుననుట ఇచట బ్రహ్మచారియై వేదములనభ్యసించినపిమ్మట రాజ్యాధికారము గలిగియుండగా నిపుడు వేదాభ్యాసమును జెప్పుటచే తదభ్యాసమును దప్పకుండ జేయవలయునని తాత్పర్యము॥ ౪౩॥

మూ॥ ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశం। జితేం
ద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః॥ ౪౪॥

జితేంద్రియుడు ప్రజలను లెస్సగా పరిపాలనజేయుటకు సమర్థుడగును గాన నెల్లప్పుడును చక్షురాదీంద్రియముల యొక్క జయమును విశేషముగా యత్నించవలయును ఇచట బ్రహ్మచారిధర్మములయందింద్రియనిగ్రహమందరికి నావశ్యకత జెప్పియుం

డినను రాజునకవిముఖ్యమని తెలియుటకై యీయర్థమును జెప్పెనని తెలియవల యును॥ ౪౪॥

మూ॥ దశకామ సముత్థాని తథాష్టౌ క్రోధజానిచ। వ్యసనాని దు
రంతాని ప్రయత్నేన వివర్జయేత్॥ ౪౫॥

వక్ష్యమాణప్రకారముగ గామమువలన బుట్టునదియు గ్రోధమువలనబుట్టునవి మిదియునగు దురంతములగు అనగానారంభమునసుఖముగదోచుచు నంతమునదుః ఖకరములు లేక నభ్యాసమైనపిమ్మట విడువరానివ్యసనములను యత్నపూర్వకముగ విడువవలయుననిభావము॥ ౪౫॥

మూ॥ కామజేషు ప్రసక్తోహి వ్యసనేషు మహీపతిః। వియుజ్యతే
ఒర్థ ధర్మాభ్యాం క్రోధజే ష్వాత్మ నైవతు॥ ౪౬॥

వ్యసనములనువర్జించుటకు ప్రయోజనమును చెప్పుచున్నాడు-కామమువలనబు ట్టినవ్యసనములయందాసక్తుడగు రాజున కర్థధర్మములునశించును ఇట్లు క్రోధమువల నబుట్టినవ్యసనములయందాసక్తుడైనయెడల నర్థధర్మములునశించుటయే గాక మంత్రి మొదలగువారివలన నాత్మహానియగును ఈచెప్పుటచే కామజములకున్న క్రోధజము లకతిశయము జెప్పబడెనని నందనుడు వ్రాసెను॥ ౪౬॥

మూ॥ మృగయాక్షోదివాస్వప్నః పరివాదస్స్త్రియోమదః। తౌర్య
త్రికం వృథాట్యాచ కామజో దశకోగుణః॥ ౪౭॥

ఆవ్యసనముల కామముల నిర్దేశించుచున్నాడు వేటయు జూదను పవలు ని ద్రించుట ఇతరదోషములను వెల్లడిజేయుట స్త్రీసంభోగము మద్యపానము వల ననగు వికారము నృత్తవాద్యములు పనిలేకుండ తిరుగుట యను నీపదియు కామ ము వలననగు వ్యసనములని యెరుంగునది॥ ౪౭॥

మూ॥ పైశున్యం సాహసంద్రోహ ఈర్ష్యా సూయార్థ దూష
ణం।వాగ్దండజంచ పారుష్యం క్రోధజోపి గణోష్టకః॥౪౮॥

తెలియని దోషములను ప్రకటించుట సజ్జనులను బంధనాదులచే గ్రహించుట మిషచే నోరులజంపుట ధనములను హరించుట లేక నివ్వదగిన వాటినివ్వకపోవుట

ఇతరులమంచిని సహించకపోవుట- ఒరులగుణముల దోషము నాపాదించుట ఆక్రోశను తాడనాదికము యీయెనిమిదియును క్రోధము వలన బుట్టిన వ్యసనములని యెరుగవలయును॥ ౪౮॥

మ॥ ద్వయోరప్యేతయోర్మూలం యం సర్వే కవయో విదుః।
తం యత్నేన జయేల్లోభం తజ్జావేతావుభౌ గణౌ॥ ౪౯॥

పైఁజెప్పిన కామజక్రోధజగణములకు మూలముగానే లోభమును స్మృతికారులు తెలియుదురో యట్టిలోభము నాగణములను బుట్టించుగాన జయించవలయునని భావము॥ ౪౯॥

మ॥ పానమక్షాః స్త్రియశ్చైవ మృగయా చ యథాక్రమం।
ఏతత్కష్టతమం విద్యాచ్చతుష్కం కామజే గణే॥ ౫౦॥

ఈ చెప్పిన కామజగణములో మద్యపానము జూదము స్త్రీసంభోగము వేట- ఈ నాలుగున్ను ఉత్తరోత్తరము దుఃఖముల నిచ్చునని యెరుంగునది ఇచ్చట రాఘవానందుడను వ్యాఖ్యాత వేటవ్యాయామమువలన రోగములు బాపునుగాన నింతకంటె స్త్రీసంభోగము- అపత్యోత్పాదకమైనను రేతఃక్షరణవేగధారణములచే రోగమును బుట్టించి స్మృతిని బాధించుగాన దుఃఖము ఇంతకంటె పాక్షికధనాగమహేతువైనను విరోధోత్పాదకమాటను జూదము దుఃఖము దీనికంటెను శరీరస్మృతి నపహరించునది యాటను అట్టియవస్థను విషాదులచే ననర్థమూలమాటను బహుకాలనరకాధాయం మాటను మద్యపానమన్నిటికంటె నెక్కుడుగాన నీనాలుగున్ను దివాస్వాపాదులకంటె కామజగణములలో నతిదుఃఖదనుగా తెలియవలయునని సహేతుకముగవ్రాసెను॥ ౫౦॥

మ॥ దండస్య పాతనం చైవ వాక్పారుష్యార్థదూషణే। క్రోధజేపి గణే విద్యాత్కష్టమేతత్త్రికం సదా॥ ౫౧॥

క్రోధజగణమందును పైశున్యాదులకన్న దండపాతమున్ను వాక్పారుష్యమున్ను అర్థదూషణమున్ను ఈమూడున్ను దుఃఖకరములని తెలియవలయును ఇచట్టను రాఘవానందుడు అర్థదూషణముకన్న యతికైనను మరణోద్యోగమును గలుగజేయు వాక్పారుష్యముకన్నను బహుకల్పనరకజనకమగు బ్రహ్మహత్యాదిహేతు

ఘగుటను శీఘ్రమరణాద్యాయకమగుటను దండమన్నిటికన్న దుఃఖమని వ్రాసెను॥

మూ॥ సప్తకస్యాస్య సర్వస్య సర్వత్రైవానుషంగిణః । పూర్వం పూర్వం గురుతరం విద్యాద్వ్యసన మాత్మవాన్॥ ౫౨॥

కామజదోషములందలి పానాదిచతుష్టయమును క్రోధజదోషములయందలి దండపాతాదిత్రయమును గలవగు నాయేడింటిలో క్రమముగా పూర్వపూర్వము గురుతర దుఃఖమని బుద్ధిమంతుడగు రాజు యెరుంగవలయునని భావము॥ ౫౨॥

మూ॥ వ్యసనస్యచ మృత్యోశ్చ వ్యసనం కష్టముచ్యతే । వ్యసన్యధోధో వ్రజతి స్వర్యాత్యవ్యసనీమృతః। ౫౩॥

లోకములో తెలివిని పోగొట్టుటను శాస్త్రానుష్ఠానాది పద్ధతి ప్రతిబంధకములగుటను వ్యసనమునకు మృత్యువునకు సామ్యము సిద్ధించెను వీటిలో వ్యసనము బహుదుఃఖకరమని జెప్పుచున్నాడు- ఏమనగా వ్యసనముగల పురుషుడు బహునరకమును బొందును మరణమును బొందినవాడైతే స్వకర్మానుసారముగ స్వర్గమును బొందుచున్నాడని భావము॥ ౫౩॥

మూ॥ మౌలాన్ శాస్త్రవిదశ్శూరాన్ లబ్ధలక్షాన్ కులోద్భవాన్। సచివాన్ సప్తచాష్టౌవా ప్రకుర్వీత పరీక్షితాన్॥ ౫౪॥

మౌలులనగా పితృపితామహాది కులక్రమాగతులైనట్టియు సంతానవంతులైనట్టియు ధనవంతులైనట్టియు బంధుసమృద్ధిగలిగినట్టియు ప్రసిద్ధమైనభూమి ధనము మొదలగు నైశ్వర్యముగలిగి స్వదేశవాసులు శాస్త్రవేత్తలనగా భృత్యవిధిమొదలగు శాస్త్రములను తెలిసినట్టియు ఇచ్చట నుపలక్షణవిధిచే ప్రాజ్ఞులు దక్షులు మొదలగువారని మేధాతిథివ్రాసెను॥ లబ్ధలక్షులనగా ఆయుధవేత్తలనుట సత్కులప్రసూతులైనట్టియు ఇట్టిమంత్రులను లెస్సగ పరీక్షజేసి యేడుగురైన నెనమండ్రైన సహాయార్థము రాజు సంపాదించవలెననుట॥ ౫౪॥

మూ॥ అపియత్సుకరం కర్మ తదప్యేకేన దుష్కరం। విశేషతోఽసహాయేన కింతు రాజ్యం మహోదయం॥ ౫౫॥

ఏపనిసుఖముగా జేయదగినదో యదియైన నొకనికి జేయనలవిగాదు గొప్పఫలముగల రాజ్యమసహాయముగ జేయ శక్యముగాదని యేమిచెప్పను। ౫౫॥

మూ॥ తైస్సార్ధం చింతయేన్నిత్యం సామాన్యం సంధివిగ్రహం।
స్థానం సముదయం గుప్తిం లబ్ధప్రశమనానిచ॥ ౫౬॥

ఆమంత్రులతోఁగూడ సామాన్యమగు సంధివిగ్రహాదికము ననగా మంత్రములం దు దాఁచఁదగని యట్టి సంధివిగ్రహాదులనున్ను స్థానమనగా దండకోశపురరాష్ట్రాత్మకము చతుర్విధము ఇందులో దండమనగా హస్త్యశ్వరథపదాతులు వీటియొక్క పోషణమున్ను కోశమనగా ధనరాశి దానియొక్క ఆయవ్యయాదికమున్ను పురముయొక్క రక్షణాదికమున్ను రాష్ట్రమనగా దేశము దానియందుగల మనుష్యపశ్వాదులు బ్రతుకునట్టి క్రమమున్ను సముదయమనగా ధాన్యహిరణ్యాద్యుత్పత్తిస్థానమున్ను గుప్తియనగా పరీక్షించి యన్నాదికము భక్షించుట పరీక్షితస్త్రీలననుభోగించుట మొదలగు నాత్మరక్షణమున్ను వక్ష్యమాణప్రకారమగు రాష్ట్రరక్షణమున్ను లబ్ధప్రశమనములనగా॥ "శ్లో॥ జిత్వాసంపూజయేద్దేవా" ననిచెప్పుటవలన సంపాదితధనమును సత్పాత్రములందు వినియోగపరుచుటయున్ను ప్రతిదినమందున నాలోచించవలయును॥ ౫౬॥

మూ॥ తేషాం స్వస్వమభిప్రాయ ముపలభ్య పృథక్పృథక్।సమస్తా
నాంచ కార్యేషు విదధ్యాద్ధితమాత్మనః॥ ౫౭॥

చేయదగిన పనివిషయమై యా మంత్రులయొక్క యభిప్రాయమును రహస్యమందు ప్రతివాదములేకుండ ప్రత్యేకముగానున్ను యందరిభావము నొక్కమారుగానున్ను దెలిసికొని యుచితమగు హితమైన యది జేయవలయును॥ ౫౭॥

మూ॥ సర్వేషాంతు విశిష్టేన బ్రాహ్మణేన విపశ్చితా। మంత్రయే
త్పరమంమంత్రం రాజాషాడ్గుణ్యసంయుతం॥ ౫౮॥

ఈమంతులందరిలోనున్ను ధార్మికత్వాదిగుణవిశిష్టుడును బ్రాహ్మణుడగునొకనితో వక్ష్యమాణమగు గుణయుక్తమగు ప్రకృష్టసంధివిగ్రహాదికముయొక్క మంత్రమును నిరూపించవలెను॥ ౫౮॥

మూ॥ నిత్యం తస్మిన్ సమాశ్వస్త స్సర్వకార్యాణినిక్షిపేత్। తేన
సార్ధంవినిశ్చిత్య తతః కర్మసమాచరేత్॥ ౫౯॥

ఎల్లప్పుడును బ్రాహ్మణునియందే నమ్మకముగలిగి తాజేయుకార్యములన్నిటిన

తని కష్టజెప్పవలెను అతనిలో నిశ్చయించి యన్యకార్యములను నారంభింప వల
యును॥ ౫౯॥

మూ॥ అన్యానపి ప్రకుర్వీత శుచీన్ ప్రాజ్ఞా నవస్థితాన్। సమ్యగ
ర్థసమాహర్తౄ నమాత్యాన్సుపరీక్షితాన్॥ ౬౦॥

మరియు కొందరిని లంచములేనివారును బుద్ధిశాలురును ధనార్జనమందు నేర్పుగలవారును లెస్సగా పరీక్షింపబడినవారునగు నట్టివారిని కార్యసహాయులనుగా జేయవలెను॥ ౬౦॥

మూ॥ నిర్వర్తేతాస్య యావద్భి రితికర్తవ్యతా నృభిః। తావతో
తంద్రితాన్ దక్షాన్ ప్రకుర్వీత విచక్షణాన్॥ ౬౧॥

ఈరాజునకు కార్యజాతమందెవరిచే నేకార్యము నెరవేరునో బద్ధకములేక క్రియలయందుత్సాహముగలవారై యాకార్యములను జేయనేర్చినవారినందరి నాకార్యమందు నియమింపవలెను॥ ౬౧॥

మూ॥ తేషామర్థే నియుంజీత శూరాన్ దక్షాన్ కులోద్గతాన్।
శుచీనాకరకర్మాంతే భీరూనంతర్నివేశనే॥ ౬౨॥

అట్టిమనుష్యులలో శూరులును చతురులును సత్కులమనేయంకుశముచేనియామితులగువారును లంచపుధనమందు నిస్పృహులునునగువారిని ధనోత్పత్తిస్థానములందునియమించవలెను యిటువంటివారినె బంగారుమొదలగుగనులను త్రవ్వించడమందును చెరుకు ధాన్యము మొదలగునవి పండేక్షేత్రములయందును నియోగించవలెనని భోజనశయనగృహాంతఃపురాదికమందు భయశీలురగువారిని నియోగించవలెను తరుచుగా నట్టిచోట్లనేకాకియు స్త్రీపరివృతుడైయున్న రాజును అనియుక్తుడు శూరుడైనయెడల శత్రువులచేత భేదింపబడ్డవాడై అపాయముజేయునని భీరుని నియోగించుమనిచెప్పుట॥ ౬౨॥

మూ॥ దూతంచైవ ప్రకుర్వీత సర్వశాస్త్రవిశారదం। ఇంగితా
కారచేష్టజ్ఞం శుచిందక్షం కులోద్గతం॥ ౬౩॥

దృష్టాదృష్టార్థశాస్త్రజ్ఞుడును ఇంగితాకారచేష్టజ్ఞుడనగా ఇంగితమనగా అభి

ప్రాయమును దానినిసూచించెడుమాటలయందగు స్వరాదికము ఆకారమనగా సుఖప్రసాదవైవర్ణ్యాదిరూపమైన ప్రీత్యప్రీతిసూచకమగు దేహధర్మాదికము. చేష్టయనగా కోపాదిసూచకమగు కరాస్ఫాలనాదికము వీటితత్త్వమునుదెలిసినవాడును ధనాశయుస్త్రీవ్యసనాదికములేనివాడును చతురుడును కులీనుడును నగువానిని దూతనుగా జేయవలయును॥ ౬౩॥

మూ॥ అనురక్తశ్శుచిర్దక్షః స్మృతిమాన్ దేశకాలవిత్। వపు
ష్మాన్వీతభీర్వాగ్మీ దూతో రాజ్ఞః ప్రశస్యతే॥ ౬౪॥

అనురక్తుడనగా జనానురాగముగలవాడు దీనిచేనేరాజైన నెవ్వరైన ద్వేషించ బాత్రముగాకుండును శుచియనగా ధనవనితాదిలోలుడుగానివాడు దీనిచే నభేద్యుడని దక్షుడనగాసమర్థుడు దీనిచేకార్యకాలమునతిక్రమించదు స్మృతిమంతుడనగా మరుపులేనివాడు దీనిచే జెప్పినసంగతులను మరువడు దేశకాలవిత్ యనగా దేశకాలముల ననుసరించి మున్నుజెప్పినమాటలేగాక నన్యథాబలుకువాడు వపుష్మానగా సురూపుడు చూచినవాడు తోచినట్టుననలేకుండును విగతభీయనగా నిర్భయుడు దీనిచేసందేశముశ్రోత్రకలకప్రియమైనను నిశ్శంకగాజెప్పనువాగ్మియనగాసంస్కృతాద్యుక్తిక్షముడు ఇట్టిదూతరాజునకు బ్రశస్యుడు॥ ౬౪॥

మూ॥ అమాత్యేదండ ఆయత్తో దండే వైనయికీక్రియా। నృపతౌ
కోశరాష్ట్రే చ దూతే సంధివిపర్యయౌ॥ ౬౫॥

సేనానాయకునియాజ్ఞచే దండమనగా చతురంగబలమువర్తించుచుండుగానన దియతనియధీనము వినయయోగము దండాయత్తము కోశగృహమున్ను గ్రామాదికమున్ను రాజుస్వయముగ పరిశీలించదగినవిగాన నవితదధీనములు రాజుచే నన్యాధీనములుగా జేయదగవు సంధివిగ్రహములుదూతజెప్పినటులుజేయవలెనుగా ననవితదాయత్తములు॥ ౬౫

మూ॥ దూతఏవహి సంధత్తే భినత్త్యేవచ సంహతాన్। దూతస్త
త్కురుతేకర్మ భిద్యంతే యేనవానవా॥ ౬౬॥

భేదమునుబొందియున్నవారికి సంధిచేయుటకును కలసియున్నవారిని భేదించుటకును దూతసమర్థుడు గావున పరులదేశమందా కార్యములజేయుటకు దూత

మహీదుర్గమనగా రాళ్ళచేనయినను ఇటుకలచేనయినను దళసరికి రెండు రెట్లు పదిరెండుమూళ్ళకుతక్కువగాకుండ పొడవుగలిగి యుద్ధమప్పుడు పైనిదిరుగుటకు వెడల్పుగలిగి సావరణగవాక్షయుక్తమగు ప్రాకారముచే వేష్టితమగునది యబ్దుర్గమనగా నగాధమగుజలముచే చుట్టునుబరివృతమగునది వార్క్షదుర్గమనగా చుట్టునామడమేరను వృక్షకంటకగుల్మలతాద్యావృతము నృదుర్గమనగా చతురంగబలముతో చుట్టును బహుమంది యోధులచే రక్షితము గిరిదుర్గమనగా చుట్టును కొండలు పరులకశక్యముగానట్టి కొండలుగలిగి చిన్నత్రోవగలిగి యంతర్గతప్రస్రవణనద్యాదిజలయుక్తమై బహుసస్యఫలవృక్షాదియుక్తమగునది యీదుర్గములలోనొకదాని నాశ్రయించి పురమునునిర్మించవలెను॥ ౭౦॥

మూ॥ సర్వేణతు ప్రయత్నేన గిరిదుర్గం సమాశ్రయేత్। ఏషాం
హి బాహుగుణ్యేన గిరిదుర్గం విశిష్యతే॥ ౭౧॥

ఈచెప్పబడిన దుర్గములన్నిలో నెక్కువగుణములు గలదిగావున గిరిదుర్గము నతిప్రయత్నముచే నాశ్రయించవలెను. దీనియందు శత్రువులకు దురారోహత్వము సులభముగ శత్రుసంహారార్థమై శిలాదులు సంభవించుట మొదలగు గుణములు పెక్కులుగలవు॥ ౭౧॥

మూ॥ త్రీణ్యాద్యాన్యాశ్రితాస్త్వేషాం మృగగర్తాశ్రయాప్సరాః।
త్రీణ్యుత్తరాణి క్రమశః ప్లవంగమ నరామరాః॥ ౭౨॥

ఈ దుర్గములలో మొదటి మూడుదుర్గములను మృగాదులాశ్రయించును అంటే మరుదుర్గమును మృగములు మహీదుర్గము గర్తాశ్రితములనగా నెలుకలు మొదలగునది యబ్దుర్గమును నక్రాదులు నాశ్రయించును మిగిలిన వృక్షదుర్గా[illegible]ంటిని వానరాదులాశ్రయింతురు అందువృక్షదుర్గమును వానరములు [illegible]మును మనుష్యులు గిరిదుర్గమును దేవతలు నాశ్రయింతురు॥ ౭౨॥

మూ॥ [illegible] దుర్గాశ్రితానేతాన్నోపహింసంతి శత్రవః। త
[illegible]యో నహింసంతి నృపదుర్గ సమాశ్రితం॥ ౭౩॥

[illegible] నీయాదుర్గముల నాశ్రయించిన మృగాదులను తద్విరోధు[illegible] పీడించలేరో యట్లీదుర్గముల నాశ్రయించిన రాజును శ

త్రువుఁబీడింపఁ జేరఁడు॥ ౭౩॥

మూ॥ ఏకశ్శతం యోధయతి ప్రాకారస్థో ధనుర్ధరః । శతంద
శసహస్రాణి తస్మాద్దుర్గం విధీయతే॥ ౭౪॥

ప్రాకారమందున్న యేవిలుకాఁడు నూరుమందితో నుండు నూరుమంది విల్లుకాం
డ్రు పదివేలతో యుద్ధమొనర్పుదురు గావున నె దుర్గనిర్మాణము చె
ప్పఁబడెను॥ ౭౫॥

మూ॥ తత్స్యాదాయుధ సంపన్నం ధనధాన్యేన వాహనైః। బ్రా
హ్మణైః శిల్పిభిర్యంత్రైర్యవసేనోదకేనచ॥ ౭౫॥

ఆదుర్గము ఖడ్గాద్యాయుధసువర్ణాదిధనధాన్యకరితురగాదివాహనబ్రాహ్మ
ణభక్షణ శిల్పియంత్రాద్యమును గానున్న జలసమృద్ధము గానున్న జేయవలయును॥

మూ॥ తస్య మధ్యే సుపర్యాప్తం కారయేద్గృహమాత్మనః। గు
ప్తం సర్వర్తుకం శుభ్రం జలవృక్షసమన్వితం॥ ౭౬॥

ఆదుర్గమధ్యమందు వేరువేర స్త్రీగృహదేవాగారాగ్నిగృహాయుధాగారాది
యుక్తమును కందకము ప్రాకారము మొదలగువాటిచే గుప్తమును సర్వర్తుకఫ
లపుష్పాదియుక్తమును సుధాధవళితము వాప్యాదిజలసహితమును వృక్షాన్వితమ
గు గృహమును దమనివాసార్థమై నిర్మింపఁజేయవలెను॥ ౭౬॥

మూ॥ తదధ్యాస్యోద్వహేద్భార్యాం సవర్ణాం లక్షణాన్వితాం।
కులేమహతి సంభూతాం హృద్యాం రూపగుణాన్వితాం॥

ఆగృహమందు నివసించి సమానవర్ణాలును శుభసూచకచిహ్నములు గ
లదియు మహాకులమందు బుట్టినదియు మనోహరస్వరూపరాలును మంచిరూప
మున్ను గుణములున్ను గలభార్యను బెళ్ళిజేసుకొనవలెను॥ ౭౭॥

మూ॥ పురోహితంచ కుర్వీత వృణుయాదేవ చర్త్విజం। తేస్య
గృహ్యాణి కర్మాణి కుర్యుర్వైతానికానిచ॥ ౭౮॥

అథర్వణవిధిజ్ఞుఁడైన పురోహితునిన్ని శ్రౌతకర్మములను జేయుటకు ఋత్విజునిన్ని
వరింపవలెను వారా రాజుయొక్క గృహ్యాదికర్మములను జేయవలెను॥ ౭౮॥

మూ॥ యజేత రాజా క్రతుభి ర్వివిధై రాప్తదక్షిణైః। ధర్మార్థం
చైవ విప్రేభ్యో దద్యాద్భోగా న్ధనాని చ॥ ౭౯॥

రాజు బహుదక్షిణలుగల యశ్వమేధాదినానావిధయజ్ఞములను జేయవలయు ను బ్రాహ్మణులకు స్త్రీగృహశయ్యాదిభోగసాధనములను సువర్ణరత్నాదిధనమును న్ను ఇవ్వవలెను॥ ౭౯॥

మూ॥ సాంవత్సరిక మాప్తైశ్చ రాష్ట్రా దాహారయేద్బలిం। స్యా
చ్చామ్నాయపరో లోకే వర్తేత పితృవన్నృషు॥ ౮౦॥

అనురక్తులగు మంత్రులచేత సంవత్సరగ్రాహ్యమగు ధాన్యాదిభాగమును దె ప్పించవలెను- లోకమందు వన్నివిషయమై శాస్త్రనిష్ఠుడు గావలెను స్వదేశస్థులను దండ్రివలె బరిపాలించవలెను॥ ౮౦॥

మూ॥ అధ్యక్షా న్వివిధా న్కుర్యా త్తత్ర తత్ర విపశ్చితః। తే౽
స్య సర్వాణ్యవేక్షేర న్నృణాం కార్యాణి కుర్వతాం॥ ౮౧॥

అచ్చటచట గజతురగరథపదాతాదిస్థానములందు వేరువేరతత్కర్మములం దు కుశలులగు నధ్యక్షులను అనగా సమ్యగ్దర్శనవిచక్షణులనునియమించవలెను వారీ రాజుయొక్క గజతురగాదిస్థానములందు పనులను జేయువారి కర్మములను పరి శీలించవలెను॥ ౮౧॥

మూ॥ ఆవృత్తానాం గురుకులా ద్విప్రాణాం పూజకో భవేత్। నృ
పాణా మక్షయో హ్యేష నిధి ర్బ్రాహ్మో౽భిధీయతే॥ ౮౨॥

అధీతవేదులై గురుకులమునుండివచ్చి గార్హస్థ్యమందు బ్రవేశించ నిచ్ఛయిం చు బ్రాహ్మణులను ధనధాన్యాదులచే బూజించవలెను ఇట్లు బ్రాహ్మణాధీనము ఇచ్చిన ధనధాన్యాదికము బ్రహ్మజ్ఞానఫలకమగుగాన రాజులకు నిధివలెనక్షయమ గుచున్నది గావుననిది శాస్త్రముచే నుపదేశించబడుచున్నది॥ ౮౨॥

మూ॥ నతం స్తేనా నచామిత్రా హరంతి నచనశ్యతి। తస్మాద్రాజ్ఞా
నిధాతవ్యో బ్రాహ్మణేష్వక్షయో నిధిః॥ ౮౩॥

ఇట్లు బ్రాహ్మణులకు సమర్పించు ధన్యాదికము నిధివంటిదిగాన నిధిపాతిపెట్టి

న ధనమువలె చోరులకుగాని శత్రువులకుగాని యపహరింప నసాధ్యమది యేరీతిని న్ని నశింపదు గావున నిట్టినిధిగ బ్రాహ్మణులయందుంచవలెననగా వారికివ్వవలెను. ౮౩

మూ॥ నస్కందతే నవ్యథతే నవినశ్యతి కర్హిచిత్। వరిష్ఠమగ్ని హోత్రేభ్యో బ్రాహ్మణస్య ముఖేహుతం॥ ౮౪॥

అగ్నియందు హోమము మొదలగువానివలెనే యీ బ్రాహ్మణుని ముఖమందు హుతము గాకక మరుగును మరేరీతినైన నశించును గాని॥ "శ్లో॥ పాణ్యాస్యోహి ద్విజః స్మృతః" అని బ్రాహ్మణుడు హస్తమే ముఖముగాఁ గలవాడనుటవలన బ్రాహ్మణహస్తమందర్పించినది యట్లుగాదు గావున నగ్నిహోత్రాదికములకంటె బ్రాహ్మణులకిచ్చినవియు త్తమమని జెప్పబడెను॥ ౮౪॥

మూ॥ సమ మబ్రాహ్మణేదానం ద్విగుణం బ్రాహ్మణబ్రువే। ప్రాధీతే శతసాహస్రమనంతం వేదపారగే॥ ౮౫॥

బ్రాహ్మణేతరక్షత్రియాదులకిచ్చినది యంతో యెక్కువ తక్కువ లేకుండ నంతే ఫలమిచ్చును కర్మానిష్ఠ లేక బ్రాహ్మణుడనిపించుకున్నవాడు బ్రాహ్మణబ్రువుడతనికిచ్చిన దానము పూర్వముకంటె ద్విగుణఫలమిచ్చును- ఉపక్రమించి కొంత వేదమును జదివిన బ్రాహ్మణునకిచ్చిన దానము శతసహస్రగుణమగును సర్వశాఖాధ్యాయి యగువానికిచ్చినదియనంతఫలదమగును "సహస్రగుణమాచార్యే" యని మూడవపాదమును గొందరు వ్రాసిరి॥ ౮౫॥

మూ॥ పాత్రస్యహి విశేషేణ శ్రద్దధానతయైవచ। అల్పంవాబహువాప్రేత్య దానస్యావాప్యతే ఫలం॥ ౮౬॥

విద్యాతపోవృత్తులచే యోగ్యులగు సత్పాత్రభేదము చేతనున్ను శాస్త్రమునునమ్మడమను శ్రద్ధ దీనితారతమ్యముచేతనున్ను చేసినదానము పరలోకమందల్పమేని యధికమేని ఫలమునిచ్చును॥ ౮౬॥

మూ॥ సమోత్తమాధమై రాజా త్వాహూతః పాలయన్ ప్రజాః। నని వర్తేత సంగ్రామాత్ క్షాత్రం ధర్మమనుస్మరన్॥ ౮౭॥

ప్రజాపరిపాలన మొనరించుచున్న రాజు తనకంటె నధికబలులైన నల్పబలులైన స

ముకైన తననుయుద్ధమునకుపిలిచినచో క్షత్రియుడు యుద్ధమునకు వెనుక దీయరా దనుక్షత్రియధర్మమును స్మరించుకొనుచు యుద్ధమువలనమరలగూడదనిపోవవలెను॥

మూ॥ సంగ్రామేష్వనివర్తిత్వం ప్రజానాం పరిపాలనం। శుశ్రూ
షా బ్రాహ్మణానాంచ రాజ్ఞాం శ్రేయస్కరం పరం॥౮౮॥

యుద్ధములం దపరాఙ్ముఖత్వమున్ను ప్రజారక్షణమున్ను బ్రాహ్మణపూజయు న్ను రాజులకుత్కృష్టమగు స్వర్గాదిశ్రేయస్థానము గావున నే॥ ౮౮॥

మూ॥ ఆహవేషు మిథోన్యోన్యం జిఘాంసంతో మహీక్షితః। యు
ధ్యమానాః పరంశక్త్యా స్వర్గంయాంత్యపరాఙ్ముఖాః॥౮౯॥

రాజులు స్పర్థచే నన్యోన్యమునుచంపుట కుద్యుక్తులై యుద్ధమందపరాఙ్ముఖు లగుచు నధికశక్తిచేపోరిరేని స్వర్గమునొందుదురు విచారించగాశత్రుజయరాజ్య ధనలాభములు దృష్టఫలమునేగాని స్వర్గము లేదయినప్పటికిన్ని యుద్ధాపరాఙ్ముఖ త్వనియమమునకుఫలము స్వర్గమగునుదోషముగాదు॥ ౮౯॥

మూ॥ నకూటైరాయుధైర్హన్యా ద్యుధ్యమానో రణేరిపూన్।న
కర్ణిభిర్నాపి దిగ్ధైర్నాగ్నిజ్వలితతేజనైః॥ ౯౦॥

కూటములనగా పయికికర్రగాకనబడి లోపలనాయుధములున్నవాటిచేతనుచి ల్లకోలలచేతనున్ను నగ్నిచేజ్వలించుచున్న యలుగులుగలవాటిచేతనున్ను విషాదిది గ్ధములగువాటిచేతనున్ను యుద్ధమందుశత్రువులనుకొట్టతగదు॥ ౯౦

మూ॥ నచహన్యాత్ స్థలారూఢాన్ నక్లీబం నకృతాంజలిం।నా
ముక్తకేశంనాసీనం నతవాస్మీతి వాదినం॥ ౯౧॥

తానురథముపైనుండి రథమువిడిచి దిగువనున్నవానినిన్ని నపుంసకునిన్ని అంజలి జేసినవానినిన్ని కొప్పువిడినవానినిన్ని కూచున్నవానినిన్ని నీవాడననిన వానిని న్ని కొట్టగూడదు॥ ౯౧॥

మూ॥ నసుప్తం నవిసన్నాహం ననగ్నం ననిరాయుధం। నాయు
ధ్యమానం పశ్యంతం నపరేణ సమాగతం॥ ౯౨॥

నిద్రితుని సన్నాహములేనివానిని నగ్నుని నిరాయుధుని యుద్ధముచేయని చూచు

మన్నవానిని మఱియొకనితో యుద్ధముఁ జేయుచున్నవానినిన్ని కొట్టరాదు॥ ౯౨॥

మూ॥ నాయుధవ్యసన ప్రాప్తం నార్తం నాతి పరిక్షతం। నభీతం
నపరావృత్తం సతాం ధర్మమనుస్మరన్॥ ౯౩॥

భగ్నశస్త్రాద్యాయుధునిన్ని పుత్రాదివిపత్తిచే నార్తుఁడగువానినిన్ని బహుపరి
హారాకులునిన్ని భీతునిన్ని యుద్ధపరాఙ్ముఖునిన్ని శిష్టులగు క్షత్రియులయొక్క ధర్మ
మునుదలచుచు గొట్టఁగూడదు॥ ౯౩॥

మూ॥ యస్తుభీతః పరావృత్తః సంగ్రామే హన్యతే పరైః। భర్తు
ర్యద్దుష్కృతం కించి త్తత్సర్వం ప్రతిపద్యతే॥ ౯౪॥

ఏభటుఁడు ప్రాణభీతిచే యుద్ధములో నుంచిపోవుచు శత్రువులచే జంపఁబడునో
యతఁడు తన యేలికయొక్క పాపమునెల్ల నుంగొనిపోవును సుకృత దుష్కృతము
లుశాస్త్రప్రమాణముచే సంక్రమయోగ్యలయందు సంక్రమించును ప్రీవేష సుకృ
తమిత్యాదికముచే షష్ఠాధ్యాయమందీవిషయము పరిష్కరించఁబడెను మేధాతిథిపో
షకుని పాపమునొందునన్నది యర్థవాదమనెను॥ ౯౪॥

మూ॥ యచ్చాస్యసుకృతంకించి దముత్రార్థ ముపార్జితం। భ
ర్తా తత్సర్వమాదత్తే పరావృత్తహతస్యతు॥ ౯౫॥

యుద్ధమందు పరాఙ్ముఖుఁడై హతుఁడగువాఁడు పరలోకార్థమై జేసిన పుణ్యమె
ల్ల నతనియేలిక పొందును॥ ౯౫॥

మూ॥ రథాశ్వం హస్తినంఛత్రం ధనంధాన్యం పశూంస్త్రియః।
సర్వద్రవ్యాణి కుప్యంచ యోయజ్జయతి తస్యతత్॥ ౯౬॥

రాజుకు సర్వధనగ్రహణము గలుగుచుండఁగ నిందుకు నపవాదమును చెప్పుచు
న్నాఁడు రథాశ్వగజఛత్రవస్త్రాదిధనధాన్యగవాదిస్త్రీముఖ్యములను గుడలవణా
దిసర్వద్రవ్యములును కుప్యమనఁగా సువర్ణరజతవ్యతిరిక్త తామ్ర కాంస్యాదికము
న్ను వేరువేరనెవరుజయించి తెచ్చిరది వారికే యగుచున్నది సువర్ణరజతరత్నభూ
మ్యాద్యుత్కృష్టద్రవ్యంబులను రాజుకుసమర్పించవలెను ఇందుకేయిచట పరిగణ
నగా చేయదగినదె నరిగావున నే॥ ౯౬॥

మూ॥ రాజ్ఞశ్చ దద్యురుద్ధార మిత్యేషా వైదికీ శ్రుతిః। రాజ్ఞా చ
సర్వయోధేభ్యో దాతవ్య మపృథగ్జితమ్॥ ౯౭॥

జయించి తెచ్చిన ద్రవ్యములలోనుంచి మెంచి గొప్పతీయబడిన సువర్ణరజతవస్త్రాదికోత్కృష్టద్రవ్యముద్ధారమనబడును దానిన్ని కరితురగాది వాహనములున్ను రాజుకు యోధులివ్వవలెను॥ "సూ॥ వాహనంచ రాజ్ఞ ఉద్ధారం చేతి" వాహనములున్ను రాజుకుద్ధారమని గౌతమవచనము స్వామికి ఉద్ధారవిషయమై శ్రుతి॥ ఇంద్రో వై వృత్రంహత్వా" అనునదియారంభించి "సమహాన్ భూత్వా దేవతా అబ్రవీత్ ఉద్ధారంసముద్ధరతేతి॥" ఇంద్రుడు వృత్రవధచేసి దేవతలనుగూర్చి పలికెనని మొత్తపుదోపుడుసొమ్మును యోధులకు పౌరుషానుసారముగ రాజు పంచిపెట్టవలె॥ ౯౭॥

మూ॥ ఏషోనుపస్కృతః ప్రోక్తో యోధధర్మ స్సనాతనః। అస్మాద్ధ
ర్మాన్న చ్యవేత క్షత్త్రియో ఘ్నన్ రణే రిపూన్॥ ౯౮॥

అనాదిసర్గప్రవాహ సంభవముగాన నిదినిత్యమై యవిగర్హితమగు యోధధర్మము చెప్పబడెను యుద్ధమందు రిపుసంహారమొనర్చిన క్షత్త్రియుడీధర్మమును విడువరాదు యుద్ధాధికారిగావున క్షత్త్రియుడని చెప్పుటచేత నితరులయినను రాజులకునిదే ధర్మము॥ ౯౮॥

మూ॥ అలబ్ధం చైవ లిప్సేత లబ్ధం రక్షేత యత్నతః। రక్షితం వ
ర్ధయేచ్చైవ వృద్ధం పాత్రేషు నిక్షిపేత్॥ ౯౯॥

అజితములగు భూసువర్ణాదికములను జయించనుద్యుక్తుడుగావలెను లబ్ధముగుదానిని యత్నముచే రక్షించవలెను రక్షితమగుదానిని వాణిజ్యాదికనుచే వృద్ధినొందించవలెను వృద్ధినొందినదానిని సత్పాత్రములందు వినియోగపరచవలెను॥౯౯

మూ॥ ఏతచ్చతుర్విధం విద్యా త్పురుషార్థప్రయోజనమ్। అస్యని
త్యమనుష్ఠానం సమ్యక్కుర్యా దతంద్రితః॥ ౧౦౦॥

ఈనాలుగు విధములగు పురుషార్థమనగా స్వర్ణాదికము దానిప్రయోజనమును యేహేతువుచే నీరీతిరూపమని తెలియవలెనో యదిహేతువచే నలసుడై సం

తత్తమును తదనుష్ఠానము జేయవలయును॥ ౧౦

మూ॥ అలబ్ధ మిచ్ఛే ద్దండేన లబ్ధం రక్షే దవేక్షయా। రక్షితం వర్ధయే ద్వృద్ధ్యా వృద్ధం దానేన నిక్షిపేత్॥ ౧౦౧॥

ఏది యలబ్ధమో దానిని చతురంగబలరూపమగు దండనముచే సంపాదింపవలయును లబ్ధమగు దానిని ప్రత్యవేక్షణముచే రక్షించవలెను రక్షితమగు దానిని వృద్ధ్యుపాయమగు స్థలజలపదవాణిజ్యాదికముచే వృద్ధినొందించవలెను ప్రవృద్ధమగు ధనమును శాస్త్రీయమగు విభాగముచే సత్పాత్రమందుపయోగపరచవలెను॥ ౧౦౧॥

మూ॥ నిత్య ముద్యతదండస్స్యా న్నిత్యం వివృతపౌరుషః। నిత్యం సంవృతసంవార్యో నిత్యం ఛిద్రానుసార్యరేః॥ ౧౦౨॥

నిత్యమును హస్త్యశ్వాదియుద్ధాది శిక్షాభ్యాసముగలవాడుగావలెను నిత్యము శస్త్రవిద్యాభ్యాసాదికముచే బ్రకటితమగు పౌరుషముగలవాడు గావలెను నిత్యము మంత్రాగారచేష్టాదికము గుప్తముగా గలవాడును శత్రువుయొక్క వ్యసనాదిరూపఛిద్రములను కనుగొనువాడును గావలెను॥ ౧౦౨॥

మూ॥ నిత్యముద్యత దండస్య కృత్స్నముద్విజతే జగత్। తస్మాత్సర్వాణి భూతాని దండేనైవ ప్రసాధయేత్॥ ౧౦౩॥

దండనముచే లోకము భయపడును గావున సర్వప్రాణులనున్ను దండముచే స్వాధీనపరచుకొనవలెను॥ ౧౦౩॥

మూ॥ అమాయయైవ వర్తేత నకథంచన మాయయా। బుధ్యేతారి ప్రయుక్తాంచ మాయాంనిత్యం స్వసంవృతః॥ ౧౦౪॥

అమాత్యాదులయెడల నెల్లప్పుడును మాయచేబ్రవర్తించరాదు యటులయినను వారువిశ్వసించకపోదురు ధర్మరక్షార్థమై యథార్థముగా వ్యవహరించవలెను యత్నముచే జేయబడినయాత్మపక్షరక్షనున్ను తనవారినిభేదించుటకు విరోధులొనర్చెడు మాయనున్ను నిత్యము నెరుంగవలెను॥ ౧౦౪॥

మూ॥ నాస్యచ్ఛిద్రం పరో విద్యా ద్విద్యాచ్ఛిద్రంపరస్యతు। గూహేత్కూర్మ ఇవాంగాని రక్షేద్వివర మాత్మనః॥ ౧౦౫॥

తనమంత్రులుమొదలగువారలలో బుట్టినభేదమును శత్రువులెరుగకుండ నట్లులును శత్రువులప్రకృతిభేదము చారులవలన తనకు దెలియునట్లులును యత్నముజేయవలయును కూర్మముతనముఖమును చరణములను దనదేహమందెట్లుదాచునట్లు తనయమాత్యాదిరాజ్యాంగములను దానసమ్మానాదులచే స్వాధీనపరచుచుండవలెను దైవవశముచే ప్రకృతిభేదాదిఛిద్రముగలిగెనేని తత్ప్రతీకారము యత్నముచే జేయవలెను॥ ౧౦౫॥

మూ॥ బకవచ్చింతయేదర్థాన్ సింహవచ్చ పరాక్రమేత్। వృ
కవచ్చావలుంపేత శశవచ్చ వినిష్పతేత్॥ ౧౦౬॥

అతిచంచలస్వభావమయిననూ జలమందున్నమీనమును గ్రహించుట కేకాగ్రమనస్కుడై యెట్లుబకముచింతించుచుండునో రహస్యమున లెస్సగాజేయబడిసంరక్షణముగల శత్రువునియొక్క దేశగ్రహణాద్యర్థములను చింతించవలెను యేలాగునసింహము స్థూలదేహముగల యేనుగులకదుపుపై విక్రమించునో యాప్రకారముగ శత్రువు బలవదన్యసహాయము లేనివాడగుచుండునపుడు తానుస్వల్పబలుడైనను విజృంభించవలెను యేరీతినివృకముపాలకకృతరక్షగలిగినను దైవవశముచేపాలకుడు మరచియున్నప్పుడు పశువునుబట్టిచంపునో తద్రీతిని దుర్గాదిసంరక్షితుడైనను శత్రువు ప్రమాదమునొందియుండుటగనుగొని చంపవలెను చెవులపిల్లి వ్యాధునివాగురాదులచే బట్టబడియును ప్లుతగతితో దొరకక నేరీతిని పారిపోవునోయట్టిరీతిని శత్రువులుచుట్టుముట్టినపుడు భ్రమకలగజేసి విరోధులనుగకురించి తప్పించుకుని గుణముగల బలవదాశ్రయమునకు బోవలయును॥ ౧౦౬॥

మూ॥ ఏవం విజయమానస్య యేస్యస్యుః పరిపంథినః। తానానయే
ద్వశం సర్వాన్ సామాదిభి రుపక్రమైః॥ ౧౦౭॥

ఈప్రకారముగ విజయోద్యుక్తుడగురాజు విజయమునకడ్డువచ్చెడు విరోధులను సామభేద దండోపాయములచే వశమునుగజేయవలయును॥ ౧౦౭॥

మూ॥ యదితేతు నతిష్ఠేయు రుపాయైః ప్రథమైస్త్రిభిః। దండే
నైవ ప్రసహ్యైతాన్ శనకై ర్వశమానయేత్॥ ౧౦౮॥

తనవిజయమునకు విఘ్నమొనర్చెడువారు సామభేదదానముల స్వాధీనముగాని యెడల లఘుగురుదండక్రమముచే బలాత్కరించి యద్ధుచేనెల్లగ వశవముజే

యవలయును॥ ౧౦౮॥

మూ॥ సామాదీనా ముపాయానాం చతుర్ణామపి పండితాః ।
సామదండౌ ప్రశంసంతి నిత్యం రాష్ట్రాభివృద్ధయే॥౧౦౯॥

నాలుగైన సామాద్యుపాయములలో సామదండములనే రాష్ట్రాభివృద్ధికై పండితులు ప్రశంసించుచున్నారు సామమందు బ్రయాసధనవ్యయసైన్యక్షయాది దోషములులేవుగావుననున్ను యిదియుండవనున్నదండమందు కార్యసిద్ధివలననున్ను ౧౦౯

మూ॥ యథోద్ధరతి నిర్దాతా కక్షం ధాన్యంచ రక్షతి। తథా రక్షే
న్నృపో రాష్ట్రం హన్యాచ్చ పరిపంథినః॥ ౧౧౦॥

మూ॥ భూమియందు సస్యమున్ను తృణమున్ను కూడాబుట్టును కర్షకుడు తృణమునుతీసివేసి ధాన్యమునురక్షించినట్లు దుష్టులనుసంహరించి సన్మార్గులను నిలవబెట్టి రాష్ట్రవృద్ధినిజేయవలయును కర్షకదృష్టాంతముచే వారలభ్రాతలను నశింపజేయవలయును సద్యుక్తమగు రాజ్యమునురక్షించవలెను॥

మూ॥ మోహాద్రాజా స్వరాష్ట్రం యః కర్శయత్యనవేక్షయా।
సోచిరాద్భ్రశ్యతే రాజ్యాజ్జీవితాచ్చ సబాంధవః॥౧౧౧॥

సదసజ్జనవివేచనలేక స్వరాష్ట్రజనులను పీడించినరాజు అశాస్త్రీయము ధనగ్రహణమారణాదిపీడాజనితదోషముచే శీఘ్రముగా రాజ్యమువల్లనున్ను జీవితమువల్లనున్ను భ్రష్టుడై పుత్రాదులతోనశించును॥ ౧౧౧॥

మూ॥ శరీరకర్శనాత్ప్రాణాః క్షీయంతే ప్రాణినాం యథా। త
థా రాజ్ఞామపి ప్రాణాః క్షీయంతే రాష్ట్రకర్శనాత్॥౧౧౨॥

ఆహారాదినిరోధమువలననగు శరీరశోషణములచే ప్రాణులయొక్క ప్రాణములు క్షీణించినట్లు రాష్ట్రముయొక్క కర్శనముచే ప్రజలయొక్క కోపాదికమువలన రాజులయొక్క ప్రాణములు క్షీణించును గావున నృపుడు శరీరరక్షణము వలెనే రాష్ట్రరక్షణజేయవలెను॥ ౧౧౨॥

మూ॥ రాష్ట్రస్య సంగ్రహే నిత్యం విధాన మిదమాచరేత్। సుసం
గృహీతరాష్ట్రో హి పార్థివః సుఖమేధతే॥ ౧౧౩॥

రాష్ట్రరక్షణము నీవక్ష్యమాణప్రకారముగ నిత్యముజేయవలయును లెస్సగారక్షించబడిన రాజ్యముగలరాజు సుఖముగా వృద్ధినొందును॥ ౧౧౩॥

మూ॥ ద్వయోస్త్రయాణాం పంచానాం మధ్యేగుల్మ మధిష్ఠితం।త
థా గ్రామశతానాంచకుర్యాద్రాష్ట్రస్యసంగ్రహం। ౧౧౪॥

రెండుగ్రామములకుగాని మూడుగ్రామములకుగాని నైదింటికిగాని నూటికిగాని మధ్యను రక్షించెడుభటులను సత్యపరుడగు నాయకునితో నిలపవలెను-యది రక్షాస్థానముగా జేయవలెను గౌరవలాఘవవిచారము కర్తవ్యము॥ ౧౧౪॥

మూ॥ గ్రామస్యాధిపతిం కుర్యాద్దశగ్రామపతింతథా।వింశతీశం
శతేశంచ సహస్రాధిపతింతథా॥ ౧౧౫॥

ఒకగ్రామమును మొదలుకొని పది యిరువది నూరు వేయిగ్రామములకధిపతులనేర్పరుపవలయును॥ ౧౧౫॥

మూ॥ గ్రామదోషాన్ సముత్పన్నాన్ గ్రామికశ్శనకైస్స్వయం।
శంసేద్గ్రామదశేశాయ దశేశో వింశతీశినే॥ ౧౧౬॥

మూ॥ వింశతీశస్తు తత్సర్వం శతేశాయ నివేదయేత్। శంసేద్గ్రా
మశతేశస్తు సహస్రపతయే స్వయం॥ ౧౧౭॥

ఈరెంటికినొకటే యర్థము గ్రామమందుబుట్టిన చోరాదిదోషములను గ్రామాధిపతి తానుదీర్చ నధికారముచాలనిచో దశగ్రామాధిపతికి తెలియజేయవలెనుఇటులెపైపైవారికి తెలియజేయుచుండి రేనిచోరాదికంటకోద్ధారమగును॥౧౧౬॥౧౧౭

మూ॥ యానిరాజప్రదేయాని ప్రత్యహంగ్రామవాసిభిః। అన్నపా
నేంధనాదీని గ్రామికస్తాన్యవాప్నుయాత్॥ ౧౧౮॥

ఏకగ్రామాధికృతునకువృత్తిని చెప్పుచున్నాడు ప్రతిదిననియమముచేరాజుకివ్వనిర్ణీతమగునన్నపానేంధనాదికమును గ్రామవాసులవలన గ్రామాధికృతుడు వృత్త్యర్థముపుచ్చుకోవలెను॥ ౧౧౮॥

మూ॥ దశీ కులంతు భుంజీత వింశీ పంచకులానిచ। గ్రామం గ్రా

మశతాధ్యక్షః సహస్రాధిపతిః పురం॥ ౧౧౯॥

"శ్లో॥ అష్టాగవంధర్మహలం షడ్గవంజీవితార్థినాం। చతుర్గవం గృహస్థానాం త్రిగవంబ్రహ్మఘాతినాం" అనిహారీతస్మృతివలన షడ్గవంమధ్యమం హలమని చెప్పుట వలన నాలుగువృషభములచేతననగా రెండునాగేళ్లచేతని దున్నబడెడుభూమికుల మనబడును దీనినిదశగ్రామాధిపతిజీవితార్థమనుభవించవలెను ఈప్రకారముగా వింశతిగ్రామాధిపతియైదుకులములననుభవించవలెను శతాధిపతిమధ్యమమగుగ్రామమునున్ను సహస్రాధిపతిమధ్యమనుగుపురమునున్ను అనుభవించవలెను॥ ౧౧౯॥

మూ॥ తేషాం గ్రామ్యాణి కార్యాణి పృథక్కార్యాణిచైవహి।
రాజ్ఞోన్యస్సచివస్స్నిగ్ధస్తాని పశ్యేదతంద్రితః॥ ౧౨౦॥

ఆగ్రామవాసులు మొదలగువారు పరస్పరమున్ను విరుద్ధములను బొందినచో నష్టికార్యములను జేసినదిన్ని కానిదిన్ని కనుగొని రాజుయొక్క సచివుడన్యుడలసుడు గాకుండ జేయవలయును॥ ౧౨౦॥

మూ॥ నగరే నగరేచైకంకుర్యాత్సర్వార్థచింతకం। ఉచ్చైస్థా
నం ఘోరరూపం నక్షత్రాణామివగ్రహం॥ ౧౨౧॥

ప్రతిపట్టణమందు నొక్కొక్కని కులాదులచే నుత్కృష్టునిన్ని ప్రధానరూపునిన్ని హస్త్యశ్వాదులచే భయంకరునిన్ని నక్షత్రాదులలో భార్గవాదిగ్రహమువలె తేజోవంతుని కార్యములను చూచెడివానిగా నగరాధిపతిని జేయవలెను॥ ౧౨౧॥

మూ॥ సతానసుపరిక్రామేత్సర్వానేవ సదాస్వయం। తేషాంవృ
త్తం పరిణయేత్సమ్యగ్రాష్ట్రేషు తచ్చరైః॥ ౧౨౨॥

ఆనగరాధికృతుడు గ్రామాధిపతిప్రభృతులచే కార్యములు నెరవేరనప్పుడు సైన్యముతో వెళ్లి వారికి సహాయుడు కావలెను- గ్రామాధిపతి మొదలుగా నగరాధిపతిపర్యంతమగు వారలయొక్క కార్యములందగు చేష్టలను చారులవలన ప్రజలయొక్క క్షేమముకొరకు రాజు లెస్సగా దెలుసుకొనవలెను॥ ౧౨౨॥

మూ॥ రాజ్ఞోహి రక్షాధి కృతాః పరస్వాదాయినశ్శఠాః। భృ
త్యాభవంతిప్రాయేణ తేభ్యోరక్షేదిమాఃప్రజాః॥ ౧౨౩॥

రాజుచేనధికృతులగువారు వంచనచే బ్రజలయొక్క సొమ్మును దరుచుగా నపహరింతురుగాన రాజుప్రజలను వారివలన పీడలేకుండ రక్షించవలెను॥ ౧౨౩॥

మూ॥ యే కార్యికేభ్యోర్థమేవ గృహ్ణీయుః పాపచేతసః । తే
షాం సర్వస్వ మాదాయ రాజాకుర్యాత్ప్రవాసనం॥౧౨౪॥

ఏరాజాధికృతులు కార్యార్థుల వలన లంచము పుచ్చుకుని ఛలము కల్పింతురో వారి సర్వస్వమును దోచుకుని రాజు వారినిస్వదేశము దాటించవలెను॥౧౨౪॥

మూ॥ రాజకర్మసు యుక్తానాం స్త్రీణాం ప్రేష్య జనస్యచ ।
ప్రత్యహం కల్పయే ద్వృత్తిం స్థానకర్మాను రూపతః॥ ౧౨౫॥

రాజోపయుక్తములగు కర్మములందు నియోగించబడిన దాసీలుమొదలగు స్త్రీలకును పనులనొనర్చు దాసజనమునకున్ను ఉత్తమమధ్యమాధమ స్థానానుసారముగానున్ను తత్కర్మానురూపముగానున్ను జీతములను నిర్ణయించవలెనుదానినే చెప్పుచున్నాడు॥ ౧౨౫॥

మూ॥ పణోదేయోపకృష్టస్య షడుత్కృష్టస్య వేతనం । షాణ్మా
సికస్తథాచ్ఛాదో ధాన్యద్రోణస్తు మాసికః॥ ౧౨౬॥

ఇల్లుతుడవడము నీళ్లు మొయ్యడము మొదలగు నపకృష్టకర్మమును జేయువానికి వక్ష్యమాణలక్షణమగు నొక పణము ప్రతిదినము నివ్వవలెను ఆరుమాసములకు రెండుబట్టలునిప్పించవలెను॥ "శ్లో॥ అష్టముష్టిర్భవేత్కించిత్కించిదష్టౌ చ పుష్కలం పుష్కలాని తు చత్వారి ఆఢకః పరికీర్తితః । చతురాఢకో భవేద్ద్రోణ ఇతి॥" ఎనిమిది పిడికిళ్ల ధాన్యము "కించిత్" అనిన్ని యెనిమిది కించిత్తులు పుష్కలమనిన్ని నాలుగు పుష్కలములాఢకమనిన్ని నాలుగాఢకములు ద్రోణమనిన్ని చెప్పబడెను యీలెక్కచే నొకద్రోణము ధాన్యను ప్రతిమాసమునందు నొసగవలయును- ఉత్కృష్టునకు భృతిగానారుపణములున్ను కట్టుకొనుట కారునెలలకారువస్త్రయుగ్మములును మాసమునకారుద్రోణముల ధాన్యమును నొసగవలయును యీలెక్కనే మధ్యమునకు మూడుపణములు భృతిన్ని యారునెలకు మూడువస్త్రలును నెలకు మూడుద్రోణములు ధాన్యమును నివ్వవలయును॥ ౧౨౬॥

మూ॥ క్రయవిక్రయ మధ్వానం భక్తంచ సపరివ్యయం । యోగ

క్షేమంచ సంప్రేక్ష్య వణిజో దాపయేత్కరాన్ ॥౧౨౭॥

ఎంతమూల్యమునకు కొనబడెనో వస్త్రలవణాదిద్రవ్యము - ఇచ్చట నమ్మితే నెంతలాభించునో యెంతదూరమునుంచి తేబడెను యెంతసామ్ము భత్యాకచ్చాలు మొదలగు వాటికై తగులబడియ్యెనో అరణ్యాదిప్రదేశములందు చోరాదులవలన రక్షార్థమైనయగు వ్యయమెంతో కొనకులాభమెంతో చూచి వర్తకునివలన పన్ను నిర్ణయింపవలెను॥ ౧౨౭॥

మూ॥ యథాఫలేన యుజ్యేత రాజాకర్తాచ కర్మణాం । తథా
వేక్ష్య నృపో రాష్ట్రే కల్పయేత్సతతం కరాన్॥ ౧౨౮॥

అవేక్షణాది కర్మములయొక్కయున్ను కృషివాణిజ్యాది కర్మములయొక్క కర్తయున్ను వాటివాటివలన ఫలము నేరీతినొందునో తత్ప్రకారముగ రాజుపరిశీలించి పన్నులనెల్లప్పుడు విధించవలెను॥ ౧౨౮॥

మూ॥ యథాల్పాల్పమదం త్యాద్యం వార్యోకో వత్సషట్పదాః । త
థాల్పాల్పో గృహీతవ్యో రాష్ట్రా ద్రాజ్ఞాబ్దికః కరః॥౧౨౯॥

జెలగ రక్తమును గోవత్సదుగ్ధమును తుమ్మెదలు మకరందమును నేలాగు స్వల్పస్వల్పము స్వీకరించునోయట్లు తే రాజురాష్ట్రమువలన మూలధనచ్ఛేదముగాకుండ నేటేట రాదగిన పన్నును రాబట్టవలెను దానినే చెప్పుచున్నాడు॥ ౧౨౯॥

మూ॥ పంచాశద్భాగ ఆదేయో రాజ్ఞా పశు హిరణ్యయోః । ధా
న్యానామష్టమో భాగః షష్ఠో ద్వాదశ ఏవవా॥ ౧౩౦॥

మూలముకంటెనధికములగు పశుహిరణ్యములయందు నేబదవపాలునున్ను ధాన్యములయొక్క యారవపాలునైన నెనిమిదవపాలునైన రాజుపుచ్చికొనవలెనుభూమియొక్క యుత్తమాదిభేదముచేతనున్ను కర్షకక్లేశ తారతమ్యముచేతనున్ను షష్ఠభాగాదివికల్పము॥ ౧౩౦॥

మూ॥ ఆదదీతాథ షడ్భాగం ద్రుమాంస మధుసర్పిషాం । గం
ధౌషధిరసానాంచ పుష్పమూల ఫలస్యచ॥ ౧౩౧॥
పత్రశాక తృణానాంచ చర్మణాం వైదళస్యచ । మృణ్మ

యానాంచ భాండానాం సర్వస్యాశ్మ మయస్యచ॥ ౧౩౨॥

ఇచ్చట ద్రుశబ్దము వృక్షవాచకము ఇదిమొదలుకొని పదారింటికిని శిలామయ ములకున్ను వచ్చినలాభములో నారవభాగమున్ను బుచ్చికొనవలెను॥౧౩౧॥౧౩౨

మూ॥ మ్రియమాణోప్యాదదీత నరాజా శ్రోత్రియాత్కరం। నచ
క్షుధాస్య సంసీదే చ్ఛ్రోత్రియో విషయేవసన్॥ ౧౩౩॥

ధనములేక రాజెంతక్షీణించినను శ్రోత్రియబ్రాహ్మణునివలన పన్నును బుచ్చి కొనగూడదు ఈరాజుయొక్క రాజ్యమందు శ్రోత్రియుడాకలిచే నీరసించగూడదు॥

మూ॥ యస్యరాజ్ఞస్తు విషయె శ్రోత్రియస్సీదతిక్షుధా। తస్యాపి
తత్క్షుధారాష్ట్రమచిరేణైవసీదతి॥ ౧౩౪॥

ఏరాజుయొక్క దేశమందు శ్రోత్రియుడాకలిచే నీరసించునో యారాజుయొ క్క రాజ్యము శీఘ్రముగా దుర్భిక్షాదులచే నీరసించును॥ ౧౩౪॥

మూ॥ శ్రుతవృత్తే విదిత్వాస్య వృత్తింధర్మ్యాంప్రకల్పయేత్।
సంరక్షేత్సర్వ తశ్చైనం పితాపుత్ర మివౌరసం॥ ౧౩౫॥

శాస్త్రజ్ఞానమున్ను నడువడిన్ని దెలిసి శ్రోత్రియునకు ధర్మమగువృత్తిని రాజు కల్పించవలెను చోరాదిపీడలేకుండ నెల్లవిధములచేతనున్ను తండ్రి పుత్రునివలె ర క్షించవలెను॥ ౧౩౫

మూ॥ సంరక్ష్యమాణో రాజ్ఞాయం కురుతే ధర్మమన్వహం।
తేనాయుర్వర్ధతే రాజ్ఞో ద్రవిణం రాష్ట్రమేవచ॥ ౧౩౬॥

రాజుచే రక్షణముచేయబడుచున్న శ్రోత్రియుడు ప్రత్యహమును ధర్మమాచ రించు నందుచేనీరాజునకాయుర్దాయముధనమున్ను రాజ్యమున్ను వృద్ధిబొందును॥

మూ॥ యత్కించిదపి వర్షస్య దాపయేత్కర సంజ్ఞితం। వ్యవ
హారేణ జీవంతం రాజారాష్ట్రే పృథగ్జనం॥ ౧౩౭॥

కూరమొదలగునవి యమ్ముకొని బ్రతికెడువారలకున్ను సంవత్సరపుపన్నుకొం చము రాజు విధించవలెను॥ ౧౩౭॥

మూ॥ విక్రోశంత్యో యస్య రాష్ట్రా ద్ధ్రియంతే దస్యుభిః ప్రజాః। సం
పశ్యత స్సభృత్యస్య మృతస్స నతు జీవతి॥ ౧౪ ॥

మంత్రియుక్తుడగు రాజు చూచుచునుండఁగా చోరాదులచేనెవని ప్రజలు మొఱ్ఱలుబె
ట్టుచు క్షీణింపజేయబడుదురో యారాజు బ్రతికియుండియును మృతుఁడై యగుచు
న్నాఁడు॥ ౧౪౩॥

మూ॥ క్షత్రియస్య పరో ధర్మః ప్రజానామేవ పాలనం।నిర్దిష్ట ఫ
లభోక్తాహి రాజా ధర్మేణ యుజ్యతే॥ ౧౪౪॥

రాజులకితరధర్మములకంటె బ్రజాపాలనమే శ్రేష్ఠమయినధర్మము శాస్త్రోక్త
మగుపన్నుమొదలగు ఫలమునను భవించెడురాజు ధర్మమును బొందును॥ ౧౪౪॥

మూ॥ ఉత్థాయ పశ్చిమే యామే కృతశౌచ స్సమాహితః।హుతా
గ్నిర్బ్రాహ్మణాం శ్చార్చ్య ప్రవిశేత్ససభాం శుభాం॥౧౪౫॥

మూ॥ ఆరాజు ఉషఃకాలమందులేచి శౌచాచారమును దీర్చి సమాహితుఁడై
హోమమొనర్చి బ్రాహ్మణపూజజేసి వాస్తులక్షణాద్యుపేతమగు సభనమా
త్యాదిదర్శనార్థము ప్రవేశించవలెను॥ ౧౪౫॥

మూ॥ తత్రస్థితః ప్రజా స్సర్వాః ప్రతినంద్య విసర్జయేత్। విసృ
జ్యచ ప్రజాస్సర్వా మంత్రయే త్సహమంత్రిభిః॥ ౧౪౬॥

ఆసభయందుండి దర్శనార్థమువచ్చియున్న ప్రజలను దర్శనసంభాషణాదు
లచే సంతోషింపజేసి వారినంపి మంత్రులతో సంధివిగ్రహాదులనాలోచించవలెను॥

మూ॥ గిరిపృష్ఠం సమారుహ్య ప్రాసాదం వారహోగతః। అర
ణ్యే నిశ్శలాకే వా మంత్రయే దవిభావితః॥ ౧౪౭॥

గిరిపృష్ఠమందైనను నిర్జనారణ్య సౌధాదులయందునయిన మంత్రభేదముగా
కుండ కర్మములయారంభోపాయంబును పురుషద్రవ్యసంపత్తియు దేశకాలవిభా
గంబును విపత్తిప్రతీకారంబును కార్యసిద్ధియునను పంచాంగమంత్రంబు జింతింపవ
లయు॥ ౧౪౭

మూ॥ యస్యమంత్రం నజానంతి సమాగమ్య పృథగ్జనాః । సకృ
త్స్నాం పృథివీం భుంక్తే కోశహీనోపి పార్థివః ॥౧౪౮॥

ఏరాజుయొక్క మంత్రులవలన మయిజనులామంత్రమును నెఱుగకుందురో యారా
జు కోశరహితుడయినను సకలభూమిని శాసించును॥ ౧౪౮॥

మూ॥ జడమూకాంధ బధిరాం స్తైర్యగ్యోనాన్ వయోతిగాన్ ।
స్త్రీ మ్లేచ్ఛ వ్యాధిత వ్యంగాన్ మంత్రకాలే ప్రసారయేత్ ।౧౪౯॥

బుద్ధివాక్చక్షుః శ్రోత్రవికలులగు వారినిన్ని తిర్యగ్జంతువులగు శుకశారికాదులను
న్ను అతివృద్ధస్త్రీ మ్లేచ్ఛరోగ్యంగహీనులనున్ను మంత్రాలోచనకాలమందు దూర
ముగ దొలగజేయవలయును॥ ౧౪౯॥

మూ॥ భిందంత్యవమతా మంత్రం తైర్యగ్యోనా స్తథైవచ । స్త్రి
యశ్చైవ విశేషేణ తస్మాత్తత్రా దృతోభవేత్॥ ౧౫౦॥

పూర్వ జన్మదుష్కృతముచే మూకాంధతకాదిజడభావమును పొందియుండు
వారల నధార్మికత్వముచే నవియుండినసేమి యనినిర్లక్ష్యపెట్టినవవి మంత్రభేద
మునొనర్చును వృద్ధులును స్త్రీలును చాపల్యముచే మంత్రమును వెల్లడిపరుతురు
గావున వీరినెల్లను మంత్రస్థానమందు లేకుండం జేయవలెను॥ ౧౫౦॥

మూ॥ మధ్యందినే ర్ధరాత్రేవా విశ్రాంతో విగతక్లమః । చింత
యే ద్ధర్మకామార్థాన్ సార్థం తై రేక ఏవవా॥౧౫౧॥

మధ్యాహ్నమందునైన నర్ధరాత్రమందునైన శారీరమానసరుజలు లేకుండ స్వ
స్థముగనుండి యామంత్రులతో గూడినైన నొంటరినైన ధర్మార్థకామముల
నాలోచించవలెను॥ ౧౫౧॥

మూ॥ పరస్పర విరుద్ధానాం తేషాంచ సముపార్జనం । కన్యా
నాం సంప్రదానంచ కుమారాణాంచ రక్షణం॥ ౧౫౨॥

ఆ ధర్మార్థకామములు తరుచుగా పరస్పరవిరుద్ధములుగావున వానిలోనొ
కటి నొకటిబాధింపకుండ త్రివర్గము నార్జించెడు వలననున్ను కన్యలకు వివా
హకార్యముల విషయమును పుత్రులు నీతిమంతులగునట్లు శిక్షావిషయమునను

యమునున్ను చింతింపవలెను॥ ౧౫౨॥

మూ॥ దూతసంప్రేషణంచైవ కార్యశేషం తథైవచ । అంతఃపు
ర ప్రచారంచ ప్రణిధీనాంచ చేష్టితం॥ ౧౫౩॥

తహ పాల్యర్థలేఖలు పట్టుకుని వెళ్ళడము మొదలగు వాటితో దూతలనుపరరాష్ట్రములకనుపుటయున్ను ఆరంభించిన కార్యముల శేషకృత్యమున్ను స్త్రీలతివిషయచేష్టితల దెల్పన॥ "శ్లో॥ శస్త్రేణ వేణీ వినిగూహితేన విదూరథం వై మహిషీ జఘాన । విషప్రదిగ్ధేన చ నూపురేణ దేవీ విరక్తా కిల కాశిరాజం॥" జడయందు మాటుగా నుంచబడిన ఖడ్గముచే విదూరథుని యొక్క భార్యయనియెడు గరళము పూసి యుంచినచే విరక్తయగు కాశిరాజు పత్ని యతనిని జంపెనట యదిగాన నంతఃపుర స్త్రీజనముయొక్క చేష్టలను సఖీదాస్యాదులవలన పరిశీలించడమున్ను పంపబడిన చారులకును శత్రురాజులకును సంబంధముండునను సంశయనివృత్తికై వారిచేష్టలను మఱికొందరి చారులవలన నెరిగికొనుటయు విషయమ్మునుం జింతించవలెను॥

మూ॥ కృత్స్నంచాష్టవిధం కర్మ పంచవర్గంచ తత్త్వతః । అ
నురాగాపరాగౌచ ప్రచారం మండలస్యచ॥ ౧౫౪॥

అష్టవిధమగు కర్మమును సమగ్రముగ జింతించవలెను- శుక్రనీతి॥ "శ్లో॥ ఆదానేచ విసర్గేచ తథా ప్రేషనిషేధయోః। పంచమే చార్థవచనే వ్యవహారస్య చేక్షణే। దండశుద్ధ్యో స్సదాయుక్త స్తేనాష్టగతికో నృపః । అష్టకర్మా దివంయాతి రాజా శక్రాభిపూజితః॥" పన్నులు మొదలగు వాటిని గ్రహించడము దానము భృత్యాదుల కర్థమిచ్చుట విసర్గము దృష్టాదృష్టానుష్ఠానమందమాత్యాదులను నియమించుట ప్రేషము దృష్టాదృష్టవిరుద్ధక్రియలయందు నియోగించకుండుట నిషేధము కార్యసందేహమందు రాజాజ్ఞ చేతనే నిర్ణయమును నియమమర్థవచనము ప్రజలయొక్క ఋణాదానాది వివాదములను బరిహరించుట వ్యవహారావేక్షణము పరాజితులవల ననిశ్చితశాస్త్రోక్త ధనగ్రహణము దండము పాపము జేసినవారలకు యథోక్తముగ ప్రాయశ్చిత్తమును విధించుట శుద్ధి- ఇచ్చట మేధాతిథి అకృతారంభము కృతానుష్ఠానమున్ను చేయబడిన దానిని విశేషింపజేయుటయు చేసినకర్మముయొక్క ఫలసంగ్రహము సామదానభేద దండములును నీయెనిమిదియు నష్టవిధకర్మమనెను ఇట్లుగాక వర్తకపథము సమపురట నీటిబూధారములను కట్టించుటకోటకట్టించుట

చారంచ శత్రోశ్చైవ ప్రయత్నతః॥ ౧౫౫॥

అరివిజిగీషులయొక్క భూమ్యనంతరుడును సంహతులగుచుండ ననుగ్రహసమర్థుడును నసంహతులగుచుండ నిగ్రహసమర్థుడునగు రాజు మధ్యముడతనియొక్క ప్రచారమునున్ను ప్రజ్ఞోత్సాహగుణప్రకృతిసమర్థుడు విజిగీషుడతనియొక్క చేష్టనున్ను విజిగీషుమధ్యములు సంహతులై రేని యనుగ్రహమందును నసంహతులై రేని నిగ్రహమందును సమర్థుడగువాడుదాసీనుడు ఇతనియొక్క ప్రచారమునున్ను సహజాకృత్రిమభూమ్యనంతరులగు ద్రివిధశత్రుప్రచారమునున్ను మిక్కిలిప్రయత్నముచే చింతించవలెను॥ ౧౫౫॥

మూ॥ ఏతాః ప్రకృతయో మూలం మండలస్య సమాసతః। అష్టౌ
చాన్యాస్సమాఖ్యాతా ద్వాదశైవతు తాస్స్మృతాః॥ ౧౫౬॥

ఈ చెప్పబడిన మధ్యమాదులునలుగురు ప్రకృతులు సంక్షేపముగా మండలమునకుమూలము చెప్పబోయెడి యితరప్రకృతులకాద్యులు గావున మూలమని చెప్పబడిరి అన్యులైనమండ్రినగా శత్రుమాములకుముందు క్రమముగా మిత్రారిమిత్రమిత్రమిత్రమిత్రారిమిత్రులననలుగురు ప్రకృతులగుచున్నారు వెనుకవైపుపార్ష్ణిగ్రాహాక్రంద పార్ష్ణిగ్రాహాసారాక్రందాసారులునలుగురు ఇట్లెనమండ్రుప్రకృతులైరి మున్నుచెప్పబడినమధ్యమాదివిజిగీషూదాసీనులునలుగురు ప్రధానమూల ప్రకృతులు కలసినపదిరెండుప్రకృతులుగా వీరుచెప్పబడిరి॥ ౧౫౬॥

మూ॥ అమాత్యరాష్ట్రదుర్గార్థదండాఖ్యాః పంచచాపరాః।
ప్రత్యేకం కథితా హ్యేతా స్సంక్షేపేణ ద్విసప్తతిః॥ ౧౫౭॥

పైనిచెప్పబడినమూలప్రకృతులు నలుగురు శాఖాప్రకృతులెనమండ్రుకలసి పదిరెండుప్రకృతులు వీరికి ప్రత్యేకముగానమాత్య దేశ దుర్గ దండాఖ్యద్రవ్య ప్రకృతులైదేసిచొప్పుననరువదియయ్యెనామూలప్రకృతిశాఖాప్రకృతులుపదిరెండునుంగలసి సంక్షేపముగ డెబ్బదిరెండుప్రకృతులని మునులచే చెప్పబడెను॥ ౧౫౭॥

మూ॥ అనంతర మరిం విద్యా దరిసేవన మేవచ। అరేరనంతరం
మిత్ర ముదాసీనం తయోః పరం॥ ౧౫౮॥

విజిగీషునియొక్క భూమ్యనంతరుడు శత్రుప్రకృతిగా దెలియవలెను వానినిసే

లించెడువానికిన్ని యరిప్రకృతినిగానే తెలియవలెను అరికి నంతరుఁడు విజిగీషునకు ముఖ్యమగు మిత్రప్రకృతినిగా తెలియవలెను అర్యరిమిత్రులకనంతరుఁడగువాఁడు విజిగీషున కుదాసీన ప్రకృతినిగా తెలియవలెను ఈప్రకృతులకే అగ్రపశ్చాద్భాగభేదముచే వ్యపదేశభేదము అందునగ్రవర్తికి అరివ్యపదేశము వెనుక నున్నవాని కరివ్య ముండినను పార్ష్ణిగ్రాహవ్యపదేశము వ్యపదేశమనగా పేరుపెట్టిచెప్పుట॥ ౧౫౮॥

మూ॥ తాన్ సర్వానభిసందధ్యాత్సామాదిభిరుపక్రమైః। వ్యస్తై
శ్చైవ సమస్తైశ్చ పౌరుషేణ నయేనచ॥ ౧౫౯॥

ఆరాజులనందరిన్ని సామాద్యుపాయములన్నిటిచేతనుగాని కొన్నిటిచేతనైనను దనకు వశులనుగా చేయవలెను కేవల దండముచేనైన నీతిచేనైనను॥ "శ్లో॥ సామదండౌ ప్రశంసంతి నిత్యం రాష్ట్రాభివృద్ధయే॥" నయమనగ సామము దండమనగ యుద్ధమీరెండును రాష్ట్రాభివృద్ధికి ముఖ్యములనబడెను॥ ౧౫౯॥

మూ॥ సంధించ విగ్రహంచైవ యానమాసనమేవచ। ద్వైధీభావం
సంశ్రయంచ షడ్గుణాంశ్చింతయేత్సదా॥ ౧౬౦॥

చతురంగబలముతో దామన్యోన్యోపకారమున కొకటియై యుండుమని నియమబంధముసంధి వైరాచరణాధిక్యము విగ్రహము శత్రునిపైకి యుద్ధయాత్రయానము ఉపేక్షణమాసనము స్వార్థసిద్ధికై బలమునొకటిద్విధాకరణము ద్వైధీభావము శత్రుపీడితుఁడగురాజు ప్రబలుఁడగు రాజాంతరము నాశ్రయించుట సమాశ్రయము తనకుపకారకములగు నీగుణముల నారింటిని సంతతమును జింతించవలెనే గుణమునుచేతనకు వృద్ధిన్ని రిపునకు క్షయమునగునో యాగుణము నాశ్రయించవలెను॥ ౧౬౦॥

మూ॥ ఆసనంచైవ యానంచ సంధిం విగ్రహమేవచ। కార్యం వీక్ష్య
ప్రయుంజీత ద్వైధం సంశ్రయ మేవచ॥ ౧౬౧॥

సంధ్యాదిగుణముల యపేక్షలేకుండ ననుష్ఠానము జెప్పబడెనుతదుచితానుష్ఠానార్థమీయారంభము ఆత్మవృద్ధిపరహాన్యాది కార్యమునుచూచి యాసనవిగ్రహయానద్వైధీభావసంశ్రయములలో నొకనితోసంధియు నొకనితో విగ్రహమునిట్లాచరించవలెను॥ ౧౬౧॥

మూ॥ సంధింతు ద్వివిధం విద్యా ద్రాజావిగ్రహమేవచ। ఉభేయా
నాసనే చైవ ద్వివిధ స్సంశ్రయస్స్మృతః॥ ౧౬౨॥

సంధ్యాదిగుణషట్కమును ద్విప్రకారమని తెలియవలెను ఇదియవిషయార్థము॥

మూ॥ సమానయానకర్మాచ విపరీత స్తథైవచ। తదాత్వాయతి
సంయుక్త స్సంధి ర్జ్ఞేయో ద్విలక్షణః॥ ౧౬౦॥

తాత్కాలికఫలలాభార్థమైన నుత్తరకాలఫలలాభార్థమైన నొకరాజుతో కూడ సన్యునిపైకి యుద్ధయాత్రాదికర్మమేదిజేయబడునో యది సమానయానకర్మమనుసంధిఇప్పటిఫలమునకైననుత్తరకాలఫలమునకైననీవారాజుమీదికివచ్చినప్పటికి నేనువచ్చెదనని యేదిచేయబడునో యాదియసమాయానకర్మము ఇది ద్విప్రకారముగు సంధియని తెలియతగ్గది॥ ౧౬౩॥

మూ॥ స్వయంకృతశ్చ కార్యార్థ మకాలే కాలఏవవా।మిత్రస్య
చైవాపకృతే ద్వివిధో విగ్రహస్స్మృతః॥ ౧౬౪॥

శత్రుజయము కొరకు శత్రువ్యసనాదికమును దెలిసి వక్ష్యమాణమగు మార్గశీర్షవ్యతిరిక్తకాలమందైననుక్తకాలమందైన తానేజేసినదిన్ని మిత్రునకపకారముచేసినవానితో మిత్రరక్షార్థముచేసినదిన్ని విగ్రహము రెండు ప్రకారములు పరునకెవడు శత్రువో వాడు విజిగీషునకు మిత్రుడతనిచే నపకారము చేయబడినచో నట్టివ్యసనమందు చేయబడినది యని గోవిందరాజు "మిత్రేణచైవాపకృతః" యని పఠించి వ్యాఖ్యచేసెను మేధాతిథిప్రభృతులు దీనినే వ్రాసిరి॥ ఇదిన్ని నాచే నంగీకరించబడెనని కుల్లూకభట్టువ్రాసెను॥ ౧౬౪॥

మూ॥ ఏకాకిన శ్చాత్యయికే కార్యే ప్రాప్తే యదృచ్ఛయా।సంహ
తస్యచ మిత్రేణ ద్వివిధం యాన ముచ్యతే॥ ౧౬౫॥

దైవవశముచే శత్రునకు వ్యసనాదికము తటస్థమైనప్పుడు శక్తిగలవాడేకాకి యుద్ధమునకు బోవడమున్ను అశక్తుడైతే మిత్రసహాయుడై పోవడమున్ను యానముద్వివిధము॥ ౧౬౫॥

మూ॥ క్షీణస్యచైవక్రమశో దైవాత్పూర్వకృతేనవా। మిత్రస్యచా

సురోధేన ద్వివిధం స్మృతమాసనం॥ ౧౬౬॥

జన్మాంతరమందుగాని యీజన్మమందుగాని జేయబడినపాపముచే బలమున్ను కోశమున్ను క్షీణించినవానికిన్ని సమృద్ధిగలవానికిన్ని మిత్రానురోధముచేనతనికా ర్యార్థమాసనము రెండువిధములని మునులచే జెప్పబడెను॥ ౧౬౬॥

మూ॥ బలస్య స్వామినశ్చైవ స్థితిః కార్యార్థసిద్ధయే। ద్వివిధం
కీర్త్యతే ద్వైధం షాడ్గుణ్యగుణవేదిభిః॥ ౧౬౭॥

సాధించదగిన స్వప్రయోజనసిద్ధికొరకు సేనాధిపతితో చతురంగబలము నొక చో శత్రుకృతోపద్రవవారణార్థముంచుటయు మరియొకచో కోటయందుకొంత సైన్యముతో రాజుండడమున్ను ద్వైధీభావము ద్వివిధమని షాడ్గుణ్యగుణోపకార వేత్తలచే జెప్పబడెను॥ ౧౬౭॥

మూ॥ అర్థసంపాదనార్థంచ పీడ్యమానస్య శత్రుభిః। సాధుషు
వ్యపదేశార్థం ద్వివిధః సంశ్రయస్స్మృతః॥ ౧౬౮॥

శత్రువులచే పీడితుడగువాని కాపీడను దొలగించుకొనుటకును పీడలేకుండి, ముందు శత్రుపీడ గలుగునని బలవంతుడగు రాజు నాశ్రయించెనని ప్రకటనార్థ మాశ్రయించుటయు నను రెండుతెరగులు సమాశ్రయము జెప్పబడెను॥ ౧౬౮॥

మూ॥ యదావగచ్ఛేదాయత్యా మాధిక్యం ధ్రువ మాత్మనః। తదా
త్వేచాల్పికాం పీడాం తదా సంధింసమాశ్రయేత్॥ ౧౬౯॥

ఎప్పుడు తనకుముందు గొప్పధనాదిలాభముకలుగునని తెలుసుకొనునో అప్పు డు కొంచవు ధనక్షయమునకంగీకరించియైన సంధినాశ్రయించవలెను॥ ౧౬౯॥

మూ॥ యదా ప్రకృష్టా మన్యేత సర్వాస్తు ప్రకృతీ ర్భృశం। అత్యు
చ్ఛ్రితం తథాత్మానం తదా కుర్వీత విగ్రహం॥ ౧౭౦॥

ఎప్పుడు దానసమ్మానాదులచే నమాత్యాదులు సంతుష్టులైయున్నట్టు తెలిసి కొనునో చతురంగబలమున్ను కోశమున్ను వృద్ధిగానుండుటచే తాను శక్తిత్రయ సంపన్నుడై యుండునప్పుడు విగ్రహము నాశ్రయించవలెను॥ ౧౭౦॥

మూ॥ యదా మన్యేత భావేన హృష్టం పుష్టం స్వకం బలం। పరస్య
విపరీతంచ తదాయాయాద్రిపుంప్రతి॥ ౧౭౧॥

ఎప్పుడు తనసైన్యము హర్షయుక్తమై ధనాదికముచే పుష్టిగలిగి యుండునో శత్రుసైన్యము విపరీతమనగా క్షీణించియుండునో యది తెల్లగా దెలిసి యతనిపై కి యుద్ధయాత్రకుబోవలయును॥ ౧౭౧॥

మూ॥ యదాతుస్యాత్పరిక్షీణో వాహనేన బలేనచ। తదాసీత
ప్రయత్నేన శనకైస్సాంత్వయన్ రిపూన్॥ ౧౭౨॥

ఎప్పుడు హస్త్యశ్వాదివాహనమున్ను అమాత్యాదులున్ను సైన్యము క్షీణించి యుండునో యప్పుడు సామముచేతనున్ను కానుకలు మొదలగునవి యిచ్చుచు ప్రయత్నమున శత్రుని మందళించుచునాసనము నాశ్రయించవలెను॥ ౧౭౨॥

మూ॥ మన్యేతారిం యదారాజా సర్వదా బలవత్తరం। తదా ద్విధా బలం కృత్వా సాధయేత్కార్య మాత్మనః॥ ౧౭౩॥

ఎప్పుడు రాజు తనశత్రువు సర్వవిధములచేతనున్ను బలవంతుడైసంధికసాధ్యుడై యుండెనని తెలియునో యప్పుడుకొంతసైన్యముతో తాను దుర్గమునాశ్రయించి యుండి కొంతసైన్యమును బంపిశత్రువిరోధమునాచరించవలెను ఇట్లుబలము రెండు తెరగులానర్చి మిత్రసంగ్రహాదిస్వకార్యమునుసాధించవలెను॥ ౧౭౩॥

మూ॥ యదా పరబలానాంతు గమనీయతమో భవేత్। తదాతు
సంశ్రయేత్ క్షిప్రం ధార్మికం బలినం నృపం॥ ౧౭౪॥

ఎప్పుడమాత్యాదికోపముచే శత్రువునకు తాను మిక్కిలిగ్రాహ్యుడగునో యప్పుడు తాను బలమును రెండుభాగములొనర్చి దుర్గమునాశ్రయించుటచే నాత్మరక్షణమొనర్చుచు శీఘ్రముగధార్మికుడును బలవంతుడునగు రాజు నాశ్రయించవలెను॥ ౧౭౪॥

మూ॥ నిగ్రహం ప్రకృతీనాంచ కుర్యాద్యోరిబలస్యచ। ఉపసేవేత తం నిత్యం సర్వయత్నైర్గురుం యథా॥ ౧౭౫॥

తనయొక్కయు అమాత్యాదిప్రకృతులకోపముచేతను శత్రువునకు గ్రాహ్యు

డాయెనో యేశత్రుబలము తనపైవచ్చుటచేత తనకు భయముత్పన్నమాయెనో యట్టివారిని నిగ్రహించుటకుసమర్థుఁడగురాజును గురువ్రనువలె సర్వప్రయత్నములచేతనున్ను సర్వదా సేవించవలెను॥ ౧౭౫॥

మూ॥ యది తత్రాపి సంపశ్యే ద్దోషం సంశ్రయ కారితం । సు
యుద్ధమేవ తత్రాపి నిర్విశంక స్సమాచరేత్॥ ౧౭౬॥

అగతికునకుఁగదా సంశ్రయమను అచ్చటగూడ సంశ్రయకృతదోష మగుపడెనేని యప్పుడు నిశ్శంకముగ శోభనమగు యుద్ధమే చేయవలెను-యుద్ధమందు దుర్బలునకుగూడ జయమొకప్పుడుగలుగును లేదా శాశ్వతస్వర్గమైనను గలుగును॥ ౧౭౬॥

మూ॥ సర్వోపాయై స్తథా కుర్యా న్నీతిజ్ఞః పృథివీపతిః। యథా
స్యా భ్యధికా నస్యు ర్మిత్రోదాసీన శత్రవః॥ ౧౭౭॥

సామాద్యుపాయము లన్నిటిచేతనున్ను నీతిజ్ఞుఁడగురాజు యేలాగునైతే మిత్రోదాసీనశత్రురాజులు తనకంటె నధికులుగారో యట్లుజేయవలెను యట్లుగాకున్న వారిచే నెప్పుడైనదాబట్టుబడును ధనలోభముచే మిత్రునకునునట్టి బుద్ధిబుట్టును॥

మూ॥ ఆయతిం సర్వకార్యాణాం తదాత్వంచ విచారయేత్। అ
తీతానాంచ సర్వేషాం గుణదోషౌచ తత్వతః॥ ౧౭౮॥

సర్వకార్యములకు నల్పములగువాటికిన్ని యుత్తరకాలమందగు గుణమునుదోషమునున్ను అతీతములగువాటియొక్కయు ననగా యెట్లేవిచేయబడెనో యేది విఘటితమాయెనో శేనికేమియవశిష్టమై సేయదగియుండెనో యీయంతయు నున్నట్టుగాను విచారించవలెను శీఘ్రఫలప్రదముగావున వర్తమానకాలీనమునున్ను విచారించవలెను॥ ౧౭౮॥

మూ॥ ఆయత్యాం గుణదోషజ్ఞ స్తదాత్వే క్షిప్రనిశ్చయః। అతీతే
గుణదోషజ్ఞ శ్శత్రుభి ర్నాభిభూయతే॥ ౧౭౯॥

ఏరాజు కార్యములయొక్క యాగామిగుణదోషజ్ఞుఁడో యుతండు గుణయుక్తముగు దానినిజేయును సదోషమునువిడుచును వర్తమానకార్యగుణదోషజ్ఞుడు శీఘ్రముగ కార్యమొనర్చును అతీతకార్యములజెవఁడు కార్యశేషమునెరుఁగునో యతండా.

కార్యాంతమందు తత్ఫలంబునొందును ఈప్రకారముగ కాలత్రయసావధానుఁడగు లచే నభిభూతుఁడు గాఁడు యింకనింత యేల॥ ౧౭౯॥

మూ॥ యథైనం నాభిసందధ్యు ర్మిత్రోదాసీన శత్రవః। తథాసర్వం సంవిదధ్యా దేష సామాసికో నయః॥ ౧౮౦॥

ఈరాజును మిత్రాదులేలాగునైతే బాధించకుందురో యట్లుసంవిధాన మొన ర్పవలెనిది సర్వనీతిసంగ్రహము॥ ౧౮౦॥

మూ॥ యదాతు యాన మాతిష్ఠే దరిరాష్ట్రం ప్రతిప్రభుః। తదా నేన విధానేన యాయా దరిపురం శనైః॥ ౧౮౧॥

ఎప్పుడైతే శక్తియుక్తుఁడై శత్రురాజ్యముపైకి దండెత్తిపోవునో యప్పుడీవక్ష్య మాణప్రకారముగ శత్రుదేశమును మెల్లగబోవలెను॥ ౧౮౧॥

మూ॥ మార్గశీర్షే శుభేమాసి యాయాద్యాత్రాం మహీపతిః। ఫాల్గునంవాథ చైత్రంవా మాసౌప్రతి యథాబలం॥౧౮౨॥

ఏరాజు కరితురగరథాదులతో విలంబముగ బోవునో యతండు హైమంతస స్యభరితమగు పరరాష్ట్రమునకు శుభమగుమార్గశీర్షమాసమందు బోవలయు ను ఏరాజతివేగముగబోవసమకట్టునో యతండు సర్వసస్యసంపన్నమగు ఫాల్గున చైత్రంబులలో స్వబలోపయోగకాలను నతిక్రమించకుండ యాత్రజేయవలెను॥ శ్లో॥"యదాసస్యగుణోపేతం పరరాష్ట్రం తదావ్రజేత్॥ ౧౮౨॥

మూ॥ అన్యేష్వపితు కాలేషు యదాపశ్యే ద్ధ్రువం జయం। తదా యాయా ద్విగృహ్యైవ వ్యసనేచో ద్థితేరిపోః॥ ౧౮౩॥

ఉక్తేతరకాలములందైనను యెప్పుడు తనకు జయమునిశ్చయముగ నగునని తె లుసుకొనునో యప్పుడు స్వబలయోగ్యకాలమగు గ్రీష్మాదికమునందునైన చతు రంగబలయుక్తుఁడై విగ్రహించి యాత్రచేయవలెను అమాత్యాదులు శత్రురాజు యొక్క-దండపారుష్యాదికముచే వికటించి శత్రుపక్షమువలె నగుచుండనట్టిచో నే కాలమందు నయిన యానముజేయవలెను॥ ౧౮౩॥

మూ॥ కృత్వా విధానం మూలేతు యాత్రికంచ యథావిధి। ఉ

పగృహ్యా స్పదంచైవ చారాన్ సమ్య గ్విధాయచ॥౧౮౪॥
సంశోధ్య త్రివిధం మార్గం షడ్విధంచ బలం స్వకం।సాం
పరాయిక కల్పేన యాయా దరిపురం శనైః॥ ౧౮౫॥

స్వదుర్గరాష్ట్రరూపమగు మూలమందు పార్ష్ణిగ్రాహసంవిధానమున్ను కొంతసైన్యముతో ప్రధానపురుషులను రక్షార్థమున్ను నిలిపి యుపయోగముగ వాహనాయుధవర్మప్రభృతిశాస్త్రోక్తవిధాన మొనర్చుకొని పరమండలమందు నుండు తనకు నవస్థానము దేసిచేనగు దానిని సంగ్రహించుకొని శత్రునిభృత్యపక్షీయులను స్వాధీనులనుగా జేసికొని శత్రుదేశవార్తలను దెలియుటకు కాపటికాది చారులనంపి జాంగలానూపాటవిక విషయభేదముచే మూడువిధములగు మార్గములందు తరుగుల్మాదిచ్ఛేదన నిమ్నోన్నతదేశసమీకరణాదులచేశోధనమొనర్చి కరి తురగ రథపదాతిసేనాకర్మకరాత్మకమగు షడ్విధబలమునుయథోపయోగము గ నాహారౌషధసత్కారాదులచే సంతుష్టిపరుచుకొని యుద్ధమునకుచితమగువిధానముతో శత్రుదేశమునకు త్వరలేకుండ జనవలయును॥ ౧౮౪॥౧౮౫॥

మూ॥ శత్రుసేవిని మిత్రేచ గూఢే యు క్తతరోభవేత్।గతప్రత్యా
గతేచైవ సహి కష్టతరో రిపుః॥ ౧౮౬॥

ఏమిత్రుడు రహస్యముగ శత్రువుని సేవించునో భృత్యాదులలో నెవడు మొదట విరాగముచే బోయి మరల వచ్చి కలియునో వీరిరువ్వురును కష్టతరులగు శత్రువులుగాన వారియెడల బహుజాగరూకుడు గావలెను॥ ౧౮౬॥

మూ॥ దండవ్యూహేన తన్మార్గం యాయాత్తు శకటేనవా । వ
రాహమకరాభ్యాంవా సూచ్యావా గరుడేనవా॥ ౧౮౭॥

దండాకృతివ్యూహరచనగలది దండవ్యూహము ఈలాగునసేశకటాదివ్యూహములున్ను అందులో నగ్రమందు బలాధ్యక్షుడు మధ్యమందురాజు వెనుకను సేనానాయకుడు పార్శ్వములం దేనుగులావగ్గి రనే గుర్రము లాపైనిపదాతులు యిట్టి రచన గలిగి దీర్ఘసమవిన్యాసముగలది దండ వ్యూహము దీనిచే మార్గమందంతటనున్ను భయముండినం బోవలెను- అగ్రమందు సూదివలె సన్నముగనున్ను వెనుకను పృథులమున్ననగు నదిశకటవ్యూహము వెనుక వైపు భయమున్నచో దీని

చే నడువవలెను వెనుక ముందు సూక్ష్మముగానున్న మధ్యను పృథుతరమధ్యమైతే గరుడవ్యూహము పార్శ్వములందు భయమున్నచో నీరెండింటిచేతనున్న నడువవలెను వరాహమునకు విపర్యయమైలే మకరవ్యూహము దీనిచే వెనుకనున్న ముందున్నగూడ భయముండినచో వెళ్లవలెను చీమలబారువలె నొకనివెనుక నొకడుండి యెచ్చటెచట సైనికులుందు రచ్చటచట శీఘ్రవీరపురుషులు ముఖమందు గలది సూచీవ్యూహము అగ్రమందు భయమున్నచో దీనిచే నరుగవలెను॥ ౧౮౭॥

మూ॥ యతశ్చ భయ మాశంకే త్తతో విస్తారయే ద్బలం। పద్మేన
చైవ వ్యూహేన నివిశేత సదాస్వయం॥ ౧౮౮॥

ఏదిక్కువలన శత్రుభయము నూహించునో యాదిక్కుననే బలమును విస్తరింపజేయవలెను సమవిస్తృతపరిమండలాకారమై విజిగీషుడు మధ్యమందుగలదిపద్మవ్యూహము దీనిచే పురమునుంచి బయలుదేరి సర్వదా కపటనివేశనము గావించుకొనవలెను॥ ౧౮౮॥

మూ॥ సేనాపతి బలాధ్యక్షౌ సర్వదిక్షు నివేశయేత్। యతశ్చ
భయ మాశంకే త్ప్రాచీం తాం కల్పయే ద్దిశం॥ ౧౮౯॥

కరితురగరథపదాత్యాత్మకమగు నంగదశకమున కొకపతిని జేయవలయు నతడు పత్తికుడనబడును పత్తికదశకమునకు పతియగువాడు సేనాపతియనబడును తద్దశకమునకు పతియగువాడు సేనానాయకుడితడే బలాధ్యక్షుడు సేనాపతి బలాధ్యక్షులనిన్ని దిక్కులను సంఘర్షయుద్ధార్థమై నియోగించవలెను యేదిక్కువలన నెప్పుడు భయమూహించు నాదిక్కును ప్రథమదిక్కుగా జేయవలెను॥

మూ॥ గుల్మాంశ్చ స్థాపయే దాప్తాన్ కృతసంజ్ఞా న్సమంతతః
స్థానే యుద్ధేచ కుశలా నభీ రూనవికారిణః॥ ౧౯౦॥

గుల్మములనగా సైన్యములో నొక్కొక్కభాగములు వాటినియాప్తపురుషుల నధికారులను గా జేసి నిలపడమునకున్ను జరిగిపోవుటకున్ను భేరీపటహశంఖాదిధ్వనులచే సంకేతములనెరుగపరచి నిలచియుండుటకున్ను యుద్ధమొనర్చుటకున్ను ప్రవీణులుగానెంచి నిశ్చయులును శుద్ధులునగు సేనాపతిబలాధ్యక్షులతో నుదూరముగ నన్నిదిక్కులయందును పరులప్రవేశమును వారించుటకును శత్రువులయొక్క చేష్టల

ను తెలియుటకున్ను నిర్ణయించియుంచవలెను॥ ౧౯౦॥

మూ॥ సంహతా న్యోధయే దల్పాన్ కామం విస్తారయే ద్బహూన్ ।
సూచ్యావజ్రేణచైవైతాన్ వ్యూహేన వ్యూహ్యయోధయేత్॥

అల్పులగుయోధులను సంఘముగాగూర్చి బహుమందినికలిపి సంకుల సమరము చేయించవలెను పూర్వోక్తమగుసూచీవ్యూహముచేతనున్ను వజ్రవ్యూహముచేతనున్ను యోధులనుమూడుమొనలేర్పరచియుద్ధముచేయించవలెను॥ ౧౯౧॥

మూ॥ స్యందనాశ్వైః సమేయుధ్యే దనూపే నౌద్విపైస్తథా ।
వృక్షగుల్మావృతేచాపై రసిచర్మాయుధైః స్థలే॥ ౧౯౨॥

సమభూమియందు రథాశ్వబలముచేతనున్ను జలప్రాయభూములయందు నౌడలచేతనున్ను కరులచేతనున్ను తరుగుల్మాద్యావృతస్థలమందు ధనుర్ధరులచేతనున్ను గర్తపాషాణకంటకాదియుక్తమగుభూమియందు ఖడ్గఖేట కుంతాద్యాయుధధరులచేతనున్ను యుద్ధముచేయించవలెను॥ ౧౯౨॥

మూ॥ కురుక్షేత్రాంశ్చ మత్స్యాంశ్చ పంచాలాన్ శూరసేనజాన్। దీ
ర్ఘాన్లఘూంశ్చైవనరానగ్రానీకేషుయోధయేత్॥ ౧౯౩॥

కురుక్షేత్రసంభవులును మాత్స్యులును కన్యాకుబ్జాహిచ్ఛత్రోద్భవులును మాధురులును దరుచుగాపృథుశరీరులును శౌర్యాహంకారయుక్తులునగుదురు వారలనున్ను యితరదేశస్థులగువారిని దీర్ఘలఘుశరీరులనున్ను సేనాగ్రమందు యుద్ధముచేయించవలెను॥ ౧౯౩॥

మూ॥ ప్రహర్షయే ద్బలం వ్యూహ్య తాంశ్చసమ్యక్పరీక్షయేత్।
చేష్టాశ్చైవ విజానీయా దరీన్ యోధయతామపి॥ ౧౯౪॥

సైనికులను వ్యూహముగారచించి వారలతోజయమయితే ధర్మలాభము యెదురుగా నడిచినహతులైతే స్వర్గలాభము వెనకదీసిరేని స్వామియొక్కదురితమున్ను నరకమున్ను పొందుదురని చెప్పి యుత్సాహపరచవలెను మరియును యోధులేయభిప్రాయముతో సంతోషించుచుండిరో పరీక్షించవలెను శత్రువులతోయుద్ధము చేయుచుండినను సోపాధికచేష్టలను తెలియవలెను॥ ౧౯౪॥

మూ॥ ఉపరుధ్యారి మాసీత రాష్ట్రంచాస్యోపపీడయేత్। దూష
యేచ్చాస్య సతతం యవసాన్నోదకేంధనం॥ ౧౯౫॥

శత్రువు కోటయందుండినను మరియునొకచోనుండినను యుద్ధమొనర్చకుం
డినను కనిపెట్టియుండవలెను మరియు గడ్డియన్న ముదకముకర్రలు నందకుండ జే
యుటయుచెరువుప్తుస్త్రలను గలిపిచెడగొట్టవలెను॥ ౧౯౫॥

మూ॥ భింద్యాచ్చైవ తటాకాని ప్రాకార పరిఘాస్తథా। సమ
వస్కందయేచ్చైనం రాత్రౌ విత్రా సయేత్తథా॥ ౧౯౬॥

శత్రువునకుపజీవ్యములగు తటాకాదులనునశింపజేయవలెను ప్రాకారములను
పడగొట్టికందకములను కప్పివెయ్యవలెను సర్వప్రకారములచేతను నాక్రమించవలె
ను రాత్రులయందు భేరీకాహళాదిశబ్దములచే భయపెట్టవలెను॥ ౧౯౬॥

మూ॥ ఉపజప్యా నుపజపే ద్బుధ్యేతైవచ తత్కృతం। యుద్ధేచ
దైవే యుధ్యేత జయప్రేప్సు రపేతభీః॥ ౧౯౭॥

భేదార్హులగు శత్రువంశ్యులు రాజ్యార్హులునగువారినిన్ని రాజుయందు
క్రోధముగలయమాత్యాదులనున్ను భేదించవలెను భేదముచేనాత్మీయులై యుండి
నను వారిచేష్టలపరీక్షించుచుండవలెను శుభగ్రహావశావశముచేదైవము యోగించె
నేని నిశ్శంకముగజయేచ్ఛుడై యుద్ధమొనర్చవలెను॥ ౧౯౭॥

మూ॥ సామ్నాదానేన భేదేన సమస్తై రథవా పృథక్। విజేతుం
ప్రయతేతారీ న్నయుద్ధేన కదాచన॥ ౧౯౮॥

ప్రీత్యాదరదర్శనసహితకథనాద్యాత్మకమగు సామముచేతనున్ను కరితురగరథ
హిరణ్యాదిదానముచేతనున్ను వానియమాత్యాదులును తదనుయాయులగు వార
లున్ను రాజ్యార్థులగుదురుగాన భేదముచేతనున్ను ఈయుపాయము లన్నిటిచె
గాని కొన్నిటిచేగాని యరినిజయించుటకుయత్నముజేయవలెను గాని యుద్ధముచె
నెప్పుడునుగూడదు॥ ౧౯౮॥

మూ॥ అనిత్యో విజయో యస్మా ద్దృశ్యతే యుధ్యమానయోః। ప
రాజయశ్చ సంగ్రామే తస్మా ద్యుద్ధం వివర్జయేత్। ౧౯౯॥

యుద్ధమొనర్చుచో ప్రబలదుర్బలాద్యపేక్షలేకుండనే జయాపజయము లగు చున్నవి గావున నుపాయాంతరమున్నచో యుద్ధమును పరిహరించవలెను॥ ౧౯౯॥

మూ॥ త్రయాణామప్యుపాయానాం పూర్వోక్తానామసంభవే।
తథాయుధ్యేతసంపన్నో విజయేతరిపూన్ యథా॥ ౨౦౦॥

పూర్వోక్తములగు సామదానభేదోపాయములు మూటిచేతనున్ను కార్యము గాని యెడల జయపరాజయసందేహమైన నిట్టిని మేలాగునైతే శత్రులను జయించు నో యట్లు ప్రయత్నము జేయవలెను లేకున్న యుద్ధమొనర్చవలెను జయించనేని యపకాలాభమగును యుద్ధమందభిముఖముగ జచ్చెనేని స్వర్గప్రాప్తియగును ని స్సందేహముగ పరాజయమే దోచెనేని యుద్ధమును మాని జరిగిపోవలయునుకొన్న॥ "శ్లో॥ ఆత్మానం సర్వదారక్షేత్" తనశరీరమెల్ల స్వామిని రక్షించవలెనని మేధాతిథిగోవింద రాజులువ్రాసిరి॥ ౨౦౦॥

మూ॥ జిత్వా సంపూజయేద్దేవాన్ బ్రాహ్మణాంశ్చైవధార్మికాన్ । ప్రదద్యాత్పరిహారాంశ్చ ఖ్యాపయేదభయానిచ॥ ౨౦౧॥

పరరాష్ట్రమును జయించి యచ్చటనున్న దేవతలనున్ను ధర్మప్రధానులగు బ్రాహ్మణులనున్ను భూమిసువర్ణాదిదానసంమానాదులచే బూజించవలెను ఈ పూజయున్ను జయించబడిన ద్రవ్యములో కొంతచేతనే చేయవలెను॥ "శ్లో॥ నాతః పరతరో ధర్మో నృపాణాం యదుపార్జితం । విప్రేభ్యోదీయతే ద్రవ్యం ప్రజాభ్యశ్చాభయం సదా॥" ఆర్జించిన ద్రవ్యము బ్రాహ్మణులకిచ్చుటయు ప్రజలకభయమిచ్చుటయు నింతకంటె రాజులకధికమైన ధర్మము లేదని యాజ్ఞవల్క్యుడే వబ్రాహ్మణులకీద్రవ్యమీబడెనని తద్దేశవాసులకు పరిహారము నీవలెను మరియును మీరు స్వామిభక్తిచే మాయెడల జేసిన యపకారములు క్షమించబడెను మీరునిర్భయులై మీమీకార్యములందు సుఖముగనుండుడని ప్రజలకభయమొసగవలెను యిట్లు ప్రకటించవలెను॥ ౨౦౧॥

మూ॥ సర్వేషాంతు విదిత్వైషాం సమాసేన చికీర్షితం । స్థాపయేత్తత్ర తద్వంశ్యం కుర్యాచ్చ సమయక్రియాం॥ ౨౦౨॥

ఈ శత్రునృపామాత్యుల యందరియభిప్రాయమునున్ను సంక్షేపముగా దెలి

మూ॥ పార్ష్ణిగ్రాహంచ సంప్రేక్ష్య తథా క్రందంచ మండలే ।
మిత్రా దథాప్య మిత్రాద్వా యాత్రాఫల మవాప్నుయాత్ ॥౨౦౭॥

విజిగీషుడరి పైకిపోవుటజూచి యాతరాజ్యాధికము నాక్రమించుట కుద్యోగించు నతడు పార్ష్ణిగ్రాహుడు అలాగుజేసెడు వానిని యడ్డెడు వాడాక్రందుడు వీరిని చూచి వెళ్ళవలెను మిత్రీభూతుని వలననైన మిత్రునివలననైన యాత్రాఫలముగ్ర హించవలెను॥ ౨౦౭॥

మూ॥ హిరణ్య భూమిసంప్రాప్త్యా పార్థివో న తథైధతే । య
థామిత్రం ధ్రువం లబ్ధ్వా కృశమ ప్యాయతిక్షమం॥౨౦౮॥

రాజుస్థిరమైన మిత్రుడు కృశుడైనను ముందువృద్ధి నొందువాడు లభించిననందు వలన నెట్లువృద్ధినొందునో యట్లుసువర్ణభూలాభములచే వృద్ధినొందడు॥౨౦౮॥

మూ॥ ధర్మజ్ఞంచ కృతజ్ఞంచ తుష్టప్రకృతి మేవచ । అనురక్తం
స్థిరారంభం లఘుమిత్రం ప్రశస్యతే॥ ౨౦౯॥

ధర్మజ్ఞుడు నుపకారమును మరువనివాడును సంతుష్టిగలప్రకృతిగలవాడును అను రాగయుక్తుడును కార్యమందు స్థిరబుద్ధిగలవాడునునగు మిత్రుడుప్రశస్తుడు॥౨౦౯॥

మూ॥ ప్రాజ్ఞం కులీనం శూరంచ దక్షం దాతార మేవచ। కృతజ్ఞం
ధృతిమంతంచ కష్టమాహు రరిం బుధాః॥ ౨౧౦॥

విద్వాంసుడును సత్కులప్రసూతుడును శూరుడును సమర్థుడును దాతయు కృతజ్ఞుడును ధీరుడును కష్టసుఖములు సమముగాదలచువాడునునగు వైరిదుర్జయు డనిపండితులుచెప్పుదురు గాన నిట్టివానితో సంధియే జేయవలెను॥ ౨౧౦॥

మూ॥ ఆర్యతా పురుషజ్ఞానం శౌర్యం కరుణవేదితా। స్థౌలలక్ష్యం
చ సతత ముదాసీన గుణోదయః॥ ౨౧౧॥

సాధుత్వము పురుషవిశేషజ్ఞత్వము శౌర్యము కృపాళుత్వము నిత్యస్థూలలక్షత్వ ము అనగాబహుప్రదత్వము కార్యమందుసూక్ష్మదర్శిత్వమని మేధాతిథిగోవిందరా జులు ఇవవిదానిగుణములజూచి వానినాశ్రయించి యుక్తలక్షణములుగల శత్రుని తోసంధిజేయవలెను॥ ౨౧౧॥

మూ॥ క్షేమాం సస్య ప్రదాం నిత్యం పశువృద్ధి కరీమపి।పరిత్యజె
న్నృపోభూమి మాత్మార్థ మవిచారయన్॥ ౨౧౨॥

ఆరోగ్యకరమయినప్పటికిని నదీమాతృకయగుటవలన సర్వదాసస్యయుక్తమైన ప్పటికిని పశువృద్ధికరమయినప్పటికిని భూమిని యాత్మార్థమై విడువవలెను ఈధర్మము సర్వవిషయమయినదె॥ ౨౧౨॥

మూ॥ ఆపదర్థం ధనంరక్షే ద్దారాన్ రక్షే ద్ధనై రపి। ఆత్మానం
సతతంరక్షే ద్దారైరపి ధనైరపి॥ ౨౧౩॥

ఆపన్నివారణార్థము ధనమురక్షించదగినది ధనపరిత్యాగ మొనర్చియైనను దారరక్షణమొనర్చవలెను ఆత్మరక్షణార్థము దారలనున్ను ధనమునున్నువిడువ వలెను॥ శ్రు॥ "సర్వత ఏవాత్మానం గోపాయీత" యనుశ్రుతిచే శాస్త్రీయమరణవ్యతిరిక్తముగ నాత్మరక్షణమొనర్చవలెనని యుపదేశమువలన॥ ౨౧౩॥

మూ॥ సహ సర్వా స్సముత్పన్నాః ప్రసమీక్ష్యా పదో భృశం।సం
యుక్తాంశ్చ వియుక్తాంశ్చ సర్వోపాయాన్ సృజెద్బుధః॥౨౧౪॥

ధనమున్ను మంత్రిప్రభృతిప్రకృతులున్ను మిత్రులున్ను వ్యసనమునుబొందియుం డుటవలన సకలమయినయాపదలున్ను పుట్టునేనివానినిదెలిసి మోహమును పొందజగదనగా తొట్రుబడగూడదు వ్యస్తముగానయినసన్నిటినయిన సామాద్యుపాయములను శాస్త్రజ్ఞుడై ప్రయోగించవలెను॥ ౨౧౪॥

మూ॥ ఉపేతార ముపేయంచ సర్వోపాయాంశ్చ కృత్స్నశః। ఏ
తత్త్రియం సమాశ్రిత్య ప్రయతే తార్థ సిద్ధయె॥ ౨౧౫॥

ఉపేతయగుతననున్ను ఉపేయమగుదానినిన్ని సామాద్యుపాయములనున్న పరిపూర్ణములగునీమూడింటిని యవలంబించి యథాశక్తిగా ప్రయోజనసిద్ధికొరకు ప్రయత్నించవలెను॥ ౨౧౫॥

మూ॥ ఏవం సర్వమిదం రాజా సహాసం మంత్ర్య మంత్రిభిః। వ్యా
యామ్యాప్లుత్య మధ్యాహ్నే భోక్తు మంతఃపురంవిశేత్॥౨౧౬॥

ఈప్రకారముగ రాజవృత్తమఖిలమును మంత్రులతో నాలోచించి పిమ్మట నాయుధాభ్యాసాదులచే పరిశ్రమమొనర్చి మాధ్యాహ్నికస్నానాదికృత్యమును దీర్చి భోజనార్థమంతఃపురమున బ్రవేశించవలెను॥ ౨౧౬॥

మూ॥ తత్రాత్మభూతైః కాలజ్ఞై రహార్యైః పరిచారకైః। సు
పరీక్షిత మన్నాద్య మద్యాన్మంత్రై ర్విషాపహైః॥ ౨౧౭॥

అయ్యంతఃపురమందు తనతో తుల్యులును భోజనకాలజ్ఞులును భేదాహులుగాని సూపకారాదులచే సిద్ధపరచబడినట్టియు పరీక్షితమయినట్టియు చకోరాదులచే జూపింపబడినట్టియు సవిషాన్నదర్శనముచే చకోరపక్షియొక్కకన్నులెఱ్ఱబడును విషాపహమంత్రములచే నభిమంత్రితమగునన్నమును దినవలెను॥ ౨౧౭॥

మూ॥ విషఘ్నై రగదైశ్చాస్య సర్వద్రవ్యాణి యోజయేత్। విష
ఘ్నానిచ రత్నాని నియతో ధారయేత్సదా॥ ౨౧౮॥

విషహరములగు నౌషధములతో భోజ్యవస్తువులనన్నిటినిన్ని కలపవలెను విషహారములగు రత్నములను సర్వదా ధరించవలెను॥ ౨౧౮॥

మూ॥ పరీక్షితాః స్త్రియశ్చైనం వ్యజనోదక ధూపనైః। వేషాభ
రణ సంశుద్ధాః స్పృశేయు స్సుసమాహితాః॥ ౨౧౯॥

గుప్తముగ నాయుధములను విషలిప్తాభరణములను ధరింతురను శంకచే గూఢచారులచే బరీక్షింపబడి నిర్ణయవేషాలంకారాదుల స్త్రీలననన్యమనస్కులగుచు చామరస్నానపానీయోదకధూపనాదులచే పరిచర్యజేయవలెను॥ ౨౧౯॥

మూ॥ ఏవం ప్రయత్నం కుర్వీత యానశయ్యాసనాశనే। స్నానే
ప్రసాధనే చైవ సర్వాలంకారకేషుచ॥ ౨౨౦॥

ఈప్రకారముగ పరీక్షాదిప్రయత్నము యానశయ్యాసనాశన స్నానానులేపనములందును సర్వాలంకారములందును నిత్యము జేయవలెను॥ ౨౨౦॥

మూ॥ భుక్తవాన్విహరేచ్చైవ స్త్రీభిరంతఃపురే సహ। విహృత్య
చ యథా కాలం పునః కార్యాణి చింతయేత్॥ ౨౨౧॥

భుజించి యచ్చటనే భార్యలతో గూడ క్రీడించవలెను యనలసుడై కాలమతిక్రమించకుండ పగటిలో సప్తమభాగమువిహరించి యష్టమభాగమందు మరల కార్యములను జింతించవలెను॥ ౨౨౧॥

మూ॥ అలంకృతశ్చ సంపశ్యే దాయుధీయం పునర్జనం। వాహనానిచ సర్వాణి వస్త్రాణ్యాభరణానిచ॥ ౨౨౨॥

అలంకృతుడై యాయుధోపజీవులనున్ను కరితురగాదివాహనములనున్ను వస్త్రములనలంకారాదులను ఖడ్గాదిశస్త్రములనున్ను జూడవలెను॥ ౨౨౨॥

మూ॥ సంధ్యాంచోపాస్యశృణుయా దంతర్వేశ్మని శస్త్రభృత్।రహస్యాఖ్యాయినాంచైవ ప్రణిధీనాంచ చేష్టితం॥ ౨౨౩॥
గత్వాకక్షాంతరం త్వన్య త్సమనుజ్ఞాప్య తం జనం। ప్రవిశే ద్భోజనార్థంచ స్త్రీవృతోంతఃపురం పునః॥ ౨౨౪॥

సంధ్యోపాసనమొనర్చి మరియొక కక్ష్యాంతరమందు జనశూన్యప్రదేశము ప్రవేశించి శస్త్రపాణియై గృహాభ్యంతరమందు రహస్యములను జెప్పెడుచారుల వ్యాపారమును వినవలెను చారులనంపి పరిచారకస్త్రీలతో గూడ భోజనార్థమంతఃపురమందు బ్రవేశించవలెను॥ ౨౨౩॥౨౨౪॥

మూ॥ తత్ర భుక్త్వా పునః కించి త్తూర్యఘోషైః ప్రహర్షితః। సంవిశేచ్చ యథా కాల ముత్తిష్ఠేచ్చ గతక్లమః॥ ౨౨౫॥

భుజించి తూర్యధ్వనులచే కొంచము సంతుష్టుడై నాలుగు గడియలరాత్రికి పరుండి రాత్రియొక్క నాలవయామమందే లేవవలెను॥ ౨౨౫॥

మూ॥ ఏతద్విధాన మాతిష్ఠే దరోగః పృథివీపతిః।అస్వస్థ స్సర్వ మేతత్తు భృత్యేషు వినియోజయేత్॥ ౨౨౬॥

ఇతిమానవే ధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాం సంహితాయాం
రాజధర్మోనామ సప్తమోధ్యాయః.

ఈచెప్పబడిన ప్రజారక్షణాదికము యథోక్తముగా రాజు తాను స్వస్థముగానున్నప్పుడు చేయవలెను అస్వస్థముగా నుండినప్పుడీతంత్రమంతయు యోగ్యుడును

శ్రేష్ఠుడునగు మంత్రిచే జేయింపవలయును॥ ౨౨౬॥

ఇది శ్రీమహామహీపతిరాజ శ్రీమదానందగజపతిరాజ మహారాజ
దయాపాత్ర భారద్వాజ సగోత్రపవిత్ర సుకవిజనవిధేయ
మండకామేశ్వరనామధేయవిరచితాంధ్రమన్వ
ర్థదీపికాఖ్యయగు వ్యాఖ్యయందు

సప్తమాధ్యాయము.

శ్రీపరదేవతామణిపాదుకార్పణమస్తు.



శుభమస్తు - అవిఘ్నమస్తు.

ఆం ధ్ర మ న్వ ర్థ దీ పి కా స హి త

# మనుస్మృతి * అష్టమాధ్యాయప్రారంభము.

మూ॥ వ్యవహారాన్ దిదృక్షుస్తు బ్రాహ్మణైస్సహ పార్థివః। మం
త్రజ్ఞైర్మంత్రిభిశ్చైవ వినీతః ప్రవిశేత్సభాం॥ ౧॥

ఈపూర్వోక్తప్రకారముగ శత్రురాజులవలన ప్రజారక్షణమువలన బొందబడిన వృత్తిగలవాడై యాప్రజలయొక్క యన్యోన్యమునగు వివాదపీడా పరిహారమునకై ఋణాదానాద్యష్టాదశప్రకారమగువివాదమందు విరుద్ధార్థముగల యర్థిప్రత్యర్థులయొక్క వాక్యములవలన బొడమిన సందేహమును హరించెడువిచారము వ్యవహారము॥ "శ్లో॥ వినానార్థేఽవసందేహే హరణం హార ఉచ్యతే। నానాసందేహహరణాద్వ్యవహార ఇతిస్మృతః॥" వి యనుపదము నానార్థకము అవ యనునది సందేహార్థకము హారః యనునది హరణార్థకము నానాసందేహములనున్ను హరించడమువలన వ్యవహారమని చెప్పబడెను॥ యని కాత్యాయనుఁడు అట్టి వ్యవహారమునుజూడ నిచ్ఛయించుచున్నరాజు వక్ష్యమాణలక్షణములుగలమం

త్రులతోఁటిన్ని సప్తమాధ్యాయోక్తపంచాంగమంత్రజ్ఞులగు మంత్రులతోఁగూడ వాక్పాణిపాదచాపల్యము లేమి ననుద్ధతుడగుచు రాజు వినీతుడు గాకుండెనేని వాదిప్రతివాదులు ప్రతిభాక్షయమువలన నెస్సగా చెప్పకుండిన తత్వనిర్ణయము గాకపోవును వక్ష్యమాణమగు సభను బ్రవేశించవలెను ఈవ్యవహారదర్శనము ప్రజలితరేతరపీడనొందకుండ తత్వనిర్ణయమగుచుండ రక్షణార్థమౌట వక్ష్యమాణదృష్టాదృష్టాన్యకకరణఫలముచేతనే ఫలముగలది॥ ౧॥

మూ॥ తత్రాసీనస్స్థితోవాపి పాణిముద్యమ్య దక్షిణం। వినీతవేషా
భరణః పశ్యేత్కార్యాణి కార్యిణాం॥ ౨॥

కార్యగౌరవాపేక్షచే నాసభయందుగూచుండనియైన లఘుకార్యమైనప్పుడు నిలవబడియైన కుడిచేయినిమెత్తి అనుద్ధతములగు వేషాలంకారములు గలవాడై పై శ్లోకమందు నంగేంద్రియానౌద్ధత్యము జెప్పబడెను అట్టివాడై కార్యములనువిచారించవలెను॥ ౨॥

మూ॥ ప్రత్యహం దేశదృష్టైశ్చ శాస్త్రదృష్టైశ్చ హేతుభిః। అ
ష్టాదశసుమార్గేషు నిబద్ధాని పృథక్పృథక్॥ ౩॥

ఆఋణాదానాదికార్యములను పదునెనిమిదియగు వ్యవహారమార్గములవిషయమైపఠించబడిన దేశజాతికులవ్యవహారములచే దెలియబడినట్టియు శాస్త్రావగతము యినట్టియు సాక్షిద్రవ్యాదిహేతువులచే వేరువేర ప్రత్యహమున్ను విచారించవలెను ఆపదునెనిమిదింటిని లెక్కబెట్టుచున్నాడు॥ ౩॥

మూ॥ తేషామాద్య మృణాదానం నిక్షేపోస్వామి విక్రయః। సం
భూయచ సముత్థానం దత్తస్యానపకర్మచ॥ ౪॥
వేతనస్యైవచాదానం సంవిదశ్చ వ్యతిక్రమః। క్రయవిక్రి
యానుశయో వివాదస్స్వామిపాలయోః॥ ౫॥
సీమావివాదధర్మశ్చ పారుష్యేదండవాచికే। స్తేయంచ
సాహసంచైవ స్త్రీసంగ్రహణమేవచ॥ ౬॥
స్త్రీపుంధర్మో విభాగశ్చ ద్యూతమాహ్వయ ఏవచ। ప
దాన్యష్టాదశైతాని వ్యవహారస్థితావిహ॥ ౭॥

ఆపదునెనిమిటిలోనున్న ముందుగా ఋణాదానము విచారించబడుచున్నది॥ "శ్లో॥ ఋణం దేయమదేయంచ యేనయత్రయథాచయత్। దానగ్రహణధర్మాశ్చ తదృణాదానముచ్యతే॥" ఎవనిచే నెచ్చట నే ప్రకారముగ నేది ఋణమియ్యఁదగినది తగనిదో ఋణమిచ్చుటయొక్కయు గొనుటయొక్కయు ధర్మమని యెన్నియుంగలదో ఋణాదానమని నారదునిచే జెప్పబడెనది ఋణదానము ౧ తనధనము యొక్కనియొద్ద దాచుకొనుట నిక్షేపము ౨ అస్వామిచే నమ్మకము జేయబడినది యస్వామివిక్రయము ౩ కూడికవర్తకము సంభూయసముద్ధానము ౪ ఇచ్చినధనము నపాత్రమనిగాని క్రోధముచేగాని మరలబుచ్చికొనుట దత్తానపకర్మము ౫ పనిజేసినవానికి జీతమియ్యకుండుట వేతనాదానము ౬ చేయబడిన వ్యవస్థ నతిక్రమించుట సంవిద్వ్యతిక్రమము ౭ క్రయవిక్రయములు జేయబడినవానికి పశ్చాత్తాపముచే వివాదపడడము క్రయవిక్రయానుశయము ౮ స్వామికిని పశువులగాచువానికిని వివాదము స్వామిపాలవివాదము ౯ గ్రామాదులపొలిమెరలవివాదము సీమావివాదనిర్ణయము ౧౦ తిట్టడము కొట్టడమున్న వాక్పారుష్యదండపారుష్యములు ౧౧ మాయచేఁ ధనము నపహరించుట స్తేయము ౧౨ బలాత్కరించి ధనాదిహరణము సాహసము ౧౩ పరపురుషుడు స్త్రీతో సంపర్కము జేయుడము స్త్రీసంగ్రహణము ౧౪ స్త్రీపురుషుల యొక్క ధర్మవ్యవస్థ స్త్రీపుంధర్మము ౧౫ పిత్రార్జితధనాదికమును పంచుకొనడము విభాగము ౧౬ వ్యవస్థాపూర్వకముగ నక్షాదులచే క్రీడించుట ద్యూతము ౧౭ పక్షులు గొర్రెలు మొదలగు జంతు యుద్ధమాహ్వయము ౧౮ యీ యాపదునెనిమిదియును వ్యవహారప్రవృత్తిస్థానములు సమాహ్వయము ద్యూతమైనప్పటికిని నవాంతరభేదముచే విశేషముగా పృథక్కరింపబడెను నష్టాదశసంఖ్యకు పపత్తియయ్యె॥ ౪॥౫॥౬॥౭॥

మూ॥ ఏషు స్థానేషు భూయిష్ఠం వివాదం చరతాం నృణాం। ధర్మం శాశ్వత మాశ్రిత్య కుర్యా త్కార్యవినిర్ణయం॥౮॥

ఈ ఋణదానాదివ్యవహారస్థానములందు నధికముగ వివాదము బడుచున్నమనుష్యులకు ననాదిపారంపర్యాగతమగుటచే నిత్యమగు ధర్మము నవలంబించి కార్యనిర్ణయమును జేయవలయును భూయిష్ఠమనుటచే నింకకొన్ని వివాదస్థానములు కలవని సూచించబడెను యవన్నియు ప్రకీర్ణకశబ్దముచే నారదాదులచే జెప్పబడెను॥ "శ్లో॥ నదృష్టంయచ్చపూర్వేషు సర్వం తత్స్యాత్ప్రకీర్ణకం।" పూర్వులయందేది చూడబడలేదో యవియెల్లనున్ను ప్రకీర్ణకమని అర్థ్యాని॥ ౮॥

మూ॥ యదా స్వయం నకుర్యాత్తు నృపతిః కార్యదర్శనం। తదా
నియుంజ్యా ద్విద్వాంసం బ్రాహ్మణం కార్యదర్శనే॥ ౯॥

ఎప్పుడు రాజు కార్యాంతరములందుండినదైన రోగాదికముచేతనైన నాకలుడై యుండునో యప్పుడు కార్యదర్శనజ్ఞుడగు బ్రాహ్మణుని కార్యదర్శనమందు నియోగించవలెను॥ ౯॥

మూ॥ సోఽస్య కార్యాణి సంపశ్యే త్సభ్యైరేవ త్రిభి ర్వృతః। స
భామేవ ప్రవిశ్యాగ్ర్యా మాసీన స్థ్సిత ఏవవా॥ ౧౦॥

ఆ బ్రాహ్మణుడు రాజుచేసెడు కార్యములను సాధులును ధార్మికులును కార్యదర్శనాభిజ్ఞులునగు ముగ్గురు బ్రాహ్మణులతో గూడి యాసభయందే ప్రవేశించి కూచుండిగాని నిలవబడిగాని ఋణదానాదికార్యములను జూడవలెను॥ ౧౦॥

మూ॥ యస్మిన్ దేశే నిషీదంతి విప్రా వేదవిద స్త్రయః। రాజ్ఞా
చాధికృతో విద్వాన్ బ్రహ్మణ స్తాం సభాం విదుః॥ ౧౧॥

ఏ స్థానమందు ఋగ్యజుస్సామవేత్తలగు బ్రాహ్మణులు ముగ్గురున్ను అధికృతుడగు విద్వాంసుడైన బ్రాహ్మణున్ను యుండునో యాసభను చతుర్ముఖుని సభగా తెలిపెదరు॥ ౧౧॥

మూ॥ ధర్మో విద్ధ స్త్వధర్మేణ సభాం యత్రోపతిష్ఠతే। శ
ల్యం చాస్య నకృంతంతి విద్ధా స్తత్ర సభాసదః॥ ౧౨॥

[illegible]సహా ప్రకాశము దానితో వర్ణించెడి విద్వత్త్వం హతియే సభాశ[illegible]ము యేదేశమందు విద్వత్సంహతిరూపమగు సభనుగూర్చి సత్యాభిధా[illegible]గు ధర్మమనృతాభిధానజన్యమగు నధర్మముచే బీడితమైవచ్చునో అర్థిప్రత్యర్థు లలో నొకడు సత్యమును జెప్పెడువాడు నొకడనృతము బలికెడువాడు [illegible]గాన సభాసదులు ధర్మమునకు పీడను జేసెడువారగుటచే శల్యమునువలె [illegible] దీసివెయ్యక పోయిరేని వారే యీయధర్మశల్యముచే గొట్టబడుదు [illegible]॥ ౧౨॥

మూ॥ సభాంవా నప్రవేష్టవ్యం వక్తవ్యం వాసమంజసం। అబ్రు

వన్ విబ్రువన్వాపి నరోభవతి కిల్బిషీ॥ ౧౩॥

సభను దెలిసి వ్యవహారార్థమై దానియందు బ్రవేశింపరాదు. తానడగబడె నేని సత్యమే చెప్పవలెను లేక చెప్పకయూరకుండినను నన్పృతము జెప్పినను భయ మువలన నపుడప్పుడే పాపాత్ముడగును ఇకకూడ మేధాతిథి "సభావానప్రవేష్టవ్యా" యనిబుగ్వేదపఠితమును వ్రాసెను॥ ౧౩॥

మూ॥ యత్ర ధర్మో హ్యధర్మేణ సత్యంయత్రానృతేనచ।హ-
న్యతే ప్రేక్షమాణానాం హతా స్తత్ర సభాసదః॥ ౧౪॥

ఏ సభయందు సభాసదులు జూచుచుండ నర్థిప్రత్యర్థులచే ధర్మమధర్మ ముచే జూడబడదో సాత్ముల నన్పృతముచే సత్యమును నశింపజేతురో సభాసదులందు కు ప్రతీకారమునుజేయరో యనియర్థము యచ్చటనా సభాసదులే యాపాపము చే హతులగుదురు॥ ౧౪॥

మూ॥ ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః।తస్మా
ద్ధర్మో నహంతవ్యో మానో ధర్మో హతో వధీత్॥ ౧౫॥

ఇష్టులని యనిష్టులని యధర్మముచే ధర్మమతిక్రమించబడెనేని యదేనశింపజే యునర్థిప్రత్యర్థు లేమిజేయగలరు అధర్మమతిక్రమించబడకుండిన నర్థిప్రత్య ర్థులతోగూడ రక్షించును గావున ధర్మమతిక్రమించదగదు యతిక్రమించబడిన ధర్మముతోగూడ నీసభాసదులను జంపకపోవుగావుతమనియుత్తమప్రవర్తనను గల ప్రాడ్వివాకునకీసంబోధనము॥ ౧౫॥

మూ॥ వృషోహి భగవాన్ ధర్మ స్తస్యయః కురుతే హ్యలం।
వృషలంతం విదుర్దేవా స్తస్మా ద్ధర్మం నలోపయేత్॥౧౬॥

కామములను వర్షించును గావున వృషమనగా ధర్మము అలయనగా వారి ణము- ఎవడు ధర్మమును వారించునో వానిని వృషలునిగా గుర్తెరుగుచున్నారు జాతివృషలునిగాదు గావునధర్మోచ్ఛేద మొనర్చరాదనిధర్మవ్యతిక్రమఖండనా ర్థమీవృషలశబ్దనిర్వచనము॥ ౧౬॥

మూ॥ ఏక ఏవ సుహృ ద్ధర్మో నిధనే హ్యనుయాతియః। శరీరేణ

సమం వాశం సర్వమన్యద్ధి గచ్ఛతి॥ ౧౭॥

ధర్మ మొకటియే మిత్రుడు మరణమం దప్పుడున్ను తనతో నభీష్టఫలము నిచ్చుట కడిగూడ జనును భార్యాపుత్రాదులు శరీరము వదలి పోవునట్టే వదిలిపోదురు గాన తిరియందు కంటెను ధర్మమందపేక్ష యెక్కువగా నుంచవలెను॥ ౧౭॥

మూ॥ పాదోధర్మస్య కర్తారం పాదస్సాక్షిణ మృచ్ఛతి। పా దస్సభాసద స్సర్వాన్ పాదో రాజాన మృచ్ఛతి॥ ౧౮॥

దుష్టవ్యవహారదర్శనము వలన నధర్మసంబంధమగు చతుర్థభాగమధర్మకర్తయగు నర్థినిగాని ప్రత్యర్థినిగాని పొందును అసత్యవాదియగు సాక్షినొక పాదమున్ను అధర్మానివారకులగు సర్వసభాసదుల నొకపాదమున్ను రాజునొక పాదమున్ను బొందును పాపసంబంధమీయందరికిని గలదలని వివక్షితమాయెను॥౧౮

మూ। రాజా భవత్యనే నాస్తు ముచ్యంతె చ సభాసదః। ఏనోగ చ్ఛతి కర్తారం నిందార్హో యత్ర నింద్యతే॥ ౧౯॥

ఏసభయందు నన్నృతవాదియగుటనర్థియైనం బ్రత్యర్థియైన నిందార్హుడు నిందింపబడునో సమ్యగ్దర్శనముచే రాజున్ను సభాసదులునాపాపమునొందరు కర్తకే యాపాపము సంభవించును॥ ౧౯॥

మూ॥ జాతిమాత్రోపజీవీవా కామంస్యా ద్బ్రాహ్మణబ్రువః। ధర్మ ప్రవక్తా నృపతేః నతు శూద్రః కథంచన॥ ౨౦॥

వైశ్యాదులవలె బ్రాహ్మణ కర్మానుష్ఠానములేక జాతిమాత్రబ్రాహ్మణుడైనను సాంఖ్యాదికముచే స్ఫుటముగ న్యాయాన్యాయనిరూపణమందు సమర్థుడైతే నా బ్రాహ్మణబ్రువుడైన నించుకమంచిది యుక్తయోగ్యబ్రాహ్మణాభావమందుగానికా త్యతశ్చనమనేదు ధార్మికుడైనను వ్యవహారజ్ఞుడైనను శూద్రుడు నియోగార్హుడు కాడు॥ "సూ॥ బ్రాహ్మణోధర్మప్రవక్తా" యను విధివలననే శూద్రునకు నివృత్తి సిద్ధమగుచుండ మరల శూద్రఃకథంచన యని చెప్పుట యోగ్యబ్రాహ్మణాభావమం దు క్షత్రియవైశ్యులకును జ్ఞానార్థము॥ "శ్లో॥ యత్రవిప్రోనవిద్వాన్ స్యాత్ క్ష త్రియం తత్ర యోజయేత్। వైశ్యంవా ధర్మశాస్త్రజ్ఞం శూద్రం యత్నేనవర్జ

యేత్॥" అని కాత్యాయనవచనమువలన॥ ౨౦॥

మూ॥ యస్య శూద్రస్తు కురుతే రాజ్ఞో ధర్మవివేచనం। తస్యసీద
తి తద్రాష్ట్రం పంకే గౌరివ పశ్యతః॥ ౨౧॥

ఏరాజురాజ్యమందు ధర్మవివేచనము శూద్రుడొనర్చునో యారాజు చూచుచుండ బురదలో దిగబడిన గోవువలె నారాజ్యము చిక్కుబడినశించును॥ ౨౧॥

మూ॥ యద్రాష్ట్రం శూద్రభూయిష్ఠం నాస్తికాక్రాంత మద్వి
జం।వినశ్యత్యాశు తత్కృత్స్నం దుర్భిక్షవ్యాధిపీడితం॥౨౨॥

ఏరాజ్యము శూద్రబహుళమున్ను పరలోకము లేదనియెడి నాస్తికులచే నాక్రాంతమున్ను ద్విజశూన్యమునగునో యారాజ్యమంతయు దుర్భిక్షరోగాదిపీడితమై శీఘ్రముగ నశించును॥ "శ్లో॥ అగ్నౌప్రాస్తాహుతిస్సమ్య"గను వచనముచే సగు హోమాభావముచే వృద్ధిలేకపోవుటవలననున్ను దుర్భిక్షరోగాద్యుపద్రవ శాంత్యర్థకర్మాభావమువలననున్ను నశించునని తాత్పర్యము॥ ౨౨॥

మూ॥ ధర్మాసన మధిష్ఠాయ సంవీతాంగ స్సమాహితః।ప్రణమ్య
లోకపాలేభ్యః కార్యదర్శన మారభేత్॥ ౨౩॥

ధర్మదర్శనార్థమాసనమందుగూర్చుండి యాచ్ఛాదితశరీరుడు ననన్యమనస్కుడునై లోకపాలురకు మ్రొక్కి కార్యదర్శనమొనర్చవలె॥ ౨౩॥

మూ॥ అర్థానర్థా వుభౌ బుద్ధ్వా ధర్మాధర్మౌచ కేవలౌ। వ
ర్ణక్రమేణ సర్వాణి పశ్యేత్కార్యాణి కార్యిణాం॥ ౨౪॥

ప్రజలకు సాధకబాధకరూపములు నైహికములగు నర్థానర్థములను దెలిసి పరలోకార్థము ధర్మాధర్మములను ముఖ్యములుగా ననుసరించి విరోధములేనిమార్గముచే కార్యార్థులయొక్క కార్యములను చూడవలెను అన్నివర్ణములవారును గూడికేని బ్రాహ్మణాదిక్రమముచే జూడవలెను॥ ౨౪॥

మూ॥ బాహ్యై ర్విభావయే ల్లింగై ర్భావమంతర్గతం నృణాం।
వరవర్ణేంగితాకారై శ్చక్షుషా చేష్టితేనచ॥ ౨౫॥

బాహ్యములగు స్వరాదిచిహ్నములచే నర్థిప్రత్యర్థులయంతర్గతమగు నభి

పాత్రియమునునిరూపించవలెను అవియేవియనిన గద్గదాదిస్వరము స్వాభావికవర్ణ ముకంటె నన్యాదృశమగు ముఖకాళిమాదివర్ణము అధోనిరీక్షణాదిక మింగితము దేహభవమగు స్వేదరోమాంచాద్యాకారము హస్తాస్ఫాలనాదిచేష్టవీటిచే దెలియ వలెను॥ ౨౫॥

మూ॥ ఆకారైరింగితై ర్గత్యా చేష్టయా భాషితేనచ। నేత్రవక్త్ర వికారైశ్చ గృహ్యతేంతర్గతం మనః॥ ౨౬॥

పూర్వోక్తములగు నాకారాదులచేతనున్ను పదములు తొట్రుపడెడిగమనము చేతనున్ను లోపలి మనోబుద్ధులయొక్క పరిణతి తెలియబడును॥ ౨౬॥

మూ॥ బాలదాయాదికం రిక్థం తావ ద్రాజానుపాలయేత్। యావ త్సస్యా త్సమావృత్తో యావ చ్చాతీత శైశవః॥ ౨౭॥

అనాథులగు బాలురయొక్క పిత్రాద్యుపహృతమగాకుండ రాబట్టినరిక్థము ను గురుకులమునుండి షట్త్రింశదాదిపరిమితకాలమంతమయినపిమ్మట సమావృత్త మగుదనుకను లేక పదారుసంవత్సరములు బాల్యమదిదాటునంతకును రాజు పరి పాలించవలెను॥ శ్లో॥ "బాలఆషోడశాద్వర్షా"దనునారదవచనమువలన॥ ౨౭॥

మూ॥ వశాపుత్రాసు చైవంస్యా ద్రక్షణం నిష్కులాసుచ। పతివ్ర తాసుచ స్త్రీషు విధవా స్వాతురాసుచ॥ ౨౮॥

వంధ్యలయొక్కయు ననగా భర్త మరియొకభార్యను వివాహమై దీనికిజీవనా ర్థమై యిచ్చిన ద్రవ్యముగలవారియొక్కయనియర్థము పుత్రులులేని ప్రోషిత భ ర్తృకలయొక్కయు జ్ఞాతులెవ్వరునులేని వారియొక్కయు పతివ్రతలయొక్కయు విధవలయొక్కయు రోగముగల స్త్రీలయొక్కయు ధనము నాబాలుర ధనమును వలెను రాజురక్షించవలెను॥ ౨౮॥

ప్రక్షిప్తశ్లోకము॥ ఏవమేవవిధిః కుర్యా ద్యోషిత్సుపతితాసుచ। వ స్త్రాన్నపానం దేయంచ వసేయుశ్చ గృహాంతికే॥ దీనికే వ్యాఖ్యాతలున్ను వ్యాఖ్యజేయలేదు॥ *

మూ॥ జీవంతీనాంచ తాసాంయే తద్ధరేయుః స్వబాంధవాః।

తాన్ శిష్యాచ్చౌరదండేన ధార్మికః పృథివీపతిః॥ ౨౯॥

ఈస్త్రీకి మేమనంతరాధికారులము దీనిధనమునురక్షించెదమని వ్యాజముచే నే మేబాంధవులు బిడ్డిలియుండినస్త్రీలయొక్క ధనమునపహరించినవారిని చౌర్యమా నామగుచోరదండముచే ధార్మికుడగురాజు శిక్షించవలెను॥ ౨౯॥

మూ॥ ప్రణష్టస్వామికం రిక్థం రాజా త్ర్యబ్దం నిధాపయేత్। అ ర్వాక్త్ర్యబ్దాద్ధరేత్స్వామీ పరేణ నృపతిర్హరేత్॥ ౩౦॥

ఎవనిదో తెలియబడనిధనము రాజు ఈధనమెవనిది యేమిపోయినది యిట్లని వా ద్యముతోగూడచాటించి రాజద్వారాదికమందుంచి మూడబ్దములురక్షించవలె నీ లోగా నీధనమునాదియని ధనస్వామివచ్చియడిగిపుచ్చుకొనవచ్చును మూడేండ్లుదా టునేని రాజాధనమును వినియోగపరచవలెను॥ ౩౦॥

మూ॥ మమేదమితి యోబ్రూయాత్సోనుయోజ్యో యథావిధి।సం వాద్య రూపసంఖ్యాదీన్ స్వామీ తద్ద్రవ్యమర్హతి॥ ౩౧॥

ఎవడైన నాధనమిదియని వచ్చెనేని ఆధనమెట్టిది యెంత యెచ్చటబోయెనని యెడివిధిచే నడుగవలెను ఆధనమునతడున్నట్టు జెప్పెనేని యాధనమునతడుపుచ్చు కొనవలెను॥ ౩౧॥

మూ॥ అవేదయానో నష్టస్య దేశంకాలంచ తత్త్వతః।వర్ణం రూ పం ప్రమాణంచ తత్సమం దండమర్హతి॥ ౩౨॥

నష్టద్రవ్యముయొక్క దేశకాలాదులనగా నీదేశమందీకాలమందు బోయెనని యును శుక్లాదివర్ణము ప్రమాణము నున్నట్టుజెప్పనెరుగకుండెనేని యానష్టద్రవ్య మునకు సమముగుధనముగా వానికిశిక్షవిధించవలెను॥ ౩౨॥

మూ॥ ఆదదీతాథ షడ్భాగం ప్రణష్టాధిగతాన్నృపః। దశమం ద్వాదశంవాపి సతాం ధర్మమనుస్మరన్॥ ౩౩॥

సరిగా దేశకాలాదులంజెప్పెనేని రాజుకే నష్టద్రవ్యముదొరికెనా ఆధనములో నాలవపాలయినను బది పదిరెండవపాలునయిన రక్షణార్థనిమిత్తముగా బ్రాచీను లగుసాధుల ధర్మము నెరిగిరాజుపుచ్చుకొని మిగిలినద్రవ్యము నాస్వామికీవలెను ద్రి

వ్యస్వామియోగ్యతనుబట్టి షడ్భాగాది వికల్పము॥ ౩౩॥

మూ॥ ప్రణష్టాధిగతం ద్రవ్యం తిష్ఠేద్యుక్తై రధిష్ఠితం। యాం స్తత్ర
చోరాన్ గృహ్ణీయాత్ తాన్ రాజేభేన ఘాతయేత్॥ ౩౪॥

ఏద్రవ్యమెవనిదైన నష్టమై రాజపురుషులచేపట్టబడి రక్షానియుక్తులచే రక్షింప బడియుండవలెను ఆద్రవ్యమందు యేచోరులుబట్టుబడుదురో వారినేనుగచే చంపిం చవలెను-గోవిందరాజైతే "శతాదభ్యధికేవధః" యనిశాస్త్రమువలననూటికిపైనిహ రించినయడలనేయీశిక్షయని వ్రాసెనుగాని "సూ॥ "తత్రసంధింకృత్వా యే చౌర్య"మి త్యాదివచనముచే స్వామ్యముగలుగుచుండ సంధినొనచిన ప్రణష్టరాజరక్షితద్రవ్య హరణముచేతనే విషముచేజంపవలెనని "పధివలన శతాదభ్యధికేవధః" యనువా నికి విశేషముగచెప్పబడినవధ ఇతరవిషయమగుటవలన నదిగాదని కుల్లూకభట్టు వ్రాసెను॥ ౩౪॥

మూ॥ మమాయమితి యోబ్రూయా న్నిధిం సత్యేన మానవః। త
స్యాదదీత షడ్భాగం రాజా ద్వాదశమేవవా॥ ౩౫॥

తనకుగాని మరియొకనికిగాని దొరికిననది యేమనిషిదైన నీనిధినాదియని సత్య మగుప్రమాణముచే తనసంబంధముబోధపరుచునో యందునెనిమిదవపాలునయిన పదిరెండవపాలునయిన రాజువుచ్చుకుని శేషమతనికిప్పించవలెను॥ ౩౫॥

మూ॥ అనృతంతు వదన్ దండ్య స్స్వవిత్తస్యాంశ మష్టమం । త
స్యైవవా నిధానస్య సంఖ్యాయాల్పీయసీం కళాం॥ ౩౬॥

తనదిగాని నిధినితనదని యనృతనుచెప్పినేని వానిద్రవ్యములో నెనిమిదవపా లు శిక్షగాపుచ్చుకొనవలెను ఆనిధికొంచమయినచో నదిలెక్కబెట్టి యందునొక యల్పతరమగునంశమంత సొమ్మునగానెంతచేవాడు క్షీణించడో విషాదమునొం దునోయంతసొమ్ము శిక్షగాగొనవలెనని యల్పీయసీమనిచెప్పుటచే నిదిదండభేదము గుణవదగుణభేదముచే వికల్పము॥ ౩౬॥

మూ॥ విద్వాంస్తు బ్రాహ్మణో దృష్ట్వా పూర్వోపనిహితం నిధిం।
అశేషతోప్యా దదీత సర్వస్యాధిపతిర్హి సః॥ ౩౭॥

విద్వాంసుడగు బ్రాహ్మణుడు పూర్వమందుంచబడిన నిధిం జూచి సర్వమును బుచ్చికొనవలెను యేలనవనిపాలీవగదు ఇతడు సర్వమయిన ధనజాతమునకును ప్రభువుగావున నే॥ శ్లో॥ “సర్వస్వంబ్రాహ్మణస్యేద”మని చెప్పబడెను గావునని వచనమును పరిగృహీతవిషయము అందుకునారదుడు॥ శ్లో॥ “పరేణనిహితంలబ్ధ్వా రాజాప్యపహరేన్నిధిం రాజాస్వామినిధేస్సర్వం సర్వేషాం బ్రాహ్మణాదృతే” యనలేనుబడిన నిధిని రాజుబొందిపుచ్చుకొనవచ్చును సర్వమగునిధి జాతమునకు రాజధికారి బ్రాహ్మణుని నిధివినాగానని యాజ్ఞవల్క్యులున్ను “రాజాలబ్ధ్వానిధిందద్యాద్ద్విజేభ్యోర్ధం ద్విజఃపునః। విద్వానశేషమాదద్యాత్ససర్వస్యప్రభుర్యతః” రాజుకుదొరికిననిధిలోసగము ద్విజులకొసగవలెను విద్వాంసుడగు బ్రాహ్మణుడంతయు దానె పుచ్చుకొనవలెనుగాని యీనక్కరలేదు బ్రాహ్మణుడంతకును ప్రభువుగావునని మేధాతిథి గోవిందరాజులుయిది నాదియనిచెప్పబడినది పిత్రాదినిహితత్వమును జెప్పటచే రాజదేయార్థనిరాసార్థమని వ్రాసిరి యిదియాషమునగాదనిన్ని నారదాదిమునివాక్యవిపరీతమనిన్ని కుల్లూకభట్టు వ్రాసెను॥ ౩౭॥

మూ॥ యంతు పశ్యేన్నిధిం రాజా పురాణం నిహితం క్షితౌ
తస్మాద్ద్విజేభ్యో దత్వార్ధ మర్ధం కోశే ప్రవేశయేత్॥ ౩౮॥

పురాతనమై భూమ్యంతర్గతమగు నేనిధిని రాజుగనునో యందులోసగమ్ము బ్రాహ్మణులకిచ్చి మిగిలినసగమును కోశగృహమందుంచవలెను॥ ౩౮॥

మూ॥ నిధీనాంతు పురాణానాం ధాతూనామేవ చక్షితౌ। అర్ధభాగ్రక్షణాద్రాజా భూమేరధిపతిర్హిసః॥ ౩౯॥

పురాతములగు నిధులును సువర్ణాదిఖనులునునవిద్వద్బ్రాహ్మణేతరలబ్ధములగువాటిని స్వకీయములయినను రాజులుసగము పుచ్చుకొనవలెను రాజుభూమిని రక్షించెడు ప్రభువుగావున॥ ౩౯

మూ॥ దాతవ్యంసర్వవర్ణేభ్యో రాజ్ఞా చోరైర్హృతం ధనం।
రాజా తదుపయుంజాన శ్చోరస్యాప్నోతి కిల్బిషం॥ ౪౦॥

చోరాపహృతమగు ధనమును రాజుబట్టితెచ్చి లోకులకెవరిదో వారికి దయిచ్చివేయవలెను ఆధనమురాజుపుచ్చుకొనెనేని యాచోరులపాపమునా రాజుపొందును॥

మూ॥ జాతిజానపదాన్ ధర్మాన్ శ్రేణీధర్మాంశ్చ ధర్మవిత్।సమీ
క్ష్య కులధర్మాంశ్చ స్వధర్మం పరిపాలయేత్॥ ౪౧॥

బ్రాహ్మణాదిజాతి నియతములగు యాజనాదిధర్మములనున్ను ఆయా దేశములందువ్యవస్థితములై స్వీయావిరుద్ధములునగు జానపదధర్మములనున్ను॥సూ॥ "దేశజాతికులధర్మాశ్చామ్నాయైరప్రతిషిద్ధాః" దేశజాతికులధర్మములు శాస్త్ర నిషిద్ధములుకాగూడదవియె ప్రమాణములని గౌతమస్మృతివలన వణిగాదిధర్మను శ్రేణీధర్మములు ప్రతికులములకును నియతములగువాటినెరిగి వ్యవహారాదులందు తదవిరుద్ధములగువాటిని వ్యవస్థాపనముసేయవలెను॥ ౪౧॥

మూ॥ స్వాని కర్మాణి కుర్వాణాః దూరే సంతోఽపి మానవాః।ప్రి
యా భవంతి లోకస్య స్వేస్వే కర్మ ణ్యవస్థితాః॥ ౪౨॥

ఆత్మీయములగు జాతిదేశకులధర్మములను జేయుచు తమతమనిత్యనైమిత్తికాది కర్మములందువర్తించువారు దూరమందుండినను యనగా నొకచోనుండినను స్నేహములేకుండినను లోకమునకుప్రియులగుచున్నారు ఇదిప్రసంగవశమునజెప్పిప్రకృతమునుజెప్పుచున్నాడు॥ ౪౨॥

మూ॥ నోత్పాదయే త్స్వయం కార్యం రాజా నాప్యస్యపూరుషః।
నచ ప్రాపిత మన్యేన గ్రసే దర్థం కథంచన॥ ౪౩॥

రాజయినను రాజనియుక్తులైనను ధనలోభాదికముచే ఋణదానాదికార్యము నుబుట్టించగూడదు ఇందుకుకాత్యాయనుడు॥శ్లో॥ "నరాజాతువశిత్వేన ధనలోభేన వాపునః।స్వయంకర్మాణికుర్వీతనరాణామవివాదినాం"ధనాదిలోభముచేవివాదము లేనినరులకువివాదమురాజుపుట్టించకూడదనిఅర్థిచేనయినబ్రత్యర్థిచేనయినచెప్ప..డినకార్యమును ధనాదిలోభముచే నుపేక్షించరాదు॥ ౪౩॥

మూ॥ యథా నయ త్యసృక్పాతై ర్మృగస్య మృగయుః పదం।న
యే త్తథానుమానేన ధర్మస్య నృపతిః పదం॥ ౪౪॥

శస్త్రహతమగు మృగముండిచోటును రాలినరక్తముచే నేలాగువేటకాడు కనుక్కొనునోతగినప్రమాణములచేగాని ననుమానము వలననైనగాని యూహచేధర్మసూక్ష్మస్థానమును రాజు తెలుసుకొనవలెను॥ ౪౪॥

మూ॥ సత్య మర్థంచ సంపశ్యే దాత్మాన మథ సాక్షిణః। దేశం
రూపంచ కాలంచ వ్యవహారవిధౌ స్థితః॥ ౪౫॥

వ్యవహారదర్శనమందుండురాజు ఛలమును పరిహరించి సత్యమును జూడవలెను అర్థమనగా నర్థముగలగోహిరణ్యాది ధనవిషయస్థమగు వ్యవహారమును జూడవలెను నేనువీని చేకన్నుగిండముచే నపహసితుడనయితిననునట్టి స్వల్పాపరాధమును జూడవలెను తన్నిర్ణయము చేతతనను స్వర్గాదిఫలభాగినిగాను సత్యవాదులగుసాక్షులనున్ను దేశకాలోచిత వ్యవహారస్వరూప గురులఘుత్వాదికమును న్ను జూడవలెను॥ ౪౫॥

మూ॥ సద్భిరాచరితం యత్స్యా ద్ధార్మికైశ్చ ద్విజాతిభిః। తద్దేశ
కులజాతీనా మవిరుద్ధం ప్రకల్పయేత్॥ ౪౬॥

విద్వాంసులును ధర్మప్రధానులునగు ద్విజులచేనేది శాస్త్రమునుజూచి చేయబడెనో దేశకాలజాత్యవిరుద్ధముగ దానినిబట్టి వ్యవహారనిర్ణయమును గల్పించవలెను ఇదిసకలవ్యవహారసాధారణము పరిభాషాత్మకముగ చెప్పబడెను ఇప్పుడుబుణాదానమును ద్దేశించి చెప్పుచున్నాడు॥ ౪౬॥

మూ॥ అధమర్ణార్థ సిద్ధ్యర్థ ముత్తమర్ణేన చోదితః। దాప
యే ద్ధనికస్యార్థ మధమర్ణా ద్విభావితం॥ ౪౭॥

అధమర్ణుడనగా నప్పుపుచ్చుకున్నవాడు వాడివలనసినధనము రాబటుటకు త్తమర్ణునిచే బోధితుడగురాజు వక్ష్యమాణప్రకారములగు పత్రములు మొదలగువాటియందు ప్రతిపాదితమగుధనము నుత్తమర్ణునకధమర్ణునివలన నిప్పించవలెను॥

మూ॥ యైర్యై రుపాయై రర్థం స్వం ప్రాప్నుయా దుత్తమర్ణికః।
తైస్తై రుపాయై స్సంగృహ్య దాపయే దధమర్ణికం॥౪౮॥

వక్ష్యమాణములగు నేయేయుపాయములచేనుత్తమర్ణుడిచ్చిన సొమ్మునొందునో యయ్యయుపాయములచేత నధమర్ణునివలన నాధనమును రాబట్టియుత్తమర్ణునకిప్పించవలెను॥ ౪౮॥

మూ॥ ధర్మేణ వ్యవహారేణ ఛలేనాచరితేనచ ప్రయుక్తం సాధ

యేదర్థం పంచమేన బలేనవ॥ ౪౯॥

ఈచెప్పబడిన ధర్మాదులచే దాపాద్రవ్యను నిప్పించవలెను ధర్మమనగా॥ "శ్లో॥ సుహృత్సంబంధిసందిష్టైః సామ్నాచానుగమేనచ। ప్రాయేణవాఋణీదాప్యో ధర్మ ఏష ఉదాహృతః ఇతి" అధమర్ణుని మిత్రులుబంధువులు మొదలగువారిచేవతెలుపు నానాటు బంపుటచేనైనను మంచిమాటలచేనైనను అనుసరించడముచేనైనను ఋణి చేతకి ధనమిప్పించుట ధర్మమని కాత్యాయన వచనము ఇవ్వదగిన సొమ్మునధమ ర్ణుడు వివాదచేసెనేని వ్యవహారముచేతనున్ను॥ "శ్లో॥ అర్థే అపవ్యయమానం తు" యని చెప్పగలడు మేధాతిథియైతే అధమర్ణుడు సుస్వాధీనైతే వ్యవహారముచే ని ప్పించవలసినస్రా సెను మరిన్ని కృష్యాదికర్మములకు మనుష్యులగా బెట్టి బలులిచ్చినవా నివాక్యాదిఫలముచే వచ్చిన ధనమును బుచ్చికొనదగునని చెప్పుచున్నాడు ఛలా దులను కూడేదని బృహస్పతి చెప్పుచున్నాడు॥ "శ్లో॥ ఛద్మనాయాచితం చార్థ మానీయఋణికాద్బలీ। అన్వాహృతాదివాహృత్య దాప్యతేతత్రసోపధిః। దారపు త్రపశూన్ హృత్వా కృత్వా ద్వారోపవేశనం। యత్రార్థీ దాప్యతేర్థంస్వంత దాచరితముచ్యతే। బధ్వాస్వగృహమానీయ తాడనాద్యైరుపక్రమైః। ఋణీకో దాప్యతేయత్ర బలాత్కారః ప్రకీర్తిత ఇతి॥" ఋణిని యేదైనను మాయచే ధనము దిగసుచ్చుకొని అన్వాహృతము వల్లనువలెనందులోనించి దీసి ధనికి బలవంతుడిప్పిం చుట ఛలమనబడును పశుపుత్రదారాదులనరికట్టి ద్వారములోకూచుండి ధనిఋ ణివలన ధనమును బుచ్చికొనిననిది యాచరితమనబడును ఋణినికట్టియింటికిదీసుకు నివచ్చి తాడనాదులచేఋణివలన ధనమిప్పించబడునదిబలాత్కారమనబడును॥ ౪౯॥

మూ॥ యస్స్వయం సాధయే దర్థ ముత్తమర్ణోధమర్ణికాత్।
న స రాజ్ఞాభియోక్తవ్యః స్వకం సంసాధయన్ ధనం॥ ౫౦॥

ఉత్తమర్ణుడు డధమర్ణునివలన చిక్కుబడిన తనధనమును బలాత్కారాదుల చే సాధించుకొనిన రాజాయుత్తమర్ణుని నిషేధించరాదు॥ ౫౦॥

మూ॥ అర్థేఽపవ్యయమానంతు కరణేన విభావితం। దాపయేద్ధ
నికస్యార్థం దండలేశంచ శక్తితః॥ ౫౧॥

అధమర్ణుడు తాను బాకీలేదనియపహ్నవమొనర్చెనేని లేఖ్యసాక్షిదివ్యాదు

లచే నిశ్చితమగు ధనము నుత్తమర్ణునకు తనిపలన నిప్పించవలెను వక్ష్యమాణమగు దండము తద్ధనములో దశమాంశముగాని శక్తిబట్టి తక్కువగాని రాజు పుచ్చుకొనవలెను॥ ५०॥

మూ॥ అపహ్నవేధమర్ణస్య దేహీత్యుక్తస్య సంసది। అభియోక్తా దిశేద్దేశ్యం కరణంవాన్యదుద్దిశేత్॥ ५१॥

ఉత్తమర్ణునకుధనమిచ్చివెయ్యుమని సభలో ప్రాడ్వివాకునిచే చెప్పబడినయధమర్ణుడుబాకీలేదని పలికెనేని యప్పుడుత్తమర్ణుడు ధనమిచ్చినచోటేదో తద్దేశస్థులగుసాక్షులనున్ను లేఖ్యాదులనున్ను చెప్పికనపరచవలెను తరుచుగా స్త్రీమూఖాది సాధారణనిర్ణయసాక్షులచేతనే యగును గాన ముందుగా సాక్షులనున్ను లిఖితమును గనుపరచవలెను॥ ५१॥

మూ॥ అదేశ్యం యశ్చదిశతి నిర్దిశ్యాపహ్నుతేచ యః। యశ్చాధరోత్తరా నర్థాన్విగీతాన్నావబుధ్యతే॥ ५३॥

మూ॥ అపదిశ్యాపదేశ్యంచ పునర్యస్త్వపధావతి। సమ్యక్ప్రణిహితంచార్థంపృష్టస్సన్ నాభినందతి॥ ५४॥

మూ॥ అసంభాష్యే సాక్షిభిశ్చ దేశే సంభాషతే మిథః। నిరుచ్యమానం ప్రశ్నంచ నేచ్ఛేద్యశ్చాపి నిష్పతేత్॥ ५५॥

బ్రూహీత్యుక్తశ్చ నబ్రూయాదుక్తంచ నవిభావయేత్।
నచపూర్వాపరం విద్యాత్తస్మాదర్థాత్సహీయతే॥

ఋణగ్రహణకాలమందధమర్ణుడెచ్చటనుండెనని చెప్పెనో యాదేశమందు ఋణిసర్వదాయుండడని పలికి యునట్లు నేనుచెప్పలేదని యెవడు తప్పబలుకునో ఎవడుముందుగా సత్యమైనయర్థముగలమాటలనులేక పలికెడిమాటలాపూర్వోక్తములకువిరుద్ధములని తెలియడో యెవడుతనచేతితోనింతసొమ్మిచ్చితినననిదేశించి నాపుతుడిచ్చెనని మొదలగుమాటలచే తప్పిపోవునో ఎవడు లెస్సగా నర్థముగల మాటలేలనచెప్ప రాత్రియందసాక్షికముగ నెందుకిచ్చితివని ప్రాడ్వివాకుడడిగిననా మాటకు సమాధానమును జెప్పడో ఎవడుసాక్షులతో నిర్జనస్థలమందురహస్యముగ సంభాషించునో చెప్పినయర్థమును స్థిరపరుచుటకు ప్రాడ్వివాకుడుచేసెడుప్రశ్న

శ్నము నెవడా మోదించడో చెప్పబడిన వ్యవహారపుమాటలనుమున్ను చెప్పకనువలె దాచెప్పెడి స్థానమునువిడిచి మరియొకచోటి కెవడుబోవునో ఎవడు చెప్పుమనియడిగిన నేమియుం జెప్పకుండునో చెప్పబడినసాధ్యమునకు ప్రమాణము నెవడు గనుపరచడో ముందుసాధనము పిదపసాధ్యముఁ దియెవడెఱుగడో ఎవడుసాధనమును సాధ్యముగా జెప్పునో ఎవడుసంభావితమనగా శశశృంగగతమగు ధనువు దెలియదగినదన్నట్లుగా నసాధ్యమునుమానముచే సాధ్యముగానిర్దేశించునో వాడాదావాద్రవ్యమునకు చెడును॥౫౩॥౫౪॥౫౫॥౫౬॥

మూ॥ సాక్షిణస్సంతి మేత్యుక్త్వా దిశేత్యుక్తో దిశేన్నయః। ధర్మ
స్థకారణైరేతైర్హీనం తమపి నిర్దిశేత్॥ ౫౭॥

సాక్షులున్నారని చెప్పి యెవరా సాక్షులను చెప్పుమనియడిగితె చెప్పకనూరకుండినవాఁడున్ను పరాజితుఁడేయని ప్రాడ్వివాకుఁడు జెప్పవలెను "జ్ఞాతారస్సంతిమేత్యుక్త్వా"యని పాఠాంతరము - ఇకారమునకు పరరూపముఛాందసము॥ ౫౭॥

మూ॥ అభియోక్తా నచేద్బ్రూయా ద్బధ్యోదండ్యశ్చ ధర్మతః। న
చేత్త్రిపక్షాత్ప్రబ్రూయా ద్ధర్మం ప్రతిపరాజితః॥ ౫౮॥

అభియోక్త రాజస్థానమందు చెప్పుకొని యామాటనుస్థిరపరచడో యాతప్పు పెద్దదైతే బధ్యుఁడున్ను స్వల్పమైతే దండ్యుఁడున్ను ధర్మప్రకారముచే గావలెను ప్రత్యర్థి మూఁడుపక్షములలోగా చెప్పుకోకపోయిన యెడల ధర్మమువలనవాఁడె పరాజితుడగును॥ ౫౮

మూ॥ యో యావన్నిహ్నువీతార్థం మిథ్యాయావతి వావదేత్।
తౌనృపేణ హ్యధర్మజ్ఞౌ దాప్యౌత ద్ద్విగుణంధనం॥౫౯॥

ప్రతివాది పుచ్చుకున్నయప్పు నెంతసొమ్ము లేదనునో వాది యెంతసొమ్మును పుచ్చుకొనుటకనృతమాడునో వారుభయులు ననృతవాదులుగాన ఆయా ధనములకు ద్విగుణముగ దండముపుచ్చుకొనవలెను అధర్మజ్ఞావనుటచే తప్పులు జ్ఞానపూర్వకములైతేనే యీదండుముగ ప్రమాదముచే మాటతప్పుగలిగెనేని నూటికి పదింటిచొప్పున పుచ్చుకొమ్మని చెప్పగలడు॥ ౫౯॥

మూ॥ పృష్టోపవ్యయమానస్తు కృతావస్థో ధనైషిణా। త్ర్యవరై

స్సాక్షిభి ర్భావ్యో నృపబ్రాహ్మణ సన్నిధౌ॥ ౬౦॥

•ఇచ్చిన యప్పును పుచ్చుకొనగోరుచున్న యుత్తమణునిచే జెప్పబడిన పిద ప రాజపురుషులచే బట్టించబడిన యధమణుఁడు బాకీలేదని యాచ్ఛాదించెనేని •ధనియొక్క సాక్షులను మువ్వురికి తక్కువగాకుండ రాజుచేనివ్వబడిన ధర్మాధికార ముగల బ్రాహ్మణుడు రుజువు పుచ్చుకొనవలెను॥ ౬౦॥

మూ॥ యాదృశా ధనిభిః కార్యా వ్యవహారేషు సాక్షిణః। తా దృశాన్ సంప్రవక్ష్యామి యథా వాచ్య మృతంచ తైః॥౬౧॥

ఋణాదానాదివ్యవహారమందు ఉత్తమణునిచే నెట్టి సాక్షులు తేబడవలెనో యా సాక్షులెట్లు పలకవలెనో యాప్రకారమును చెప్పుచున్నాను॥ ౬౧॥

మూ॥ గృహిణః పుత్రిణో మౌలాః క్షత్రవిట్శూద్రయోనయః। అర్థ్యుక్తాః సాక్ష్య మర్హంతి నయే కేచి దనాపది॥౬౨॥

భార్యయు పిల్లలును గలవారును స్వదేశస్థులునగు సాక్షులు వాదిచే కోరబ డిన వారనాపదియనగా ఋణాదానాదివ్యవహారమందు సాక్ష్యమున కర్హులు పుత్రదారాదులుగలవా రబద్ధమాడుటకు భయపడుదురు స్వదేశస్థులన్యథా చెప్ప నేరరని ఇట్టివారే గావలె నన్యులుగారాదు ఆపద యంద్రైతేననగా వాక్పారుష్య దండపారుష్య స్త్రీసంగ్రహాదులందు క్తవ్యతిరిక్తులైనను సాక్షులు గావచ్చును॥౬౨॥

మూ॥ ఆప్తాః సర్వేషు వర్ణేషు కార్యాః కార్యేషు సాక్షిణః। సర్వధర్మవిదో లుబ్ధా విపరీతాంస్తు వర్జయేత్॥౬౩॥

"క్షత్రవిట్శూద్రయోనయః" యని చెప్పబడెను బ్రాహ్మణపరిగ్రహము కొరకు సర్వవర్ణేషుయని చెప్పుట అన్నివర్ణములయందున్ను తెలిసినంత చెప్పెడువారు న్ను సకలజ్ఞానముగలవారున్ను యలుబ్ధులున్ను కార్యములందు సాక్షులు గావలె ను క్తవ్యతిరిక్తులు సాక్షులుగా గూడదు॥ ౬౩॥

మూ॥ నార్థసంబంధినో నాప్తా నసహాయా నవైరిణః। నదృష్టదోషాః కర్తవ్యా నవ్యాధ్యార్తా నదూషితాః॥ ౬౪॥

ఋణము పుచ్చుకోవడము మొదలగు ధనసంబంధముగలవారును మిత్రులునుత

నపరిచారకులును శత్రువులును స్థానాంతరము వలన వచ్చిన కూటసాక్షులును రోగపీడితులును మహాపాతకాదిదూషితులును వీరిని సాక్షులనుగా జేయదగదు- లోభరాగద్వేష స్మృతిభ్రంశాదు లన్యథాపలుకుటకు హేతువులగును గావున నట్లు జెప్పుట॥ ౬౪॥

మూ॥ నసాక్షీ నృపతిః కార్యో నకారుక కుశీలవౌ।
నశ్రోత్రియో నలింగస్థో నసంగేభ్యో వినిర్గతః॥ ౬౫॥

ప్రభువుగాన సాక్షినడిగెడి క్రమముచే నడుగుట కశక్యమగు రాజున్ను స్వస్వకర్మములందు సక్తులు గావుననున్నుతరుచుగా ధనలుబ్ధులు కాననున్ను సూపకారాదులున్ను నటాదులున్ను స్వాధ్యాయాగ్నిహోత్రాదికర్మవ్యగ్రులుగాన శ్రోత్రియులున్ను బ్రహ్మచారియు యతియును సాక్షులనుగా గోరగూడదు- అగ్నిహోత్రాది వ్యగ్రుడుగాని బ్రాహ్మణునకు నిషేధములేదు॥ ౬౫॥

మూ॥ నాధ్యధీనో నవక్తవ్యో నదస్యుర్నవికర్మకృత్।
నవృద్ధో నశిశు ర్నైకో నాంత్యో నవికలేంద్రియః॥ ౬౬॥

పరాధీనుడు గావున గర్భదాసుడున్ను స్వవిహితకర్మము విడిచి లోకనింద గలవాడున్ను దస్యుడనగా చోరుడున్ను నిషిద్ధకర్మములను జేసెడివాడున్ను వీరందరికి రాగద్వేషములు సంభవించును గాన స్మృతివికలత్వముండునుగాన వృద్ధుడున్ను వ్యవహారానభిజ్ఞుడు గాన బాలుడున్ను నశించును ప్రవాసముబోవునుగాననొకడున్ను "త్ర్యవరైః"యని విధివల్లనుండెన్ని ఒంటిసాక్షిన్ని-ఇద్దరికితక్కువగూడదని నిషేధము కల్పించుచున్నది కర్మానభిజ్ఞుడు గాన చండాలుడున్ను జ్ఞాపకముండదు గాన వికలేంద్రియుడున్ను వీరుసాక్ష్యమునకు కొరగారు గాన సాక్షులనుగా జేయరాదు॥ ౬౬॥

మూ॥ నార్తో నమత్తో నోన్మత్తో నక్షుత్తృష్ణోపపీడితః।
నశ్రమార్తో న కామార్తో నక్రుద్ధో నాపి తస్కరః॥ ౬౭॥

స్వబంధు మరణాదులచే నార్తుడగువాడున్ను మద్యాదులచేమత్తుడున్ను పైత్యాదులచే వెర్రివాడున్ను క్షుత్పిపాసాదులచే పీడితుడున్ను మార్గగమనముచే శ్రమగలవాడున్ను కామాతురుడున్ను క్రోధిన్ని దొంగవాడున్ను సాక్షులుగా జే

యబడరాదు యిందులో నార్తులందరున్ను బుద్ధివికలతేనున్ను చోరుడధార్మికుడ గుటచేతనున్ను నని॥ ౬౭॥

మూ॥ స్త్రీణాం సాక్ష్యం స్త్రియః కుర్యుర్ద్విజానాం సదృశా ద్విజాః।
శూద్రాశ్చ సంతశ్శూద్రాణా మంత్యానా మంత్యయోనయః॥ ౬౮॥

స్త్రీలయొక్క ఋణదానాదికమందు స్త్రీలున్ను బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు క్రమముగా సజాతీయులున్ను శూద్రులకు సాధులగు శూద్రులున్న ఇందుకు యాజ్ఞవల్క్య॥ శ్లో॥ "యథాజాతి యథావర్ణం సర్వేసర్వేషు తాస్స్మృతాః" సజాతీయులు కుపవర్ణులున్ను అందరికిని అందరునయిన గావచ్చునని॥ ౬౮॥

మూ॥ అనుభావీతు యఃకశ్చి త్కుర్యాత్సాక్ష్యం వివాదినాం। అం
తర్వేశ్మ న్యరణ్యేవా శరీరస్యాపి చాత్యయే॥ ౬౯॥

గృహములోపలగాని యరణ్యమందుగాని చోరాతతాయికృత దేహాపఘాతాదిపీడగలిగినప్పుడు యెవడుండేవాడే సాక్ష్యమునకు పయోగించును ఋణాదానాదికమందువలె నుక్తలక్షణులేగావలెనని లేదు అజ్ఞేయుడాపంర్ణముచేస్తున్నట్టు చెబుచున్నాడు॥ ౬౯

మూ॥ స్త్రియాప్యసంభవే కార్యం బాలేన స్థవిరేణవా। శిష్యే
ణ బంధునా వాపి దాసేన భృతకేనవా॥ ౭౦॥

అంతర్గృహాదులలో జరిగినదానికి తగినసాక్షులుసంభవించనప్పుడు స్త్రీబాలవృద్ధశిష్యబంధుదాసకర్మకారులచే సాక్ష్యముప్పుచ్చుకొనవచ్చును ఊయూబాలాదులస్థిరబుద్ధులుగదా సాక్ష్యమునకెట్లుదగుదురంటే దానికిచెప్పుచున్నాడు॥ ౭౦॥

మూ॥ బాల వృద్ధాతురాణాంచ సాక్ష్యేషు వదతాం మృషా।జా
నీయా దస్థిరాం వాచ ముత్సిక్త మనసాం తథా॥ ౭౧॥

బాలవృద్ధాతురాదులకు మనస్సుస్థిరముగాదుగాపున వారుచెప్పినసాక్ష్యమబద్ధమైన నామాటలచే నర్థమునుమానముచేసనగా నూహచేతెలియవలెను। సూ॥ "యథోక్తవాగ్వ్యభిచారే లింగైరితి" చెప్పబడినదానిబట్టి వాక్యములచేతను చిహ్నములచేతనున్ను నిజమునుభావించవలెనని॥ ౭౧॥

మూ॥ సాహసేషు చ సర్వేషు స్తేయసంగ్రహణేషు చ। వాగ్దండ
యోశ్చ పారుష్యే న పరీక్షేత సాక్షిణః॥ ౭౨॥

గృహదాహాదిసాహసములయందున్ను చోర్యస్త్రీసంగ్రహ వాక్పారుష్యదండ పారుష్యములందున్ను "గృహిణఃపుత్రిణఇత్యాది" పరీక్షయక్కరలేకుండ స్త్రీయేత్యాద్యుక్తసాక్షులనే స్వీకరించవచ్చును॥ ౭౨॥

మూ॥ బహుత్వం పరిగృహ్ణీయాత్సాక్షిద్వైధే నరాధిపః। సమే
షు తు గుణోత్కృష్టాన్ గుణిద్వైధే ద్విజోత్తమాన్॥ ౭౩॥

బహుమందిసాక్షులు పరస్పరవిరుద్ధముగ సాక్ష్యమిచ్చినప్పుడు రాజు ఎక్కువమంది వానినే గ్రహించవలెను విరుద్ధార్థముగా బలికిన సాక్షులు సమసంఖ్యగలిగినప్పుడందులో గుణవంతులసాక్ష్యమున్ను ఆగుణవంతులలో విరుద్ధమైతే ద్విజశ్రేష్ఠులనగా కార్మికుల సాక్ష్యమును ప్రమాణముగ జేయవలెను అదిగాకనే బృహస్పతి॥ శ్లో॥ "గుణిద్వైధే క్రియాయుక్తా ఇతి" గుణవంతుల సాక్ష్యము పరస్పరవిరుద్ధమైనప్పుడు కర్మశ్రేష్ఠ సాక్ష్యము ప్రమాణమని గోవిందరాజు గుణవంతుల ప్రతిపత్తియందు ద్విజోత్తములనగా బ్రాహ్మణులను నమ్మవలెనని వ్రాసెను॥ ౭౩॥

మూ॥ సమక్షదర్శనాత్సాక్ష్యం శ్రవణాచ్చైవ సిధ్యతి। తత్రసత్యం
బ్రువన్సాక్షీ ధర్మార్థాభ్యాం న హీయతే॥ ౭౪॥

చూడదగినదానిని కళ్ళతో జూచిన్ని వినతగినదానిని వినిన్ని పలికినసాక్ష్యము సిద్ధించును సత్యముగా జెప్పిన సాక్షికి ధర్మార్థములు నశించవు సత్యవచనముచేతనే ధర్మప్రాప్తివల్లనున్ను దండము లేకుంటె హానిలేదు గనుకనున్ను॥ ౭౪॥

మూ॥ సాక్షీ దృష్టశ్రుతాదన్యద్విబ్రువన్నార్యసంసది। అవాఙ్న
రకమభ్యేతి ప్రేత్య స్వర్గాచ్చ హీయతే॥ ౭౫॥

సాక్షి దృష్టశ్రుతములకు విరుద్ధముగ జెప్పిన దలక్రిందుగా నరకమునబడును దా జేసిన పుణ్యముచే స్వర్గమునకు పోడు॥ ౭౫॥

మూ॥ యత్రానిబద్ధోపీక్షేత శృణుయాద్వాపి కించన। పృష్టస్త
త్రాపి తద్బ్రూయాద్యథాదృష్టం యథాశ్రుతం॥ ౭౬॥

నిశ్చయముగ సాక్షిగా వలెనని నిర్ణయించబడకున్నను ఋణదానాదికమును జేసిన చూచెనో వాక్పారుష్యాదికమును దేనిని వినెనో దానిని యా సాక్షి యడుగబడినవాఁడై తెలిసినంత చెప్పవలెను ఇతఁడకృతసాక్షి సామాన్యముగా మనువుచే జెప్పబడెను దీనికి- "శ్లో॥ గ్రామశ్చ ప్రాడ్వివాకశ్చ రాజా చే"త్యాదికముచే నారదాదులు వచనమును జెప్పిరి॥ ౭౬॥

మూ॥ ఏకోఽలుబ్ధస్తు సాక్షీ స్యాద్బహ్వ్యశ్శుచ్యోఽపి న స్త్రియః।
స్త్రీబుద్ధేరస్థిరత్వాత్తు దోషైశ్చాన్యేఽపి యే వృతాః॥ ౭౭॥

లోభాదిదోషయుక్తుఁడుగాని సాక్షి యొకఁడైన నుపయోగించును॥ "శ్లో॥ శుచిక్రియశ్చ ధర్మజ్ఞస్సాక్షీ యత్రానుభూతవాక్। ప్రమాణమేకోఽపి భవేత్ సాహసేషు విశేషతః॥" కామికుఁడును ధార్మికుఁడును వివాదమెఱిఁగినవాఁడునగు సాక్షి యొకఁడైనను ప్రమాణమగుచున్నాఁడు సాహసాదులందు చెప్పఁదగియుని వ్యాసవచనము మేధాతిథి గోవిందరాజులు "ఏకోఽలుబ్ధస్త్వసాక్షీ స్యా"దని పఠించి వ్యాఖ్యానము చేసిరి లుబ్ధుఁడును ఒకఁడు సాక్షిగా రాదని వ్రాసిరి అలుబ్ధుఁడును గుణవంతుఁడు నొకఁడైనను సాక్షి ప్రమాణమగును స్త్రీలు బహుమందియైనను స్థిరబుద్ధులు గారు గావున ఋణాదానాదులు పర్యాలోచితవ్యములు గావున నుపయోగించరు పర్యాలోచితములుగాని చౌర్యాదులందు "స్త్రీయాం శ్వసంభవే కార్య"మని చెప్పబడెను ఇతరులున్న చౌర్యాదిదోషమాషితులగువారు సాక్షులుగా కూడదు॥ ౭౭॥

మూ॥ స్వభావేనైవ యద్బ్రూయుస్తద్గ్రాహ్యం వ్యావహారికం।అ
తో యదన్యద్విబ్రూయుర్ధర్మార్థం తదపార్థకం॥ ౭౮॥

సాక్షి భయాదివ్యతిరిక్తముగా స్వభావముచే నేదిచెప్పునో యది వ్యావహారికము గ్రాహ్యము స్వాభావమునకంటె నన్యమగునది యేదిచెప్పిన నది యపార్థకముగా నగ్రాహ్యముగాదు॥ ౭౮॥

మూ॥ సభాన్తస్సాక్షిణః ప్రాప్తానర్థిప్రత్యర్థిసన్నిధౌ। ప్రా
డ్వివాకోఽనుయుంజీత విధినానేన సాంత్వయన్॥ ౭౯॥

సభలోనికివచ్చిన సాక్షులను మృదువాక్యములచే ననునయించుచు వాదిప్రతివాదుల యెదుటను ప్రాడ్వివాకుఁడీప్రకారముగ నడుగవలెను॥ ౭౯॥

మూ॥ యద్ద్వయోరనయోర్వేత్థ కార్యేస్మిన్ చేష్టితం మిథః। త
ద్బ్రూతసర్వం సత్యేన యుష్మాకం హ్యత్రసాక్షితా॥౮౦॥

ఈవాదిప్రతివాదుల కన్యోన్యముజరిగిన కృత్యమును మీరేమెరుగుదురో దానిని సత్యముగా జెప్పుడు మీకు సాక్ష్యముసంభవించెనుగాన॥ ౮౦॥

మూ॥ సత్యం సాక్ష్యే బ్రువన్ సాక్షీ లోకానాప్నోతిపుష్కలాన్।
ఇహచానుత్తమాంకీర్తిం వాగేషాబ్రహ్మపూజితా॥ ౮౧॥

సాక్ష్యకర్మమందు సాక్ష్యము సత్యమును జెప్పిసాక్షిపుష్కలములగు పుణ్యలోకములబొందును ఇహమందుత్కృష్టమగు ఖ్యాతినిన్ని బొందును ఈవాక్కును చతుర్ముఖుడు మెచ్చి సత్కరించునుగదా॥ ౮౧॥

మూ॥ సాక్ష్యేనృతం వదన్ పాశైర్బధ్యతే వారుణైర్భృశం।వి
వశశ్శతమాజాతీ స్తస్మాత్సాక్ష్యం వదేదృతం॥ ౮౨॥

ఏహేతువుచే సాక్షిసాక్ష్యమందనృతమును బలికి నూరుజన్మములపర్యంతమును వరుణసంబంధములగు నాగపాశములచే బద్ధుడయిన్ని జలోదరము చేతనున్ను పీడితుడగును గావున సాక్ష్యమును సత్యముగ బలుకవలెను॥ ౮౨॥

మూ॥ సత్యేనపూయతే సాక్షీ ధర్మస్సత్యేనవర్ధతే। తస్మాత్సత్యం
హి వక్తవ్యం సర్వవర్ణేషు సాక్షిభిః॥ ౮౩॥

సాక్షిసత్యముచెప్పి పూర్వజన్మార్జితపాపములవల్లనున్ను విముక్తుడగును తనకు ధర్మమున్ను వృద్ధినొందును గాన సర్వవర్ణముల విషయమై సాక్ష్యమున్ను సత్యమే పలుకవలెను॥ ౮౩॥

మూ॥ ఆత్మైవహ్యాత్మనస్సాక్షీ గతిరాత్మా తథాత్మనః।
మావమంస్థాస్స్వమాత్మానం నృణాం సాక్షిణముత్తమం॥ ౮౪॥

మంచి చెడ్డలు దెలిసెడిచో దనకు ఆత్మావేసాక్షి తనయొక్కశుభాశుభకర్మప్రతిష్ఠకు ఆత్మేసాధనము గావున మనుష్యులకునుత్తమసాక్షియగు స్వాత్మ ననృతమునాడి యవమానపరచకుము॥ ౮౪॥

మూ॥ మన్యంతేవై పాపకృతో నకశ్చిత్పశ్యతీతినః।

తాంస్తు దేవాః ప్రపశ్యంతి స్వస్యైవాంతర పూరుషః॥ ౮౫॥

పాపకర్మమును జేసెడి జనులు మమ్మెవ్వరున్ను జూడలేరని తలచెదరువా రుచేసెడి కర్మములను సంరక్షకులగు దేవతలును స్వాంతరపురుషుడున్ను చూచు చున్నేయున్నారు॥ ౮౫॥

మూ॥ ద్యౌర్భూమి రాపో హృదయం చంద్రార్కాగ్ని యమానిలాః।
రాత్రి స్సంధ్యేచ ధర్మశ్చ వృత్తజ్ఞా స్సర్వదేహినాం॥ ౮౬॥

ఆకాశము భూమి జలము హృదయము చంద్రుడు సూర్యుడు వహ్ని యముడు పవనుడు రాత్రి రెండుసంధ్యలు ధర్మదేవత వీరందరుననగా నాకాశాద్యధిష్ఠాన దేవతలు సకల ప్రాణులయొక్కయు వ్యాపారమును దెలియుచున్నేయున్నారుశ్రు త్యర్థము లిట్లున్నవి గావున తత్ప్రామాణ్యముచే నిట్లుజెప్పబడెను॥ ౮౬॥

మూ॥ దేవబ్రాహ్మణ సాన్నిధ్యే సాక్ష్యం పృచ్ఛేదృతం ద్విజాన్।
ఉదఙ్ముఖాన్ ప్రాఙ్ముఖాన్వా పూర్వాహ్ణే వై శుచిశ్శుచీన్॥ ౮౭॥

ప్రతిమారూపదేవబ్రాహ్మణ సన్నిధానమందు ఉత్తరముఖముగానైనపూర్వా భిముఖముగానైననుండి శుచులై బ్రాహ్మణాదిసాక్షులను తానున్ను శుచియైప్రా డ్వివాకుడు పూర్వాహ్ణమందు సత్యమునుజెప్పుడని యడుగవలెను॥ ౮౭॥

మూ॥ బ్రూహీతి బ్రాహ్మణం పృచ్ఛేత్సత్యం బ్రూహీతి పార్థివం।
గోబీజకాంచనై ర్వైశ్యం శూద్రం సర్వైస్తు పాతకైః॥ ౮౮॥

చెప్పుమని బ్రాహ్మణునిన్ని సత్యముగా బలుకుమని క్షత్రియునిన్ని గోబీజసువ ర్ణములను హరించిన పాపమగు నసత్యమాడితివేని వైశ్యునిన్ని అబద్ధమంటి వేని సకలపాపములు నీకు సంభవించునని శూద్రునిన్ని సాక్ష్యమడుగవలెను॥ ౮౮॥

మూ॥ బ్రహ్మఘ్నో యే స్మృతా లోకా యే చ స్త్రీ బాలఘాతినః।
మిత్రద్రుహః కృతఘ్నస్య తే తే స్యు బ్రువతో మృషా॥ ౮౯॥

బ్రహ్మహత్యయు స్త్రీహత్యయు బాలహత్యయు జేసిన వారికిన్ని మిత్రద్రోహి కిన్ని కృతఘ్నునకున్ను యేనరకములు గలుగునో యనృతమును జెప్పితివేని యానర కములన్నియు నీకు సంభవించునని సాక్ష్యమడుగవలెను॥ ౮౯॥

మూ॥ జన్మప్రభృతియత్కించి త్పుణ్యం భద్రత్వయా కృతం ।
తత్తే సర్వం శునో గచ్ఛే ద్యదిబ్రూయా స్త్వమన్యథా॥౯౦॥

ఓశుభాస్పదుడా జన్మాదిగా నీవుయేమి పుణ్యమును జేసితివో యిప్పుడున్నదాని నున్నట్టు చెప్పవేనియదియెల్లను కుక్కపాలయి పోవును॥ ౯౦॥

మూ॥ ఏకోహ మస్మీ త్యాత్మానం యత్త్వం కల్యాణమన్యసే।
నిత్యం స్థితస్తే హృద్యేష పుణ్యపాపేక్షితా మునిః॥౯౧॥

ఓ మంగళకరుడా నేనొక్కనే జీవుడనై యుంటినని తలచకుము పాపపుణ్యములను జూచుచు సర్వజ్ఞుడు సర్వదా నీలోనున్నాడు ఇందుకు శ్రుతి "ద్వాసుపర్ణా సయుజాసఖాయాసమానంవృక్షంపరిషస్వజాతే। తయోరన్యఃపిప్పలంస్వాద్వత్త్యనశ్నన్నన్యోఅభిచాకశీతి" రెండుపక్షులు స్నేహితులన్యోన్యము వదలనివిసమముగా వృక్షమునాశ్రయించియున్న వనగా నిత్యయోగముగల జీవాత్మపరమాత్మలు రెండు నీసంసారమును బట్టియుండె నారెంటిలో నొకటి జీవాత్మవిషయసుఖము ననుభవించుచుండెను ఇంద్రియముల కందక నిరపేక్షతో నొకటి పరమాత్మస్వయముగా బ్రకాశించుచుండెనని॥ ౯౧॥

మూ॥ యమో వైవస్వతో దేవో యస్తవైష హృదిస్థితః।
తేనచే దవివాదస్తే మాగంగాం మాకురూన్గమః॥౯౨॥

సర్వమును లయమొనర్చుచుండు పరమాత్మ దండధారిగావున వైవస్వతుడు నిగ్రహించెడువాడు గాన దేవుడెవడు నీహృదయమం దంతర్యామియుండెనో అతనితో యథార్థమును జెప్పెడు నీకువివాదలేకుండెనేని నీమనస్సుకు తెలిసినదొకటి నీవన్యథా చెప్పితివేని నీకును నీమనస్సుకును వివాదముగలుగును ఇట్లుగాక మనసెరిగినదే చెప్పితివేని ఆసత్యముచేతనే నీవు నిష్పాపుడవు పాపముపోగొట్టుకొనుటకు నీవు గంగకు కురుక్షేత్రమునకుపోకుము గంగాకురుక్షేత్రములకు సామ్యమునకు మత్స్యపురాణము॥ "శ్లో॥ కురుక్షేత్రసమాగంగాయత్రతత్రావగాహితా" యని యేస్థలమందుమునిగినా గంగ కురుక్షేత్రసేవాతుల్యఫలమునిచ్చునని ఈశ్లోకమునకు మేధాతిథి గోవిందరాజులు సూర్యపుత్రుడగు యమదేవుడు దక్షిణదిక్పతిలోకములోవినుటవలన నీహృదయమందుండు నతనితో నీవు ధర్మకారివి గావున నీకువివాద లేదుగాన గంగకును కురుక్షేత్రమునకును పోకుమని వ్యాఖ్యానమొనర్చిరి॥ ౯౨॥

మూ॥ పంచ పశ్వనృతే హంతి దశహంతి గవానృతే । శతమశ్వా
నృతే హంతి సహస్రం పురుషానృతే॥ ౯౮॥

పశువిషయమై యనృతమాడెనేని యైదుగురు బంధువులనునరకమందుఁద్రోయును అట్టిపాపమునొందును ఇట్లేయనృతముగోవిషయమైతే పదిమందినిన్ని అశ్వవిషయమయితే వేయుమందినిన్ని బంధువులను నరకమందు ద్రోయునట్టి పాపము నొందును॥ ౯౮॥

మూ॥ హంతి జాతానజాతాంశ్చ హిరణ్యార్థేనృతం వదన్।స
ర్వం భూమ్యనృతేహంతి మాస్మభూమ్యనృతంవదీః॥౯౯॥

హిరణ్యార్థమనృతమాడెనేనిపుట్టియున్నట్టియుపుట్టగలట్టియు పుత్రాదులను నరకమునద్రోయును వారినిజంపిన దోషమునొందును భూమి విషయమై యనృతమాడెనేనిసకలప్రాణివధచేసినదోషమునొందును గానభూవిషయమై యనృతమాడకుము॥ ౯౯॥

మూ॥ అప్సుభూమివదిత్యాహుః స్త్రీణాంభోగేచ మైథునే। అబ్జే
షుచైవ రత్నేషు సర్వేష్వశ్మమయేషుచ॥ ౧౦౦॥

ఉదకములనగా నూతులుచెరువులు మొదలగువాటివిషయమయిన్ని స్త్రీసంభోగము జలభవములగు ముత్తెములు మొదలగునవి శిలామయములగు సర్వరత్నములు వీటివిషయమై యనృతమాడెనేని భూమ్యనృతదోషమునే పొందును॥ ౧౦౦॥

మూ॥ ఏతాన్ దోషా నవేక్ష్యత్వం సర్వాననృతభాషణే యథా
శ్రుతం యథాదృష్టం సర్వమేవాంజసావద॥ ౧౦౧॥

ఈచెప్పబడినయనృతముచేనగుదోషములను దెలిసి వినినది కనినది తప్పిపోకుండ చెప్పుము॥ ౧౦౧॥

మూ॥ గోరక్షకాన్ వాణిజకాన్ తథా కారు కుశీలవాన్ । ప్రే
ష్యాన్ వార్ధుషికాంశ్చైవ విప్రాన్ శూద్రవదాచరేత్॥౧౦౨॥

గోరక్షణము వాణిజ్యము వంటమొదలగుపనులును గానానాట్యాదులు దాసత్వము వడ్డిజీవనమును వీటిచేబ్రతికెడిబ్రాహ్మణుని శూద్రునివలెనే వర్తించవలెను.

మూ॥ తద్వదన్ ధర్మతోర్థేషు జానన్నప్యన్యథానరః । నస్వ

గాచ్చ్యవతే లోకా ద్దైవీం వాచం వదంతి తాం॥౧౦౩॥

ఈసాక్ష్యమన్యథా దెలిసియు నగుడు దయాదిధర్మముచే వ్యవహారములం దన్యథా దెలియజేసి స్వర్గమునుండి భ్రష్టుడు గాడు ఇట్టిమాట దైవవాక్యముచే సత్యవచనమే యగును గావున నావాక్కు వేదసంబంధమైనదని మన్వాదులు చెప్పిరి ఎక్కడో నిట్లసత్యమాడవలెనంటే దానిని చెప్పుచున్నాడు॥ ౧౦౩॥

మూ॥ శూద్రవిట్క్షత్రవిప్రాణాం యత్రర్తోక్తౌ భవేద్వధః। తత్ర
వక్తవ్యమనృతం తద్ధిసత్యాద్విశిష్యతే॥ ౧౦౪॥

ఏవ్యవహారమందు సత్యమును బలికినయెడల శూద్రవైశ్యక్షత్రియవిప్రులకు వధ యగునో యచ్చట నసత్యము పలకతగినది యేవిషయములో నేయసత్యమో యా ద్విప్రాణరక్షణమందు సత్యముగుచున్నదేగాదు విశేషించుచున్నది ఇది ప్రమాదముచేనధర్మము జరిగినవిషయముగాని అత్యంతధార్మికబుద్ధిపూర్వకస్తేనాదివిషయము గాదు॥ "సూ॥ నానృతవదనేదోషో యజ్జీవనంచేత్తదధీనం నతుపాపీయసోజీవనమితి॥" యేయనృతాధీనమైన జీవనమాయనృతవాదము దోషముగాదు పాపతమునిజీవనవిషయమిట్లుగాదని గౌతమవచనము॥ "శ్లో॥ నజాతుబ్రాహ్మణం హన్యాత్సర్వపాపేష్వవస్థితమితి-" యెల్లపాపములయందు నెకుడై యున్నదిగాన బ్రాహ్మణుని జంపరాదని మనువే చెప్పగలడు గావున బ్రాహ్మణవధప్రసక్తియనిగాదు రాజుగ్రదండుడు గనుక నేలాగునైన సంభవించును గావున ఈశ్లోకమందు శూద్రాదిక్రమము వధ యమంగళముగావున॥ ౧౦౪॥

మూ॥ వాగ్దైవత్యైశ్చచరుభిర్యజేరంస్తే సరస్వతీం। అనృతస్యై
నసస్తస్య కుర్వాణానిష్కృతింపరాం॥ ౧౦౫॥

ఆసాక్షులాయనృతదోషప్రాయశ్చిత్తార్థము వాగ్దైవత్యములగు మూడుచరువులచేతను సరస్వతీయాగమును జేయవలెను ఇచ్చట ప్రాయశ్చిత్తప్రకరణము యనను లాఘవార్థము ఆప్రకరణమందు శూద్రవిట్క్షత్రియ్యాద్యపృథక్కను ప్రాయుట గౌరవము గావున॥ ౧౦౫॥

మూ॥ కూశ్మాండైర్వాపిజుహుయా ద్ఘృతమగ్నౌ యథావిధి। ఉ
దిత్యృచావావారుణ్యా తృచేనాబ్దైవతేనవా॥ ౧౦౬॥

యద్దేవా దేవహేళనమిత్యాది కూశ్మాండమంత్రములచేనైన ఉదుత్తమంవరుణపాశమిత్యాది వారుణమంత్రములచేనైన ఆపోహిష్ఠేతి జలదైవత్యమంత్రముచేనైన నగ్నిముఖవిధానపూర్వకముగ నేయిచే నగ్నియందు హోమము జేయవలెను॥

మూ॥ త్రిపక్షాదబ్రువన్ సాక్ష్య మృణాదిషు నరోఽగదః। తదృణం
ప్రాప్నుయాత్సర్వం దశబంధంచ సర్వతః॥ ౧౦౭॥

సాక్షి రోగపీడ లేకుండ నీబుణాదానాదివ్యవహారమందు మూడుపక్షములు దనుకబలుకకుండెనేని యాఋణమంతయును నుత్తమర్ణునికిన్ని యాధనములో పదోపాలు రాజుకున్ను దండుగనిచ్చుకోవలెను॥ ౧౦౭॥

మూ॥ యస్యదృశ్యేత సప్తాహా దుక్తవాక్యస్య సాక్షిణః। రోగోఽగ్ని
ర్జ్ఞాతిమరణ మృణందాప్యో దమంచ సః॥ ౧౦౮॥

సాక్ష్యమును బలికిన సాక్షికదిమొదలుకొని యేడుదినములలో గారోగాగ్నిదాహసన్నిహితజ్ఞాతిమరణములో నేదైననొకటియగుపడుట చేయనృతసాక్ష్యఫలముగా నెంచియాఋణమున్ను తద్దశమాంశముదండుగనున్ను వానివలనవుచ్చుకోవలెను॥

మూ॥ అసాక్షికేషుత్వర్థేషు మిథో వివదమానయోః। అవిందం
స్తత్త్వతస్సత్యం శపథేనాపి లంభయేత్॥ ౧౦౯॥

అసాక్షికములగు కార్యములవిషయమై పరస్పరమును వివాదము పడుచున్నవారిలో సత్యము తేలనప్పుడు ప్రాడ్వివాకుని చే వక్ష్యమాణముగ బ్రమాణమును జేయించి విచారించవలెను॥ ౧౦౯॥

మూ॥ మహర్షిభిశ్చ దేవైశ్చ కార్యార్థంశపథాః కృతాః। వసిష్ఠ
శ్చాపిశపథం శేపే పైజవనే నృపే॥ ౧౧౦॥

సప్తమహర్షులచేతనున్ను దేవతలచేతనున్ను కార్యార్థమై శపథములు సేయబడెను వసిష్ఠుడున్ను విశ్వామిత్రునిచే తననూర్గురుకొడుకులు నతనిచే భక్షించబడిరని నిందించబడి యానిందపోగొట్టుకొనుటకు యవనపుత్రుడగు సుధాముడు రాజైయున్నప్పుడు ప్రమాణము జేసెను॥ ౧౧౦॥

మూ॥ నవృథా శపథం కుర్యా త్స్వల్పేప్యర్థే నరో బుధః। వృథా

హిశపథం కుర్వన్ ప్రేత్యచేహచ నశ్యతి॥ ౧౧౧॥

విద్వాంసుడగునరుడు స్వల్పకార్యమందున్ను వృథాగాశపథము జేయరాదు వృథాశపథమొనరిచిన ఇహపరలోకములచెరుపునొందును॥ ౧౧౧॥

మూ॥ కామినీషు వివాహేషు గవాంభక్ష్యే తథేంధనే। బ్రాహ్మణాభ్యుపపత్తౌచ శపథే నాస్తిపాతకం॥ ౧౧౨॥

బహుభార్యుడు నీయందేనాకు ప్రీతిసున్నాయని స్త్రీలయందును వివాహార్థమై మఱియొకతెను వివాహముగాననిమొదలగునవిన్ని॥సూ॥"సురతలాభార్థం కామినీవిషయేవివాహవిషయేనమయాన్యావివాహ్యేతి"యనివసిష్ఠవచనము- గోగ్రాసార్థమున్ను నగ్నిహోత్రార్థమై సమిధలవిషయమయిన్ని బ్రాహ్మణాపత్తునుడప్పించెడు విషయమయిన్ని శపథముజేసినను దోషములేదు॥ ౧౧౨

మూ॥ సత్యేన శాపయేద్విప్రం క్షత్రియం వాహనాయుధైః। గోబీజకాంచనైర్వైశ్యం శూద్రంసర్వైస్తు పాతకైః॥౧౧౩॥

సత్యమునుబోవుగాకయని విప్రునిచేతనున్ను వాహనాయుధములు నశించుగాకయని క్షత్రియునిచేతనున్ను గోబీజకాంచనములు జెడుగాకయని వైశ్యునిచేతనున్ను సకలపాపములున్ను వచ్చుగాకయని శూద్రునిచేతనున్ను ప్రమాణమును జేయించవలెను॥ ౧౧౩॥

మూ॥ అగ్నింవా హారయేదేన మప్సుచైనం నిమజ్జయేత్।పుత్రదారస్య వాప్యేనం శిరాంసి స్పర్శయేత్పృథక్॥ ౧౧౪॥

ఏబదిపలములెత్తును నెనిమిదియంగుళములువైపుల్యమునుగలిగ యగ్నివలెనెఱ్ఱగగాల్చినయినుపపిండమునేడశ్వత్థపత్రములుగలదానిని హస్తగతమొనరించిశూద్రాదులను పితామహాద్యుక్తవిధానముచేనేడడుగులుదెప్పించవలెను జలూకాదిరహితమగుజలములో మునిగించివెయ్యావలెను ఆచేయవలసినవిధులు స్మృత్యంతరములందుదెలియవలెను పుత్రులమొకరియు దారలమొకరియు శిరస్సులపైని వేరువేర స్పృశింపజేయవలెను॥ ౧౧౪॥

మూ॥ యమిద్ధోనదహత్యగ్ని రాపోనోన్మజ్జయంతిచ। నచార్తి

మృచ్ఛతి క్షిప్రం స జ్ఞేయ శ్శపథే శుచిః॥ ౧౧౫॥

ఎవని నాప్రజ్వలించుచున్న యగ్నికాల్చదో జలము తేల్చదో ఎవడుగొప్పయార్తి నొందడో వాడు ప్రమాణమందుశుద్ధుడని తెలియవలెను యిక్కడ ప్రకృతమగు సాక్షివాదమును చెప్పుచున్నాడు॥ ౧౧౫॥

మూ॥ వత్సస్య హ్యభిశస్తస్య పురాభ్రాత్రా యవీయసా। నాగ్ని
ర్దదాహ రోమాపి సత్యేన జగతస్స్పృశః॥ ౧౧౬॥

పూర్వకాలమందు సాపత్నసోదరునిచే నీవుశూద్రాపుత్రుడవుకాని బ్రాహ్మణుడవు గావని నిందించబడిన వత్సనామకఋషి తననిందనుపోగొట్టుట కగ్నియందు బ్రవేశించినను తని సత్యముచే నాజగత్సాక్షియగు నగ్నిదేవుండతనియొక్క లోమము నను దహించడాయెను గావున॥ ౧౧౬॥

మూ॥ యస్మిన్ యస్మిన్ వివాదేతు కౌటసాక్ష్యం కృతంభవేత్।
తత్తత్కార్యం నివర్తేత కృతంచాప్యకృతంభవేత్॥౧౧౭॥

యే యే వ్యవహారమందు సాక్షులనృతమాడినట్టు నిశ్చితమాయెనో ఆయావ్యవహారము సమాప్తమయినప్పటికిని ప్రాడ్వివాకుడు తిప్పవలెను అదిన్నిదండమునగా శిక్షవిధించడమున్నట్టుగా ముగిసినను పునర్విచారణము చెయ్యవలెను॥ ౧౧౭॥

మూ॥ లోభాన్మోహాత్ భయాన్మైత్రాత్ కామాత్క్రోధా త్తథైవచ।
అజ్ఞానాద్బాలభావాచ్చ సాక్ష్యం వితథముచ్యతే॥౧౧౮॥

లంచపుధనాదిలోభముచేనయిన మరొకరీతిని తెలిసినమైనభయముననయిన స్నేహముననయిన కామముననయిన క్రోధముననైననజ్ఞానముననైన తెలివితక్కువచేనైన సాక్ష్యమనృతమాడబడును॥ ౧౧౯॥

మూ॥ ఏషామన్యతమే స్థానే యస్సాక్ష్యమనృతం వదేత్ । తస్య
దండవిశేషాంస్తు ప్రవక్ష్యామ్యనుపూర్వశః॥ ౧౧౯॥

ఈ లోభాదినిమిత్తములచే నెవడనృతసాక్ష్యము పలుకునో వానిశిక్షావిశేషములను క్రమముగా జెప్పెదను॥ ౧౧౯।

మూ॥ లోభాత్సహస్రం దండ్యస్తు మోహాత్పూర్వంతు సాహసం। భయాద్ద్వౌ మధ్యమౌ దండౌ మైత్రాత్పూర్వం చతుర్గుణం॥ ౧౨౦॥

లోభముచే నసృతమును బలికెనేని చెప్పగలవాటియొక్క సహస్రము దండుగవిధించవలెను మోహముచే నసృతము బలికెనేం వక్ష్యమాణమగు ప్రథమసాహసము భయముచే నసృతము బలికెనేని వక్ష్యమాణ మధ్యమసాహసములు రెండు స్నేహముచేనైన ప్రథమసాహసము చతుర్గుణము॥ ౧౨౦॥

మూ॥ కామాద్దశగుణం పూర్వం క్రోధాత్తు త్రిగుణం పరం। అజ్ఞానాద్ద్వేశతే పూర్ణే బాలిశ్యాచ్ఛతమేవతు॥ ౧౨౧॥

స్త్రీసంభోగరూపకామసంబంధముచే కూటసాక్షియైనవాడు ప్రథమసాహసము దశగుణముగా దండ్యుడగును క్రోధముచే నయ్యేనేని మధ్యమసాహసము త్రిగుణముగా దండ్యుడుగావలెను- అజ్ఞానముచే బలికెనేని యిన్నూరు బాల్యముచేన నవహితుడే పలికిన దనృతమయ్యేనేనిపణశతమాత్రమేదండ్యుడుగావలెనని యన్నిటికి గూర్చవలెను॥ ౧౨౧॥

మూ॥ ఏతానాహుః కౌటసాక్ష్యే ప్రోక్తాన్దండాన్మనీషిభిః। ధర్మస్యావ్యభిచారార్థ మధర్మనియమాయచ॥ ౧౨౨॥

సత్యరూపమగు ధర్మము లోపించకుండుటకును అసత్యరూపమగు నధర్మమును వారించుటకును కూటసాక్ష్యవిషయమైపూర్వోక్తములగుమునులచేనిర్ణీతములగుశిక్షలను మన్వాదులు చెప్పిరిదిన్నిసాక్ష్యమంతయు నసృతమైనను బహుమారులిట్టి దోషముచే ప్రసిద్ధుడైనను గావలెను॥ ౧౨౨॥

మూ॥ కౌటసాక్ష్యంతుకుర్వాణాం స్త్రీన్వర్ణాన్ధార్మికోనృపః। ప్రవాసయే ద్దండయిత్వా బ్రాహ్మణాంస్తు వివాసయేత్॥ ౧౨౩॥

క్షత్రియాదులగు మూడువర్ణముల వారినిన్ని యనృతసాక్ష్యమునకు తగినశిక్షయైన పణుని స్వదేశము పైకివెళ్ల గొట్టవలెను బ్రాహ్మణులైతే శిక్షలేకుండస్వదేశమును దాటించవలెను॥ "శ్లో॥ నజాతు బ్రాహ్మణంహన్యా త్సర్వపాపేష్వవస్థితం। రాష్ట్రాదేనం బహిః కుర్యా త్సమగ్రధనమక్షతం" ఒకానొకప్పుడున్ను బ్రా

హ్మణుని గొట్టగూడదు వాడెల్ల పాపముల నొనర్చినను రాజు వానిని సంపూర్ణ ధనముతోటి కాయదండమున్ను లేకుండ స్వరాజ్యమును దాటించవలెనని వానిధనముతో గూడ దేశము దాటించుట జెప్పగలదు గావున- గోవిందరాజైతె పూర్వ దండముచే శిక్షించి నగ్నునిగా జేయవలెనని జెప్పెను మేధాతిథియైతె బ్రాహ్మణునకు వివాసస్త్వమనగా వస్త్రాపహారణమైన గృహభంగమైన జేయవలెనని వ్రాసెను॥ ౧౨౪॥

మూ॥ దశస్థానాని దండస్య మనుస్స్వాయంభువో బ్రవీత్। త్రిషు
వర్ణేషు యానిస్యు రక్షతో బ్రాహ్మణో వ్రజేత్॥ ౧౨౪॥

స్వాయంభువమనువు క్షత్రియాది మూడువర్ణముల వారికిని శిక్షించేస్థానము లేవో యవిపదింటిని జెప్పెను బ్రాహ్మణుడై తేయక్షతుడై దేశాంతరమునకు వెళ్లి పోవలెను॥ ౧౨౪॥

మూ॥ ఉపస్థముదరంజిహ్వా హస్తౌ పాదౌచ పంచమం । చక్షు
ర్నాసాచ కర్ణౌచ ధనందేహ స్తథైవచ॥ ౧౨౫॥

లింగము ౧ కడుపు ౨ జిహ్వ ౩ హస్తములు ౪ పాదములు ౫ కన్నులు ౬ ముక్కు ౭ చెవులు ౮ ధనము ౯ దేహము ౧౦ యీలింగాదిస్థానములు శిక్షించతగినవి తత్తదవయవములచే జరిగిన యపరాధములు గలిగిన దోషమెక్కువగావడమువలన తత్తదంగములకు తాడనవేదనాదికములు జేయదగినవి అపరాధము స్వల్పమయితె శాస్త్రీయమైన ధనదండమున్ను మహాపాతకాదులయందు దేహదండమనగా మరణము॥ ౧౨౬॥

మూ॥ అనుబంధం పరిజ్ఞాయ దేశకాలౌచ తత్వతః। సారాపరా
ధౌ చాలోక్య దండం దండ్యేషు పాతయేత్॥ ౧౨౬॥

మాటిమాటికి నిచ్చుచే నపరాధమొనచుటట దెలిసి గ్రామారణ్యాదికముచేతనున్ను రాత్ర్యాదికముచేతనున్ను అపరాధమును దెలిసి సారమనగా నపరాధముజేసిన వానియొక్క ధనశరీరాదిసామర్థ్యమును అపరాధమున్ను గౌరవలాఘవములనున్ను జూచి దండించదగినవారికి శిక్షవిధించవలెను ఇదిసరికి జెప్పబడినట్టియు జెప్పగలట్టియు దండము శేషభూతము॥ ౧౨౬॥

మూ॥ అధర్మదండనంలోకే యశోఘ్నం కీర్తినాశనం। అస్వ
ర్గ్యంచ పరత్రాపి తస్మాత్తత్పరివర్జయేత్॥ ౧౨౭॥

ప్రతిక్రియయున్నప్పటి ఖ్యాతియశస్సు మృతుడైనవానిఖ్యాతికీర్తి పైనిచెప్పబడినయ
నుబంధాదులననుసరించని దండనము యశస్సుకున్ను కీర్తికిన్ని పరలోకమందు స్వ
ధర్మార్జితమగు స్వర్గమునకున్ను ప్రతిబంధకమగునుగాననట్టిదండమునుజేయ
రాదు॥ ౧౨౭॥

మూ॥ అదండ్యాన్ దండయన్రాజా దండ్యాంశ్చైవాప్యదండయన్।
అయశోమహదాప్నోతి నరకంచైవ గచ్ఛతి॥ ౧౨౮॥

రాజుధనాదిలోభముచే దండార్హులుగాని వారినిదండించినను దండార్హు
లననుబంధాద్యుపరోధముచే దండించకున్నను నిచ్చటనయశస్సున్ను పరమందునర
కమున్ను బొందును॥ ౧౨౮॥

మూ॥ వాగ్దండం ప్రథమంకుర్యా ద్ధిగ్దండం తదనంతరం।తృతీయం
ధనదండంతు వధదండమతఃపరం॥ ౧౨౯॥

ప్రథమాపరాధమందు నీవు చేసినది మంచిపనిగాదిక నెప్పుడునిటులుజేయకుమ
ననెడివాగ్దండము మరలనపరాధమొనర్చెనేని నీజన్మముకాల్చనా యింతకంటె చ
చ్చినను మేలనునదిధిగ్దండము రెండవది యొకటిరెండుసారుల మానకతప్పుచేసెనేని ధనదండ
ముమూడవది జేయవలెను యప్పటికిని దుష్కార్యములుమానకుండెనేని నాలవది
వధదండము తాడనాంగచ్ఛేదనాదిరూపము జేయవలెను గాని జంపరాదు॥ "శ్లో॥
వధేనాపి యదాత్వేతానితి॥" ముందుజెప్పగలదుగావున॥ ౧౨౯॥

మూ॥ వధేనాపి యదాత్వేతా న్నిగ్రహీతుం నశక్నుయాత్। త
దైవ సర్వమప్యేత త్ప్రయుంజీత చతుష్టయం॥ ౧౩౦॥

పయిని చెప్పిన శిక్షలలో నొక్కొక్కదానిచే వశముగానివానికి నాలుగుశిక్షలును
జేయవలయును॥ ౧౩౦॥

మూ॥ లోకసంవ్యవహారార్థం యాస్సంజ్ఞాః ప్రథితాభువి। తా
మ్రరూప్యసువర్ణానాం తాః ప్రవక్ష్యామ్యశేషతః॥ ౧౩౧॥

రాగి వెండి బంగారములకు క్రయవిక్రయాది వ్యవహారార్థము వేపణాది సంజ్ఞలులోకమందు ప్రసిద్ధములో వాటిని దండాద్యుపయోగార్థమై సాకల్యముగా జెప్పెదను॥ ౧౩౧॥

మూ॥ జాలాంతరగతే భానౌ యత్సూక్ష్మం దృశ్యతేరజః । ప్రథ
మంతత్ప్రమాణానాం త్రసరేణుం ప్రచక్షతే॥ ౧౩౨॥

గవాక్షవివరములందగు సూర్యరశ్ములందు చిన్నవిగా నేరజస్సుకనబడునో యదికనపడేపరిమాణములలో మొదటిది త్రసరేణువనిపించుకొనును॥ ౧౩౨

మూ॥ త్రసరేణవోష్టౌ విజ్ఞేయా లిక్షైకాపరిమాణతః। తా రాజ
సర్షపస్తిస్రస్తే త్రయో గౌరసర్షపః॥ ౧౩౩॥

త్రిసరేణువు లెనిమిదైయుంటే నొకలిక్షయని తెలియదగినది మూడులిక్షలు రాజసర్షపము మూడురాజసర్షపములు గౌరసర్షపమని పరిమాణముచే దెలియవలెను॥ ౧౩౩॥

మూ॥ సర్షపాష్షడ్యవోమధ్యస్త్రియవం త్వేక కృష్ణలం। పంచకృ
ష్ణలకోమాషస్తేసువర్ణస్తు షోడశ॥ ౧౩౪॥

ఆరుకృష్ణలనులైతే పెద్దచిన్నగాని మధ్యమయవమగును అవిమూడైతెనొకకృష్ణలమగును దీనిని రక్తికలమనిన్నియందురు ఈకృష్ణలము లైదైతే నొకమాషము పదారుమాషములు సువర్ణమనబడును॥ ౧౩౪॥

మూ॥ పలంసువర్ణాశ్చత్వారః పలాని ధరణందశ। ద్వేకృష్ణలే
సమధృతే విజ్ఞేయో రౌప్యమాషకః॥ ౧౩౫॥

నాలుగుసువర్ణములుపలము ఇవిపదియైన నొకధరణము రెండు కృష్ణలములు సమముగాచేస్తే తూనికచే రూప్యమాషకమని తెలియదగును॥ ౧౩౫॥

మూ॥ తే షోడశస్యాద్ధరణం పురాణశ్చైవరాజతః। కార్షాప
ణస్తు విజ్ఞేయ స్తామ్రికః కార్షికః పణః॥ ౧౩౬॥

ఆరూప్యమాషకములు పదారయితే రౌప్యధరణమగును పురాణమున్ను రజతసంబంధమైనదగును కార్షికము తామ్రమయము కార్షాపణము పణమని తెలియ

దగును కార్షికమనగా శాస్త్రీయమగు పలములో నాలవపాలని తెలియదగును గావున నా॥"శ్లో॥ పలంకర్షచతుష్టయం" నాలుగుకర్షము లొకపలమని నిఘంటు॥

మూ॥ ధరణాని దశజ్ఞేయః శ్శతమానస్తు రాజతః । చతుస్సౌవ
ర్ణికో నిష్కో విజ్ఞేయస్తు ప్రమాణతః॥ ౧౩౭॥

రూప్యధరణములు పది రూప్యశతమానమని తెలియదగును నాలుగు సువర్ణములు నిష్కమని తెలియదగును॥ ౧౩౭॥

మూ॥ పణానాం ద్వేశతే సార్థే ప్రథమ స్సాహస స్స్మృతః।మ
ధ్యమః పంచవిజ్ఞేయః సహస్రం తేన చోత్తమః। ౧౩౮॥

రెండు వందల యేబది పణములు ప్రథమసాహసమని మన్వాదులచే జెప్పబడె ను అయిదువందలయితే మధ్యమసాహసము వేయుపణము లుత్తమసాహసమని తెలియదగినది॥ ౧౩౮॥

మూ॥ ఋణే దేయే ప్రతిజ్ఞాతే పంచకం శతమర్హతి । అపహ్న
వే తద్ద్విగుణం తన్మనో రనుశాసనం॥ ౧౩౯॥

ఋణముత్తమర్ణునకు తీర్చవలసినదే యని సభయందధమర్ణు డొప్పుకొనె నేని నూరుపణముల కైదుపణములు దండమున్ను అధమర్ణుడు ఋణమేమియు లేదని యనృతమాడెనేని పదిపణములున్ను దండుగ పుచ్చుకొనవలెను- మనుస్మృతి యందిది దండప్రకారము॥ ౧౩౯॥

మూ॥ వసిష్ఠ విహితాం వృద్ధిం సృజే ద్విత్త వివర్ధినీం । అశీతి
భాగం గృహ్ణీయా న్మాసేవార్ధుషిక శ్శతే॥ ౧౪౦॥

వసిష్ఠునిచే నిర్ణీతమగు వృద్ధి ధర్మయుక్తమైనది గావున వృద్ధిచే జీవించెడివాడు నూటిలో నెనబదియోవంతు నెలకు వృద్ధిని పుచ్చుకొనవలెను- ఇది ధనవృద్ధిని జేయును॥"సూ॥ శతే ప్రయుక్తే అశీతిభాగం ప్రతిమాసం గృహ్ణీయాత్॥" నూరుబదులిచ్చెనేని నెలకొకటింబావు వృద్ధి పుచ్చుకొనవలెనని॥ ౧౪౦॥

మూ॥ ద్వికం శతంవా గృహ్ణీయా త్సతాం ధర్మ మనుస్మరన్ ।
ద్వికం శతంహి గృహ్ణానో నభవ త్యర్థ కిల్బిషీ॥ ౧౪౧॥

నూటికి రెండుచొప్పున వృద్ధివచ్చికొనిన వాడు వృద్ధిధనగ్రహణముచే కిల్బిష ముగలవాడుగాడు॥ ౧౪౧॥

మూ॥ ద్వికం త్రికం చతుష్కంచ పంచకంచ శతంసమం। మాస స్య వృద్ధిం గృహ్ణీయా ద్వర్ణానా మనుపూర్వశః॥౧౪౨॥

బ్రాహ్మణాదివర్ణముల దగ్గిర క్రమముగా నూటికి రెండు మూడు నాలుగు అయిదు మాసమునకు పుచ్చుకోవలెను- ఇంతకధికము పుచ్చుకొనరాదు- ఓయీ ఎనబదివ వంతనగా నెలకు నూటికి రూపాయిపావలాచొప్పున లఘువృద్ధి అంత కంటె రెంటిచొప్పననైతే గురువృద్ధిగదా ఈలఘుగురుకల్పము లెట్లువికల్పించబడు ననిన- ఇచ్చట మేధాతిధి గోవిందరాజులు మొదట జెప్పిన వృద్ధిచే నిర్వాహముకా కుంటె నూటికి రెండు చొప్పున వడ్డి పుచ్చుకోవడమని చెప్పిరి- కుల్లూకభట్టైతే తాకట్టుమీద నూటికి నెలకు రూపాయిపావలా చొప్పుననున్ను తాకట్టులేనిబదు లయితే నూటికి రెండు చొప్పుననని వ్రాసెను యిందుకు యాజ్ఞవల్క్యవచనము న్ను వ్రాసెను॥ "శ్లో॥ అశీతిభాగోవృద్ధిస్స్యా న్మాసిమాసిసబంధకే। వర్ణక్రమాచ్ఛ తంద్విత్రి చతుఃపంచకమన్యధా। వేదాంతో గ్గీతమహసోమునేర్వ్యాఖ్యానమా దిృమే। తద్విరుద్ధం స్వబుధ్యాచ నిబధ్నమధునాతనైః॥" తాకట్టుమీదనూటికి ఎన బదివపాలున్ను వట్టిబదలుకు వర్ణక్రమముచే రెండుమూడు నాలుగైదుపాళ్లనని వేదాంతోద్గీతమహులయొక్క మతమునుసాదరించక నిప్పటివారు తోచినట్టువ్రాసిరి॥

మూ॥ నత్వేవాదౌ సోపకారే కౌశీదం వృద్ధిమాప్నుయాత్। న చాధేః కాలసంరోధా న్నిసర్గోస్తి నవిక్రయః॥ ౧౪౩॥

భూమి పశువులు సొమ్ములలోవాడుక చేసుకోవడపుషరతుతో తాకట్టుబెట్టిన యెడల సాధనమున కుత్తమర్ణునకు వృద్ధిసొమ్ములేదు వాయిదాదాటి చిరకాల ముండినప్పటికి యనగా ధనద్విగుణము వడ్డి యయినప్పటికిన్ని ఆతాకట్టువస్తువు మరియొకనికి దానముగాని యమ్మడముగాని వల్లగాదు- మేధాతిధి గోవిందరా జులైతే మరొకనికివ్వడమైనా తాకట్టుబెట్టడమైనాను గూడదనివ్రాసినారుగానితన కావస్తువు నన్యునివద్దతాకట్టుండడము లోకములో ప్రకాశముగా కలదుగాన నా చారవిరోధమని కుల్లూకభట్టువ్రాసెను॥ ౧౪౩॥

మూ॥ నభోక్తవ్యో బలాదాధిం భుంజానో వృద్ధిముత్సృజేత్।

మూల్యేన తోషయేచ్చైన మాధిస్తేనో న్యథాభవేత్॥ ౧౪౪॥

ఈశ్లోకము గోప్యాధివిషయమనగా దాచియుంచడమునకు నిర్ణయించిన తాకట్టు వస్తువును వస్త్రాలంకారమును బలాత్కారముగా ననుభవించరాదు- అట్లనుభవించెనేని మొదట నిచ్చినంత ధనముమాత్రము పుచ్చుకొనినాయెనను లేదా తాననుభవించుటవల్ల దరిగినందుకు తగినసొమ్మైన నిచ్చి ముదమొందించవలెను నట్లుజేయుడేని తాకట్టుదొంగయగును॥ ౧౪౪॥

మూ॥ ఆధిశ్చోప నిధిశ్చోభౌ నకాలాత్యయ మర్హతః । అపహా
ర్యౌ భవే తాంతౌ దీర్ఘకాల మవస్థితౌ॥ ౧౪౫॥

తాకట్టుంచినదిన్ని ప్రీతిచే నొసవిచ్చినదిన్ని లేదా దాచుకున్నదిన్ని ఈరెండున్ను చిరకాలమతిక్రమించి నప్పటికిని ఆవస్తువులను హక్కుదారు డడిగినప్పుడీయవలెను॥ ౧౪౫॥

మూ॥ సంప్రీత్యా భుజ్యమానాని ననశ్యంతి కదాచన । ధేనురు
ష్ట్రోవహన్నశ్వో యశ్చదమ్యః ప్రయుజ్యతే॥ ౧౪౬॥

ఏదైనా పదిసంవత్సరములనుభవమై తెలిపైనియావస్తువుయందు మొదటివానికి హక్కునశించునని ముందుజెప్పగలడందు కిదియపవాదము యెద్దుగాని ఉష్ట్రము గాని గుఱ్ఱముగాని ప్రీతిచేతనైనను మప్పుదునని పుచ్చుకొని యెంతకాలమనుభవించినను అనగాబరువుమోయించుకొనినను స్వామికిహక్కు గాకపోదు- ప్రీతిచేతననడమున సామాన్యము ఏరీతినైననని విశేషమును భుజ్యమానానియన్ననపుంసకలింగప్రయోగము తెలియజేయుచున్నది॥ ౧౪౬॥

మూ॥ యత్కించి ద్దశవర్షాణి సన్నిధౌ ప్రేక్షతే ధనీ । భుజ్య
మానం పరైస్తూష్ణీం నసత ల్లబ్ధుమర్హతి॥ ౧౪౭॥

ప్రీత్యాదివ్యతిరిక్తముగనే వస్తువైనపరుడనుభవించడము తానుచూచుచు నెందుకనుభవించెదవనియనకుండ పదిసంవత్సరములతిక్రమించిన నావస్తువాస్వామికి హక్కుగాకపోవును॥ ౧౪౭॥

మూ॥ అజడశ్చేదపోగండో విషయేచాస్య భుజ్యతే। భగ్నంతద్వ్య
వహారేణ భోక్తా తద్ద్రవ్య మర్హతి॥ ౧౪౮॥

బుద్ధివికలుడు గాని పౌగండుడనగా బాలుడు గాని గాక స్వామి యాక్షేపించక జూచుచుండ ననుభవించినవానికా వస్తువు వ్యవహారమునుచేపోదు॥ "శ్లో॥ బాలఆషోడ శాద్వర్షాత్ పౌగండశ్చాపి శబ్దితః । బాలుడు పౌగండుడుననగా పదారేళ్ళకులో పలివయస్సున్నవాడని నారదుడు॥ ౧౪౮॥

మూ॥ ఆధిస్సీమా బాలధనం నిక్షేపోపనిధీస్త్రియః। రాజస్వం
శ్రోత్రియస్వంచ నభోగేన ప్రణశ్యతి॥ ౧౪౯॥

తాకట్టున్ను పొలిమేరలున్ను బాలధనమున్ను వాసెనగట్టిముద్రజేసిలోనున్న దానినిజెప్పకుండ దాచుకున్నదియుపనిధి యివిన్ని నిక్షేపమున్ను స్త్రీలయొక్కయు రాజుయొక్కయు శ్రోత్రియునియొక్కయు ధనమున్ను పదివర్షములనుభవించిన మీదనైనవారిహక్కు చెడదు భోక్తకుదక్కదు॥ ౧౪౯॥

మూ॥ యస్స్వామినాననుజ్ఞాత మాధిం భుఙ్క్తే విచక్షణః । తే
నార్ధవృద్ధిర్మోక్తవ్యా తస్యభోగస్య నిష్కృతిః॥ ౧౫౦॥

వడ్డికితాకట్టుపెట్టినవస్తువు నాస్వామియనుజ్ఞ లేకుండరహస్యముగననుభవించె నేని యందుకతనిచ్చెడి వడ్డిలోసగముకొట్టివెయ్యవలెను బలాత్కారముగ ననుభవించిననంతవడ్డియును నిప్పించరాదు॥ ౧౫౦॥

మూ॥ కుసీదవృద్ధిర్ద్వైగుణ్యం నాత్యేతి సకృదాహృతా। ధాన్యే
సదేలవేవాహ్యే నాతిక్రామతి పంచతాం॥ ౧౫౧॥

బడులిచ్చినసొమ్మునకొక్కమారు పుచ్చుకొనెడివృద్ధి ధనద్విగుణముకంటె నతి క్రమించదు ధాన్యమువృక్షఫలము ద్రాంకవాదిలోమమువృషభములుమొదలగునవివీ టివిషయమైచిరకాలమైనను పంచత్వమునతిక్రమించదు॥ ౧౫౧॥

మూ॥ కృతానుసారాదధికా వ్యతిరిక్తా న సిధ్యతి। కుసీదపదమా
హుస్తం పంచకం శతమర్హతి॥ ౧౫౨॥

శాస్త్రముచేచెప్పబడిన "ద్వికంత్రిక" మిత్యాదికముచే వర్ణక్రమమువలన చెప్ప బడినదానికంటె నధికమగువృద్ధిసిద్ధించదు శాస్త్రోక్తముగాని వృద్ధియందువిశేష మును చెప్పుచున్నాడు శూద్రునివలన పుచ్చుకొనేనూటికైదుచొప్పున వృద్ధి బ్రా

హ్మణునివలనఁ బుచ్చుకోవడము శాస్త్రీయమైనధర్మవడ్డీకి విరుద్ధముగఁ జేయబడినది యకృతవృద్ధియిదికుత్సితమార్గమని మన్వాదులుచెప్పిరి ఇదియడిగినప్పుడివ్వకుండి ననని ॥ "శ్లో॥ ప్రీతిదత్తం నవర్ధేత యావన్నప్రతియాచితం । యాచ్యమానం నదత్తంచేత్ వర్ధతే పంచకం శతం॥" ప్రీతిదత్తమునకు వృద్ధిలేదు అడిగినప్పు డీకున్న నూటికైదుచొప్పున వృద్ధీవలెనని కాత్యాయనులు మూడునెలలకుగాని యయినవడ్డియొకమారిచ్చుచు డవలెనని నిర్ణయించి సంవత్సరముదాటకుండఁబుచ్చుకొనవలెను గానియశాస్త్రీయమగువృద్ధిని ద్వికత్రికాద్యధికవృద్ధిని పుచ్చుకొనగూడదు అశాస్త్రీయముగాన చక్రవృద్ధ్యాదికములగు నాలుగువృద్ధులనున్ను పుచ్చుకొనగూడదు వాటిస్వరూపమును బృహస్పతిచెప్పుచున్నాడు॥ "శ్లో॥ కాయికా కాయసంయుక్తా మాసగ్రాహ్యాచ కాలికా । వృద్ధేర్వృద్ధిశ్చక్రవృద్ధిః కారితా ఋణినాకృతా॥" ఋణియొక్క శరీరయుక్తమైనదనగా పనిచెయ్యడముతోగూడినది కాయికయన్ని మాసమాసమందును బుచ్చుకొనియెడి వృద్ధికాలికయనబడును వృద్ధికి వృద్ధిచక్రవృద్ధి ఋణిచే జేయబడినవృద్ధికారితయనబడును చక్రవృద్ధి స్వరూపముచేత నే నిందితము కాలవృద్ధిరెట్టికంటె నధికను పుచ్చుకొనుటచేతనున్ను కాయికవెట్టిగా పాలుపితకడముబలువ్రలు వెయ్యడము మొదలగునది తనకాపదలేనప్పుడైన నుత్తముణుఁడొనచేఁదుపీడచే నధమణుఁడు వృద్ధినధికముగనిచ్చెదనని యొప్పుకొనినదియీ నాలుగుప్రకారములగు వడ్డిన్ని యశాస్త్రీయముగావున పుచ్చుకొనరాదు అందుకు బృహస్పతివచనము॥ "భాగోయ ద్ద్విగుణాదూర్ధ్వం చక్రవృద్ధిశ్చ గృహ్యతే । పూర్ణేన చ సోదయం పశ్చా ద్వార్ధుష్యం తద్విగర్హితం ॥" ఋణమిచ్చిన సొమ్మునకు రెట్టింపైనదిగానయిన పయినిన్ని తిరిగిదానివలన వడ్డిని పుట్టించినది చక్రవృద్ధి నింద్యము గావున నావార్ధుషికత్వము మంచిదికాదు ॥ "శ్లో॥ ఋణికేనకృతావృద్ధిరధికా సంప్రకల్పితా । ఆపత్కాలకృతానిత్యం దాతవ్యాకారితాతథా। అన్యథాకారితావృద్ధిర్న దాతవ్యాకథంచన-" ఋణికునిచే నాపత్కాలమం దధికముగా నిచ్చెదనని యొప్పుకొనునట్టి వృద్ధియీదగవదే అన్యథాయంగా ఆపదలేనప్పుడు ధనియొనర్చుపీడచే ఋణియొప్పుకొనిన యధికమగు వడ్డి యెన్నడును యివ్వదగినది గాదు॥ ౧౫౩॥

మూ॥ ఋణం దాతు మశక్తో యః కర్తు మిచ్ఛేత్పునః క్రియాం। స
దత్త్వా నిర్జితాం వృద్ధిం కరణం పరివర్తయేత్॥ ౧౫౪॥

అధమర్ణుడు ఋణమును దీర్చలేక మరల పత్రము వ్రాయనిచ్ఛయించె నేని ఆ సరికైనవడ్డి నుత్తమర్ణుడు పుచ్చుకొని యసలుసొమ్మునకు మరల పత్రమును వ్రాయించుకొనవలెను॥ ౧౫౪॥

మూ॥ అదర్శయిత్వా తత్రైవ హిరణ్యం పరివర్తయేత్। యా
వతీసంభవేద్వృద్ధి స్తావతీం దాతుమర్హతి॥ ౧౫౫॥

అధమర్ణుడు దైవవశముచే నాసరికైన వృద్ధినీలేకపోయినచో నావృద్ధి సొమ్మునుగలిపి పత్రమువ్రాసి అందువలననైన చక్రవృద్ధిధనమెంతయైన నదియివ్వవలెను। ౧౫౫॥

మూ॥ చక్రవృద్ధిం సమారూఢో దేశకాలవ్యవస్థితః। అతిక్రామన్
దేశకాలౌ నతత్ఫలమవాప్నుయాత్॥ ౧౫౬॥

ఇచ్చట చక్రవృద్ధియనగా చక్రములుగల శకటాదిభారరూపమగు వృద్ధియభిమతము అట్టిచక్రవృద్ధినాశ్రయించినవాడింతదూరమున కింతకాలములోనీసరుకు చేర్చితినేని యింతసొమ్ము నాకీవలెనని దేశకాలవ్యవస్థతో నిర్ణయించబడిన గుత్తదారుడనగా అద్దెలలో భేదముగల దీని నాశ్రయించినవాడు నిర్ణీతములగు దేశకాలముల నతిక్రమించెనేని యాలాభమునంతనుంబొందడు॥ ౧౫౬॥

మూ॥ సముద్రయానకుశలా దేశకాలార్థదర్శినః। స్థాపయంతితు
యాం వృద్ధిం సాతత్రాధిగమంప్రతి॥ ౧౫౭॥

సముద్రముపై నోడమీదుగాగాని భూమిపై శకటాదులచేగాని సరుకు మొదలైనవాటిని నడిపించనేర్పుగలట్టియు ఏదేశమందు నేకాలమందెంతలాభము వచ్చునో దానినిదెలిసినవర్తకులు ఆదేశమునకా కాలములోగా నావస్తువులను చేర్చుటకెంతసొమ్మును నిర్ణయింతురో దానినిపొందుట కదివ్యవస్థ॥ ౧౫౭॥

మూ॥ యోయస్య ప్రతిభూస్తిష్ఠే ద్దర్శనాయేహమానవః। అద
ర్శయంత్సతం తస్య ప్రయచ్ఛేత్స్వధనాదృణం॥ ౧౫౮॥

అప్పిచ్చినపుడొకడుత్తమర్ణునకధమర్ణుని వాయిదానాటికప్పగించుటకు జామీనుబడి యట్లప్పగించకుండిన నాఋణము నాయుత్తమర్ణునకు నాజామీన్

దారుడు తనధనములోనుంచిదీయవలెను॥ ౧౫౮॥

మూ॥ ప్రాతిభావ్యం వృథాదాన మాక్షికం సౌరికంచయత్।
దండశుల్కావశేషంచ నపుత్రో దాతుమర్హతి॥ ౧౫౯॥

జామీనుపడినదిన్ని హాస్యార్థమయి వృథాప్రతిజ్ఞ జేసినదిన్ని ద్యూతమందుబాకీపడినదిన్ని మద్యపానము జేసిన బాకీసొమ్మున్ను రాజశిక్షచే నివ్వవలసియుండిపోయినదిన్ని ఘట్టములు మొదలగుచోటులసుంకముగా నొప్పుకున్న దానిశేషమున్ను నగు తండ్రీవలసినసొమ్ము తండ్రిపోతే వానిపుత్రుడీనక్కరలేదు॥ ౧౫౯॥

మూ॥ దర్శనప్రాతిభావ్యేతు విధిస్స్యాత్పూర్వచోదితః। దానప్ర
తిభువిప్రేతే దాయాదానపిదాపయేత్॥ ౧౬౦॥

జామీనుపడినదిన్ని సురాపానదండశుల్కశేషాదికమేది పుత్రుడీనక్కరలేదని మున్నుచెప్పెనో యదిఋణికు నప్పగించెద ననేడి జామీనువిషయమయినది సొమ్మిచ్చుటకు తండ్రిబడినజామీను సొమ్ము కొడుకిచ్చుకోవలెను॥ ౧౬౦॥

మూ॥ అదాతరిపునర్దాతా విజ్ఞాతప్రకృతావృణం। పశ్చాత్ప్రతి
భువిప్రేతే పరీప్సేత్కేనహేతునా॥ ౧౬౧॥

ఉత్తమర్ణునకు ధనమివ్వనొప్పన్నములేక నారుణికునగుపరచి యప్పగించుటకుగాని నమ్మకమునకుగాని యొప్పుకున్నట్టియుజామీనుకు కారణమైనట్టి మూలము ఆలోసించి తీసిన యుచితమగు ధనముయొక్క గ్రహణమున దెలిసిన జామీనుదారుడు మృతుడగుచునుండ నుత్తమర్ణుడాజామీన్దారునిపుత్రునివలన ఋణియిచ్చెడి సొమ్మునిచ్చుకొననొప్పన్నము లేకుండుటచే నెట్లాధనమును పుచ్చుకొన నిచ్ఛయించుననిన చెప్పుచున్నాడు॥ ౧౬౧॥

మూ॥ నిరాదిష్టధనశ్చేత్తు ప్రతిభూస్స్యాదలంధనః। స్వధనాదేవ
తద్దద్యాన్నిరాదిష్టఇతిస్థితిః॥ ౧౬౨॥

ఈదర్శనప్రతిభూః అనిన్ని ప్రత్యయప్రతిభూః అనిన్ని అనగా నధమర్ణునిగనుపరుచుటకుగాని నమ్మకమునకుగాని యొప్పుకున్న జామీనుదారుడు అధమర్ణునిచే కొంతసొమ్ముపుచ్చుకుని జామీనుబడెనేని యాసొమ్ముపోగానుండినసొమ్ముకు

తగినంత సొమ్ముగలవాడైతే అట్టివానిపుత్రుడాఋణమునుతీర్చవలెనని శాస్త్రసంప్రదాయము॥ ౧౬౨॥

మూ॥ మత్తోన్మత్తార్త్యధీనై ర్బాలేన స్థవిరేణవా। అసంబద్ధ
కృతశ్చైవ వ్యవహారోనసిధ్యతి॥ ౧౬౩॥

మద్యపానాదికముచే తెలివిలేనివాడు మత్తుడు రోగముచే వెఱ్ఱివాడున్మత్తుడు రోగాతురుడు నస్వతంత్రుడు బాలుడు వృద్ధుడు వీరిచే పితృభ్రాతాద్యనుబంధము లేక చేయబడిన ఋణదానాదివ్యవహారము సిద్ధించదు॥ ౧౬౩॥

మూ॥ సత్యానుభాషాభవతి యద్యపిస్యాత్ప్రతిష్ఠితా । బహిశ్చే
ద్భాష్యతేధర్మా న్నియతాద్వ్యావహారికాత్॥ ౧౬౪॥

నేనిల్లుజేసెదనని పలికిన మాటలేఖ్యాదులచే స్థిరీకృతమయినది శాస్త్రీయమును లోకవ్యవహారపరంపరాసిద్ధమునుం గాకుండినం జెల్ల నేరదు॥ ౧౬౪॥

మూ॥ యోగాధమనవిక్రీతం యోగదానప్రతిగ్రహం । యత్రవా
ప్యుపధిం పశ్యే త్తత్సర్వం వినివర్తయేత్॥ ౧౬౫॥

యోగమనగా ఛలము మిషచేతజేయబడిన తాకట్టున్ను విక్రయమున్ను దానమున్ను ప్రతిగ్రహమున్ను నిక్షేపమున్ను చెల్ల నేరవు॥ ౧౬౫॥

మూ॥ గ్రహీతాయదినష్టస్స్యాత్కుటుంబార్థేకృతవ్యయః। దా
తవ్యం బాంధవైస్తత్స్యా త్ప్రవిభక్తైరపిస్వతః॥ ౧౬౬॥

అధమర్ణుడుమృతుడైనట్టాయెనా మున్నాఋణము కుటుంబవ్యయార్థమయి చేసినట్లైతే ప్రస్తుతము వానిబంధువులు విభక్తులైనప్పటికిన్ని తమతమధనములోనుంచి యాఋణమును దీర్చవలయును॥ ౧౬౬॥

మూ॥ కుటుంబార్థే ధ్యధీనోపి వ్యవహారం యమాచరేత్। స్వ
దేశేవా విదేశేవా తంజ్యాయాన్నవిచాలయేత్॥ ౧౬౭॥

యజమానుడు స్వదేశమందుండిన నన్యదేశంబున నుండిన నట్టివాని కుటుంబార్థమై దాసుడైన నేఋణాదానాది వ్యవహారమునొనచునో దాని నా స్వామియట్లం

గీకరించవలెను॥ ౧౬౭॥

మూ॥ బలాద్దత్తం బలాద్భుక్తం బలాద్యచ్చాపి లేఖితం। సర్వా
న్బలకృతానర్థా నకృతా న్మనురబ్రవీత్॥ ౧౬౮॥

ప్రతిగ్రహించరానిదానిని బలాత్కారముగా ప్రతిగ్రహింపచేసినదిన్ని బలాత్కారముగా భూమ్యాదికము నాక్రమించి యనుభవించినదిన్ని బలాత్కారముగా వ్రాయించబడిన చక్రవృధ్యాదికమున్ను బలాత్కారముగ నింకనే దిజరిగినను వెల్లదిప్పివెయ్యవలెనని మనువుచెప్పెను॥ ౧౬౮॥

మూ॥ త్రయః పరార్థే క్లిశ్యంతి సాక్షిణః ప్రతిభూః కులం। చ
త్వారస్తూపచీయంతె విప్రఆఢ్యో వణిఙ్నృపః॥ ౧౬౯॥

సాక్షులున్ను జామీనుదారుడున్ను కులమున్ను ధర్మార్థవ్యవహారదర్శనవిశిష్టులైరేని పరులకొరకు లేశముననుభవింతురు గావున వీరిచేనివి జేయించరాదదియును బ్రాహ్మణుడు నుత్తమర్ణుడును వర్తకుడును రాజున్ను క్రమముగా దానఫలోపాదానముణద్రవ్యార్పణ క్రయ వ్యవహారేక్షణరూపమగు వాటినిజేయుచు ధనవృద్ధినిబొందుదురు గావున విప్రుడుదాతనున్ను ఆఢ్యుడుత్తమర్ణునిన్ని వర్తకుడుక్రానేవానినిన్ని రాజువ్యవహర్తనున్ను బలాత్కరించి ఆపనులయందుప్రవర్తింపజేయరాదు పూర్వశ్లోకమందుజెప్పబడిన బలాత్కారనిషేధమునకు ప్రపంచమేయిది॥ ౧౬౯॥

మూ॥ అనాదేయం నాదదీత పరిక్షీణోపి పార్థివః। నచాదే
యంసమృద్ధోపి సూక్ష్మమప్యర్థ ముత్సృజేత్॥ ౧౭౦॥

రాజుంక్షీణించినను పుచ్చుకొనరానిసొమ్మును పుచ్చుకోగూడదు ఎంత సమృద్ధిగలిగినను పుచ్చుకొనతగినసొమ్ము నించుకయైన విడువరాదు॥ ౧౭౦॥

మూ॥ అనాదేయస్యచాదానా దాదేయస్యచ వర్జనాత్। దౌర్బ
ల్యంఖ్యాప్యతె రాజ్ఞః స్సప్రేత్యేహచనశ్యతి॥ ౧౭౧॥

అగ్రాహ్యగ్రహణమువల్లనున్ను శాస్త్రీయగ్రాహ్యముయొక్క వర్జించడము

వల్లనున్ను రాజుకసామర్థ్యమును బహుప్రకటించుతురు అధర్మము చేసినచో కీర్తిహాని చేతనున్ను పరమందు నరకప్రాప్తి చేతనున్ను రాజునశించును॥ ౧౭౯॥

మూ॥ స్వాద్దానాద్వర్ణసంసర్గా ద్దుర్బలానాంచరక్షణాత్।
బలంసంజాయతే రాజ్ఞః స ప్రేత్యేహచ వర్ధతే॥ ౧౭౨॥

ధనగ్రహణమువల్లనున్ను॥ "వర్ణసంసర్గాత్॥" అనగా ఏవర్ణమువారిలో నావర్ణస్థులు వివాహాదుల నీలాగు జేయడము వల్లనున్ను లేదా వర్ణసాంకర్యముగాకుండ రక్షణమువల్లనని సంబంధించుటయైనను బలవంతులవలన బలహీనులకుబీడలేకుండ రక్షించుట వల్లనున్ను రాజుకు బలము పుట్టినందుచే రాజుకుభయలోకములందును సుఖవృద్ధిగలుగును॥ ౧౭౨॥

మూ॥ తస్మాద్యమ ఇవస్వామీ స్వయంహిత్వా ప్రియాప్రియే। వ
ర్తేతయామ్యయావృత్త్యా జితక్రోధో జితేంద్రియః॥౧౭౩॥

కావున రాజు యముడువలెను క్రోధమునువిడిచి జితేంద్రియుడై స్వీయునియందైనను ప్రియమున ప్రియమునువిడిచి యమునివృత్తియనగా సమవృత్తిచే ప్రవర్తించవలెను॥ ౧౭౩॥

మూ॥ యస్త్వధర్మేణ కార్యాణి మోహాత్కుర్యాన్నరాధిపః।
అచిరాత్తందురాత్మానం వశేకుర్వంతి శత్రవః॥ ౧౭౪॥

ఏరాజైతే లోభాదులచే వ్యవహారధర్మమును దెలియక చేయరానిపనులను జేయునో యారాజునుదుష్టచిత్తునిగా దెలిసి మంత్రులును పౌరులునువిరక్తులగుదురందుచే శీఘ్రముగశత్రువులతనినినిగ్రహింతురు॥ ౧౭౪॥

మూ॥ కామక్రోధౌతు సంయమ్య యోర్థాన్ ధర్మేణ పశ్యతి।
ప్రజాస్తమనువర్తంతే సముద్రమివసింధవః॥ ౧౭౫॥

ఏరాజు రాగద్వేషములను విడిచి ధర్మముచే నర్థములను నిర్ణయించునో ప్రజలారాజును నదులు సముద్రమునువలె ననుసరించి వర్తింతురనగా రాజుతో నెల్లకార్యములందు నేకీభవింతురని యుపమానమున నగుచున్నది॥ ౧౭౫॥

మూ॥ యస్సాధయంతం ఛందేన వేదయేద్ధనికం నృపే।సరాజ్ఞాత

చ్చతుర్భాగం దాప్యస్తస్య చ తద్ధనం॥ ౧౭౬॥

ఏయధమర్ణుడు రాజవల్లభుడను నాకేమియని స్వేచ్ఛచే తనధనము సాధించుచుండు నుత్తమర్ణుని రాజుతో చెప్పునో యాయధమర్ణు డీవలసిన ధనమును నందులో నాలవభాగమును దండనముగా వానిచే నాయుత్తమర్ణున కిప్పించవలెను॥ ౧౭౬॥

మూ॥ కర్మణాపి సమం కుర్యా ద్ధనికాయాధమర్ణికః। సమోఽవ
కృష్టజాతిస్తు దద్యాచ్ఛ్రేయాంస్తు తచ్ఛనైః॥ ౧౭౭॥

ఉత్తమర్ణునితో సమజాతిగాని దక్కువజాతిగాని యధమర్ణుడు ధనమీయ లేనప్పుడు తనజాతికనురూపమగు పనిజేయవలెను సమమనగా ఉత్తమర్ణాధమర్ణవ్యపదేశము నివర్తించునట్లు జేయవలయునని సమజాతియనగ నిచట బ్రాహ్మణేతరుడు- "మూ॥ కర్మణా క్షత్రవిట్ఛూద్రాన్ సమానజాతీయాన్ హీనాంస్తు దాపయేత్ ఇతి॥" క్షత్రియవైశ్యశూద్రులను సమానజాతీయులనుగూర్చి కర్మముచే తనున్న హీనులనుగూర్చి కొంచెము కొంచెమప్పుడప్పుడధికజాతిగలవానిచే ధనము నిప్పించవలెనని కాత్యాయనవచనమువలన గావున నుత్కృష్టజాతిచే నపకృష్టజాతికి కర్మమును జేయించరాదు మరేమంటే యథాసంభవముగా ధనమప్పుడప్పు డిప్పించవలెను॥ ౧౭౭॥

మూ॥ అనేన విధినా రాజా మిథోవివదతాం నృణాం। సాక్షిప్ర
త్యయసిద్ధాని కార్యాణి సమతాం నయేత్॥ ౧౭౮॥

ఈచెప్పబడిన ప్రకారముచే నన్యోన్యము వివాదపడివచ్చిన వాది ప్రతివాదుల సాక్ష్యాదిసాధనములచే బ్రమాణసిద్ధనుగు నిర్ణయమొనర్చి వారివాదమునగలవి ప్రతిపత్తినగా, విరోధమును బరిహరించి తత్తత్కార్యములను సమీకరించ వలెను॥ ౧౭౮॥

మూ॥ కులజే వృత్తసంపన్నే ధర్మజ్ఞే సత్యవాదిని। మహాపక్షే ధని
న్యార్యే నిక్షేపం నిక్షిపేద్బుధః॥ ౧౭౯॥

సత్కులమునందు బుట్టినట్టియు సద్వ్యాపారముగలట్టియు ధర్మజ్ఞుడైనట్టియు

సత్యప్రతిజ్ఞుడైనట్టియు పుత్రపౌత్రాది కుటుంబవృద్ధిగలట్టియు ధనికుడయినట్టియు నగు యోగ్యుడు తప్పనపువడిచేయుడు గాన నట్టివానియొద్దనే ధనమును దాచుకొనవలెను ౧౭౯॥

మూ॥ యోయథా నిక్షిపేద్ధస్తే యమర్థం యస్యమానవః। సత
థైవగ్రహీతవ్యో యథా దాయస్తథా గ్రహః॥ ౧౮౦॥

ఏమనుష్యుఁ డేప్రకారముగా ననగా ముద్రవేసిగాని వేయకగాని ససాక్షికముగా నేస్వర్ణాదిధనము నెవనిహస్తమందుంచి దాచుకొనెనో ఆధనమును దాచుకొనిన మనిషి యాప్రకారముగా బుచ్చికొనవలెను ఏలాగునిచ్చెనో యాలాగు పుచ్చుకోవడము చితము ముద్రాయుక్తమైన యాముద్రను స్వయముగా విప్పి తూచియిచ్చినని చెప్పుట శిష్టాద్యర్థము॥ ౧౮౦॥

మూ॥ యోనిక్షేపం యాచ్యమానో నిక్షేప్తుర్నప్రయచ్ఛతి। సయా
చ్యః ప్రాడ్వివాకేన తన్నిక్షేప్తురసన్నిధౌ॥ ౧౮౧॥

ధనమును దాచికొనినవాఁడడిగినప్పుడతఁడీ దేనియప్పుడు ప్రాడ్వివాకునితోఁ జెప్పవలెనతండు దాచినవానిని నిక్షేప్తయొక్కయసన్నిధానమందడగవలెనేమనియడగవలెననిన॥ ౧౮౧॥

మూ॥ సాక్ష్యభావే ప్రణిధిభిర్వయోరూపసమన్వితైః। అపదేశై
శ్చసన్న్యస్యహిరణ్యం తస్యతత్త్వతః॥ ౧౮౨॥

మొదటియే నిక్షేపసమయమందు సాక్షులు లేకుండిరేని ప్రాడ్వివాకుఁడు తనకు ప్రియులును బాలులుగాని వారును సౌమ్యరూపులగు చారపురుషులచే తమధనమునకేదో రాజాదిపీడగలుగునని మిషజెప్పి యతనియొద్దనే దాచబడినసొమ్మును ప్రాడ్వివాకుఁడా చారపురుషులచేతనే దానిని వానినడగవలెను॥ ౧౮౨॥

మూ॥ సయది ప్రతిపద్యేత యథా న్యస్తం యథా కృతం। నత
త్ర విద్యతే కించిత్ యత్పరై రభియుజ్యతే॥ ౧౮౩॥

ఆనిక్షేపధారి ముద్రాయుక్తముగ నేలాగునుంచబడెనో కటకమకుటాదిరూపముగ జేయబడెనో అది యేలాగునే యుంచిన ప్రకారముగా నిచ్చుట కొప్పుకొ

నేసేని మొదటివాడుంచి నానని నది యేమిన్ని లేదని తెలియవలెను॥ ౧౮౩॥

మూ॥ తేషాం నదద్యా ద్యదితు తద్ధిరణ్యం యథావిధి । ఉభౌ
నిగృహ్య దాప్యస్స్యా దితిధర్మస్య ధారణా॥ ౧౮౪॥

చారపురుషులచే నుంచబడిన చేలాటిదాలాగివ్వనియెడల రెండునిక్షేపములును బలాత్కరించి యానిక్షేపధారివలన పుచ్చుకోవలెనని యిట్టిది ధర్మనిశ్చయము సూనిక్షేపమనునది మొదలుగాగల నాలుగు శ్లోకములున్ను మేధాతిథి మొదలగు వారందరున్ను యీప్రకారముగానే పాఠక్రమమున్ను వ్యాఖ్యానమున్ను జేసిరి గోవిందరాజు "సాక్ష్యభావేప్రణిధిభిః" యనుశ్లోకమునే కొసను పఠించెను॥ ౧౮౪॥

మూ॥ నిక్షేపోపనిధీనిత్యం నదేయౌ ప్రత్యనంతరే । నశ్యతో వినిపాతే తా వనిపాతే త్వనాశినౌ॥ ౧౮౫॥

"నిక్షిప్యతఇతినిక్షేపః" యనివాచకట్టునది ముద్రాంకితమైనా లెక్కబెట్టకనైనా యియ్యబడినదియు పది బ్రాహ్మణ పరివ్రాజకుడన్నట్లుద్దేశభేదమేగాని రెండునొకటే యీనిక్షేపోపనిధులనుంచినవాడు బతికియుండగా వాని పుత్రాదులనధికారులు గావున వారికివ్వరాదు ఆపుత్రాదులుంచిన వానికివ్వకుండిననవియుంచినవానికీనిక్షేపాదిధారియిచ్చుకొన్నవలసియుండును పితృపుత్రాదులలో నెవరైననునశించెదరు నశించకనుందు రర్థసందేహము గలుగునుగాన నొరులకీగూడదు॥ ౧౮౫॥

మూ॥ స్వయమేవతు యోదద్యా న్మృతస్య ప్రత్యనంతరే । నస రాజ్ఞానియోక్తవ్యో ననిక్షేప్తుశ్చ బంధుభిః॥ ౧౮౬॥

నిక్షేప్తమృతుడైతే వానిపుత్రాదు లడగకుండనే నిక్షేపధారియానిక్షేపము నిచ్చివేసెనేని యప్పుడానిక్షేపధారినిరాజుగాని నిక్షేప్తయొక్క పుత్రాదులుగాని యింకాకొంతధనము నీవద్దయున్నది తెమ్మనిబాధించరాదు చోకప్పుడు భీమగలుగునుగాన॥ ౧౮౬॥

మూ॥ అచ్ఛలేనైవ చాన్విచ్ఛే త్తమర్థం ప్రీతిపూర్వకం । విచార్య తస్యవా వృత్తం సామ్నైవ పరిసాధయేత్॥ ౧౮౭॥

యథార్థముగనున్న నిక్షేపధారిదగ్గ మరికొంత నిక్షేపరూపముగ నుండెనే

మోయనుసంశయనివారకమగు మాటను సామముచేతనే బయిలుదీయవలెనుగాని గడబడచేసి దివ్యాదులతనిచే జేయించరాదు నిక్షేపధారియొక్క శీలమును బరీక్షించవలెను॥ ౧౮౭॥

మూ॥ నిక్షేపేష్వేషు సర్వేషు విధిస్స్యాత్పరిసాధనే । సముద్రే
నాప్నుయాత్కించి ద్యదితస్మాన్నసంహరేత్॥ ౧౮౮॥

నిక్షేపవిధులన్నిటియందును సాక్ష్యభావేయనుశ్లోకమాదిగా జెప్పబడినది నిర్ణయమునకుగావలెను ముద్రితాదికమందగు దానికిన్ని నిక్షేపధారిభ్రమముద్రాదికముచే నించుకైననపహరించకుండినచో నేమిదూషణము పొందును॥ ౧౮౮॥

మూ॥ చోరైర్హృతం జలేనోఢ మగ్నినా దగ్ధ మేవవా । నద
ద్యాద్యదితస్మాత్సనసంహరతి కించన॥ ౧౮౯॥

నిక్షేపధనము చోరాపహృతమైనను జలోపద్రవముచే గొట్టుకొనిపోయినన గ్నిచేగాలిపోయిన నష్టనిక్షేపము నతడు తత్వముచే నపహరించకుండిన నీనక్కర లేదు॥ ౧౮౯॥

మూ॥ నిక్షేపస్యాపహర్తార మనిక్షేప్తార మేవచ । సర్వై
రుపాయై రన్విచ్ఛే చ్ఛపథైశ్చైవ వైదికైః॥ ౧౯౦॥

నిక్షేపమును మాలుచేసి లేదనిన వానినిన్ని నిక్షేపమును జేయకనే తెమ్మనిన వానినిన్ని సకలసామాద్యుపాయములచేతనున్ను వహ్న్యాహరణాదివైదికప్రమాణములచేతనున్ను రాజునిర్ణయించవలెను॥ ౧౯౧॥

మూ॥ యోనిక్షేపం నార్పయతి యశ్చానిక్షిప్యయాచతే। తావు
భౌ చోరవచ్ఛాస్యౌ దాప్యౌవా తత్సమందమం॥ ౧౯౧॥

నిక్షేపముగానుంచినసొమ్ము నెవడివ్వడో నిక్షేపముచేయనిది యెవడడుగునో వారినుభయులనున్ను అదిసువర్ణరత్నాదికమయితే చోరులనుంబలె శిక్షించవలెను తామ్రాదిస్వల్పధనమైతె దానితోసమమగు ధనమును దండుగబుచ్చుకొనవలెను॥

మూ॥ నిక్షేపస్యాపహర్తారం తత్సమం దాపయేద్దమం।తథో
పనిధిహర్తార మవిశేషేణ పార్థివః॥ ౧౯౨॥

నిక్షేపమునుహరించినవానివద్ద నానిక్షిప్తధనము దండుగఫుచ్చుకొనవలెను ముద్రితాదికముఆనిధి దానినిహరించినదియేశిక్ష ఇచ్చటశరీరదండమును చెప్పకుండుట శరీరదండములేని బ్రాహ్మణులకివియాగనని పునరుక్తిలేదు హరించినవానికిది శిక్షయన్యోన్యయుంచనిది తెమ్మనినవానికి నిక్షేపయని యథార్థత్వమున్ను సిద్ధమాయెను ఇందువలన పూర్వోక్తమధికసాహసముగావున చోరునివలె శిక్షచెప్పబడుటచే వైయర్థ్యమునొందదు ఇప్పటిది ప్రథమాపరాధమందగు శిక్షయని చెప్పవచ్చును॥

మూ॥ ఉపధాభిశ్చయః కశ్చిత్పరద్రవ్యం హరేన్నరః। ససహాయ
స్సహంతవ్యః ప్రకాశం వివిధైర్వధైః॥ ౧౯౩॥

రాజునీపై కోపపడుచుండెను నిన్ను నేనురక్షించెదను నాకుధనమునుగాని కన్యకనుగాని యిమ్మని యన్యతబుద్ధితో లంచమును పరులవలన పుచ్చుకొనినవానినిన్ని యిందుకు సహాయమైనచుణ మాయావాదినిన్ని బహుమందియెదుట హస్తపాదశిరశ్ఛేదాదిరూపముగ రాజు చిత్రవధచేయించవలెను॥ ౧౯౩॥

మూ॥ నిక్షేపోయః కృతోయేన యావాంశ్చ కులసన్నిధౌ। తావా
నేవ సవిజ్ఞేయో తత్సమం దండమర్హతి॥ ౧౯౪॥

ఎంతపరిమాణముగల సువర్ణాదినిక్షేపము సాక్షులయెదుట నెవనిచేజేయబడెనో యాపరిమాణాదికమందు నెచ్చుతగ్గు విరోధముగలిగనేని సాక్షివచనములబట్టి నిర్ణయము తెలియదగ్గది ఈవిరుద్ధవాదమొనర్చినవానివద్ద నంతసొమ్మునుదండముపుచ్చుకొనవలెను॥ ౧౯౪॥

మూ॥ మిథోదాయః కృతోయేన గృహీతో మిథఏవవా। మిథఏవ
ప్రదాతవ్యో యథాదాయ స్తథాగ్రహః॥ ౧౯౫॥

రహస్యముగా నిక్షేపముంచెనేని రహస్యముగానే నిక్షేపధారియిచ్చివెయ్యవలెనని క్షేపధారికి నియమవిధి యిచ్చినప్పుడు సాక్షులక్కర లేదని॥ శ్లో॥ "యాయథానిక్షిపేద్యస్తు" యనిచెప్పటవలన నేలాగుంచెనో యటులేపుచ్చుకోవలెననినిక్షేప్తకునియమార్థము "గృహీతవ్యః" యనిచెప్పటవలన పునరుక్తిలేదు॥ ౧౯౫॥

మూ॥ నిక్షిప్తస్య ధనస్యైవం ప్రీత్యోపనిహితస్యచ। రాజావిని

ణయం కుర్యా దక్షిణ్వ న్యాసధారిణం॥ ౧౯౬॥

ముద్రారహితనిక్షిప్తధనమునున్ను ముద్రాసహితమగు నుపనిధిధనమున్ను గో వస్తువులనున్ను ప్రీతిచేకొంతకాలము వాడుక చేసుకొనవచ్చునని చెప్పబడి యీప్రకారముగానే జరిగించినన్యస్తవస్తుధారిని పీడించకుండనే నిర్ణయమును రాజుచేయవలెను॥ ౧౯౬॥

మూ॥ విక్రీణీతే పరస్యస్వం యోఽస్వామీ స్వామ్యసమ్మతః। నతం
నయేత సాక్ష్యంతు స్తేనమస్తేనమానినం॥ ౧౯౭॥

తనకు హక్కులేనిద్రవ్యమును స్వామ్యనుమతిలేకుండ నెవడువిక్రయించునో వాడుస్వయముగా చోరుడయ్యెనుచోరుడనైడ యభిమానముగలవాడు వానినెప్పుడు నెచటనయిన సాక్షిగాగ్రహించదగదు॥ ౧౯౭॥

మూ॥ అవహార్యో భవేచ్చైవ సాన్వయ షట్ఛతం దమం। నిరన్వ
యో నవసరః ప్రాప్తస్స్యాచ్చోరకిల్బిషం॥ ౧౯౮॥

పరద్రవ్యమునమ్మివేసినవాడుద్రవ్యస్వామివంశములోవాడయ్యెనేని యతడారునూరుపణములు దండుగ బుచ్చుకొనదగినవాడుస్వామివంశజుడుగాకుండెనేనియనవసరుడునసగాస్వామియొక్క పుత్రాదులవలనప్రతిగ్రహక్రయాదులు లేకధనమునుదొంగిలించినవాడు వానినిచోరునివలె శిక్షించవలెను॥ ౧౯౮॥

మూ॥ అస్వామినా కృతోయస్తు దాయోవిక్రయఏవవా। అకృత
స్సతువిజ్ఞేయో వ్యవహారేయథాస్థితిః॥ ౧౯౯॥

స్వామిగాని వానిచేదానమివ్వబడినదిన్ని విక్రయించబడినదిన్ని చెల్లనేరదు వ్యవహారమందేమర్యాదగలదో యట్లుచెయ్యబడదని తెలియదగును॥ ౧౯౯॥

మూ॥ సంభోగో దృశ్యతేయత్ర నదృశ్యేతాగమః క్వచిత్। ఆగ
మః కారణం తత్ర నసంభోగ ఇతిస్థితిః॥ ౨౦౦॥

ఏవస్తువునందైననను భవమగుపడి దానక్రయాద్యాగమము కనపడకుండెనేని ఆగమము తెలియని యనుభవము కారణముగాదని శాస్త్రమర్యాద॥ ౨౦౦॥

మూ॥ విక్రయాద్యో ధనం కించిద్గృహ్ణీయాత్కులసన్నిధౌ। క్ర
యేణసవిశుద్ధంహి న్యాయతోలభతేధనం॥ ౨౦౧॥

విక్రయమొనరించెడుస్థలమునందు క్రయధనము నొకానొకస్వామిహస్తమునందు
ంటనిచ్చెనేని యట్టిక్రయముచే నస్వామివిక్రయమనెడి దోషములేక శుద్ధమగావున
సాధనమునాకొనినవాడా యమ్మినవానివలన పుచ్చుకొనును॥ ౨౦౧॥

మూ॥ అథమూలమనాహార్యం ।ప్రకాశక్రయశోధితం । అదండ్యో
ముచ్యతేరాజ్ఞా నాష్టికోలభతేధనం॥ ౨౦౨॥

ద్రవ్యస్వామిగానివాడు ప్రకాశముగా నధికారపురుషులయెదుట నమ్మివేసినవా
డుమృతుడై నాదేశాంతరగతుడైనా కొనినవాడుదండనహుడుగావున రాజువా
నిఁవిడువవలెను ద్రవ్యస్వామి కొనినవానికాధనమిచ్చితనవస్తువునుపుచ్చుకొనవలెను
ఇందుకు బృహస్పతివచనము॥ "శ్లో॥వణిగ్వీధీపరిగతం విజ్ఞాతం రాజపూరుషైః। అ
విజ్ఞాతాశ్రయాత్క్రీతం విక్రేతాయత్రవామృతః । స్వామీదత్వార్ధమూల్యంతు
ప్రగృహ్ణీయాత్స్వకంధనం॥" బజారులో రాజపురుషులయెదుటకొనినవస్తువ తె
నెరుగనివాడమ్మివేసి మృతుడయ్యెనేని కొనినవాడుశుద్ధుడుగావున రాజువానివిడచి
పెట్టవలెను ద్రవ్యస్వామియామూల్యమునిచ్చి వేసితనద్రవ్యమునుపుచ్చుకోవలెనుఅ॥

మూ॥ నాన్యదన్యేన సంసృష్ట రూపంవిక్రయమర్హతి । నచాసా
రంనచన్యూనం నదూరే నతిరోహితం॥ ౨౦౩॥

కుంకుమపువ్వును కుసుంభాపువ్వుమొదలగువాటితోకలిపి యమ్మగూడదు నిస్సా
రమగుదానినిన్ని తూనికతక్కువతూచిన్ని అవస్తువును దూరముగానుంచి రోగాది
దూషితమునున్ను అమ్మరావట్లమ్మెనేని ఇది అస్వామిక్రయసదృశమేగనుకనాదండ
మేవీనికిన్ని చేయవలయును॥ ౨౦౩॥

మూ॥ అన్యాంచేద్దర్శయిత్వాన్యా వోఢుఃకన్యా ప్రదీయతే।ఉభే
తే ఏకశుల్కేన వహేదిత్య బ్రవీన్మనుః॥ ౨౦౪॥

శుల్కమును నిర్ణయించేకాలమందు మంచిరూపముగల కన్యనగుపరచి వివా
హకాలమందు మరియొకకురూపయగు కన్యనిచ్చెనేని యాశుల్కానికె ఆయిద్దరికి

న్యలను వావరుడు వివాహముగావలెనని మనువుజెప్పెను శుల్కముపుచ్చుకొని కన్య
నిచ్చుట అమ్మకమువంటిదెగావున వస్తువులను కొనడము అమ్మడముతో సాధర్మ్య
ముచేత నిట్లుచెప్పబడెను॥ ౨౦౪॥

మూ॥ నోన్మత్తాయా న కుష్ఠిన్యా నచయాస్పృష్ట మైథునా। పూ
ర్వందోషానభిఖ్యాప్య ప్రదాతా దండమర్హతి॥ ౨౦౫॥

కుష్ఠరోగిణియు నున్మాదవతియు ననుభూతమైథునయునగు కన్యకనాదాతముం
దుగా కన్యాదోషములను చెప్పియిచ్చినయడల దండార్హుడుగాడు చెప్పకుండిన
దండార్హుడగునని॥ "శ్లో॥ యస్తుదోషవతీంకన్యామని చెప్పగలదు॥ ౨౦౫॥

మూ॥ ఋత్విగ్యది వృతోయజ్ఞె స్వకర్మపరిహాపయేత్ । తస్యక
ర్మానురూపేణ దేయోంశ స్సహకర్తృభిః॥ ౨౦౬॥

ఇటుపైని సంభవించిచేసేదాని చెప్పుచున్నాడు యజ్ఞమందువరణముపుచ్చుకొ
ని కొంతకర్మ మొనర్చిరోగాదికముచే చేయలేకుండిన నితరునిచే నాకర్మము
ను జేయించి చేసినంతపనికి తగినయంశమునకీఋత్విగనుమతిచే నీవలెను॥ ౨౦౬॥

మూ॥ దక్షిణాసుచదత్తాసు స్వకర్మపరిహాపయన్। కృత్స్నమేవల
భేతాంశ మన్యేనైవచ కారయేత్॥ ౨౦౭॥

మాధ్యందినసవనాదిదక్షిణాదానకాలమందు దక్షిణపుచ్చుకొనిరోగాదికముచే
కర్మము చేయలేకుండిననాదక్షిణవాని దే శేషకర్మమన్యునిచేచేయించవలెను॥ ౧౧౬

మూ॥ యస్మిన్ కర్మణియాస్తుస్యు రుక్తాఃప్రత్యంగదక్షిణాః। సఏవ
తాఆదదీతభజేర స్సర్వఏవవా॥ ౨౦౮॥

ఏయాధానాదికర్మమందు ప్రతియంగమును గూర్చి యెవనిసంబంధముచేసేద
క్షిణలుచెప్పబడెనో యవన్నియు నతడేపుచ్చుకోవలెనా లేకనందరు పంచుకోవలె
నాయనిసంశయమురాగా చెప్పుచున్నాడు॥ ౨౦౮॥

మూ॥ రథంహరేతచాధ్వర్యు ర్బ్రహ్మాధానేచవాజినం। హోతా
చాపిహరేదశ్వ ముద్గాతా చాప్యనః క్రమే॥ ౨౦౯॥

కొన్ని శాఖలవారి యాధానమందు రథమునధ్వర్యుడును గుర్రమును హోతయు ,బ్రహ్మవాజిని సోమశకటమునుద్గాతయు పుచ్చుకోవలె నిట్లెవరికేదిదక్షిణగా వేదమందు చెప్పబడెనో యట్లుపుచ్చుకోవలెను॥ మొత్తముగ నిచ్చేదిదక్షిణకువిభాగము నిటుపైని చెప్పుచున్నాడు॥ ౨౦౯॥

మూ॥ సర్వేషామర్థినో ముఖ్యా స్తదర్ధేనార్ధినోపరే॥ తృతీయిన స్తృతీయాంశా శ్చతుర్థాంశాస్తుపాదినః॥ ౨౧౦॥

శ్రు॥ "తంశతేందీక్షయేత్-" అనుశ్రుతివలన యజ్ఞమున కిచ్చేడు దక్షిణనూరు గోవులలో సగమనగా నలుబదెనిమిది ప్రధానులగుహోత అధ్వర్యుడు బ్రహ్మఉద్గాత యీనలుగురున్ను పుచ్చుకోవలెను॥ "సూ॥ యద్వాదశేభ్యః-"యని ప్రత్యేకమీనలులురకును పదిరెండుచొప్పున నిమ్మని కాత్యాయనులుజెప్పిరి గాన విచారించగా నూటిలో సగమేబదిగావలె నయినప్పటికిని కొంచెము తక్కువగా భాగభాక్కులీనల్వురని చెప్పబడిరి వీరికిదగ్గిరవారు మైత్రావరుణులు ప్రతిప్రస్థాత బ్రాహ్మణాచ్ఛంసి ప్రస్తోత వీరునలుగురు నందులో సగమేసిచొప్పున నిరువదినాలుగున్ను వీరి తరువాత అచ్ఛావాకుడు నేష్ట యాగ్నీధ్రుడు ప్రతిహర్త యీనలుగురున్ను ప్రధానాంశములో మూడవవంతు నాలుగేసిచొప్పున పదారున్ను ఆపై నిగ్రావదున్నేతృపోతృసుబ్రహ్మణ్యులు నలుగురును నాలవభాగము మూడేసిచొప్పునపన్నెండున్ను ఇట్లు సూత్రకారులగు కాత్యాయనులచే స్ఫుటముగా జెప్పబడెను॥ ౨౧౦॥

మూ॥ సంభూయస్వానికర్మాణి కుర్వద్భిరిహమానవైః॥ అనేనవిధియోగేన కర్తవ్యాంశప్రకల్పనా॥ ౨౧౧॥

ఈప్రకారముగా పదిమందిగలసి గృహనిర్మాణాది కర్మములొనర్చిన కంసాలలుమొదలగువాళ్ళు తమతమపనులనుబట్టి భాగములను పంచుకొనవలెను॥ ౨౧౧॥

మూ॥ ధర్మార్థంయేనదత్తంస్యా త్కస్మైచిద్యాచతేధనం॥ పశ్చాచ్చనతథాతత్స్యాత్ నదేయం తస్యతద్భవేత్॥ ౨౧౨॥

యజ్ఞాదిసత్కర్మముల నొనర్తునని యాచించినవానికి ధర్మార్థమిచ్చిన ధనము నాతడాసత్కర్మము జేయకున్న నిచ్చినది మరల బుచ్చికొనవలెను యిచ్చెదనని ప్రతినజేసిన నీవలను॥ "సూ॥ ప్రతిశ్రుత్యాప్యధర్మసంయుక్తాయనదద్యాత్"

ప్రీతి సుకృతముగు ధనము నాధర్మము జేయనివానికిరాదని గౌతములు॥ ౨౧౨॥

మూ॥ యః సంసాధయేత్తస్తు దర్పాల్లోభేనవాపునః। రాజ్ఞాదా
ప్యస్సువర్ణంస్యాత్తస్యస్తేయస్యనిష్కృతిః॥ ౨౧౩॥

సత్కర్మనిమిత్తముపుచ్చుకొని యదిచేయక లోభముచే నాసొమ్ము మరలనిచ్చి
వేసుకొనుండినను ఇచ్చేదనన్నదానిని బలాత్కారముగా బుచ్చుకొన్నను వాడుచో
రుడు గావున నిష్కృతికై సువర్ణము దండను విధించవలెను॥ ౨౧౩॥

మూ॥ దత్తస్యైషోదితాధర్మ్యా యథావదనపక్రియా। అతఊ
ర్ధ్వం ప్రవక్ష్యామి వేతనస్యానపక్రియాం॥ ౨౧౪॥

ఇదిదత్తాప్రతిపాదనము ధర్మయుక్తముగ జెప్పబడెను ఇటుపైని జీతమునివ్వ
కపోవడము విషయమై చెప్పగలను॥ ౨౧౪॥

మూ॥ భృతోనార్తోన కుర్యాద్యో దర్పాత్కర్మ యథోదితం।
సదండ్యః కృష్ణలాన్యష్టౌ నదేయంచాస్యవేతనం॥ ౨౧౫॥

రోగాతుడుగాకుండ గర్వముచే నేభృత్యుడు చేయవలసినపని చేయడో వా
నివద్ద నెనిమిదిసువర్ణకృష్ణలము లనగా నిరవై నాలుగు యవగింజలెత్తు బంగార
ము దండను విధించి జీతమివ్వగూడదు॥ ౨౧౫॥

మూ॥ ఆర్తస్తు కుర్యాత్స్వస్థస్సన్ యథా భాషితమాదితః।
స దీర్ఘస్యాపి కాలస్య తల్లభేతైవ వేతనం॥ ౨౧౬॥

చెప్పినట్లు పనిచేసే భృత్యుడు వ్యాధిపీడితుడయ్యేనని పనిచేయకుండి చిర
కాలమైనను జీతము వానికి పూర్ణముగ నీవలెను॥ ౨౧౬॥

మూ॥ యథోక్తమార్త స్సుస్థోవా యస్తత్కర్మ నకారయేత్।
న తస్య వేతనం దేయ మల్పోనస్యాపి కర్మణః॥ ౨౧౭॥

చెప్పబడిన పనిని భృత్యుడు రోగియైన నరోగియైనను గోరతయించుకైన లే
కుండ చేయకుండినను జేయించకుండినను జీతమీరాదు॥ ౨౧౭॥

మూ॥ ఏష ధర్మో ఖిలేనోక్తో వేతనాదాన కర్మణః। అతఊ

ధర్మం ప్రవక్ష్యామి ధర్మేణాం సమయ భేదినాం॥ ౨౧౮॥

ఈ వ్యవస్థ వేతనాదానకర్మములకు చెప్పబడెను ఇటుపయిని సంవిద్వ్యతిక్రమమును జేసిన వారికి దండాదికమును చెప్పగలను॥ ౨౧౮॥

మూ॥ యో గ్రామదేశ సంఘానాం కృత్వా సత్యేనసంవిదం। వి సంవదే న్నరోలోభా త్తం రాష్ట్రా ద్విప్రవాసయేత్॥౨౧౯॥

గ్రామస్థులు దేశస్థులు వర్తకులు మొదలగువారి సమూహమును వీరలీపనిమనమందరగను విడిచి పెట్టక చేతుమని సంకేతముచేసి సత్యముగా శపథములు చేసుకొని వారిలోనెవడైన లోభాదకముచే దాటిపోయినట్లైతె వానిని రాజురాజ్యమునుండి వెళ్లిగొట్టవలెను॥ ౨౧౯॥

మూ॥ నిగృహ్య దాపయేచ్చైనం సమయవ్యభిచారిణం। చతుస్సువర్ణాన్ షణ్ణిష్కాన్ శతమానంచ రాజితం॥ ౨౨౦॥

ఇట్లు శపథము నతిక్రమించిన వానిని పట్టించినాలుగు మొహరీలను ఆరునిష్కములు బంగారమును నూరురూపాయీలను తప్పుననుసరించి యెన్నియోగాని కొన్నియోగాని రాజుదండము నిప్పించవలెను॥ ౨౨౦॥

మూ॥ ఏత ద్దండవిధిం కుర్యా ద్ధార్మికః పృథివీపతిః। గ్రామజాతి సమూహేషు సమయ వ్యభిచారిణాం॥ ౨౨౧॥

గ్రామములందును బ్రాహ్మణాదిజాతులందును సమయము నతిక్రమించిన వానికిట్లు ధర్మప్రధానుడగు రాజుదండమును విధించవలెను॥ ౨౨౧॥

మూ॥ క్రీత్వా విక్రీయవా కించి ద్యస్యేహానుశయో భవేత్। సోంతర్దశాహా త్తద్ద్రవ్యం దద్యాచ్చైవా దదీతచ॥ ౨౨౨॥

కొనిగాని అమ్మివేసిగాని స్థిరమైన భూమ్యాదికమునమ్ముట తగదనిపశ్చాత్తాపముచే పదిదినములలో నామూల్యము నిచ్చి యావస్తువును పుచ్చుకొనవలెనుకొనినవాడు నట్లు జేయవలెను॥ ౨౨౨॥

మూ॥ పరేణతు దశాహస్య నదద్యా న్నాపి దాపయేత్। ఆద

దానో దదచ్చైవ రాజ్ఞా దండ్య శ్శతాని షట్॥ ౨౨౩॥

పదిదినములకు పయిని అమ్మినవాడు తెమ్మనడమున్ను కొనినవాడు పుచ్చుకొమ్మనడమున్ను కూడదట్లు బలాత్కారముగ జేసితేని రాజుచే నారువందలు రూపాయీలు దండమున కపార్హులగుచున్నారు॥ ౨౨౩॥

మూ॥ యస్తు దోషవతీం కన్యా మనాఖ్యాయ ప్రయచ్ఛతి । త
స్య కుర్యా న్నృపో దండం స్వయం షణ్ణవతిం పణాన్॥ ౨౨౪॥

మున్ను క్రేత్రాయా యను శ్లోకముచే సామాన్యముగా జెప్పబడెను దండవిశేషార్థమిప్పుడు చెప్పుచున్నాడు- ఉన్మాదాదిదోషదూషితయగు కన్యయొక్క దోషగోపన మొనర్చి వరునకిచ్చిన వానికి తొంబదిపణములు రాజు స్వయముగా దండమును విధించవలెను పశ్చాత్తాపప్రశంసచే నిచ్చట నదిచెప్పబడెను॥ ౨౨౪॥

మూ॥ అకన్యేతి తు యః కన్యాం బ్రూయా ద్ద్వేషేణ మానవః ।
స శతం ప్రాప్నుయా ద్దండం తస్యా దోషమదర్శయన్॥ ౨౨౫॥

ఇది పురుషసంబంధము నొందినది గాన కన్యగాదని ద్వేషముచే నెవడు చెప్పునో యతడు దోషమును ఋజువుపరచలేకుండెనేని నూరురూపాయీలు దండమునీవలెను కన్యకుదోషముగల్పించినవానికీదండమర్హమే॥ ౨౨౫॥

మూ॥ పాణిగ్రహణికా మంత్రాః కన్యాస్వేవ ప్రతిష్ఠితాః । నాక
న్యాసు క్వచిన్నౄణాం లుప్తధర్మ క్రియాహి తాః॥ ౨౨౬॥

ప్ర॥ "అర్యమణంను దేవంకన్యా అగ్నిమయక్షత" ఇత్యాదిక మంత్రములు కన్యాశబ్దశ్రవణముచే మనుష్యకన్యలయందే వ్యవస్థితములాయెను గాని యకన్యకావిషయమై యెక్కడనే శాస్త్రమందును ధర్మవివాహసిద్ధికొరకు వ్యవస్థచేయబడలేదు అది గావున నై అక్షతయోనులుగాని వారు వైవాహికమంత్రములచే సంస్కరించబడినప్పటికిని లేకపోయిన ధర్మవివాహము గలవారగుచున్నారు ఇది ధర్మ్యమగు వివాహముగాదనియర్థము-క్షతయోనికి వైవాహికమంత్రహోమాదినిషేధక మువిగాదు॥ శ్లో॥ "యాగర్భిణీసంస్క్రియతె వోఢుః కన్యాసముద్భవ" మని క్షతయోనికిన్ని నున్నవై వాహికసంస్కారము ముందు జెప్పగలడుగావున॥ శ్లో॥ "గాంధర్వేషువివాహే

షు పునర్వైవాహికో విధిః కర్తవ్యశ్చ త్రిభిర్వర్ణైః స్వగృహేనాగ్నిసాక్షికః ఇతి" యని దేవలుఁచే మూఁడువర్ణములవారికిని గాంధర్వవివాహములందున్ను వైవాహికహోమమంత్రాదివిధి చెప్పబడెను- గాంధర్వమున్ను సగమనపూర్వకమన్నగును ఇదిక్షత్రియునకు ధర్మమని మనువుచేచెప్పబడెను ఇదిగావున సామాన్యవిశేషన్యాయమువలన క్షతయోనివివాహ మధర్మమనుట యితరవిషయము॥ ౨౨౬॥

మూ॥ పాణిగ్రహణికా మంత్రా నియతం దారలక్షణం। తేషాం
నిష్ఠాతు విజ్ఞేయా విద్వద్భి స్సప్తమేపదే॥ ౨౨౭॥

వైవాహికమంత్రములు భార్యాత్వనిమిత్తమని నిశ్చితమాయెను యథాశాస్త్రప్రయుక్తములగు మంత్రములచే భార్యాత్వమునిష్పన్నమనుటవలననామంత్రములలో॥శ్రు॥"సఖాసప్తపదీభవ" యనుమంత్రముచేనగు కల్పనముచే సప్తమపదన్యాసమగుచుండ భార్యాత్వనిష్పత్తిశాస్త్రజ్ఞులచే తెలియతగినది ఇట్లుగుచుండ సప్తపదికంటె పూర్వము భార్యాత్వనిష్పత్తిలేకపోవుటవల్ల పశ్చాత్తాపముగల్గెనేని విడువవలెను॥ ౨౨౭॥

మూ॥ యస్మిన్యస్మి న్కృతే కార్యే యస్యేహాను శయోభవేత్ ।
తమనేన విధానేన ధర్మ్యేపథి నివేశయేత్॥ ౨౨౮॥

కేవలక్రయమందేకాదు యితరమగు నేమేసంబంధముచేతనయిననగు కార్యమందెవనికి పశ్చాత్తాపముపుట్టనో వానిని దశదినాంతరవిధిచే ధర్మయుక్తమగు మార్గమందు రాజు స్థాపనమొనర్పవలెను॥ ౨౨౮॥

మూ॥ పశుషు స్వామినాంచైవ పాలానాంచ వ్యతిక్రమే।వివాదం
సంప్రవక్ష్యామి యథావ ద్ధర్మతత్త్వతః॥ ౨౨౯॥

గవాదిపశువులవిషయమరు స్వామియొక్కయు పాలకులయొక్కయు వ్యతిక్రమముగలుగుచుండెనేని యట్టివి వాదములందు ధర్మయుక్తమగు వ్యవస్థలేర్పరుపబడుచున్నవి॥ ౨౨౯॥

మూ॥ దివా వక్తవ్యతా పాలే రాత్రౌ స్వామినితద్గృహాత్। యో
గక్షేమే న్యథాచేత్తు పాలో వక్తవ్యతామియాత్॥ ౨౩౦॥

పగలు పశువులయొక్క యోగక్షేమము విషయమై పాలకుని దేపూచీ రాత్రియందు పాలకుడప్పగించుటచే పశుస్వామిదే యాలోపమగుచున్నది రాత్రికాలమందు కూడా పాలకాధీనములై యుండిన నాపూచీపాలకునికే యగుచున్నది॥ ౨౩౦॥

మూ॥ గోపఃక్షీర భృతో యస్తు సదుహ్యా ద్దశతో వరాం।గోస్వా
 మ్యనుమతే భృత్య స్సాస్యాత్పాలే భృతేభృతిః॥ ౨౩౦॥

ఏగోపరి పాలకుడు స్వామివలన వేరేజీతములేకుండ క్షీరమే భృతిగా నాజ్ఞను బొందినవాడగునో వాడు పదిగోవులలో కమంచిగోవుయొక్క పాలను జీతముగాభి తుకుకొనవలెను పదిగోవులను పాలించిన వాడికొకగోవుపాలు జీతమని నిష్కృష్టార్థము॥ ౨౩౧॥

మూ॥ నష్టం వినష్టం క్రిమిభి శ్శ్వహతం విషమేమృతం।హీనం పు
 రుషకారేణ ప్రదద్యాత్పాల ఏవతు॥ ౨౩౧॥

కనపడకపోయినదిన్ని కుక్కలుమొదలగువాటిచే కరవబడిగాని పురుగులుబట్టిగాని గర్తాదులలోబడిగాని చచ్చినదిన్ని ఈరీతిని పాలకునిప్రయత్నము తక్కువచే సేగవాదికమునశించినను పురుషకారలోపముచేపోయినదిగాన నది స్వామికి పాలకుడచ్చుకోవలెను॥ ౨౩౨॥

మూ॥ విఘుష్య తుహృతం చోరై ర్నపాలో దాతుమర్హతి।
 యదిదేశేచ కాలేచ స్వామిన స్స్వస్యశంసతి॥ ౨౩౨॥

చోరులచే చాటిచెప్పి యేది హరించబడునో యనగా బందెపట్టి చోరులగు ప్రబలులచేనని తాత్పర్య మట్టిదేశకాలములు తప్పకుండ దనస్వామితో నాగోపాలుడు తన్నాశమును వెంటనే తెలియ జేసెనేని వాడానష్టమీనక్కరలేదు॥ ౨౩౩॥

మూ॥ కర్ణౌచర్మచ వాలాంశ్చ వస్తిస్నాయుంచ రోచనాం।
 పశుషుస్వామినాం దద్యాన్మృతేష్వంగాని దర్శయేత్॥

పాటికమరణముచే చచ్చినపశువులయొక్క చర్మమున్ను కర్ణములున్ను తోకనున్ను నాభికిందనుండేడినరములున్ను గోరోచనమునున్ను స్వామికప్పగించవలెను మరిన్ని డెక్కలు కొమ్ములు నీచిహ్నములనగుపరచవలెను॥ ౨౩౪॥

మూ॥ అజావికేతు సంరుద్ధే వృకైః పాలే త్వనాయతి । యాం ప్రస
హ్య వృకోహన్యాత్పాలే తత్కిల్బిషం భవేత్॥ ౨౩౫॥

మేకలు గొఱ్ఱెలు వీటిని తోడేళ్లు చుట్టుకొనిన కాపరి పాలకుఁడు వానినిఁ విడిపించుటకు రాఁడేని యాదోషము పాలకునకే గావలెను॥ ౨౩౫॥

మూ॥ తాసాంచే దవరుద్ధానాం చరంతీనాం మిథో వనే । యా
ముత్ప్లుత్య వృకోహన్యాన్న పాలస్తత్ర కిల్బిషీ॥ ౨౩౬॥

అజావికాదులను పాలకుఁడుకూడ త్రోవ కాచుచున్నప్పటికిని నందలొకటి యొకటి తెలియకుండ మేయుచుపోయిన దానిఁ తోడేలు పట్టుకొనిపోయిన యందు దోషము పాలకునకు లేదు॥ ౨౩౬॥

మూ॥ ధనుశ్శతంపరీహారో గ్రామస్య స్యాత్సమంతతః। శమ్యాపా
తాస్త్రయోవాపి త్రిగుణోనగరస్యతు॥ ౨౩౭॥

గ్రామమునకు చుట్టును నన్నూరుమూళ్లుగానిమున్నూరు మూళ్లు గాని సస్యాదిసంరోధము లేకుండ కఱ్ఱల పాతించవలెను పట్టణమునకైతే దీని త్రిగుణముగావలెను॥

మూ॥ తత్రాపరివృతం ధాన్యం విహింస్యుః పశవోయది । నత
త్ర ప్రణయేద్దండం నృపతిః పశురక్షిణాం॥ ౨౩౮॥

ఆయావరణాలో నిరావరణగా బోసిన ధాన్యమును పశువులు మేసినేని దానికై పశుపాలకుని రాజు దండించరాదు॥ ౨౩౮॥

మూ॥ వృతింతత్ర ప్రకుర్వీత యాముష్ట్రో నవిలోకయేత్। ఛిద్రం
చ వారయేత్సర్వం శ్వసూకర ముఖానుగం॥ ౨౩౯॥

ఆ పరిహారస్థానమునకు చుట్టును నెంతపొడుగయితే నవతలనున్న యొంట్లు చూచుటకు వలనుగాదో యంతపొడుగుగల ముంటికంప వెలుగు పందులుకుక్కలును దూరి దూరడమునకైనను సందు లేకుండ వేయవలెను॥ ౨౩౯॥

మూ॥ పథిక్షేత్రే పరివృతే గ్రామాంతీయేథవాపునః। సపాలశ్శ
తదండార్హో విపాలాన్ వారయేత్పశూన్॥ ౨౪౦॥

మూ॥ మార్గమునకు దగ్గరనయున్న గ్రామసమీపమందైనను పావరణమగు సస్యమును పశుపాలకుని యుపేక్షచే ద్వారమునుండి పశువువెళ్ళి మేసినయెడల నాపశుపాలకునకు నూరుపణములు దండనము విధించవలెను పాలకుడులేని పశువులు దాకుండ చేస్తే కాపువాడు వారించవలెను గాని పశువునకు శిక్షలేదు॥ ౨౪౦॥

మూ॥ క్షేత్రే ష్వన్యేషుతుపశు స్సపాదపణమర్హతి। సర్వత్ర
తు సదో దేయః క్షేత్రికస్యేతి ధారణా॥ ౨౪౧॥

ఉక్తవ్యతిరిక్తములగు క్షేత్రములందు సస్యమును పశువుభక్షించెనేని యాపశుపాలకుడు సపాదమగు పణమునుదండుగనీవలెను అన్నిక్షేత్రములందును పశువు మేసిన నష్టము నాకృషికునకు పశుపాలకుడుగాని స్వామిగానియివ్వవలెను॥ ౨౪౧॥

మూ॥ అనిర్దశాహాంగాం సూతాం వృషాన్దేవపశూం స్తథా।
సపాలాన్వా విపాలాన్వా నదండ్యా న్మనురబ్రవీత్॥ ౨౪౨॥

దేవతాప్రతిమలకిబడినవిగాని దేను మేసినయెడలశిక్షలేదు సపాలములేగానియు పాలములేగాని యీనినపదిదినములలో గోవులున్ను చక్రశూలాదిచిహ్నితోత్సృష్టములు గానిసపాలత్వములేగాని ఆబోతులను గోగర్భాధానార్థము మందలలో నుంచురవియని తాత్పర్యము। ౨౪౨॥

మూ॥ క్షేత్రికస్యాత్యయె దండో భాగా ద్దశగుణోభవేత్। తతో
ర్ధదండో భృత్యానా మజ్ఞానాత్ క్షేత్రికస్యతు॥ ౨౪౩॥

కృషిచేసినవాడు పశువులుమేయుటముచేతగాని విత్తనము క్షేత్రమునకుచాలినంత కాలము తప్పకుండ వెయ్యకపోవడముచేతగాని రాజభాగమునకు వచ్చిననష్టమెంతో దానికిపదిరెట్లు దండనీయుడగును వాడెరుగకుండభృత్యులచే నిట్టిలోపమువజరిగనేని యందులోసగము దండమువిధించవలెను క్షేత్రసస్యప్రసంగముచే నిచ్చటనిది వ్రాయబడెను॥ ౨౪౩॥

మూ॥ ఏతద్విధాన మాతిష్ఠే ద్ధార్మికః పృథివీపతిః। స్వామినాంచ
పశూనాంచ పాలానాంచ వ్యతిక్రమే॥ ౨౪౪॥

పశువులవిషయమై స్వాములయొక్కయు పాలకులయొక్కయు నపరాధముల

కుమించినవారి నిర్ణయోపకారముగా ధర్మప్రధానుడగు రాజు చేయవలెను॥

మూ॥ సీమాంప్రతి సముత్పన్నే వివాదే గ్రామయోర్ద్వయోః ।
జ్యేష్ఠే మాసి నయేత్సీమాం సుప్రకాశేషు సేతుషు ॥౨౪౫॥

రెండు గ్రామములవారు పొలిమేరలవిషయమై వివాదపడిరేని జ్యేష్ఠమాసమందు గ్రీష్మాతపముచే గడ్డి కాలక మొండిగట్లు మొదలగుహద్దులు కనపడునుగాన నప్పుడా వివాదమునుతీర్చవలెను॥ ౨౪౫॥

మూ॥ సీమావృక్షాంశ్చకుర్వీత న్యగ్రోధాశ్వత్థకింశుకాన్ । శాల్మ
లీన్సాలతాలాంశ్చ క్షీరిణశ్చైవ పాదపాన్॥ ౨౪౬॥

మఱ్ఱి రావి మోదుగ బూరుగ సాల తాటి యీచెట్లనున్ను పాలుగలిగల మేడి మొదలగుచెట్లు చిరకాలముండువాటిని సీమలకుచిహ్నములుగా వేయించవలెను॥ ౨౪౬॥

మూ॥ గుల్మాన్వేణూంశ్చవివిధాం చ్ఛమీవల్లీస్థలానిచ। శరాన్కు
బ్జకగుల్మాంశ్చ తథాసీమా న నశ్యతి॥ ౨౪౭॥

వెదురుపొదలనున్ను శమివృక్షములనున్ను లతలనున్ను నిమ్నోన్నతాదిస్థలములనున్ను రెల్లునున్ను పొట్టిముల్లుతుప్పలనున్ను సీమలకు చిహ్నములుగా జేసినేని సీమనశించదు॥ ౨౪౭॥

మూ॥ తటాకాన్యుదపానాని వాప్యఃప్రస్రవణానిచ । సీమాసంధి
షుకార్యాణి దేవతాయతనానిచ॥ ౨౪౮॥

కోనేళ్ళు నూతులు బావులు దొరువులు మొదలగుజలస్థానములున్ను దేవతాగృహములున్ను పొలిమేరసంధులను జేయించెనేని జలార్థముబోయెడునరులు వినికిడియొకటి పరంపరచే సాక్షులగుదురు॥ ౨౪౮॥

మూ॥ ఉపచ్ఛన్నానిచాన్యాని సీమాలింగానికారయేత్ ।సీమాజ్ఞా
నేనృణాంవీక్ష్య నిత్యం లోకే విపర్యయం॥ ౨౪౯॥

ఈచెప్పబడినవిగాక మరికొన్ని పైకి కనపడకుండెడు వక్ష్యమాణములగుసీమా

చిహ్నములను ుంచవలెను లోకమందు నరులకు భ్రమప్రమాదములనుజూచి యట్లు జేయవలెను॥ ౨౪౯॥

మూ॥ అశ్మనోస్థీని గోవాలా స్తుషాన్భస్మకపాలికాః। కరీషమి ష్టకాంగారాం శ్శర్కరా వాలుకా స్తథా॥ ౨౫౦॥

మూ॥ యానిచైవం ప్రకారాణి కాలాద్భూమిర్నభక్షయేత్। తా నిసంధిషుసీమాయా మప్రకాశానికారయేత్॥ ౨౫౧॥

రాళ్ళు ఎముకలు ఆవులతోకలు నూక విభూతి కపాలములు పేడ పిడకలు నిప్పకలు బొగ్గులు నిసుక చిడపరాళ్ళు ఈప్రకారముగునవిఏవి కాలాంజనము ప్రత్తి గింజలు ఇవి త్యాజ్యములుచిరకాలము భూమియందుండినను మన్నయిపోకనుండునో వాటిని॥ "శ్లో॥ ప్రత్యక్షంభేష్యే తాని సీమాసంధౌనిధాపయే" దను బృహస్పతివచనమువలన నివి కుండలలోనుంచి సీమాసంధియందు పాతించవలెను॥ ౨౫౦॥౨౫౧॥

మూ॥ ఏతైర్లింగైర్నయేత్సీమాం రాజావివదమానయోః। పూర్వభుక్త్యాచసతత ముదకస్యాగమేనచ॥ ౨౫౨॥

పొలిమేరలకై వివాదపడినవచ్చిన గ్రామముల కెంటికిన్ని ఈచెప్పబడినచిహ్నములచే సీమానిర్ణయము జేయవలెను మూడుపురుషాంతరములకు పూర్వము చిరకాలానుభవము చేతనున్న మధ్యానుపదులు మొదలగు ప్రవాహముల చేతనున్ను సీమానిశ్చయముచేయవలెను॥ ౨౫౨॥

మూ॥ యదిసంశయఏవస్యా ల్లింగానామపిదర్శనే। సాక్షిప్రత్యయ ఏవస్యా త్సీమావాదవినిర్ణయః॥ ౨౫౩॥

ఈవృక్షములు సీమావృక్షములు కావనిన్ని ప్రచ్ఛన్నాంగారాదికమునున్న చోటినుండివేసి మరొకచోట పాతిరిదిసీమగాదని వివాదమువచ్చునున్నచో సీమానిర్ణయము సాక్షిప్రమాణముచే గావలెను॥ ౨౫౩॥

మూ॥ గ్రామీయకకులానాంచ సమక్షం సీమ్నిసాక్షిణః। ప్రష్టవ్యా సీమ్నిలింగాని తయోశ్చైవవివాదినోః॥ ౨౫౪॥

ఉభయగ్రామస్థులయొక్కయు వాదిప్రతివాదులయొక్కయు సమక్షమందు సీ

మా చిహ్నముల నాసాక్షులనడుగవలెను॥ ౨౫౪॥

మూ॥ తేపృష్టాస్తు యథాబ్రూయు స్సమస్తాంసీమ్నినిశ్చయం। ని
బధ్నీయాత్తథాసీమాంసర్వాంస్తాంశ్చైవనామతః॥౨౫౫॥

సీమావిషయమయిన ద్వైవిధ్యమందు నాసాక్షులుజెప్పినదానిని నిశ్చయపరచి యట్లనేచిహ్నములవేయుంచి స్థిరపరచి యాసాక్షులపేరులతో పరిష్కరించిన విధము వ్రాయించవలెను॥ ౨౫౫॥

మూ॥ శిరోభిస్తే గృహీత్వోర్వీం స్రగ్విణోరక్తవాససః। సుకృతై
శ్శాపితాస్స్వైస్స్వైర్నయేయుస్తేసమంజసం॥ ౨౫౬॥

"సూ॥ రక్తస్రగ్వాససస్సీమాం నయేయురితి" యని యాజ్ఞవల్క్యవచనము చే నాసాక్షులు రక్తమాలికలును రక్తవస్త్రములును ధరించి మట్టిబెడ్డనె త్తిపైని బెట్టుకొని అనృతమును చెప్పితిమేని మాపుణ్యము నశించుగాక యని శపథములొనరించి సీమను యథాశక్తిగా నిర్ణయించవలెను॥ ౨౫౬॥

మూ॥ యథోక్తేన నయంతస్తే పూయంతే సత్యసాక్షిణః। విపరీ
తం నయంతస్తు దాప్యాస్స్యుర్ద్విశతం దమం॥ ౨౫౭॥

ఆసాక్షులు సత్యముగ బలికితేని నిష్పాపులగుచున్నారు అసత్యముగ జెప్పితేని సాక్షియొకరుడికి రెండువందల పణములు దండమును రాజుపుచ్చుకోవలెను॥

మూ॥ సాక్ష్యభావేతు చత్వార స్సామంతా గ్రామవాసినః। సీ
మావినిర్ణయం కుర్యుః ప్రయతా రాజసన్నిధౌ॥ ౨౫౮॥

అట్టిసాక్షులు లేకుండిన నావివాదస్థానమునకు నాలుగు దిక్కులనున్న గ్రామస్థులు నలుగురు విచారించి రాజసన్నిధిని జెప్పి సీమానిర్ణయమును పరిష్కరించవలెను॥ ౨౫౮॥

మూ॥ సామంతానామభావేతు మౌలానాం సీమ్నిసాక్షిణాం।
ఇమాన్యను యుంజీత పురుషాన్వనగోచరాన్॥ ౨౫౯॥

అట్టివారును లేకుండినచో గ్రామముకట్టినది మొదలు వంశపరంపరగా నుండి

నకటుంబస్థులవారిన్ని సమీపవనమందున్న వారిన్ని సీమాసాక్షులుగా నేర్పరచవలెను॥ ౨౫౯॥

మూ॥ వ్యాధాంచ్ఛాకునికాన్గోపాన్ కైవర్తాన్మూలఖానకాన్ ।
వ్యాళగ్రాహానుంఛవృత్తీనన్యాంశ్చ వనచారిణః॥ ౨౬౦॥

మృగవధజీవులును పక్షివధజీవులను గొల్లవాళ్లున్ను జాలరులున్ను దుంపలు వెళ్లు నమ్ముకొనే వాళ్ళును పాములవాళ్ళున్ను శిలోంఛవృత్తిచేననగా కకినేరుకొనేవాళ్లున్ను వీళ్లనున్ను మరియున్న వనచారులనున్ను ఫలములను పుష్పములనాకులను గర్రలను బొగ్గులను నమ్ముకొనేవాళ్ళనున్ను సాక్షులనుగాదెచ్చియడగవలెను వీళ్ళందరుస్వార్థముననకు గ్రామమునుంచి వెళ్లుచుందురు గావున వాళ్ళకు సీమలుతెలిసియుండును గావున వాళ్ళనడుగవలెను॥ ౨౬౦॥

మూ॥ తేపృష్టాస్తు యథాబ్రూయుస్సీమాసంధిషు లక్షణం। త
త్తథా స్థాపయేద్రాజా ధర్మేణగ్రామయోర్ద్వయోః॥ ౨౬౧॥

ఆవ్యాధాదులడగబడి గ్రామముల పొలిమేరహద్దులు యేచిహ్నములు చెప్పుదురో అదిస్థిరపరచి రెండుగ్రామములకు రాజుహద్దులుచేసి సీమావ్యవస్థచేయవలెను॥

మూ॥ క్షేత్రకూపతటాకానా మారామస్య గృహస్యచ । సా
మంతప్రత్యయో జ్ఞేయ స్సీమాసేతు వినిర్ణయః॥ ౨౬౨॥

ఒకగ్రామమందైనను క్షేత్రకూపతటాకారామ గృహములయొక్క వివాదములో హద్దులనిర్ణయము విషయమై సామంతులుగ దేశవాసులసాక్ష్యమే ప్రమాణముగా హద్దులచిహ్నము తేర్పాటుచేయవలెనుగాని వ్యాధాదుల మాటమీదనేనిశ్చయించరాదు॥ ౨౬౨॥

మూ॥ సామంతాశ్చే న్మృషాబ్రూయు స్సేతౌ వివదతాంనృణాం।
సర్వే పృథక్పృథ గ్దండ్యా రాజ్ఞా మధ్యమసాహసం॥ ౨౬౩॥

హద్దులయొక్క చిహ్నములనిమిత్తమై వివాదపడుచున్న మనుష్యులయొక్క కార్యము విషయమై సామంతులగు దేశస్థులబద్ధమాడిరేని ప్రత్యేకముగా మధ్యమసాహసమును దండమువిధించవలెను- అనగా నాసామంతులగు వారికి పూర్వ

ము నిర్ణయించిన దానికి ద్విగుణ మిన్నూరుపణములు దండించనగును॥ ౨౬౩॥

మూ॥ గృహం తటాక మారామం క్షేత్రంవా భీషయాహరన్ ।
శతాని పంచదండ్యస్స్యా దజ్ఞానా ద్ద్విగుణోదమః॥ ౨౬౪॥

గృహతటాకోద్యానక్షేత్రములలో దేనినైన చంపెదను ఖయిను జెయించెదనని భయపెట్టిహరించిన వానికేనూరుపణములు దండమువిధించవలెను తనదనుకొనిభ్రమచే స్వతంత్రించి యాక్రమించెనేని యిన్నూరుపణములు దండముపుచ్చుకోవలెను॥ ౨౬౪॥

మూ॥ సీమాయామవిషహ్యాయాం స్వయంరాజైవ ధర్మవిత్ ।
ప్రదిశేద్భూమి మేతేషా ముపకారాదితి స్థితిః॥ ౨౬౫॥

సీమాచిహ్నములును సాక్షులున్ను లేనప్పుడు హద్దు లేర్పాటుగాకుండనుండినప్పుడు రాజే పక్షపాతరహితుడై వివాదభూమి స్వయముగాచూచి కలహపడుచున్నవాళ్లలో నేపక్షమువాళ్లకువివాదస్థలము మిక్కిలీ ఉపయోగించుటగానీ అదిలేకున్నంజాలానపకారము గావడముగాని గల్గిపెద్దకలహముపడుచు నెవళ్లుందురోవాళ్లకావివాదభూమి నిప్పించవలెనని శాస్త్రనిశ్చయము॥ ౨౬౫॥

మూ॥ ఏషోఖిలే నాభిహితో ధర్మస్సీమావినిర్ణయే । అతఊ
ర్ధ్వం ప్రవక్ష్యామి వాక్పారుష్య వినిర్ణయం॥ ౨౬౬॥

ఇదిసీమానిశ్చను నిశ్శేషముగ జెప్పబడెను ఇటుపైనివాక్పారుష్య నిర్ణయమునుజెప్పెను అనుక్రమణికలో॥ "శ్లో॥ పారుష్యేదండవాచికే॥" యని దండపారుష్యమన్యాయము గావున ముందుజెప్పబడినప్పటికిని ముందుగావాక్పారుష్యమును ఆపైని దండపారుష్యము జరుగునుగాన నిట్లుచెప్పబడెను॥ ౨౬౬॥

మూ॥ శతంబ్రాహ్మణమాక్రుశ్య క్షత్రియోదండమర్హతి। వైశ్యో
ప్యర్ధ శతంద్వేవా శూద్రస్తు వధమర్హతి॥ ౨౬౭॥

బ్రాహ్మణునిసీవ్రుదొంగవనుట మొదలగుమాటలను మించనాడినక్షత్రియునకు నూరుపణములు దండమువిధించవలెను ఈలాగునే వైశ్యునకునూటయేబదిగానియిన్నూరుగాని పణములు గౌరవలాఘవవిచారముచే దండము విధించవలెనుశూద్రుడ

ట్లు బ్రాహ్మణుని మించనాఁడనేని దెబ్బలు కొట్టించడము మొదలగుకఠినశిక్షఁజేయవలెను

మూ॥ పంచాశద్బ్రాహ్మణోదండ్యః క్షత్రియస్యాభిశంసనే । వై
శ్యేస్యాదర్థపంచాశత్ శూద్రేద్వాదశకోదమః॥ ౨౬౮॥

క్షత్రియుని పైనిచెప్పినట్లాక్షేపించిన బ్రాహ్మణునకు నేబదిపణములు దండము విధించవలెను వైశ్యునాక్షేపించెనేని యిరువదైదున్ను శూద్రునాక్షేపించెనేని పన్రెండుపణములును దండమువిధించవలెను॥ ౨౬౮॥

మూ॥ సమవర్ణే ద్విజాతీనాం ద్వాదశైవవ్యతిక్రమే । వాదేష్వ
వచనీయేషు తదేవ ద్విగుణంభవేత్॥ ౨౬౯॥

ద్విజులు బ్రాహ్మణక్షత్రియవైశ్యులు వీరిలో నేజాతివాఁడాజాతివానినుక్తప్రకారమాక్షేపించినం బండ్రెండుపణములు దండము విధించవలెను అవాచ్యములు అనగా నమ్మనాలినివాక్రుచ్చితిట్టినచో మొదటచెప్పినవర్ణక్రమముననైనదండము నూరుచెప్పినచో నిన్నూరు యీవిధమైనదండమందరికిని విధించవలెను॥ ౨౬౯॥

మూ॥ ఏకజాతి ద్విజాతీంస్తు వాచాదారుణయాక్షిపన్। జిహ్వా
యాః ప్రాప్నుయాచ్ఛేదం జఘన్య ప్రభవోహిసః॥ ౨౭౦॥

శూద్రుడుద్విజులను పాపపుతిట్లుతిట్టెనేని వానినాలుకను గోయించవలెను పాదజుడధముఁడుగావున॥ ౨౭౦॥

మూ॥ నామజాతి గ్రహంత్వేషా మభిద్రోహేణ కుర్వతః । నిక్షే
ప్యోయో మయశ్శంకు జ్వలన్నాస్యే దశాంగుళః॥ ౨౭౧॥

అభిద్రోహమనఁగా నాక్రోశము బ్రాహ్మణాదులనోరీయజ్ఞదత్తుఁడా బ్రాహ్మణాధముఁడానీవనియహంకృతితో పేరు జాతియెత్తియెవ్వఁడుమించనాఁడునో వానినోటిలో మెఱ్ఱగాకాల్చిన పదియంగుళములయినుపచీల దిగగొట్టించవలెను॥ ౨౭౧॥

మూ॥ ధర్మోపదేశం దర్పేణ విప్రాణామస్యకుర్వతః । తప్త
మాసేచ యెత్తైలం వక్త్రేశ్రోత్రేచపార్థివః॥ ౨౭౨॥

ఏలాగునో ధర్మమును లేశమమాత్రమునుదెలసి గర్వముచేసికి ధర్మముచేయవలసినదని యేశూద్రుడు బ్రాహ్మణునకుపదేశించునో వానినోటిలోనున్నచెవుల

లోనున్ను మరిగించినచమురుబోయించవలెను॥ ౨౭౨॥

మూ॥ శ్రుతందేశంచ జాతించ కర్మశారీర మేవచ। వితథేనబ్రు
వన్దర్పా ద్దాప్యస్స్యా ద్ద్విశతందమం॥ ౨౭౩॥

ఇదిసమానజాతివిషయము దండముస్వల్పముగావున ద్విజుల నాక్షేపించు శూద్రునివిషయముగాదు నీవుచదవలేదు నీవాదేశస్థుడవుగావు నీవాజాతిగలవాడవుగావు నీశరీరముపనయనాదులచే సంస్కరించబడలేదని యహంకారముచే వ్యర్థముగాబలికినవానికి యిన్నూరుపణములు దండమురాజువిధించవలెను॥ ౨౭౩॥

మూ॥ కాణంవా ప్యథవాఖంజ మన్యంవాపి తథావిధం। తథ్యేనా
పి బ్రువన్దాప్యో దండం కార్షాపణావరం॥ ౨౭౪॥

ఒకకన్నుగుడ్డివాడు కాణుడు వానినిగాని సొట్టవాడు మొదలయిన వారిని నిజమైనప్పటికిని గుడ్డివాడా సొట్టవాడా యనిపిలిచినవానికికొంచెపు దండముకార్షాపణమనగా యిప్పటిలెక్కను కొంచముతక్కువ పదారుచిన్నములబంగారమునకయ్యేసొమ్ము విధించవలెను॥ ౨౭౪॥

మూ॥ మాతరం పితరం భార్యాం భ్రాతరం తనయం గురుం। ఆ
క్షారయం చ్ఛతందాప్యః పంథానం చాదదద్గురోః॥ ౨౭౫॥

తల్లిని తండ్రిని భార్యను పుత్రుని పాపపుతిట్లుతిట్టినను గురువుకు త్రోవనియ్యకనుండినను వానికి నూరుపణములు దండమువిధించవలెను భార్యాదులతో గురువును తిట్టినేని శిక్షసమముగాకుండనిట్లు సమాధానముచేయ్యవలెను మేధాతిథిమాత్రాదులకన్యోన్యము భేదముపుట్టించినవానికీ దండమనివ్రాసెను॥ ౨౭౫॥

మూ॥ బ్రాహ్మణక్షత్రియాభ్యాంతు దండంకార్యో విజానతా। బ్రా
హ్మణే సాహసఃపూర్వః క్షత్రియే త్వేవ మధ్యమః॥ ౨౭౬॥

బ్రాహ్మణులకున్ను క్షత్రియులకును తిట్టుటజరిగినప్పుడు దండశాస్త్రజ్ఞుడగు రాజు క్షత్రియునినిందించినాడైన బ్రాహ్మణునకు ప్రథమసాహసమున్ను బ్రాహ్మణునితిట్టినక్షత్రియునకు మధ్యమసాహసమున్ను విధించవలెను॥ ౨౭౬॥

మూ॥ విట్ఛూద్రయో రేవమేవ స్వజాతిం ప్రతితత్త్వతః । ఛేదవ
ర్జం ప్రణయనం దండస్యేతి వినిశ్చయః॥ ౨౭౭॥

వైశ్యశూద్రులు తిట్లాడినచో విప్రక్షత్రియులకునుంబలె శూద్రుని తిట్టిన వైశ్యునకు ప్రథమసాహసమున్ను వైశ్యుని తిట్టిన శూద్రునకు మధ్యమసాహసమున్ను ఛేదవర్జముగా విధించవలెను దీనిచే పూర్వమందు ద్విజులను బూతులాడిన శూద్రునకు జిహ్వాచ్ఛేదము చెప్పెను ఇచ్చటి విధిచే వైశ్యుని తిట్టిన శూద్రునకు జిహ్వాచ్ఛేదనము లేదని ప్రాప్తమాయెను॥ ౨౭౭

మూ॥ ఏవం దండవిధిః ప్రోక్తో వాక్పారుష్యస్య తత్త్వతః। అత ఊ
ర్ధ్వం ప్రవక్ష్యామి దండపారుష్య నిర్ణయం॥ ౨౭౮॥

ఈప్రకారముగా వాక్పారుష్యమునకు దండనిర్ణయమును జెప్పి యిటుపైని దండపారుష్యమునకు దండమును నిర్ణయించుచున్నాడు॥ ౨౭౮॥

మూ॥ యేనకేనచిదంగేన హింస్యాచ్చేచ్ఛ్రేష్ఠమంత్యజః। ఛేత్త
వ్యం తత్తదేవాస్య తన్మనోరనుశాసనం॥ ౨౭౯॥

శూద్రుడే యవయవముచే బ్రాహ్మణుని కొట్టునో రాజా శూద్రుని యొక్క యాయవయవమును ఛేదించవలెనని మనుశాసనము॥ ౨౭౯॥

మూ॥ పాణిముద్యమ్య దండంవా పాణిచ్ఛేదనమర్హతి। పాదేన
ప్రహరన్ కోపాత్పాదచ్ఛేదనమర్హతి॥ ౨౮౦॥

చెయ్యెత్తిగాని కర్రయెత్తిగాని కొట్టెనేని హస్తచ్ఛేదనమున్ను కాలెత్తితన్నెనేని పాదచ్ఛేదనమున్ను బొందును॥ ౨౮౦॥

మూ॥ సహాసనమభిప్రేప్సు రుత్కృష్టస్యాపకృష్టజః।కట్యాం కృ
తాంకో నిర్వాస్యాత్ స్ఫిచంవాస్యాపకర్తయేత్॥ ౨౮౧॥

బ్రాహ్మణునితోగూడ నేకాసనమందు గూర్చుండనిచ్ఛయించిన శూద్రుని కటియందు తప్తలోహముచే కాల్పించి దేశమును వాటించవలెను చావకుండునట్లు వాని పిర్రనయినను గోయించవలెను॥ ౨౮౧॥

మూ॥ అవనిష్ఠీవతో దర్పా ద్వావోష్ఠౌ చ్ఛేదయేన్నృపః । అవ
మూత్రయతో మేఢ్ర మవశర్ధయతో గుదం॥ ౨౮౨॥

బ్రాహ్మణుని యవమానించుటకు గర్వముచే శూద్రుడుమిసెనేని రెండు పెదవులున్ను మీదమూత్రించెనేని లింగమున్ను ప్రమాదముచేగాక నవమానించుటకు విప్రునిపైశర్ధించెనేని గుదమున్ను రాజుకోయించవలెను॥ ౨౮౨॥

మూ॥ కేశేషు గృహ్ణతో హస్తౌ చ్ఛేదయే దవిచారయన్। పాద
యోర్దాఢికాయాంచ గ్రీవాయాం వృషణేషుచ॥ ౨౮౩॥

గర్వముచే బ్రాహ్మణుని బాధించుటకు శూద్రుడు జుట్టు పాదములు గడ్డమును వృషణమునున్ను బట్టుకొనెనేని విచారము కర్ర లేకుండ వాని చేతులను ఛేదించవలెను॥

మూ॥ త్వగ్భేదకశ్శతం దండ్యో లోహితస్యచ దర్శకః। మాంస
చ్ఛేత్తాతు షణ్ణిష్కాన్ ప్రవాస్య స్త్వస్థిభేదకః॥ ౨౮౪॥

దండలాఘవముచే నిచ్చట సమానజాతియని చెప్పవలెను బ్రాహ్మణునిబ్రాహ్మణుడు చర్మమూడునట్లుగొట్టెనేని నూరుపణములున్ను మాంసము తెగపడునట్లు గొట్టెనేని యారునిష్కములున్ను దండుగ పుచ్చుకొనవలెను యెముక విరుగునట్లు గొట్టినవానిని దేశమును దాటించవలెను॥ ౨౮౪॥

మూ॥ వనస్పతీనాం సర్వేషా ముపభోగో యథాయథా। తథాత
థా దమః కార్యో హింసాయామితి ధారణా॥ ౨౮౫॥

ఫలపుష్పాదులచే మనుష్యులకుపయోగము త్తమమధ్యమాదిభేదమున నగుచుండునో తత్తద్వృక్షాదులను గొట్టినవానికి త్తమసాహసాది భేదముచే దండమువిధించవలెను॥ "సూ॥ ఫలోపభోగద్రుమచ్ఛేదీ తూత్తమసాహసం- పుష్పోపభోగచ్ఛేదీ మధ్యమం- వల్లీగుల్మలతాచ్ఛేదీ కార్షాపణశతం- తృణచ్ఛేద్యేకం కార్షాపణం పణమేవచేతి మనునాప్యుక్తో వేదితవ్యః॥" ఫలవృక్షములను నరికినవానికి త్తమసాహసమనగా వేయిపణములు పుష్పమాత్రోపయోగార్హవృక్షములను నరికినవానికిమధ్యమసాహసమనగా నేనూరుపణములు లతాగుల్మాదులను ఛేదించినవానికినూరు పణములు తృణమును ఛేదించినవానికొకపణమున్ను దండము విధించుమని మను-

పున్న చెప్పెనని తెలియదగునని విష్ణుస్మృతి॥ ౨౮౫॥

మూ॥ మనుష్యాణాం పశూనాంచ దుఃఖాయప్రహృతేసతి। య
థాయథామహద్దుఃఖం దండంకుర్యాత్తథాతథా॥ ౨౮౬॥

మనుష్యులనున్ను పశువులనున్ను కొట్టడముచేసినగు దుఃఖాదికమునుబట్టి దండా ధిక్యము గావలెను చర్మమూడగొట్టినవానికి నూరుపణములని చెప్పబడినదిదుఃఖా ధిక్యమైనను దండమునంతకంటే నెకుడుగా విధించవలెను॥ ౨౮౬॥

మూ॥ అంగావపీడనాయాంచ వ్రణశోణితయోస్తథా। సముత్థాన
వ్యయందాప్యస్సర్వదండమథాపివా॥ ౨౮౭॥

కాలుచేయివిరుగుటగాని గాయములుపడడముగానిఅయ్యేటట్టుగొట్టినవానిచేనా దెబ్బలవల్లవచ్చిన పీడబోయి యెప్పటివలె బాగుపడే మట్టుకునుపథ్యౌషధాదుల కర్యాన్వయమిప్పించవలె నట్లివ్వకుండెనేని యందుకు తగిన ధనమునున్నదండము తోకూడా వానివలన పుచ్చుకోవలెను॥ ౨౮౭॥

మూ॥ ద్రవ్యాణిహింస్యాద్యోయస్య జ్ఞానతోజ్ఞానతోపివా। సత
స్యోత్పాదయేత్తుష్టిం రాజ్ఞేదద్యాచ్చతత్సమం॥ ౨౮౮॥

ఎవడెవని తామ్రపాత్రాదివస్తువులను తెలిసీగాని తెలియకగాని చెడగొట్టెనే ని వాల నట్టివస్తువులను వాడువానికిచ్చి సంతసింపజేయవలెను చెడిన వస్తువులకు సమానమయిన సొమ్మును రాజుకు దండమివలెను॥ ౨౮౮॥

మూ॥ చర్మచార్మికభాండేషు కాష్ఠలోష్ఠమయేషుచ। మూల్యా
త్పంచగుణోదండః పుష్పమూలఫలేషుచ॥ ౨౮౯॥

చర్మములును తోలుసంచులును కర్రచేగాని మట్టిచేగాని చేసిన పాత్రాదులు న్ను పుష్పమూలఫలములున్ను వీటినెవడుపాడుజేయునో వాడాచెడగొట్టబడినవా టిమూల్యమునకయిదురెట్లు దండము రాజుకీవలెను వస్తువుగలవానికి తుష్టిజేయవ లెను॥ ౨౮౯॥

మూ॥ యానస్యచైవయాతుశ్చ యానస్వామినఏవచ। దశాతివర్తన

నాన్యాహుశ్శేషేదండోవిధీయతే॥ ౨౯౦॥

రేతాదియానములకున్ను సారథులకున్ను నారథావులహేతు(?)దాలకున్ను నిమిత్తములతిక్రమించి వర్తించునవిగలవదిగలిగెనేని ప్రాణినాశ ద్రవ్యనాశము లుగలిగినను యానస్వామికి దండములేదని చెప్పుచున్నారవిగానిచో దండము పడును.॥ ౨౯౦॥

మూ॥ ఛిన్ననాస్యేభగ్నయుగె తిర్యక్ప్రతిముఖాగతే। అక్షభంగే చయానస్య చక్రభంగేతథైవచ॥ ౨౯౧॥

భేదనేచైవ యంత్రాణాం యోక్త్రరశ్మ్యోస్తథైవచ। ఆ క్రందెచాప్యపైహీతి నదండంమనురబ్రవీత్॥ ౨౯౨॥

బండికిబూన్చినయెద్లయొక్కముకుత్రాడు తెగినను పూజు విరిగినను భూమి యొక్క నిమ్నోన్నతముల చేతను బండియెదురుగా దిరిగినను ఇరుసువిరిగినను యుండ విరిగినను బండికిగట్టిన చర్మాదులు వికలములయినను మెడత్రాడు తెగినను కొరడా శిథిలమైనను వసిలిపొమ్మని సారథి కేకలువేయుచుండినను యిట్టినిమిత్తములు గలిగిన ప్పుడు యానమున జంతుమరణమైనను ద్రవ్యనాశమైనను సారథిమొదలగు వారికి దండములేదు॥ ౨౯౧॥౨౯౨॥

మూ॥ యత్రాపవర్తతే యుగ్యం వైగుణ్యాత్ప్రాపకస్యతు। తత్రస్వామిభవేద్దండ్యో హింసాయాంద్విశతంపమం॥౨౯౩॥

సారథియొక్క నేరమిచే బండివికటముగా నడుచుటచే ప్రాణిహింసయయ్యెనే ని నేరసిసారథినుంచినందుకు యానస్వామి కిన్నూరు పణములు దండము వేయవ లెను॥ ౨౯౪॥

మూ॥ ప్రాజకశ్చేద్భవేదాప్తః ప్రాజకోదండమర్హతి। యుగ్యస్థాః ప్రాజకేనాప్తె సర్వేదండ్యాశ్శతంశతం॥ ౨౯౪॥

సారథికుశలుడైనప్పటికిని మనుష్యమారణమయ్యెనేని యాసారథికే యిన్నూరుపణములు దండముగావలెను- స్వామికక్కరలేదు సారథికుశలుడుగాని రథముపైనున్న వారలందరున్ను నూరేసి పణములు దండనార్హులగుచు న్నారుకుసార

ధిగల రథమును నారోహించుటవలనః॥ ౨౯౪॥

మూ॥ స చేత్తు పథిసంరుద్ధః పశుభి ర్వారథేనవా । ప్రమాపయే
త్ప్రాణ భృత స్తత్ర దండో౽విచారితః॥ ౨౯౫॥

రథమునకడ్డుగా విస్తారముగా పశువులుగాని మరియొక రథముగానియడ్డుపడిన ప్పుడు రథమడ్డుగా తిరగడము వల్లనైనను రథావయవములు విరుగుట వల్లనైన ను ప్రాణినాశమయ్యెనేని యట్టిచో విచారమక్కర లేకుండ సారథిదండ్యుడు గా వలెను. అట్టియపరాధ మొకమారైయినప్పుడు దండమెట్లగుననఁగ॥ ౨౯౫॥

మూ॥ మనుష్య మారణే క్షిప్రం చోరవ త్కిల్బిషంభ వేత్। ప్రా
ణభృత్సు మహత్స్వర్ధం గోగ జోష్ట్రహయాదిషు॥ ౨౯౬॥

అట్టిచో మనుష్యమారణమయ్యెనేని చోరునకుఁబలెనుత్తమసాహసము వేయి పణములు సారథికి దండము విధించవలెను గాని వధరూపమగు దండము గూడదు గోగజాదికమగు గొప్పజంతువునకు మారణమయ్యెనేని యేనూరుపణములుదండిం చవలెను॥ ౨౯౬॥

మూ॥ క్షుద్రకాణాం పశూనాంతు హింసాయాం ద్విశతో దమః ।
పంచాశత్తు భవేద్దండ శ్శుభేషు మృగపక్షిషు॥ ౨౯౭॥

జాతిచేతనున్ను వయస్సుచేతనున్ను చిన్నజంతువులు చచ్చెనేని యిన్నూరుపణ ములు దండము శుభకరములగు శుకశారికాదిపక్షులును లేళ్ళు మొదలగు మృగము లున్ను జచ్చెనేని యేబదిపణములు దండమగుచున్నది॥ ౨౯౭॥

మూ॥ గర్దభాజావికానాంతు దండస్స్యా త్పాంచమాషకః। మా
షకస్తు భవే ద్దండ్యశ్శ్వ సూకరనిపాతనే॥ ౨౯౮॥

గాడిదె మేకమొదలగునట్టివి చచ్చెనేని నైదువెండిమాషములున్ను కుక్కపంది యిట్టివి చచ్చెనేని యొకమాషమే దండమగును॥ ౨౯౮॥

మూ॥ భార్యా పుత్రాశ్చ దాసశ్చ శిష్యో భ్రాతా చ సోదరః।
ప్రాప్తాపరాధా స్తాడ్యాస్స్యూ రజ్జ్వా వేణుదళేన వా॥ ౨౯౯॥

భార్యయు కొడుకు దాసుడు శిష్యుడు సోదరుడు వీరపరాధమొనర్చి నపుడు శిక్షార్థము సన్నపుత్రాడుచేనై న వెదురుకివ్వచేనైన గొట్టవలెను॥ ౨౯౯॥

మూ॥ పృష్ఠతస్తు శరీరస్య నోత్తమాంగే కథంచన। అతోన్యథా తు ప్రహరన్ ప్రాప్తస్స్యా చ్చౌరకిల్బిషం॥ ౩౦౦॥

ఆవెదురు కివ్వచేనైన వీపుమీదకొట్టవలెను కాని నెత్తిమీదగొట్టరాదు- అన్యథాకొట్టెనేని చోరునకువలె వాగ్దండధనదండముల నొందును॥ ౩౦౦॥

మూ॥ ఏషోఖిలే నాభిహితో దండపారుష్య నిర్ణయః । స్తేన స్యాతః ప్రవక్ష్యామి విధిం దండవినిర్ణయే॥ ౩౦౧॥

ఈ దండపారుష్యవిధి నిశ్శేషముగ జెప్పబడెను- ఇంక చోరదండవిధానమును జెప్పెదను॥ ౩౦౧॥

మూ॥ పరమం యత్నమాతిష్ఠేత్ స్తేనానాం నిగ్రహేన్నృపః। స్తేనానాం నిగ్రహాదస్య యశోరాష్ట్రంచ వర్ధతే॥ ౩౦౨॥

రాజు చోరనిగ్రహమందు గొప్పప్రయత్నమును జేయవలెనుచోరనిగ్రహమువలన రాజుకధికమైన కీర్తిన్ని ఉపద్రవాభావముచే రాష్ట్రవృద్ధిన్ని యగును॥ ౩౦౨॥

మూ॥ అభయస్యచయో దాతా సపూజ్య స్సతతం నృపః । సత్రంహి వర్ధతే తస్య సదైవాభయదక్షిణం॥ ౩౦౩॥

చోరభీతిలేకుండ నేరాజు పాలించునో యాతండు సర్వదాపూజ్యుడగును యజ్ఞము వంటి యితని పాలలము చోరులవలన నభయమనెడి దక్షిణగలదియై సంతతము వృద్ధినొందును యజ్ఞ మొకప్పటిదిది సర్వకాలీనమని వ్యతిరేకాకారము॥ ౩౦౩॥

మూ॥ సర్వతో ధర్మషడ్భాగో రాజ్ఞోభవతి రక్షతః । అధర్మాదపి షడ్భాగో భవత్యస్యహ్యరక్షతః॥ ౩౦౪॥

చోరాదిభీతిలేకుండ రక్షించెడి రాజుకు సాధుజనకృతధర్మములలో నారవపాలు లభ్యమగునట్లు రక్షించని రాజునకసాధుజనకృతమగు నధర్మములో నారవపాలు సంభవించునుగాన సవర్యము రక్షించవలెనని తాత్పర్యము॥ ౩౦౪॥

మూ॥ యదధీతే యద్యజతే యద్దదాతి యదర్చతి। తస్యషడ్భా
గభాగ్రాజా సమ్యగ్భవతి రక్షణాత్॥ ౩౦౫॥

అధ్యయనము యజ్ఞము దానము దేవార్చనము నేదిచేయబడుచుండునదియెల్ల రాజరక్షణముచే నగునుగాన నారాజాధర్మములలో షడ్భాగము నవశ్యము బొందును॥ ౩౦౫॥

మూ॥ రక్షన్ ధర్మేణ భూతాని రాజా వధ్యాంశ్చ ఘాతయన్।
యజతేఽహరహర్యజ్ఞైః సహస్రశతదక్షిణైః॥ ౩౦౬॥

స్థావరజంగమభూతములను యథాశాస్త్రముగ పరిపాలించుచును చోరాది దుష్టులను శిక్షించుచును రాజులక్షదక్షిణగలయజ్ఞము నిత్యముచేయును యజ్ఞఫలమును పొందుచుండునని॥ ౩౦౬॥

మూ॥ యోఽరక్షన్ బలిమాదత్తే కరంశుల్కంచ పార్థివః। ప్రతి
భాగంచ దండంచ ససద్యో నరకంవ్రజేత్॥ ౩౦౭॥

ఏరాజుప్రజారక్షణముజేయక బలియనగా ప్రతిసంవత్సరమున్ను పుచ్చుకొనే ధాన్యాదికము కరమనగాపన్ను శుల్కమనగావర్తకులవద్దరాబట్టెడిసుంకముప్రతిభాగమనగా ప్రత్యహముకానుకగానిచ్చెడి పుష్పఫలాదికముదండమనగాజులమానా ఇదిపుచ్చుకొనునో యతండుజీవితాంతమందునరకమునబడును॥ ౩౦౭॥

మూ॥ అరక్షితారం రాజానం బలిషడ్భాగహారిణం। తమాహు
స్సర్వలోకస్య సమగ్రమలహారకం॥ ౩౦౮॥

ఏరాజురక్షించకపన్నులనారవపాలును స్వీకరించునో యతండు సర్వజనుల యొక్క పాపమునేస్వీకరించుచున్నాడు॥ ౩౦౮॥

మూ॥ అనపేక్షితమర్యాదం నాస్తికం విప్రలుంపకం। అరక్షితా
రమత్తారం నృపంవిద్యా దధోగతిం॥ ౩౦౯॥

శాస్త్రమర్యాదలను విడచినట్టియు పరలోకములేదనునట్టియు ననుచిత దండమునొనర్చిధనమునుబుచ్చుకొనునట్టియు రక్షించనట్టియు బలిషడ్భాగాదికమును దినునట్టి రాజును నరకగామినిగా దెలియవలెను॥ ౩౦౯॥

మూ॥ అధార్మికం త్రిభిర్న్యాయై ర్నిగృహ్ణీయాత్ప్రయత్నతః।
నిరోధనేనబంధేన వివిధేన వధేనచ॥ ౩౧౦॥

చోరాదులగు నధార్మికులను రాజు కారాగృహప్రవేశమును సంకెళ్లు వేయడము చేతులుకాళ్లు ఛేదించడము నీత్రిప్రకారమగు న్యాయములచే ప్రయత్నము వలనని గ్రహించవలెను॥ ౩౧౦॥

మూ॥ నిగ్రహేణహి పాపానాం సాధూనాం సంగ్రహేణచ।
ద్విజాతీయఇవేజ్యాభిః పూయంతే సతతంనృపాః॥ ౩౧౧॥

పాపకర్ములను శిక్షించుటవలనను సాధులను రక్షించుటవలనను మహాయజ్ఞములచే ద్విజులువలెను రాజులు నిత్యముగా పవిత్రులగుచున్నారు॥ ౩౧౧॥

మూ॥ క్షంతవ్యం ప్రభుణానిత్యం క్షిపతాంకార్యిణాం నృణాం।
బాలవృద్ధాతురాణాంచ కుర్వతాహితమాత్మనః॥ ౩౧౨॥

అర్థిప్రత్యర్థులును బాలవృద్ధాతురులును తమపీడలచేతన్నాక్షేపింతురయిన వ్పటికిని వక్ష్యమాణమగుతనహితమునుగోరురాజు నిత్యముక్షమించవలెను॥ ౩౧౨॥

మూ॥ యః క్షిప్తో మర్షయత్యార్తై స్తేనస్వర్గే మహీయతే।
యస్త్వైశ్వర్యాన్నక్షమతే నరకం తేనగచ్ఛతి॥ ౩౧౩॥

దుఃఖితులగువారుచేసిన నిందను రాజుక్షమించి నతండు స్వర్గమందు పూజ్యుడగును ప్రభుత్వముచే సహించక రాజు నరకమునొందును॥ ౩౧౩॥

మూ॥ రాజాస్తేనేనగంతవ్యో ముక్తకేశేనధావతా। ఆచక్షాణేన
తత్స్తేయ మేవంకర్మాస్మిశాధిమాం॥ ౩౧౪॥

స్కంధేనాదాయ ముసలం లగుడంవాపి ఖాదిరం। శక్తిం
చోభయతస్తీక్ష్ణా మాయసం దండమేవవా॥ ౩౧౫॥

ప్రాయశ్చిత్త కాండలో స్వర్ణస్తేయవిషయమై యిదిచెప్పగలవాడైన రాజు స్వర్ణస్తేయమువిషయమైన దండనిర్ణయమున కిట సెప్పపడు బ్రాహ్మణసువర్ణాపహర్త తనపాపమును బ్రకటించుకోనుచు రోకలినైనను చండ్రకర్రదుడ్డు

నైనను రెండుపార్శ్వములందు వాడిగల యినుపకర్రి శక్తియనబడును దానినైనే భుజమునందు ధరించి జుట్టువిరిబోసుకొని రాజువద్దికివచ్చి బ్రాహ్మణస్వర్ణహారినగు నన్ను దీనిచే శిక్షించుమని చెప్పవలెను॥ ౩౧౪॥

మూ॥ శాసనాద్వా విమోక్షాద్వా స్తేనస్తేయాద్విముచ్యతే।అ
శాసిత్వాతు తం రాజా స్తేనస్యాప్నోతి కిల్బిషం॥ ౩౧౬॥

ఆరాజా దండముచేవానిఁగొట్టినచో వాడు చచ్చిననొకప్పుడు బ్రతికినను వానికా పాపముపోవును॥ శ్లో॥ "మృతఃల్పఃప్రహారాత్తో జీవన్నపి విశుధ్యతీతి" రాజు కొట్టినదెబ్బచే వాడు మృతప్రాయుడై బ్రతికియుండినను వాడు శుద్ధుడగుచున్నాడని యాజ్ఞవల్క్యవచనము-రాజు కరుణాదికముచేనట్లు కొట్టకుండిననా పాపమునా రాజుబొందును॥ ౩౧౬॥

మూ॥ అన్నాదే భ్రూణహా మార్ష్టి పత్యౌభార్యాపచారిణీ। గు
రౌశిష్యశ్చ యాజ్యశ్చ స్తేనో రాజని కిల్బిషం॥ ౩౧౭॥

బ్రహ్మహత్యనొనర్చిన వానియన్నము ఎవడుతినునో వానికి యాపాపము సంక్రమించును గాని బ్రహ్మఘ్నునిపాపము పోదని తాత్పర్యము భ్రూణహత్యజేసినవాని పాపము వానియన్నముఁదినినవానికిన్ని, భార్యవ్యభిచారము సహించినవానికా భార్యాపాపమున్ను శిష్యుడు కర్మనిష్ఠుడుగాకుండిన సహించినగురువునకా శిష్యపాపమున్ను యజమానుఁడు యజ్ఞతెనుసహించిన యాజకునకు వానిపాపమున్ను రక్షించని రాజుకాచోరుని పాపముసంక్రమించును॥ ౩౧౭

మూ॥ రాజభిర్ధృతదండాస్తు కృత్వా పాపాని మానవాః। ని
ర్మలాః స్వర్గమాయాంతి సంతః సుకృతినోయథా॥ ౩౧౮॥

స్వర్ణస్తేయాదిదోషములను జేసినవారలు రాజదండముచే పాపముపోవడమువలన నిర్మలులయినవారగుచు సత్పురుషులవలెను స్వర్గమునొందుదురు. ౩౧౮

మూ॥ యస్తురజ్జుంఘటం కూపాద్ధరేద్భింద్యాచ్చ యఃప్రపాం।స
దండం ప్రాప్నుయాన్మాషం తచ్చతస్మిన్ సమాహరేత్॥ ౩౧౯॥

నూతియొద్ద నీళ్ళుతోడుకొను త్రాడునా ఘటమునున్ను హరించువానికిన్ని చలి

పందిళ్ళపాడుచేసినవానికిన్ని యొకటిసువర్ణమాషమువిధించవలెను ఆరణ్యాదుల నానూతిదగ్గిరవాడే చేర్చవలెను॥ ౩౧౯॥

మూ॥ ధాన్యందశభ్యః కుంభేభ్యో హరతో భ్యధికంవధః। శేషే
ప్యేకాదశగుణం దాప్యస్తస్యచ తద్ధనం॥ ౩౨౦॥

ఇరువదిపలములుద్రోణము ద్రోణములిరువది కుంభమిట్టివిపది కుంభములకంటె నధికముగ ధాన్యమునుదొంగిలించినవానికి దండము వధ- ధాన్యస్వామియొక్కయు హర్తయొక్కయు గుణాపేక్షచే తాడనముగాని అంగచ్ఛేదముగాని మారణముగాని తెలియదగినది ఆపదికుంభములలోను వకటిమొదలుకొని యెన్నికుంభములుదొంగిలిస్తే దానికిపదకొండురెట్లు దండుగపుచ్చుకొని దొంగిలించిన ధాన్యము నాస్వామికియిప్పించవలెను॥ ౩౨౦॥

మూ॥ తథాధరిమమేయానాం శతాదభ్యధికేవధః। సువర్ణ ర
జతాదీనా ముత్తమానాంచ వాససాం॥ ౩౨౧॥

ధాన్యమునకువలె నుత్కృష్టమగు సువర్ణరజతాదులున్ను మంచివస్త్రములున్ను పశ్వాదులున్ను నూటికిపైనిదొంగిలించెనేని వధచేయతగినది దానికిదేశకాలాపహర్తృజాతిగుణాపేక్షచే పరిహరించతగును యీలాగునె ముందున్ను తెలియదగును॥ ౩౨౧॥

మూ॥ పంచాశతస్త్వభ్యధికే హస్తచ్ఛేదన మిష్యతే। శేషేత్వే
కాదశగుణం మూల్యాద్దండం ప్రకల్పయేత్॥ ౩౨౨॥

పూర్వోక్తములగునవి యేబదికంటె పైనిహరించెనేని చేతులు తెగకొట్టించవలెను యిదిమన్వాదులచే చెప్పబడెను మిగిలినవాటిలో నేకాదశఫలములు మొదలుకొని పైనియెంతసొమ్ముహరిస్తే దానికిపదకొండురెట్లు దండుగపుచ్చుకొవలెను॥

మూ॥ పురుషాణాం కులీనానాం నారీణాంచ విశేషతః। ముఖ్యా
నాంచైవరత్నానాం హరణేవధమర్హతి॥ ౩౨౩॥

మహాకులసంభవులగు పురుషులను విశేషించి స్త్రీలను శ్రేష్ఠములగువజ్రాదిరత్నములను నపహరించబడెనేని యాచోరుని వధించవలెను॥ ౩౨౩॥

మూ॥ మహాపశూనాం హరణే శస్త్రాణా మౌషధస్యచ। కాల
మాసాద్య కార్యంచ దండంరాజాప్రకల్పయేత్॥ ౩౨౪॥

గొప్పయేనుగు మొదలగు పశువులను ఖడ్గాద్యాయుధములను దొంగిలించెనేని దుర్భిక్షాదిరూపమగు కాలమునున్ను సదసద్వినియోగరూపమగు ప్రయోజనమున్ను విచారించి రాజు తాడనాంగచ్ఛేదాదిరూపమగు దండమును కల్పింపవలెను॥ ౩౨౪॥

మూ॥ గోషుబ్రాహ్మణసంస్థాసు ఛురికాయాశ్చభేదనే।పశూనాం
హరణేచైవ సద్యః కార్యోర్ధపాదికః॥ ౩౨౫॥

బ్రాహ్మణులయొక్క గోవులను హరించెనేనియు గొడ్డావులకు దుక్కి మొదలైన పనులకై ముక్కుత్రాడుగుచ్చెనేనియు మేకలను గొర్రెలను హరించెనేనియు అవియాగార్థమైనవన్యో నేని దండాధిక్యమువలన నట్టిచోరునకు అర్ధపాదికము దండము విధించదగును॥ ౩౨౫॥

మూ॥ సూత్రకార్పాసకిణ్వానాం గోమయస్య గుడస్యచ। దధ్నః
క్షీరస్యతక్రస్య పానీయస్యతృణస్యచ॥ ౩౨౬॥

మూ॥ వేణువైదళభాండానాం లవణానాం తథైవచ।మృణ్మయా
నాంచహరణే మృదోభస్మనఏవచ॥ ౩౨౭॥

మూ॥ మత్స్యానాం పక్షిణాంచైవ తైలస్యచ ఘృతస్యచ। మాం
సస్య మధునశ్చైవ యచ్చాన్యత్పశుసంభవం॥ ౩౨౮॥

మూ॥ అన్యేషాంచైవమాధ్వీనాం మద్యానామోదనస్యచ। పక్వా
న్నానాంచ సర్వేషాం తన్మూలాద్ద్విగుణోదమః॥ ౩౨౯॥

పట్టునూలు పత్తికిణ్వములనగా మద్యమునకు మూలకారణమగుద్రవ్యము గోమయము బెల్లము పెరుగు పాలు చల్ల గడ్డి నీరు వెదురు పెళ్ళచేనల్లినబుట్టలు నుప్పులు మృణ్మయములు మన్ను వెలిమిడి చేపలు పక్షులు నూనె నెయ్యి మాంసము మధ్వను నింకా పశువులవల్ల పుట్టినది మరికొన్నిమద్యములు అన్నము అన్నిపక్వాన్నములును వీటినిదొంగలించెనేని దానికి ద్విగుణముదండము విధించవలెను॥ ౩౨౬॥
౩౨౭॥౩౨౮॥౩౨౯॥

※

మూ॥ పుష్పేషు హరితేధాన్యే గుల్మవల్లీనగేషుచ। అన్యేష్వపరి
పూతేషు దండస్స్యాత్పంచకృష్ణలః॥ 330॥

పుష్పములు క్షేత్రమందు కోయకుండనున్న ధాన్యము ఆవరణరహితములగువృ క్షలతాగుల్మములు వీటిహాకసమర్థుఁడగుపురుషుడు మోసెడిబలువుహరించబడెనే వి బంగారముగాని వెండిగానిదైదుకృష్ణలముల మెత్తుమాషము దేశకాలాదులనుబట్టి విచారించి దండమువిధించవలెను॥ 330॥

మూ॥ పరిపూతేషు ధాన్యేషు శాకమూలఫలేషుచ। నిరన్వయేశ
తందండ స్స్యాన్వయేర్ధశతంవిదుః॥ 33౧॥

కళ్ళములో గాలికిబోసి బాగుజేసిన ధాన్యము శాకమూలఫలములు హరించబడెనేని హరించినవాఁడాస్వామివంశ్యుడుగాకుండిన నూరుపణములున్ను ఆవంశజుడైతేనేబదిపణములున్ను దండమువిధించవలెను॥ 33౧॥

మూ॥ స్యాత్సాహసం త్వన్వయవ త్ప్రసభం కర్మ యత్కృతం।
నిరన్వయం భవేత్ స్తేయం హృత్వా పవ్యయతేచయత్॥

ద్రవ్యస్వామియెదుటనేదైనా స్వామిసంబంధముగలవాడు హరించినది దొంగతనముగాదది సాహసము బలాత్కారమనియర్థము స్వామిసంబంధము లేనివాడు నయుఃహరించినది కనపడకుండ దాచినధాన్యాదికము దొంగతనము॥ 33౨

మూ॥ యస్త్వేతాన్యుపక్లప్తాని ద్రవ్యాణిస్తేనయేన్నరః।తమాద్యం
దండయేద్రాజా యశ్చాగ్నిం చోరయేద్గృహాత్॥ 333॥

ఈచెప్పబడి సూత్రాదులుపభోగార్థము బాగుచెయ్యబడిన విహరించినసుగృహమందుండిన త్రేతాగ్నులను హరించినను ప్రథమసాహసము దండము విధించవలెను పునరగ్న్యాధానార్థమగు వ్యయము నిప్పించవలెను- గోవిందరాజులౌకికాగ్నినని వ్రాసె నదిస్వల్పనేరము దానికధికదండమన్యాయము గావున బాగుండలేదని కుల్లూకభట్టువ్రాసెను॥ 333॥

మూ॥ యేనయేన యథాంగేన స్తేనోనృషువిచేష్టతె। తత్తదేవ
హరేత్తస్య ప్రత్యాదేశాయపార్థివః॥ 33౪॥

ఏచోరుడు హస్తపాదాదికమగు యేయేయవయవముచే పరులధనాదిహరణ రూపమగు విరుద్ధమును జేసెనా చోరునకాయాయవయవమును మరియొకడట్లుజే యకుండుటకుగా ఛేదించవలెను ద్రవ్యస్వామియొక్క విశేషమునుబట్టి యీయంగ చ్ఛేదముగావలెను॥ ౩౩౪॥

మూ॥ పితాచార్యస్సుహృన్మాతా భార్యాపుత్రః పురోహితః ।
నాదండ్యో నామరాజ్ఞోఽస్తి యస్స్వధర్మే నతిష్ఠతి॥ ౩౩౫॥

తండ్రి గురువు పుత్రుడు తల్లి కొడుకు పురోహితుడు వీరైనను స్వధర్మమందుండకుండిరేని రాజుచే శిక్షించదగని వాడన్నదిలేదు మరేమంటే శిక్షించదగినవారే॥ ౩౩౫॥

మూ॥ కార్షాపణో భవేద్దండ్యో యత్రాన్యః ప్రాకృతో జనః।
తత్ర రాజా భవేద్దండ్యస్సహస్రమితిధారణా॥ ౩౩౬॥

రాజవ్యతిరిక్తుడగు నరుడెట్టి తప్పుచేసిన నొకపణము దండమగునో యట్టితప్పు రాజుజేసెనేని వేయిపణములు దండముగావలెను "శ్లో॥ ఈశోదండస్య వారుణః" యని ముందు జెప్పును గాన రాజు తనకు విధించుకున్న దండధనము జలమందైన పారవేయవలెను బ్రాహ్మణులకైన నీవలెను॥ ౩౩౬॥

మూ॥ అష్టాపాద్యంతు శూద్రస్య స్తేయే భవతి కిల్బిషం । షోడ
శైవతు వైశ్యస్య ద్వాత్రింశత్క్షత్రియస్యచ॥ ౩౩౭॥
మూ॥ బ్రాహ్మణస్య చతుష్షష్టిస్సంపూర్ణం శతమేవవా । ద్వి
గుణాహి చతుష్షష్టిస్తద్దోషగుణవిద్ధిసః॥ ౩౩౮॥

ఏదోషమున కొకపణము విధించదగునాదోషమే గుణదోషజ్ఞుడగు శూద్రుడొనర్చెనేని యెనిమిది రెట్లుదండము విధించవలెను అట్టివైశ్యునకు పదారురెట్లున్ను అట్టిక్షత్రియునకు ముప్పదిరెండురెట్లున్ను అట్టిబ్రాహ్మణుడగు బ్రాహ్మణునకరువదినాలుగురెట్లుగాని నూరురెట్లుగాని నూటయిరువదెనిమిది రెట్లుగాని గుణదోషజ్ఞత యెక్కువైన కొద్దిదండమెక్కువగా విధించవలెను॥ ౩౩౭॥౩౩౮॥

మూ॥ వానస్పత్యం మూలఫలం దార్వగ్న్యర్థం తథైవచ

ణంచగోభ్యో గ్రాసార్థ మస్తేయం మనురబ్రవీత్॥౩౩౯॥

ఆవరణ చేయబడకుండనుండిన వృక్షాదులవలన స్వీయములవలె నేర్పడగిన మూలఫలాదికమున్ను అగ్నిహోత్రాదిహోమార్థము కట్టెలున్ను గోగ్రాసార్థము తృణమున్ను దెచ్చెనేని యది చౌర్యముగాదని మనువు సెప్పెనందువలన దండమున్ను పాపమున్ను లేదనుట॥ ౩౩౯॥

మూ॥ యోఽదత్తాదాయినో హస్తాల్లిప్సేత బ్రాహ్మణోధనం।
యజనాధ్యాపనేనాపి యథాస్తేన స్తథైవసః॥ ౩౪౦॥

చోరునివలన నన్యులధనమని యెరిగిన్ని బ్రాహ్మణుడు యాగాధ్యయనార్థమైనం బుచ్చుకొన్న నతడును చోరుడేగావున చోరునివలెనతని శిక్షింపవలెను॥ ౩౪౦॥

మూ॥ ద్విజోధ్వగః క్షీణవృత్తి ర్ద్వావిక్షూ ద్వేచ మూలకే। ఆద
దానః పరక్షేత్రా న్నదండం దాతుమర్హతి॥ ౩౪౧॥

మార్గస్థుడగు విప్రుడు భత్త్యములేక క్షీణించినపుడు పరులక్షేత్రములోనుంచి రెండు చెరుకులును రెండుదుంపలును దీసుకొని తినినను దండార్హుడుగాడు॥౩౪౧॥

మూ॥ అసంధితానాం సంధాతా సంధితానాంచ మోక్షకః।
దాసాశ్వరథ హర్తాచ ప్రాప్తస్స్యాచ్చోరకిల్బిషం॥౩౪౨॥

కట్టులేక తిరుగుచున్న యశ్వాదులను కట్టినవాడున్ను మందురాదులందు కట్టబడియున్నవాటిని విప్పుకొనిపోయినవాడున్ను దాసులను అశ్వములను రథములను అపహరించినవాడును చోరశిక్షకు పాత్రుడగును ఆశిక్ష అపరాధానుసారముగా మారణాంగఛేదనాపహారములలో నుచితప్రకారముగ జేయవలయును॥ ౩౪౨॥

మూ॥ అనేన విధినా రాజా కుర్వాణ స్తేననిగ్రహం। యశోస్మిన్
ప్రాప్నుయాల్లోకే ప్రేత్యచాను త్తమం సుఖం॥ ౩౪౩॥

ఈ చెప్పబడిన విధానముగా చోరశిక్షనొనర్చిన రాజు యీలోకమందు మంచి కీర్తినిన్ని పరలోకమందధిక సుఖమున్ను బొందును॥ ౩౪౩॥

మూ॥ ఐంద్రం స్థాన మభిప్రేప్సు ర్యశశ్చాక్షయ మవ్యయం।

నోపేక్షేతక్షణమపి రాజా సాహసికం నరం॥ ౩౪౪॥

సర్వాధిపత్యరూపమగు పదవినిన్ని శాశ్వతమగు కీర్తినిన్ని పొందనిశ్చయించి నరాజు బలాత్కారముగ గృహదాహధనాపహరణములనుజేయు సాహసికుని క్షణమాత్రమైన నుపేక్షించరాదు॥ ౩౪౪॥

మూ॥ వాగ్దుష్టాత్తస్కరాచ్చైవ దండేనైవచ హింసతః।
సాహసస్య నరఃకర్తా విజ్ఞేయః పాపకృత్తమః॥ ౩౪౫॥

వాక్పారుష్యము దండపారుష్యము చౌర్యమున్ను చేసిన వాళ్ళకంటె సాహసికుడగు నరుడు అత్యంతపాపకారిగా తెలియదగును॥ ౩౪౫॥

మూ॥ సాహసే వర్తమానంతు యోమర్షయతి పార్థివః।
సవినాశం వ్రజత్యాశు విద్వేషం చాధిగచ్ఛతి॥ ౩౪౬॥

ఏ రాజుసాహసప్రవృత్తిగలవాని నుపేక్షించునో అట్టిరాజె ఆదోషముచేశీఘ్రముగనశించును జనవిద్వేషమున్నుగలుగును॥ ౩౪౬॥

మూ॥ నమిత్రకారణాద్రాజా విపులాద్వాధనాగమాత్। సము
త్సృజేత్సాహసికాన్ సర్వభూతభయావహాన్॥ ౩౪౭॥

మిత్రునియొక్క మాట మొగమాటముచేతగాని చాలాధనలాభ మగునని గాని సర్వభూతములకు భయంకరులగు సాహసికులనా రాజువిడువరాదు॥ ౩౪౭॥

మూ॥ శస్త్రంద్విజాతిభిర్గ్రాహ్యం ధర్మోయత్రోపరుధ్యతే।
ద్విజాతీనాంచ వర్ణానాం విప్లవేకాలకారితే॥ ౩౪౮॥
ఆత్మనశ్చపరిత్రాణే దక్షిణానాంచ సంగరే। స్త్రీవిప్రా
భ్యుపపత్తౌచఘ్నన్ ధర్మేణనదుష్యతి॥ ౩౪౮॥

బ్రాహ్మణాదిమూడువర్ణములవారిచేతను ఖడ్గముధరించతగినది సాహసికులచే నేకాలమందు వర్ణాశ్రమ ధర్మములకు హానియగుచుండునో అరాజకమగు రాష్ట్రమందు పరచక్రాగమకాలమందగు స్త్రీసంగరాదికము ప్రాప్తమగుచుండ దక్షిణాధనగవాద్యపహరణనిమిత్తమగు యుద్ధమందు స్త్రీబ్రాహ్మణాత్మ రక్షార్థమై ధర్మయుద్ధముచే ననన్యగతికమాటవలన శత్రుసంహారమునుజేసెనేని దోష

భాగికాడు గావున నట్టిద్విజునకు సాహసదండము జేయరాదు॥ ౩౪౮॥ ౩౪౯

మూ॥ గురుంవాబాలవృద్ధౌవా బ్రాహ్మణంవాబహుశ్రుతం । అత
తాయినమాయాంతం హన్యాదేవా విచారయన్॥ ౩౫౦॥

ఆయుధమునుధరించి చంపుటకువచ్చుచున్నవాడు గురుబాలవృద్ధ బహుశ్రుత బ్రాహ్మణులలోనెవ్వడైన విద్యాధనాదులచే నుత్కృష్టుడైనను వాడాతతాయిగావునవానివలనతనహననమును తప్పించుకొనిపోలేనప్పుడునిర్విచారముగజంపవలయును అదిగావుననే॥ "సూ॥ గృహీతశస్త్రమాతతాయినం హత్వానదోషః॥" శస్త్రధరుడగు నాతతాయినిజంపినదోషములేదని ఉశనస్స్మృతికారుడ్యాయనునున్న భృగుశబ్దోల్లేఖనుచే మన్వర్థశ్లోకమునే స్ఫుటముగా వ్యాఖ్యానముచేసెను॥ "శ్లో" ఆతతాయినిచోత్కృష్టే తపస్స్వాధ్యాయ జన్మతః । వధస్తత్రతునైవస్యాత్పాపంహీనేవధోభృగుః॥" తపస్సువలన స్వాధ్యాయమువలన జన్మమువలననైనతెయుత్కృష్టుడైనను ఆతతాయియగువానిని చంపుటవలన పాపములేదని భృగువుచెప్పెను తపస్స్వాధ్యాయహీనుని విషయమై యేమిచెప్పెనుయిచ్చట మేధాతిథి గోవిందరాజులు స్త్రీవిప్రాద్యుపఘాతమును జేయుగుర్వాదులనుజంపెనేని ధర్మముచే దోషమునొందడనుచో నింకనన్యుడైననేమిచెప్పతెగినది యనిపూర్వశ్లోకమునకేయనువాదముగా వ్యాఖ్యానమునచేరి॥ ౩౫౦॥

మూ॥ నాతతాయి వధేదోషో హంతుర్భవతికశ్చన ప్రకాశం
వా ప్రకాశంవా మన్యుస్తన్మన్యుమృచ్ఛతి॥ ౩౫౧॥

జనసపక్షమందైనను రహస్యమందైనను జంపుటకువచ్చుచున్నవాని జంపినవానికధర్మదండమేమియులేదు కొట్టవచ్చినవానికోపము రెండవవానికోపమునుప్రేరేపనట్టిపనియగును గాన॥ ౩౫౧॥

మూ॥ పరదారాభిమర్శేషు ప్రవృత్తాన్నౄన్మహీపతిః। ఉద్వే
జనకరైర్దండైశ్ఛిన్నయిత్వా మహీపతిః॥ ౩౫౨॥

పరస్త్రీభోగార్థప్రవృత్తిమంతులగు నరులను లోకభయంకరములగు నాసికాచ్ఛేదనాద్యంకకర్ణనాది చిహ్నములొనర్చి రాజు దేశాంతరవాసము జేయింపవలెను॥ ౩౫౨॥

మూ॥ తత్సముద్భోహిలోకస్య జాయతే వర్ణ సంకరః । యేన మూలహరోధర్మః స్సర్వనాశాయ కల్పతే॥ 353॥

ఆపరదారగమనమువలన వర్ణసంకరమగుచున్నది దానిచే పరిశుద్ధ పత్న్యభావమువలన॥"శ్లో॥ అగ్నౌప్రాస్తాహుతిస్సమ్య॥" గనుక్తధర్మముజరగక పోవడమువలన వృష్ట్యభావముచే లోకమునకు మూలచ్ఛేదమగుచున్నది॥ 353॥

మూ॥ పరస్యపత్న్యా పురుషఃసంభాషాం యోజనోరహః। పూర్వమాక్షారితోదోషైః ప్రాప్నుయాత్పూర్వ సాహసం ॥

పరభార్యతో రహస్యమందుచితకారణములేని సంభాషణమునొనర్చిన పురుషుడు ప్రథమసాహసదండార్హుడగును అట్టిమాటలచే లోకములో నిందబుట్టుగాన॥ 354॥

మూ॥ యస్త్వనాక్షారితఃపూర్వ మభిభాషేత కారణాత్ । న దోషం ప్రాప్నుయాత్కించి న్నహితస్య వ్యతిక్రమః॥ 355

ఎవడైతేపూర్వమందు స్త్రీప్రార్థనాదివ్యాపారముచే లోకములోనింద్యుడు కాకుండునో యట్టివాడు జనసమక్షమందుచితకారణముచే పరస్త్రీతో భాషించువాడుదండ్యుడు గాడు వానియందట్టిదోషమువినబడలేదు గావున॥ 355॥

మూ॥ పరస్త్రియం యోభివదే త్తీర్థేరణ్యే వనేపివా। నదీనాం వాపి సంభేదే ససంగ్రహణ మాప్నుయాత్॥ 356॥

తీర్థమందనగా నీళ్లుతెచ్చుచుండ త్రోవలో నరణ్యమందు గ్రామబహిః ప్రదేశమందగు గుల్మాది సంకులప్రదేశమందును నదులు కలసినచోట నివియన్నియునుజనరహితదేశోపలక్షణార్థమట్టిచోటులం బరాంగనలతో కారణముండిభాషించినను పూర్వమందు నిందనొందనివాడైనను వక్ష్యమాణసహస్రపణములచేదండించనర్హుడగుచున్నాడు సంగ్రహణమనగా "సమ్యగ్గృహ్యతేజాయతే యేనపరస్త్రీసంభోగాభిలాషఃఇతిసంగ్రహణం"పరస్త్రీయభిలాషము వీనికిగలదని దేనిచే గ్రహించబడునదిసంగ్రహణము॥ 356॥

మూ॥ ఉపచార క్రియా కేళి స్పర్శోభూషణ వాససాం। సహ

ఛటాప్యాసనంచైవ సర్వంసంగ్రహణం స్మృతం॥ ౩౫౭॥

మాలికలు మొదలగునవి తెచ్చియివ్వడము కూడానాడడము పరిహాసము నాలింగనము లోనచర్చడము వస్త్రాలంకారాదులను స్పృశించుటయు నొకమంచమందుగూర్చుండుటయు నిట్టిదంతయు సంగ్రహణమని మన్వాదులచే జెప్పబడెను వీటిచేవానియందట్టిదోషము నిరూపించబడును॥ ౩౫౭॥

మూ॥ స్త్రియంస్పృశే దదేశేయ స్స్పృష్టోవా మర్షయే త్తయా।
పరస్పరస్యానుమతె సర్వం సంగ్రహణంస్మృతం॥ ౩౫౮॥

కుచజఘనాదిస్థలమందు స్త్రీనిముట్టి స్త్రీతననుగోప్యస్థలమందుముట్టినేని సహించి నాస్త్రీపురుషులకన్యోన్యానుమతిచేత గలుగగలదని మన్వాదులచే జెప్పబడెను॥ ౩౫౮

మూ॥ అబ్రాహ్మణ స్సంగ్రహణే ప్రాణాంతం దండమర్హతి। చతుర్ణామపి వర్ణానాం దారా రక్ష్యతమాస్సదా॥ ౩౫౯॥

దండాధిక్యమువలన న బ్రాహ్మణుడనగా నిచ్చటశూద్రుడువాడంగీకారములేని బ్రాహ్మణస్త్రీయందు సంగ్రహణమొనర్చెనేని ప్రాణాంతదండమునకర్హుడగును-నాలుగువర్ణములవారికిన్ని భార్యలు ధనపుత్రాదులకంటె మిక్కిలిరక్షింపతగినవారు ప్రసక్తిగారాదుత్తమజాతితోనయినసంగ్రహణముగాకుండరక్షించవలెను॥

మూ॥ భిక్షుకావందినశ్చైవ దీక్షితాఃకార వస్తథా। సంభాషణం సహ స్త్రీభిః కుర్యురప్రతి వారితాః॥ ౩౬౦॥

భిక్షార్థులై వచ్చినవారున్ను స్తుతిపాఠకులున్ను యజ్ఞదీక్షనున్నవారున్ను సూపకారాదులున్ను వారివారికార్యార్థమై గృహస్త్రీలతో సంభాషణ మనివారితులై యొనర్చుటిందువలన సంగ్రహణమనరాదు॥ ౩౬౦॥

మూ॥ నసంభాషాం పరస్త్రీభిః ప్రతిషిద్ధ స్సమాచరేత్। నిషిద్ధో భాషమాణస్తు సువర్ణం దండమర్హతి॥ ౩౬౧॥

గృహస్వామిచే స్త్రీలతో మాటలాడవద్దని నిషేధించబడిన్ని మాటలాడెనేని పరదారుమాషములొకసువర్ణమదిదండముగనీవలెను॥ ౩౬౧॥

మూ॥ నైషచారణ దారేషువిధి ర్నాత్మోపజీవిషు । సజ్జయంతి
హితేనారీ ర్నిగూఢా శ్చారయంతిచ॥ ౩౬౨॥

"పరస్త్రియం యోఽభివదే" దనుపద్యమొదలుకొని పరస్త్రీతో సంభాషణనిషేధము చెప్పబడెనది నటగాయకాదులభార్యలందు లేదు॥ శ్లో॥ "భార్యాపుత్రస్స్వకాతనుః" యనెడిశాస్త్రముచే భార్యఆత్మగావున భార్యచేనుపజీవించెడివాళ్ళుగావున ధనలాభమునకై దానికిక్షమింతురు నటాదివ్యతిరిక్తులగు వీళ్ళభార్యలయందును సంభాషణనిషేధములేదు చారణులు నాత్మోపజీవులే పరపురుషులను దెచ్చి వాళ్ళతో స్వభార్యలను సంశ్లేషింపజేతురు స్వయముగా పరపురుషులువచ్చిరేని వారుప్రచ్ఛన్నులై తమకు తెలియనట్లు వ్యవహరింతురు॥ ౩౬౨

మూ॥ కించిదేవతు దాప్యస్స్యాత్సంభాషాం తాభి రాచరన్।ప్రై
ష్యాసుచైక భక్తాసు రహః ప్రవ్రజితాసుచ॥ ౩౬౩॥

ఈచారణస్త్రీలతో నిర్జనదేశమందు సంభాషించెనేని కొంచముదండమీవలెను వాళ్ళును పరస్త్రీలేగావున ఒకరిఆంక్షలో లేనిదాసీలతోటిన్ని బౌద్ధబ్రహ్మచారిణీలతోటిన్ని రహస్యసంభాషణమొనర్చెనేని కొంచెము దండమీవలెను॥ ౩౬౩॥

మూ॥ యోఽకామాందూషయేత్కన్యాం ససద్యోవధమర్హతి।
సకామాం దూషయంస్తుల్యో నవధం ప్రాప్నుయాన్నరః॥

ఇచ్ఛలేనిసవర్ణకన్యను చెడగొట్టెనేని బ్రాహ్మణేతరుడు తత్క్షణమే లింగచ్ఛేదనాదికముచే వధార్హుడగుచున్నాడు ఇచ్ఛయించిన కన్యతో బోయెనేని వధార్హుడుకాడు॥ ౩౬౪॥

మూ॥ కన్యాంభజంతీ ముత్కృష్టం నకించిదపి దాపయేత్ ।జఘన్యం
సేవమానాంతు సంయతాం వాసయేద్గృహే॥ ౩౬౫॥

సంభోగార్థముత్కృష్టజాతిపురుషుని భజించిన కన్యనుగూర్చి దండమించుకయైనలేదు హీనజాతిపురుషుని సేవించినకన్యను మరల నట్టిబుద్ధి బుట్టకుండునట్లు గట్టిగా బందుచెయ్యవలెను॥ ౩౬౫॥

మూ॥ ఉత్తమాం సేవమానస్తు జఘన్యోవధమర్హతి। శుల్కందద

ద్యాత్సేవమాన స్సమామిచ్ఛేత్పితాయది॥ ౩౬౬॥

ఉత్తమజాతికన్య నధమజాతి పురుషుడు బొందెనేని యంగచ్ఛేదమునైనవధమునైన జేయదగును సమానజాతీయయగు కన్యనుబొందెనేని దానితండ్రి గోరినయడల శుల్కమునిచ్చుకొని వాడేపెళ్ళి జేసుకొనవలెను॥ ౩౬౬॥

మూ॥ అభిషహ్యతుయః కన్యాం కుర్యాద్దర్పేణ మానవః। తస్యాశుకత్యేఽఅంగుళ్యౌ దండంచార్హతిషట్ఛతం॥ ౩౬౭॥

ఎవడుబలాత్కారముగా నహంకారముచే సమానజాతీయయగుకన్య నంగుళిప్రక్షేపముచే సంగమములేకనే చెడగొట్టునో వానికయ్యంగుళులు రెండును ఛేదించి యారునూరుపణములు దండమువిధింపవలెను॥ ౩౬౭॥

మూ॥ సకామాందూషయంస్తుల్యో నాంగుళిచ్ఛేదమాప్నుయాత్।
ద్విశతంతుదమందాప్యః ప్రసంగవినివృత్తయే॥ ౩౬౮॥

సమానజాతివాడు తనకు కోరినకన్యనంగుళిప్రక్షేపముచే జెడగొట్టెనేని యంగుళిచ్ఛేదవర్జముగ రెండువందలపణము లతిప్రసంగమవగా నిట్టియకార్యము జరగకుండుటకు దండము విధించవలెను॥ ౩౬౮॥

మూ॥ కన్యైవకన్యాం యాకుర్యాత్తస్యాస్స్యాద్ద్విశతోదమః। శుల్కంచద్విగుణందద్యాచ్ఛిఫాశ్చైవాప్నుయాద్దశ॥ ౩౬౯॥

ఒకకన్య మరొకకన్యనంగుళిప్రక్షేపముచే జెడగొట్టెనేని దానికిన్నూరుపణములు దండమువిధించి పదికొరడాదెబ్బలుగొట్టి శుల్కము నాకన్యతండ్రి కిప్పించవలెను॥ ౩౬౯॥

మూ॥ యాతుకన్యాం ప్రకుర్యాత్ స్త్రీ సాసద్యో దండమర్హతి।
అంగుళ్యోరేవవాచ్ఛేదం ఖరేణోద్వహనం తథా॥ ౩౭౦॥

కన్యైవేకన్యనంగుళిప్రక్షేపముచే జెడగొట్టునో దానికితత్క్షణమే బుర్రగొరిగించి వేళ్ళుబెట్టుటచే నావేళ్ళను ఛేదించి గాడిదెమీదనెకించి త్రిప్పవలెను॥ ౩౭౦॥

మూ॥ భర్తారం లంఘయేద్యాతు స్త్రీజాతిగుణదర్పితా। తాం

శ్వభిః ఖాదయేద్రాజా సంస్థానే బహుసంస్థితే॥ ౩౭౧॥

ఏస్త్రీ తండ్రి ధనికుడని గాని శౌర్యాదిగుణగర్వముచే గాని పరపురుషునిమరిగి భర్తనతిక్రమించునో దానిబహుజనులున్నచోటను కుక్కలచే గఱపించవలెను॥ ౩౭౧॥

మూ॥ పుమాంసం దాహయేత్పాపం శయనే తప్త ఆయసే। అభ్యా
దధ్యుశ్చ కాష్ఠాని తత్ర దహ్యేత పాపకృత్॥ ౩౭౨॥

అనంతరము జెప్పబడిన యాపాపపురుషుని కాలి మండుచున్న యినుపశయ్యయందు వేసి వధ్యఘాతకులగుపురుషులు వాడు కాలిపోయేమట్టుకును కఱ్ఱలు వాని మీదవేయవలెను॥ ఇట్లు రాజా పాపాత్ముని దహింపచేయవలెను॥ ౩౭౨॥

మూ॥ సంవత్సరాభిశస్తస్య దుష్టస్య ద్విగుణో దమః। వ్రాత్య
యా సహ సంవాసే చాండాల్యా తావదేవ తు॥ ౩౭౩॥

పరస్త్రీ గమనముచే దుష్టుడగు పురుషుడు మొదట నొకమారు శిక్షించబడి మరలనట్టి పాపకర్మ మొనర్చి నిందితుడగు వానికి మొదటవిధించిన దండముకంటె ద్విగుణము దండము విధించవలెను వ్రాత్యునిభార్యనుగాని చండాలస్త్రీనిగాని బొంది॥ "శ్లో॥ సహస్రం త్వంత్యజస్త్రియ" మనువచన ప్రకారముగా చండాలీసహస్తిచే వ్రాత్యజాయను బొందినట్లు శిక్ష గావున నట్లు వేయుపణముల దండవిధానముచే శిక్షించబడి మరల సంవత్సరమున కవలనా స్త్రీలనే బొందెనేని ద్విగుణము శిక్షగావలెను దీనిచే రెంటివిధులు బ్రాప్తమగుచున్న వలెనసిన వ్రాత్యజాయాగమనము చండాలీగమనమువంటిదే యనిన్ని యేపాపమొనర్చిన పూర్వమే మీదండము విధించబడెనో సంవత్సరానంతరమందా స్త్రీనేపొందెనేని ద్విగుణము దండమని రెంటికి నుదాహరణములు దెలియదగును॥ ౩౭౩॥

మూ॥ శూద్రో గుప్తమగుప్తం వా ద్వైజాతం వర్ణమావసన్।
అగుప్తమంగ సర్వస్వైర్గుప్తం సర్వేణ హీయతే॥ ౩౭౪॥

భర్త్రాదులచే రక్షించబడుచుండినను రక్షించబడకుండినను ద్విజాతిస్త్రీని శూద్రుడు బొందెనేని లింగచ్ఛేదమున్ను సర్వధనహరణమున్ను అగుప్తయగు దాని బొందిన నిదిశిక్ష అంగమని చెప్పిన లింగచ్ఛేదము చెప్పబడెను॥ "సూ॥ ఆర్యస్త్రీ

ధిగమనే లింగోద్ధారస్సర్వస్వహరణ"మనిన్ని "గుప్తాం చేద్వధోధికః" యనిన్ని గౌతమ వచనము వలన రక్షించబడుచున్న దాసితో బోయినవైని చెప్పినశిక్ష గాక వధవి ధించబడెను॥ ౩౭౪॥

మూ॥ వైశ్య స్సర్వస్వ దండస్స్యాత్సంవత్సర నిరోధతః । సహ
స్రం క్షత్రియోదండ్యో మౌండ్యం మూత్రేణ చార్హతి॥౩౭౫॥

వైశ్యుడు బ్రాహ్మణీగమనమొనర్చెనేని యొకసంవత్సరము కారాగృహమం దుండనున్ను సర్వస్వదండను విధించవలెను క్షత్రియా గమనమునకు॥ "శ్లో॥ వైశ్య శ్చేత్క్షత్రియామితి" యని ముందుజెప్పును క్షత్రియుడు గుప్తబ్రాహ్మణస్త్రీ గమన మొనర్చెనేని వేయుపణములు దండము వుచ్చుకని ఖరమూత్రముచే ముండనమొ నర్పించవలెను॥ ౩౭౫॥

మూ॥ బ్రాహ్మణీం యద్యగుప్తాంతు గచ్ఛేతాం వైశ్య పార్థివా ।
వైశ్యం పంచశతం కుర్యాత్ క్షత్రియంతు సహస్రిణం॥ ౩౭౬॥

అగుప్తయగు బ్రాహ్మణస్త్రీని వైశ్యక్షత్రియులు బొందిరేని వైశ్యున కేనూరున్ను క్షత్రియునకు వేయుపణములున్ను దండము విధించవలెను వైశ్యున కేనూరుశి క్షయనుట శూద్రస్త్రీభర్తృచేనైనను జాతిమాత్రబ్రాహ్మణస్త్రీనైననుబొందెనేనిడ త్తముబ్రాహ్మణస్త్రీనైతె వైశ్యుడును సహస్రదండార్హుడగును॥ ౩౭౬॥

మూ॥ ఉభావపితు తావేవ బ్రాహ్మణ్యా గుప్తయాసహ । విప్లు
తౌ శూద్రవ ద్దండ్యౌ దగ్ధవ్యౌ వాకటాగ్నినా॥ ౩౭౭॥

ఆవైశ్య శూద్రులు గుప్తబ్రాహ్మణస్త్రీని బొందిరేని శూద్రునకుంబలె "సర్వే ణవా" యనునట్లుసర్వస్వదండార్హులగుచున్నారు॥ "సూ॥ తత్రవైశ్యంలోహితద ర్భైః క్షత్రియం శరపత్త్రై ర్వావేష్ట్యఇతి" యను వసిష్ఠోక్తివలన వైశ్యునియెఱ్ఱదర్భ లచేతనున్ను క్షత్రియునిరెల్లు గడ్డి చేతనున్ను చుట్టికాలిచిరైనా వేయవలెను పూ ర్వమందు క్షత్రియునకు సహస్రపణములు వైశ్యునకు సర్వస్వమునని చెప్పి యిప్పు డు మరణదండమును విధించడను గుణవద్బ్రాహ్మణస్త్రీ విషయము॥ ౩౭౭॥

మూ॥ సహస్రం బ్రాహ్మణో దండ్యో గుప్తాంవిప్రాం బలాద్వ్రజన్ ।

శతాని పంచదండస్స్యా దిచ్ఛన్త్యా సహసంగతః॥ ౩౭౮॥

గుప్తబ్రాహ్మణస్త్రీని బ్రాహ్మణుఁడు బలాత్కారముగాబట్టెనేని వానికివేయిపణములు దండమువిధించవలెను దానియనుమతిచేత నొకమారుబోయెనేని యేనూరుపణములు విధించవలయును॥ ౩౭౮॥

మూ॥ మౌండ్యంప్రాణాంతికో దండో బ్రాహ్మణస్య విధీయతే।
ఇతరేషాంతు వర్ణానాం దండః ప్రాణాంతికోభవేత్॥

బ్రాహ్మణునివధచేసేయంతశిక్షకుముండనము శాస్త్రముచే విధించబడియెను క్షత్రియాదులకైతే చెప్పినప్రకారము ప్రాణాంతదండముపఘాతమే చెప్పబడెను॥

మూ॥ నజాతు బ్రాహ్మణంహన్యాత్సర్వపాపేష్వవస్థితం। రా
ష్ట్రాదేనంబహిఃకుర్యాత్సమగ్రధన మక్షతమ్॥ ౩౮౦॥

బ్రాహ్మణుండఖిలపాపయుక్తుడైనను జంపదగడు మరేమంటే వానిసర్వస్వముతోటిన్ని శరీరక్షతిలేకుండ వానిని స్వరాష్ట్రముదాటించవలయును॥ ౩౮౦॥

మూ॥ నబ్రాహ్మణవధాద్భూయా నధర్మో విద్యతేభువి। తస్మా
దస్యవధంరాజా మనసాపి నచింతయేత్॥ ౩౮౧॥

బ్రాహ్మణవధకంటె నధర్మము భూమియందధికముమరిలేదుగావున రాజుబ్రాహ్మణవధవిషయమై మనస్సునందు జింతించరాదు॥ ౩౮౧॥

మూ॥ వైశ్యశ్చేత్ క్షత్రియాంగుప్తాం వైశ్యాంవా క్షత్రియోవ్రజేత్।
యోబ్రాహ్మణ్యామగుప్తాయాం తావుభౌ దండమర్హతః॥

గుప్తక్షత్రియస్త్రీని వైశ్యుఁడును గుప్తవైశ్యస్త్రీని క్షత్రియుండును బొందిరేని వారిరువురుగుప్తబ్రాహ్మణస్త్రీనిబొందిన వీరికేదండమోయనగా॥ "శ్లో॥ వైశ్యఃపంచశతంకుర్యాత్ క్షత్రియంతుసహస్రిణ॥" మనురీతిని వైశ్యునకేనూరును క్షత్రియునకుసహస్రపణములున్ను దండముకావలెను రక్షితక్షత్రియాగమనమునందు వైశ్యునకేనూరుపణములు తక్కువ దండముకావున వైశ్యుఁడు గుణవంతుడున్ను ఆక్షత్రియస్త్రీ నిర్గుణజాతిమాత్రోపజీవనియు శూద్రస్త్రీ భ్రాంత్యాది గమనమనియు

నేరాజుగ్రహించు నారాజాన్వజాతీయులగు రాజులలో సామ్రాజ్యభాగులనులో కమందధిక కీర్తివంతుడగును॥ ౩౮౭॥

మూ॥ ఋత్విజం యస్త్యజే ద్యాజ్యో యాజ్యంచర్త్విక్త్యజేద్యది।
శక్తంకర్మణ్యదుష్టంచ తయోర్దండ శ్శతంశతం॥ ౩౮౮॥

కర్మమునుజేయించ సమర్థుడగుఋత్విజునివిడచిన నతిపాతకాదులచే దుష్టుడుగాని యజమానునివిడచినట్టి ఋత్విగ్యాజ్యులకు నూరేసిపణములు దండమువిధించవలెను॥ ౩౮౮

మూ॥ నమాతా నపితా నస్త్రీ నపుత్రస్త్యాగ మర్హతి। త్యజన్నప
తితానేతా న్రాజ్ఞాదండ్య శ్శతానిషట్॥ ౩౮౯॥

తల్లికిని దండ్రికిని శుశ్రూషజేయకనున్ను భార్యనుపుత్రునిపోషించకనున్ను వీరు పాతకులుగాకున్నవిడచినవానికి యారునూరుపణములు దండముగవిధించవలెను॥ ౩౮౯

మూ॥ ఆశ్రమేషు ద్విజాతీనాం కార్యే వివదతాంమిథః। నవిబ్రూ
యా న్నృపోధర్మం చికీర్షన్ హితమాత్మనః॥ ౩౯౦॥

ద్విజులాశ్రమకార్యములవిషయమై పరస్పరముకలహించుచుండినచో నాత్మహితమునుగోరినరాజు సదృశములగువాటియందు విశేషమునుగల్పించి చెప్పరాదు॥

మూ॥ యథార్హమేతా నభ్యర్చ్య బ్రాహ్మణైస్సహపార్థివః।
సాంత్వేన ప్రశమయ్యాదౌ స్వధర్మం ప్రతిపాదయేత్॥ ౩౯౧॥

ఏబ్రాహ్మణుడెట్టిపూజకర్హుడగునో యట్లువారలసత్కరించి మరికొందరు బ్రాహ్మణులతోగూడా వారికోపమును శమింపజేసి ప్రీతియుక్తముగ వారిస్వధర్మమేదోదానిబోధించవలెను॥ ౩౯౧॥

మూ॥ ప్రాతివేశ్యానువేశ్యౌచ కల్యాణే వింశతిద్విజే। అర్హావ
భోజయన్విప్రో దండమర్హతి మాషకం॥ ౩౯౨॥

తనయింటిపొరుగు ప్రాతివేశ్యుడు దానికవతలింటివాడనువేశ్యుడు వీరు దోషరహితులగుచుండ వివాహాదిశుభములందిరువదిమంది బ్రాహ్మణులకు తక్కువగా

ని సంతర్పణమందువారిని భోజనమునకుబిలువకుండెనేని వానికొక రౌప్యమాష ముదండమునువిధించవలెను॥ ౩౯౨

మూ॥ శ్రోత్రియ శ్శ్రోత్రియం సాధుం భూతికృత్యే ష్వభోజయన్ ।
తదన్నం ద్విగుణం దాప్యో హిరణ్యం చైవమాషకం॥ ౩౯౩॥

విద్యాచారవంతుడగు బ్రాహ్మణుడట్టి శ్రోత్రియునివివాహాదివిభవకార్యములం దు భుజింపజేయకుండెనేని భోజనమునకు ద్విగుణముగ భోజనార్థమిచ్చి యొక సువర్ణము రాజుకుదండమీవలెను॥ ౩౯౩॥

మూ॥ అంధోజడః పీఠసర్పీ సప్తత్యాస్థవిరశ్చయః। శ్రోత్రియేషూ
పకుర్వంశ్చ నదాప్యాః కేనచిత్కరం॥ ౩౯౪॥

అంధుడు జడుడు సొట్టవాడు డెబ్బదివత్సరములపైవృద్ధుడు శ్రోత్రియులకుప కారమొనర్చువాడును నగువీరియొద్ద నెంతక్షీణదశనుండినను రాజు పన్నుగొన రాదు॥ ౩౯౪॥

మూ॥ శ్రోత్రియం వ్యాధితార్తౌచ బాలవృద్ధావకించనం । మ
హాకులీన మార్యంచ రాజా సంపూజయేత్సదా॥ ౩౯౫॥

శ్రోత్రియుడును రోగి గొప్పకష్టమునుబొందినవాడు బాలుడు వృద్ధుడుదరిద్రు డు గొప్పకులమందుబుట్టినవాడు నార్యుడనగా ఉదారమగుచరిత్రముగలవాడు ని ట్టివారిని రాజెల్లప్పుడును దానమానాదులచే సత్కరించవలెను॥ ౩౯౫॥

మూ॥ శాల్మలీఫలకేశ్లక్ష్ణే నేనిజ్యాన్నేజకశ్శనైః। నచవాసాంసివా
సోభి ర్నిర్హరేన్నచవాసయేత్॥ ౩౯౬॥

బూరుగుదూదిబట్టమెల్లగా నుతకవలెను ఒకరిబట్టలతోనొకరిబట్టకలిపి మారిగి ళ్ళుచేయరాదు ఒకరిబట్టలనొకనికి గట్టనీరాదు ఇట్లుతప్పజేసెనేని చాకలివాడుదం డించదగును॥ ౩౯౬॥

మూ॥ తంతువాయోదశపలం దద్యాదేకపలాధికం। అతోన్యథావ
ర్తమానో దాప్యోద్వాదశకందమం॥ ౩౯౭॥

బట్టలునేసెడువాడు పదిపలములు నూలుపుచ్చుకొని పదొకొండుపలములు బట్టతాచియివ్వవలెను పిండిగంజిపెట్టరాదటులివ్వకున్న పండ్రెండుపణములురాజు దండనువిధించవలెను॥ ఆస్వామికి సంతుష్టిజేయవలెను॥ ౩౯౭॥

మూ॥ శుల్కస్థానేషు కుశలాః సర్వపణ్యవిచక్షణాః । కుర్యురర్ఘం యథాపణ్యం తతోవింశం నృపోహరేత్॥ ౩౯౮॥

శుల్కమనగా స్థలజలపథవ్యవహారమువలన రాజగ్రాహ్యమగుభాగము దానిని పుచ్చుకొనేస్థానమందు కుశలులును సర్వసరకుపణ్యములసారాసారములనెరిగినవారు నిర్ణయించిన మూల్యములో నిరువదియవగు భాగము రాజు పుచ్చుకొనవలెను॥ ౩౯౮॥

మూ॥ రాజ్ఞః ప్రఖ్యాతభాండాని ప్రతిషిద్ధాని యానిచ । తాని నిర్హరతో లోభాత్ సర్వహారం హరేన్నృపః ॥౩౯౯॥

రాజోపయోగములుగా ప్రఖ్యాతములగు నేతద్దేశజనితగజతురగాదులున్న ప్రతిషిద్ధములనగా క్షామాది సమయములందు స్వదేశజాతధాన్యాదికమన్య దేశస్థులకమ్మరాదను వాటిని లోభబుద్ధిచే రాజాజ్ఞకువ్యతిరిక్తముగా నమ్మేని వారిసర్వస్వమును రాజుపుచ్చుకొనవలెను॥ ౩౯౯॥

మూ॥ శుల్కస్థానం పరిహరన్నకాలే క్రయవిక్రయీ। మిథ్యావాదీ చ సంఖ్యానే దాప్యోష్టగుణమత్యయం॥ ౪౦౦॥

సుంకమును పుచ్చుకొనేచోటుదప్పించి మరియొకత్రోవను వెళ్ళినవాడున్ను రాత్రులయందు క్రయవిక్రయములనొనర్చినవాడున్ను సుంకముతగ్గుటకు మూల్యము నబద్ధముగా జెప్పినవాడున్ను రాజుకు రావలసినసుంకపుసొమ్మెంతతప్పించుకొనెనో దానికెనిమిదిరెట్లు దండుగబుచ్చుకొనవలెను॥ ౪౦౦॥

మూ॥ ఆగమం నిర్గమం స్థానం తథా వృద్ధిక్షయావుభౌ। విచార్య సర్వపణ్యానాం కారయేత్క్రయవిక్రయౌ॥ ౪౦౧॥

ఏసరుకెంతదూరమునుంచి వచ్చెనో యెంతదూరమువెళ్ళునో యెంతకాలము నిలవయుండునో యందుకయ్యేవృద్ధియెంతో యాసరుకురక్షించుకూలిమొదలయిన

విమెంతవ్యయమాయెనో యాసరుకతరుగెంతో యువన్నియును విచారించికొ
నినవానికి నమ్మినవానికి నష్టములేకుండ ధరలేర్పరచి క్రయవిక్రయానులొనర్పించవ
లెను॥ ౪౦౧॥

మూ॥ పంచరాత్రే పంచరాత్రే పక్షేపక్షేథవాగతే। కుర్వీతచై
షాం ప్రత్యక్ష మర్ఘసంస్థాపనంనృపః। ౪౦౨॥

సరుకురావడమున్ను చెల్లడమున్ను నియతముగానుండదు గావునవాటికరీదు
లు శీఘ్రముగ మారునుగావున నట్టివాటికై దేసిదినముల కొకమారున్ను స్థిరప్రా
యములగువాటికి ప్రతిపక్షమందున్ను వర్తకులలో కుశలులగువారియెదుటనుధర
ను రాజు బుద్ధిమంతులచే వ్యవస్థనేర్పాటుచేయించవలెను॥ ౪౦౨॥

మూ॥ తులామానం ప్రతీమానం సర్వంచస్యాత్సులక్షితం। షట్సుష
ట్సుచమాసేషు పునరేవపరీక్షయేత్॥ ౪౦౩॥

బంగారు మొదలగువాటిని తూచే త్రాసులుగుళ్ళు కొలపాత్రలు మున్నైవాట
టు జేయబడిన వాటినారునెలకొకమారుసభ్యులచే పరీక్షజేయించవలెను॥ ౪౦౩॥

మూ॥ పణంయానంతరేదాప్యం పౌరుషోర్ధపణంతరే। పాదంప
శుశ్చయోషిచ్చ పాదార్ధంరిక్తకః పుమాన్॥ ౪౦౪॥

"భాండపూర్ణానీతి" యని బలువులతోనున్న యానములనిజెప్పును గావున బ
లువులులేని యట్టిబళ్ళను పడవమీద దాటించుట కొకపణము నొకపురుషభారము
నకు పణములో సగమున్ను గవాదిపశువులకున్ను స్త్రీలకున్ను పాదపణమున్ను
మనుష్యునకు పణములో నెనమిదవభాగమున్ను పడవకు పణ్యమీవలెను॥ ౪౦౪॥

మూ॥ భాండపూర్ణాని యానాని తార్యం దాప్యానిసారతః। రి
క్తభాండానియత్కించిత్పుమాంసశ్చాపరిచ్ఛదాః॥ ౪౦౫॥

బలువుగలసరకుతోనున్న బళ్ళకుబలువుననుసరించితరిపణ్యమీవలెను బలువులేని
గోనెలు గొంగళ్లుమొదలగువాటికిన్ని దరిద్రులగువారలకున్ను చెప్పబడినదానిలో
యేమాత్రమైనంగొంచముతరిపణ్యమీవలెను॥ ౪౦౫॥

మూ॥ దీర్ఘాధ్వని యథాదేశం యథాకాలంతరోభవేత్। నదీ

తీరేషు తద్విద్యాత్సముద్రేనాస్తిలక్షణం॥ ౪౦౬॥

పూర్వమందు సముద్రతరణార్థము చెప్పబడెను ఇప్పుడు నదీ మార్గమందు దూరముగా వెళ్లేత్రోవైతె నదీజలము నిలకడగానున్నది వడికట్టుగల దేశములను న్ను గ్రీష్మవర్షాదికాలమునున్ను బట్టిన్ని తరిమూల్యముకల్పించవలెను ఇదినదీతర ణములందు తెలియవలెను సముద్రమందువాడనడకవాతాధీనముగనుక తత్తత్కా లములనుబట్టి తరిపణ్యమూహించదగ్గది॥ ౪౦౬॥

మూ॥ గర్భిణీతు ద్విమాసాది స్తథాప్రవ్రజితోమునిః। బ్రాహ్మ
ణాలింగినశ్చైవ నదాప్యాస్తారికంతరే॥ ౪౦౭॥

రెండుమాసములకుపైని గర్భిణీస్త్రీలున్ను సన్యాసిన్ని వానప్రస్థున్ను బ్రహ్మ చారిన్ని తరిమూల్యమివ్వకుండవారిని దాటించవలెను॥ ౪౦౭॥

మూ॥ యన్నావికించిద్దాశానాం విశీర్యేతా పరాధతః।తద్దాశైరే
వదాతవ్యం సమాగమ్యస్వతోంశతః॥ ౪౦౮

వాడయందుగూచున్నవారివస్తువులు మొదలగువాటికి నావికాపరాధమువల ననష్టమేమివచ్చినను నావికులందరునుగూడి భాగానుసారముగనానష్టమునుభర్తీ చేయవలెను॥ ౪౦౮॥

మూ॥ ఏషనౌయాయినా ముక్తో వ్యవహారస్యనిర్ణయః। దాశా
పరాధతస్తోయె దైవికేనాస్తినిగ్రహః॥ ౪౦౯॥

నావికాపరాధమువలన నేదిజలమందు నష్టమాయెనో యదినావికులచే నివ్వద గ్గది నౌకాగమనముగలతరివ్యవహారనిర్ణయమిది చెప్పబడెను దైవోపజాతవాతా దికముచే నావకుభంగము కలిగనేని యాధనాదినష్టమువలన నావికులకు దండ ము లేదు॥ ౪౦౯॥

మూ॥ వాణిజ్యంకారయే ద్వైశ్యం కుసీదం కృషిమేవచ। పశూ
నాం రక్షణంచైవ దాస్యంశూద్రం ద్విజన్మనాం॥ ౪౧౦॥

వర్తకమున్ను వ్యవసాయమున్ను వృద్ధిన్ని పశుపాలనమున్ను వైశ్యునిచే జేయిం

చవలెను శూద్రుని చే ద్విజశుశ్రూష చేయించవలెనట్లు చేయకేని రాజువారిరువురను దండించవలెనని యిచ్చట నుపన్యసించెను॥ ౪౧౦॥

మూ॥ క్షత్రియంచైవ వైశ్యంచ బ్రాహ్మణో వృత్తికర్శితౌ। బిభృయాదానృశంస్యేన స్వానికర్మాణి కారయన్॥ ౪౧౧॥

బ్రాహ్మణుడు దరిద్రులగు క్షత్రియుడును వైశ్యుడున్నునాశ్రయించి రేనివారిచే కృషివాణిజ్యాదికములగు స్వకర్మములను జేయించుచు గ్రాసాచ్ఛాదనాదులచే వారిని గరుణతో బోషించవలెను బలవంతుడగు విప్రుడట్లు పోషించడేని రాజుచే దండ్యుడుగావలెనని యిచట చెప్పెను॥ ౪౧౧॥

మూ॥ దాస్యంతు కారయన్ లోభాద్బ్రాహ్మణస్సంస్కృతాన్ ద్విజాన్। అనిచ్ఛతః ప్రాభవత్వాద్రాజ్ఞా దండ్యశ్శతాని షట్॥ ౪౧౨॥

బ్రాహ్మణుడు తన ప్రాభవము చేత నుపనయనసంస్కారము నొందిన విప్రునిచే దాస్యము పాదధావనాదికమును వానియిచ్ఛలేకుండ జేయించుకొనునేని యా బ్రాహ్మణున కారునూరుపణములను రాజు దండము విధించవలెను॥ ౪౧౨

మూ॥ శూద్రంతు కారయేద్దాస్యం క్రీతమక్రీతమేవవా। దాస్యాయైవహి సృష్టోసౌ బ్రాహ్మణస్య స్వయంభువా॥ ౪౧౩॥

బ్రాహ్మణుడు శూద్రునకు జీతమిచ్చినయైన నిడకుండినను వానిచే దాస్యమును జేయించుకొనవలెను బ్రాహ్మణునకు దాస్యమొనర్చుటకే శూద్రుడు బ్రహ్మచే నిర్మించబడెను॥ ౪౧౩॥

మూ॥ నస్వామినా నిసృష్టోపి శూద్రో దాస్యాద్విముచ్యతే। నిసర్గజంహి తత్తస్య కస్తస్మాత్తదపోహతి॥ ౪౧౪॥

బ్రాహ్మణునిచే శూద్రుడు విడిచిపెట్టబడి దాసుడుగాకున్నను దాస్యమువలన విముక్తుడుగాడు గావున దాస్యము శూద్రునకు సహజము ఆశూద్రునివలన దాస్యము నెవడు తీసివెయ్యగలడు పరలోకార్థమైనను శూద్రుడు ద్విజశుశ్రూషను విడువరాదని తాత్పర్యము అట్లుగాకున్న ముందు జెప్పబోయెడి దాస్యకారణ పరిగణన మనర్థకమయ్యీని॥ ౪౧౪॥

మూ॥ ధ్వజాహృతో భక్తదాసో గృహజః క్రీతదత్త్రిమౌ। పైత్రికో
దండదాసశ్చ సప్తైతే దాసయోనయః ౪౧౫॥

యుద్ధమందు జయించి తేబడినవాడు ధ్వజదాసుడు భక్తుడై దాసుడైనవాడు భక్తదాసుడు దాసీపుత్రుడు గృహజుడు కొనబడినవాడు క్రీతదాసుడు ఒకరిచే నీబడినవాడు దత్త్రిముడు పిత్రాదిక్రమాగతుడు పైత్రికుడు దండాదిధనశుద్ధికొరకు స్వీకృతదాస్యుడు దండదాసుడు యేడును దాసత్వమునకు మూలములు॥ ౪౧౫॥

మూ॥ భార్యాదాసశ్చ పుత్రశ్చ త్రయఏవా ధనాస్స్మృతాః। య
త్తేసమధిగచ్ఛంతి యస్యతే తస్యతద్ధనం॥ ౪౧౬॥

భార్యయున్ను దాసుడున్ను పుత్రుడున్ను నిర్ధనులని చెప్పబడిరి వీరుముగ్గురున్ను యేధనము నార్జింతురో అదివారెవరిసంబంధులో వారిదాధనమగుచున్నది భార్యాదిత్రయమునకు స్వాతంత్ర్యము లేదనెడియర్థపరమిది అధ్యగ్న్యాదిషడ్విధమగుస్త్రీధనము చెప్పగలవు గావున అదృష్టార్థకర్మోపదేశార్థమున్ను భార్యాదులకున్ను ప్రత్యధికరణమందు భార్యాసంబంధమగు ధనముండిననుయాగాదికారియగునని చెప్పుటవలననున్ను ఏకధనమందున్ను భర్త్రనుమతిచే స్త్రీకిన్ని యాధనము వినియోగపరచుటయందు కర్తృత్వముగలదుగావుననున్ను అస్వాతంత్ర్యపరమీవచనార్థము॥

మూ॥ విస్రబ్ధం బ్రాహ్మణశ్శూద్రాద్ద్రవ్యోపాదానమాచరేత్। స
హితస్యాస్తికించిత్స్వం భర్తృహార్యధనోహిసః॥ ౪౧౭॥

ప్రకరణమువలన దాసుడగుశూద్రునివలన ధనమునిశ్శంకముగా బ్రాహ్మణుడు దుర్భిక్షాద్యులందు స్వీకరించవచ్చును వానికించుకయైన స్వీయము లేదు స్వామిచే గ్రహించదగినవానిధనముగావున నిట్లుండ నాపదయందు బలాత్కారముగనైన వానిధనముపుచ్చుకొనిన బ్రాహ్మణుని రాజుదండించరాదని యిచ్చట జెప్పుట॥ ౪౧౭॥

మూ॥ వైశ్యశూద్రౌ ప్రయత్నేన స్వానికర్మాణికారయేత్। తౌ
హిచ్యుతౌస్వకర్మభ్యః క్షోభయేతామిదంజగత్॥ ౪౧౮॥

వైశ్యునిచే వాణిజ్యాదికర్మమునున్ను శూద్రునిచే ద్విజశుశ్రూషాదికమునున్ను రాజతిప్రయత్నముచే జేయించవలయును అట్లు కానిచో నా వైశ్యశూద్రులు శాస్త్రీయ

వ్యాపారము చే నతిధనవంతులై గర్వముచే జగత్తును వ్యాకులింపజేతురు॥ ४१८॥

మూ॥ అహన్యహన్యవేక్షేత కర్మాంతాన్వాహనానిచ । ఆయవ్య
యౌచ నియతా నాకరాన్కోశమేవచ॥ ४१९॥

ప్రతిదినమందును నధికృతులగువారిచే జేయబడెడు దృష్టాదృష్ట కర్మములయొ
క్క ఫలమునున్ను గజతురగాదికములనున్ను నియతములగు నాయవ్యయములనున్ను సు
వర్ణరత్నాకరములనున్ను ధనసంచయమునున్ను రాజుచూచుచుండవలెను వ్యవ
హారదర్శనవ్యగ్రత గలిగియుండినను స్వధర్మములను విడువరాదని జెప్పుటకీవచనమి
క్కడ జెప్పుటచే బునరుక్తిలేదు॥ ४१९॥

మూ॥ ఏవం సర్వానిమాన్ రాజా వ్యవహారాన్సమాపయన్। వ్య
పోహ్య కిల్బిషం సర్వం ప్రాప్నోతి పరమాం గతిం॥ ४२०॥

ఇతి మానవే ధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాం సంహితాయా
మష్టమోధ్యాయః.

---

ఈ చెప్పబడిన ప్రకారముగ ఋణాదానాది సకలవ్యవహారములను సాంతము
గ జేసిన రాజు నిర్ధూతకల్మషుడై స్వర్గలోకమును బొంది సుఖించును॥ ४२०॥

ఇది శ్రీమన్మహామహీంద్ర రాజశ్రీ ముకుందగజపతి రాజ
మహారాజ దయాపాత్ర భారద్వాజసగోత్రపవిత్ర
సుకవిజనవిధేయ మండకామేశ్వర నామధేయ
విరచిత తాంధ్రమన్వర్థదీపికాఖ్యయగు
వ్యాఖ్యయం దష్టమాధ్యాయము.
శ్రీపరదేవతార్పణమస్తు.

---



శ్రీరస్తు.

ఆంధ్రమన్వర్థదీపికాసహిత.

# మనుస్మృతి * నవమాధ్యాయప్రారంభము.

మూ॥ పురుషస్య స్త్రియాశ్చైవ ధర్మేవర్త్మని తిష్ఠతోః।
సంయోగే విప్రయోగేచ ధర్మాన్వక్ష్యామి శాశ్వతాన్॥౧॥

ధర్మోపయోగమగు మార్గమందు వర్తించు పురుషునకున్ను పత్నికిన్ని యనగా నన్యోన్యమనుకూలముగనుండు దంపతులు సంయోగమందును విప్రయోగమందును నెట్టిధర్మములో పారంపర్యాగతములు గావున శాశ్వతములగునట్టిధర్మములను జెప్పగలను దంపతులలో ప్రతికూలవ్యాపారవంతులగు వారిని రాజు శిక్షించవలయును గాన నీప్రకరణంబున నీధర్మంబులు చెప్పుటకు కారణము॥ ౧॥

మూ॥ అస్వతంత్రాః స్త్రియః కార్యాః పురుషైస్స్వైర్దివానిశం।
విషయేషుచ సజ్జంత్యస్సంస్థాప్యా ఆత్మనోవశే॥౨॥

తమసంబంధులగు పురుషులచే స్త్రీలెల్లప్పుడు నస్వతంత్రలుగానున్ను రూపరసాదివిషయములందు సక్తులగుచుండువారు గాన నాత్మవశ్యలుగానున్ను జేయదగుదురు॥ ౨॥

మూ॥ పితా రక్షతి కౌమారే భర్తారక్షతి యౌవనే।
రక్షంతి స్థావిరే పుత్రా న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి॥ ౩॥

బాల్యమందు వివాహముగాక పూర్వము తండ్రిన్ని యౌవనమందు పతిన్ని పతిలేనప్పుడు పుత్రులున్ను స్త్రీని రక్షించవలెను గాని స్త్రీకి స్వాతంత్ర్యమేయవస్థయందైనను లేదు "భర్తారక్షతియౌవనే" యనునది మొదలగు వాక్యార్థము తరుచుగా నన్వయగును పతిపుత్రరహితయగు స్త్రీనైతే సన్నిహితులగు పుత్రాదులు రక్షించవలెను॥ ౩॥

మూ॥ కాలేఽదాతా పితా వాచ్యో వాచ్యశ్చానుపయన్పతిః।

మృతే భర్తరి పుత్రస్తు వాచ్యో మాతురరక్షితా॥౪॥

"శ్లో॥ ప్రదానం ప్రాగృతోరితి రజస్వలకాకమున్నె కన్యకు వివాహము చేయ వలెనను గౌతమవచనము వలన నట్టికాలమందు పెళ్లి చేయనేని తండ్రి నింద్యుడగును రజోదర్శనానంతరమందు భార్యతో నుండకుండిన భర్తయును భర్త చనిపోయిన పిమ్మట తల్లి నిరక్షించని పుత్రుడును నింద్యులగుదురు॥ ౪॥

మూ॥ సూక్ష్మేభ్యోపి ప్రసంగేభ్య స్స్త్రియో రక్ష్యా విశేషతః।
ద్వయోర్హి కులయో శ్శోక మావహేయు రరక్షితాః॥౫॥

దుస్సంగము స్వల్పముండినను విశేషముగ స్త్రీలు రక్షించదగుదురు రక్షించబడని స్త్రీ పితృభర్తృకులము వారలందరికిని తలవంపులు దెత్తురుగాన స్త్రీరక్షణ మావశ్యకము॥ ౫॥

మూ॥ ఇమంహి సర్వవర్ణానాం పశ్యంతో ధర్మముత్తమం।
యతంతే రక్షితుం భార్యాం భర్తారో దుర్బలా అపి॥౬॥

బ్రాహ్మణాద్యఖిలవర్ణములవారున్ను ఈభార్యారక్షణమగు ధర్మము నుత్తమముగా దెలుసుకొనుచు నంధపంగ్వాదిదుర్బలు లయినను భార్యారక్షణమందు జాగరూకులై యత్నించెదరు॥ ౬॥

మూ॥ స్వాం ప్రసూతిం చరిత్రంచ కులమాత్మాన మేవచ।
స్వంచ ధర్మం ప్రయత్నేన జాయాంరక్షన్హి రక్షతి॥౭॥

భార్యను రక్షించుచున్నవాడు సంకరజన్మము లేకుండా తనసంతానమునున్ను తనవిశిష్టచరిత్రమునున్ను పితృపితామహాదివంశమునున్ను దుస్సంతానము గాకుండుటచే పరలోకమున కుపయోగించు పుత్రులుగలవాడగును గాన దననున్ను పత్నీశుద్ధిచే నాధానాదికర్మముల కధికారియగుటచే నాత్మధర్మమునున్ను రక్షించుచున్నాడుగాన ప్రయత్నముచే భార్యారక్షణ మెల్ల ధర్మమునకును మూలమని పూర్వోక్తమునే విశేషించెను॥ ౭॥

మూ॥ పతిర్భార్యాం సంప్రవిశ్య గర్భో భూత్వేహ జాయతే।
జాయాయా స్తద్ధి జాయాత్వం యదస్యాం జాయతే పునః॥౮॥

పతి తానుతనశుక్లరూపముచే భార్యయొక్క గర్భమందు ప్రవేశించి తానే పుత్ర

రూపుడై పుట్టును "శ్రు॥ ఆత్మా వై పుత్రనామాసి" నీవు నేనే పుత్రనామకుడ వగుచున్నావని యీ శ్రుతియందు పతియే మరల జన్మించుట చేదో యదే జాయయొక్క జాయాత్వము ఇందుకు బహ్వృచబ్రాహ్మణము "పతిర్జాయాం ప్రవిశతి గర్భో భూత్వేహ మాతరం। తస్యాం పునర్నవో భూత్వా దశమే మాసి జాయతే। తజ్జాయా జాయా భవతి యదస్యాం జాయతే పునః" దీని యర్థము పతి గర్భరూపుడై భార్యయందు ప్రవేశించుచున్నాడు దానియందు నూతనుడై పదోమాసమందు బుట్టుచున్నాడు ఏ హేతువచే దానియందు తాను జాతుడగుచున్నాడో యందువలన జాయకు జాయాత్వము కలిగెనని గాన నీ స్త్రీ ప్రయత్నముచే రక్షించతగినది నామనిర్వచనమున చేతను॥ ౮॥

మూ॥ యాదృశం భజతే హి స్త్రీ సుతం సూతే తథావిధం। తస్మా
త్ప్రజావిశుద్ధ్యర్థం స్త్రియం రక్షేత్ప్రయత్నతః॥ ౯॥

స్త్రీ శాస్త్రీయవివాహితభర్తను బొంది కనెనేని మంచికొడుకును వ్యభిచారముచే నికృష్టుడగువానిని బొంది కనెనేని యధముడగు సుతునిన్ని గనును గావున పరిశుద్ధసంతానముకొరకు భార్యను రక్షింపవలెను యెట్లు రక్షింపవలెనో యా యుపాయమును చెప్పుచున్నాడు॥ ౯॥

మూ॥ న కశ్చిద్యోషితశ్శక్తః ప్రసహ్య పరిరక్షితుం। ఏతైరుపాయ
యోగైస్తు శక్యాస్తాః పరిరక్షితుం॥ ౧౦॥

బలాత్కారముగా నిరోధించి స్త్రీల నెవ్వడును రక్షింపశక్తుడుగాడు అట్టిచో నున్న వ్యభిచారము వినబడెను మరేమంటే ఈ చెప్పబోయెడి యుపాయములచే రక్షింపవచ్చు నా యుపాయములేవనిన॥ ౧౦॥

మూ॥ అర్థస్య సంగ్రహే చైనాం వ్యయే చైవ నియోజయేత్।
శౌచే ధర్మేఽన్నపక్త్యాం చ పారిణాహ్యస్య చేక్షణే॥ ౧౧

ధనసంగ్రహవినియోగములందున్ను వస్తువులయొక్కయు శరీరముయొక్కయు శుద్ధియందున్ను భర్తృశుశ్రూషణమందున్ను అన్నపానసాధనమందున్ను గృహోపకరణములగు శయ్యాసనపరిసుఖములను చూడడమందున్ను భార్యను నియోగించవలెను॥ ౧౧॥

మూ॥ అరక్షితా గృహే రుద్ధాః పురుషై రాప్తకారిభిః।

ఆత్మానమాత్మనాయస్తు రక్షేయుస్తాస్సురక్షితాః॥ ౧౨

ఆప్తులగు నాజ్ఞాకారిపురుషులచే గృహమందు సంరుద్ధలైనప్పటికిని యేస్త్రీలు దుస్స్వభావముచే తమ్మురక్షించుకొనరో వారు యరక్షితలేయగుచున్నారు యేస్త్రీలు ధర్మమునెరిగి తమబుద్ధిచే తమ్మును రక్షించుకుందురో వారేసురక్షితలగుచున్నారు అదిగావున ధర్మాధర్మఫలములగు స్వర్గనరకప్రాప్త్యాదుల నుపదేశించి స్త్రీలకు నియమముమప్పవలెనని నదిముఖ్యమగు రక్షణోపాయమని తాత్పర్యము॥ ౧౨॥

మూ॥ పానందుర్జనసంసర్గః పత్యాచవిరహోటనం।
స్వాపోన్యగేహవాసశ్చ నారీసందూషణానిషట్॥ ౧౩

మద్యపానమున్ను దుర్జనసహవాసమున్ను భర్తనువిడిచి యుండడమున్ను ఇకడాకడాతిరగడమున్ను అకాలమందు పరుండడమున్ను పరగృహమందుని వసించుటయు నను నీయారును స్త్రీలకువ్యభిచారదోషమును పుట్టించునవిగాన వీటివలన రక్షించవలెను॥ ౧౩॥

మూ॥ నైతారూపం పరీక్షంతే నాసాం వయసి సంస్థితిః।
సురూపంవా విరూపంవా పుమానిత్యేవభుంజతే॥ ౧౪

ఈస్త్రీలు మిక్కిలిరూపవంతుడు వీడుకాడని చూడరు యౌవనాది వయస్సులయందు నాదరములేదు సురూపుడేకాని కురూపుడేకాని పురుషుడైతేసరియని భోగింతురు॥ ౧౪॥

మూ॥ పౌంశ్చల్యాచ్చలచిత్తాచ్చ నైస్నేహ్యాచ్చస్వభావతః।
రక్షితాయత్నతోపీహ భర్తృష్వేతావికుర్వతే॥ ౧౫

పురుషుడు కనపడితే సంభోగశీలురగుటచేతనున్ను చిత్తస్థైర్యములేకుండుటచేతనున్ను స్వభావమువలననున్ను స్నేహములేనివారగుటచేతనున్ను ఈస్త్రీలుయత్నముచే రక్షితలౌచుంచున్నప్పటికిని వ్యభిచారము నాశ్రయించుటచేభర్తలయందు వికారమును బొందుదురు॥ ౧౫॥

మూ॥ ఏవం స్వభావం జ్ఞాత్వాసాం ప్రజాపతినసర్గజం।

పరమం యత్నమాతిష్ఠేత్ పురుషో రక్షణంప్రతి॥ ౧౬

ఈ రెండుశ్లోకములచే జెప్పబడిన యీ స్త్రీల స్వభావము హిరణ్యగర్భసృష్టి కాలమందు బుట్టించబడినదని దెలసి రక్షార్థమధికమగుయత్నము పురుషుడు జేయవలెను॥ ౧౬॥

మూ॥ శయ్యాసనమలంకారం కామంక్రోధ మనార్జవం।
ద్రోహభావం కుచర్యాంచ స్త్రీభ్యో మనురకల్పయత్॥౧౭॥

పర్యంకములపైనుండుటయు నలంకారములందును నాసక్తియు కామమున్ను క్రోధమున నార్జవమును హింసయు కుత్సితాచారమున్ను యిది సృష్ట్యాదియందు స్త్రీలకుమనువుకల్పించెనుగాన యత్నమువలన స్త్రీలురక్షించదగుదురు॥ ౧౭॥

మూ॥ నాస్తిస్త్రీణాం క్రియామంత్రై రితిధర్మే వ్యవస్థితిః।
నిరింద్రియా హ్యమంత్రాశ్చ స్త్రీయోనృతమితిస్థితిః॥౧౮॥

స్త్రీలకుమంత్రములచే జాతకర్మాదిక్రియలులేవు ఈలాగున నీశాస్త్రముచే వ్యవస్థచేయబడెను అందువలననగా మంత్రయుక్తముగసంస్కారములు లేకపోవుటచేనిష్పాపమనస్కులుకాకపోయిరి ఇంద్రియమనగా ప్రమాణము ధర్మమునకు ప్రమాణములగు శ్రుతిస్మృతులులేమిచే ధర్మజ్ఞులుగారు పాపమునుబోగొట్టెడిమంత్రజపాదిరహితులగుటచే జేసిన పాపముబోగొట్టుకొనలేరు అనృతమువలెనశుభమయులు ఇట్టివారు స్త్రీలశాస్త్రమర్యాదకలదుగావున యత్నముచేవీరినిరక్షించవలెనని తాత్పర్యము॥ ౧౮॥

మూ॥ తథాచ శ్రుతయోబహ్వ్యో నిగీతాని గమేష్వపి।
స్వాలక్షణ్య పరీక్షార్థం తాసాం శృణుతనిష్కృతీః॥౧౯॥

స్త్రీలకువ్యభిచారశీలత్వము ప్రాయశః స్వభావమనిచెప్పబడ్డది ఆవిషయమై శ్రుతిప్రమాణత్వేనఉపన్యసించబడునుఆరీతిని అనేకశ్రుతులు॥శ్రు॥"నచైతద్విద్మోబ్రాహ్మణాస్స్మోబ్రాహ్మణావేతి" యనియీ మొదలయిన వేదవాక్యములు వేదములయందు వ్యభిచారశీలత్వమునున్ను తత్పరిజ్ఞానార్థమునున్ను పఠించబడియున్నవిఆశ్రుతులలో మేవైతేవ్యభిచారప్రాయశ్చిత్తభూతములయినవో వాటినిఅనగానొకట్రెండుశ్రుతిచెప్పగలడుగనుక శ్రుతినివినుండని యర్థము వైదిః ముఃనుక ఏకవచనాని

కి బహువచనము చెప్పబడెను॥ ౧౯॥

మూ॥ యన్మే మాతా ప్రలులుభే విచరం త్యపతివ్రతా।
తన్మే రేతః పితా వృఙ్క్తా మిత్యస్యైతన్నిదర్శనం॥౨౦॥

ఒకానొకపుత్రుని తల్లి యొక్క మానసవ్యభిచారమునూహించి పలుకుచున్నాడు మనోవాక్కాయకర్మములచేత పతివ్యతిరిక్తుడగు పురుషునిగూర్చి లోభపడునదియైతే ఆపురుషుని సంకల్పించడముచే దూషితమైన మాతృరజోరూపమగు రేతస్సును నాతండ్రి పవిత్రముగా జేయుగావుత యను నీమంత్రపాదత్రయము స్త్రీల వ్యభిచారశంకరసుటకు జ్ఞాపకము చాతుర్మాస్యాదులందు దీనికి వినియోగము ఇప్పుడు మానసవ్యభిచారప్రాయశ్చిత్తరూపత్వము నీమంత్రమునకు చెప్పుచున్నాడు॥ ౨౦॥

మూ॥ ధ్యాయత్యనిష్టం యత్కించి త్పాణిగ్రాహస్య చేతసా।
తస్యైష వ్యభిచారస్య నిహ్నవ స్సమ్యగుచ్యతే॥౨౧॥

భర్తకప్రియమగు పురుషాంతరగమనమును మనస్సుచే స్త్రీ సిందించునది యేదో యామానసవ్యభిచారమునకు సమ్యక్శోధకముగా నీమంత్రము మన్వాదులచే చెప్పబడెను-మాతా యని చెప్పడమువలన నీప్రాయశ్చిత్తము పుత్రునకుగాని తల్లికిగాదు॥

మూ॥ యాదృగ్గుణేన భర్త్రా స్త్రీ సంయుజ్యేత యథావిధి।
తాదృగ్గుణా సా భవతి సముద్రేణేవ నిమ్నగా॥౨౨॥

మంచివాడుగాని చెడ్డవాడుగాని యేభర్తతో వివాహవిధిచే స్త్రీ సంబంధించునో యాస్త్రీ భర్తృసదృశగుణములుగలదేయగుచున్నది-నది మధురజలము గలదైనను సముద్రునితో సంబంధించి తాను క్షారజలముగలదేయగుచున్నది భర్తకాన్మపన్నానాఖ్యమగు స్త్రీరత్నోపాయాంతరోపదేశార్థమిది ఈవిషయమై యుత్కర్షదృష్టాంతమును జెప్పుచున్నాడు॥ ౨౨॥

మూ॥ అక్షమాలా వసిష్ఠేన సంయుక్తాధమయోనిజా।
సారంగీ మందపాలేన జగామాభ్యర్హణీయతాం॥౨౩॥

వసిష్ఠపరిణీతయై నికృష్టయోనిజాతయగు నక్షమాలాఖ్యయు మందపాలుడను ఋషితోగూడుకొని పటకయు పూజ్యానుబొందిరి॥ ౨౩॥

మూ॥ ఏతాశ్చాన్యాశ్చ లోకేస్మిన్నపకృష్టప్రసూతయః।
ఉత్కర్షం యోషితః ప్రాప్తాః స్వైస్స్వైర్భర్తృగుణైశ్శుభైః॥

ఈచెప్పబడినవారిద్దరయినప్పటికిని ప్రదర్శనార్థత్వము గావున నేతాః యనిబహువచనము వీరున్ను మరికొందరున్ను నికృష్టప్రసూతులయినప్పటికిని యుత్కృష్టములగు భర్తృగుణములచే నీలోకమందును పరలోకమందును నుత్కృష్టమును బొందిరి॥ ౨౪॥

మూ॥ ఏషోదితా లోకయాత్రా నిత్యం స్త్రీపుంసయోశ్శుభా।
ప్రేత్యేహ చ సుఖోదర్కాన్ ప్రజాధర్మాన్నిబోధత॥ ౨౫॥

ఇదిదంపతులవిషయమైన శుభరూపమగు నాచారము ఇకనులోకద్వయమందును సుఖమునకు హేతువులగు ప్రజాధర్మములనగా సంతానము క్షేత్రిదా బీజిదా యనునది మొదలగువాటిని జెప్పెదనువినుండు॥ ౨౫

మూ॥ ప్రజనార్థం మహాభాగాః పూజార్హా గృహదీప్తయః।
స్త్రియశ్శ్రియశ్చ గేహేషు న విశేషోస్తి కశ్చన॥ ౨౬॥

విచారించగా రక్షణార్థమై స్త్రీలయందుదోషము లెంచబడెను అటులైనప్పటికిని యీస్త్రీలు గర్భోత్పాదనకొరకుపయోగమైనవారుగనుక అనేకమంగళములకు స్థానభూతులుగావున వస్త్రాలంకారాదిదానముచే సన్మానించుట కర్హులు గృహమందు శోభనుకలిగించెడివారు స్త్రీలుగృహలక్ష్ములు గృహమందు స్త్రీకిన్ని శ్రీకిన్ని విశేషముకనపడదు నిశ్శ్రీకమయినగృహమేదంటే నిస్త్రీకమైనదేమరిన్ని॥ ౨౬॥

మూ॥ ఉత్పాదనమపత్యస్య జాతస్య పరిపాలనం।
ప్రత్యహం లోకయాత్రాయాః ప్రత్యక్షం స్త్రీనిబంధనం॥ ౨౭॥

సంతానముయొక్కపుట్టడమునకును బుట్టినయపత్యమును బరిపాలించడమునకున్ను ప్రతిదినంబుననతిథిభోజనాదిలోకయాత్రకున్ను స్త్రీప్రత్యక్షమగుసాధనము॥

మూ॥ అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషా రతిరుత్తమా।
దారాధీనస్తథా స్వర్గః పితౄణామాత్మనశ్చహ॥ ౨౮॥

అపత్యము పయిని చెప్పబడినదైనను ముఖ్యత్వజ్ఞాపనార్థమై మరలజెప్పబడెను

సంతానమును నగ్నిహోత్రాది ధర్మకార్యములును బరిచర్యయునున్నుఉత్కృష్టమగురతిన్ని పుత్రోత్పాదనమూలముగా పితరులకున్ను దనకున్ను స్వర్గమున్ను యీసర్వమున్ను భార్యాధీనము॥ ౨౮॥

మూ॥ పతింయా నాభిచరతి మనోవాగ్దేహసంయుతా।
సాభర్తృలోకా నాప్నోతి సద్భిస్సాధ్వీతి చోచ్యతే॥ ౨౯॥

మనోవాగ్దేహములయొక్క నియమముచే నేస్త్రీభర్తనతిక్రమించివ్యభిచరించదో యాస్త్రీభర్తతోగూడ పుణ్యలోకములననుభవించును సజ్జనులచే సాధ్వియని పించుకొనును॥ ౨౯॥

మూ॥ వ్యభిచారాత్తు భర్తుః స్త్రీ లోకేప్రాప్నోతి నింద్యతాం।
సృగాలయోనించాప్నోతి పాపరోగైశ్చ పీడ్యతే॥ ౩౦॥

స్త్రీభర్తనతిక్రమించి పురుషాంతరసంపర్కముకలదయ్యేనేనిలోకమునందునింద్యురాలుగావడమున్ను తరువాతనక్కయైపుట్టడమున్ను యన్నిజన్మములకు పాపరోగముచే పీడనున్ను బొందును యీరెండుశ్లోకములున్ను పంచమాధ్యాయమందుక్తములైనను సంతానప్రశంసార్థమిచ్చట మరలవ్రాయబడెను॥ ౩౦॥

మూ॥ పుత్రంప్రత్యుదితం సద్భిః పూర్వజైశ్చ మహర్షిభిః।
విశ్వజన్యమిమంపుణ్య ముపన్యాసం నిబోధత॥ ౩౧॥

పుత్రునుద్దేశించి శిష్టులగుమన్వాదులచేతనున్ను ప్రాచీనులగుమహర్షులచేతనున్ను పుణ్యమగునుపన్యాసముసర్వలోకహితార్థముగ జేయబడెనుదానినివినుండు॥

మూ॥ భర్తుః పుత్రం విజానంతి శ్రుతిద్వైధంతుభర్తరి।
ఆహురుత్పాదకంకేచి దపరేక్షేత్రిణంవిదుః॥ ౩౨॥

పుత్రుని భర్తృసంబంధునిగా మునులుతలచుచున్నారు భర్తవిషయమై శ్రుతిద్విప్రకారముగానున్నది తనపెండ్లిభార్యకాకుండిన నన్యుని స్త్రీయందునైననెవనికి కొడుకుబుట్టునో వాడువానికొడుకని కొందరున్ను కొందరుతనభార్యయందన్యునకుబుట్టినవాడు పెండ్లిమగనికొడుకగునని చెప్పుచున్నారు॥ ౩౨॥

మూ॥ క్షేత్రభూతా స్మృతానారీ బీజభూతస్స్మృతఃపుమాన్।

క్షేత్రబీజసమాయోగా త్సంభవ స్సర్వదేహినాం॥33॥

ధాన్యాదులుపండెడుమడి క్షేత్రమట్టిది స్త్రీయనిన్ని యందువేసే ధాన్యాది విత్తనముపంటివాడు పురుషుడనిన్ని చెప్పబడెను శుక్లముబీజమైనప్పటికినితదధిష్ఠానముగా నపురుషుడు బీజభూతుడని చెప్పబడెను యట్టిక్షేత్రబీజసంబంధముచే నెల్ల దేహులకునుత్పత్తియగుచున్నది స్త్రీపురుషులిద్దరును కారణమని తుల్యముగా జెప్పబడిన నొకవిరోధముగనపడుచున్నది అదేమనిన ఒకనిబీజముచే నొకనిక్షేత్రమందుబుట్టినయపత్యము క్షేత్రిదా లేక బీజిదాయని॥ 33॥

మూ॥ విశిష్టంకుత్రచిద్బీజం స్త్రీయోనిస్త్వేవ కుత్రచిత్।
ఉభయంతు సమంయత్ర సాప్రసూతిః ప్రశస్యతే॥ 34॥

ఒకానొకచో బుధుడు చంద్రునకువలెనున్ను వ్యాసఋశ్యశృంగాదులు పరాశరవిభాండకులకువలెనున్ను బీజముప్రధానమగుచున్నది క్షత్రియస్త్రీయందు బ్రాహ్మణునివలనకలిగిన ధృతరాష్ట్రాదులు విచిత్రవీర్యునకువలె నొకానొకచో క్షేత్రము ప్రధానముగానున్ను కనపడుచున్నది యెవని క్షేత్రమందు వానికిబుట్టిన యపత్యముత్తమము ముందుగాబీజప్రాధాన్యమునుగూర్చి చెప్పుచున్నాడు॥ 34॥

మూ॥ బీజస్య చైవ యోన్యాశ్చ బీజముత్కృష్ట ముచ్యతే।
సర్వభూత ప్రసూతిర్హి బీజలక్షణలక్షితా॥35॥

బీజక్షేత్రములయందు బీజముప్రధానముగా జెప్పబడుచున్నది సకలభూతములయొక్కసంతతియు బీజముయొక్క వర్ణస్వరూపాది లక్షణములుగలదై గనబడుచున్నది॥ 35॥

మూ॥ యాదృశం తూప్యతే బీజం క్షేత్రే కాలోపపాదితే।
తాదృగ్రోహతి తత్తస్మిన్ బీజం స్వైర్వ్యంజితంగుణైః॥36॥

గ్రీష్మాదికాలమందు వర్షజలముచేదడిసినభూమి యందు నేజాతిగింజ యెట్టిదియునాటబడునో యాక్షేత్రమందా జాతిమొలకయెట్లులుండునో యట్టిదే మొలుచు నట్లన్వయదృష్టాంతమును జెప్పి వ్యతిరేకదృష్టాంతమునుచెప్పుచున్నాడు॥ 36॥

మూ॥ ఇయంభూమిర్హి భూతానాం శాశ్వతీ యోనిరుచ్యతే।

నచ యోని గుణాన్ కాంశ్చి ద్బీజం పుష్యతి పుష్టిషు॥౩౭॥

తరుగుల్మలతాదులకు శాశ్వతమగుకారణమీ భూమే చెప్పబడుచున్నది యీ భూమియందుపుట్టినమొక్కలలో నొక్కటైన భూమిరూపమునుబొందియుండలేదు కొమ్మలయందైనా నాకులయందైనా మృత్స్వరూపముకనపడదు॥ ౩౭॥

మూ॥ భూమావప్యేక కేదారే కాలోప్తాని కృషీవలైః।
నానారూపాణి జాయంతె బీజానీహ స్వభావతః॥౩౮॥

భూమియందగు నొక్కమడిలో కర్షకుడనేకవిత్తనములుపెట్టినను తత్తద్బీజములకు స్వభావముగలబహువిధములగు మొక్కలేమొలుచునుగాని భూమియొక్క రూపమువలె నొక్కరూపముగలవిబుట్టవు॥ ౩౮॥

మూ॥ వ్రీహయశ్శాలయోముద్గా స్తిలామాషా స్తథాయవాః।
యథాబీజం ప్రరోహంతి లశునానీక్షవ స్తథా॥ ౩౯॥

సత్తికపుధాన్యమున్ను శాలిధాన్యమున్ను పెసలు తిలలు మినుములుయవలును ల్లి చెరుకు యివిమొదలగునవి బీజానుసారముగా మొలుచుచున్నవి ఇట్లగుచుండ॥

మూ। అన్యదుప్తం జాతమన్య దిత్యేత దుపపద్యతే।
ఉప్యతె యద్ధి యద్బీజం తత్తదేవ ప్రరోహతి॥౪౦॥

ధాన్యపుగింజనూపితె పెసరమొక్కపుట్టదు యేగింజవేస్తె యామొక్కయేపుట్టును ఇట్లుభూమిధరానువృత్తిలేకుండ బీజగుణానువృత్తి వ్రీహ్యాద్యులయందగుపడుచుండెనుగాన మనుష్యులయందును బీజమేప్రధానమనిచెప్పి యింక క్షేత్రమేప్రధానమునుగాచెప్పుచున్నాడు॥ ౪౦॥

మూ॥ తత్ప్రాజ్ఞేన వినీతేన జ్ఞానవిజ్ఞాన వేదినా।
ఆయుష్కామేన వప్తవ్యం నజాతు పరయోషితి॥౪౧॥

ఆబీజమును ప్రాజ్ఞుడును పిత్రాదులచే శిక్షితుడును వేదవేదాంగములను తెలిసినవాడును ఆయుష్కాముడునగు పురుషుడు పరస్త్రీయందు బీజము నుంచగూడదు॥ ౪౧॥

మూ॥ అత్రగాథా వాయుగీతాః కీర్తయంతి పురావిదః ।
యథా బీజం నవప్తవ్యం పుంసాపరపరిగ్రహే॥౪౨॥

ఈయర్థమందు ప్రాచీనధర్మజ్ఞులు వాయుప్రోక్తములగు గాథలననగా ఛందోవిశేషయుక్తములగు వాక్యములను చెప్పుచున్నారు యేమనంటే పరపురుషుడు పరస్త్రీయందు బీజము నుంచగూడదని॥ ౪౨॥

మూ॥ నశ్యతీషు ర్యథా విద్ధః ఖేవిద్ధమనువిధ్యతః।
తథా నశ్యతివై క్షిప్రం బీజం పరపరిగ్రహే॥౪౩॥

ఒకనిచే కొట్టబడిన మృగముయొక్క గాయపురంధ్రమందు గాడువాని బాణము వ్యర్థముగా నశించును మొదట గొట్టినవానిదే యామృగమూలమగు లాభము గావునయీలాగునే పరస్త్రీయందు ప్తమగుబీజము శీఘ్రముగనిష్ఫలమగుచున్నదిగర్భగ్రహణానంతరమందు క్షేత్రికే యాఫలము లభించును గావున॥ ౪౩॥

మూ॥ పృథోరపీమాం పృథివీం భార్యాం పూర్వవిదోవిదుః ।
స్థాణు చ్ఛేదస్య కేదార మాహుశ్శల్య హతోమృగం॥౪౪॥

ఈభూమి పూర్వమందు పృథుచక్రవర్తిది గావున బిమ్మట నెందరో ప్రభుత్వము నీభూమికిజేసినను పూర్వవృత్తాంతజ్ఞులు పృథునిభార్యయే యీపృథ్వియని దెలియుచున్నారు ఎవడు ముందుగా మొళ్లుత్రవ్వించి మడిగా గట్టించెనో యామడివాడిదని యంటున్నారు ఆలాగునే మొందుగామృగముమీదబాణము నెవడేసెనో పిమ్మట నామృగము నెందరుగొట్టిన నామృగము మొదటగొట్టినవానిదే యగుచున్నది యందురు ఇట్లగుట నాదిని వివాహమైనవాడా స్త్రీకి స్వామిగావున దానియందన్యుని వలన గర్భోత్పత్తియైన నాఫలమా వివాహమైన వానిదేయగుచున్నది గాని పుట్టించిన వానిదిగాదు॥ ౪౪॥

మూ॥ ఏతావానేవ పురుషో యజ్జాయాత్మా ప్రజేతిహ ।
విప్రాః ప్రాహు స్తథాచైత ద్యోభర్తా సాస్మృతాంగనా॥౪౫॥

ఒకడు పురుషుడుగాడు మరేమంటె భార్యస్వదేహము సంతానము న్నదే యీపరిమాణముగలవాడు పురుషుడగుచున్నాడు ఇందుకు వాజసనేయబ్రాహ్మణ

శ్రు॥ "శ్రు॥ అర్ధోహవా ఏషఆత్మన స్తస్మాద్యజ్జాయాం నవిందతె నైతావత్ప్రజాయతే అసర్వోహితావద్భవతి- అథయదైవజాయాంవిందతేఽథప్రజాయతె తర్హిసర్వోభవతి॥" ఈపురుషుడు తనలో సగము భార్యగావున భార్యనెవడొందడో వాడుసంతానవంతుడు కాలేడు గావున పూర్ణుడుగాడు యెప్పుడుభార్యనర్ధశరీరమునుగాగ్రహించునో యప్పుడు సంతానమునుగనునప్పుడు పూర్ణుడగుచున్నాడని వేదవేత్తలు చెప్పుచున్నారు భర్తయేభార్యయునగునని తెలియుచున్నారు గావునభార్యయందు బుట్టినయపత్యము భర్తదేయగుచున్నది దంపతులిరువురు నొక శరీరమే గావున॥ ౪౫॥

మూ॥ ననిష్క్రయ విసర్గాభ్యాం భర్తుర్భార్యా విముచ్యతే ।
ఏవం ధర్మం విజానీమః ప్రాక్ప్రజాపతినిర్మితం॥ ౪౬॥

అమ్మివేసినను విడిచిపెట్టినను వీటిచేత భర్తకుభార్యగాకపోదు ఇట్లుపూర్వమందు మనువుచే జెప్పబడెను ఇది నిత్యమైన ధర్మమని తలుచుచుంటున్నాము గావున నొకనిభార్యను కొనుట మొదలగువాటిచే స్వాధీనపరుచుకొనిదానియందుగనిన సంతానపుత్రుడు క్షేత్రిదే గాని బీజిదిగాదు॥ ౪౬॥

మూ॥ సకృదంశో నిపతతి సకృత్కన్యా ప్రదీయతే ।
సకృదాహ దదానీతి త్రీణ్యేతాని సతాంసకృత్॥ ౪౭॥

పితృభ్రాత్రాదిధనవిభాగము ధర్మమువలననొకసారేయగుచున్నదిగానిమరల తిరగదు పిత్రాదులచే నన్యునకొకమారివ్వబడిన కన్యమరల మరియొకని కీబడదు ఒకనిచే కన్యయొకనికివ్వబడి యదిపిత్రాదులకు దొరికినను దానియందన్యునివలనబుట్టిన సంతానమాబీజికిగానేరదన్నేనిమిత్త మీయుపన్యాసము కన్యావ్యతిరిక్తముగునేవస్తువులైన నిచ్చెదనని యొకనితోననిమరల నన్యునకీబడదు ఈమూడునుసాధుజనులచేనొకమారేయగుచున్నవి కన్యాదానమొకమారె గావలయుననునది ప్రకృతము ప్రసంగమువలనదాయవిభాగమున్ను ఇతరవస్తువులదానము నొకమారె గావలయుననుటచే కన్యాదానమవశ్యమొకమారేయనునట్టు యర్థముకొరకు వేరేచెప్పబడెను॥ ౪౭॥

మూ॥ యథాగోశ్వోష్ట్రదాసీషు మహిష్యజావికాసుచ।

నోత్పాదకః ప్రజాభాగీ తథైవా న్యాంగనాస్వపి॥ ౪౮॥

పరకీయములగు గోవులు నశ్వములు వష్ట్రములు దాసీలు గేదెలు మేకలుగొఱ్ఱె లు మొదలగువాటియందు స్వవృషభాదులచే జతగట్టించినవాని కావత్సలయందు హక్కులేదాలాగుననే పరకీయయందుబుట్టించిన సంతానమాబీజిదికాదు॥ ౪౮॥

మూ॥ యే క్షేత్రిణో బీజవంతః పరక్షేత్ర ప్రవాపినః।

తేవైసస్యస్యజాతస్య నలభంతె ఫలంక్వచిత్॥౪౯॥

ఒకనిభూమిలోనొకడు వి త్తనమువేసెనేనియాధాన్యాదిఫలము భూమిస్వామి దిగాక బీజస్వామికేదేశమందునైన లభించలేదుగదా యని ప్రకృతసంతాన విష యమై దృష్టాంతమిది॥ ౪౯॥

మూ॥ యదన్యగోషు వృషభో వత్సానాం జనయేచ్ఛతం।

గోమినామేవతెవత్సా మోఘస్కందితమార్షభం॥ ౫౦॥

ఒకనిగోవులలో నొకనివృషభముపోలి నూరుపిల్లలను బుట్టించిన నాపెయ్యా లాగోవులుగలవానివేగాని వృషభస్వామికివాటిహక్కులేదు వీనివృషభముయొక్క రేతఃపాతము వ్యర్థమైపోవుచున్నది "యథాగోశ్వోష్ట్రదాసీషు॥" యనుశ్లోకమం దు చెప్పబడినను మరలదీనిచెనిచ్చుటబీజికి సంతానపుహక్కులేదనుటకు దృష్టాంత ముగావున పునరుక్తిలేదు॥ ౫౧॥

మూ॥ తథైవాక్షేత్రిణోబీజం పరక్షేత్ర ప్రవాపినః।

కుర్వంతిక్షేత్రిణామర్థం నబీజీలభతేఫలం॥ ౫౧॥

ఎట్లుగోవులుమొదలగువాటి గర్భఫలమో యట్లనే సంతానములేనివాడు పర భార్యయందుగనినసంతానరూపఫలముక్షేత్రిదిగాని బీజికిలేదు॥ ౫౧॥

మూ॥ ఫలంత్వనభిసంధాయ క్షేత్రిణాం బీజినాంతథా।

ప్రత్యక్షం క్షేత్రిణామర్థో బీజాద్యోనిగరీయసీ॥ ౫౨॥

ఈస్త్రీయందుబుట్టిన సంతానరూపఫలము మనకుభయులకు నగుననెడి నియ మములేకుండెనేని యాఫలమునిస్సందేహముగ క్షేత్రికేయగుచున్నది ఈచెప్పబడి

గరీతిచే బీజముకంటె యోనిబలిష్ఠమైనది॥ ౫౨॥

మూ॥ క్రియాభ్యుపగమాత్త్వేత ద్బీజార్థం యత్ప్రదీయతే।
తస్యేహభాగినౌదృష్టౌ బీజీక్షేత్రిక ఏవచ॥ ౫౩॥

దీనియందేసంతానము గలిగినను మనకుభయులకు నాసంతానమందు హక్కు గునని నిర్ణయించుకొని క్షేత్రితనక్షేత్రము బీజార్థము బీజస్వామి కప్పగించెనేని యాసంతానమందుభయులకును హక్కుగలుగును॥ ౫౩॥

మూ॥ ఓఘవాతాహృతం బీజం యస్య క్షేత్రే ప్రరోహతి।
క్షేత్రికస్యైవ తద్బీజం నవప్తాలభతేఫలం॥ ౫౪

ప్రవాహవేగముచేగాని గాలిచేగాని పరక్షేత్రమునుంచి బీజమొకని క్షేత్రము లోబడి ఫలించినఫలమా క్షేత్రిదేగాని బీజవప్తకెట్టుగాలేదో పరభార్యయందు స్వభార్యాభ్రమచే బీజమునుంచెనేని వానికాసంతానపు హక్కులేక కళత్రవంతునికే యగుచున్నది॥ ౫౪॥

మూ॥ ఏషధర్మోగవాశ్వస్య దాస్యుష్ట్రాజావికస్యచ।
విహంగమహిషీణాంచ విజ్ఞేయః ప్రసవంప్రతి॥ ౫౫

గోవు అశ్వము దాసి యుష్ట్రము మేక గొర్రె పక్షి గేదె వీటియొక్క సంతతి గవాదిస్వామికేగాని వృషభాదిస్వామికి హక్కులేదని యిట్లు వ్యవస్థచేయబడెను మొదట సత్యమయిన నియమముచేసుకొనిరేని యుభయులకును హక్కుగలుగును॥

మూ॥ భ్రాతుర్జ్యేష్ఠస్య భార్యాయాం గురుపత్న్యనుజస్యసా।
యవీయసస్తు యా భార్యా స్నుషా జ్యేష్ఠస్యసాస్మృతా॥ ౫౭

జ్యేష్ఠభ్రాతయొక్క భార్య కనిష్ఠభ్రాతకు గురుపత్నివంటిది తమ్మునిభార్యవాని యన్నకు కోడలువంటిది యనిమునులచేచెప్పబడెను॥ ౫౭॥

మూ॥ జ్యేష్ఠోయవీయసో భార్యాం యవీయాన్వాగ్రజస్త్రియం।
పతితౌభవతోగత్వా నియుక్తావప్యనాపది॥ ౫౮

అన్నదమ్ములన్యోన్యభార్యలతో సంతానాభావరూపమగు నాపదలేనప్పుడు ని

యుక్తులయినప్పటికి భోగించిరేని పతితులగుచున్నారు॥ ౫౮॥

మూ॥ దేవరాద్వా సపిండాద్వా స్త్రియాసమ్యఙ్నియుక్తయా।
ప్రజేప్సితాధిగంతవ్యా సంతానస్య పరిక్షయే॥ ౫౯

సంతతిలేనప్పుడు మరిదివలనగాని మరియొక సపిండుని వలనగాని ఘృతాక్తాదినియమయుక్తముగ పత్యాదులచే నియుక్తయగుచు స్త్రీపుత్రునిగనవచ్చునుశ్లోకములోనున్న యీప్సితశబ్దవిశేషణసామర్థ్యమువలన కార్యాక్షమపుత్రోత్పత్తి యయ్యేనేని పునర్గమనము దోచుచున్నది॥ ౫౯॥

మూ॥ విధవాయాం నియుక్తస్తు ఘృతాక్తో వాగ్యతో నిశి।
ఏకముత్పాదయేత్పుత్రం నద్వితీయం కథంచన॥ ౬౦

విధవాయామనుటచే నపత్యోత్పాదనమునకు యోగ్యుడైన భర్తలేనిస్త్రీయందనితాత్పర్యము పతిబ్రతికియుండిన నట్టిస్త్రీ రాత్రియందు నెయ్యి శరీరమంతటను రాసుకొని మౌనియైనియుక్తుడగు పురుషుడొకపుత్రుని గలుగజేయవలెను రెండవ పుత్రునెట్లైనంగనదగదు॥ ౬౦॥

మూ॥ ద్వితీయమేకే ప్రజనం మన్యంతే స్త్రీషు తద్విదః।
అనిర్వృతం నియోగార్థం పశ్యంతో ధర్మతస్తయోః॥ ౬౧॥

మరికొందరు పెద్దలు పుత్రోత్పాదనవిధిజ్ఞులు ఒకకొడుకుగలవాడు కొడుకు లేనివంటివాడేయను లోకవాదమునుబట్టి నియోగప్రయోజనఫలమును దెలుసుకొన్నవారగుచు స్త్రీలయందు రెండవపుత్రుని కూడా గలిగించుట ధర్మమనిదలచుచున్నారు॥ ౬౧॥

మూ॥ విధవాయాం నియోగార్థే నిర్వృత్తే తు యథావిధి।
గురువచ్చ స్నుషావచ్చ వర్తేయాతాం పరస్పరం॥ ౬౨

నియుక్తయగు విధవయందు నియోగప్రయోజనము గర్భధారణము నిష్పన్నమయినపిమ్మట నాభావగారియందామరదలు గురుభావనగానున్ను భావగారామరదలియందు కోడలిభావనయును గలిగి వర్తించవలెను॥ ౬౨॥

మూ॥ నియుక్తౌయౌవిధింహిత్వా వర్తేయాతాంతుకామతః।
తావుభౌపతితౌస్యాతాం స్నుషాగగురుతల్పగౌ॥౬౩॥

తమ్ముని భార్యయందన్నయే గాని యన్నభార్యయందు తమ్ముడే గాని నియుక్తులై నెయ్యిగాను సుసేవనము మొదలగు విధిని విడిచి యథేచ్ఛగా కామవశంచే భోగించిరేని వారు స్నుషాగమనగురుతల్పగామి దోషములనొందె పతితులగుదురు॥ ౬౩॥

మూ॥ నాన్యస్మిన్విధవానారీ నియోక్తవ్యాద్విజాతిభిః।
అన్యస్మిన్హి నియుంజానా ధర్మంహన్యుస్సనాతనం॥౬౪॥

ఇట్లు నియోగమును జెప్పి దీనిని దూషించుటకు చెప్పుచున్నాడు-బ్రాహ్మణాదిద్విజులచే విధవయగు స్త్రీ భర్తృకంటె నన్యుడగు దేవరాదిపురుషునందు నియోగించదగదు నియోగించినవారు సనాతనమగు నేకపత్నీవ్రతధర్మమును నశింపజేయుచున్నారు॥౬౪॥

మూ॥ నోద్వాహికేషుమంత్రేషు నియోగః కీర్త్యతేక్వచిత్।
నవివాహవిధావుక్తం విధవావేదనంపునః॥ ౬౫॥

అర్యమణంన్నుదేవ త్యాది వైవాహికమంత్రములందు నే శాఖలోనున్న నియోగవిధి జెప్పలేదు వివాహవిధియందనగా తద్విధాయకశాస్త్రమందు స్త్రీకి పునర్వివాహమెచ్చటనైనం జెప్పబడలేదు॥ ౬౫॥

మూ॥ అయంద్విజైర్హి విద్వద్భిః పశుధర్మోవిగర్హితః।
మనుష్యాణామపిప్రోక్తో వేనేరాజ్యంప్రశాసతి॥ ౬౬॥

ఇది పశుధర్మము గావున మనుష్యులకున్ను దగదని విద్వాంసులగు బ్రాహ్మణులచే నిందించబడెను మున్ను వేనుడనే రాజు పుడమినేలునప్పుడా పాపకర్ముడీయధర్మమును బ్రవర్తింపజేసెనట యంతనుండి స్త్రీయిది ప్రబలెను॥ ౬౬॥

మూ॥ స మహీమఖిలాంభుంజన్ రాజర్షిప్రవరఃపురా।
వర్ణానాంసంకరంచక్రే కామోపహతచేతనః॥ ౬౭॥

మున్ను వేనుడను రాజు సర్వభూమండలము నేలుచు నంతమాత్రముచేతనే రాజర్షి ప్రవరుడని చెప్పబడెను గాని ధర్మము చేగాదు యతడు కామోపహతమగు బుద్ధిగలవాడై భ్రాతృభార్యాగమనరూపమగు వర్ణసంకరమును బ్రవర్తింపజేసెను॥ ౬౭॥

మూ॥ తతః ప్రభృతియో మోహాత్ ప్రమీతపతికాం స్త్రియం।
నియోజయత్యపత్యార్థం తం విగర్హంతి సాధవః॥ ౬౮॥

ఆ వేనుడు మొదలుకొని యెవడు శాస్త్రార్థాజ్ఞానముచే విధవగాని సధవగాని యగు స్త్రీని సంతానార్థమై దేవరాదులయందు నియోగించునో వానిని సజ్జనులు నిందించుచున్నారు ఇది మన్వుక్త నియోగనిషేధము కలియుగవిషయము॥ "శ్లో॥ ఉక్తా నియోగా మనునా నిషిద్ధాస్స్వయమేవతు। యుగక్రమాదశక్యోయం కర్తుమన్యైర్విధానతః॥ తపోజ్ఞానసమాయుక్తాః కృతత్రేతాయుగేనరాః। ద్వాపరేచకలౌనౄణాం శక్తిహానిర్హినిర్మితా॥ అనేకధాకృతాః పుత్రా ఋషిభిశ్చపురాతనైః। నశక్యంతేధునాకర్తుం శక్తిహీనైరిదంతనైః॥" మనువు నియోగములను చెప్పి స్వయముగా నిషేధించెను యుగక్రమముచే నావిధానముగ చేయుటకన్యులకు శక్యముగాదు కృతత్రేతాద్వాపర యుగములందు తపస్సును జ్ఞానమును గలిగినవారలుండిరి కలియుగమందు మనుష్యులకు శక్తిహీనత నిర్మించబడెను పురాతనులగు ఋషులనేకప్రకారముగా పుత్రులను జెప్పిరి యట్లు జేయుటకిప్పటివారు శక్తిహీనులుగావున సమర్థులుగారని బృహస్పతివచనము॥ ఇచట గోవిందరాజు యుగవ్యవస్థజేయక నెప్పుడైనను నియోగపక్షముకంటె ననియోగపక్షము మంచిదనివ్రాసెను దీనిని మునిమతము గాదని కుల్లూకభట్టు ఖండించి యొకశ్లోకము వ్రాసెను॥ "శ్లో॥ ప్రాయశో మనువాక్యేషు మునివ్యాఖ్యానమేవహి। నాపరాధోస్తివిదుషాం క్వాహం సర్వవిదః కుధీః॥" తరుచుగా మనువాక్యములందు మునులస్మృతులే వ్యాఖ్యలు సర్వవేత్తలారా స్వల్పబుద్ధిగల నేనొకడ గావున విద్వాంసులకు నేనపరాధినిగాను అని కుల్లూకభట్టు॥ ౬౮॥

మూ॥ యస్యా మ్రియేత కన్యాయా వాచా సత్యే కృతే పతిః।
తామనేన విధానేన నిజో విందేత దేవరః॥ ౬౯॥

వాగ్దానానంతరమందే కన్యకు భర్తపోవునో యాకన్యనీ చెప్పబోయెడి విధానముచే తద్భర్తృసోదరుడు వివాహముగావలెను॥ ౬౯॥

మూ॥ యథావిధ్యధిగమ్యైనాం శుక్లవస్త్రాం శుచివ్రతాం।
మిథోభజేతాప్రసవాత్సకృత్సకృదృతావృతౌ॥ ౭౦

ఆమత్రికి వివాహవిధిచే నీకన్యను పరిగ్రహించి శుక్లవస్త్రయు మనోవాక్కా యశుద్ధయునగు దానిని ఋతువున కొకరాత్రియందు గర్భధారణముదనుక సహ స్యముగ బొందవలెనుని యోగమువల్లనున్న క్రమమైనవివాహముగాకపోవుటవల్లను న్ను గమనమందు నియమోపదేశము వల్లనున్న యాకన్యకుబుట్టిన సంతానము వాగ్దానమెవనికాయెవనిదానికగుచున్నది॥ ౭౦॥

మూ॥ నదత్వా కస్య చిత్కన్యాం పునర్దద్యా ద్విచక్షణః ।
దత్వాపునః ప్రయచ్ఛన్హి ప్రాప్నోతి పురుషానృతం॥ ౭౧॥

ఒకనికి కన్యనిచ్చెదనని వాగ్దానమొనర్చిన పిమ్మట నావరుడు మృతుడయ్యేనేని యాకన్యనన్యునికిచ్చెనేని॥ "శ్లో॥ సహస్రం పురుషానృతె" యనునట్టి లక్షణముగల దోషము నతడు బొందును సప్తపదిగాకుండుటచే భార్యాత్వానిష్పత్తివలన పునర్దానాశంకపోడమును గాన నీవచనము॥ ౭౧॥

మూ॥ విధివ త్ప్రతిగృహ్యాపి త్యజే త్కన్యాం విగర్హితాం ।
వ్యాధితాం విప్రదుష్టాంవా ఛద్మనా చోపపాదితాం॥ ౭౨॥

ఈశ్లోకను వద్దినుంచి యీవదధ్యాయనును గోవిందరాజు వ్యాఖ్యలేదు- "అద్భిరేవద్విజాగ్య్రాణా"మను విధిచే ప్రతిగ్రహించిన్నై దుర్వ్యలక్షణములతో గూడినట్టియు అచికిత్సితరోగిణియు క్షతయోనిత్వాదిదుష్టయు నధికాంగాదిగోపనఛద్మోపపాదితయునగునట్టి దానిని దెలిసెనేని యాకన్యను సప్తపదీకరణముకంటె పూర్వమందట్లు దెలిసి త్యజించవలెను అందువలన దోషములేదనుట మాత్రము కొరకీశ్లోకముగానివిడిచిపెట్టుమని విధికొరకుగాదు॥ ౭౨॥

మూ॥ యస్తుదోషవతీం కన్యా మనాఖ్యాయోపపాదయేత్ ।
తస్యతద్వితథంకుర్యాత్ కన్యాదాతుర్దురాత్మనః॥ ౭౩॥

ఎవడు కన్యకుగల రోగాదిదోషములను చెప్పక వరునికిచ్చునో దురాత్ముడగు నాకన్యాదాతయొక్క దానము ఆకన్యవారవరుడు తిరిగ యిచ్చివేయుటచే వ్యర్థమగుచున్నది యిదిన్ని త్యాగమందు దోషము లేదని చెప్పుట కొరకే॥ ౭౩॥

మూ॥ విధాయ వృత్తింభార్యాయాః ప్రవసేత్కార్యవాన్నరః।
అవృత్తికర్శితాహిస్త్రీ ప్రదుష్యేత్ స్థితిమత్యపి॥ ౭౪॥

పురుషుడు కార్యగౌరవముచే దేశాంతరమునకుబోవుచో భార్యకు గ్రాసాచ్ఛాదనాదికమును సమకూర్చిపోవలెను వృత్తికర్శితయగు స్త్రీ శీలవతియైనను పరపురుషసంపర్కదోషమును బొందును॥ ౭౪॥

మూ॥ విధాయ ప్రోషితే వృత్తిం జీవేన్నియమ మాస్థితా।
ప్రోషితేత్వవిధాయైవ జీవేచ్ఛిల్పై రగర్హితైః॥౭౫॥

అన్నమునకు బట్టకు తగినద్రవ్యమునిచ్చి భర్త దేశాంతరమునకు బోయెనేని దేహాలంకారము పరగృహగమనము లేకుండ భార్యజీవించవలెను వృత్తికిద్రవ్యము నివ్వకబోయెనేని నింద్యములుగాని పనులుకుట్టు మొదలయినవాటిచే జీవించవలెను॥

మూ॥ ప్రోషితో ధర్మకార్యార్థం ప్రతీక్ష్యోష్టౌ నరస్సమాః।
విద్యార్థం షడ్యశోర్థంవా కామార్థం త్రీంస్తు వత్సరాన్॥౭౬॥

గురుకార్యములను సాధించడము మొదలగు ధర్మార్థము పతిపరదేశగతుడయ్యెనేని యెనిమిది సంవత్సరములు పతిరాకట ప్రతీక్షించి యాపైని పతివద్దికి భార్యపోవలెను- ఇందుకు వసిష్ఠవచనము॥ "సూ॥ ప్రోషితపత్నీ పంచవర్షాణ్యుపాసీత ఊర్ధ్వం పతిసకాశం గచ్ఛేత్" పరదేశగతుడగు వానిభార్య యైదువర్షములు ప్రతీక్షించి యాపైని భర్తవద్దికిబోవలెనని- విద్యార్థమై ప్రోషితుడయ్యెనేని యారువర్షములు తనవిద్యను బ్రకటించి కీర్తినార్జించుటకు బోయినను షడబ్దము లే భార్యాంతరభోగమును తగిలి రాకుండిన మూడు వర్షములు ప్రతీక్షించవలెను॥ ౭౬॥

మూ॥ సంవత్సరం ప్రతీక్షేత ద్విషంతీం యోషితం పతిః।
ఊర్ధ్వం సంవత్సరాత్త్వేనాం దాయంహృత్వా నసంవసేత్॥౭౭॥

పతిని ద్వేషించిన భార్యను పెనిమిటి యొకసంవత్సరము ప్రతీక్షించి యాపైని ద్వేషము మానకుండెనేని దానుంచిన యలంకారాదికమును బుచ్చుకొనిదానిదగ్గిరికి వెళ్లకుండవలెను గ్రాసవాసస్సులను మాత్రము గడపవలెను॥ ౭౭॥

మూ॥ అతిక్రామేత్ప్రమత్తంయా మత్తం రోగార్త మేవవా।
సా త్రీన్ మాసాన్ పరిత్యాజ్యా విభూషణ పరిచ్ఛదా॥౭౮॥

ఏ స్త్రీ ద్యూతాదికముచే ప్రమాదముగలవానిన్ని బంధుమొదలయిన వాటిని ద్రాగుటచే మత్తుడగువానిన్ని రోగయుక్తునిన్ని శుశ్రూషాదికము జేయక యవమానించునో యా స్త్రీని యలంకారశయ్యాదిరహితురాలినిగాజేసి మూడుమాసములు దానిని బొందకుండవలెను॥ ౭౮॥

మూ॥ ఉన్మత్తం పతితం క్లీబ మబీజం పాపరోగిణం।
న త్యాగో౽స్తి ద్విషంత్యాశ్చ నచ దాయాపవర్తనం॥ ౭౯॥

వాతాదివికారముచే చిత్తవిభ్రమము గలుగునట్టియు నపుంసకుడైనట్టియు ఏదైనా బాధచే రేతోరహితుడైనట్టియు కుష్ఠాదిరోగయుక్తుడగునట్టియు పురుషున కుపచారముజేయని భార్యయొక్క పరిత్యాగముగాని యలంకారాదులను పుచ్చుకోవడముగాని కూడదు॥ ౭౯॥

మూ॥ మద్యపా౽సాధువృత్తా చ ప్రతికూలాచ యాభవేత్।
వ్యాధితావాధివేత్తవ్యా హింస్రార్థఘ్నీచ సర్వదా॥ ౮౦॥

మద్యపానమొనర్చునదియు దురాచారముగనుండునదియు భర్తకుప్రతికూలాచరణముగలదికుష్ఠాదిరోగయుక్తురాలున్నత్యాదులనుకొట్టుచున్నదియుసంతతము నధికవ్యయమొనర్చునదియు నగుభార్యయుంటుండగా నన్యాంగనను వివాహము జేసుకొనవలెను॥ ౮౦॥

మూ॥ వంధ్యాష్టమే౽ధివేద్యాబ్దే దశమేతుమృతప్రజా।
ఏకాదశేస్త్రీజననీ సద్యస్త్వప్రియవాదినీ॥ ౮౧॥

ప్రథమఋతువు మొదలుకొని సంతానములేకుండెనేని యెనిమిదివర్షములున్ను స్త్రీసంతానము మాత్రమేకలిగున్నచో బదివర్షములున్ను సంతానముకలిగనశించుచుండెనేని పదాకొండు వర్షములున్ను ప్రతీక్షించియాభార్యయుండగానేమరలవివాహముగావచ్చును భార్య యప్రియము లాడుచున్న నప్పుడెమరొక దానినివివాహముగావచ్చును॥ ౮౧॥

మూ॥ యారోగిణీస్యాత్తుహితా సంపన్నాచైవశీలతః।
సానుజ్ఞాప్యాధివేత్తవ్యా నావమాన్యాచకర్హిచిత్॥ ౮౨॥

ఏస్త్రీశీలసంపన్నయు హితయునై రోగవతియైతె నా స్త్రీయనుజ్ఞ చేత పున ర్వివాహముజేసికొనవలెను॥ ౮౨॥

మూ॥ అధివిన్నాతుయానారీ నిర్గచ్ఛేద్రుషితాగృహాత్।
సాసద్యస్సన్నిరోద్ధవ్యా త్యాజ్యావాకులసన్నిధౌ॥ ౮౩॥

ఏస్త్రీ తానుండగా భర్త మరల వివాహముజేసికొనెనని కోపించి గృహమువ దిలిపయికిబోయెనేని త్రాడుతో నాకోపము బోవుదనుక కట్టిపెట్టవలెను లేదా బుట్టినింటివారిసన్నిధినివిడువవలెను॥ ౮౩॥

మూ॥ ప్రతిషిద్ధాపి చేద్యాతు మద్యమభ్యుదయేష్వపి।
ప్రేక్షాసమాజం గచ్ఛేద్వాసాదండ్యా కృష్ణలానిషట్॥ ౮౪॥

క్షత్రియాదిస్త్రీలెవ్వరైన భర్త్రాదులచే నిషేధింపబడియు నుత్సవాదులయం దైనను నింద్యమగుమద్యమునుద్రావెనేనియు నాట్యాదిసమాజములతో బోయెనేని యునట్టిస్త్రీలకు కృష్ణలములారురాజుదండమువిధించవలెను॥ ౮౪॥

మూ॥ యదిస్వాశ్చాపరాశ్చైవవిందేరన్ యోషితోద్విజాః।
తాసాంవర్ణ క్రమేణస్యా జ్జ్యేష్ఠ్యంపూజాచ వేశ్మచ॥ ౮౫॥

ద్విజులుసజాతీయలను గాని విజాతీయలనుగాని వివాహమయిరేని వారికి వర్ణ క్రమముచే మాటలచేనగు మన్ననలును వస్త్రాలంకారాదులిచ్చుట యందును గృహములగట్టించుటయందును జ్యేష్ఠ్యమును విచారించవలెను॥ ౮౫॥

మూ॥ భర్తుశ్శరీర శుశ్రూషాం ధర్మకార్యంచ నైత్యకం।
స్వాచైవకుర్యా త్సర్వేషాం నాస్వజాతిః కథంచన॥ ౮౬॥

భర్తయొక్క శరీరశుశ్రూషయనగా నన్నపానాదులసమకూర్చుటయును ని త్యమునగు నగ్నిహోత్రార్థద్రవ్యసంఘటనావిధిపూజాదిధర్మముల నొనర్చుట యును ద్విజులకందరికి సజాతీయయగుభార్యయె జేయవలెను గాని విజాతీయ జేయ రాదు॥ ౮౬

మూ॥ యస్తుతత్కారయేన్మోహా త్సజాత్యాస్థితయాన్యయా।

యథా బ్రాహ్మణచండాలః పూర్వదృష్ట స్తథైవసః॥ ౮౭॥

ఏబ్రాహ్మణుడు సజాతీయయగు భార్యదగ్గిరనుంటుండగాను మౌఢ్యముచే విజాతీయయగుభార్యచే శరీరశుశ్రూషయు ధర్మకార్యసహాయమును జేయించునో ని వాడు బ్రాహ్మణస్త్రీయందు శూద్రునివలనబుట్టినవాడు చండాలుడెట్టివాడో యట్టిబ్రాహ్మణచండాలుడగుచున్నాడు॥ ౮౭॥

మూ॥ ఉత్కృష్టాయాభి రూపాయ వరాయా సదృశాయచ।
అప్రాప్తామపితాంతస్మై కన్యాందద్యా ద్యథావిధి॥ ౮౮॥

కులాచారాదులచే నుత్కృష్టుడును సురూపుడును సజాతీయుడగువరుడు తటస్థించినప్పుడు వివాహమునకు ఈడు రాకుండినను॥ "సూ॥ వివాహమేదష్టవర్షా మేవంధర్మో నహీయతే।" యనుదక్షస్మృతివలన నాకాలమునకు లోపలనైన బ్రాహ్మణవిధిచే వివాహముజేయవలెను॥ ౮౮॥

మూ॥ కామమామరణా త్తిష్ఠే ద్గృహే కన్యర్తుమత్యపి।
నచైవైనాం ప్రయచ్ఛేత్తు గుణహీనాయకర్హిచిత్॥ ౮౯॥

విద్యాగుణాదిహీనుడగు వరునకిచ్చుటకంటె నామరణాంతముగ కన్యఋతుమతియైనప్పటికి పితృగృహమందేయుండవలెను॥ ౮౯॥

మూ॥ త్రీణివర్షాణ్యుదీక్షేత కుమార్యృతుమతీసతీ।
ఊర్ధ్వంతుకాలా దేతస్మా ద్విందేత సదృశంపతిం ౯౦॥

పిత్రాదులచే గుణవంతుడగు వరునకీబడకుండెనేని ఋతుమతియైనదిమొదలు మూడేండ్లు ప్రతీక్షించి సజాతీయుడగు వరునాకన్యస్వయముగావరించవలెను॥ ౯౦॥

మూ॥ అదీయమానా భర్తార మధిగచ్ఛే ద్యదిస్వయం।
నైనఃకించి దవాప్నోతి నచయం సాధిగచ్ఛతి॥ ౯౧॥

పిత్రాదులచే వరునకివ్వబడని కన్యక యుక్తకాలమందు స్వయముగా వరించెనేని యాకన్యకగాని వరుడుగాని యించుకైనంబాపమునొందరు॥ ౯౧॥

మూ॥ అలంకారం నాదదీత పిత్ర్యం కన్యా స్వయంవరా।

మాతృకం భ్రాతృదత్తంవా స్తేనాస్యా ద్యదితంహరేత్॥౯౨॥

తనంతటతాను పరునివరించినకన్యక పూర్వమందు తల్లి మొదలగువారిచే నీబడినయలంకారమును వారికిచ్చివెయ్యవలెను యట్లివ్వకుండిన చోరురాలగును॥౯౨॥

మూ॥ పిత్రేనదద్యా చ్ఛుల్కంతు కన్యామృతుమతీంహరన్।
సహిస్వామ్యా దతిక్రామే దృతూనాం ప్రతిరోధనాత్॥౯౩॥

రజస్వలయైనపిమ్మట కన్యను వివాహమయ్యేవరుడు దానితండ్రికి శుల్కమీరాదు ఋతుకార్యమగు నపత్యోత్పత్తినిరోధ మాతండ్రివల్లనయ్యెనుగావున నతడు స్వామిత్వమువలన హీనుడగుచున్నాడు॥ ౯౩॥

మూ॥ త్రింశద్వర్షో వహేత్కన్యాం హృద్యాం ద్వాదశవార్షికీం।
త్ర్యష్టవర్షోష్ట వర్షాంవా ధర్మేసీదతి సత్వరః॥౯౪॥

ముప్పదేండ్లపురుషుడు పదిరెండువత్సరముల యీడుగల మనోహరాకృతిగలకన్యకనున్ను గార్హస్థ్యధర్మము బోకుండ త్వరగలవాడయితే యిరువదినాల్గు వర్షములుగలవాడెనిమిదేండ్లుగలదానినిన్ని వివాహముగావలెను ఇదిన్ని యోగ్యకాలప్రదర్శనార్థముగాని నియమార్థముగాదు తరుచుగా పురుషునివయస్సులో మూడవభాగమీడుగలకన్యను వివాహముగావలెనని యోగ్యతను తెలియజేసెను "సత్వరః" యనుదానికర్థమునుపకుర్వాణుడు వేదముజదివి వివాహమునకాలస్యముగాకూడదని॥ ౯౪॥

మూ॥ దేవదత్తాం పతిర్భార్యాం విందతే నేచ్ఛయాత్మనః।
తాం సాధ్వీం బిభృయాన్నిత్యం దేవానాం ప్రియమాచరన్॥౯౫॥

శ్రు॥ "భగోర్యమాసవితాపురంధ్రిర్మహ్యంత్వాదుర్గార్హపత్యాయదేవాః" ఇత్యాదిమంత్రలింగమువలన దేవతలచేనివ్వబడినదానిని వరుడు పొందుచున్నాడు గాని స్వేచ్ఛచేగాదుగావున దేవతలచేనీబడినభార్యను గ్రాసవాసస్సులచే ద్వేషముండినను బోషించి దేవతలకుప్రీతిజేయవలెను॥ ౯౫॥

మూ॥ ప్రజనార్థం స్త్రియస్సృష్టా స్సంతానార్థంచ మానవాః।
తస్మాత్సాధారణోధర్మ శ్శ్రుతౌపత్న్యా సహోదితః॥౯౬॥

ఏహేతువచే గర్భధారణార్థము స్త్రీలుసృజించబడిరో మనుష్యులుసంతతి వృద్ధికై సృజించబడిరో యాహేతువుచే గర్భోత్పాదనమునుగూర్చి యీదంపతులకు గార్హ్యధర్మాదిధర్మము పత్నితోగూడనాధారణము॥ శ్రు॥ "శ్లో॥ మేవ సా నావగ్నినా దధీయాతా" మిత్యాదికము వేదమునందుచెప్పబడెను-గావున భార్య నుపోషించవలసినదని పూర్వశ్లోకమునకు శేషము॥ ౯౬॥

మూ॥ కన్యాయాం దత్తశుల్కాయాం మ్రియేతయది శుల్కదః।
దేవరాయ ప్రదాతవ్యా యదికన్యానుమన్యతే॥ ౯౭॥

కన్యకకుశుల్కమిచ్చి వివాహముగాకమునుపు వరుడుచనిపోతే కన్యకతండ్రిమొదలగువారిలాకన్యకయంగీకరించినట్టయితే మరిదికిచ్చేది॥ శ్లో॥ "యస్యామ్రియేత" ఇత్యాదిశ్లోకముచే పూర్వముచెప్పినప్రకారముగా నియోగరూపము ఇద్దైతెశుల్కగ్రహణవిషయము॥ ౯౭॥

మూ॥ ఆదదీతనశూద్రోపి శుల్కందుహితరం దదత్॥
శుల్కంహిగృహ్ణన్ కురుతేఛన్నందుహితృ విక్రయం॥ ౯౮॥

శాస్త్రానభిజ్ఞుడగు శూద్రుడైనను పుత్రికనిచ్చి శుల్కమునుపుచ్చుకొనరాదుశాస్త్రమునెరిగిన ద్విజులకుజెప్పనేల శుల్కమును గ్రహించడమన్నది గుప్తమైన దుహితృవిక్రయమె॥ "శ్లో॥ నకన్యాయాః పితా"త్యాదికముచే నిషిద్ధమగుశుల్కగ్రహణము॥ "శ్లో॥ కన్యాయామపిగృహీతశుల్కాయాః॥" మనుదానిచేశాస్త్రీయనియనుమానము కనపడుటవలన శుల్కగ్రహణమందుశాస్త్రీయత్వ శంకగలుగుచుండగానిషేధించబడుచున్నది॥ ౯౮॥

మూ॥ ఏతత్తునపరేచక్రుః నాపరే జాతు సాధవః।
యదన్యస్య ప్రతిజ్ఞాయ పునరన్యస్యదీయతే॥ ౯౯॥

ఇది పూర్వమందు శిష్టులెప్పుడును జేయలేదు వర్తమానమందును జేయుచుండలేదు కన్యనొకనికిచ్చెదననిమరియొకనికిచ్చుటయను నదేదిగలదోయది యగృహీతశుల్కకన్యావిషయము "నదత్వాకస్యచిత్కన్యా॥" మనునది గృహీతశుల్కకన్యావిషయము॥ ౯౯॥

మూ॥ నానుశుశ్రుమ జాత్వేత త్పూర్వేష్వపి హి జన్మసు।
శుల్కసంజ్ఞేన మూల్యేన ఛన్నం దుహితృవిక్రయం॥౧౦౦॥

పూర్వకల్పములందు నైనను శుల్కమనెడి మిషచేత ఛన్నమగు మూల్యముచేదుహితృవిక్రయమును సాధులు జేసిరని యెన్నడైనను వినలేదు ఇది శుల్కనిషేధార్థము॥ ౧౦౦॥

మూ॥ అన్యోన్యస్యావ్యభిచారో భవేదామరణాంతికః।
ఏష ధర్మస్సమాసేన జ్ఞేయస్స్త్రీపుంసయోః పరః॥ ౧౦౧॥

భార్యాభర్తలకు యావజ్జీవమును ధర్మార్థకామములందు పరస్పరావ్యభిచారముగావలెనను నిది స్త్రీపురుషులకు సంక్షేపమగు ధర్మము తెలియదగినది ఇటులగుచునుండగా॥ ౧౦౧॥

మూ॥ తథానిత్యం యతేయాతాం స్త్రీపుంసౌతు కృతక్రియౌ।
యథానాభిచరేతాంతౌ వియుక్తావితరేతరం॥ ౧౦౨॥

వివాహమైనపిమ్మట స్త్రీపురుషులు ధర్మార్థకామములం దొలాగునతిక్రమించకుండునో యట్లు ప్రయత్నమును జేయుచుండవలెను॥ ౧౦౨॥

మూ॥ ఏష స్త్రీపుంసయోరుక్తో ధర్మోవోరతిసంహితః।
ఆపద్యపత్యప్రాప్తిశ్చ దాయభాగం నిబోధత॥ ౧౦౩॥

ఇది భార్యాభర్తలయొక్క యితరేతరానురాగరూపధర్మమున్ను సంతానము లేకుండినేని యపత్యావాప్తియున్ను జెప్పబడెను యిటుపైని దాయమనగా పిత్రాదిధనము తద్విభాగవిషయమగు వ్యవస్థ చెప్పబడును వినుండు॥ ౧౦౩॥

మూ॥ ఊర్ధ్వం పితుశ్చ మాతుశ్చ సమేత్య భ్రాతరస్సమం।
భజేరన్ పైతృకంరిక్థ మనీశాస్తేహి జీవతోః॥ ౧౦౪॥

పితృమరణమయిన పిమ్మటనని విభాగహేతువును జెప్పుచున్నాడు అన్నదమ్ములందరును గలసి తలిదండ్రుల సంబంధమైన ధనమును సమముగా బంచికొనవలెను తండ్రియుండగాను వానియిచ్ఛచే విభాగము గావచ్చును। "శ్లో॥ విభాగంచేత్పి

నాకుర్యాదిచ్ఛయా పితా జ్యేష్ఠు తాన్।" తండ్రికి యిచ్ఛచే విభాగము నొనరించునేని పు
త్రులకు విభజించవచ్చునని యాజ్ఞవల్క్య॥ ౧౦౪॥

మూ॥ జ్యేష్ఠ ఏవ తు గృహ్ణీయాత్పిత్ర్యం ధనమశేషతః।
శేషాస్తముపజీవేయుర్యథైవ పితరం తథా॥ ౧౦౫

జ్యేష్ఠుడు ధార్మికుడయి నట్లాయెనా పిత్రార్జితమంతయును జ్యేష్ఠుడే పుచ్చుకొ
నవచ్చును దమ్ములందరును దండ్రినివలె నతని నాశ్రయించి గ్రాసాచ్ఛాదనాదుల
నొందుచు నందరుంగలసియుండి జీవించవలెను॥ ౧౦౫॥

మూ॥ జ్యేష్ఠేన జాతమాత్రేణ పుత్రీభవతి మానవః।
పితౄణామనృణశ్చైవ స తస్మాత్సర్వమర్హతి॥ ౧౦౬॥

పుత్రుడు పుట్టినమాత్రముచే వాడు సంసారి యగుచు తృప్తుడైనసని తాత్పర్యము పురు
షు పుత్రవంతుడగుచున్నాడు అందుకు- "శ్రు॥ నాపుత్రస్య లోకోస్తి యనియు ప్రజ
య్యా పితృభ్యః" యనియు శ్రుతులవలనను- "స్మృ॥ పుత్రేణ జాతమాత్రేణ పితౄ
ణామనృణశ్చ సః-" పుత్రుడు పుట్టుటమాత్రముచేత నే పితృఋణవిముక్తుడగుచున్నా
డు గావున జ్యేష్ఠుడే ధనమునకు హర్హుడగుచున్నాడు అతనికనుజులగువారు వానిమూల
చే వర్తించవలెను॥ ౧౦౬॥

మూ॥ యస్మిన్నృణం సన్నయతి యేన చానంత్యమశ్నుతే।
స ఏవ ధర్మజః పుత్రః కామజానితరాన్ విదుః॥ ౧౦౭॥

ఎవడు పుట్టగానే ఋణము వదిలెనో ఎవనిచే నమృతత్వము నొందెనో॥ "శ్రు॥
ఋణమస్మిన్ సమున్నయత్యమృతత్వంచ గచ్ఛతి। పితా పుత్రస్య జాతస్య పశ్యేచ్చేజ్జీ
వతో ముఖం-" ఈ పుత్రుడు పుట్టుచుండగా ఋణమువిడుచును పుట్టినపుత్రుని ముఖ
మును తండ్రి చూడడముతో యమృతమును బొందుచున్నాడనిశ్రుతి- మొదట పుట్టిన
వాడె ఋణాపనయనాద్యుపకారములను జేసెను గావున వాడే తండ్రికి ధర్మహే
తువచే బుట్టినవాడితరులందరును కామజులని మునులందురు గావున సర్వధనమును
జ్యేష్ఠుడే పుచ్చుకొనవలెను వానికే యీ విశేషము జెప్పబడెను॥ ౧౦౭॥

మూ॥ పితేవ పాలయేత్పుత్రాన్ జ్యేష్ఠో భ్రాతౄన్యవీయసః।

పుత్రవచ్చాపి వర్తేరన్ జ్యేష్ఠే భ్రాతరి ధర్మతః॥ ౧౦౮॥

జ్యేష్ఠుడు పుత్రులను తండ్రివలెను తమ్ములను గ్రాసాచ్ఛాదనాదులనిచ్చి పోషింపవలెను తమ్ములున్ను ధర్మముచే తండ్రియందువలెనన్నయందు భక్తితో వర్తింపవలెను॥ ౧౦౮॥

మూ॥ జ్యేష్ఠః కులంవర్ధయతి వినాశయతి వా పునః।
జ్యేష్ఠః పూజ్యతమో లోకే జ్యేష్ఠస్సద్భిరగర్హితః॥ ౧౦౯॥

విభక్తుడుగాని జ్యేష్ఠుడు గుణవంతుడయ్యెనేని సోదరులు తనననుసరించి గుణవంతులగుదురు గాన కులమును వృద్ధిబొందించును జ్యేష్ఠుడు దుష్టుడయ్యెనేని తమ్ములున్ను వారగుటచే కులమును నశింపజేయును గావున గుణవంతుడగు జ్యేష్ఠుడు లోకమందు పూజ్యతముడును సజ్జనులచే నగర్హితుడు నగుచున్నాడు॥ ౧౦౯॥

మూ॥ యో జ్యేష్ఠో జ్యేష్ఠవృత్తిస్స్యాన్మాతేవ స పితేవ సః।
అజ్యేష్ఠవృత్తిర్యస్తుస్యాత్స సంపూజ్యస్తు బంధువత్॥ ౧౧౦॥

ఏ జ్యేష్ఠుడు మంచివృత్తిలో సోదరులయందు తండ్రివలె నుండెనేని తమ్ములచే వాడు తల్లివలెనున్ను తండ్రివలెనున్ను మన్నించదగును వాడట్టివాడుగానిచో మాతులాదులగు బంధువులందునూవలెను గౌరవించుటమాత్రమె గావలెను॥ ౧౧౦॥

మూ॥ ఏవం సహ వసేయుర్వా పృథగ్వా ధర్మకామ్యయా।
పృథగ్వివర్ధతే ధర్మ స్తస్మాద్ధర్మ్యా పృథక్క్రియా॥ ౧౧౧॥

ఈప్రకారముగ నన్నదమ్ములు గలసియుండినను సరే ధర్మకామముచే విభక్తులయిరేని కావచ్చును విభక్తులయి వేర్వేరపంచమహాయజ్ఞాదుల నొనర్చుటచే ధర్మాభివృద్ధియగును గావున విభాగము గావలెను- ఇందుకు బృహస్పతి॥ "శ్లో॥ ఏకపాకేనవసతాం పితృదేవద్విజార్చనం । ఏకంభవే ద్విభక్తానాం తదేవస్యాద్గృహేగృహే॥" అన్నదమ్ములు గలసి యొకటే పాకమయగుచుండిన నొకటియే పితృదేవాతిథిపూజాదికమగును భిన్నపాకులయిరేని యందరి గృహములందున్ను నాధర్మము కావలెనని॥ ౧౧౧॥

మూ॥ జ్యేష్ఠస్య వింశఉద్ధార స్సర్వద్రవ్యాచ్చ యద్వరం।
తతోఽర్ధం మధ్యమస్య స్యాత్తురీయంతు యవీయసః॥ ౧౧౨॥

ఉద్ధారమనగా వేరుగా దీయబడినది సముదాయద్రవ్యములలో నిరువదింటిలోను
త్తమమగునది యిరువదియోవంతు పయికీదిని జ్యేష్ఠునకీవలెను మధ్యమునకునలుబ
దియోభాగమీవలెను కనిష్ఠునకెన్బదియోభాగమీవలెను- అయున్సగనమందరును
సమముగా పంచుకొనవలెను॥ ౧౧౨॥

మూ॥ జ్యేష్ఠశ్చైవ కనిష్ఠశ్చ సంహరేతాం యథోదితం ।
యేఽన్యే జ్యేష్ఠకనిష్ఠాభ్యాం తేషాంస్యాన్మధ్యమంధనం॥ ౧౧౩॥

జ్యేష్ఠకనిష్ఠులు పైనచెప్పిన ప్రకారము పుచ్చుకోవలెను మధ్యములెందరుండిన
ను వారిలో జ్యేష్ఠకనిష్ఠభాగములకంటెతక్కువలేకుండ నందరును సమముగా ప్రత్యేకముగ న
లుబదవభాగము చొప్పున బుచ్చుకోవలెను- మధ్యములలో విశేషములేనందు కీవచ
నము॥ ౧౧౩॥

మూ॥ సర్వేషాం ధనజాతానామాదదీతాగ్ర్యమగ్రజః ।
యచ్చసాతిశయం కించిద్దశతశ్చాప్నుయాద్వరం॥ ౧౧౪॥

ఆనికరములగు ద్రవ్యములలోనున్న ఏది శ్రేష్ఠమో దానిని జ్యేష్ఠుడు బుచ్చుకొ
నవలెను- "సూ॥ దశతః పశూనా"మని గోవులు మొదలగు పశుజాతములో పదిం
టికొకటి మంచిది జ్యేష్ఠుడు పుచ్చుకొనవలెనని గౌతముడు పదింటిలో నొకటి పు
చ్చుకోవలెనను పదిలేకనొకటియేయుంచిదుంటే అదియేజ్యేష్ఠుడు పుచ్చుకొనవచ్చును
ఇదిగుణశ్రేష్ఠుడు జ్యేష్ఠుడై యితరులు గుణహీనులయినరేని॥ ౧౧౪॥

మూ॥ ఉద్ధారో నదశస్వస్తి సంపన్నానాం స్వకర్మసు ।
యత్కించిదేవ దేయంతు జ్యాయసే మానవర్ధనం॥ ౧౧౫॥

అందరున్ను సమముగా గుణవంతులైనప్పుడు పదింటిలో నొకటిమంచిది జ్యే
ష్ఠుడు పుచ్చుకోవడము అన్నదమ్ములందరున్ను విద్యాదిగుణవిశిష్టులగుచునుండి రేని
లేదు అందరును యోగ్యులయినప్పుడు జ్యేష్ఠభాగములేదు అయినప్పటికిన్ని యేదై
ననొకవస్తువు గౌరవార్థం ఈవలెను ఇట్లగుచునుండ గుణవదగుణవద్విశేషములెనుబ
ట్టియుద్ధారవ్యవహారమైనష్యముగావలెనని తాత్పర్యము॥ ౧౧౫॥

మూ॥ ఏవం సముద్ధృతోద్ధారే సమానంశాన్ ప్రకల్పయేత్ ।
ఉద్ధారేఽనుద్ధృతే త్వేషామియం స్యాదంశకల్పనా॥ ౧౧౬॥

పైని జెప్పబడినట్టి రువది వంతుతియ్యగానుండిన ధనము నన్నదమ్ము లందరు ను సమానభాగములుగా బంచికొనవలెను ఇరువదివవంతు మొదలగు నుద్ధృతము విషయమై యీవక్ష్యమాణప్రకారముగ భాగకల్పన గావలెను॥ ౧౧౬॥

మూ॥ ఏకాధికం హరేజ్జ్యేష్ఠః పుత్రోఽధ్యర్ధం తతోఽనుజః।
అంశమంశం యవీయాంస ఇతిధర్మో వ్యవస్థితః॥౧౧౭॥

జ్యేష్ఠుడు రెండంశములనున్ను రెండవపుత్రుడు వంతున్నరనున్ను తర్వాతతమ్ము లందరు నొక్కొకయంశమునున్ను పుచ్చుకొనవలయునని ధర్మమువ్యవస్థితమాయెను ప్రథమద్వితీయపుత్రులువిద్యాది గుణవంతులై కనిష్ఠులునిర్గుణులై రేని యీప్రకారముగావలెనని తెలియదగును జ్యేష్ఠతదనుజులకధికాంశముకన బడుటవలన॥౧౧౭॥

మూ॥ స్వేభ్యోఽంశేభ్యస్తుకన్యాభ్యః ప్రదద్యుర్భ్రాతరః పృథక్।
స్వాత్స్వాదంశాచ్చతుర్భాగం పతితాస్స్యురదిత్సవః॥ ౧౧౮॥

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులగు నన్నదమ్ములులేక జాతులుముందుచెప్పబోయే భాగభేదముచేత తమయంశములను పంచుకొనేటప్పుడు తనతనభాగమునులో నాలవపాలు అవివాహితసోదరీలకు యెవరికేని సోదరియగునో వానికివాడు వివాహసంస్కారార్థమై యీవలయును- "శ్లో॥ అసంస్కృతాస్తు సంస్కార్యా భ్రాతృభిఃపూర్వసంస్కృతైః। భగిన్యశ్చ నిజాదంశాద్దత్త్వాంశంతుతురీయకం" వివాహితులుగాని యనుజులువిహితులగు నన్నలచేతను భాగములో నాలవపాలునిచ్చి వివాహముచేయదగుదురని యాజ్ఞవల్క్య యట్లివ్వనిచ్ఛయించనివారు పతితులగుదురు దీనిచే నేకజాతీయాస్త్వమాత్రేయభగినులైనప్పటికిని వారికినాలవపాలివ్వదగునని తెలియదగును॥ ౧౧౮॥

మూ॥ అజావికం సైకశఫం నజాతు విషమంభజేత్।
అజావికంతు విషమం జ్యేష్ఠస్యైవ విధీయతే॥౧౧౯॥

ఒకజెకొకగలయశ్వాదులున్ను మేకలు గొర్రెలును వీటివిభాగకాలమందు సమముగా పంచుకొనుటకశక్యముగావుననవి జ్యేష్ఠునకేకావలెనుగాని వాటికిమూల్యముకట్టియైనం బంచుకొనదగదు॥ ౧౧౯॥

మూ॥ యవీయాన్ జ్యేష్ఠభార్యాయాం పుత్రముత్పాదయేద్యది।

సమస్తత్ర విభాగస్స్యా దితిధర్మో వ్యవస్థితః॥౧౨౦॥

కనిష్ఠుడు జ్యేష్ఠునిభార్యయందు నియోగమువలనపుత్రునిబుట్టించెనేని క్షేత్రజుడగువానికి పితృపితృవ్యులతోగూడ సమాంశమునుపుచ్చుకొనవలెనుగాని తండ్రికివలెను భాగములేదు ఇదినియతమగువిభాగవ్యవస్థ నియోగములేకుండంబుట్టినవానికంశములేదనిచెప్పగలము।శ్లో॥"సమేత్యభ్రాతరస్సమ"మనిచెప్పియుండినను దీనిచే తండ్రి చనిపోయినను పౌత్రుడు తండ్రియొక్క-పితృవ్యులతో సమముగబంచుకొనవలెనని గమ్యమానమగుచున్నది॥ ౧౨౦॥

మూ॥ ఉపసర్జనం ప్రధానస్య ధర్మతో నోపపద్యతే।
పితాప్రధానం ప్రజనే తస్మాద్ధర్మేణతం భజేత్॥౧౨౧॥

జ్యేష్ఠభ్రాతకు క్షేత్రజుడగువాడయినప్పటికిని యాపుత్రుడు తండ్రివలెనుద్ధారమునకర్హుడగునోయని శంకరాగా దానినినిరాకరించి పూర్వోక్తమునేదృఢపరచుచున్నాడు-అప్రధానమగు క్షేత్రజుడగుపుత్రుడు ప్రధానుడును క్షేత్రియునగుదండ్రి ధర్మమునుబట్టి యుద్ధారముతోగూడ విభాగగ్రహణసంబంధము గలుగుగాక క్షేత్రియైనను దండ్రియూదారయందపత్యోత్పాదనముచేతనే ప్రధానుడు గావున పూర్వోక్తమగుధర్మముచేత విభాగవ్యవస్థారూపముచే పితృవ్యునితోగూడ క్షేత్రజుడు సమముగాబంచుకోవలెనని పూర్వోక్తమునకేవిశేషము॥ ౧౨౧॥

మూ॥ పుత్రఃకనిష్ఠో జ్యేష్ఠాయాం కనిష్ఠాయాంచ పూర్వజః।
కథం తత్ర విభాగస్స్యా దితిచేత్సంశయోభవేత్॥౧౨౨॥

ప్రథమభార్యయందుబుట్టినవాడు కనిష్ఠుడును ద్వితీయాదిభార్యలయందు బుట్టినవాడు జ్యేష్ఠుడునగుచుండ జ్యేష్ఠకనిష్ఠభావము తల్లులననుసరించియో జన్మమునుబట్టియోయని సంశయమయ్యేనేని చెప్పుచున్నాడు॥ ౧౨౨॥

మూ॥ ఏకం వృషభముద్ధారం సంహరేతసపూర్వజః।
తతోపరే జ్యేష్ఠవృషాః తదూనానాం స్వమాతృతః॥౧౨౩॥

పెద్దభార్యయందుబుట్టినవాడు కనిష్ఠుడైనప్పటికిని యొకవృషభమును ద్ధారముగా గ్రహించవలెను ఆశ్రేష్ఠమైనవృషభముకంటె నుతకృష్టములగువృషభములను పెద్దభార్య కొడుకుకంటె మాతృతః తక్కు-వవారలగువారికి ప్రత్యేకమొక్కొక

టియగుచున్నది తల్లియొక్క పెండ్లిక్రమముచే జ్యేష్ఠ్యమగును॥ ౧౨౩॥

మూ॥ జ్యేష్ఠస్తుజాతో జ్యేష్ఠాయాం హరేద్వృషభషోడశాః।
తతస్స్వమాతృతశ్శేషా భజేరన్నితి ధారణా॥౧౨౪॥

జ్యేష్ఠభార్యయందు జ్యేష్ఠుడైబుట్టినవాడు గోవులుపదేనున్ను పదారోదివృషభమున్నుగాగా పదారింటినిబుచ్చుకొనవలెను తరువాత నితరభార్యలందు బుట్టినవారలు తమతమతల్లులవివాహ జ్యైష్ఠ్యమునుబట్టి భాగాదికమును బంచుకొనవలెను॥

మూ॥ సదృశస్త్రీషు జాతానాం పుత్రాణా మవిశేషతః।
నమాతృతో జ్యైష్ఠ్యమస్తి జన్మతో జ్యేష్ఠ్యముచ్యతే॥౧౨౫॥

సమానజాతీయులగు స్త్రీలయందుబుట్టినపుత్రులకు జాతివిశేషాభావమగుచుండ మాతృక్రమముచే జ్యైష్ఠ్యము మునులచేజెప్పబడెను జన్మజ్యేష్ఠులకు పూర్వము చెప్పినట్లు వింశతిభాగాదికముద్ధారము దెలియదగ్గది యిట్లగుచుండ మాతృజ్యైష్ఠ్యము విహితప్రతిషిద్ధమగుటవలన వికల్పము అదిన్ని గుణవత్వనిర్గుణత్వములచేనన్నదమ్ములకు గురుత్వలఘుత్వములు దోచడమువలనవ్యవస్థచేయబడెను అదిగావుననే శ్లో॥"జన్మవిద్యాగుణజ్యేష్ఠ త్ర్యంశందాయాదవాప్నుయాత్" జన్మముచేతనున్ను విద్యాదిగుణములచేతనున్ను జ్యేష్ఠుడగువాడు దాయనువలనత్ర్యంశమునుపుచ్చుకొనవలెనని బృహస్పత్యాదులచే జెప్పబడుటచే జన్మజ్యేష్ఠునకు విద్యాద్యుత్కర్షచేనుద్ధారోత్కర్ష చెప్పబడెను॥శ్లో॥"సగుణస్యైకవృషభమని మందగుణునకొకవృషభమని మాతృజ్యైష్ఠ్యాశ్రయణముచే వృషభషోడశగ్రహణముద్ధారము దెలియదగును-మాతృజ్యైష్ఠ్యవిధికనువాదమని మేధాతిథిచెప్పెను-గోవిందరాజన్యతమమని చెప్పెను జన్మజ్యైష్ఠ్యమునుమాత్రమునుబట్టి విభాగములేదు మరేమంటే॥ ౧౨౫॥

మూ॥ జన్మజ్యేష్ఠేన చాహ్వానం సుబ్రహ్మణ్యాస్వపిస్మృతం।
యమయోశ్చైవ గర్భేషు జన్మతో జ్యేష్ఠతాస్మృతా॥౧౨౬॥

సుబ్రహ్మణ్యాఖ్యమగు జ్యోతిష్టోమఇత్యాదిమంత్రమింద్రునిబిలుచుటకు ప్రయోగించబడును అందుప్రథమపుత్రునిదండ్రియనుచు నుద్దేశించి యాహ్వానము జేయబడును "అముకపితాయజతే॥" యని ఇతనితండ్రియజించుచున్నాడని యిట్లు ఋషులచే చెప్పబడెను అట్లగుచుండ కవలవారలకు గర్భాధానమేకకాలమందైనను జన్మక్ర

మనుచే జ్యేష్ఠత్వము గర్భములందని బహుత్వముచే చెప్పబడెను॥ ౧౨౬॥

మూ॥ అపుత్రోనేన విధినా సుతాం కుర్వీత పుత్రికాం।
యదపత్యం భవేదస్యాం తన్మమ స్యాత్స్వధాకరం॥౧౨౭॥

పుత్రులు లేనివాడు ఈ స్త్రీయందు బుట్టిన సంతానము నాయొక్క శ్రాద్ధాది పారలౌకిక క్రియలు జేయుగాక యని పుత్రీవివాహకాలమందు అల్లునితో సంప్రతిపత్తి విధానరూపముగ కుమారికను పుత్రికనుజేయవలెనని గాని యట్లు చేయుట పుత్రీకరణమందురు॥

మూ॥ అనేనతు విధానేన పురా చక్రేథ పుత్రికాః।
వివృద్ధ్యర్థం స్వవంశస్య స్వయం దక్షః ప్రజాపతిః॥౧౨౮॥

ఇందు దృష్టాంతరూపముగ ననువాదమును జెప్పుచున్నాడు పుత్రోత్పాదన విషయజ్ఞుడగు దక్షుడను బ్రజాపతి స్వవంశవృద్ధికై యీ చెప్పిన ప్రకారము విధిచేతంగాగు కుమార్తెలనన్ను వివాహములందు బుత్రికలను జేసెను॥ ౧౨౮॥

మూ॥ దదౌ స దశ ధర్మాయ కశ్యపాయ త్రయోదశ।
సోమాయ రాజ్ఞే సత్కృత్య ప్రీతాత్మా సప్తవింశతిం॥ ౧౨౯॥

ఆదక్షుడు భావిపుత్రికా పుత్రలాభమునకు సంతుష్టుడగుచు నలంకారాదులచేత సత్కరించి ధర్మునకు బదుగురనున్ను కశ్యపునకు పదుమువ్వురనున్ను ద్విజులకు నోషధులకును రాజగు చంద్రునకు ఇరువదేడ్వురినున్ను నిచ్చెను సత్కారవచనమందగు నిష్ఠ సత్కారపవలెనన్నందుకున్ను దశత్ర్యాదిసంఖ్య జెప్పుటచే బహుమంది కన్యలనున్ను పుత్రికలను జేయవచ్చునన్నందుకున్ను జ్ఞాపకము॥ ౧౨౯॥

మూ॥ యథైవాత్మా తథా పుత్రః పుత్రేణ దుహితా సమా।
తస్యామాత్మని తిష్ఠంత్యాం కథమన్యో ధనం హరేత్॥ ౧౩౦॥

"శ్రు॥ ఆత్మావై పుత్ర నామాసి॥" యను మంత్రలింగమువలన పుత్రుడాత్మస్థానీయుడు తత్తుల్యయగు పుత్రిక పిత్రశరీరోత్పన్నయైనగావున తండ్రియొక్క యాత్మస్వరూపురాలగు పుత్రికయుండగా నన్యుడెట్లు పుత్రహీనుడగు తండ్రి ధనమును హరించును॥ ౧౩౦॥

మూ॥ మాతుస్తు యౌతకం యత్స్యాత్కుమారీ భాగ ఏవ సః।

దౌహిత్రఏవచహరే దపుత్రస్యాఖిలంధనం॥ ౧౩౦॥

మాతృధనములక్ష్మియనంతరమున కుమారీభాగము గావున పుత్రులకాధనము తో ప్రసక్తిలేమ పుత్రికలలో కన్యకకని తాత్పర్యము॥ "సూ॥ స్త్రీధనందుహితౄణా మదత్తానామ ప్రతిష్ఠితానాంచ॥" తల్లియొక్క ధనముదుహితలలో కన్యకలకున్ను అప్రతిష్ఠితలకున్ను నని గౌతమస్మృతి యపుత్రుడగువానిధనమంతయును దౌహిత్రుడు హరించును॥ ౧౩౦॥

మూ॥ దౌహిత్రోహ్యఖిలంరిక్థ మపుత్రస్య పితుర్హరేత్।
సఏవదద్యాద్ద్వౌపిండౌ పిత్రేమాతామహాయచ॥ ౧౩౧॥

ప్రకృతమగుటవలన పుత్రికాపుత్రుడపుత్రకుడగు మాతామహునిధనమంతయు పుచ్చుకొనుట పైని చెప్పబడెను ఇచ్చట పితృశబ్దమువలన జనకధనగ్రహణపిండదానార్థమీశ్లోకము- అపుత్రుడగు దౌహిత్రుడగువాడు పుత్రాంతరరహితుడగుజనకుని ధనమునున్ను పుచ్చుకొనవలెను వాడుజనకునకున్ను మాతామహునకున్ను రెండు పిండములనున్ను బెట్టవలెను పిండశబ్దము శ్రాద్ధోపలక్షణార్థము పుత్రికయైనదన గా పుత్రీకరణమయినదనికొందరు గావున జనకధనగ్రహణ పిండదానములకగు నాయనుసంశయనివారణార్థమీవచనము॥ ౧౩౨॥

మూ॥ పౌత్రదౌహిత్రయోర్లోకే నవిశేషోస్తి ధర్మతః।
తయోర్హిమాతాపి పితా సంభూతౌ తస్య దేహతః॥ ౧౩౩

పౌత్రునకున్ను దౌహిత్రునకున్ను భేదమేమియు లేదు పౌత్రునితండ్రియును దౌహిత్రునియొక్కతల్లియును వారలతాత శరీరమువలననే పుట్టినవారుగావున నవి పూర్వమునకనువాదము॥ ౧౩౩॥

మూ॥ పుత్రికాయాంకృతాయాంతు యదిపుత్రోనుజాయతే।
సమస్తత్రవిభాగస్స్యాజ్జ్యేష్ఠతానాస్తిహిస్త్రియాః॥ ౧౩౪॥

పుత్రీకరణమయినవిమ్మట నాతండ్రికి పుత్రోత్పత్తియైనను వీరిద్దరికిని విభాగము సమముగా గావలెను పుత్రిక జ్యేష్ఠురాలయినప్పటికినీ ఉద్ధారము లేదు స్త్రీ గావున॥ ౧౩౪॥

మూ॥ అపుత్రాయాంమృతాయాంతు పుత్రికాయాంకథంచన।

ధనంతత్పుత్రికాభర్తా హరేతైవావిచారయన్॥౧౩౫॥

పుత్రీకరణమైనకూతురు సంతానము లేకుండనే దైవవశమునుచే చనిపోయెనే ని దాని ధనమును దానిభర్త నిర్విచారముగ పుచ్చుకొనవలెను సంతానము భార్య యు లేకచనిపోయిన కొడుకుధనమును తండ్రిపుచ్చుకొనునుగాన పుత్రికపుత్రుని వంటిదేగనుక దాని ధనమాతండ్రికి రాదనుటకీవచనము॥ ౧౩౫॥

మూ॥ అకృతావాకృతావాపి యంవిందేత్సదృశాత్సుతం।
పౌత్రీమాతామహస్తేన దద్యాత్పిండంహరేద్ధనం॥౧౩౬॥

అకృతావాయనగాపుత్రీకరణము మంత్రముచేకున్నను మాటమాత్రముచేనల్లు నియంగీకరింపజేసినను బుత్రికయనియర్థము "కృతావా" యనగామంత్రముచేపుత్రీ కరణమైన పుత్రికయనియర్థము॥ "సూ॥ అభిసంధిమాత్రాత్పుత్రికామేకేషామితి" యను గౌతమవచనప్రామాణ్యము పుత్రికాధర్మశంకయాయను వివాహప్రకరణస్థశ్లోకవ్యా ఖ్యలో పరిగణించబడెను ప్రకృతము నపుత్రీకరణమయిన దయిన నభిసంధిమాత్ర ముచేనైననైననుపుత్రిక సదృశుడగుభర్తవలనకనుమారునిగనునోవాడు మాతామ హునకుపౌత్రునివంటివాడేగనుక వానిచేమాతామహుడు పౌత్రియగుచున్నాడు గావునవానిసొమ్ము పుచ్చుకొనిశ్రాద్ధముజేయుటకీదౌహిత్రుడేతగును॥ ఇచటగోవిం దరాజు అపుత్రికయైనను వానికొడుకుపుత్రికాపుత్రునివంటివాడే గావున మాతా మహధనమునున్ను మాతామహ్యాదిధనమునున్ను స్వీకరించుటకధికారియగునని వ్రా సెను అట్లుగావని పుత్రీకరణమైన దానికిన్ని కానిదానికిన్ని తుల్యతలేదుగానవారిపు త్రులకున్ను తుల్యత్వము లేదని కుల్లూభట్టుఖండించివేసెను॥ ౧౩౬

మూ॥ పుత్రేణలోకాంజయతి పౌత్రేణానంత్యమశ్నుతే।
అథపుత్రస్యపౌత్రేణ బ్రధ్నస్యాప్నోతివిష్టపం ॥౧౩౭॥

పుత్రుడుపుట్టడముతోనే స్వర్గాదిలోకములుదొరికెను పౌత్రలాభముగలిగె నేని యాలోకములందు చిరకాలముండును పుత్రునికి పౌత్రుడుబుట్టెనేని సూర్య లోకానందమునొందును ఇదిపితృదాయము పుత్రతత్పుత్రపౌత్రాది పరంపరకొన నుటకీవచనము॥ ౧౩౭॥

మూ॥ పుంనామ్నోనరకాద్యస్మాత్త్రాయతే పితరంసుతః।

తస్మాత్పుత్ర ఇతిప్రోక్త స్స్వయమేవ స్వయంభువా॥౧౩౮॥

తండ్రిని పుత్ యనేపేరుగల నరకమునుండి "త్రాయతే" యనగా రక్షించుచున్నాడు గనుక పుత్రుడాయెనని బ్రహ్మ స్వయముగాచెప్పెను దీనిచేతనే మహోపకారకారి గనుక పురుషసంతానపరంపరదాయము పుచ్చుకొనవలెనని పూర్వోక్తమగు దానికే దార్ఢ్యపరచెను॥ ౧౩౮॥

మూ॥ పౌత్రదౌహిత్రయోర్లోకే విశేషో నోపపద్యతే।
దౌహిత్రోఽపి హ్యముత్రైన సంతారయతి పౌత్రవత్॥౧౩౯॥

దౌహిత్రునకున్ను పౌత్రునకున్ను లోకమందు విశేషమేమియు లేదు పుత్రపుత్రుడివలెను పుత్రికాపుత్రుడున్ను పరలోకమందు మాతామహాదులను తరింపజేయును పుత్రికకరణమైనపిమ్మటపుట్టినపుత్రుడును దౌహిత్రుడును సమముగాబంచుకొనుటకీవచనము॥ ౧౩౯॥

మూ॥ మాతుః ప్రథమతః పిండం నిర్వపేత్పుత్రికాసుతః।
ద్వితీయంతు పితుస్తస్యాస్తృతీయం తత్పితుఃపితుః॥౧౪౦॥

పౌత్రికేయుడు మొదటగాతల్లికిని యటపైని తల్లితండ్రికిని పిమ్మటతల్లిపితామహునకును పిండదానముజేయవలెను॥ శ్లో॥ "పితామాతామహాయచ" యనిచెప్పుటవలన పితృక్రమముగానే పిండదానము॥ ౧౪౦॥

మూ॥ ఉపపన్నో గుణైస్సర్వైః పుత్రోయస్యతు దత్త్రిమః।
సహరేతైవ తద్రిక్థం సంప్రాప్తో ప్యన్యగోత్రతః॥౧౪౧॥

శ్లో॥ "పుత్రాద్రిక్థహరాఃపితుః" యని ద్వాదశవిధపుత్రులును తండ్రియొక్క రిక్థమును హరించవలెనని చెప్పగలదు॥ శ్లో॥ "దశాపరేతుక్రమశః" యనిచెప్పుటవలన ఔరసక్షేత్రజులులేకుండినచో దత్తుడే తండ్రిధనమును హరించుట ప్రాప్తమగుచునేయుండగా నొకని పుత్రుడున్నప్పటికిని గుణవంతుడగుదత్తునకు పితృరిక్థభాగప్రాప్తికీవచనము సకలగుణసంపన్నుడగుదత్తుడన్యగోత్రజుడైనప్పటికిని యౌరసుడున్నప్పటికిని పితృరిక్థభాగమును పుచ్చుకొనవలెను॥ శ్లో॥ "అతఏవౌరసఃపుత్రః పిత్ర్యస్యవసునఃప్రభుః" యౌరసపుత్రుడు సర్వపిత్ర్యధనమునకున్ను ప్రభువని ఔరసునకు సర్వోత్కర్షము చెప్పుటచే నిర్గుణుడైన ఔరసునితో సమభాగిత్వములేదు మరేమంటే క్షేత్రజునకు

చెప్పబడిన యారవభాగమీదత్తునకున్యాయము-గోవిందరాజైతే ఔరసక్షేత్రజులు లేనప్పుడు గుణవంతుడగుదత్తునకు పిత్ర్యరిక్థభాగిత్వార్థమీవచనమని చెప్పెను అది బాగుండలేదనిన్ని గుణహీనులయినప్పటికిని కృత్రిమపుత్రాదులకు పిత్ర్యరిక్థభాగిత్వమున్ను తత్పూర్వపఠితుడును గుణవంతుడునగుదత్తునకునని చెప్పటయన్యాయము గావుననని కుల్లూకభట్టువ్రాసెను॥ ౧౪౧॥

మూ॥ గోత్రరిక్థే జనయితు ర్నహరేద్దత్త్రిమః క్వచిత్।
గోత్రరిక్థానుగః పిండో వ్యపైతి దదతస్స్వధా॥౧౪౨॥

దత్తుడు జనకగోత్రరిక్థములనెప్పుడును బొందడు పిండము గోత్రరిక్థముల ననుసరించునుగావున నెవనిగోత్రరిక్థములనొందునో వానికే వాడు పిండమును బెట్టును గావున దత్తుడు జనకునకు శ్రాద్ధాదికముజేయరాదు॥ ౧౪౨॥

మూ॥ అనియుక్తా సుతశ్చైవ పుత్రిణ్యాప్తశ్చ దేవరాత్।
ఉభౌతౌ నార్హతోభాగం జారజాతక కామజౌ॥౧౪౩॥

శ్వశురాదులచే నియుక్తురాలుకాని దానియందుబుట్టినవాడున్ను పుత్రవతియైయుండియు కామముచే దేవరునివలన కనబడినవాడును వారుభయులును జారోత్పన్నుడును కామాభిలాషజుడునుగావున పితృధనభాగార్హులు గారు॥ ౧౪౩॥

మూ॥ నియుక్తాయామపి పుమా న్నార్యాంజాతో విధానతః।
నైవార్హః పైతృకం రిక్థం పతితోత్పాదితోహిసః॥ ౧౪౪॥

పెద్దలచేనియుక్తురాలయినప్పటికిని నియోగమందుజేయదగిన ఘృతాక్తత్వాదివిధిరహితముగాబుట్టినవాడు క్షేత్రియొక్క ధనమున కర్హుడుగాడు "నియుక్తాయావిధింహిత్వా"యనువచనముచేవారుపతితులుగావున పతితోత్పన్నుడగుచున్నాడుగాన॥ ౧౪౪॥

మూ॥ హరేత్తత్ర నియుక్తాయాం జాతఃపుత్రో యథౌరసః।
క్షేత్రికస్యతు తద్బీజం ధర్మతః ప్రసవశ్చసః॥౧౪౫॥

నియుక్తురాలగు దానియందు బుట్టినవాడు క్షేత్రజుడు ఔరసపుత్రుడువలెనే క్షేత్రియొక్క ధనమును హరించును ఏహేతువచేత వానికి కారణభూతమగు బీజ

ము తత్కార్యకరణమాటచే క్షేత్రస్వామిడే యగుచున్నాడి ధర్మము వలన నా యపత్యమున్న క్షేత్రిదే. "శ్లో॥ యవీయాన్ జ్యేష్ఠభార్యాయాం పుత్రముత్పాదయే ద్యది" యనుదానిచే క్షేత్రజునకు పితామహధనమందు పితృవ్యునితో గూడ సమానభాగము చెప్పబడుట వలన నౌరసునితో తుల్యుడని జెప్పుట గుణవంతుడగు క్షేత్రజునకు నౌరసునకువలె నుద్ధారభాగప్రాప్తికి॥ ౧౪౫॥

మూ॥ ధనంయోబిభృయాద్భ్రాతు మృతస్య స్త్రియమేవచ ।
సోపత్యం భ్రాతురుత్పాద్య దద్యా త్తస్యైవ తద్ధనం॥౧౪౬॥

ఎవడు చనిపోయిన భ్రాతయొక్క స్థావరజంగమరూపమగు ధనమును వాని పత్ని రక్షించుకోలేదుగాన దానిచేనప్పగించబడెనేని రక్షించవలె నాస్త్రీనిన్ని పోషించవలెను వాడునియోగధర్మముచే దానియందు బుట్టించి యన్నసంతానమున కాధనము నప్పగించవలెను "ధనంయోబిభృయా"దని చెప్పడమువలన విభక్తభాతృవిషయము "యవీయాన్ జ్యేష్ఠభార్యాయా" మని సమభాగము జెప్పుటవలన॥

మూ॥ యానియుక్తాన్యతః పుత్రం దేవరాద్వాప్యవాప్నుయాత్ ।
తం కామజమరిక్థీయం వృథోత్పన్నం ప్రచక్షతే॥౧౪౭॥

ఏస్త్రీ గర్వాదులచే నియోగించ బడిన దయినప్పటికిని దేవరుని వలనగాని మరియొకసపిండుని వలనగాని పుత్రునిగనునో వాడు కామజుడయినట్టాయెనా వానికి రిక్థభాగములేదని మన్వాదులు జెప్పిరి కామజుడు గాని వాడేరిక్థభాగయగుచున్నాడు ఆకామజుడెట్టివాడనిన నారదుడు చెప్పుచున్నాడు॥ "శ్లో॥ ముఖాన్ముఖంపరిహరన్ గాత్రైర్గాత్రాణ్యసంస్పృశన్ । కులేతదవశేషేచ సంతానార్థంనకామతః॥" నియుక్తులుముఖమువలనముఖముపరిహరించుచునవయవములతోనవయవములుగలపక వానితోకులము సమాప్తమగుచునుండసంతానార్థముగా పుత్రోత్పత్తికై ప్రవర్తించవలెనుంగాని కామమువల్లన ప్రవృత్తిగాగూడదని॥ ౧౪౭॥

మూ॥ ఎతద్విధానం విజ్ఞేయం విభాగస్యైక యోనిషు ।
బహ్వీషుచైక జాతానాం నానాస్త్రీషు నిబోధత॥౧౪౮॥

సమానజాతీయలగు బహుభార్యలందొకభర్తవలన బుట్టినవారికి భాగప్రకారమిదియని తెలియదగును ఇప్పుడు నానాజాతీయలగు భార్యలందు బుట్టిన వారి వి

భాగక్రమమును జెప్పెదవినుండు॥ ౧౪౮॥

మూ॥ బ్రాహ్మణస్యానుపూర్వేణ చతస్రస్తు యది స్త్రియః ।
తాసాం పుత్రేషు జాతేషు విభాగేయం విధిస్స్మృతః॥౧౪౯॥

బ్రాహ్మణునకు బ్రాహ్మణకన్యమొదలుగా నాలుగు జాతులస్త్రీలను వివాహమయితె వారియందుబుట్టిన వారివిభాగక్రమమీవక్ష్యమాణ ప్రకారముగావలెనని నిన్వాదులచేచెప్పబడెను॥ ౧౪౯॥

మూ॥ కీనాశో గోవృషోయానమలంకారశ్చ వేశ్మచ ।
విప్రస్యోద్ధారికందేయ మేకాంశశ్చ ప్రధానతః॥ ౧౫౦॥

వ్యవసాయమొనర్చు పాలికాపున్ను గోవులపిల్లలను బుట్టించెడియాబోతున్ను అశ్వాదికమునున్ను అంగములు మొదలగునలంకారమున్ను ప్రధానమగు గృహమున్ను యేన్నియంశములో వాటిలో బ్రధానభూతములగు వాటినొకటొకటినిదంతయు బ్రాహ్మణీపుత్రునకుద్ధారార్థముగా నివ్వదగినది మిగిలినది వక్ష్యమాణప్రకారముగా విభజించుకోవలెను॥ ౧౫౦॥

మూ॥ త్రీంశందాయాద్ధరేద్విప్రో ద్వావంశౌ క్షత్రియాసుతః ।
వైశ్యాజస్సార్ధమేవాంశ మంశంశూద్రాసుతోహరేత్॥౧౫౧॥

బ్రాహ్మణీపుత్రుడుమూడంశములనున్ను క్షత్రియాపుత్రుడురెండంశములనున్ను వైశ్యాపుత్రుడు సార్ధాంశమునున్ను శూద్రాపుత్రుడొకయంశమునున్ను పుచ్చుకొనవలెను బ్రాహ్మణీక్షత్రియాపుత్రులు మాత్రమేయుంటే ద్రవ్యమైదుభాగములుగానున్ను బ్రాహ్మణీవైశ్యాపుత్రులు మాత్రముండిరేని నాలుగున్నరయున్ను బ్రాహ్మణీశూద్రాపుత్రులుమాత్రమునుండిన నాలుగంశములే యేర్పరచి యథోక్తముగబుచ్చుకొనవలెను॥ ౧౫౧॥

మూ॥ సర్వంవా రిక్థజాతం తద్దశధా పరికల్ప్యచ ।
ధర్మ్యం విభాగం కుర్వీత విధినానేన ధర్మవిత్॥ ౧౫౨॥

ఇట్లుగాకున్న నుద్ధారములేకుండ సంతద్రవ్యమున్ను బదివంతులేసి ధర్మయుక్తముగభాగధర్మజ్ఞుడు వక్ష్యమాణప్రకారముగ బంచిపెట్టవలెను॥ ౧౫౨

మూ॥ చతురోంశాన్ హరేద్విప్రస్త్రీనంశాన్ క్షత్రియాసుతః।
వైశ్యాపుత్రో హరేద్ద్వ్యంశమంశం శూద్రాసుతో హరేత్॥ ౧౫౩॥

బ్రాహ్మణీపుత్రుడు నాలుగంశములను క్షత్రియాపుత్రుడు మూడంశములనున్ను వైశ్యాపుత్రుడు రెండంశములనున్ను శూద్రాసుతుడొకయంశమునున్ను బుచ్చుకొనవలెను ఇచటనున్ను బ్రాహ్మణీక్షత్రియాపుత్రులు మాత్రముంటే ద్రవ్యమంతయు నేడువంతులొనర్చవలెనిట్లూహచే నెవరుండినవారివారికంశకల్పన మొనర్చవలెను॥ ౧౫౩॥

మూ॥ యద్యపిస్యాత్తు సత్పుత్రోప్యసత్పుత్రోపి వా భవేత్।
నాధికం దశమాద్దద్యాచ్ఛూద్రాపుత్రాయ ధర్మతః॥ ౧౫౪॥

బ్రాహ్మణునకు ద్విజాతిస్త్రీలయందు సంతానముండినలేకుండినను వానియనంతరకర్తలు వానిద్రవ్యములోనుంచి శూద్రునకు ధర్మముగా వచ్చిన దశమాంశముకంటె నధికమీగూడదు॥ ౧౫౪॥

మూ॥ బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాపుత్రో నరిక్థభాక్।
యదేవాస్య పితా దద్యాత్తదేవాస్య ధనంభవేత్॥ ౧౫౫॥

బ్రాహ్మణక్షత్రియవైశ్యులయొక్క ధనమునకు శూద్రాపుత్రుడు హక్కుదారుడుగాడు తండ్రివానికేమిచ్చునోయదియే వానికి ధనము ఇట్లుండగా పూర్వోక్త విభాగనిషేధముచే గుణవన్నిర్గుణభేదముచే వికల్పమైనను దశమభాగ నిషేధముంచుకున్న శూద్రాపుత్రవిషయమేనియు గావలెను॥ ౧౫౫॥

మూ॥ సమవర్ణాసు యే జాతాః సర్వేపుత్రా ద్విజన్మనాం।
ఉద్ధారంజ్యాయసే దత్వా భజేరన్నితరే సమం॥ ౧౫౬॥

ద్విజులసమానజాతీయభార్యయందు బుట్టినపుత్రులు జ్యేష్ఠునకుద్ధారమిచ్చి మిగిలినధనము నాజ్యేష్ఠునితోగూడ సమముగా బంచుకొనవలెను॥ ౧౫౬

మూ॥ శూద్రస్యతు సవర్ణైవ నాన్యాభార్యా విధీయతే।
తస్యాంజాతాస్సమాంశాస్స్యుర్యదిపుత్రశతంభవేత్॥ ౧౫౭॥

శూద్రునకు సజాతీయమాత్రమే భార్యగాని యుత్కృష్టాపకృష్టజాతిస్త్రీలుభా

యని తన్నిరాసార్థము చెప్పుచున్నాడు తృణాదికముచే గట్టిన తెప్పచే జలమును దాటగోరెడు వాడెట్టి ఫలమునొందునో కుపుత్రులగు క్షేత్రజాదులచే పారలౌకిక దుఃఖము తరించుట కూహించినవాడు దురుత్తరమగునట్టి ఫలము నొందునని యీారసుని చేతనుంబలె క్షేత్రజాదులచే జేయబడిన కర్మము సంపూర్ణఫలదముగాదని చెప్పెను॥ ౧౬౧॥

మూ॥ యద్యేకరిక్థినౌ స్యాతా మౌరసక్షేత్రజౌ సుతౌ।
యస్య యత్పైతృకంరిక్థం సతద్గృహ్ణీత నేతరః॥ ౧౬౨॥

శ్లో॥ "అపుత్రేణ పరక్షేత్రే నియోగోత్పాదితస్సుతః। ఉభయోరప్యసౌరిక్థీ పిండదాతా చధర్మతః॥" అపుత్రకుడగువానిచే నియోగమువలన పరక్షేత్రనుందు బుట్టించబడినసుతుండు జనకక్షేత్రికుల యుభయులరిక్థమును గ్రహించునిద్దరికిపిండదాతయునగుచున్నాడు యాజ్ఞవల్క్యోక్తవిషయముగలుగుచుండ క్షేత్రికుడగు తండ్రికి క్షేత్రజానంతరమందౌరసుడు పుట్టెనేని యప్పుడౌరసక్షేత్రజులేక రిక్థభాగులగుచున్నారటులైనప్పటికిని క్షేత్రజులు తనజనకుడగు తండ్రియొక్క రిక్థమునకే యర్హులుగాని క్షేత్రకపితయొక్క రిక్థభాకుడ్గాడు॥ "శ్లో॥ షష్ఠంతు క్షేత్రజస్యాంశం ప్రదద్యాత్పైతృకాద్ధనాత్।ఔరసోవిభజన్ దాయమితి॥" ఔరసక్షేత్రజులొకనిధనమును విభజించుకొనెడిచోనున్న ధనములో నారవపాలు క్షేత్రజునకీవలెననునది బహుపుత్రునియొక్క ధనమునకు యేదైతే యాజ్ఞవల్క్యచే జనకక్షేత్రికుల యుభయులరిక్థహారిత్వమేదిజెప్పబడెనో యది యౌరసపుత్రులు లేనివారియొక్కయని తెలియతగ్గది॥ మేధాతిథి గోవిందరాజులైతే యనియుక్తాపుత్రుడగు నౌరసునివిషయమై యీశ్లోకము వ్యాఖ్యానముజేసిరి యదికాదు అనియుక్తాపుత్రుడక్షేత్రజుడుగావునవానికిరిక్థగ్రహణనిషేధమువలననున్న "యద్యేకరిక్థినౌ" యనెడు శ్లోకము యన్వయించకపోవుటవలననున్నని కుల్లూకభట్టువారి సెను॥ ౧౬౨॥

మూ॥ ఏకఏవౌరసః పుత్రః పిత్ర్యస్యవసునఃప్రభుః।
శేషాణా మానృశంస్యార్థం ప్రదద్యాత్తుప్రజీవనం॥ ౧౬౩॥

రోగాదులచే నౌరసపుత్రులులేనందున క్షేత్రజాదులు సంపాదితు లగుచుండ నౌషధాదికముచే నారోగ్యము నొందినవాని కౌరసులుగలుగుచుండ నట్టి విషయమై యీవచనములు జెప్పబడుచున్నది ఔరసపుత్రుడొకడేపితృధనమునకు స్వామి

యగుచున్నాడు క్షేత్రజునకు షష్ఠాంశము పంచమాంశముగాని యిచ్చి దక్కిన మిగిలినవారందరికిని కనికరముచే పాపపరిహారార్థమై గ్రాసాచ్ఛాదనములకు తగుమాత్రమౌరసుడీవలెను॥ ౧౬౩॥

మూ॥ షష్ఠంతు క్షేత్రజస్యాంశం ప్రదద్యాత్పైతృకాద్ధనాత్।
ఔరసోవిభజన్దాయం పిత్ర్యం పంచమమేవవా॥ ౧౬౪॥

ఔరసుడు పితృసంబంధియగు దాయమును విభజించుచో క్షేత్రజునకు షష్ఠాంశముగాని పంచమాంశమునుగాని యీవలెను నిర్గుణ సగుణాపేక్షచే నిది వికల్పము॥ ౧౬౪॥

మూ॥ ఔరసక్షేత్రజౌపుత్రౌ పితృరిక్థస్య భాగినౌ।
దశాపరేతు క్రమశో గోత్రరిక్థాంశభాగినః॥ ౧౬౫॥

ఔరసక్షేత్రజులిద్దరు పితృధనహరులగుచున్నారు ఇతరులగు పది మంది దత్తకాదులు గోత్రమును పొందుచున్నారు మొదటిమొదటివారు లేనప్పుడు పైపైవారు క్రమముగా ధనాంశమునున్ను పొందుచున్నారు॥ ౧౬౫॥

మూ॥ స్వేక్షేత్రే సంస్కృతాయాంతు స్వయముత్పాదయేద్ధియం।
తమౌరసం విజానీయాత్పుత్రం ప్రథమకల్పితం॥ ౧౬౬॥

తనకు వివాహితసజాతీయభార్యయందు బుట్టినవా డౌరసపుత్రుడనిన్ని ముఖ్యుడనిన్ని తెలియవలయును॥ "సూ॥ సవర్ణాయాం సంస్కృతాయాముత్పాదిత మౌరసపుత్రంవిద్యా" దనిబోధాయనవచనమువలన॥ ౧౬౬॥

మూ॥ యస్తల్పజః ప్రమీతస్య క్లీబస్య వ్యాధితస్యవా।
స్వధర్మేణ నియుక్తాయాం సపుత్రః క్షేత్రజస్స్మృతః॥ ౧౬౭॥

చనిపోయినవానియొక్కయు నపుంసకునియొక్కయు సంతానము గనుటకు విరుద్ధమగువ్యాధిగలవానియొక్కయు నియుక్తయగు భార్యయందు ఘృతాక్తత్వాదినియోగధర్మముచే పుట్టినవాడు క్షేత్రజుడని మన్వాదులచే జెప్పబడెను॥ ౧౬౭॥

మూ॥ మాతా పితావా దద్యాతాం యమద్భిః పుత్రమాపది।
సదృశం ప్రీతిసంయుక్తం సజ్ఞేయో దత్రిమస్సుతః॥ ౧౬౮॥

"శుక్లశోణితసంభవః పురుషో మాతాపితృనిమిత్తకః। తస్య ప్రదానవిక్రయపరిత్యాగేషు మాతాపితరౌ ప్రభవత ఇతి॥" శుక్లశోణితములవలనపుట్టినవాడు గావున పురుషుడు తలిదండ్రులునిమిత్తముగాఁగలవాఁడు వానియొక్క ప్రదానవిక్రయపరిత్యాగాదులయందు ఆతలిదండ్రు లధికారులగుచున్నారని వసిష్ఠస్మృతివలన తల్లియును దండ్రియును పరస్పరానుజ్ఞచే సజాతీయుఁడగు ప్రతిగ్రహీతకు పుత్రాభావనిమిత్తమగు నాపదయందు ప్రీతియుక్తముగ నననగా భయాదినిమిత్తముగాకుండ నుదకపూర్వకముగ నెవని దానమిత్తురో వాఁడు దత్తిమాఖ్యుఁడగు పుత్రుఁడని తెలియఁదగును॥

మూ॥ సదృశంతు ప్రకుర్యాద్యం గుణదోషవిచక్షణం।
పుత్రంపుత్ర గుణైర్యుక్తం సవిజ్ఞేయశ్చ కృత్రిమః॥౧౬౯॥

సమానజాతీయుఁడును తలిదండ్రులకు పారలౌకికములగు శ్రాద్ధాదికర్మములను చేయుటము వలన గుణమనియు మానడము వలన దోషమనియు నెరిగినట్టియు తలిదండ్రులకు శుశ్రూషాదికమును జేయుటయందు శ్రద్ధగలట్టియు నెవనిపుత్రునిగాఁ జేసుకొందురో వాఁడు కృత్రిమాఖ్యపుత్రుఁడని చెప్పఁదగును॥ ౧౬౯॥

మూ॥ ఉత్పద్యతే గృహేయస్య నచజ్ఞాయేత కస్యసః।
స గృహే గూఢ ఉత్పన్నః తస్య స్యాద్యస్య తల్పజః॥౧౭౦॥

ఎవనిభార్య తన యింటిలోనుండగానే సజాతీయుఁడగు పురుషునివలన వాఁడెవ్వఁడో తెలియకుండ దానియందు బుట్టినవాఁడు వానికి గూఢోత్పన్నుఁడు॥ ౧౭౦॥

మూ॥ మాతాపితృభ్యా ముత్సృష్టం తయోరన్యతరేణవా।
యం పుత్రం పరిగృహ్ణీయా దపవిద్ధస్స ఉచ్యతే॥౧౭౧॥

తలిదండ్రులచేగాని వారిలో నొకరు చనిపోతే నన్యునిచేగాని విడిచిపెట్టబడినవాఁడెవనిచే స్వీకరించబడునో వానికివాఁడపవిద్ధుఁడను బుత్రుఁడగునున్నాఁడు॥ ౧౭౧॥

మూ॥ పితృవేశ్మని కన్యాతు యం పుత్రం జనయేద్రహః।
తం కానీనం వదేన్నామ్నా వోఢుః కన్యా సముద్భవం॥౧౭౨॥

తండ్రిగృహమందు కన్యయై యుండగానే రహస్యముగా నాకన్యయందు బుట్టినవాఁడు పిమ్మట నాకన్యను పెండ్లియాడిన వానికా పుత్రుఁడు కానీనుఁడని పేరుగల

కాడగును మేధాతిథివ్యాఖ్యయుక్తకృతినుంచి ౩౦ శ్లోకములకులేదు॥ ౧౭౨॥

మూ॥ యాగర్భిణీ సంస్క్రియతే జ్ఞాతాజ్ఞాతాపి వాసతీ।
వోఢుస్సగర్భో భవతి సహోఢ ఇతిచోచ్యతే॥౧౭౩॥

ఏస్త్రీ గర్భిణియని తెలియబడినను తెలియబడకున్నను వివాహసంస్కారమును బొందునో దాని గర్భస్థుడగువాడావివాహితునకుసహోఢుడనుపుత్రుడగుచున్నాడు॥ ౧౭౩॥

మూ॥ క్రీణీయాద్యస్త్వపత్యార్థం మాతాపిత్రోర్యమంతికాత్।
సక్రీతకస్సుత స్తస్య సదృశోఽసదృశోపివా॥ ౧౭౪॥

తనసంతానార్థమై తలిదండ్రులవలన నెవ్వడెవనిగొనునో వాడువానిగుణములచే సదృశుడైగాని గాకుండని క్రీతుడనుపుత్రుడగుచున్నాడు-ఇచ్చట జాతిసాదృశ్యాసాదృశ్యములనిజెప్పరాదు॥ శ్లో॥ "సజాతీయేష్వయంప్రోక్త స్తనయేషుమయోచ్యతే"సజాతీయులగు పుత్రులందీవిధి నాచేజెప్పబడెనని యాజ్ఞ్యవల్కవచనముగలుగుచుండుటచే మనమతమందున్ను క్రీతవ్యతిరిక్తులగుపుత్రులందరును సజాతీయులేయనిదెలియదగునని సర్వజ్ఞనారాయణుడు సవర్ణుడైనాయసవర్ణుడైనా యనివ్రాసెను॥ ౧౭౪॥

మూ॥ యాపత్యావా పరిత్యక్తా విధవావా స్వయేచ్ఛయా।
ఉత్పాదయేత్పునర్భూత్వా సపౌనర్భవ ఉచ్యతే॥౧౭౫॥

ఏస్త్రీ భర్తచేవిడువబడినదయిగాని విధవయైగాని మరలనొకనివివాహమైకనిననకొడుకు పుట్టించినవానికి పౌనర్భవుడగుచున్నాడు॥ ౧౭౫॥

మూ॥ సాచేదక్షతయోనిస్స్యా ద్గతప్రత్యాగతాపివా।
పౌనర్భవేన భర్త్రాసా పునస్సంస్కార మర్హతి॥౧౭౬॥

అక్షతయోనియగు స్త్రీ భర్తనువిడిచి మరియొకనియాశ్రయించెనేని వానిచే నాస్త్రీమరల వివాహసంస్కృతురాలుగా జేయబడవలెను లేదా చిన్నప్పుడు పెనిమిటినివిడిచి మరియొకనినాశ్రయించి యక్షతయోనియగుచు మరల మొదటివాని వద్దికి వచ్చెనేని వాడు మరలపెండ్లిచేసుకొనవలెను॥ ౧౭౬॥

మూ॥ మాతాపితృ విహీనో యస్త్యక్తోవా స్యాదకారణాత్।
ఆత్మానం స్పర్శయేదస్మై స్వయందత్తస్తు సస్మృతః॥౧౭౭॥

తలిదండ్రులుచనిపోయినా కారణములేకుండ స్వేచ్ఛాదికముచే వారిచేవిడువబడినా నెవడుతన్నెవనికిచ్చుకొనునో వానికివాడు స్వయందత్తుడను పుత్రుడగునని మన్వాదులచేజెప్పబడెను॥ ౧౭౭॥

మూ॥ యంబ్రాహ్మణస్తు శూద్రాయాం కామాదుత్పాదయేత్సుతం।
సపారయన్నేవ శవస్తస్మాత్పారశవస్స్మృతః॥౧౭౮॥

శ్లో॥"విన్నాస్వేషవిధిస్స్మృతఇతి"వివాహితలందే యీపుత్రవిధియనియాజ్ఞ్యవల్కుఁ చెప్పుటవలన వివాహితయగు శూద్రస్త్రీయందు కామమువలన గనినపుత్రుడు బ్రతికియుండియే శవమువంటివాడుగావున పారశవుడనేపుత్రుడగుచున్నాడు శ్రాద్ధాదికర్మములొనచుటకు కనహుఁడుగావున శవమనిచెప్పబడెను॥ ౧౭౮॥

మూ॥ దాస్యాంవా దాసదాస్యాంవా యశ్శూద్రస్యసుతోభవేత్।
సోనుజ్ఞాతో హరేదంశ మితిధర్మో వ్యవస్థితః॥౧౭౯॥

దాసియందుగాని దాసునిదాసియందుగాని శూద్రునకుబుట్టినవాడుతండ్రియాజ్ఞచే వివాహితభార్యయందుబుట్టినవాళ్ళతో సమముగాభాగభాకుఁగుచున్నాడు. ఇదిశాస్త్రమర్యాద॥ ౧౭౯

మూ॥ క్షేత్రజాదీన్ సుతానేతా నేకాదశ యథోదితాన్।
పుత్రప్రతి నిధీనాహుః క్రియాలోపా న్మనీషిణః॥౧౮౦॥

ఈచెప్పబడిన క్షేత్రజాదులను పదొకండుగురిని పుత్రోత్పాదన విధిలోపము న్ను శ్రాద్ధాదిలోపమున్ను కాకపోవుగాకయని పుత్రప్రతినిధులనుగా మునులు జెప్పిరి॥ ౧౮౦॥

మూ॥ యఏతేభిహితాః పుత్రాః ప్రసంగా దన్యబీజజాః।
యస్యతే బీజతోజాతా స్తస్యతే నేతరస్యతు॥౧౮౧॥

ఔరసపుత్రప్రసంగముచే నీపదొకండుపుత్రులన్యబీజోత్పన్నులగు పుత్రులగుచున్నారని జెప్పబడిరి వారెవనిబీజమువలన బుట్టిరో వానికె పుత్రులగుదురు గాని

క్షేత్రికాదులకుగాదు ఔరసుడుగాని పుత్రికగానియుండగా వీరినిసంపాదించరాద నే యర్థపరమీ శ్లోకము "అన్యబీజజా" యనునది యేకోదర పుత్రోపలక్షణా ర్థము స్వబీజజుయిలనప్పటికిన్ని పౌనర్భవశూద్రాపుత్రులుసంపాదించదగరు"శ్లో॥ ఆజ్యంవినాయథాతైలం సద్భిఃప్రతినిధిస్స్మృతం। తథైకాదశపుత్రాస్తుపుత్రికౌరస యోర్వినా॥" నేయిలేనప్పుడు నూనియయెట్లు ప్రతినిధిగాసత్పురుషులచే చెప్పబడె నో పుత్రికయు ఔరసపుత్రుడును లేనప్పుడీపదియునొకండు నగుపుత్రులుగాజెప్ప బడిరని వృద్ధబృహస్పతి॥ ౧౮౧॥

మూ॥ భ్రాతౄణామేకజాతానామేకశ్చేత్పుత్రవాన్భవేత్।
సర్వాంస్తాంస్తేన పుత్రేణ పుత్రిణో మనురబ్రవీత్॥౧౮౨

ఏకపితృ మాతృసంభవులగు నన్నదమ్ములలో నొకనికైన నౌరసపుత్రుడుండె నేని యీభ్రాతలందరును వానిచే పుత్రవంతులగుచున్నారనగా పిండోదకక్రియలు జే యుటకును రిక్థమునుహరించుటకును నాభ్రాతృపుత్రుడేయగునని యర్థము॥"శ్లో॥ పత్నీదుహితరశ్చైవ పితరౌ భ్రాతరస్తథా।తత్సుతాః॥" యనుయాజ్ఞవల్క్యవచన ముచే భ్రాతృపుత్రపర్యంతాభావమంచె యనితెలియదగును॥ ౧౮౨॥

మూ॥ సర్వాసామేకపత్నీనాం యద్యేకాపుత్రిణీభవేత్।
సర్వాస్తాస్తేన పుత్రేణ ప్రాహపుత్రవతీర్మనుః॥ ౧౮౩॥

ఒకనికి బహుమంది భార్యలుండినచో నందొకతె పుత్రవతియైననందరును వా నిచేతనే పుత్రవతులుగా మనువుజెప్పెను॥ . ౧౮౩॥

మూ॥ శ్రేయసశ్శ్రేయసోలాభే పాపీయాన్రిక్థమర్హతి।
బహవశ్చేత్తుసదృశా స్సర్వేరిక్థస్య భాగినః॥ ౧౮౪॥

ఇచ్చటనౌరసాదిపుత్రులందరును ప్రకృతముగావున వీరలలో పూర్వపూర్వుడు లేకుండినచో పైపైవాడు రిక్థముఁగుబుచ్చుకొని ఇతరులను॥ "సూ॥ సచాన్యాన్ బి భృయా"దనువిష్ణువచనముచలనబోషించవలెను ఇట్లుండగా శూద్రాపుత్రుని ద్వాద శవిధపుత్రులలోను బరించడము క్షేత్రజాదులున్నప్పుడు వీడు ధనానర్హుడని జ్ఞా పకార్థము అట్లుగాకున్న క్షత్రియావైశ్యాపుత్రులువలెను వీడున్ను ఔరసుడేగా వునధనమునుబొందినిగాన పూర్వుడుపయివాళ్లను బోషించవలెననునదిజూడదగు

ను క్షేత్రజునకున్ను గుణవంతుడగు దత్తునకున్ను నౌరసునకైదవపాలైన నారవపాలైన నిమ్మనిజెప్పుటవలన పౌనర్భవాదులు సమానులు జహన్మందిగలిగ కేని యందరును సమముగా బంచుకొనవలెను॥ ౧౮౪॥

మూ॥ నభ్రాతరోనపితరః పుత్రాఋక్థహరాఃపితుః।
పితాహరేదపుత్రస్య రిక్థంభ్రాతరఏవచ॥౧౮౫॥

ఏకోదరభ్రాతలుగాని తలితండ్రులుగాని రిక్థభాగులుగారుమరేమంటేపుత్రులురిక్థమును బుచ్చుకుందురనగా ఏకఏవౌరసఃపుత్రఃయనుటచేనౌరసపుత్రులులేనప్పుడు క్షేత్రజాదులు రిక్థభాగులని దీనిచేజెప్పబడిరి ముఖ్యాముఖ్యపుత్రులును పత్నియు దుహితయులేనివానిధనమును తలిదండ్రులును వీరున్ను లేనప్పుడన్నదమ్ములును బుచ్చుకొందురు ఈవిషయముముందుజెప్పబడును॥ ౧౮౫॥

మూ॥ త్రయాణాముదకం కార్యం త్రిషుపిండః ప్రవర్తతే।
చతుర్థస్సంప్రదాతైషాం పంచమోనోపపద్యతే॥౧౮౬॥

పితృపితామహప్రపితామహులకు ముగ్గురికిని నాలవవాడగుకొడుకు పిండోదకములనిచ్చెదువాడుగాని యైదవవాడుమరిలేడు గావున పితామహాదులధనమును గౌణపౌత్రులయినను హరింతురు ఔరసపుత్రపౌత్రాదులయితే "పుత్రేణలోకాంజయతీ"త్యాదులచే పితృపితామహాదిధనభాగులగుటసిద్ధమే॥ ౧౮౬॥

మూ॥ అనంతరస్సపిండాద్య స్తస్యతస్య ధనంభవేత్।
అతఊర్ధ్వంసకుల్యస్స్యా దాచార్యశ్శిష్య ఏవవా॥ ౧౮౭॥

ఈసామాన్యవచనమునకు చెప్పబడినయౌరసపుత్రాదిసంపిండులవిషయమైమాత్రమేయైనవై యర్థమగును గాన ననుక్తపత్న్యాదిదాయప్రాప్తికి నిదిగావలెను చనిపోయినవానిధనమును సపిండులలోసన్నిహితుడగుపురుషుడుగాని స్త్రీగాని పుచ్చుకొనవలెను అందులో "ఏకఏవౌరసః పుత్రః" యనుటవలన నౌరస పుత్రుడే సర్వధనమునకధికారియగుచున్నాడు క్షేత్రజగుణవర్ధకులకు పంచభాగమైన షష్ఠాంశమైననీవలెను క్షేత్రజానంతరులను బోధించుచున్నాడు ఔరసుడులేకుండినచో పుత్రికయు నటపై తత్పుత్రుడు॥ "శ్లో॥ దౌహిత్రఏవచహరే దపుత్రస్యాఖిలంధనం॥" అనుటచే దౌహిత్రుడు పుచ్చుకొనవలెను ఇచ్చట పుత్రాభావమనగా

సౌరసాభావమే వివక్షితము వీడులేనప్పుడు క్షేత్రజాదులు యథాక్రమముగా పితృధనాధికారులగుచున్నారు శూద్రాపుత్రుడుక్తప్రకారముగ దశమభాగాధికారి యగుచున్నాడు దశమభాగావశిష్టమగు ధనమును సన్నికృష్ట సపిండుడు పుచ్చుకొనును ఈపదిముగ్గురుపుత్రులున్ను లేనప్పుడు సర్వధనమునున్ను బత్నియే గ్రహించును ఇందుకు యాజ్ఞవల్క్యవచనము॥ "శ్లో॥ పత్నీదుహితరశ్చైవ పితరౌభ్రాతరస్తథా। తత్సుతోగోత్రజోబంధుశ్శిష్యస్సబ్రహ్మచారిణః। ఏషామభావే పూర్వస్య ధనభాగుత్తరోత్తరః। స్వర్యాతస్యహ్యపుత్రస్య సర్వవర్ణేష్వయంవిధిః॥" అపుత్రుడై చనిపోయినవాని ధనమును యీచెప్పబడిన భార్య కూతురు తలిదండ్రులు అన్నదమ్ములు వీరిపుత్రుడు గోత్రజుడనగా సపిండాదులు ఇతరబంధువులు శిష్యుడు సహాధ్యాయి క్రమముగా పూర్వపూర్వులులేకుండిన పైపైవాడు హారకుడగునని మరియునిట్లే॥ "శ్లో॥ ఆమ్నాయే స్మృతితంత్రేచ లోకాచారేచసూరిభిః। శరీరార్ధం స్మృతాజాయా పుణ్యాపుణ్యఫలేసమా॥" వేదశాస్త్రలోకాచారములందు పెద్దలచేనర్ధశరీరముభార్య పుణ్యపాపఫలములగు సుఖదుఃఖములను సమముగా బొందునని చెప్పెనని బృహస్పతి మరికొన్నివచనములు వ్రాసెను॥ "శ్లో॥ యస్యనోపరతాభార్యా దేహార్ధం తస్యజీవతి। జీవత్యర్ధశరీరేతు కథమన్యస్స్వమాప్నుయాత్। సకుల్యైర్విద్యమానైస్తు పితృమాతృసనాభిభిః। అపుత్రస్య ప్రమీతస్య పత్నీతద్భాగహారిణీ॥ పూర్వప్రమీతాగ్నిహోత్రం మృతేభర్తరి తద్ధనం। విందేత్పతివ్రతానారీ ధర్మఏషసనాతనః॥ జంగమంస్థావరంహేమ కుప్యంధాన్యంరసాంబరం। ఆదాయదాపయేచ్ఛ్రాద్ధం మాసషాణ్మాసికాదికం॥ పితృవ్యగురుదౌహిత్రాన్ భర్తృస్వస్రీయమాతులాన్। పూజయేత్ కవ్యపూర్తాభ్యాం వృద్ధానాథాతిథీన్‌స్త్రియః॥ తత్సపిండా బాంధవావా యేతస్యాః పరిపంథినః। హింస్యుర్ధనానితాన్‌రాజా చోరదండేనశాసయేత్॥" భార్యసగముదేహమైయుండగాపిత్రాదులెవ్వరు నాధనమపహరించలేరనిన్ని భార్యముందుకాలముచేసెనేని యగ్నిహోత్ర భర్తపోయెనేని ధనమునున్ను హరించుననిన్ని అపుత్రునిస్థావరజంగమధనధాన్యాదులన్నిటినిన్ని భార్యయేహరించి వానికి శ్రాద్ధములన్నియుబెట్టవలెననియు భర్తయొక్క పితృవ్యాదులను మేనల్లుని మొదలగబంధువులనున్ను అతిథులనున్ను ఇష్టాపూర్తములచేపూజించుచు స్త్రీమంచిప్రవర్తనతోనుండవలెననిన్ని భర్తృసంబంధులుగాని యితరులుగాని యెవ్వరైన విరోధులై స్త్రీలధనాదులనపహరింతురో

వారిని రాజు చోరులకుజేసిన శిక్షచే శాసించవలెనని వృద్ధబృహస్పతి వచనము॥ "శ్లో॥ అపుత్రా శయనం భర్తుః పాలయంతీ వ్రతేస్థితా। పత్న్యేవదద్యాత్తత్పిండం కృత్స్నమంశంలభేత చ-" పుత్రులులేని స్త్రీ భర్తృశయ్యాపరిపాలనవ్రతమును జేయుచున్నదై భార్యయే ఆభర్తకు శ్రాద్ధము జేయవలయును అతని సర్వధనమును బొందవలెనని వృద్ధమనువు॥ యేదైతే "స్త్రీణాంతుజీవనందద్యా"దనుపోషణను మాత్రపరమగువచనము జెప్పబడెనోయది దుశ్శీలలైయు కార్పణ్యకులుగాక యౌవనస్థలైయు సవికారలగు పత్నీవిషయము అదిగావున మేధాతిథిచే పత్నులకు అంశభాగిత్వము నసిద్ధమునిచెప్పబడెను గాని యదిబృహస్పత్యాది సమ్మతముగాదని కుల్లూకభట్టు॥ పత్నిలేకుండినదుహితయును అదిలేకుండినతండ్రియు తల్లియు వారులేకుండినసోదరభ్రాతలు వారూలేకుండినతత్పుత్రులు॥ "శ్లో॥ మాతర్యపిచవృత్తాయాం పితుర్మాతా హరేద్ధన" మనివక్ష్యమాణముచేతండ్రితల్లియు నదిలేకుండిన సమీపసపిండుడు నామృతునిధనము గ్రహించవలెను పితామహసంతాన మెవరును లేకుండిన ప్రపితామహసంతానము వారనిన్నిచెప్పబడె నటపైనిసపిండసంతానము లేకుండినసమానోదకులు సాచార్యులు శిష్యుడు క్రమముగా ధనముగ్రహించవలెను॥౧౮౭॥

మూ॥ సర్వేషామప్యభావేతు బ్రాహ్మణా రిక్థభాగినః।
త్రైవిద్యాశ్శుచయోదాంతాస్తథాధర్మోనహీయతే॥ ౧౮౮॥

యీపైనిచెప్పినవారెవరును లేకుండిన వేదత్రయాధ్యయనము గలిగి బాహ్యాంతరశౌచయుక్తులై జితేంద్రియులగు బ్రాహ్మణులా మృతునిధనమును పుచ్చుకొనివారె పిండదానాదికమును జేయవలయు నట్లైన మృతునకు శ్రాద్ధాదిధర్మ హానిగాకపోవుచున్నది॥ ౧౮౮॥

మూ॥ అహార్యం బ్రాహ్మణద్రవ్యం రాజ్ఞానిత్య మితిస్థితిః।
ఇతరేషాంతు వర్ణానాం సర్వాభావే హరేన్నృపః॥౧౮౯॥

బ్రాహ్మణధనమును రాజెప్పుడును గ్రహించగూడదని శాస్త్రమర్యాద పైనిచెప్పినయోగ్యులు లేకుండినను బ్రాహ్మణమాత్రులకునైన నాధనమియ్యవలెను॥ క్షత్రియాదులధనమైతే పూర్వోక్తదాయభాగులెవ్వరును లేకుండినచో రాజుపుచ్చుకొనవలయును॥ ౧౮౯॥

మూ॥ సంస్థితస్యానపత్యస్య సగోత్రాత్పుత్రమాహరేత్।

తత్రయద్రిక్థ జాతంస్యా త్తస్మిన్ ప్రతిపాదయేత్॥ ౧౯౦॥

అనపత్యురాలై చనిపోయినవానిభార్య సమానగోత్రుడగు పురుషునివలన పెద్దల చే నియుక్తురాలై నియోగధర్మముచే పుత్రునిగనవలెను ఆభర్తృధనము నాపుత్రు నకీవలెను "దేవరాద్వా సపిండాద్వా" యనిచెప్పుటవలన సగోత్రునినియోగప్రాప్తి కొఱకును తజ్జన్యుడగువానికి రిక్థభాగిత్వముకొఱకు నీవచనము॥ ౧౯౦॥

మూ॥ ద్వౌతుయౌ వివదేయాతాం ద్వాభ్యాం జాతౌ స్త్రియాధనే।
తయోర్యద్యస్య పిత్ర్యంస్యా త్తత్సగృహ్ణీత నేతరః॥౧౯౧॥

శ్లో॥ "యద్యేకరిక్థినౌస్యాతా" మనెడుశ్లోకమౌరసక్షేత్రజులకు చెప్పబడెనుయీ శ్లోకమైతే ఔరసపౌనర్భవవిషయము యొకభర్తకు ఔరసుడుపుట్టినపిమ్మట నా భర్తచనిపోగా వానిధనమును నాశిశువునుంగొనిపోయిమరియొకనిం బెళ్లిచేసుకొని వానివలన పుత్రుడుజన్మించినపైని యాభర్తయును జనిపోయినపైని వానిధనము న్ను నాస్త్రీహస్తగతంబైనచో నాధనమునకు దానిపుత్రులుయిద్దరును భాగార్థు లై వివాదపడినప్పుడు యెవనికియెవడుతండ్రియో వానిధనము వానికిపుట్టినవాడుం పుచ్చుకొనవలయునుగాని అన్యధనమన్యపుత్రుడుగొనదగదు॥ ౧౯౧

మూ॥ జనన్యాం సంస్థితాయాంతు సమంసర్వం సహోదరాః।
భజేరన్ మాతృకంరిక్థం భగిన్యశ్చ సనాభయః॥౧౯౨॥

తల్లిచనిపోయినపిమ్మట సోదరులగు భ్రాతలును భగినులుననగానవివాహితలు ను తల్లిధనమును సమముగాపంచుకోవలయును వివాహితభగినులకు నాధనము న నుసరించి కొంతధనమునియ్యవలెను అందుకు బృహస్పతివచనము॥శ్లో॥ "స్త్రీధనం స్యాదపత్యానాం దుహితాచ తదంశినీ। అప్రత్తా చేత్సమూఢాతు లభతేమానమా త్రకం" స్త్రీధనము దానిసంతానములలో కొమార్తెయున్న భాగభాగురాల గుచున్నది యవివాహితురాలై పుత్రవతిగాకుండనుండిన సన్మానరూపముగా కొంతధనముసుపొందునని అందువలనకన్యకలకు పితృధనమందునువలెను వివాహి తలకు మాతృధనములో సోదరుడు తనభాగమునుంచి చతుర్థాంశమీవలెను॥

మూ॥ యాస్తాసాంస్యుర్దుహితర స్తాసామపి యథార్హతః।
మాతామహ్యా ధనాత్కించి త్ప్రదేయం ప్రీతిపూర్వకం॥౧౯౩॥

ఆకోమ · తెగలయొక్క కన్యపిల్లలకున్ను మాతామహీధనమువలన యేలాగు నయితే ప్రాజయగునో యాస్త్రీపుత్రికచే కొంతధనమీగగును॥ ౧౯౩॥

మూ॥ అధ్యగ్న్యధ్యావాహనికం దత్తంచ ప్రీతికర్మణి।
భ్రాతృమాతృ పితృప్రాప్తం షడ్విధం స్త్రీధనం స్మృతం॥ ౧౯౪॥

వివాహాగ్ని సన్నిధిం పిత్రాదులిచ్చినది యధ్యగ్నియను స్త్రీధనము పుట్టినయింటనుంచి భర్తృగృహంబునకు బోవునప్పుడు పడుచులకీబడిన దధ్యావాహనికము॥ శ్లో॥ "వివాహకాలె యత్స్త్రీభ్యో దీయతేహ్యగ్నిసన్నిధౌ। తదధ్యగ్నికృతంసద్భిః స్త్రీధనం పరికీర్తితం। యత్పునర్లభతేనారీ నీయమానాతు పైతృకాత్। అధ్యావాహనికంనామతత్ స్త్రీ ధనము దాహృతం" వివాహకాలమందగ్నిసన్నిధిని న్ని సారె వెళ్లేటప్పుడున్ను స్త్రీకేమిలభించునో యవి యధ్యగ్నియనిన్ని యధ్యావాహనికమనిన్ని పేరులుగల స్త్రీధనములు ప్రీతిహేతువగు బనియందు భర్త్రాదులచే నీబడినదిన్ని భ్రాతచేతనున్ను తండ్రిచేతనున్ను తల్లిచేతనున్ను సమయవిశేషములందు స్త్రీలకీబడినదిన్ని యీయారు ప్రకారములు స్త్రీధనమని చెప్పబడెను॥ ౧౯౪॥

మూ॥ అన్వాధేయంచ యద్దత్తం పత్యాప్రీతేన చైవయత్।
పత్యౌజీవతి వృత్తాయాః ప్రజాయాస్తద్ధనంభవేత్॥ ౧౯౫॥

అన్వాధేయమనగా॥ "శ్లో॥ వివాహాత్పరతోయత్తు లబ్ధంభర్తృకులేస్త్రియా। అన్వాధేయం తదుక్తంతు సర్వబంధు కులేతథా॥" వివాహానంతరమందు భర్తృకులమందున్ను పితృకులమందున్ను స్త్రీకిప్రాప్తమగునదిన్ని ప్రీతుడగు భర్తచే నీబడినదిన్ని పూర్వశ్లోకోక్తమగు నధ్యగ్న్యాదికమున్ను యేస్త్రీధనముగలదో యది భర్తబ్రతికియుండగా స్త్రీచనిపోయెనేని యాధనమంతయు నాస్త్రీయొక్క సంతానమునకు హక్కగుచున్నది॥ ౧౯౫॥

మూ॥ బ్రాహ్మదైవార్ష గాంధర్వ ప్రాజాపత్యేషు యద్వసు।
అప్రజాయామతీతాయాం భర్తురేవ తదిష్యతే॥ ౧౯౬॥

బ్రాహ్మదైవార్షగాంధర్వప్రాజాపత్యవివాహములం దారువిధములగు స్త్రీధనను సంతానములేక నాస్త్రీచనిపోయెనేని యాధనను దాని భర్తకే హక్కగుచున్నది॥ ౧౯౬॥

మూ॥ యత్త్వస్యాస్స్యాత్ ధనం దత్తం వివాహేష్వాసురాదిషు ।
అప్రజాయా మతీతాయాం మాతా పిత్రో స్తదిష్యతే॥౧౯౭॥

ఆసుర రాక్షస పైశాచములనెడి వివాహములందు స్త్రీకిలబ్ధమైన ధనమారువిధములయినదిన్ని సంతానములేక నా స్త్రీచనిపోయెనేని దాని తలిదండ్రులకు హాకరగుచున్నది॥ ౧౯౭॥

మూ॥ స్త్రియాంతు యద్భవే ద్విత్తం పిత్రాదత్తం కథంచన ।
బ్రాహ్మణీ తద్భవే త్కన్యా తదపత్యస్యవా భవేత్॥౧౯౮॥

బ్రాహ్మణునకు నాలుగుజాతుల స్త్రీలును భార్యలై యున్నప్పుడందు క్షత్రియాది స్త్రీలు పుట్టినింటినుండి తెచ్చుకున్న ధనము నాక్షత్రియాది స్త్రీ తన సంతానమున్ను భర్తయున్నలేక చనిపోయెనేని యితరసజాతీయ విజాతీయసపత్నీ సంతానములున్నప్పటికిన్ని బ్రాహ్మణ స్త్రీకిబుట్టిన స్త్రీలున్ను వారిసంతానమైనను బుచ్చుకొనవలెను॥ ౧౯౮॥

మూ॥ ననిర్హారం స్త్రియః కుర్యుః కుటుంబా ద్బహుమధ్యగాత్ ।
స్వకాదపిచ విత్తాద్ధి స్వస్య భర్తు రనాజ్ఞయా॥ ౧౯౯॥

అనేకమంది దాయాదులతో సమష్టిగానున్న సామాన్యకుటుంబధనములోనించి రత్నాలంకారాదులైనను స్త్రీ తీసి కొనరాదు భర్త్రాజ్ఞలేకుండ భర్తృధనమైననట్లు జేయరాదది స్త్రీధనమున్నుగాదు॥ ౧౯౯॥

మూ॥ పత్యౌజీవతి యస్త్రీభి రలంకారో ధృతోభవేత్ ।
నతంభజేర న్దాయాదా భజమానాః పతంతి తే॥ ౨౦౦॥

భర్త బ్రతికియుండగా నతని సమ్మతిచే స్త్రీచేధరించబడిన యలంకారములు విభాజ్యములు గావు భర్తచనిపోయిన పయిని పుత్రాదిదాయాదులు వాటిని విభజించుకొని రేని పతితులగుదురు॥ ౨౦౦॥

మూ॥ అనంశౌ క్లీబపతితౌ జాత్యంధబధిరౌ తథా ।
ఉన్మత్తజడ మూకాశ్చ యేచ కేచి న్నిరింద్రియాః॥౨౦౧॥

క్లీబ పతిత జాత్యంధబధిరోన్మత్త జడమూక పంగ్వాదులు నిరింద్రియులగువారును పిత్రాదిధనభాక్కులుగారు గ్రాసాచ్ఛాదనాదులచే పోష్యులగుచున్నారు॥

మూ॥ సర్వేషామపి తు న్యాయ్యం దాతుం శక్త్యా మనీషిణా।
గ్రాసాచ్ఛాదన మత్యంతం పతితోహ్యదదద్భవేత్॥౨౦౨॥

ఈక్లీబాదులకు శాస్త్రీయముగ రిక్థహారియగువాడు యావజ్జీవము శక్త్యనుసారముగ గ్రాసాచ్ఛాదనముల నొసంగవలయును నట్లివ్వకున్న బతితుడయ్యాని॥

మూ॥ యద్యర్థితాతు దారైస్స్యాత్ క్లీబాదీనాం కథంచన।
తేషా ముత్పన్న తంతూనా మపత్యం దాయ మర్హతి॥౨౦౩॥

"కథంచన" యనుటచే క్లీబాదులు వివాహార్హులనిసూచింపబడెను యేలాగు నైన నీక్లీబాదులకు వివాహేచ్ఛబొడమె నేని క్లీబునికి క్షేత్రజుడు గలుగుచుండగ వాడున్ను జాత్యంధాదులకు బుట్టిన యపత్యమున్ను దాయధనమును బుచ్చుకుందురు॥ ౨౦౩॥

మూ॥ యత్కించిత్పితరిప్రేతే ధనంజ్యేష్ఠోధిగచ్ఛతి।
భాగోయవీయసాం తత్ర యదివిద్యానుపాలినః॥ ౨౦౪॥

తండ్రి మృతుడగుచుండ భ్రాతలతో నవిభక్తుడైయున్న జ్యేష్ఠుడు తన పౌరుషముచేనేమిధనమార్జించినను నాధనమువలన విద్యాభ్యాసముజేయుచున్న కనిష్ఠభ్రాతలకు భాగమీవలె నితరులకక్కర లేదు॥ ౨౦౪॥

మూ॥ అవిద్యానాంతు సర్వేషామీహాతశ్చేద్ధనంభవేత్
సమస్తత్రవిభాగస్స్యాదపిత్ర్యఇతిధారణా॥౨౦౫॥

అందరన్నదమ్ములకున్ను కృషివాణిజ్యాదులచే ధనమబ్బినయప్పుడు పిత్ర్యమగుధనములేకుండ స్వార్జితమగుధనమందు సవిభాగము గావలెను ఉద్ధారము లేదు

మూ॥ విద్యాధనంతు యద్యస్య తత్తస్యైవ ధనంభవేత్।
మైత్రమౌద్వాహికంచైవ మాధుపర్కికమేవచ॥ ౨౦౬॥

విద్యామూలముగానున్ను మిత్రులవల్లనున్ను వివాహమందున్ను మధుపర్కకాలమందు పూజ్యతచేతనున్ను బ్రాప్తమగుధనము విభాజ్యముగాదు గాన నెవనిక

ట్లు కోరికెనో యదివాని దేయగుచున్నది విద్యాధనము కాత్యాయనులచే జెప్పబడెను "శ్లో॥ పరభక్త ప్రదానేన ప్రాప్తా విద్యా యదాన్యతః। తయా ప్రాప్తంచ విధినా విద్యాప్రాప్తం తదుచ్యతే। ఉపన్యస్తేచ యల్లబ్ధం విద్యయా పణపూర్వకం। విద్యాధనంతు తద్విద్యాద్విభాగే న విభజ్యతే। శిష్యాదార్త్విజ్యతః ప్రశ్నాత్ సందిగ్ధప్రశ్ననిర్ణయాత్। అజ్ఞానసంశనాద్వాదా ల్లబ్ధం ప్రాజ్యధనాచ్చయత్। విద్యాధనంతు తత్ప్రాహుర్విభాగే న విభజ్యతే॥" అన్యుడన్నము పెట్టుటచే నన్యునివద్దనభ్యసించినవిద్యచే ప్రాప్తమైనదిన్ని విద్యావిషయమై పణపూర్వకముగ నుంచబడినదై గెలిచి తెచ్చినదిన్ని శిష్యునివలన నార్త్విజ్యమువలన యడిగినప్రశ్నకు త్తరమిచ్చుటవలన సందిగ్ధమగు ప్రశ్నమును నిర్ణయించుటవలన నొకని అజ్ఞానమును దీర్చుటవలన వాదజయమువలననున్ను ధనవంతునివద్దినుంచి లబ్ధమయినదిన్ని విద్యాధనమని జెప్పిరది విభాగములోకి రాదు మేధాతిథిగోవిందరాజులు మాధుపర్కికమనగా ఆర్త్విజ్యలబ్ధమని వ్రాసిరి ఆర్త్విజ్యప్రాప్తము విద్యాధనము మాధుపర్కికము వేరే చెప్పబడినదిగా వారువ్రాసినదిగాదని కుల్లూకభట్టువ్రాసెను॥ ౨౦౬।

మూ॥ భ్రాతౄణాంయస్తునేహేత ధనంశక్తస్స్వకర్మణా।
సనిర్భాజ్యస్స్వకాదంశా త్కించిద్దత్వోపజీవనం॥ ౨౦౭॥

అన్నదమ్ములలోనొకడు రాజాశ్రయాదికమువలన ధనార్జనమందు సమర్థుడై సామాన్యమగు పితృధనమును తనభ్రాతలకు విడిచిపెట్టుగాక నైన తానుతనవంతులోనుంచి కొంతభ్రాతలకు జీవనార్థమిచ్చి విభక్తతనేర్పాటు చేయవలెను అటులైనను మంపత త్తత్పుత్రులు వివాదనుపొందరు॥ ౨౦౭॥

మూ॥ అనుపఘ్నన్ పితృద్రవ్యం శ్రమేణయదుపార్జితం।
స్వయమీహితలబ్ధంత న్నాకామోదాతు మర్హతి॥ ౨౦౮॥

పితృద్రవ్యావిరోధముగా తానుశ్రమచేసి యార్జించినధనము నన్నదమ్ములకు విభజించుటకు తనకనిష్టమేని యివ్వనక్కరలేదు॥ ౨౦౮

మూ॥ పైతృకంతు పితాద్రవ్య మనవాప్తం యదాప్నుయాత్।
స్వయమీహితలబ్ధంత న్నాకామో దాతుమర్హతి॥ ౨౦౯॥

పైతృకమగు ధనమునసామర్థ్యముచే తానొందలేకున్నను తనపుత్రులు సమ

ర్థులై పుచ్చుకొనవచ్చును స్వార్జితము నిచ్ఛలేకుండెనేని భ్రాతృలకైనబంచియీయ నక్కఱలేదు॥ ౨౦౯॥

మూ॥ విభక్తాః సహజీవంతో విభజేరన్ పునర్యది।
సమ స్తత్ర విభాగస్స్యా జ్జ్యైష్ఠ్యంతత్రనవిద్యతే॥ ౨౧౦॥

ముందుగానుద్ధారముగలిగగాని లేకగాని యన్నదమ్ములు విభక్తులైమరలకలసి యిరుగావిభజించుకొనునప్పుడు సమముగా విభాగముగావలెను గాని యుద్ధారము మరిలేదు॥ ౨౧౦॥

మూ॥ ఏషాం జ్యేష్ఠః కనిష్ఠోవాహీయేతాంశప్రదానతః।
మ్రియేతాన్యతరోవాపి తస్యభాగోనలుప్యతే॥ ౨౧౧॥

ఈయన్నదమ్ములలో నొకడు విభాగకాలమందు సన్న్యాసాదికముచేనైన మృతిచేనైనలేకున్నప్పుడు వానియొక్కభాగములోపించదు మరేమంటె॥ ౨౧౧॥

మూ॥ సోదర్యా విభజేరం స్తం సమేత్య సహితాస్సమం।
భ్రాతరోయేచ సంసృష్టా భగిన్యశ్చ సనాభయః॥ ౨౧౨॥

ఏకోదరభ్రాతలు భగినులుకలసి వానియంశమును సమముగా పంచుకోవలయును సాపత్నీసోదరులైనను తమతమ భాగములను కలుపుకొని ఏకయోగక్షేమునులైయుండిరేని వారికిని వంతుగలదు॥ యిద్దిన్ని భ్రాతృపత్నీ పితృమాత్రభావమందే యని తెలియదగును॥ ౨౧౨॥

మూ॥ యో జ్యేష్ఠో వినికుర్వీత లోభాద్భ్రాతౄన్ యవీయసః।
సో జ్యేష్ఠస్స్యాదభాగశ్చ నియంతవ్యశ్చ రాజభిః॥ ౨౧౩॥

ఏ జ్యేష్ఠభ్రాతలోభమువలన తమ్ములను వంచించునో వాడు జ్యేష్ఠభ్రాతృత్వపూజామాన్యుడైసోద్ధారభాగరహితుడై రాజుచే దండార్హుడుగావలెను॥ ౨౧౩॥

మూ॥ సర్వఏవవికర్మస్థాః నార్హంతి భ్రాతరోధనం।
నచాదత్వా కనిష్ఠేభ్యో జ్యేష్ఠః కుర్వీతయౌతకం॥ ౨౧౪॥

పతితులు గాకపోయినను ద్యూతవేశ్యాసేవాదివికర్మాసక్తులగు నన్నదమ్ములు

సు జ్యేష్ఠుడు తమ్ములకు ధనమివ్వక వారికిని తనకును సామాన్యముగ ధనముకలన (స్త్రీ) ధనాదిరూపముగ విభాగానర్హ మగునట్లుగా నాత్మార్థమై ధనమునుగూర్చుకొనెనేని వాడున్ను శిక్షార్హుడగును। ౨౧౪॥

మూ॥ భ్రాతౄణామవిభక్తానాంయద్యుత్థానంభవేత్సహ।
సపుత్రభాగంవిషమంపితాదద్యాత్కథంచన॥ ౨౧౫॥

తండ్రి యవిభక్తులగునన్న దమ్ములలో ధనార్జనార్థమైయుద్యోగము చేసినను విభాగకాలమందు కొడుకులలో నెవ్వరికైననధికాంశము నీరాదు॥ ౨౧౫॥

మూ॥ ఊర్ధ్వంవిభాగాజ్జాతస్తు పిత్ర్యమేవహరేద్ధనం।
సంసృష్టాస్తేనవాయేస్యుర్విభజేతసతైస్సహ॥ ౨౧౬॥

స్వేచ్ఛచే తండ్రిపుత్రులకు పంచిపెట్టినపైనియనగా విభాగానంతరమందు పుట్టినవాడాతండ్రి చనిపోయినపిమ్మట నాపితృధనమునే పుచ్చుకోవలెను విభక్తపుత్రుడు తండ్రితో సంసృష్టుడయ్యానేని పితృమరణానంతరమందు నాసంసృష్టునితో పంచుకోవలెను॥ ౨౧౬॥

మూ॥ అనపత్యస్య పుత్రస్య మాతా దాయమవాప్నుయాత్।
మాతర్యపిచవృత్తాయాం పితుర్మాతా హరేద్ధనం॥ ౨౧౭॥

అనపత్యుడగు పుత్రునిధనమును తల్లి పుచ్చుకోవలెను మున్ను "పత్నీ దుహితరశ్చ పితరౌ భ్రాతరస్తథా" మనిచెప్పుటవలన నిచ్చట మాతాపితరావిత్యాదికము యాజ్ఞవల్క్యుని "పితరా" వని యేకశేష చెయ్యడమువలన "అపుత్రస్య ధనం పత్న్యభిగామి తదభావే దుహితృగామి తదభావే పితృగామి మాతాపితాచపితరా" వని యేకశేషగానిర్దిష్టవచనమున నుండుటవలనను తలిదండ్రులు విభజించి పుచ్చుకోవలెను ఆతల్లి చనిపోతే పత్ని పితృ భ్రాతృ భ్రాతృజాభావమందు తండ్రితల్లి పుచ్చుకోవలెను॥ ౨౧౭॥

మూ॥ ఋణేధనేచ సర్వస్మిన్ ప్రవిభక్తేయథావిధి।
పశ్చాద్దృశ్యేతయత్కించి త్తత్సర్వం సమతాంనయేత్॥ ౨౧౮॥

పిత్రాదికృతఋణమైనను విభజనార్హధనమైనను భాగించదగును పంచుకొనినపిమ్మట యెంతమాత్రమునైనం గనపడెనేని దానిని భాగించదగును సమముగ

తయోర్నిత్యం ప్రతీఘాతే నృపతిర్యత్నవాన్ భవేత్॥ ౨౨౨॥

ఈద్యూతసమాహ్వయములు ప్రకాశమగు చౌర్యమేగావున వీనిని పోగొట్టుటకు రాజు ప్రయత్నపరుడుగావలెను॥ ౨౨౨॥

మూ॥ అప్రాణిభిర్యత్క్రియతే తల్లోకే ద్యూతముచ్యతే।
ప్రాణిభిః క్రియతే యస్తు సవిజ్ఞేయ స్సమాహ్వయః॥ ౨౨౩॥

పాచికలు మొదలగువాటిచేనగునది ద్యూతమనియు మేషకుక్కుటాదులచేనగు పందెముగలవి సమాహ్వయమని లోకములో జెప్పబడును ఇవి లోకప్రసిద్ధములైనను మనువు పరిహార్యములని యిచ్చట చెప్పెను॥ ౨౨౩॥

మూ॥ ద్యూతం సమాహ్వయంచైవ యఃకుర్యాత్కారయేతవా।
తాన్ సర్వాన్ ఘాతయేద్రాజా శూద్రాంశ్చ ద్విజలింగినః॥ ౨౨౪॥

ద్యూతసమాహ్వయములగు నీజూదము నెవడాడునో లేవడాడించునో వారలనేకపరాధానుసారముగా రాజుహస్తఛేదాదిక శిక్షను చేయించవలెను. యజ్ఞోపవీతాదిద్విజచిహ్నధారులగు శూద్రులను వధించవలెను॥ ౨౨౪॥

మూ॥ కితవాన్ కుశీలవాన్ క్రూరాన్ పాషండస్థాంశ్చ మానవాన్।
వికర్మస్థాన్ శౌండికాంశ్చ క్షిప్రం నిర్వాసయేత్పురాత్॥ ౨౨౫॥

జూదగాళ్ళను నర్తకులను గాయకులను వేదవిద్వేషులను శ్రుతిస్మృతివిరుద్ధవ్రతధారులను ఆపదలేనప్పుడు పరకర్మముచే జీవించు వారలను మద్యపాయులునగు మనుష్యులను శీఘ్రముగ రాజు రాష్ట్రమును దాటించవలెను- కితవప్రసంగముచే నన్యులున్ను జెప్పబడిరి అందుకు హేతువను జెప్పుచున్నాడు॥ ౨౨౫॥

మూ॥ ఏతే రాష్ట్రే వర్తమానా రాజ్ఞః ప్రచ్ఛన్నతస్కరాః।
వికర్మక్రియయానిత్యం బాధంతే భద్రికాః ప్రజాః॥ ౨౨౬॥

ఈకితవాదులు గూఢచోరులు రాజుయొక్క రాజ్యమందుంటున్నవారై సర్వదావంచనచే ధనమాకర్షించుచు సజ్జనులను బాధింతురు॥ ౨౨౬॥

మూ॥ ద్యూతమేతత్పురాకల్పే దృష్టంవైరకరం మహత్।

తస్మాద్ద్యూతం న సేవేత హాస్యార్థమపి బుద్ధిమాన్॥౨౨౭॥

ఇది యిప్పుడే వైరకరమనిగాదు మరేమంటే పూర్వకల్పమందున్న యీద్యూతము మిక్కిలి వైరకరమైగనబడెను గావున ప్రాజ్ఞుడు పరిహాసార్థమైన నీద్యూతమునాడరాదు॥ ౨౨౭॥

మూ॥ ప్రచ్ఛన్నంవా ప్రకాశంవా తన్నిషేవేత యోనరః।
తస్య దండవికల్పస్స్యాత్ యథేష్టం నృపతే స్తథా॥౨౨౮॥

ఎవడీద్యూతమును ప్రచ్ఛన్నముగానైన ప్రకాశముగానైన సేవించునో వానికి రాజు తన యిచ్ఛాప్రకారముగా దండను విధించవచ్చును యికనుద్యూతపరాజితులకు ధనములేకున్నప్పుడు కర్తవ్యమును జెప్పుచున్నాడు॥ ౨౨౮॥

మూ॥ క్షత్రవిట్శూద్రయోనిస్తు దండం దాతుమశక్నువన్।
ఆనృణ్యం కర్మణా గచ్ఛేద్విప్రో దద్యాచ్ఛనైశ్శనైః॥౨౨౯॥

క్షత్రియవైశ్యశూద్రజాతులవారు జూదమందోడిపోయి రాజువిధించిన దండను యివ్వలేకుండిరేని వారిచే నాదండధనమునకు దగిన పనులను జేయించవలెను- బ్రాహ్మణుడైతే నప్పుడప్పుడా సొమ్మును పుచ్చవలెను గాని పనులు జేయించ నర్హులుగారు॥ ౨౨౯॥

మూ॥ స్త్రీబాలోన్మత్తవృద్ధానాం దరిద్రాణాంచ రోగిణాం।
శిఫావిదళరజ్జ్వాద్యై ర్విదధ్యాన్నృపతిర్దమం॥ ౨౩౦॥

స్త్రీబాలాదులకు ఊడసంబంధమగునట్టియు వెదురుసంబంధమగు నట్టియురివ్వలచే కొట్టడముచేతనున్ను త్రాళ్ళచేవిరిచికట్టడముచేతనున్ను రాజుశిక్షించవలెను॥

మూ॥ యేనియుక్తాస్తు కార్యేషు హన్యుః కార్యాణి కార్యిణాం।
ధనోష్మణా పచ్యమానాం స్తాన్నిస్స్వాన్కారయేన్నృపః॥౨౩౧॥

ఎవరు యేవ్యవహారము జేయుటకు రాజాజ్ఞచేనియుక్తులై లంచమును పుచ్చుకొని తమతేజస్సుచే నధికారమును బొంది స్వామ్యాదులయొక్క కార్యమునునశింపచేతురో వారిసర్వస్వమును దోచుకొని రాజువారిని నిర్ధనులనుగా జేయవలెను॥

మూ॥ కూటశాసన కర్తౄంశ్చ ప్రకృతీనాంశ్చ దూషకాన్ ।
స్త్రీబాల బ్రాహ్మణఘ్నాంశ్చ హన్యాద్ద్విట్సేవినస్తథా॥౨౩౨॥

కూటరాజాజ్ఞాలేఖకులనున్ను మంత్రులలో భేదమును బుట్టించినవారినిన్ని స్త్రీలనున్ను బ్రాహ్మణులనున్ను జంపినవారినిన్ని శత్రుపక్షలలో గలసినవారినిన్ని రాజుచంపవలెను॥ ౨౩౨॥

మూ॥ తీరితం చానుశిష్టంచ యత్రక్వచన యద్భవేత్ ।
కృతం తద్ధర్మతో విద్యాన్నతద్భూయో నివర్తయేత్॥౨౩౩॥

ఎక్కడనైన నొకానొక ఋణాదానాది వ్యవహారమందు ధర్మముచే తీర్పు చేయబడినదిన్ని నేరమునకు శిక్షపర్యంతము నిర్ణయించబడినదిన్ని యేదో దాని నంగీకరించవలెను గాని అకారణముగ మరి తిప్పివేయరాదు కారణ ముండెనేని తిప్పివేయవలెను॥ ౨౩౩॥

మూ॥ అమాత్యాః ప్రాడ్వివాకోవా యత్కుర్యుః కార్యమన్యథా ।
తత్స్వయం నృపతిః కుర్యాత్తాన్ సహస్రంచ దండయేత్॥౨౩౪॥

మంత్రులున్ను ప్రాడ్వివాకుడున్ను లెస్సగా విచారించకుండ కార్యనిర్ణయము నొనర్చిరేని యాకార్యమును రాజుస్వయముగా జేయవలెను ఆమంత్ర్యాదులకు పణసహస్రమును దండమునువిధించవలెను ఇదిన్ని లంచమునుబుచ్చుకొనకుండినచోటను లంచమునుబుచ్చుకొన్నవారికైతె "యేనియుక్తాస్త" యనువచనముచే జెప్పబడెను గావున॥ ౨౩౪॥

మూ॥ బ్రహ్మహాచ సురాపశ్చ స్తేయీచ గురుతల్పగః।
ఏతే సర్వే పృథగ్జ్ఞేయా మహాపాతకినో నరాః॥౨౩౫॥

బ్రాహ్మణునిజంపినవాడున్ను పైష్టీ-మాధ్వీ-గౌడీ-యనగా పిండితోటిన్ని ఇప్పపువ్వుతోటిన్ని బెల్లముతోటిన్ని జేసినమద్యమును త్రావిన ద్విజుడున్ను బ్రాహ్మణుని స్వర్ణమునుహరించినవాడున్ను గురుపత్నితోబోయినవాడున్ను వీరు ప్రత్యేకముగా మహాపాతకులని తెలియదగ్గది॥ ౨౩౫॥

మూ॥ చతుర్ణామపి చైతేషాం ప్రాయశ్చిత్తమకుర్వతాం।

శారీరం ధనసంయుక్తం దండంధర్మ్యం ప్రకల్పయేత్॥౨౩౬॥

ఈనలుగురు మహాపాతకులున్ను ప్రాయశ్చిత్తముజేయరేని వారికి శారీరదండములు ధనయుక్తముగ నీవక్ష్యమాణక్రమముగ విధించవలెను॥ ౨౩౬॥

మూ॥ గురుతల్పే భగఃకార్య స్సురాపానే సురాధ్వజః।
స్తేయేచ శ్వపదంకార్యం బ్రహ్మహణ్య శిరాఃపుమాన్॥౨౩౭॥

శ్లో॥"నాంక్యారాజ్ఞా లలాటేస్యుః"యనివక్ష్యమాణమువలన నంకనస్థానము లలాటమేగావున నామరణస్థాయిగా గురుతల్పగునినుదుటనుభగాకారముగాతప్తలోహముద్రయున్ను మద్యపాయికి మద్యమమ్మెడుస్థలను దెలుపుటకుగా తైత్తినజండాపలెను పోడవగుధ్వజాకారముద్రనున్ను స్వర్ణస్తేయికికుక్కపాదమువంటి ముద్రనున్ను బ్రహ్మహత్యజేసినవానికి కబంధముద్రనున్ను వేయించవలెను॥ ౨౩౭॥

మూ॥ అసంభోజ్యా హ్యసంయాజ్యా అసంపఠ్యా వివాహినః।
చరేయుః పృథివీం దీనా స్సర్వధర్మ బహిష్కృతాః॥౨౩౮॥

ఈనలుగురు మహాపాతకులకున్ను అన్నముపెట్టరాదు చదువుజెప్పరాదు వివాహార్థమై పిల్లనివ్వరాదు నిందితులుగావున యాజనమునకును ననర్హులై శ్రౌతాదిసర్వకర్మవివర్జితులై దీనులై భూమియందుదిరగవలెను॥ ౨౩౮॥

మూ॥ జ్ఞాతిసంబంధిభి స్త్వేతే త్యక్తవ్యాః కృతలక్షణాః।
నిర్దయా నిర్నమస్కార్యా స్తన్మనో రనుశాసనం॥౨౩౯॥

జ్ఞాతులు మాతులాది సంబంధులుమొదలగువారలచే వీరువిడిచిపెట్టదగ్గవారు ఇట్లుచిహ్నితులగువారి కెవ్వరును నమస్కరించరాదు వీరియందుదయచెయ్యరాదు ఇట్లుమనువుగారియాజ్ఞ॥ ౨౩౯॥

మూ॥ ప్రాయశ్చిత్త మకుర్వాణా స్సర్వవర్ణా యథోదితం।
నాంక్యారాజ్ఞా లలాటేస్యు దాప్యాస్తూత్తమ సాహసం॥ ౨౪౦॥

తమతమ వర్ణానుసారముగా శాస్త్రోక్తప్రకారము ప్రాయశ్చిత్తమునుజేసుకొనిరేని వీరికి లలాటమందంకములను వేయరాదు ఉత్తమసాహసము వీరివద్ద రాజుదండుగబుచ్చుకోవలెను॥ ౨౪౦॥

మూ॥ అగస్సు బ్రాహ్మణస్యైవ కార్యో మధ్యమ సాహసః।
ఇవాస్యోవా భవెదాప్త్రౌ త్సద్రవ్య స్సపరిచ్ఛదః॥ ౨౪౦॥

"ఇతరేకృతవంతస్తు" యనెడు తరువాతశ్లోకోక్తమగు "కామతః" యను పదము నీశ్లోకములో గూడ నన్వయించుకోవలెను అందుచే తెలియక యే యపరాధము లందు గుణవంతుడగు బ్రాహ్మణునకు మధ్యమసాహసదండము విధించవలెను నిర్గుణునకైతె పూర్వోక్తమగు నుత్తమసాహసము దండమగుచున్నది కామముచే నీ యపరాధములొనర్చినేని ధనపరికరములతో గూడ రాజ్యమును దాటించవలెను॥

మూ॥ ఇతరే కృతవంతస్తు పాపా న్యేతాన్యకామతః।
సర్వస్వహార మర్హంతి కామతస్తు ప్రవాసనం॥ ౨౪౧॥

బ్రాహ్మణేతరులగు క్షత్రియాదులీపాపములనిచ్ఛచే జేసిరేని వారిసర్వస్వము నున్ను హరించవలెను వారివృత్తిననుసరించి సర్వస్వహరణమునున్ను ఉత్తమసాహసమునున్ను వ్యవస్థజేయవలెను ఇచ్ఛచేతనే యీపాపములనొనర్చిరేని ప్రవాసనమనగా వధకర్హులగుచున్నారు "ప్రవాసనంపరాసనంనిషూదనంహింసనమితి" యని ప్రవాసనశబ్దమును వధపర్యాయమని యాంబాధానికులుపఠించిరి॥ ౨౪౧॥

మూ॥ నాదదీత నృపస్సాధు ర్మహాపాతకినో ధనం।
ఆదధానస్తు తల్లోభా త్తేనదోషేణ లిప్యతే॥ ౨౪౩॥

ధార్మికుడగు రాజుమహాపాతకియొక్క ధనమునుబుచ్చుకోరాదు లోభముచేబుచ్చుకొనెనేని తానునామహాపాతకదోషమునొందును అయితేయాధనమునకేమిగతి యనినచెప్పుచున్నాడు॥ ౨౪౩॥

మూ॥ అప్సుప్రవేశ్యతం దండం వరుణాయోపపాదయేత్।
శ్రుతవృత్తోపపన్నేవా బ్రాహ్మణే ప్రతిపాదయేత్॥ ౨౪౪॥

ఆదండధనమును నద్యాదిజలమందుబడవేసి వరుణునకప్పగించడమైనా శ్రుతవృత్తసంపన్నుడగు బ్రాహ్మణునికైనసీవలెను॥ ౨౪౪॥

మూ॥ ఈశోదండస్య వరుణో రాజ్ఞాందండధరోహిసః।
ఈశస్సర్వస్య జగతో బ్రాహ్మణో వేదపారగ॥ ౨౪౫॥

మహాపాతకులకు విధింపబడినశోధనములకు స్వామివరుణుడు గావున రాజులకుకూడానతడుదండమువిధించేవాడగుటవలన ప్రభువు సకలవేదములను జదివిన బ్రాహ్మణుడు నిఖిలజగత్తునకున్ను ప్రభువుగావునవీరుభయులున్ను దండధనమును స్వీకరించుటకర్హులు॥ ౨౪౫॥

మూ॥ యత్రవర్జయతేరాజా పాపకృద్భ్యోధనాగమం।
తత్రకాలేన జాయంతే మానవాదీర్ఘజీవినః॥ ౨౪౬॥
నిష్పద్యంతేచసస్యాని యథోప్తాని విశాంపృథక్।
బాలాశ్చనప్రమీయంతే వికృతంనచజాయతే॥ ౨౪౭॥

ఏదేశమందు ప్రకృతమగుమహాపాతకులధనమును రాజుపుచ్చుకొనకనుండునో యాదేశమందుపూర్ణమగుకాలముచేమనుష్యులుపుట్టుచుందురుదీర్ఘాయుష్మంతులగుచుందురు కర్షకులువేసినవిత్తనములుదేనికదిఫలించుచుండును ఆకాలమందుబాలురుమృతినొందరు "దీర్ఘజీవిన"॥ యని పైనిచెప్పియు నాదరార్థమీవచనము అవయవలోపముగలిగి యేజంతువయు జన్మించకనుండును॥ ౨౪౬॥

మూ॥ బ్రాహ్మణాన్ బాధమానంతు కామాదవరవర్ణజం।
హన్యాచ్చిత్రైర్వధోపాయై రుద్వేజనకరైర్నృపః॥ ౨౪౮॥

శరీరపీడ ధనహరణమ్మును మొదలగువాటిచే బ్రాహ్మణులనుబాధించెడుశూద్రుని ఛేదనాదివధోపాయములచే భయంకరమగునట్లు రాజువధించవలెను॥ ౨౪౮॥

మూ॥ యావానవధ్యస్యవధే తావాన్ వధ్యస్యమోక్షణే।
అధర్మోనృపతిర్దృష్టో ధర్మస్తునియచ్ఛతః॥ ౨౪౯॥

అవధ్యునివధించినరాజునకధర్మమెంతశాస్త్రముచే తెలియబడెనో వధార్హునివిడిచినట్లైతె యధర్మమెంతగుచున్నది యథాశాస్త్రముగా దండమును జేయురాజునకు ధర్మమగునని తాత్పర్యము గావుననట్లుజేయవలెను॥ ౨౪౯॥

మూ॥ ఉదితోయం విస్తరశో మిథోవివదమానయోః।
అష్టాదశసుమార్గేషు వ్యవహారస్య నిర్ణయః॥ ౨౫౦॥

పదునెనిమిదిబుణాదానాదివ్యవహారపదములయందు నన్యోన్యము వివాదము

స్తాంగుచున్న యర్థిప్రత్యర్థులకార్యములవిషయమై నిర్ణయమిది విస్తరించి చెప్పబడెను॥ ౨౫౦

మూ॥ ఏవం ధర్మ్యాణి కార్యాణి సమ్యక్కుర్వన్ మహీపతిః।
దేశానలబ్ధాన్ లిప్సేత లబ్ధాంశ్చ పరిపాలయేత్॥ ౨౫౧॥

ఈప్రకారముగ ధర్మయుక్తములగు కార్యములను నిర్ణయమును జేయుచు రాజు జనానురాగమువలన మరికొన్ని దేశములను స్వీకరించ నిచ్ఛయించవలెను లబ్ధములగు దేశములను లెస్సగ పరిపాలించవలెను యిట్లు లెస్సయగు వ్యవహారము చేనలబ్ధములగు దేశములు ప్రాప్తించుటకెట్లు జెప్పబడెను॥ ౨౫౧॥

మూ॥ సమ్యఙ్నివిష్టదేశస్తు కృతదుర్గశ్చ శాస్త్రతః।
కంటకోద్ధరణేనిత్య మాతిష్ఠేద్యత్న ముత్తమం॥ ౨౫౨॥

"జాంగలం సస్యసంపన్న" మనువది మొదలుగా చెప్పబడినరీతిచే లెస్సగా నాశ్రయించబడిన దేశమందు సప్తమాధ్యాయోక్త ప్రకారముచే దుర్గమును నిర్మించుకొని చోరసాహసికాదికంటకనివారణము విషయమై ప్రకృష్టమగు యత్నమును యెల్లప్పుడును జేయవలెను॥ ౨౫౨॥

మూ॥ రక్షణాదార్యవృత్తానాం కంటకానాంచ శోధనాత్।
నరేంద్రాస్త్రిదివం యాంతి ప్రజాపాలనతత్పరాః॥ ౨౫౩॥

మంచినడువడిగలవారిని రక్షించడమువలననున్ను చోరాదులను శిక్షించడమువలననున్ను ప్రజాపాలనమందు జాగరూకులగు రాజులు స్వర్గమును బొందుదురు ది గావున దుష్టసంహారణమందు యత్నించవలెను॥ ౨౫౩॥

మూ॥ అశాసంస్తస్కరాన్యస్తు బలిం గృహ్ణాతి పార్థివః।
తస్య ప్రక్షుభ్యతే రాష్ట్రం స్వర్గాచ్చ పరిహీయతే॥ ౨౫౪॥

రాజు చోరాదిదుష్టసంహారమును జేయక షడ్భాగాద్యుక్తమగు పన్నును గ్రహించెనేని వానిరాజ్యమందుండిన జనులు కోపింతురు ఇతరధర్మసాధ్యమైన నార్జితమగు స్వర్గప్రాప్తియు నట్టిదుష్కృతముచే ప్రతిబంధించబడును॥ ౨౫౪॥

మూ॥ నిర్భయంతు భవేద్యస్య రాష్ట్రం బాహుబలాశ్రితం।
తస్య తద్వర్ధతే నిత్యం సిచ్యమాన ఇవద్రుమః॥ ౨౫౫॥

ఏరాజుయొక్క బాహుబలమునాశ్రయించుటచే రాష్ట్రముచోరాదిభయరహితమగుచున్నదో ఆరాజు రాజ్యముజలసేచనముచేవృక్షమువలెనువృద్ధినొందును॥

మూ॥ ద్వివిధాం స్తస్కరాన్విద్యాత్పరద్రవ్యాపహారకాన్।
ప్రకాశాంశ్చాప్రకాశాంశ్చ చారచక్షుర్మహీపతిః॥ ౨౫౬॥

చోరులను కనుగొనుటకు చారులేచక్షుస్సులుగాగలరాజు పరులధనమును ప్రకాశముగానున్ను నప్రకాశముగానున్ను హరించెడి రెండువిధములగు దొంగవాండ్రను దెలిసికొనవలెను॥ ౨౫౬॥

మూ॥ ప్రకాశవంచకాస్తేషాం నానాపణ్యోపజీవినః।
ప్రచ్ఛన్నవంచకాస్త్వేతే యేస్తేనాటవికాదయః॥ ౨౫౭॥

ఆచోరులలో తూనికలోనున్ను కొలతలోనున్నువంచించెడి పణ్యోపజీవులందరున్ను ప్రకాశవంచకులు కన్నములువేసి తెరవాట్లుగొట్టి హరించుచు నడవులలో నాశ్రయించెడివాళ్లు ప్రచ్ఛన్నవంచకులు॥ ౨౫౭॥

మూ॥ ఉత్కోచకాశ్చౌపధికా వంచకాః కితవాస్తథా।
మంగళాదేశవృత్తాశ్చ భద్రాశ్చేక్షణికైస్సహ॥ ౨౫౮॥
అసమ్యక్కారిణశ్చైవ మహామాత్రాశ్చికిత్సకాః।
శిల్పోపచారయుక్తాశ్చ నిపుణాః పణ్యయోషితః॥ ౨౫౯॥
ఏవమాదీన్ విజానీయాత్ప్రకాశాన్ లోకకంటకాన్।
నిగూఢచారిణశ్చాన్యాననార్యానార్యలింగినః॥ ౨౬౦॥

లంచమునుపుచ్చుకొనెడివాళ్లున్ను కార్యార్థులను భయపెట్టి ధనమును కానుకగా పుచ్చుకొనెడివాళ్లున్ను మంచిబంగారు మొదలగునవి పుచ్చుకొని తక్కువ వస్తువులను భ్రమపెట్టి యిచ్చెడివాళ్లను రెండువిధములగు జూదమాడెడివాళ్లున్ను ధనపుత్రలాభాదిమంగళములగునని చెప్పి సొమ్ము పుచ్చుకొనెడివాళ్లున్ను భద్రమైనవాళ్లమని ??? వివశభావములచే ధనమును హరించెడివాళ్లున్ను

సాముద్రికమును చూచెడివాళ్లున్ను లెస్సగా చెయ్యలేని చికిత్సలకున్ను గజములను ముప్పేకమని స్వామ్మునుహరించెడివాళ్ళున్ను చిత్తరువు వ్రాయడం మొదలగువాటిని ఉపరచి యాశ్రయించెడివాళ్ళున్ను నేర్పుగలసానులున్ను పరవశీకరణ మొనర్చు మనువాళ్ళు మొదలగుప్రకాశవంచకులను మరిన్ని శూద్రులుబ్రాహ్మణాదివేషముం వేసుకొనిధనముహరించెడివాళ్ళున్ను రాజుచారులవలన నెరుంగవలయును॥ ౨౬౦ ॥

మూ॥ తాన్విదిత్వా సుచరితై ర్గూఢై స్తత్కర్మకారిభిః।
చారైరనేక సంస్థానైః ప్రోత్సాద్యవశమానయేత్॥ ౨౬౧॥

ఈచెప్పబడినవంచకులను ప్రచ్ఛన్నులగు సభ్యులచేతనున్ను వణిజులను వణిజులచేతనుయిట్లాకర్మములంజేయువారిచేతనున్ను సప్తమాధ్యాయోక్తకాపటికాది చారులచేతనున్ను పట్టుకొని తత్తత్స్థానములనుంచియూడగొట్టి రాజువశులనుగాజేయవలెను॥ ౨౬౧॥

మూ॥ తేషాందోషా నభిఖ్యాప్య స్వే స్వే కర్మణి తత్వతః।
కుర్వీతశాసనం రాజా సమ్యక్సారాపరాధతః॥ ౨౬౨॥

ఆప్రకాశాప్రకాశతస్కరులనుబట్టుకొని వాళ్ళొనర్చిననిజమైనదోషములను బ్రకటించి తత్తద్ధనశరీరాదిబలాపరాధానుసారముగా రాజుశిక్షించవలెను॥ ౨౬౨॥

మూ॥ నహిదండాదృతె శక్యః కర్తుంపాపవినిగ్రహః।
స్తేనానాం పాపబుద్ధీనాం నిభృతం చరతాంక్షితౌ॥ ౨౬౩॥

వినీతవేషములతోదిరుగు పాపబుద్ధులగు చోరులనుశిక్షించకుండ పాపనిగ్రహముజేయశక్యముగాదు గావున చోరశిక్షతప్పకచేయవలె॥ ౨౬౩॥

మూ॥ సభాప్రపా పూపశాలా వేశమద్యాన్న విక్రయాః।
చతుష్పథాశ్చైత్య వృక్షాస్సమాజాః ప్రేక్షణానిచ॥ ౨౬౪॥
ఏవం విధాన్ నృపోదేశాన్ గుల్మైస్స్థావరజంగమైః।
తస్కరప్రతిషేధార్థం చారైశ్చాప్యనుచారయేత్॥ ౨౬౫॥
జీర్ణోద్యానా న్యరణ్యాని కారుకావేశనానిచ।
శూన్యానిచాప్యగారాణి వనాన్యుపవనానిచ॥ ౨౬౬॥

సభలు చలిపందిళ్ళు రొట్టెలమ్మెడు గృహములు సానికొంపలు కల్లమ్మెడు గృహము నన్నమమ్మెడు గృహము నాలుగు దారులుగలిసెడిచోటు రచ్చచెట్లు పదిమందిగలసిన చోట్లు చూపుస్థలములు పాడిళ్ళు ఉద్యానములు నరణ్యములు శిల్పగృహములు శూన్యములగుతోటలు ఇవి మొదలగు స్థలములందు వంచకులగు చోరులను బట్టుటకు స్థిరముగ కొందరి నుంచడమున్ను అప్పుడప్పుడు పదాతులను బంపడమున్ను గావలెను తరుచుగా నిట్టిచోటుల నన్నపానస్త్రీసంభోగాపేక్షలచే దొంగలుందురు॥ ౨౬౪।౨౬౫॥౨౬౬॥

మూ॥ తత్సహాయై రనుగతై ర్నానాకర్మ ప్రవేదిభిః ।
విద్యాదుత్సాదయేచ్చైవ నిపుణైః పూర్వతస్కరైః॥౨౬౭॥

అట్లు రాజుచే బంపబడిన వాళ్ళతోగూడ సహాయులుగావచ్చిన కార్యమును న్నెరిగ నిపుణులై నవారిచే నచ్చటచ్చట చోరులనెరింగి పట్టుకొని వ్రూడదీయవలెను॥ ౨౬౭॥

మూ॥ భక్ష్య భోజ్యోప దేశైశ్చ బ్రాహ్మణానాంచ దర్శనైః ।
శౌర్యకర్మాపదేశైశ్చ కుర్యు స్తేషాం సమాగమం॥౨౬౮॥

ఆపూర్వచోరులు యిప్పుడు చారులై యనుమానముగల మనుష్యులతో నిట్లనవలెను మీరు మాయింటికి రండి భక్ష్యభోజ్యాదులు పుచ్చుకొని యచట తలచిన తలపును తత్సిద్ధిని యెరిగి మనకు జెప్పును గావున నతనిని చూతామనిన్ని యొకడు అనేకమందితో యుద్ధముశేయగలవాడు చూతము రమ్మనుమనిన్ని యిట్టిమిషలచేరాజుచే నధికృతులగు దండధారపురుషులవద్దికి తీసుకొని పోయియప్పగింతురు॥౨౬౮॥

మూ॥ యేతత్ర నోపసర్పేయు ర్మూల ప్రణిహితాశ్చయే ।
తా న్ప్రసహ్య నృపో హన్యా త్సమిత్ర జ్ఞాతిబాంధవాన్॥౨౬౯॥

పైనిచెప్పినట్లు భక్ష్యభోజ్యాదిమిషకు లోబడక పట్టుబడుదుమను శంకచే నెవళ్ళు వెనక దీతురో యెవళ్లు పురాణచోరులు బంపబడిరో యాసంకోచము చేతనే వాళ్లు చోరులని నిశ్చయించుకుని రాజు వాళ్లను వాళ్లతోగలసియున్న మిత్రపుత్రాదులతోగూడ జంపించవలెను॥ ౨౬౯॥

మూ॥ నే హోఢేన వినాచౌరం ఘాతయే ద్ధార్మికో నృపః ।

సహోఢం సోపకరణం ఘాతయే దవిచారయన్॥౨౭౦॥

ధార్మికుడగు రాజు దొంగిలింపబడిన వస్తువులచేగాని కన్నగాడిసాధనముల చేగాని చోరుడని నిశ్చయము లేకున్న ననుమానమాత్రముచే వానిజంపరాదు హృతద్రవ్యచోరోపకరణములచే నిశ్చయింపబడిన వానినిశ్శంకముగ జంపవలెను॥

మూ॥ గ్రామేష్వపిచ యేకేచి చ్చోరాణాం భక్తదాయకాః ।
భాండావకాశ దాశ్చైవ సర్వాం స్తానపి ఘాతయేత్॥౨౭౧॥

గ్రామములందు నెవరయితే చోరులని యెరిగిన్ని వాళ్లకన్నమున్ను చౌర్యధనమును దాచుటకుపయోగించెడి గృహమునిత్తురో వారినందరినిన్ని రాజుజంపవలెను॥ ౨౭౧॥

మూ॥ రాష్ట్రేషు రక్షాధికృతాన్ సామంతాంశ్చైవ చోదితాన్।
అభ్యాఘాతేషు మధ్యస్థాన్ శిష్యా చ్చోరానివద్రుతం॥౨౭౨॥

ఎవరు రాజ్యమందు రక్షార్థమై నియోగింపబడినవారో ఎవరు సీమాంతమం దుండెడివారో వారుక్రూరులై చోరులు జనులను బీడించు నపుడు వినియుదాసీనులై యుండి రేని రాజువారిని చోరులనువలెను జంపవలెను॥ ౨౭౨॥

మూ॥ యశ్చాపి ధర్మసమయాత్ ప్రచ్యుతో ధర్మజీవనః ।
దండేనైవ తముష్యోషే త్స్వకా ద్ధర్మాద్ధి విచ్యుతం॥౨౭౩॥

ధర్మజీవనుడనగా యజ్ఞములు చేయించడము ప్రతిగ్రహము మొదలగు వాటికై పరులకు ధర్మోపదేశమొనర్చువారిచే నాయజ్ఞదానాదిధర్మములను జేయించి బ్రదికెడి బ్రాహ్మణుడు అబ్రాహ్మణుడు ధర్మమర్యాదనతిక్రమించి స్వధర్మభ్రష్టుడయ్యేనేని వానిన్ని దండముచే పీడింపవలెను॥ ౨౭౩॥

మూ॥ గ్రామఘాతే హితాభంగే పథిమోషాభి దర్శనే ।
శక్తితో నాభి ధావంతో నిర్వాస్యా స్సపరిచ్ఛదాః॥౨౭౪॥

గ్రామములందు బందిపట్టుజరుగుచున్నట్టును చెరువులు ఏటికాలువలు తెగిపోయి సస్యోపయోగమగు నీరుపోవుచున్నట్లున్ను దారిలో తెరవాట్లు జరుగుచున్నట్లున్ను తెలియడముతోనే శక్తికొలదిపరిగెత్తివెళ్లి రక్షింపనివాళ్ళను శయ్యాగవా

శ్వాపపరికరముతో దేశమును దాటించవలెను॥ ౨౭౪॥

మూ॥ రాజ్ఞః కోశాపహర్తౄంశ్చ ప్రతికూలేషుచ స్థితాన్ ।
ఘాతయేద్వివిధై ర్దండై రరీణాం చోపజాపకాన్॥ ౨౭౫॥

రాజుయొక్క ధనగృహమునుండి ధనమునుదొంగలించినవాళ్ళనున్ను రాజాజ్ఞకు భంగముచేసినవాళ్లనున్ను రాజవిరోధులతోసిలాకాపడినవాళ్ళనున్ను తత్తదపరాధానుసారముగా కరపాదజిహ్వాచ్ఛేదనాది చిత్రవధ జేయవలెను॥ ౨౭౫॥

మూ॥ సంధిం భిత్త్వాతుయే చౌర్యం రాత్రౌ కుర్వంతితస్కరాః।
తేషాం ఛిత్త్వా నృపోహస్తౌ తీక్ష్ణేశూలేనివేశయేత్॥ ౨౭౬॥

ఎవళ్ళు రాత్రియందు కన్నముత్రవ్వి పరధనమునుహరింతురో వాళ్ళయొక్క హస్తములను తెగగొట్టించి తీక్ష్ణమైనశూలమందు గ్రొత్తఱియించవలెను॥ ౨౭౬॥

మూ॥ అంగుళీగ్రంధిభేదస్య ఛేదయేత్ప్రథమేగ్రహే।
ద్వితీయే హస్తచరణౌ తృతీయేవధమర్హతి॥ ౨౭౭॥

ముళ్లైవిప్పిపరుల సువర్ణాదిద్రవ్యమును హరించినవాడు గ్రంధిభేది వాడొకమారట్టిచౌర్యమొనర్చెనేని ॥ "శ్లో ॥ ఉత్క్షేపక గ్రంథిభేదౌ కరసందంశహీనకౌ" అను యాజ్ఞవల్క్యవచనముచే వానితర్జన్యంగుష్ఠములను ఛేదించవలెను- రెండవమారట్టి చౌర్యమొనర్చెనేని కరపాదభేదము జేయించవలెను- మూడవమారు చేసెనేని వధకర్హుడగును॥ ౨౭౭॥

మూ॥ అగ్నిదాన్ భక్తదాంశ్చైవ తథా శస్త్రావకాశదాన్।
సన్నిధాతౄంశ్చ మోషస్య హన్యాచ్చోరమివేశ్వరః॥ ౨౭౮॥

మూటలువిప్పేవానికి అగ్నియునన్నమును శస్త్రములను చౌర్యధనము దాచుకొనుటకు స్థలమునిచ్చినవారినిన్ని ఆదొంగవానిధనమెవరివద్దనుండునో వారినిన్ని చోరులనూవలెను రాజుదండించవలెను॥ ౨౭౮॥

మూ॥ తటాకభేదకం హన్యా దప్సుశుద్ధవధేనవా।
యద్వాపిప్రతిసంస్కుర్యా ద్దాప్యస్తూత్తమసాహసం॥ ౨౭౯॥

ఎవడు స్నానపానాదుల కుపయోగించెడు చెరువు ఘట్టును కొట్టివేసి జలమును నశింపజేయునో వానినుదకమందు ముంచివేసైనా ప్రకారాంతరముచేనైన జంపవలెను॥ యిట్లు కాకుండిన తటాకమును మరల బాగుజేయించుటకు ఉపయోగించెడు నీరుతీసివేసినవానికి ఉత్తమసాహసమను శిక్షవిధించవలెను॥ ౨౭౯॥

మూ॥ కోష్ఠాగారాయుధాగారా దేవతాగారభేదకాన్।
హస్త్యశ్వరథహర్తౄంశ్చ హన్యాదేవావిచారయన్॥ ౨౮౦॥

రాజసంబంధములగు కోశగృహము నాయుధగృహము దేవాలయము యివి బహుధనవ్యయసాధ్యములుగావున వీటిని నశింపజేసిన వారినిన్ని హస్త్యశ్వరథాపహారులనున్ను శీఘ్రముగ జంపవలెను యేమైతే సంక్రమధ్వజయష్టిదేవతాప్రతిమా భేదకులకు పంచశతదండవిధానము చెప్పగలడు యిచ్చట దేవతాగారభేదకునకు వధవిధించుటవలన మృణ్మయములగు దేవాలయప్రతిమాదులని యిచ్చట దెలియతగ్గది॥ ౨౮౦॥

మూ॥ యస్తు పూర్వనివిష్టస్య తటాకస్యోదకం హరేత్।
ఆగమంవాప్యపాంభిద్యాత్స దాప్యః పూర్వసాహసం॥ ౨౮౧॥

ఎవడైతే ప్రజలకుపకారమగునని యెవనిచేతనైన జేయబడిన తటాకము యొక్క ఉదకముచే తీసికొనునో యావత్తుజలమును నశింపజేసినవానికి వధ దండమని మున్ను జెప్పబడెను ఆచెరువునకు నీరువచ్చేమార్గమును అడ్డుకట్టినవానికి ప్రథమసాహసము దండము విధించవలెను॥ ౨౮౧॥

మూ॥ సముత్సృజేద్రాజమార్గే యస్త్వమేధ్యమనాపది।
సద్వౌకార్షాపణౌదద్యా దమేధ్యంచాశుశోధయేత్॥ ౨౮౨॥

అనాతురుడెవడు రాజమార్గమందు పురీషమును విడుచునో వాడు రెండుపణములు దండమిచ్చుకొని స్వయముగా నయ్యమేధ్యమును తీసివేయవలెను॥ ౨౮౨॥

మూ॥ ఆపద్గతోథవావృద్ధో గర్భిణీ బాలఏవవా।
పరిభాషణమర్హంతి తచ్చశోధ్యమితి స్థితిః॥ ౨౮౩॥

రోగియు వృద్ధుడు గర్భిణియు బాలుడు రాజమార్గమందు పురీషమును వి

డిచెసేని వారికిదంటుగలేదుగాని వాళ్ళను చీవాట్లుపెట్టి యియ్యావైద్యమును వాళ్ళచే తీయించవలెనని శాస్త్రమర్యాద॥ అ౹౩॥

మూ॥ చికిత్సకానాం సర్వేషాం మిథ్యాప్రచరతాందమః।
అమానుషేషు ప్రథమో మానుషేషుతుమధ్యమః॥ అ౹౪॥

చికిత్సాప్రకారమెరుగక వైద్యమునచేయుదువారికి గవాదిపశువులకొనచేసేని ప్రథమసాహసమున్ను మనుష్యులకు జేసినేని మధ్యమసాహసమున్ను దండము విధించవలెను॥ అ౹౪॥

మూ॥ సంక్రమధ్వజయష్టీనాం ప్రతిమానాంచ భేదకః।
ప్రతికుర్యాచ్చ తత్సర్వం పంచదద్యాచ్ఛతానిచ॥ అ౹౫

సంక్రమమనగా జలోపరిగమనార్థమై కాష్ఠపాషాణాదినిర్మితమధ్వజమనగా రాజద్వారమందుండు చిహ్నము యష్టియనగా పుష్కరిణ్యాదులయందుండెడి కాష్ఠము ప్రతిమనగా మృణ్మయములగు బొమ్మలు వీటిని నశింపజేశిన వారికైదువందలపణములు శిక్షవిధించవలెను- వాటిని క్రొత్తవిగావానిచే జేయించవలెను॥

మూ॥ అదూషితానాం ద్రవ్యాణాం దూషణే భేదనేతథా।
మణీనా మపవేధేచ దండః ప్రథమసాహసః॥ అ౹౬॥

ప్రశస్తమయినవస్తువులలో అప్రశస్తమగువాటినికలిపి నారత్నములకుదోలలు వ్యత్యాసముగపొడిచినా ప్రథమసాహసముదండమువిధించవలెనుఇట్లుచేయుటచేపరులవస్తువులుచెడినందుకు ద్రవ్యాంతరమాస్వామికిప్పించి సంతుష్టినొందించవలెను॥

మూ॥ సమైర్హి విషమం యస్తు చరేద్వై మూల్యతోపివా।
సప్రాప్నుయా ద్దమం పూర్వం నరో మధ్యమమేవవా॥ అ౹౭॥

మూల్యము సమముగానుంచుకొని కొందరికి మంచివస్తువులనున్ను కొందరికల్పమూల్యవస్తువులనున్ను ఇట్లువిషమముగా నిచ్చినేని వానికి ప్రథమసాహసముదండముగావిధించవలెను॥ అ౹౭॥

మూ॥ బంధనానిచ సర్వాణి రాజమార్గే నివేశయేత్।

దుఃఖితా యత్రదృశ్యేరన్ వికృతాః పాపకారిణః॥౨౮౮॥
ప్రాకారస్యచ భేత్తారం పరిఘాణాంచ పూరకం।
ద్వారాణాంచైవ భఙ్క్తారం క్షిప్రమేవ ప్రవాసయేత్॥౨౮౯॥

బంధనగృహములనన్నింటిని రాజమార్గమందు కట్టించవలెను పాపకర్ములు పొందెడి పీడలనందరును చూచేలాగుచేయించవలెను ప్రాకారమును పడగొట్టిన వారినిన్ని కంతకములగప్పినవారినిన్ని ద్వారములను పోగొట్టినవారినిన్ని శీఘ్రముగ దేశాంతరమునకుపంపించవలెను॥ ౨౮౮॥ ౨౮౯॥

మూ॥ అభిచారేషు సర్వేషు కర్తవ్యో ద్విశతోదమః।
మూలకర్మణి చానాప్తైః కృత్యాసు వివిధాసుచ।

అభిచారహోమాది శాస్త్రీయమారణోపాయములందున్ను లౌకికములందున్ను మూలములుపాతడము కాలిక్రిందిమట్టి సంగ్రహించడముమొదలగు కృత్యములందు మరణముగాకుండపీడించుటకుమాత్రము జేసినవారికి నిన్నూరుపణములున్ను మరణార్థమే ప్రయత్నముజేసినవారికి మరణదండమున్ను ఇట్లు మాతృపితృభార్యాదివ్యతిరిక్తులగువారు జేయుపనులు నానాప్రకారములందున్ను రెండువందలపణములు దండనువిధించవలెను॥ ౨౯౦॥

మూ॥ అబీజవిక్రయీచైవ బీజోత్కృష్టం తథైవచ।
మర్యాదాభేదకశ్చైవ వికృతం ప్రాప్నుయాద్వధం॥౨౯౧॥

మొలవనివిత్తనమును మొలుచును బహుమంచివిత్తనమని యమ్మినవానికిన్ని గ్రామనగరాదుల సీమాచిహ్నములను నశింపజేసిన వానికిన్ని వికృతముగా కర్ణనాసాకరచరణాదిచ్ఛేదరూపమగు శిక్షను జేయించవలెను॥ ౨౯౧॥

మూ॥ సర్వకంటకపాపిష్ఠం హేమకారంతు పార్థివః।
ప్రవర్తమానమన్యాయే ఛేదయేల్లవశఃక్షురైః॥౨౯౨॥

దొంగలందరిలోను పెద్దదొంగయు పాపిష్ఠుడునగు బంగారుపనివాడు తూనికలోనున్ను లోహాంతరమును కలపడము చేతనున్ను గీటుబెట్టడములో రాములలోనున్ను మిథ్యావ్యాపారముచే సువర్ణమును హరించును గావున వాని శరీరమంత

యు మంగళికర్తులచే నింతకాలతలుగా గోయించవలెను॥ ఇదియును దోషానుసారముగా నంగవిశేషములను గాని శరీరమంతయు గాని ఛేదించవలెను॥ శ్లో ౨॥

మూ॥ సీరాద్రవ్యాపహరణే శస్త్రాగ్నా మౌషధస్యచ।
కాలమాసాద్య కార్యంచ రాజాదండం ప్రకల్పయేత్॥ శ్లో ౩॥

దున్నబడెడు భూమియొక్క ద్రవ్యములనగా నాగలికుద్దాలను మొదలగు వాటినిన్ని శస్త్రములనున్ను నౌషధములనున్ను దొంగిలించినవానికి నుపయోగకాలేతరకాలాపేక్షచేతనున్ను ప్రయోజనాపేక్షచేతనున్ను రాజు దండమును కల్పించి విధించవలెను॥ శ్లో ౩॥

మూ॥ స్వామ్యమాత్యౌ పురం రాష్ట్రం కోశదండౌ సుహృత్తథా।
సప్తప్రకృతయో హ్యేతాః సప్తాంగం రాజ్య ముచ్యతే॥ శ్లో ౪॥

రాజున్ను మంత్రులున్ను దుర్గయుక్తమగు రాజధానిన్ని దేశమున్ను ధనసంచయమున్ను కరితురగరథపదాతియుక్తసైన్యమున్ను సప్తమాధ్యాయోక్త త్రివిధమిత్రసంపత్తిన్ని ఈ యేడున్ను సప్తప్రకృతులనబడును ఇవే యంగములు వీటితో గూడి సప్తాంగము రాజ్యమనబడెను అందువల్ల నేమనిన॥ శ్లో ౪॥

మూ॥ సప్తానాం ప్రకృతీనాంతు రాజ్యస్యాసాం యథాక్రమం।
పూర్వం పూర్వం గురుతరం జానీయాద్వ్యసనం మహత్॥ శ్లో ౫॥

ఈ సప్తరాజ్యప్రకృతులలోనున్న క్రమముగా నుత్తరోత్తర వినాశముకంటే పూర్వపూర్వనాశముచే గొప్పకష్టమగునది యుక్తమే గదా మంత్రవ్యసనముకంటే స్వబలవ్యసనమెక్కువది బలసంపన్నునకే సామర్థ్యమెక్కువ గావున బలము కంటే ధననాశమెక్కువది ధనము లేకుండెనేని సైన్యమున్ను లేదు గావున ధననాశముకంటే రాష్ట్రనాశమెక్కువది రాష్ట్రమునశించెనేని ధనముసుతరాము లేదు గావున రాష్ట్రనాశముకంటె దుర్గనాశమెక్కుడు దుర్గమునశించెనేని రాష్ట్రరక్షణము లేదుగావున దుర్గనాశముకంటె నమాత్యనాశమెక్కుడు మంత్రిలేకుండెనేని సర్వాంగములు లేనిదే గనుక మంత్రికంటె రాజెక్కువ సర్వమాత్మార్థమే గావున అందుచేత నుత్తరాపేక్షచే పూర్వమునురక్షించుచుండవలెను॥ శ్లో ౫॥

మూ॥ సప్తాంగస్యేహ రాజ్యస్య విష్టబ్ధస్యత్రిదండవత్ ।

అన్యోన్యగుణవైశేష్యాన్న కించిదతిరిచ్యతే॥ ౨౯౬॥

లోకమందు సప్తాంగయుక్తమగు రాజ్యమునకు త్రిదండమునకు వలెనన్యోన్యమునుగుణ విశేషత్వమువలన నొకటికొకటియధికమనరాదు పూర్వశ్లోకమందైతె పూర్వపూర్వ మధికమని చెప్పెను ఐనప్పటికిన్ని యీయంగములలో నొకదాని సంబంధమగు నుపకారమొకటి జేయు లేదు గావున నుత్తరోత్తరాంగమున్ను నపేక్షించదగ్గదే యనుపదమాధిక్యనిషేధార్థము ఈవిషయమైయతియొక్క త్రిదండమే దృష్టాంతము ఆత్రిదండము చతురంగుళ గోవాలవేష్టనమువలన నగు నన్యోన్యసంబంధము దానిలోత్రిదండధారణ శాస్త్రార్థమందొక దానికాధిక్యము చెప్ప లేదు॥ ౨౯౬॥

మూ॥ తేషు తేషుతుకృత్యేషు తత్తదంగంవిశిష్యతే।
యేనయత్సాధ్యతేకార్యం తత్తస్మిన్ శ్రేష్ఠముచ్యతే॥ ౨౯౭॥

ఆయాయికార్యములందాయాయంగమతిశయమగుచున్నది ఆకార్యమితరాంగము జేయలేదు గావున నేయంగముచే నేకార్యము జేయదగ్గదో యాకార్యమందాయంగమే ప్రధాన మగుచున్నది యందువలన నన్యోన్యగుణవిశేషతయనియేది చెప్పబడెనో యదివీనిచేస్ఫుటమాయెను॥ ౨౯౭॥

మూ॥ చారేణోత్సాహయోగేన క్రియయైవచకర్మణాం।
స్వశక్తింపరశక్తించ నిత్యంవిద్యాన్మహీపతిః॥ ౨౯౮॥

సప్తమాధ్యాయోక్తమగు కాపటికాదికముచే బలమున నుత్సాహమును బొందించుటచేతనున్ను హస్తిబంధనవణిక్పథాదికర్మములను జేయుడము చేతనున్ను బుట్టిన తమయొక్కయు శత్రువులయొక్కయు శక్తిని రాజెప్పుడును దెలుసు కొనవలెను॥ ౨౯౮॥

మూ॥ పీడనానిచ సర్వాణి వ్యసనాని తథైవచ।
ఆరభేత తతః కార్యం సంచింత్యం గురులాఘవమ్॥ ౨౯౯॥

తమరాజ్యమందున్ను శత్రురాజ్యమందున్నుగల కామక్రోధోద్భవములగు మరణకారిదుఃఖములగురులఘు భావము నాలోచించి సంధివిగ్రహాదికార్యమును జేయ నారంభించవలెను॥ ౨౯౯॥

మూ॥ ఆరభేతైవకర్మాణి శ్రాంతశ్శ్రాంతః పునఃపునః।
కర్మాణ్యారభమాణంహి పురుషం శ్రీర్నిషేవతే॥300॥

రాజు స్వరాజ్యవృద్ధి పరపక్షజయసమిత్త మగు కార్యములనున్ను ఏలాగున్నో ప్రకారాగయునదని ఫలములనున్ను ఆరంభించి బుద్ధిచేనే సి యలసి మరల నాకార్యముల నారంభించవలెను ఏహేతువచే కార్యములను జేయుంచుచున్న పురుషుని లక్ష్మి యత్యంతము వరించునో అట్లు ఆశయను గానియ బ్రాహ్మణునందునున్నలక్ష్మి లేకన్న మాటలేను యంకురించిన నదియును శోషించుచున్నదియుగాను సారము గకర్మములు ఫలించునని రాజుస్వకార్యములందుదాసీనుడు గారాదు యెందుచే తనచెను॥ 300॥

మూ॥ కృతం త్రేతాయుగంచైవ ద్వాపరం కలిరేవచ।
రాజ్ఞో వృత్తాని సర్వాణి రాజాహియుగ ముచ్యతే 301॥

కృతత్రేతాద్వాపరకలియుగములు రాజుయొక్క చేష్టావిశేషములేను ఆరాజుయొక్క కర్మములచేతనే సత్యాదివిశేషములు ప్రవర్తించు గావున రాజుచేష్ట చేతనే కృతయుగాదులని చెప్పబడును కృతాదియుగము లెట్టిచేష్టలుగలవనిన చెప్పుచున్నాడు॥ 301॥

మూ॥ కలిః ప్రసుప్తో భవతి సజాగ్రద్ద్వాపరంయుగమ్।
కర్మస్వ భ్యుద్యతస్త్రేతా విచరంస్తు కృతం యుగమ్॥302॥

అజ్ఞానాలస్యాదులచే రాజెప్పుడుద్యుక్తి లేకయుండునో యప్పుడు కలియుగముగును ఎప్పుడు రాజుతెలిసియున్న కార్యములను చేయడో యప్పుడు ద్వాపరము ఏప్పుడుకార్యములను జేయనుద్యోగించునో యప్పుడు త్రేతాయుగముగుచున్నది ఎప్పుడు యథాశాస్త్రముగా స్వకర్మములను జేయుచుండునో యప్పుడుకృతయుగము గావున రాజు కర్మానుష్ఠానపరుడు గావలెనని తాత్పర్యముగాని వాస్తవముగా కృతాదియుగముల చెప్పడముగాదు॥ 302॥

మూ॥ ఇంద్రస్యార్కస్య వాయోశ్చ యమస్య వరుణస్యచ।
చంద్రస్యాగ్నేః పృథివ్యాశ్చ తేజోవృత్తం నృపశ్చరేత్॥303॥

ఇంద్రాదులయొక్క తేజస్సంబంధముగలదాని కనురూపమగు చరితమును రాజుచేయవలెను రాజుకంటకోద్ధరణముచే ప్రతాపానురాగములతోఁగూర్చి యింద్రునియొక్క చరితమునను ష్ఠించవలెనని చెప్పుచున్నాడు॥ 303॥

మూ॥ వార్షికాంశ్చతురోమాసాన్ యథేంద్రోభి ప్రవర్షతి।
తథాభివర్షేత్స్వం రాష్ట్రం కామైరింద్రవ్రతంచరన్॥304॥

ఏలాగు నింద్రుడు శ్రావణాదిచతుర్మాసములందును సస్యాదిసిద్ధికై వర్షించునో యట్లు రాజింద్రవ్రతము నవలంబించి స్వరాష్ట్రీయాతసాధుజనులకు నభిమతార్థములను వర్షించవలెను॥ 304॥

మూ॥ అష్టౌ మాసాన్ యథాదిత్య స్తోయంహరతి రశ్మిభిః।
తథా హరేత్కరం రాష్ట్రా న్నిత్యమర్క వ్రతంహితత్॥305॥

సూర్యుడేరీతిని మార్గశీర్షాదిమాసము లెనిమిదింటియందును స్వల్పతాపముగలరశ్ములచే భూగతమగు రసమును గొంచెముకొంచెము హరించునో యట్లురాజు రాష్ట్రమువలన దయతో శాస్త్రీయమగు పన్నును మెల్లమెల్లగ బుచ్చుకోవలెను రాజుకిదియర్కవ్రతము॥ 305॥

మూ॥ ప్రవిశ్య సర్వభూతాని యథాచరతి మారుతః।
తథాచారైః ప్రవేష్టవ్యం వ్రతమేతద్ధిమారుతమ్॥306॥

ఎట్లుసర్వభూతములయొక్క లోపల ప్రాణవాయువు ప్రవేశించిచరించునో యట్లనే స్వపరమండలములందుచారద్వారా రాజుప్రవేశించి చికీర్షితార్థసాధనమునెరుంగునది యిదిమారుతవ్రతము॥ 306॥

మూ॥ యథాయమః ప్రియద్వేష్యౌ ప్రాప్తేకాలేనియచ్ఛతి।
తథా రాజ్ఞానియంతవ్యాః ప్రజా స్తద్ధియమవ్రతం॥ 307॥

వస్తుతఃయమునకు శత్రుమిత్రులులేరు గాని తన్నెంచాస్తుతులనొనర్చినవారినిమరణకాలమయినప్పుడు సమనుగానెట్లు నియమించునోయట్లురాజపరాధానుసారముగప్రజలకుశిక్షవిధించవలెనని యిదియామ్యవ్రతము॥ 307॥

మూ॥ వరుణేన యథాపాశై ర్బద్ధఏవాభి దృశ్యతే।

తథా పాపాన్నిగృహ్ణీయా ద్వ్రతమేతద్ధి వారుణం॥ ౩౦౮॥

వరుణుడు స్వపాశబంధనార్హులని యేలాగునైతె తన పాశములచేగట్టి నిశ్శంకముగనగుపరచునో రాజట్లనే పాపాత్ములను బంధించి నిశ్శంకముగ దండించవలెనిదియే వారుణవ్రతము॥ ౩౦౮॥

మూ॥ పరిపూర్ణం యథాచంద్రం దృష్ట్వాహృష్యంతి మానవాః।
తథాప్రకృతయో యస్మిన్ సచాంద్ర వ్రతికోనృపః॥ ౩౦౯॥

పూర్ణచంద్రునిజూచి మనుష్యులెట్లుహర్షింతురో యమాత్యాదులు రాజును జూచి యామోదించుటయే రాజు చంద్రాచారచారియగుట॥ ౩౦౯॥

మూ॥ ప్రతాపయుక్తస్తేజస్వీ నిత్యంస్యాత్పాపకర్మసు।
దుష్టసామంతహింస్రశ్చ తదాగ్నేయవ్రతంస్మృతం॥ ౩౧౦॥

ఎప్పుడు రాజు పాపాత్ములకు తీక్ష్ణుముగ గనపడి ప్రచండదండపాత మొనర్చునో ప్రతికూలులగునమాత్యాదులను హింసించునో యప్పుడా రాజుకది యాగ్నేయవ్రతమని చెప్పబడెను॥ ౩౧౦

మూ॥ యథాసర్వాణి భూతాని ధరాధారయతేసమం।
తథాసర్వాణి భూతాని బిభ్రతః పార్థివంవ్రతం॥ ౩౧౧॥

ఏలాగున భూమి చిన్నవి పెద్దవి స్థావరములు జంగమములునగుసకలభూతములనున్ను సమముగా ధరించునో రాజాప్రకారముగా ధనికులు నిర్ధనులు గుణవంతులును దీనులు సనాథులు నగువారినందరిని పోషణదానాదులచే సమముగాపోషించునుగావున రాజుకిది పార్థివమగువ్రతము॥ ౩౧౧

మూ॥ ఏతైరుపాయైరన్యైశ్చ యుక్తోనిత్యమతంద్రితః।
స్తేనాన్ రాజానిగృహ్ణీయా త్స్వరాష్ట్రే పరఏవచ॥ ౩౧౨॥

ఇట్లుచెప్పబడినవియు నితరములగుబుద్ధిచే నూహించ తగినట్టియు యుపాయములచేననలసుడగుచు తనదేశమందలియు నన్యదేశమునుండివచ్చినట్టియు చోరులనుబట్టిపల్లార్చవలెను "సోగ్నిర్భవతివాయుశ్చ" ఇత్యాదికముచే పూర్వసిద్ధముంబ

లై నగ్న్యాదిరూపత్వము జెప్పఁబడెను ఇచ్చట తద్గుణత్వముచే స్ఫుటమైచెయ్యబడెను గాన పునరుక్తిలేదు॥ ౩౧౨॥

మూ॥ పరామప్యాపదం ప్రాప్తో బ్రాహ్మణాన్న ప్రకోపయేత్।
తే హ్యేనం కుపితా హన్యుస్సద్యస్సబలవాహనం॥ ౩౧౩॥

కోశక్షయాదికముచే గొప్పయాపదనొంద నైనను రాజు బ్రాహ్మణులను కోపింపజేయగూడదు ఆ బ్రాహ్మణులు కోపించిరేని శాపాభిచారములచే సబలవాహనుఁడగు రాజును నశింప చేతురదియుక్తమేగదా॥ ౩౧౩॥

మూ॥ యైః కృతస్సర్వభక్ష్యోఽగ్ని రపేయశ్చ మహోదధిః।
క్షయీ చాప్యాయితస్సోమః కో న నశ్యేత్ప్రకోప్య తాన్॥ ౩౧౪॥

బ్రాహ్మణుల శాపముచే నగ్ని సర్వభక్షకుడున్ను సముద్రుడపేయసలిలుడున్ను చంద్రుడు క్షయయుక్తుడున్ను తరువాత పూరితుడున్ను జేయబడిరో యా బ్రాహ్మణులను కోపింపజేసి యెవడు నశించలేదు మరిన్ని॥ ౩౧౪॥

మూ॥ లోకానన్యాన్ సృజేయుర్యే లోకపాలాంశ్చ కోపితాః।
దేవాన్ కుర్యురదేవాంశ్చ కః క్షిణ్వంస్తాన్సమృధ్నుయాత్॥ ౩౧౫॥

ఏ బ్రాహ్మణులు మరికొన్ని స్వర్గాదిలోకములనున్ను మరికొందరి లోకపాలురనున్ను సృజించుచున్నారని యూహించబడునో దేవతలనున్ను మానుషాదులనుగా జేయుచున్నారో యా బ్రాహ్మణులను పీడించువాడెవడు సమృద్ధినొందెనంతియె కాదు॥ ౩౧౫॥

మూ॥ యానుపాశ్రిత్య తిష్ఠంతి లోకా దేవాశ్చ సర్వదా।
బ్రహ్మ చైవ ధనం యేషాం కో హింస్యాత్తాన్ జిజీవిషుః॥ ౩౧౬॥

యజ్ఞాదికర్మశీలురగు నే బ్రాహ్మణుల నాశ్రయించి పృథివ్యాదిలోకములున్ను దేవతలున్ను "అగ్నౌ ప్రాస్తాహుతిస్సమ్యక్" గను న్యాయముచే స్థితినిబొందుచున్నారో వేదమే యెవరికి ధనమో యనగా నభ్యుదయసాధనమౌటచేతనున్ను యాజనాధ్యాపనాదిసాధనోపాయమౌటవల్లనున్ను ననియు బ్రాహ్మణులను బ్రతుకనాశగలవాడు వెవడు హింసించీని యిట్లయితే విద్వాంసుడగు బ్రాహ్మణుని సేవించవలె

నని యూహగా జెప్పుచున్నాడు॥ ౩౧౬॥

మూ॥ అవిద్వాంశ్చైవ విద్వాంశ్చ బ్రాహ్మణో దైవతం మహత్।
ప్రణీతశ్చా ప్రణీతశ్చ యథాగ్ని ర్దైవతం మహత్॥౩౧౭॥

వేదికయందాహితమైన ననాహితమైన నగ్నియెట్లుమహాదేవతో యట్లు మూఖుఁడైనను విద్వాంసుడైనను బ్రాహ్మణుడు ప్రకృష్టమైన దేవతయని తెలియవలెను॥

మూ॥ శ్మశానేష్వపి తేజస్వీ పావకో నైవ దుష్యతి।
హూయమానశ్చ యజ్ఞేషు భూయఏవాభివర్ధతే॥౩౧౮॥

ఈబ్రాహ్మణులు తమకిష్టములైనట్టు సర్వకర్మములందును వర్తించుచుండినను ప్పటికిని బ్రాహ్మణులు పరదేవతారూపులుగావున పూజ్యులే యెట్లుమికిలి తేజస్వియగునగ్ని శ్మశానమందు శవమును దహించుచున్నప్పటికిని కార్యములయందు దోషయుక్తముగాదు మరియేమంటె మరలయజ్ఞములందు హోమముచేయ్యబడ్డయగ్ని యభివృద్ధినిపొందుచున్నది॥ ౩౧౮॥

మూ॥ ఏవం యద్యప్యనిష్టేషు వర్తంతే సర్వకర్మసు।
సర్వథా బ్రాహ్మణాః పూజ్యాః పరమం దైవతంహి తత్॥౩౧౯॥

ఈప్రకారముగా సకలకుత్సితకర్మములయందును బ్రాహ్మణులుప్రవర్తించుచున్నప్పటికిని సర్వప్రకారముచేతనున్ను వారుపూజ్యులే యీ బ్రాహ్మణులు ప్రకృష్టదైవతములుగదా స్తుత్యర్థమాటవల్లనుండి దీనికి యథాశ్రుతార్థవిరోధము శంకించదగదు॥ ౩౧౯॥

మూ॥ క్షత్రస్యాతి ప్రవృత్తస్య బ్రాహ్మణాన్ప్రతి సర్వశః।
బ్రహ్మైవ సన్నియంతృస్యాత్ క్షత్రంహి బ్రహ్మసంభవం॥౩౨౦॥

బ్రాహ్మణులకు సర్వప్రకారముచేతను పీడకలుగునట్లు ప్రవర్తించిన క్షత్రియునకు శాపాభిచారాదులచే బ్రాహ్మణులే లెస్సగా శాసకులగుచున్నారు యేమిహేతువచే బ్రహ్మబాహు ప్రసూతులగుటవలన క్షత్రియులు బ్రాహ్మణసంభూతులగుచున్నారది యెట్లననిన॥ ౩౨౧॥

మూ॥ అద్భ్యోగ్నిర్బ్రహ్మతః క్షత్రమశ్మనో లోహ ముత్థితం।

తేషాంసర్వత్రగం తేజ స్స్వాసుయోనిషుశామ్యతి॥ 3౨౧॥

జలబ్రాహ్మణపాషాణములవలన నగ్నిక్షత్రియలోహములుద్భవించె నామూటి యొక్క తేజస్సు సర్వస్థలములందును దహనపరాభవ ఛేదనార్థమైనకార్యమును జే యును స్వకారణములగు జలబ్రాహ్మణపాషాణములందు దహనాదికముజేయ స మర్థముకాదు॥ 3౨౧॥

మూ॥ నాబ్రహ్మక్షత్రమృధ్నోతి నాక్షత్రంబ్రహ్మవర్ధతె।
బ్రహ్మక్షత్రంచ సంపృక్త మిహచాముత్రవర్ధతె॥3౨౨॥

బ్రాహ్మణరహితుడగుక్షత్రియుడువృద్ధినొందడు శాంతికపౌష్టికవ్యవహారక్రియా దిధర్మములు బ్రాహ్మణుడులేనిరాజుకు గానేరవు గావునయిటులేక్షత్రియరహితుడ గుబ్రాహ్మణుడు వృద్ధినొందడు రక్షణములేక యాగాదికర్మనిష్ఠగానేరదు గా వున మరియేమంటె బ్రాహ్మణుడున్ను క్షత్రియుడున్ను పరస్పరసంబంధము గలు గుచుండెనేని యిహలోకపరలోకములందుధర్మార్థకామమోక్షావాప్తిచే వృద్ధినొం దుదురుయీదండప్రకరణమందున్నయిది బ్రాహ్మణస్తుతి అధికారుడైనప్పటికి బ్రా హ్మణులకే లఘుదండముగావలెనని యర్థముగలదగుచున్నది ఇది యెప్పుడనుటే బ్రాహ్మణత్వప్రభుత్వవిశిష్టత్వమగుపడుచున్నదో యచికిత్స్యత రోగముచే మృత్యు వాసన్నమగుచున్నదో యప్పుడతనితాత్పర్యము॥ 3౨౨

మూ॥ దత్వాధనంతు విప్రేభ్య స్సర్వందండ సముద్ధితం।
పుత్రేరాజ్యం సమాసృజ్య కుర్వీతప్రాయణంరణే॥ 3౨3॥

మహాపాతకులవలన వచ్చినదియు న్యాయముగాగామిగలిన సర్వమైన దండధనము న్ను బ్రాహ్మణునకిచ్చి పుత్రునికి రాజ్యమిచ్చి మృత్యువాసన్నమైనప్పుడు ఫలాతిశ యార్థమై యుద్ధమందు ప్రాణత్యాగముజేయవలెను యుద్ధములేకుండెనేని నిరశ నవ్రతాదికముచేతనైన మృతినొందవలెను॥ 3౨3॥

మూ॥ ఏవంచరన్ సదాయుక్తో రాజధర్మేషు పార్థివః।
హితేషు చైవలోకస్య సర్వాన్ భృత్యాన్నియోజయేత్॥ 3౨౪॥

ఈప్రకారముగ నధ్యాయత్రయముచే జెప్పబడినరాజధర్మములందువ్యవహ రించుచున్నరాజు ప్రజలయొక్క హితమువిషయమై సకలప్రజలనున్ను నియమించు

ను బరిపాలించవలెను॥ ౩౨౪॥

మూ॥ ఏషోఽఖిలః కర్మవిధి రుక్తో రాజ్ఞ స్సనాతనః।
ఇమంకర్మవిధిం విద్యాత్క్రమశో వైశ్యశూద్రయోః॥ ౩౨౫॥

ఇది పారంపర్యాగతముగావున నిత్యమగు రాజుయొక్క కర్మానుష్ఠానము చెప్పబడెను ఇప్పుడు వైశ్యశూద్రులకు వక్ష్యమాణమగు కర్మానుష్ఠానము క్రమముగా దెలిసికొనవలయును॥ ౩౨౫॥

మూ॥ వైశ్యస్తు కృతసంస్కారః కృత్వా దార పరిగ్రహం।
వార్తాయాం నిత్యయుక్తస్స్యా త్పశూనాంచైవ రక్షణే। ౩౨౬॥

వైశ్యుడుపనీతుడై దారపరిగ్రహమొనర్చి వక్ష్యమాణమగుజీవికవిషయమై కృషివాణిజ్యపాశుపాల్యములయందు యుక్తుడుగావలెను వార్తయనగా కృష్యాదులగు మూండిటికిన్ని పేరయినప్పటికిన్ని పశుపాలనమందుముఖ్యత్వజ్ఞాపనార్థము మరల జెప్పెను॥ ౩౨౬॥

మూ॥ ప్రజాపతిర్హి వైశ్యాయ సృష్ట్వాపరిదదేపశూన్।
బ్రాహ్మణాయచ రాజ్ఞేచ సర్వాఃపరిదదే ప్రజాః॥ ౩౨౭॥

బ్రహ్మ పశువులను సృజించి రక్షణార్థమై వైశ్యునకిచ్చెను గావున వైశ్యుడు గోరక్షణముజేయవలయునని పూర్వోక్తమున కనువాదము ప్రజలనుసృజించి బ్రాహ్మణునకున్ను రాజునకున్ను యిచ్చెనని ప్రసంగముగా జెప్పెను॥ ౩౨౭

మూ॥ నచ వైశ్యస్య కామస్స్యా న్నరక్షేయం పశూనితి।
వైశ్యేచేచ్ఛతి నాన్యేన రక్షితవ్యా కథంచన॥ ౩౨౮॥

పశుపాలనమొనర్చనని వైశ్యుడిచ్ఛయించగూడదు వైశ్యుడు పశుపాలనము జేతునను చుండగా నన్యునకాపశువులనీరాదు॥ ౩౨౮॥

మూ॥ మణిముక్తాప్రవాళానాం లోహానాంతాంతవస్యచ।
గంధానాంచరసానాంచ విద్యాదర్ఘ బలాబలం॥ ౩౨౯॥

మణిముక్తాప్రవాళలోహవస్త్రములయొక్కయు కస్తూర్యాదిగంధ ద్రవ్యములయొక్కయు

యొక్కయు లవణాదిసద్రవ్యములయొక్కయు దేశకాలాదిభేదముచే నానారసాహాల్యోత్కృష్టాపకర్షములను వైశ్యుడెఱుంగవలయును॥ 329॥

మూ॥ బీజానాముప్తివిచ్చస్యాత్ క్షేత్రదోషగుణస్యచ।
మానయోగంచ జానీయా త్తులాయోగాంశ్చ సర్వశః॥ 330॥

సకలబీజములయొక్క విత్తులుయనగా నేబీజమేకాలమందు విత్తవలెనది విధి యు నిది యూషరక్షేత్రమిదిమంచిభూమియని భూమియొక్క గుణాగుణములను న్ను కొలతపాత్రలయొక్కయు తూనికలయొక్కయు భేదముల నన్నిటిన్ని తన్నారుడు వంచనను జేయకుండునటులు వైశ్యుడెఱుంగవలయును॥ 330॥

మూ॥ సారాసారంచ భాండానాం దేశానాంచ గుణాగుణాన్।
లాభాలాభంచ పణ్యానాం పశూనాం పరివర్ధనం॥ 331॥

సర్వవస్తువులయందును జాతియొక్కటైనను నిదియుత్కృష్టమిది యపకృష్టమ నియును మేమే దేశమందుబుట్టిన ద్రవ్యముల విలువయొక్క బహుత్వాల్పత్వములను న్ను యెంతకాలముచే నేయేసరుకుల కెంతతరుగునో నిలవచే మూల్యమునుయొక్క వృద్ధిక్షయములనున్ను వైశ్యుడెఱుంగవలయును॥ 331॥

మూ॥ భృత్యానాంచభృతింవిద్యా ద్భాషాశ్చవివిధానృణాం।
ద్రవ్యాణాం స్థానయోగాంశ్చ క్రయవిక్రయమేవచ॥ 332॥

పశువులనున్ను చేలనున్ను గాచెడి భృత్యులకు దేశకార్యానుసారముగ నిచ్చెడి జీతములభేదమునున్ను మనుష్యులయొక్క భాషలనున్ను యేవస్తువులను యేట్టితో సంబంధించి నిలవచేసిన చెడకుండునో దానినిన్ని దేశకాలాదిభేదముచేనన్నివస్తువులధరలనున్ను వైశ్యుడెఱుంగవలెను॥ 332॥

మూ॥ ధర్మేణచ ద్రవ్యవృద్ధా వాతిష్ఠేద్యత్నముత్తమం।
దద్యాచ్చ సర్వభూతానా మన్నమేవప్రయత్నతః॥ 333॥

ధర్మముగా క్రయవిక్రయములచే ధనాభివృద్ధికై యధికముగ యత్నము నొనర్చవలె నితరదానములకన్నిటికంటె నన్నమెల్లప్రాణులకొసంగవలెను॥ 333॥

మూ॥ విప్రాణాం వేదవిదుషాం గృహస్థానాం యశస్వినాం।
శుశ్రూషైవతు శూద్రస్య ధర్మో నైశ్రేయసః పరః॥ ౩౩౪॥

శూద్రులకు వేదవేత్తలును స్వకర్మానుష్ఠానతత్పరతచే ప్రసిద్ధులగు బ్రాహ్మణులకు బరిచర్యయొనర్చుటయే స్వర్గప్రాప్తిమూలమగు ధర్మము॥ ౩౩౪॥

మూ॥ శుచిరుత్కృష్టశుశ్రూషు ర్మృదువాగనహంకృతః।
బ్రాహ్మణాద్యాశ్రయో నిత్య ముత్కృష్టాం జాతిమశ్నుతే॥ ౩౩౫॥

బాహ్యాభ్యంతరశుచియు ద్విజశుశ్రూషుండును నపరుషభాషియు దనజాతికంటె నుత్కృష్టులనగా బ్రాహ్మణాదివర్ణత్రయము వారిలో బ్రాహ్మణసేవయు వారుసంభవించనిచో క్షత్రియవైశ్యసేవయుంజేసిన శూద్రుడుత్తమజాతి జన్మను నొందును॥ ౩౩౫॥

మూ॥ ఏషోఽనాపది వర్ణానా ముక్తః కర్మవిధిశ్శుభః।
ఆపద్యపి హి యస్తేషాం క్రమశ స్తం నిబోధత॥ ౩౩౬॥

ఇతి శ్రీమానవే ధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాం సంహితాయాం
నవమోఽధ్యాయః.

ఇది నాలుగువర్ణములవారికి ననాపదయందు కర్మవిధిరూపమగు ధర్మము జెప్పబడెను యాపదయందన్ని వర్ణములవారికిం గాదగనధర్మములనున్ను సంకీర్ణధర్మములనున్ను జెప్పెదనువినుండు॥ ౩౩౬॥

ఇది శ్రీమన్మహామహీవిడౌజ శ్రీమదానందగజపతి రాజ
మహారాజ దయాపాత్ర భారద్వాజసగోత్రపవిత్ర
సుకవిజనవిధేయ మండకామేశ్వర నామధేయ
విరచితాంధ్రమన్వర్థదీపికాఖ్యయగు
వ్యాఖ్యయందు నవమాధ్యాయము

---

శ్రీపరదేవతార్పణమస్తు



శ్రీరస్తు,

ఆంధ్రమన్వర్థదీపికాసహితము

# మనుస్మృతి * దశమాధ్యాయప్రారంభము.

మూ॥ అధీయీరం స్త్రయోవర్ణాః స్వకర్మస్థా ద్విజాతయః।
ప్రబ్రూయా ద్బ్రాహ్మణ స్త్వేషాం నేతరావితి నిశ్చయః॥౧॥

వైశ్యశూద్రధర్మములను జెప్పి "సంకీర్ణానాంచసంభవ" మనిక్రమప్రాప్తముగు సంకీర్ణసంభవము వక్తవ్యమగుచుండగా నాసంకీర్ణసంభవము వర్ణములవలననే గావున వర్ణానువాదార్థమువి వర్ణత్రయము వారికిని ప్రధానమధ్యయనము నధ్యాపనము బ్రాహ్మణులకే గాని "బ్రాహ్మణస్త్వేషా" మనుటచే నితరులకు నధికారములేదనిసిద్ధమగుచుండ "నేతరా"వని చెప్పుట ప్రాయశ్చిత్తగౌరవార్థము॥ ౧॥

మూ॥ సర్వేషాం బ్రాహ్మణోవిద్యా ద్వృత్త్యుపాయాన్ యథావిధి।
ప్రబ్రూయా దితరేభ్యశ్చ స్వయంచైవ తథాభవేత్॥ ౨॥

అన్నివర్ణములవారికిన్ని వృత్త్యుపాయములం దెలిసి బ్రాహ్మణుడుపదేశింపవలెను తానున్ను యథోక్తముగ నియమమును జేయువలయును॥ ౨॥

మూ॥ వైశేష్యాత్ప్రకృతిశ్రైష్ఠ్యా న్నియమస్యచ ధారణాత్।
సంస్కారస్య విశేషాచ్చ వర్ణానాం బ్రాహ్మణః ప్రభుః॥౩॥

వర్ణముచే పెద్దవాడగుటవల్లనున్ను ప్రకృతియనగా కారణము హిరణ్యగర్భునియొక్క శ్రేష్ఠావయవమగు ముఖమువలన బుట్టుటవల్లనున్ను "నియమ్యతేసేనేతి నియమః" యనువ్యుత్పత్తిచే నియమమనగా వేదపఠనతదర్థజ్ఞానతదుక్తకర్మానుష్ఠానతదుపదేశాదికమును ధరించుటవల్లనున్ను- గోవిందరాజిచ్చట స్నాతకాదినియమధారణమని వ్యాఖ్యానమొనర్చె నదిక్షత్రియాదులకును సాధారణమే గావుననది బాగుండలేదని కుల్లూకభట్టువ్రాసెను అదిగావుననే సంస్కారవిశేషము వ

ల్లనున్న తత్తద్వర్ణానుసారముగా కర్మములనున్ను వృత్తులను నుపదేశించుట వ బ్రాహ్మణుడే ప్రభువగుచున్నాడు॥ ౩॥

మూ॥ బ్రాహ్మణః క్షత్రియో వైశ్య స్త్రయో వర్ణా ద్విజాతయః ।
చతుర్థ ఏకజాతిస్తు శూద్రో నాస్తితు పంచమః॥ ౪॥

బ్రాహ్మణాదిమూడువర్ణముల వారున్ను ఉపనయనసంస్కారముగల వారు గావున ద్విజులైరి శూద్రుడైతే నొకటిజన్మముగలవాడేను యీనాలుగేవర్ణములయిదవ వర్ణము మరిలేదు సాంకర్యముచే బుట్టినవే సడమువలెదలివండుపిల జాతులలో నేదియుంగాదు గావున వర్ణముల వ్యవస్థ వ్యవహారోపయోగార్థము॥ ౪॥

మూ॥ సర్వవర్ణేషు తుల్యాసు పత్నీష్వక్షతయోనిషు ।
ఆనులోమ్యేన సంభూతా జాత్యా జ్ఞేయా స్తఏవ తే॥ ౫॥

నాలుగువర్ణములందునుసజాతీయలును యథావిధిగావివాహితలునక్షతయోనులు నగుపత్నులందానులోమ్యముగా బ్రాహ్మణునకు బ్రాహ్మణస్త్రీయందునుక్షత్రియున కుక్షత్రియస్త్రీయందు నిట్లీక్రమముగాబుట్టినవారలుమాతృపితృజాతీయులగుచున్నా రని తెలియదగుదురు "ఆనులోమ్యేన" యనునదియుత్తరశ్లోకమందుపయోగించునుగ వాక్యాదికమునకుంబలె బ్రాహ్మణాదిజాతిభేదము దెలియుటకు వ్యంజకమగునవయవ భేదము లేదు గావుననది దెలియుటకిచట పత్నీశబ్దము గ్రహించబడెను అన్యునిపత్నియం దుబుట్టినవానికి బ్రాహ్మణాదిజాతిత్వము లేదు అందుకు దేవలవచనము॥ "శ్లో॥ ద్వితీయేన తుయః పిత్రా సవర్ణాయాంతుజాయతే। అవావట ఇతి ఖ్యాత శ్శూద్రధర్మా సజాతితః॥" అన్యపత్నియగు సవర్ణస్త్రీయందు రెండవ తండ్రిచే బుట్టించబడినవాడు వావటుడనబడు నతండుజాతిచే శూద్రధర్మముగలవాడగునని మరియును॥ "శ్లో॥ వ్రతహీనానసంస్కార్యాః స్వతంత్రా సుచయేసుతాః। ఉత్పాదితాస్సవర్ణేన వ్రాత్యాఇవబహిష్కృతాః॥" స్వతంత్రలగు సవర్ణస్త్రీలయందన్యునిచే బుట్టించ బడిన పుత్రులు వ్రతహీనులు గావున సంస్కరించదగరు వ్రాత్యులువలె బహిష్కృ తులు గాదగుదురని॥ "శ్లో॥ యేతుజాతాస్సమానాసు సంస్కార్యాస్స్యురతోన్యథా" సజాతీయయగు నొకనిభార్యయం దన్యుచేబుట్టించబడిన వాడన్యప్రకారముచే సం స్కరించదగునని వ్యాసులు॥ "శ్లో॥ సవర్ణేభ్య స్సవర్ణాసు జాయంతేహి సజాత

యః।" యని ప్రారంభించి "విన్నాస్వేషవిధిస్స్మృతః" యని చెప్పి పత్నియందుభర్తవలన బుట్టినవారే బ్రాహ్మణాదిజాతీయులగుచున్నారని యాజ్ఞవల్క్యనిశ్చయించెను॥ ౫॥

మూ॥ స్త్రీష్వనంతర జాతాసు ద్విజైరుత్పాదితాన్ సుతాన్।
సదృశానేవ తానాహుర్మాతృదోష విగర్హితాన్॥ ౬॥

ఆనులోమ్యముచేత వ్యవహితవర్ణజాతీయులగుభార్యలందు ద్విజులచే నేపుత్రులుత్పాదితులయిరో యెట్లంటె బ్రాహ్మణునిచే క్షత్రియస్త్రీయందును క్షత్రియునిచే వైశ్యస్త్రీయందును వయిశ్యునిచే శూద్రస్త్రీయందును బుట్టినవారిని తల్లియొక్కహీనజాతీయత్వదోషముచే గర్హితులగుటచే పితృసజాతీయులుగాక పితృసదృశులనుగా మన్వాదులుచెప్పిరి పితృసదృశులనుటచే మాతృజాతికంటె నుత్కృష్టులును పితృజాతికంటె నికృష్టులునగుదురని తెలియదగును వీరిపేరులు క్రమముగా మూర్ధాభిషిక్తులు మాహిష్యులు కరణులునని యాజ్ఞవల్క్యాదులచే జెప్పబడిరి వీరికివృత్తులున్నలక్షణునిచే జెప్పబడెను హస్త్యశ్వరథశిక్ష శస్త్రధారణము మూర్ధాభిషిక్తులకును నృత్యగీతనక్షత్రజీవనమును సస్యరక్షణమును మాహిష్యులకును ద్విజశుశ్రూషయు ధనధాన్యరక్షణము రాజసేవయు నంతఃపురరక్షయు పారశవోగ్రకరణులకునని॥ ౬॥

మూ॥ అనంతరాసు జాతానాం విధిరేష సనాతనః।
ద్వ్యేకాంతరాసు జాతానాం ధర్మ్యం విద్యాదిమంవిధిం॥ ౭॥

ఇట్లు పారంపర్యముచేవచ్చినదిగావున విధినిత్యము బ్రాహ్మణునకు వైశ్యస్త్రీయందును క్షత్రియునకు శూద్రస్త్రీయందును బ్రాహ్మణునకు శూద్రస్త్రీయందును నిట్లొకటిరెండువర్ణనులు వ్యవహితములుగాబుట్టినవారికి ధర్మయుక్తమగు వక్ష్యమాణవిధిని దెలుసుకోనవలెను॥ ౭॥

మూ॥ బ్రాహ్మణాద్వైశ్యకన్యాయా మంబష్ఠో నామ జాయతే।
నిషాదశ్శూద్రకన్యాయాం యః పారశవ ఉచ్యతే॥ ౮॥

కన్యాయామనుటచేనిచ్చటవివాహితస్త్రీయందని తెచ్చుకోవలెను. శ్లో॥ "విన్నాస్వేషవిధిస్స్మృతః" యని యాజ్ఞవల్క్యునిచేస్ఫుటముచేయబడెనుగావుననన్నబ్రా

హ్మణునకూ ఛయగు వైశ్యస్త్రీయందుబుట్టినవాడంబష్ఠుడు వివాహిత శూద్రస్త్రీయందు బ్రాహ్మణునకుబుట్టినవాఁడు నిషాదుడు వీడేపారశవుడనబడును॥ ౮॥

మూ॥ క్షత్రియాచ్ఛూద్రకన్యాయాం క్రూరాచారవిహారవాన్।
క్షత్రశూద్రవపుర్జంతు రుగ్రోనామ ప్రజాయతే॥౯॥

క్షత్రియునకు వివాహితశూద్రస్త్రీయందు బుట్టినవాడు క్రూరకర్ముడును స్వభావముచే క్షత్రియవైశ్యతుల్యుడునయి యుగ్రుడనుపేరుగలవాడగును॥ ౯॥

మూ॥ విప్రస్య త్రిషు వర్ణేషు నృపతేర్వర్ణయోర్ద్వయోః।
వైశ్యస్య వర్ణే చైకస్మిన్ షడేతే పశదాస్స్మృతాః॥౧౦॥

బ్రాహ్మణునకు క్షత్రియాది మూడువర్ణముల స్త్రీలయందున్ను క్షత్రియునకు వైశ్యాది స్త్రీద్వయమందున్ను వైశ్యునకొకటి శూద్రస్త్రీయందున్ను బుట్టినవాళ్ళు పుత్రులాఱుగురును సజాతీయస్త్రీలయందు బుట్టినవాళ్ళకంటె తక్కువవాళ్ళగుచున్నారు ఇట్లనులోమజాతులనుజెప్పి విలోమజాతులను జెప్పుచున్నాడు॥ ౧౦॥

మూ॥ క్షత్రియాద్విప్రకన్యాయాం సూతోభవతి జాతితః।
వైశ్యాన్మాగధవైదేహౌ రాజవిప్రాంగనాసుతౌ॥౧౧॥

ఇచ్చట వివాహముసంభవించదుగావున కన్యాశబ్దము స్త్రీమాత్రపరము క్షత్రియునివలన బ్రాహ్మణస్త్రీయందుబుట్టినవాఁడు జాతిచేతసూతుడు వైశ్యునివలనక్షత్రియవిప్రస్త్రీలయందుబుట్టినవాళ్ళు క్రమముగామాగధుడున్ను వైదేహుడున్ను వీళ్ళకుకర్మములను మనువుజెప్పగలడు॥ ౧౧॥

మూ॥ శూద్రాదాయోగవః క్షత్తా చండాలశ్చాధమో నృణాం।
వైశ్యరాజన్యవిప్రాసు జాయంతే వర్ణసంకరాః॥౧౨॥

శూద్రునివలన క్రమముగా వైశ్యక్షత్రియబ్రాహ్మణస్త్రీలయందుబొడమిన వాళ్ళు ఆయోగవుడు క్షత్త మనుష్యులలో నధముడగు చండాలుడును వర్ణసాంకర్యమునుజేసెడివాళ్ళగుచున్నారు॥ ౧౨॥

మూ॥ ఏకాంతరేత్వానులోమ్యాదంబష్ఠోగ్రౌ యథాస్మృతౌ।

క్షత్తృవైదేహకౌ తద్వ త్ప్రాతిలోమ్యేపి జన్మని॥౧౩॥

అనులోమ్యముచే మధ్యనొకవర్ణమును విడిచి యావలివర్ణ స్త్రీల యందనగా బ్రాహ్మణునివలన వైశ్య స్త్రీయందు బుట్టినను క్షత్రియునివలన శూద్ర స్త్రీయందును గూడను బుట్టి యెట్లు స్పర్శమునకర్హులయినో యట్లు ప్రతిలోమమందు శూద్రునివలన క్షత్రియ స్త్రీయందు బుట్టినవాడు క్షత్తయు వైశ్యునివలన బ్రాహ్మణ స్త్రీయందు వైదేహుడున్ను స్పర్శకు యోగ్యులగుదురు ఇరువురు స్పర్శయోగ్యులనుటకే ద్వివచనము చండాలుడొకడును దీసివెయ్యబడెను॥ ౧౩॥

మూ॥ పుత్రా యేఽనంతర స్త్రీజాః క్రమేణోక్తా ద్విజన్మనాం।
తాననంతర నామ్నస్తు మాతృదోషాత్ప్రచక్షతే॥ ౧౪॥

ఇచ్చట మాతృదోషాదనుదానిని బట్టి చెప్పుచున్నాడు అనంతరజులనగా నేకాంతరద్వ్యంతర జన్మలనుకొనవలెను మధ్యనొకవర్ణమును రెండువర్ణములను విడిచి యావలవర్ణ స్త్రీలయందుబుట్టినవాళ్లున్ను ద్విజులైయట్లనంతరజన్ములగువాళ్లు మాతృదోషముచే మాతృపితృజాతివ్యతిరిక్తసంకీర్ణ జాతులని పైనెట్లు చెప్పబడిరో యట్లిచ్చట నున్ను మాతృదోషముచే ననంతరజులని చెప్పబడిరి దీనిచేమాతృ జాతితుల్య సంస్కారాది యోగ్యులనుటకీయుపన్యాసము॥ ౧౪॥

మూ॥ బ్రాహ్మణాదుగ్రకన్యాయా మావృతో నామ జాయతే।
ఆభీరోంబష్ఠకన్యాయా మాయోగవ్యాంతు ధిగ్వణః ౧౫॥

బ్రాహ్మణునివలన క్షత్రియునకును శూద్ర స్త్రీకిని బుట్టిన యుగ్రజాతి స్త్రీయందు బుట్టినవాడావృతనామకుడు బ్రాహ్మణునకును వైశ్య స్త్రీకిని బుట్టినయంబష్ఠజాతి స్త్రీయందు బుట్టినవాడాభీరుడు శూద్రునకున్ను వైశ్య స్త్రీకిని బుట్టిన యాయోగవజాతి స్త్రీయందు బుట్టినవాడు ధిగ్వణుడు॥ ౧౫॥

మూ॥ ఆయోగవశ్చ క్షత్తాచ చండాలశ్చాధమో నృణాం।
ప్రాతిలోమ్యేన జాయంతే శూద్రా దపసదాస్త్రయః॥౧౬॥

ఆయోగవుడును క్షత్త చండాలుడు నీమువ్వురున్ను శూద్రునివలన క్రమముగా వైశ్యాక్షత్రియ బ్రాహ్మణ స్త్రీలయందు బుట్టినవాళ్లు మనుష్యులలో నధములు ప్రతిలోమకార

మానకుపయోగించరిదుకే మీదజెప్పబడినప్పటికిని మరలంజెప్పుట ముందును యుడే ప్రకారము॥ ౧౬॥

మూ॥ వైశ్యాన్మాగధవైదేహౌ క్షత్రియాత్సూతఏవతు।
ప్రతీపమేతే జాయంతే పరేత్యపసదాస్త్రయః॥౧౭॥

క్షత్రియబ్రాహ్మణస్త్రీలయందు క్రమముగా ప్రాతిలోమ్యముచే వైశ్యుని వలన బుట్టినమాగధుడును వైదేహుడును బ్రాహ్మణస్త్రీయందు క్షత్రియుని వలనబుట్టిన సూతుడున్ను వీరుమువ్వురున్ను పుత్రకార్యమున కనర్హులుగారుగావున నధములు॥

మూ॥ జాతో నిషాదాచ్ఛూద్రాయాం జాత్యాభవతిపుల్కసః।
శూద్రాజ్జాతో నిషాద్యాంతు సవై కుక్కుటకస్స్మృతః॥౧౮॥

నిషాదస్త్రీకి శూద్రునివలను బుట్టినవాడు జాతిచే కుక్కుటకుడు నిషాదునకున్ను శూద్రస్త్రీకినిం బుట్టినవాడు జాతిచేపుల్కసుడును॥ ౧౮॥

మూ॥ క్షత్తుర్జాతస్తథోగ్రాయాం శ్వపాకఇతికీర్త్యతే।
వైదేహకేనత్వంబష్ఠ్యా ముత్పన్నో వేణఉచ్యతే॥ ౧౯॥

శూద్రునకు వైశ్యయందు బుట్టినవాడు క్షత్రియునకు శూద్రస్త్రీయందుబుట్టిన డియుగ్రజాతదివీరిరువ్రుకింబుట్టినవాడుశ్వపాకుడు వైదేహకునకు నంబష్ఠయందు బుట్టినవాడు వేణుడనబడెను॥ ౧౯॥

మూ॥ ద్విజాతయస్సవర్ణాసు జనయంత్యవ్రతాంస్తుయాన్।
తాన్ సావిత్రీపరిభ్రష్టాన్వ్రాత్యానితివినిర్దిశేత్॥ ౨౦॥

ద్విజులకుసవర్ణస్త్రీలయందు బుట్టినవారికుపనయన సంస్కారములేకుండిన ననుపనీతులై వ్రతహీనులగువారు వ్రాత్యులనబడుదురు॥ "అతఊర్ధ్వం త్రయో ప్యేతే"యని వ్రాత్యలక్షణము చెప్పబడినదియునప్పటికిని ప్రతిలోమజపుత్రులుం బలె వీరున్ను అపకారాత్ములని తెలియుటకి సంకీర్ణప్రకరణమందును విధించ బడెను॥ ౨౦

మూ॥ వ్రాత్యాత్తు జాయతే విప్రాత్పాపాత్మాభూర్జకంటకః।
అవంత్యవాటధానౌచ పుష్పధశ్శైకఏవచ॥ ౨౧॥

వ్రాత్యుడగు బ్రాహ్మణునకు బ్రాహ్మణ స్త్రీయందు బుట్టినపాపాత్ముడు భూర్జకంటకుడనబడును పిమ్మట అవంత్యవాటధాన పుష్పధ శైఖ ములను దేశములందు నాపేర్లుగలవాడగుదురు॥ ౨౦॥

మూ॥ ఝల్లోమల్లశ్చ రాజన్యాద్వ్రాత్యాన్నిచ్ఛివిరేవచ।
నటశ్చకరణశ్చైవ ఖసోద్రవిడఏవచ॥ ౨౧॥

వ్రాత్యుడగు రాజువలన సవర్ణ స్త్రీయందు బుట్టినవాడు ఝల్లుడు మల్లుడు నిచ్ఛివి నటుడు కరణుడు ఖసుడు ద్రవిడుడని చెప్పబడును॥ ౨౧॥

మూ॥ వైశ్యాత్తు జాయతే వ్రాత్యా త్సుధన్వాచార్యఏవచ।
కారూశశ్చ విజన్మాచ మైత్రస్సాత్వతఏవచ ౨౨

వ్రాత్యుడగు వైశ్యునివలన సవర్ణ స్త్రీయందు బుట్టినవాడు సుధన్వా చార్య కారూశ విజన్మ మైత్ర సాత్వతులను నామములుగలవాడగును॥ ౨౩॥

మూ॥ వ్యభిచారేణవర్ణానా మవేద్యావేదనేనచ।
స్వకర్మణాంచ త్యాగేన జాయంతే వర్ణసంకరాః॥ ౨౪॥

బ్రాహ్మణాదివర్ణములలోన నన్యోన్య స్త్రీగమనముచేతనున్ను సగోత్రాది వివాహముచేతను ఉపనయనరూపస్వకర్మత్యాగనుచేతనున్ను వర్ణసంకరమనునది యగుచున్నది గావున నీప్రకరణమందు వ్రాత్యులను చెప్పడము యుక్తము॥ ౨౪॥

మూ॥ సంకీర్ణయోనయోయేతు ప్రతిలోమానులోమజాః।
అన్యోన్యవ్యతిషక్తాశ్చ తాన్ప్రవక్ష్యామ్యశేషతః॥ ౨౫॥

ప్రతిలోమానులోమనులచే పరస్పరసంబంధము వలన సంకరజాతులేవి యగుచున్నవో వాటిని నిశ్శేషముగ జెప్పెదను॥ ౨౫॥

మూ॥ సూతో వైదేహకశ్చైవ చండాలశ్చ నరాధమః।
మాగధః క్షత్త్రజాతిశ్చ తథాయోగవ ఏవచ॥ ౨౬॥

చెప్పబడ్డలక్షణములు గలయీసూతాదులు పైనిచెప్పబోయెడి యర్థమున నీతిషేపులు చెప్పబడెను॥ ౨౬॥

న్ను ప్రకృతముగావున నీశ్లోకమున్ను దానివిస్తారమేగావున "ప్రతికూలం వర్తమానా" యనిశ్లోకమందుండుటవలన ప్రతిలోమమాత్రవిషయమీశ్లోకను గాని యను లోమవిషయమనుగాదు అట్లుండఁగా వైశ్యాదులవలనఁబుట్టిన యనులోమజాతులున పండ్రెండుగురు గలసి యిరువదిజాతులనుట యసందర్భము॥ "తథాబాహ్యతరాన్బాహ్యశ్చాతుర్వర్ణ్యే ప్రసూయతే॥" యనిమనువుగారిచే చెప్పబడుటవల్లనున్ను ఆలాగునె పిరద్దరిచేతనున్ను వ్యాఖ్యచేయఁబడుటచేతనున్ను చాతుర్వర్ణ్య సహితముగ నరువదినాలుగుజాతులనుట నిదియంతయుం బ్రకృతము గాదు సంకీర్ణ ప్రకరణమందు చాతుర్వర్ణ్యముయొక్క గణనముచితము గాదు ఇట్టియసందర్భములు పెక్కు-కనపరచితాను వ్యాఖ్యానముఁజేయుచున్నాఁడు- ద్విజాతిప్రతిలోమజులకంటె బాహ్యులగు శూద్రప్రతిలోమజాయోగవక్షత్తృచండాలులుముగ్గురున్ను పైనాలుగువర్ణములస్త్రీలయందున్ను స్వస్వజాతిస్త్రీలయందు నొక్కొక్క డైదుగురేసి చొప్పున ముగ్గురివలనను బుట్టినవాళ్లు పదేనుగురు మరియు ననులోమజులకంటెహీనులను వైశ్యక్షత్రియ ప్రభవులగు మాగధవైదేహసూతులు పైనిచెప్పినట్లైదుగురేసిచొప్పున పదేనుగురు గహీనతరులుబుట్టినవీరున్ను పైనిచెప్పబడినవాళ్ళును గలసి ముప్పదిమందియగుచున్నారు ఈలాగుగాకుంటె బాహ్యులగు చండాలక్షత్త్రియోగవవైదేహమాగధసూతులారుగురున్ను ప్రాతిలోమ్యముచే బుట్టినవాళ్ళు పదేనుగురనెట్లన్నను చండాలుడు క్షత్త్రాదులగు నైదుగురి స్త్రీలయందునుక్షత్త్యాయోగవాదిస్త్రీలు నలుగురియందున్ను నాయోగవుఁడుమాగధాదిముగ్గురి స్త్రీలయందున్ను మాగధుఁడు వైదేహాదులగు నిద్దరిస్త్రీలయందున్ను వైదేహుఁడుసూతస్త్రీయందున్ను సూతునకు ప్రతిలోమజాతిలేదుగాన నిట్లుబుట్టినవాళ్ళుపదేనుగురగుచున్నారు "పునః" యని చెప్పుటవలన సూతాదిచండాలాంతముగా నారుగురుహీనజాతులవాళ్ళుపైనిచెప్పబడిన ప్రతిలోమజులభంగనను లోమజులు పదేనుమందియగుచున్నారు గలసిముప్పదుగురు హీనజాతులవాళ్లయిరి॥ ౩౧॥

మూ॥ ప్రసాధనోపచారజ్ఞ మదాసం దాసజీవనం।
సైరంధ్రం వాగురావృత్తిం సూతేదస్యురయోగవే॥ ౩౨॥

కొప్పుముడవడము మొదలగువాటిచే నలంకరించెడినేర్పుకాళ్లునొడలను బట్టడము మొదలగువాటిచే జీవించెడివానిన్ని సైరంధ్రుఁడనువానిని యురులు వలలు మొదలగువాటిచే మృగములను దేవపిత్రతిథికార్యములకు నౌషధార్థమున్ను జంపెడి

హీనులనిన్ని "ముఖబాహూరుపజ్జానాం" అను శ్లోకమందు జెప్పఁగల దస్యుఁడాయోగవ జాతిస్త్రీయందుఁగనును॥ ౩౨॥

మూ॥ మైత్రేయకంతు వైదేహో మాధూకం సంప్రసూయతే।
నౄన్ ప్రశంసత్యజస్రం యో ఘంటాతాడో౽రుణోదయే॥ ౩౩॥

వైశ్యునివలన బ్రాహ్మణియందుబుట్టినవాడు వైదేహుడు వీడుప్రకృతమగు నాయోగవ స్త్రీయందు మధురభాషియై ప్రాతఃకాలమందుఘంటవాయించుచు రాజాదులను స్తుతిజేయుట పనిగాగలవానినిగనును॥ ౩౩॥

మూ॥ నిషాదో మార్గవం సూతే దాసం నౌకర్మజీవనం।
కైవర్తమితి యం ప్రాహురార్యావర్తనివాసినః॥ ౩౪॥

బ్రాహ్మణునివలన శూద్రస్త్రీయందుబుట్టినవాడు నిషాదుడు వీడు ఆయోగవియందు ఓడలునడిపెడువాడు దాశుడనునామాంతరముగలవాడు ఎవని నార్యావర్తదేశస్థులు కైవర్తుడనియందురో యట్టిమార్గవుడనువానిని గనును॥ ౩౪॥

మూ॥ మృతవస్త్రభృత్స్వనార్యాసు గర్హితాన్నాశనాసు చ।
భవంత్యాయోగవీష్వేతే జాతిహీనాః పృథక్త్రియః॥ ౩౫॥

సైరంధ్రుడు మైత్రేయుడు మార్గవుడు ననుహీనజాతీయులగు నీముగ్గురున్ను మృతవస్త్రములనుగట్టుకొనెడివాళ్లున్ను క్రూరస్వభావులున్ను ఉచ్ఛిష్టాది నింద్యాన్నములను దినెడివాళ్ళునగు నాయోగవస్త్రీలయందు బుట్టుదురు పితృభేదముచే వేర్వేరనగుదురు॥ ౩౫॥

మూ॥ కారావరో నిషాదాత్తు చర్మకారః ప్రసూయతే।
వైదేహా సైరంధ్రభేదౌ బహిర్గ్రామప్రతిశ్రయా॥ ౩౬॥

"వైదేహ్యామేవజాయతే" యనుచు ముందుజెప్పనుగావున వైదేహస్త్రీయందు నిషాదునివలన కారావరుడనుపేరుగల చర్మకారుఁడు బుట్టుచున్నాడు॥ సూ॥ "కారావరాణాంచర్మచ్ఛేదనాచరణమేవవృత్తిరితి" కారావరజాతికి చర్మవుపనిచేతనే జీవనమని ఔశనస్మృతివలన వైదేహుడు సైరంధ్రుడనగువారిద్దరును గ్రామబహిర్నివాసులు వైదేహస్త్రీయందు వైదేహునివలనంబుట్టిన గహితవైదేహుడనిచే

ష్పటయుచితము వీరిద్దరున్ను గన్నిధానపాత్రులగు కారావరునిచే నిషాదస్త్రీ
యందు క్రమముగా బుట్టుచున్నారు॥ ౩౬॥

మూ॥ చండాలాత్పాండుసోపాక స్త్వక్సార వ్యవహారవాన్।
ఆహిండికో నిషాదేన వైదేహ్యామేవ జాయతే॥౩౭॥

వైదేహస్త్రీయందు చండాలునివలన పాండుసోపాఖ్యుడు వేణువ్యవహారముచే జీవించువాడు బుట్టును నిషాదునివలన వైదేహస్త్రీయందు హిండికాఖ్యుడు బుట్టును వీరికి బంధనస్థానమందు బాహ్యరక్షణవృత్తియని యాశనసోక్తి కారావరాహిండికులకు దలిదండ్రులేకమయినను వృత్తిభేదముచే భేదముగా జెప్పబడిరి॥౩౭॥

మూ॥ చండాలేనతు సోపాకో మూలవ్యసన వృత్తిమాన్।
పుల్కస్యాం జాయతేపాప స్సదాసజ్జన గర్హితః॥౩౮॥

చండాలునివలన శూద్రానిషాదోత్పన్న పుల్కసస్త్రీయందు రాజుచే మరణశిక్షవిధించబడినవాళ్ళను జంపెడు వృత్తిగలవాడు సుజననిందితుడు సోపాకుడనువాడుబుట్టును॥ ౩౮॥

మూ॥ నిషాదస్త్రీతు చండాలా త్పుత్రమంత్యావసాయినం।
శ్మశాన గోచరంసూతె బాహ్యానామపి గర్హితం॥౩౯॥

నిషాదస్త్రీయందు చండాలునివలన శ్మశానమందు వసించెడువాడు చండాలులలోను నిందితుడగు నంత్యావసాయియనువాడుబుట్టును॥ ౩౯॥

మూ॥ సంకరెజాతయస్త్వేతాః పితృమాతృప్రదర్శితాః
ప్రచ్ఛన్నావాప్రకాశావా వేదితవ్యాస్స్వకర్మభిః॥౪౦॥

ఈతల్లియందీ తండ్రివలనబుట్టిన వాడీజాతివాడని యీసంకరజాతులుచెప్పబడెనువీళ్లుప్రచ్ఛన్నముగనుండినను ప్రకాశముగనుండినను తత్తత్కర్మములచే దెలియదగుదురు॥ ౪౦॥

మూ॥ సజాతిజానంతరజా షట్సుతాద్విజధర్మిణః।
శూద్రాణాంతుసధర్మాణః సర్వేపధ్వంసజాస్స్మృతాః॥౪౧॥

బ్రాహ్మణునివలన క్షత్రియవైశ్య స్త్రీలయందునుక్షత్రియునివలన వైశ్యస్త్రీయ

ష్టను సనులోమముగానున్న ద్విజులకున్వజాతిభార్యలయందునుఁబుట్టినవారారుగు రున్ను ద్విజన్వసంస్కారార్హులగుచున్నారు వీరికిన్వజాతిసంస్కారార్హమీవచనమున ద్విజాత్యుత్పన్నులైనను ప్రతిలోమజాతులగు సూతాదులుశూద్రధర్ములగుచున్నారు ఉపనయనసంస్కారము వీరికి లేదు॥ ౪౧॥

మూ॥ తపోబీజప్రభావైస్తు తేగచ్ఛంతియుగేయుగే।
ఉత్కర్షంచాపకర్షంచమనుష్యేష్విహజన్మతః॥౪౨॥

సజాతిస్త్రీలయందు ననంతరజాతిస్త్రీలయందునుఁబుట్టి వారుకృతాదియుగములందు తపోమహిమచే విశ్వామిత్రాదులున్ను బీజప్రభావముచే ఋష్యశృంగాదులున్ను ఈలోకమందుజన్మమువలననుత్కర్షమునున్ను అపకర్షమునున్ను మనుష్యులుపొందుచున్నారు॥ ౪౨॥

మూ॥ శనకైస్తుక్రియాలోపాదిమాః క్షత్రియజాతయః।
వృషలత్వంగతాలోకే బ్రాహ్మణాదర్శనేనచ॥౪౩॥

ఈవక్ష్యమాణక్షత్రియజాతులుపనయనాదికర్మలోపముచే కర్మలను జేయించుటకును అధ్యయనార్థము ప్రాయశ్చిత్తములకొరకు బ్రాహ్మణదర్శనాపేక్షలేకుండుట వలననున్ను కాలక్రమముచేశూద్రత్వమునొందుదురు॥ ౪౩॥

మూ॥ పౌండ్రకాశ్చౌడ్రద్రవిడాః కాంభోజాయవనాశ్శకాః।
పారదాః పహ్లవాశ్చీనాః కిరాతాదరదాఃఖశాః॥౪౪॥

ఈచెప్పబడినపౌండ్రాది దేశోద్భవులగుక్షత్రియులు క్రియాలోపాదికముచేశూద్రత్వమునొందిరి॥ ౪౪॥

మూ॥ ముఖబాహూరుపజ్జానాం యాలోకేజాతయోబహిః।
మ్లేచ్ఛవాచశ్చార్యవాచస్సర్వేతేదస్యవస్స్మృతాః॥౪౫॥

బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులకుఁబుట్టియేబాహ్యజాతులుగనెవ్వరెవరు మ్లేచ్ఛభాషాయుక్తులో యార్యభాషాయుక్తులో వారందరును దస్యులనిచెప్పబడిరి

మూ॥ యేద్విజానామపసదా యేచాపధ్వంసజాస్స్మృతాః।
తేనిందితైర్వర్తయేయుర్ద్విజానామేవకర్మభిః॥౪౬॥

అపపాత్రాశ్చ కర్తవ్యా ధనమేషాం శ్వగర్దభం॥ ౫౧॥
వాసాంసి మృతచేలాని భిన్నభాండేషు భోజనం।
కార్ష్ణాయసమలంకారః పరివ్రజ్యా చ నిత్యశః ౫౨॥

చండాలశ్వపాకులకు గ్రామమునకు వెలిని నివాసము వాళ్లు పాత్రరహితులుగా జేయదగుదురు ఏలోహపు పాత్రమందు వాళ్లు భుజింతురో యాలోహపుపాత్రముకరిగి మరలసంస్కరించబడినప్పటికి వ్యవహారమున కడియుపయోగించదు కుక్కలు కుక్కలుగాడిదెలును ధనముగాను వృషభాదులుగా రాదనుట శవములమీదిబట్టలే వీళ్లకువస్త్రములు భిన్నములైపోయినకుండలందన్నా పెంకులలో దినడమయినప కడియములలంకారము ఎల్లప్పుడును దేశములందు దిరుగుటస్వభావము॥ ౫౧॥

మూ॥ న తైస్సమయ మన్విచ్ఛేత్పురుషో ధర్మమాచరన్।
వ్యవహారో మిథస్తేషాం వివాహస్సదృశైస్సహ॥ ౫౩॥

ధర్మానుష్ఠానకాలమందు చండాలాదులదర్శనాదికముగూడదు వీళ్లకప్పిచ్చుట పుచ్చుకొనుట వివాహము మొదలగువ్యవహారములు వాళ్లలో వాళ్లకే గావలెను॥ ౫౩॥

మూ॥ అన్నమేషాం పరాధీనం దేయంస్యాద్భిన్నభాజనే।
రాత్రౌ న విచరేయుస్తే గ్రామేషు నగరేషు చ॥ ౫౪॥

వీళ్లకన్నము పరాధీనము ప్రత్యక్షముగా నపరాన్నయము వీళ్లకన్నమిడరాదు ప్రేష్యులచే పెంకులలో పెట్టియుంపించవలెను రాత్రులందు గ్రామములందుగాని పల్లెలందుగాని వీళ్లుదిరుగరాదు॥ ౫౪॥

మూ॥ దివాచరేయుః కార్యార్థం చిహ్నితా రాజశాసనైః।
అబాంధవం శవం చైవ నిర్హరేయురితి స్థితిః॥ ౫౫॥

పగళ్లయందు క్రయవిక్రయార్థమై రాజాజ్ఞచే చిహ్నితులై గ్రామనులందుదిరుగవలెను వీళ్లు దిక్కులేని శవములను పయికి తీసుకొనిపోవలెనని శాస్త్రమర్యాద॥

మూ॥ వధ్యాంశ్చ హన్యుస్సతతం యథాశాస్త్రం నృపాజ్ఞయా।
వధ్యవాసాంసి గృహ్ణీయుశ్శయ్యాశ్చాభరణాని చ॥ ౫౬॥

వధార్హులను యథాశాస్త్రముగా రాజాజ్ఞచే కొర్తదీయుట మొదలగువా

టిచే చంపుటయు వాళ్ళ వస్త్రశయ్యాభరణాదికము పుచ్చుకొనుటయు వీళ్ళకు వృత్తి॥ ౫౬॥

మూ॥ వర్ణాపేతమవిజ్ఞాతం నరం కలుషయోనిజం।
ఆర్యరూపమివానార్యం కర్మభిస్స్వైర్విభావయేత్॥ ౫౭॥

ఏవర్ణమువాడో తెలియబడని సంకరజాతిమనుష్యుడు లోకము వలన నిట్టివాడని నిర్ణయించ నశక్యమౌటచే నార్యునివలెగనపడుచు ననార్యుడగునట్టివానికి నిందితానురూపములగు వానిచేష్టలచేతనున్ను వక్ష్యమాణ కర్మములచేతనున్ను నిశ్చయించవలెను॥ ౫౭॥

మూ॥ అనార్యతానిష్ఠురతా క్రూరతానిష్క్రియాత్మతా।
పురుషం వ్యంజయంతీహ లోకే కలుషయోనిజం॥ ౫౮॥

నిష్ఠురభాషిత్వము ఘాతుకత్వము విహితాననుష్ఠాతృత్వమును యే పురుషుని యందుండునో వాడు సంకరజాతుడని యవియే ప్రకటించును॥ ౫౮॥

మూ॥ పిత్ర్యంవా భజతేశీలం మాతుర్వోభయమేవవా।
నకథంచన దుర్యోనిః ప్రకృతిం స్వాం నియచ్ఛతి॥

ఈ సంకరజాతులు దుష్టయోని యగుటచే పితృసంబంధమగు దుష్టస్వభావత్వమునైనా మాతృసంబంధమయినదిగాని యుభయసంబంధమయినది గాని స్వభావమునుపొందును యెప్పుడైనా వీడుస్వకారణమును దాచుటకు సమర్థుడుకాడు॥

మూ॥ కులేముఖ్యేపి జాతస్య యస్యస్యాద్యోనిసంకరః।
సంశ్రయత్యేవ తచ్ఛీలం నరోల్పమపివాబహు॥ ౬౦॥

మహాకులప్రసూతుడయినప్పటికిని యెవనియొక్క యోనిసంకరము ప్రచ్ఛన్నముగనుండునో యావరుడు కొంచముగాని గొప్పగాని యాతలిదండ్రులయొక్క స్వభావమును తప్పకపొందును॥ ౬౦॥

మూ॥ యత్రత్వేతే పరిధ్వంసా జాయంతే వర్ణదూషకాః।
రాష్ట్రికైస్సహతద్రాష్ట్రం క్షిప్రమేవవినశ్యతి॥ ౬౧॥

ఏరాష్ట్రమందు యీసంకరజాతులు వర్ణదూషకులై యుందురో ఆరాష్ట్రము ప్రజలతో గూడా శీఘ్రముగ నశించునుగావున వర్ణసంకరముగాకుండ రాజు ప్రయత్నముపడవలెను॥ ౬౧॥

మూ॥ బ్రాహ్మణార్థే గవార్థే వా దేహత్యాగాదుపస్కృతం ।
స్త్రీబాలాభ్యుపపత్తౌ చ బాహ్యానాం సిద్ధికారణం॥ ౬౨॥

గోబ్రాహ్మణ స్త్రీ బాలులలో యెవరికైన పీడతప్పించుటకు యీలోక మందగు ప్రయోజనాపేక్షలేకుండ ప్రాణత్యాగము జేసిరేని ప్రతిలోమ జాతులకు స్వర్గ ప్రాప్తియగును॥ ౬౨॥

మూ॥ అహింసా సత్యమస్తేయం శౌచమింద్రియ నిగ్రహం ।
ఏతం సామాసికం ధర్మం చాతుర్వర్ణ్యేஉబ్రవీన్మనుః ౬౩॥

హింసాత్యాగము యథార్థ భాషణము నన్యాయముగ బరధనమును హరించకుండుట మృజ్జలాదులచేస్నా ఇంద్రియములనునియమించుటయిట్లిదిసంక్షేపము గా నాలుగువర్ణములవారికిని జెయదగిన ధర్మమనిమనువు చెప్పెనుప్రకరణముచే . వర్ణజాతులకు నిదియే ధర్మమని దెలియుందగు నిప్పుడు॥"శ్లో॥సర్వవర్ణేషుతుల్యాస్వితి" యను దానిచే చెప్పబడిన దానికి వ్యతిరేకముగానగు బ్రాహ్మణాదికమును జెప్పుచున్నాడు॥ ౬౩॥

మూ॥ శూద్రాయాం బ్రాహ్మణాజ్జాతః శ్రేయసాచేత్ప్రజాయతే ।
అశ్రేయాం శ్రేయసీం జాతిం గచ్ఛత్యా సప్తమాద్యుగాత్ ।౬౪॥

బ్రాహ్మణుని వలన శూద్రస్త్రీయందు బుట్టినది పారశవాఖ్యజాతి యది స్త్రీయై బ్రాహ్మణునివివాహమై వానివలన బుట్టినస్త్రీ మరల వివాహితబ్రాహ్మణుని వలననే స్త్రీబుట్టి యీరీతి నేడవతరమందగు పారశవస్త్రీయందు వివాహితబ్రాహ్మణునివలన బుట్టినజాతి బ్రాహ్మణజాతియగుచున్నది॥ ౬౪॥

మూ॥ శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్ ।
క్షత్రియాజ్జాతమేవంతు విద్యాద్వైశ్యాత్తథైవచ॥ ౬౫॥

ఇట్లుపూర్వశ్లోకోక్తప్రకారముగా శూద్రుడు బ్రాహ్మణత్వమును బొందుచు

న్నాడు ఇచ్చట బ్రాహ్మణుడనగా బ్రాహ్మణునివలన శూద్రస్త్రీయందుబుట్టిన పారశవుడని తెలియవలెను ఆపురుషుడచ్చంశూద్రస్త్రీని వివాహమైనందానియందువానికి బుట్టినపురుషుడు శూద్రస్త్రీనే వివాహమై యాపైసన్ని ఇట్లైపుట్టిన పురుషులెల్లను క్రమముగా శూద్రస్త్రీలనే వివాహమై పురుషులుపుట్టుచూరాగా నేడవబ్రాహ్మణపురుషుడు శుద్ధశూద్రుడగుచున్నాడు ఈప్రకారముగానే క్షత్రియునివలనన్ను వైశ్యునివలననున్ను శూద్రస్త్రీయందు బుట్టిన వానికుత్కర్షాపకర్షములు తెలియదగును జాత్యపకర్షవలన జాత్యుత్కర్షయుగమందనగా జన్మమందు తరమందని తాత్పర్యము సప్తమే పంచమేవాయని యాజ్ఞవల్క్యవచనముచే క్షత్రియుని వలనబుట్టిన వానికైదవజన్మమునందుత్కర్షాపకర్షములు తెలియదగును వైశ్యుని వలన బుట్టిన వానికంటె నుత్కర్షవలన యాజ్ఞవల్క్యవచనమం దిషిద్ధముచేపక్షాంతరము సంగ్రహించబడుట వలనన్నున్ను పెద్దలయొక్కవ్యాఖ్యానానుసారముచేతనున్ను మూడవజన్మమందుత్కర్షాపకర్షములు తెలియదగును. ఈన్యాయముచేతనే బ్రాహ్మణునకు వైశ్యస్త్రీయందుబుట్టిన వానికైదవజన్మమందున్ను క్షత్రియస్త్రీయందుబుట్టినవానికిన్ని క్షత్రియునికి వైశ్యస్త్రీయందు బుట్టిన వానికిన్ని మూడవజన్మమందు నుత్కర్షాపకర్షములు తెలియదగును॥ ౬౫॥

మూ॥ అనార్యాయాం సముత్పన్నో బ్రాహ్మణాత్తు యదృచ్ఛయా।
బ్రాహ్మణ్యా మప్యనార్యాత్తు శ్రేయస్త్వం క్వేతిచే ద్భవేత్॥౬౬॥

ఆ వివాహితశూద్రస్త్రీయందు బ్రాహ్మణునకు దైవాత్తుబుట్టినవాడొకడు రెండవవాడు శూద్రునివలన బ్రాహ్మణస్త్రీయందుబుట్టినవాడు వీరిద్దరిలోనున్నుఎక్కడబుట్టినవానికి శ్రేయస్త్వమంటే సంశయమెట్లన్న బ్రాహ్మణుని వలన శూద్రయందుబుట్టినవాడు బీజోత్కర్షముచే నెట్లు లెస్సగా శూద్రుడానెనోయారీతనే క్షేత్రోత్కర్షముచే శూద్రునకు బ్రాహ్మణియందుబుట్టినవాడెట్లు సాధు శూద్రుడు గాడని సందేహము గలిగితే నిర్ణయము చెప్పుచున్నాడు॥ ౬౬॥

మూ॥ జాతో నార్యామనార్యాయా మార్యాదార్యో భవేద్గుణైః।
జాతోప్యనార్యా దార్యాయామనార్యఇతినిశ్చయః॥౬౭॥

శూద్రస్త్రీయందు బ్రాహ్మణునివలన బుట్టినవాడు స్మృత్యుక్తివలన పాకయజ్ఞాది గుణములతోగూడినవాడై ప్రశస్తుడగుచున్నాడు శూద్రునిచేనైతే బ్రాహ్మణి

యందు బుట్టినవాడు ప్రతిలోమజాతుడు గాక నన్సు స్యుడని నిశ్చయము న్యాయ మీ న్యాయప్రాప్తమైన యర్థమైనను వచనప్రామాణ్యముచే నిచ్చట తెలియబడుచున్నది॥ ౬౭॥

మూ॥ తావుభావప్య సంస్కార్యా వితిధర్మో వ్యవస్థితః।
వైగుణ్యా జ్జన్మనః పూర్వ ఉత్తరః ప్రతిలోమతః॥౬౮॥

పారశవుడును చండాలుడు నీయిద్దరు నుపనయనసంస్కారార్హులు గారని శాస్త్రమర్యాద పారశవుడు శూద్రస్త్రీయందు బుట్టుటచే వైగుణ్యము కలవాను న్న చండాలుడు ప్రతిలోమముగా శూద్రునివలన బ్రాహ్మణియందుబుట్టుటచేను న్న అనుపనేయులగుచున్నారు॥ ౬౮॥

మూ॥ సుబీజంచైవ సుక్షేత్రే జాతంసంపద్యతె యథా।
తథార్యాజ్జాత ఆర్యాయాం సర్వం సంస్కారమర్హతి॥౬౯॥

మంచిభూమియందు మంచిబీజమేలాగు బాగావృద్ధినొందునో ఆలాగున ద్విజాతిస్త్రీయందానులోమ్యముచే ద్విజునకు క్షత్రియవైశ్యలయందు బుట్టినవాడు క్షత్రియవైశ్యజాతిసంస్కారమును సకలశ్రౌతస్మార్తకర్మములకు నర్హుడగును పారశవచండాలులసంస్కార్యులనుటకు దార్ఢ్యార్థమీవచనము శాస్త్రాంతరముచేను క్తార్థమునకే దార్ఢ్యార్థము చెప్పుచున్నాడు॥

మూ॥ బీజమేకే ప్రశంసంతి క్షేత్రమన్యే మనీషిణః।
బీజక్షేత్రె తథైవాన్యె తత్రేయంతు వ్యవస్థితిః॥ ౭౦॥

కొందరుపండితులు బీజమును ప్రశంసించుచున్నారు హరిణ్యాదులందు బుట్టిన ఋష్యశృంగాదులు బ్రహ్మర్షులగుటవలన కొందరు క్షేత్రమును స్తుతించుచున్నారు క్షేత్రస్వామిపుత్రత్వదర్శనమువలన ననగ క్షేత్రజుడు క్షేత్రికిమాతుగాపునన ని కొందరుబీజక్షేత్రములను రెంటినిన్ని స్తుతించుచున్నారు మంచిభూమియందుమంచి త్తనముంచినను సమృద్ధిదర్శనమువలన యీ యభేదమందు నీవక్ష్యమాణమగు వ్యవస్థ తెలియదగ్గది ౭౦॥

మూ॥ అక్షేత్రె బీజముత్సృష్ట మంతరైవ వినశ్యతి।

అబీజక మపి క్షేత్రం కేవలం స్థండిలం భవేత్॥ ౭౧॥

ఊషరక్షేత్రమందుంచిన బీజముఫలించక మధ్యనే నశించును బీజముంచకుండెనేని క్షేత్రముకేవలభూమిమాత్రమైయుండును గాని సస్యమగుపడదు ప్రత్యేకముగ పనికిరాకుండుటచే "సుబీజంచైవ సుక్షేత్రే" యని మున్నుజెప్పబడినయుభయప్రాధాన్యమేయభిహితమాయెను ఇప్పుడు బీజప్రాధాన్యమును దృష్టాంతమును జెప్పుచున్నాడు॥ ౭౧॥

మూ॥ యస్మాద్బీజప్రభావేన తిర్యగ్జా ఋషయోఽభవన్।
పూజితాశ్చ ప్రశస్తాశ్చ తస్మాద్బీజం ప్రశస్యతే॥ ౭౨॥

ఏహేతువచే బీజమాహాత్మ్యమువలన తిర్యగ్జాతులగు హరిణ్యాది యోనులందుబుట్టినను ఋష్యశృంగాదులు ఋషులై పూజ్యులై వేదజ్ఞానాదులచే ప్రశస్తులగుచున్నారో యాహేతువచే బీజముస్తుతించబడుచున్నది ఇది స్త్రీబీజయోనుల యందు ఉత్కృష్టబీజముగల జాతిప్రధానమని తెలియదగ్గది॥ ౭౨॥

మూ॥ అనార్యమార్యకర్మాణమార్యంచానార్యకర్మిణం।
సంప్రధార్యాబ్రవీద్ధాతా నసమౌ నాసమావితి॥ ౭౩॥

ద్విజాతికర్మనిరతుడగు శూద్రునిన్ని శూద్రకర్మరతుడగు బ్రాహ్మణునిన్ని ఆలోచించి బ్రహ్మవీరుసములును గారు అసములును గారు శూద్రుడు ద్విజాదికర్మకర్తైనను ద్విజునితో సముడుగాడు అనధికారిగావున ద్విజాతికర్మజేసినను ద్విజనామ్యాభావమువలననున్ను శూద్రకర్మమొనర్చినను నిషిద్ధకర్మాచరణముచే ద్విజత్వసమపద్ధతిపోవుగనకన్ను వీరుసములుగారు ఉభయులకున్ను నిషిద్ధకర్మాచరణము సమముగానుండుటచేనసములున్నుగారు గావున నేదియేవనికినిషిద్ధమోవాడదిచేయరాదని సంకరపర్యంతవర్ణధర్మాధర్మములయుద్దేశము ఇప్పుడు బ్రాహ్మణులకాపద్ధర్మమును ప్రతిపాదించునదిచెప్పుచున్నాడు॥ ౭౩॥

మూ॥ బ్రాహ్మణా బ్రహ్మయోనిస్థా యే స్వకర్మణ్యవస్థితాః।
తే సమ్యగుపజీవేయుః షట్కర్మాణి యథాక్రమం॥ ౭౪॥

ఏబ్రాహ్మణులు బ్రహ్మధ్యాననిరతులును స్వకర్మానుష్ఠాననిష్ఠులునగుచున్నారో

వారు యాజనాధ్యాపనాదులను నారుకర్మములనవలంబించి లెస్సగా జేయవలెను॥

మూ॥ అధ్యాపనంచాధ్యయనం యజనంయాజనంతథా।
దానంప్రతిగ్రహశ్చైవ షట్కర్మాణ్యగ్రజన్మనః॥ ౭౫॥

సాంగమగు వేదమును జెప్పడమున్ను చదవడమున్ను యజ్ఞమును జేయించడమున్ను చేయడమున్ను దానమివ్వడమున్ను ప్రతిగ్రహించడమున్ను నీయారున్ను బ్రాహ్మణునకు జేయదగినవి॥ ౭౫॥

మూ॥ షణ్ణాంతుకర్మణా మస్యత్రీణి కర్మాణిజీవికాః।
యాజనాధ్యాపనేచైవ విశుద్ధాచ్చ ప్రతిగ్రహః॥ ౭౬॥

ఈబ్రాహ్మణునకు నీయారుకర్మములయందున నగా వేదమును జెప్పడముయజ్ఞమును జేయించుటయును॥ శ్లో "ద్విజాతిభ్యోధనం లిప్సేత్ప్రశస్తేభ్యోద్విజఇతి" యనువచనని దేశమువలన ద్విజులవలనప్రతిగ్రహమునను నీమూడుకర్మములున్ను జీవనార్థములని తెలియందగును॥ ౭౬॥

మూ॥ త్రయోధర్మానివర్తంతే బ్రాహ్మణాత్క్షత్రియంప్రతి।
అధ్యాపనం యాజనంచ తృతీయశ్చ ప్రతిగ్రహః॥ ౭౭॥

బ్రాహ్మణునికంటె క్షత్రియునకు యాజనాధ్యాపన ప్రతిగ్రహములుతక్కువ యజనాధ్యయనదానములు మూడుకర్మములును క్షత్రియునకగుచున్నవి॥ ౭౭॥

మూ॥ వైశ్యంప్రతితథైవైతే నివర్తేరన్నితిస్థితిః।
నతౌప్రతి హితాన్ధర్మాన్ మనురాహ ప్రజాపతిః॥ ౭౮॥

క్షత్రియునకువలెనే యాజనాధ్యాపనప్రతిగ్రహములు వైశ్యునకున్ను లేవు వీనికిన్ని యజనాధ్యయన దానములగుచున్నవి యీమూడు కర్మములే క్షత్రియవైశ్యులకుయోగ్యములని మనువుచెప్పెను॥ ౭౮॥

మూ॥ శస్త్రాస్త్రభృత్త్వం క్షత్రస్య వణిక్పశుకృషిర్విశః।
ఆజీవనార్థంధర్మస్తు దానమధ్యయనంయజిః॥ ౭౯॥

క్షత్రియునకు ప్రజారక్షణార్థము శస్త్రాస్త్ర ధారణమున్ను వైశ్యునకు కృషి

వాణిజ్యపశుపాల్యములున్ను వృత్త్యర్థమై చెప్పబడెను ఉభయులకున్ను ధర్మార్థమైయజనాధ్యయనదానములు చెప్పబడెను॥ ౭౯॥

మూ॥ వేదాభ్యాసో బ్రాహ్మణస్య క్షత్రియస్య చరక్షణం।
వార్తాకర్మైవ వైశ్యస్య విశిష్టాని స్వకర్మసు॥ ౮౦॥

ద్విజులకు వృత్త్యర్థమై చెప్పబడినవాటిలో బ్రాహ్మణునకధ్యాపనమున్ను క్షత్రియునకు రక్షణమున్ను వాణిజ్యపశుపాలనములు వైశ్యునకున్ను ముఖ్యములని చెప్పబడెను॥ ౮౦॥

మూ॥ అజీవంస్తు యథోక్తేన బ్రాహ్మణస్స్వేన కర్మణా।
జీవేత్ క్షత్రియధర్మేణ సహ్యస్య ప్రత్యనంతరః॥ ౮౧॥

బ్రాహ్మణుడు తనకు చెప్పబడిన యాజనాదికర్మములచే నిత్యకర్మానుష్ఠాన భృత్యపోషణాదులొనర్చుటకు బ్రతుకుట కుపయోగించకుండెనేని తనకుదగ్గిర జాతి గావున గ్రామనగరాదిరక్షణప్రముఖక్షత్రియకర్మముచే జీవించవలెను॥ ౮౧॥

మూ॥ ఉభాభ్యామప్యజీవంస్తు కథంస్యాదితి చేద్భవేత్।
కృషిగోరక్షమాస్థాయ జీవేద్వైశ్యస్య జీవికాం॥ ౮౨॥

బ్రాహ్మణుడు రెండుస్వవృత్తులచేనున్ను జీవించకుండెనేని కృషిగోరక్షణములననుటచే వాణిజ్యమున్ను చెప్పబడ్డదే గావున నీవైశ్యవృత్తులచే జీవించవలెను అప్పుడగినవాటిని ముందు చెప్పగలడు స్వయంకృషివిప్రునకు నిషిద్ధకర్మము గావున స్వయంకృషికన్న "ఋతామృతాభ్యాంజీవేత॥" యనునదియాపద్వృత్తియే గావుననిప్పుడీకృష్యాదులలో బలాబలములను చెప్పుచున్నాడు॥ ౮౨॥

మూ॥ వైశ్యవృత్త్యాపి జీవంస్తు బ్రాహ్మణః క్షత్రియోపివా।
హింసాప్రాయాంపరాధీనాం కృషింయత్నేన వర్జయేత్॥ ౮౩॥

బ్రాహ్మణక్షత్రియులు వైశ్యవృత్తిచే జీవించుచునైన భూమిగతజంతుహింసాప్రాయపరాధీనమగు కృషినియత్నముచే మానవలెను ఇందుచేత పశుపాలనాద్యభావమందు కృషి చెయ్యవలెనని చూడదగ్గది "క్షత్రియోపివా" యనుటచే స్వవృత్త్యభావమందు క్షత్రియుడు వైశ్యవృత్తిచే జీవించదగునని తోచుచున్నది॥ ౮౩॥

మూ॥ కృషింసాధ్వితి మన్యంతె సావృత్తిస్సద్విగర్హితా।
భూమింభూమిశయాంశ్చైవ హంతికాష్ఠ మయోముఖం ౮౪॥

కృషిని మంచిజీవనమని కొందరు తలుచుచున్నారు అజీవికమైతేను కఱ్ఱతోగూడి ఇనుపనాగలిచే భూమిని బగిల్చితద్గతజంతువులను జంపుచున్నగాన సాధులచే నిందింపబడెను॥ ౮౪॥

మూ॥ ఇదంతువృత్తివైకల్యాత్త్యజతో ధర్మనైపుణం।
విట్పణ్యముద్ధృతోద్ధారం విక్రేయం విత్తవర్ధనం॥ ౮౫॥

బ్రాహ్మణక్షత్రియులకు స్వవృత్త్యభావమందు ధర్మమును గూర్చిన యథోక్తమగు నైపుణ్యములేనప్పుడు వక్ష్యమాణనిషిద్ధవస్తువర్జనముగా వైశ్యులమ్మెడురీతిని ధనవృద్ధికరములగు క్రయవిక్రయముల నొనచుకొనవచ్చును॥ ౮౫॥

మూ॥ సర్వాన్ రసానపోహేత కృతాన్నంచ తిలైస్సహ।
అశ్మనోలవణంచైవ పశవో యేచమానుషాః॥ ౮౬॥

సర్వరసద్రవ్యములను సిద్ధాన్నతిలపాషాణలవణ పశుమనుష్యులనున్ను విక్రయించరాదు లవణము రసద్రవ్యమైనప్పటికిని మరల చెప్పడము దోషాధిక్య ప్రకటనచే ప్రాయశ్చిత్తగౌరవార్థము మిగిలినవాటికిని యిట్లే సందర్భము చేసుకొనవలెను॥

మూ॥ సర్వంచతాంతవంరక్తం శాణక్షౌమావికానిచ।
అపిచేత్స్యురరక్తాని ఫలమూలెతథౌషధీః॥ ౮౭॥

తంతునిర్మితకుసుంబాది రక్తసర్వవస్త్రములను నారచేతను పట్టుచేతను లోమముల చేతనున్ను నిర్మితములగునవిరక్తములు గాకున్నను విక్రయించరాదు ఫలమూలాదికమునున్ను నమ్మరాదు॥ ౮౭॥

మూ॥ అపశ్శస్త్రంవిషంమాంసం సోమంగంధాంశ్చ సర్వశః।
క్షీరంక్షౌద్రం దధిఘృతం తైలంమధుగుడంకుశాన్॥ ౮౮॥

జలలోహ విషమాంస సోమక్షీర దధిఘృత తైలగుడదర్భలను కర్పూరాది పరిమళద్రవ్యములను తేనయునుమైనమున్ను విక్రయించరాదు॥ "సభార్యోవసరమధూచ్ఛిష్టం"యనియాజ్ఞవల్క్యోక్తివలన॥ ౮౮॥

మూ॥ ఆరణ్యాంశ్చ పశూన్ సర్వాన్ దంష్ట్రిణశ్చ వయాంసిచ ।
మద్యం నీలీంచ లాక్షాంచ సర్వాంశ్చైకశఫాంస్తథా॥౮౯॥

గజాద్యారణ్యపశువులనున్ను కోరలుగల సింహాదులనున్ను పక్షులనున్ను మద్యమును నీలిమందును లక్కను గుఱ్ఱములు మొదలగు నొంటిడెక్కగల జంతువులనున్ను విక్రయించగూడదు॥ ౮౯॥

మూ॥ కామముత్పాద్య కృష్యాంతు స్వయమేవ కృషీవలః ।
విక్రీణీత తిలాంచ్ఛుద్ధాన్ ధర్మార్థ మచిరస్థితాన్॥ ౯౦॥

కర్షకుడు స్వకృషిచే ఫలింపించిననువ్వులను ఇతరద్రవ్యములతో గూడ పండినవెంటనే యనగా లాభార్థము ప్రియమున్యోమట్టుకను ప్రతీక్షించక ధర్మార్థముగా నిచ్చువలన విక్రయించవచ్చును తిలవిక్రయము నిషిద్ధముగావున ధర్మకార్యమునకైతే నిట్లమ్మవచ్చునని నిషేధనిషేధము॥ ౯౦॥

మూ॥ భోజనాభ్యంజనాద్దానా ద్యదన్యత్కురుతే తిలైః ।
కృమిభూతశ్శ్వవిష్ఠాయాం పితృభిస్సహ మజ్జతి॥౯౧॥

భోజనాభ్యంజనదానములకు గాక విక్రయాదినిమిత్తము తిలలనెవ్వడువినియోగపరచునో యతండు పితరులతోగూడశ్వవిష్ఠయందు క్రిమిత్వము నొంది మునుగును॥ ౯౧॥

మూ॥ సద్యః పతతి మాంసేన లాక్షయా లవణేనచ ।
త్ర్యహేణ శూద్రీభవతి బ్రాహ్మణః క్షీరవిక్రయాత్॥౯౨॥

మాంసలాక్షా లవణముల నమ్మునేనితత్క్షణమే పతితుడగునుదోషగౌరవజ్ఞాపనార్థమిట్లు వ్యాఖ్యజేయబడెను పంచమహాపాతకులను ముందు జెప్పగలడు గావున క్షీరవిక్రయము మూడుదినము లొనచేసేని శూద్రత్వము నొందును ఇదిన్ని దోషగౌరవజ్ఞాపనార్థమే॥ ౯౨॥

మూ॥ ఇతరేషాంతు పణ్యానాం విక్రయాదిహ కామతః ।
బ్రాహ్మణస్సప్తరాత్రేణ వైశ్యభావం నియచ్ఛతి॥౯౩॥

చెప్పబడిన మాంసాదులకువ్యతిరిక్తములగునపణ్యవస్తువులనుబ్రాహ్మణుడేడుదినము

నిచ్చచే నష్మోనేని వైశ్యత్వము నొందును "కామతః" యనుటచే ద్రవ్యాంతరములో
గలియుటచే ప్రమాదము వల్లనైనచో దోషములేదు॥ ౯౩॥

మూ॥ రసారసైర్నిమాతవ్యా నత్వేవలవణంరసైః।
కృతాన్నంచా కృతాన్నేన తిలాధాన్యేన తత్సమాః॥౯౪॥

రసా యనగా గుడాదులు రసైః యనగా ఘృతాదులతో వినిమయము జేయం
దగును ఉప్పునైతే నితరరసద్రవ్యముతో మాచరాగూడదు సిద్ధాన్నమును పచ్చివ
స్తువులతోటి మార్చవచ్చును తిలలను ధాన్యముతో ననగా కుంచెడుతిలలిచ్చికుంచె
డు ధాన్యము పుచ్చుకొనవచ్చును సరిగానని యర్థము॥ ౯౪॥

మూ॥ జీవేదేతేన రాజన్య స్సర్వేణాప్యనయం గతః।
నత్వేవజ్యాయసీం వృత్తి మభిమన్యేత కర్హిచిత్॥ ౯౫॥

క్షత్రియుడాపదయందు బ్రాహ్మణునకు నిషిద్ధములగు వాటినిన్ని వైశ్యునివలె
విక్రయించి బ్రదుకవచ్చును బ్రాహ్మణవృత్తినవలంబించ రాదు క్షత్రియునకేగా
దీనిషేధమందరికిన్ని॥ ౯౫॥

మూ॥ యోలోభాదధమోజాత్యా జీవేదుత్కృష్ట కర్మభిః।
తంరాజా నిర్ధనం కృత్వా క్షిప్రమేవ ప్రవాసయేత్॥౯౬॥

ఎవడధమజాతివాడు లోభముచే నుత్కృష్టజాతికర్మము లొనర్చు జీవిం
చునో వానిధనమంతయును హరించి రాజు దేశము నప్పుడే దాటించవలెను॥౯౬

మూ॥ వరం స్వధర్మో విగుణో నపారక్య స్స్వనుష్ఠితః।
పరధర్మేణ జీవన్ హి సద్యః పతతి జాతితః॥౯౭॥

స్వధర్మము విగుణమైన నించుకశ్రేష్ఠము పరజాతిధర్మము లెస్సగాజేయబడి
నను శ్రేష్ఠముగాదు జాత్యంతరకర్మముచే జీవించెనేని యప్పుడే తనజాతి దొరగ
పతితుడగును గావున నిదిదోషదర్శనార్థము॥ ౯౭॥

మూ॥ వైశ్యోజీవన్ స్వధర్మేణ శూద్రవృత్త్యాపి వర్తయేత్।
అనాచరన్నకార్యాణి నివర్తేతచ శక్తిమాన్॥౯౮॥

వైశ్యుడు స్వవృత్తిచే జీవనము జరగనప్పుడు ఉచ్ఛిష్టభోజనాది నికృష్టకార్యములను జేయకుండ ద్విజశుశ్రూషాదిశూద్రవృత్తిచే జీవించవచ్చును ఆపదను దాటిక్రమముగా శూద్రవృత్తిని విడువవలెను॥ ౯౮॥

మూ॥ అశక్నువంస్తు శుశ్రూషాం శూద్రః కర్తుం ద్విజన్మనామ్।
పుత్రదారాత్యయం ప్రాప్తో జీవేత్కారుకకర్మభిః॥౯౯॥

శూద్రుడు ద్విజశుశ్రూష చేయలేక దారపుత్రాదులన్నములేక బీదపడినప్పుడు సూపకారాదికారుకకర్మములచే బ్రదుకవలెను॥ ౯౯॥

మూ॥ యైః కర్మభిః ప్రచరితైః శుశ్రూష్యంతే ద్విజాతయః।
తాని కారుకకర్మాణి శిల్పాని వివిధానిచ॥ ౧౦౦॥

పైనిచెప్పబడిన కారుకకర్మములవిశేషములను దెలియజేయుటకీశ్లోకము॥ ఏకర్మములుచేస్తే ద్విజశుశ్రూష చేయబడునో యట్టి కర్రలుచెక్కడము చిత్తరువులు వ్రాయడము మొదలగునవి జేయవలెను॥ ౧౦౦॥

మూ॥ వైశ్యవృత్తిమనాతిష్ఠన్ బ్రాహ్మణస్స్వే పథి స్థితః।
అవృత్తికర్శితస్సీదన్నిమం ధర్మం సమాచరేత్॥ ౧౦౧॥

బ్రాహ్మణుడు వృత్త్యభావపీడితుడైనీరసించి క్షత్రియవైశ్యవృత్తి నవలంబించవలెను- "వరంస్వధర్మోఽవిగుణః-" యనిచెప్పబడుటవలన స్వవృత్తియందు వర్తించు నీవక్ష్యమాణవృత్తిననుసరించవలెను గుణహీనులవలననున్ను ప్రతిగ్రహము సంభవించనియప్పుడుపరవృత్తినాశ్రయించవలెను॥ ౧౦౧॥

మూ॥ సర్వతః ప్రతిగృహ్ణీయాద్బ్రాహ్మణస్త్వనయంగతః।
పవిత్రం దుష్యతీత్యేతద్ధర్మతో నోపపద్యతే॥ ౧౦౨॥

బ్రాహ్మణుడు వృత్త్యభావమునందు నతినిందితులవలననున్ను క్రమముగా ప్రతిగ్రహించవచ్చును ఇచ్చట నర్థాంతరన్యాస-పవిత్రమయినదిగంగ రథ్యోదకమును బొందినను నదిధర్మముచే దుష్టముగానేరదు గావున పవిత్రుడగు బ్రాహ్మణుడు ధమప్రతిగ్రహముచే దోషమునొందడు శాస్త్రధర్మముచే॥ ౧౦౨॥

మూ॥ నాధ్యాపనాద్యాజనాద్వా గర్హితాద్వా ప్రతిగ్రహాత్।
దోషోభవతివిప్రాణాం జ్వలనాంబుసమాహితే॥ ౧౦౩॥

బ్రాహ్మణులకాపదయందు గర్హితాధ్యాపనయాజన ప్రతిగ్రహములచే నఘముగాదు వారుపవిత్రులగుటచే నగ్నిసలిలతుల్యులుగావున॥ ౧౦౩॥

మూ॥ జీవితాత్యయమాపన్నో యోఽన్నమత్తియతస్తతః।
ఆకాశమివపంకేన నసపాపేనలిప్యతే॥ ౧౦౪॥

ప్రాణాంతమగు నాపదయందు ప్రతిలోమజాతివలననైన నన్నముదినినను బ్రాహ్మణుడాకాశము పంకమునంటనట్లుకలుషమునంటడు అర్థవాదమిది॥ ౧౦౪॥

మూ॥ అజీగర్తస్సుతం హంతు ముపాసర్పద్బుభుక్షితః।
నచాలిప్యతపాపేన క్షుత్ప్రతీకారమాచరన్॥ ౧౦౫॥

అజీగర్తుడను ఋషి తనపుత్రునినూరుగోవులకు యజ్ఞపశునిమిత్తమమ్మి చంపనుద్యోగించెనందుచే క్షుత్ప్రతీకారమొనర్చిన పాపము నొందడాయెను ఋగ్వేదబ్రాహ్మణమందీకథ వ్యక్తముగనున్నది॥ ౧౦౫॥

మూ॥ శ్వమాంసమిచ్ఛన్నార్తోఽత్తుం ధర్మాధర్మవిచక్షణః।
ప్రాణానాం పరిరక్షార్థం వామదేవోనలిప్తవాన్॥ ౧౦౬॥

ధర్మాధర్మములను గుర్తెరిగిన వామదేవుడను ఋషిక్షుధార్తుడై ప్రాణరక్షణార్థమై కుక్కమాంసమును దిననుద్యోగించి పాపమునొందలేదు॥ ౧౦౬॥

మూ॥ భరద్వాజః క్షుధార్తస్తు సపుత్రోవిజనేవనే।
బహ్వీర్గాః ప్రతిజగ్రాహ వృధోస్తక్ష్ణో మహాతపాః॥ ౧౦౭॥

తపస్వియగు భరద్వాజుడు పుత్రునితోగూడ క్షుధార్తుడైవిజనమగువనమందు వృధుడనుతక్షవలన ననేకగోవులను ప్రతిగ్రహించి పాపమునొందలేదు॥ ౧౦౭॥

మూ॥ క్షుధార్తశ్చాత్తుమభ్యాగాద్విశ్వామిత్రశ్శ్వజాఘనీం।
చండాలహస్తాదాదాయ ధర్మాధర్మవిచక్షణః॥ ౧౦౮॥

ధర్మాధర్మజ్ఞుడగు విశ్వామిత్రుడు క్షుధార్తుడై చండాలుని వలన కుక్క

యొక్క వెనుక చట్టమాంసమును బుచ్చుకొని తినుటకుద్యుక్తుడాయెను॥ ౧౦౮॥

మూ॥ ప్రతిగ్రహాద్యాజనాద్వా తథైవాధ్యాపనాదపి।
ప్రతిగ్రహః ప్రత్యవరః ప్రేత్యవిప్రస్య గర్హితః॥ ౧౦౯॥

ఆపదయందు సదధ్యాపనయాజనములలో నసత్ప్రతిగ్రహము నికృష్టము బ్రాహ్మణునకు నరకహేతువు గావున సదధ్యాపనయాజనములు సంభవించని యప్పుడసత్ప్రతిగ్రహము జేయుమని యీవచనము దీనికి హేతువును జెప్పుచున్నాడు॥౧౦౯॥

మూ॥ యాజనాధ్యాపనే నిత్యం క్రియేతే సంస్కృతాత్మనాం।
ప్రతిగ్రహస్తు క్రియతే శూద్రాదప్యంత్యజన్మనః॥ ౧౧౦॥

ఆపదయందైన ననాపదయందైనను యాజనాధ్యాపనములుపనయనసంస్కారముగల ద్విజులకే చేయబడును బ్రతిగ్రహము శూద్రునివల్లనున్ను గాగలదు గావునసిది నికృష్టము॥ ౧౧౦॥

మూ॥ జపహోమైరపైత్యేనో యాజనాధ్యాపనైః కృతః।
ప్రతిగ్రహనిమిత్తంతు త్యాగేన తపసైవచ॥ ౧౧౧॥

అసదధ్యయన యాజనములవలనబుట్టిన పాపము ప్రాయశ్చిత్తప్రకరణోక్తక్రమముచే జపహోమాదులవలన నశించును ప్రతిగ్రహజనితదోషమా పుచ్చుకొనబడినద్రవ్యమువిడుచుటచేతనున్ను॥ శ్లో॥ "మాసంగోష్ఠే పయఃపీత్వా" యన నది మొదలుగా జెప్పబడినక్రమమున జెప్పబోయెడితపస్సుచేబోవును॥ ౧౧౧॥

మూ॥ శిలోంఛమప్యాదదీత విప్రోఽజీవన్ యతస్తతః।
ప్రతిగ్రహాచ్ఛిలశ్శ్రేయాం స్తతోఽప్యుంఛః ప్రశస్యతే॥౧౧౨॥

బ్రాహ్మణునకు స్వవృత్తిచే జీవనము జరగనప్పుడచ్చట శిలోంఛవృత్తిచే బ్రతుకవలెనుగాని ప్రతిగ్రహముతగదు ప్రతిగ్రహముకంటె శిలవృత్తియనగా వెన్నులేరుకొనుట యింతకంటే నుంఛవృత్తిమంచిది యొక్కొకగింజచొప్పున నేరుకొనుట॥

మూ॥ సీదద్భిః కుప్యమిచ్ఛద్భిః ధనంవా పృథివీపతిః।
యాచ్యస్స్యాత్స్నాతకైర్విప్రై రదిత్సంస్త్యాగమర్హతి॥౧౧౩॥

స్నాతకులగు బ్రాహ్మణులు ధనాభావముచే కుటుంబభరణాశక్తులై యాగా

ద్ద్యుపయోగార్థమై కుప్యమనగా కృతాకృతహేమ రౌప్యవ్యతిరిక్తమగు ధాన్య వస్త్రాదికము రాజు నడగవలెను లోభ్యముచేనిచ్చే బుద్ధిలేకుండెనేని యారాజును విడువవలెను ఇచ్చట మేధాతిథి గోవిందరాజులు రాజీవ్వనిచ్ఛలేని వాడైనప్పటికి త్యాగముచేయనర్హుడు అవశ్యమీవలెనని వ్యాఖ్యానమొనరించిరి॥ ౧౧౩॥

మూ॥ అకృతంచ కృతాత్క్షేత్రాత్ గౌరజావిక మేవచ।
హిరణ్యం ధాన్యమన్నంచ పూర్వంపూర్వ మదోషవత్॥౧౧౪॥

సిద్ధముగా బాగుజేసినభూమికంటె కొనుభూమిప్రతిగ్రహిస్తేదోషములేకుండా గోవు మేక గొర్రె హిరణ్యము ధాన్యము అన్నము నీవస్తువులు ప్రతిగ్రహించుటకు పూర్వపూర్వములు దోషకరములుగావు పూర్వ పూర్వాసంభవమందుత్తరోత్తరము గ్రహించవలెను॥ ౧౧౪॥

మూ॥ సప్తవిత్తాగమాధర్మ్యా దాయోలాభః క్రయోజయః।
ప్రయోగః కర్మయోగశ్చ సత్ప్రతిగ్రహ ఏవచ॥౧౧౫॥

ధనాగమమునకు మార్గము లేడువిధములు దాయము మొదలగునవియందు దాయమనగా కులాగతధనము లాభమనగా నిధ్యాదులును మైత్ర్యాదిలబ్ధమున్ను క్రయమనగా ప్రసిద్ధము యీమూడున్ను నాలుగువర్ణములవారికిన్ని ధర్మ్యములు జయపాప్తము క్షత్రియునకుమాత్రమే ప్రయోగమనగా వృధ్యాదిపాప్తము కర్మయోగమనగా కృష్యాదిలబ్ధము వైశ్యునకీరెండు నుచితములు సత్ప్రతిగ్రహము బ్రాహ్మణునకర్హము ఇవ్వివిరికివి ధర్మ్యములని చెప్పటవలననే తదభావమందనాపద్విషయవృత్తుల నవలంబించవలె నవిసంభవించని యప్పుడాపద్ధర్మములచే జీవించదగునని కృతమునకుప్రయోగముగ నిచ్చట చెప్పబడెను॥ ౧౧౫॥

మూ॥ విద్యాశిల్పం భృతిస్సేవా గోరక్షం విపణిఃకృషిః।
ధృతిర్భైక్షం కుసీదంచ దశజీవన హేతవః॥౧౧౬॥

ఇది ఆపత్ప్రకరణముగావున "జీవన హేతవః" యనిచెప్పటవలన నీవృత్తులలోనవాపద యందు సేవనికేవృత్తిచే జీవనను బ్రాహ్మణునకు సేవాదికమువలెను నిషిద్ధమో యాపదయందు వానికావృత్తివిషయమై యభ్యనుజ్ఞజేయబడుచున్నది-ఇట్లు

శిల్పాదికసంకరమునకుగాని యాగును విద్యయనగా వేదవిద్యాతిరిక్తమగు వైద్య తర్కవిషాపహరణాదివిద్య శిల్పమనగా చందనాదికమును గూర్చేడి నేర్పు భృతి యనగా జీతమునకు కుసీదము సేవయనగా పరాజ్ఞాకరణము గోరక్షణము వర్తకము స్వయంకృషి ధృతి యనగా నల్పసంతుష్టి భిక్షమెత్తుకోవడము వడ్డీబేరము ఈపదివృత్తులచేతను నాపదయందుజీవించదగును॥ ౧౧౬॥

మూ॥ బ్రాహ్మణఃక్షత్రియోవాపి వృద్ధింనైవప్రయోజయేత్।
కామంతుఖలు ధర్మార్థం దద్యాత్పాపీయసేల్పికాం॥ ౧౧౭॥

బ్రాహ్మణుడైనను క్షత్రియుడైనను వృద్ధ్యాదిధనను నాపదయందైనను గూర్చరాదు ధర్మార్థమై యనుకల్పముగా జెప్పబడిన నికృష్టకర్మనుచేసైన ధనమార్జించవలెను ఇప్పుడు రాజులకాపద్ధర్మమును జెప్పుచున్నాడు॥ ౧౧౭॥

మూ॥ చతుర్థమాదదానోపి క్షత్రియో భాగమాపది।
ప్రజారక్షన్ పరంశక్త్యా కిల్బిషాత్ప్రతిముచ్యతే॥ ౧౧౮॥

రాజుకు ధాన్యాదులలో నెనిమిదవపాలుజెప్పబడెను ఆపదయందు నాలవపాలుపుచ్చుకొనినదైనను నధికమగుశక్తితో ప్రజలనురక్షించుచు నధికకరగ్రహపాపముతోకూడుకొనకుండును ఆపదయందుకూడా ప్రజారక్షణము రాజుకు నెందువల్లనంతే చెప్పబడుచున్నది॥ ౧౧౮॥

మూ॥ స్వధర్మో విజయస్తస్య నాహవేస్యాత్పరాఙ్ముఖః।
శస్త్రేణవైశ్యాన్ రక్షిత్వా ధర్మ్యమాహారయేద్బలిం॥ ౧౧౯॥

రాజునకువిజయము స్వధర్మము విజయఫలము యుద్ధమనియర్థము ప్రజారక్షణమునకుసమర్థుడై యెందువల్లనయిన భయముత్పన్నమయ్యేనో యపుడు యుద్ధపరాఙ్ముఖుడుకారాదు యిట్లుశస్త్రముచే దస్యులవలన వైశ్యులనురక్షించి వారలవలన శాస్త్రీయమగుపన్ను నధికారపురుషులచే నాకర్షించవలెను ఆపన్నేదనిన॥

మూ॥ ధాన్యేష్టమం విశాంశుల్కం వింశకార్షాపణావరం।
కర్మోపకరణాశ్శూద్రాః కారవశ్శిల్పినస్తథా॥ ౧౨౦॥

ధాన్యసమూహమందు వైశ్యునివలన నష్టమాంశము శుల్కమాకర్షించవలె

ను ధాన్యములలో ద్వాదశభాగమని జెప్పబడెను-యీయష్టమాంశ మాపదయందు నత్యంతాపదయందుక్త చతుర్థాంశమని యుక్తరీతిగను యింగితమః దిభా గము గ్రాహ్యమనియుక్తగలదనియుక్తమే బల్యాదులలో కార్షాపణ స్థానముల కు వింశతితమమగు భాగమునుగ్రహించవలెనుఅందున్ను "పంచాశద్భాగఆదేయో రాజ్ఞాపశుహిరణ్యయో"రనుటచే నహాంయదయందు పంచాశద్భాగముచెప్పబడెను యీవింశతితమభాగ మాపదయందని చెప్పబడెను శూద్రశిల్పగా సూపకారాదు లు శిల్పులనగా చేతిపనివాళ్లు మొదలగువారున్నచే తమతమపెట్టిగా జేయుటచు కోవడముకుతప్ప పన్ను గ్రాహ్యముకాదు॥ ౧౨౦॥

మూ॥ శూద్రస్తు వృత్తి మాకాంక్షన్ క్షత్ర మారాధయేద్యది।
ధనినంవా ప్యుపారాధ్య వైశ్యంశూద్రో జిజీవిషేత్॥౧౨౧॥

శూద్రుడు బ్రాహ్మణశుశ్రూషచే జీవనము జరగకపోవుచు క్షత్రియునియొక్క ధన వంతుడగు వైశ్యునయిన నాశ్రయించి జీవించనిచ్ఛయించవలెను ద్విజశుశ్రూషచే జరగకుండునప్పుడు మున్నుజెప్పబడిన పనులచే బ్రతుకవలెను॥ ౧౨౧॥

మూ॥ స్వర్గార్థ ముభయార్థంవా విప్రానారాధయేత్తుసః।
జాతబ్రాహ్మణ శబ్దస్య సాహ్యస్య కృతకృత్యతా॥౧౨౨॥

ఆశూద్రుడుస్వర్గప్రాప్తికిగాని ఇహపరములకు రెంటికీగానీ బ్రాహ్మణునినా శ్రయించెనేని బ్రాహ్మణాశ్రితుడని శబ్దముచే చెప్పబడునదియె వానికికృతార్థత బ్రాహ్మణ సంబంధవ్యపదేశముచే ధన్యుడగును॥ ౧౨౨॥

మూ॥ విప్రసేవైవ శూద్రస్య విశిష్టం కర్మకీర్త్యతే।
యదతోన్యద్ధి కురుతేతద్భవత్యస్య నిష్ఫలం॥ ౧౨౩॥

శూద్రునకితరకర్మముకంటె బ్రాహ్మణసేవ ఉత్కృష్టమని కర్మశాస్త్రమందు జె ప్పబడెను దీనికంటె నన్యమేమిజేసినను వినికినిష్ఫలమగునని పూర్వోక్తమగు దాని కిస్తుతి పాకయజ్ఞాదులున్ను వానికివిహితముగావున॥ ౧౨౩॥

మూ॥ ప్రకల్ప్యాతస్యతైర్వృత్తిస్స్వకుటుంబాద్యథార్హతః।
శక్తించావేక్ష్య దాక్ష్యంచభృత్యానాంచ పరిగ్రహం॥ ౧౨౪॥

ఆశూద్రుడు చేసెడిపనియందగు సామర్థ్యము ననుసరించి వాని దారపుత్రాదులకు సరిపడునట్లు బ్రాహ్మణులు చే వానివృత్తి నొసగవలెను॥ ౧౨౪॥

మూ॥ ఉచ్ఛిష్టమన్నం దాతవ్యం జీర్ణాని వసనాని చ।
పులాకాశ్చైవ ధాన్యానాం జీర్ణాశ్చైవ పరిచ్ఛదాః॥ ౧౨౫॥

ప్రకృత ద్విజాశ్రితశూద్రునకు ఉచ్ఛిష్టాన్నమున్ను జీర్ణములగుతమరుకట్టుకొని ముక్తములగు వస్త్రములు కేవలము చిరిగిపోనివి పరిచ్ఛదము గావలెను॥ “శ్లో॥ నశూద్రాయమతిం దద్యాన్నోచ్ఛిష్ట” మనునది యనాశ్రయశూద్రవిషయము ధాన్యములలో పులాకలనగా నాళ్ళు బొల్లు మొదలగునవి వానికీవలెను॥ ౧౨౫॥

మూ॥ నశూద్రే పాతకం కించిన్న చ సంస్కారమర్హతి।
నాస్యాధికారో ధర్మేఽస్తి నధర్మాత్ప్రతిషేధనం॥ ౧౨౬॥

శూద్రునకు లశునాదిభక్షణముచే నించుకైన పాపము లేదు “అహింసాసత్యమస్తేయ” మనునీనాల్గువర్ణముల వారికిహింసకూడదని చెప్పబడుటవలన బ్రాహ్మణవధాదికమువలన పాపము లేదనగాదు వీనికి విహితములగు పాకయజ్ఞాదులు దక్క నగ్నిహోత్రాదిధర్మకర్మమందధికారము లే దుపనయనాదిసంస్కారములున్ను లేవు విహితములుగావున॥ ౧౨౬॥

మూ॥ ధర్మేప్సవస్తు ధర్మజ్ఞాః సతాం వృత్తమనుష్ఠితాః।
మంత్రవర్జం నదుష్యంతి ప్రశంసాం ప్రాప్నువంతిచ॥ ౧౨౭॥

ఏశూద్రులు స్వధర్మము నెరిగినవారై ధర్మప్రాప్తినిగోరుచు పై మూడు వర్ణములవారియొక్క యనిషిద్ధమగు నాచారము నవలంబించినవారైరి॥ “శ్లో॥ నమస్కారేణ మంత్రేణ పంచయజ్ఞాన్నహాపయే” దని యాజ్ఞవల్క్యవచనమువలన నమస్కారమంత్రముచే తంత్రాంతరహితమగునట్లు పంచయజ్ఞాది ధర్మములను జేయుచున్నవారై ప్రత్యవాయమునొందరు లోకమందు ఖ్యాతిని బొందుదురు॥

మూ॥ యథాయథాహి సద్వృత్తమాతిష్ఠత్యనసూయకః।
తథాతథేమంచాముంచ లోకంప్రాప్నోత్యనిందితః॥ ౧౨౮॥

ఒకరిని నిందజేయక ద్విజాత్యాచమననమును వనకనిషిద్ధమగుదానినెట్లట్లవలంబిం

చునో యట్లట్టిహపరలోకములందహుఁడగును నిందితుఁడను గాఁడని స్మృతిచే జెప్ప
బడేను॥ ౧౨౮॥

మూ॥ శక్తేనాపిహి శూద్రేణ నకార్యోధనసంచయః।
శూద్రోహి ధనమాసాద్య బ్రాహ్మణానేవబాధతే॥ ౧౨౯॥

ధనసంచయము నార్జించుటకు సమర్థుఁడయ్యును శూద్రుఁడు దార పుత్రాది
పోష్యవర్గ పంచయజ్ఞోపయోగమాత్రముకంటె నధికముగా ధనమును జేర్చరాదుధ
నమధికముగనుండుటవలననున్న శాస్త్రమెరుగకుండుటవలననున్ను బ్రాహ్మణులనే
బాధించును శుశ్రూష చెయ్యనేచేయఁడని పూర్వోక్తమునకనువాదము॥ ౧౨౯॥

మూ॥ ఏతేచతుర్ణాం వర్ణానా మాపద్ధర్మాః ప్రకీర్తితాః।
యాన్ సమ్యగనుతిష్ఠంతో వ్రజంతి పరమాంగతిం॥ ౧౩౦॥

ఇవి నాలుగువర్ణములవారికిని యాపదయందు జేయందగినధర్మములు చెప్ప
బడెను వీటిని లెస్సగా నాచరించినవారగుచు విహితానుష్ఠాననిషిద్ధానాచరణను
లవలన పాపమునశింపజేసుకొని బ్రహ్మజ్ఞానసంపన్నులై మోక్షమునొందుదురు॥

మూ॥ ఏషధర్మవిధిః కృత్స్నశ్చాతుర్వర్ణ్యస్య కీర్తితః।
అతఃపరం ప్రవక్ష్యామి ప్రాయశ్చిత్తవిధింశుభం॥ ౧౩౧॥

ఇతిశ్రీమానవేధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాం సంహితాయాం
దశమోఽధ్యాయః.

ఇది నాలుగువర్ణములవారి యాచారము సమగ్రముగ జెప్పబడె నీపైని ప్రా
యశ్చిత్తానుష్ఠానమునతిశుభకరమగు దానిజెప్పెదను॥ ౧౩౧

ఇది శ్రీమన్మహామహీబిడౌజ శ్రీమదానందగజపతి రాజ
మహారాజ దయాపాత్ర భారద్వాజసగోత్రపవిత్ర
సుకవిజనవిధేయ మండకామేశ్వర నామధేయ
విరచి తాంధ్రమన్వర్థదీపికాఖ్యయగు
వ్యాఖ్యయందుదశమాధ్యాయము.



శ్రీరస్తు.

ఆంధ్రమన్వర్థదీపికాసహితము

# మనుస్మృతి * ఏకాదశాధ్యాయ ప్రారంభము.

మూ॥ సాంతానికం యక్ష్యమాణ మధ్వగం సర్వవేదసం।
గుర్వర్థం పితృమాత్రర్థం స్వాధ్యాయార్థ్యుపతాపినః॥౧॥

నవై తాన్ స్నాతకాన్ విద్యాత్ బ్రాహ్మణాన్ ధర్మభిక్షుకాన్।
నిస్స్వేభ్యో దేయమేతేభ్యో దానంవిద్యా విశేషతః॥౨॥

"అతఃపరంప్రవక్ష్యామి ప్రాయశ్చిత్త విధిమని॥" ప్రాయశ్చిత్తవిధానము జెప్పుటకు ప్రతిజ్ఞ జేయబడెను గాన సాంతానికాదులకు దానమీవలెనని ప్రస్తావము "దానేనాకార్యకారిణః॥" యని పైని జెప్పబడుటవల్లనున్ను "దానేనవధనిర్ణేకం సర్పాదీనామశక్నువన్॥" అనివక్ష్యమాణమువల్లనున్ను గొప్ప ప్రాయశ్చిత్తమునకు దానపాత్రమునుపన్యసించుట ప్రకృతమునకుపయోగము వర్ణాశ్రమధర్మాదివ్యతిరిక్తప్రాయశ్చిత్తాదినైమిత్తికధర్మకథనమీయధ్యాయమందగును గావున వశ్యమగునైమిత్తికధర్మోపన్యాసమున్ను నిచ్చట గాదగును వివాహముసంతానము ప్రయోజనముగాగలది గావున సాంతానికుడనగా వివాహార్థియు నవశ్యకర్తవ్యములగు నగ్నిష్టోమాదులను జేయ నిచ్ఛగలవాడున్ను పాంథుడున్ను సర్వవేదసమనగా సర్వస్వదక్షిణగల విశ్వజిద్యాగము దానిజేసినవాడును విద్యాగురువునకు గ్రాసాచ్ఛాదనాదికమును గోరెడువాడు తలిదండ్రులను బోషించుటకై ధనముగోరువాడున్ను వేదమును జదివెడికాలమందు వస్త్రాదికమును గోరెడి బ్రహ్మచారియు రోగియు నీతొమ్మండ్రును ధర్మార్థముభిక్షను గోరెడు బ్రాహ్మణులనుగా దెలియవలెను నిర్ధనులగువీరికి గోహిరణ్యాదిదానము విద్యావిశేషానురూపముగనీవలెను॥ ౧॥౨॥

మూ॥ ఏతేభ్యోహి ద్విజాగ్ర్యేభ్యో దేయమన్నం సదక్షిణం।
ఇతరేభ్యో బహిర్వేది కృతాన్నం దేయ ముచ్యతే॥

ఈతొమ్మండ్రగు బ్రాహ్మణశ్రేష్ఠులకంతర్వేదియగు సదక్షిణాన్నమును బెట్టవలె ను ఏతద్వ్యతిరిక్తులగు బ్రాహ్మణులకు బహిర్వేదిసిద్ధమగు నన్నము నిడవలెనని చెప్ప బడెను ధనమిచ్చెడిచోనీనియమనులేదు॥ ౩।

మూ॥ సర్వరత్నానిరాజాతు యథార్హం ప్రతిపాదయేత్।
బ్రాహ్మణాన్వేదవిదుషో యజ్ఞార్థంచైవదక్షిణాం॥౪॥

రాజు సకలరత్నములనున్న యాగోపయోగ్యములగు మణిముక్తాదులనున్ను దక్షిణార్థమగు ధనమును విద్యానురూపముగ వేదవేత్తలగు బ్రాహ్మణులకీవలెను॥

మూ॥ కృతదారోపరాన్ దారాన్ భిక్షిత్వా యోధిగచ్ఛతి।
రతిమాత్రం ఫలం తస్య ద్రవ్యదాతుస్తు సంతతిః॥ ౫॥

వివాహితుడైయుండియును మరల వివాహము జేసికొనుటకు ధనమును యాచించి తెచ్చి పెళ్లిజేసికొనెనేని వానికాస్త్రీయందు రతిమాత్రమెఫలము సంతానము ధనదాతకేయగును ఇట్లు జెప్పుటచే భార్యయున్నవానికి మరలవివాహార్థము ధనమీరాదనియును యట్లుచేయరాదనియు నిషేధార్థమిది॥ ౫॥

మూ॥ ధనానితు యథాశక్తి విప్రేషు ప్రతిపాదయేత్।
వేదవిత్సు వివిక్తేషు ప్రేత్యస్వర్గం సమశ్నుతే॥౬॥

గోభూహిరణ్యాదిధనమును కుటుంబవంతులును వేదవేత్తలునగు బ్రాహ్మణులకీవలెనందుచే పరలోకమందు స్వర్గసుఖము ననుభవించును॥ ౬॥

మూ॥ యస్య త్రైవార్షికం భక్తం పర్యాప్తం భృత్యవృత్తయే।
అధికంవాపి విద్యేత ససోమం పాతుమర్హతి॥౭॥

ఎవనికి యవశ్యభరణీయులగు వారికి జీవనార్థము మూడుసంవత్సరముల దనుక పూర్ణిగాగాని యెక్కువగాగాని ధనముండునో వాడు కామ్యయాగములు జేయనుద్యోగించవలెను నిత్యములగు నగ్నిష్టోమాదులనొనర్చుటకీనిషేధము లేదవి యెల్లప్పుడును జేయదగును గావుననే "సమాంతేసోమికైర్మఖైః"రని నిత్యవిషయమై ప్రతిసంవత్సరాంతమందును సోమయాగమును జేయుమని విధించెను॥ ౭॥

మూ॥ అతస్స్వల్పీయసి ద్రవ్యే యస్సోమం పిబతి ద్విజః ।
సపీత సోమపూర్వోఽపి నతస్యాప్నోతి తత్ఫలం॥౮॥

మూడుసంవత్సరములకు చాలని సొమ్ముగలవాడు మున్ను సోమయాగమును జేసినవాడు మరలజేసెనేని దానిఫలమునొందను యాగమొకమారుజేసిన వానికి రెండవయాగము తప్పక కామ్యమగుచున్నది॥ ౮॥

మూ॥ శక్తః పరజనే దాతా స్వజనే దుఃఖజీవిని ।
మధ్వాపాతో విషాస్వాద స్సధర్మ ప్రతిరూపకః॥౯॥

ధనమార్జించ శక్తుడగువాడు తలిదండ్రులు మొదలగు స్వజనమన్నములేక నీరసించుచుండగా యశస్సునకునై యన్యులకు వితరణమొనర్చువాడు మొదట తేనెవలె దోచినం ద్రావినపరిణామమందు విషమగును కీర్తికొరకుబోయినరకమందుబడును॥ ౯॥

మూ॥ భృత్యానా ముపరోధేన యఃకరోత్యౌర్ధ్వదైహికం।
తద్భవత్యసుఖోదర్కం జీవతశ్చ మృతస్యచ॥౧౦॥

పుత్రదారాదులకు పీడగలుగునట్లుగా పరలోకసుఖార్థమై దానాదికము నొనర్చువానికిహమందును పరమందును దుఃఖమెయగును పైశ్లోకములో లోకమందగుయశస్సునకు నీతిగలవాడును నీశ్లోకమందు పరలోకసుఖార్థమీవిగలవాడు నని నిషేధమునకై జెప్పను॥ ౧౦॥

మూ॥ యజ్ఞశ్చేత్ప్రతిరుద్ధస్స్యా దేకేనాంగేన యజ్వనః ।
బ్రాహ్మణస్య విశేషేణ ధార్మికే సతిరాజని॥౧౧॥

యోవైశ్యస్స్యా ద్బహుపశుర్హీనక్రతురసోమపః ।
కుటుంబాత్తస్య తద్ద్రవ్య మాహరేద్యజ్ఞసిద్ధయే॥౧౨॥

క్షత్రియునియొక్కగాని విశేషించి బ్రాహ్మణునియొక్కగాని యజ్ఞమన్నియంగములును గలిగిన నొక్కయంగముమాత్రము సమకూడనందునవాయజ్ఞమునిలచిపోవుచుండెనేని చాలాపశుధనాదులు గలిగి సోమయాజిగాని వైశ్యునియొక్క ధనము నేరీతినైనం దెచ్చి యాయజ్ఞమును బూర్తిజేయవలెను రాజు ధర్మబుద్ధిగల

కాకై యిట్లొనర్చవలెను గాని శాస్త్రార్థము నెరిగి నిగ్రహించరాదు॥ ౧౧॥౧౨॥

మూ॥ ఆహరేత్త్రీణివా ద్వేవా కామం శూద్రస్య వేశ్మనః।
నహిశూద్రస్య యజ్ఞేషు కశ్చిదస్తిపరిగ్రహః॥ ౧౩॥

యజ్ఞమునకు రెండంగములుగాని మూడంగములుగాని సంపూర్ణించని యప్పు డు శూద్రగృహమునుంచి బలాత్కారముగా గాని చౌర్యముచేగాని సనము నా యంగముల పూర్తికై తేవలెను గానియజ్ఞార్థమై శూద్రునియాచించరాదు॥ "శ్లో॥ న యజ్ఞార్థంధనంశూద్రాద్విప్రోభిక్షేతేతి" యనువచనముచే వివడు యాచించ కూడదు హరింపవచ్చును క్షత్రియుడైతే బలాత్కరించితీసుకొనవలెను॥ ౧౩॥

మూ॥ యోనాహితాగ్నిశ్శతగు రయజ్వాచసహస్రగుః।
తయోరపికుటుంబాభ్యా మాహరేదవిచారయన్॥ ౧౪॥

ఔపాసనాగ్నిగల వైశ్యుడు నూరుగోవులంతధనికుడైనా యజ్ఞముచేసినవై శ్యుడు వేయి గోవులంతధనికుడైనా నట్టికుటుంబద్రవ్యముపల్లనున్ను యజ్ఞార్థ మై రెండుమూడంగములలోపముదీరుటకు తగినసొమ్ము బ్రాహ్మణుడు తనకున్ను క్షత్రియునకున్ను యజ్ఞపూర్తియగునట్లు యోచించిగాని బలాత్కరించిగాని చౌ ర్యముచేగాని హరింపవచ్చునందువలన ఖ్యాతికిన్ని లోపములేదు యజ్ఞసిద్ధిన్ని య గును॥ ౧౪॥

మూ॥ ఆదాననిత్యాచ్చాదాతు రాహరేదప్రయచ్ఛతః।
తథాయశోస్యప్రథతె ధర్మశ్చైవ ప్రవర్ధతే॥ ౧౫॥

యాచనాదికముచే ధనాదానము నిత్యముగా గలవాడాదాననిత్యుడు బ్రాహ్మ ణుడితడిష్టాపూర్తరహితుడయ్యేనని యట్టిబ్రాహ్మణునివలననున్ను యజ్ఞము కొ రతగానున్న రెండుమూడంగముల భర్తీకిదగినద్రవ్యము నడిగ గానిబలాత్కారము గాగాని చౌర్యముచేగాని తెచ్చి యజ్ఞపూర్తిచేయుటచే నీతనికీర్తిన్ని పుట్టును ధర్మమున్ను వృద్ధినొందును॥ ౧౫॥

మూ॥ తథైవసప్తమే భక్తే భక్తానిషడనశ్నతా।
అశ్వస్తనవిధానేన హర్తవ్యం హీనకర్మణః॥ ౧౬॥

దినమునకు రెండుభోజనములు శాస్త్రీయములన్ను మూడుదినములకారుభోజనములు లేక నాలవనాఁటికుపస్తమభోజనార్థము దానధర్మశూన్యునివద్ద నొక దినమునకు జాలినంత చౌర్యాదికముచేనైన హరించవచ్చును॥ ౧౬॥

మూ॥ ఖలాత్ క్షేత్రాదగారాద్వా యతోవాప్యుపలభ్యతే।
ఆఖ్యాతవ్యంతు తత్తస్మై పృచ్ఛతే యదిపృచ్ఛతి॥ ౧౭॥

కళ్ళములోనించిగాని మడిలోనించిగాని గృహమునుంచిగాని కర్మహీనుని ధనమునెచ్చట దొంగలించుటకుతటస్థమైన నచ్చటినుంచి హరించవలెను ధనస్వామియడిగెనేని చౌర్యమునకు నిమిత్తమును వానికిజెప్పవలెను॥ ౧౭॥

మూ॥ బ్రాహ్మణస్వంనహర్తవ్యం క్షత్రియేణకదాచన।
దస్యునిష్క్రియయోస్తుస్వ మజీవన్ హర్తుమర్హతి॥ ౧౮॥

పైఁజెప్పబడిన నిమిత్తములయందునైనను బ్రాహ్మణద్రవ్యమునుక్షత్రియుడుహరించరాదు బ్రాహ్మణునికంటే నికృష్టుడుగావున నన్యాయసాదృశ్యముచే వైశ్యశూద్రులున్ను పైపైజాతులధనమును హరించరాదు నిషిద్ధకర్మము లొనర్చువానియొక్కగాని విహితకర్మములను జేయనివానియొక్కగాని బ్రాహ్మణక్షత్రియులలో నెవ్వనిధనమునైనను బ్రతుకుతెరవులేనప్పుడు క్షత్రియుడు హరించవచ్చును॥ ౧౮॥

మూ॥ యో౽సాధుభ్యో౽ర్థమాదాయ సాధుభ్యస్సంప్రయచ్ఛతి।
సకృత్వా ప్లవమాత్మానం సంతారయతి తావుభౌ॥ ౧౯॥

ఎవడు హీనకర్ములగు ధనవంతులవలన ధనముదెచ్చి పైనిచెప్పిన నిమిత్తములందు సజ్జనులకిచ్చునో వాడు తనను పడవనుగాజేసి యెవనివలనసొమ్ముతెచ్చెనో వాడునుబ్బుడు గావున వానిధనము ధర్మమునకు వినియోగపడుటవలన వాడు కృతార్థుఁడాయెను ఎవరికిచ్చెనో వాళ్ళదారిద్ర్యముపోయి ధర్మము లొనర్చిరిగావున నిద్దరిని దుఃఖసముద్రమును దాటించుచున్నాడు॥ ౧౯॥

మూ॥ యద్ధనం యజ్ఞశీలానాం దేవస్వంతద్విదుర్బుధాః।
అయజ్వనాంతు యద్విత్తమాసురస్వంతదుచ్యతే॥ ౨౦॥

యజ్ఞశీలురగువారిధనము ధర్మవినియోగమునకర్హము గావున నదిదేవస

మని పెద్దలందురు యజ్ఞాదులు జేయనివారిధనము ధర్మమునకు కానిదిగావుననా సురమనబడును రాజు దానిదేవస్వముగా జేయవలెను॥ ౨౦॥

మూ॥ నతస్మిన్ ధారయేద్దండం ధార్మికః పృథివీపతిః।
క్షత్రియస్యహి బాలిశ్యా ద్బ్రాహ్మణస్సీదతిక్షుధా॥ ౨౧॥

పైనిచెప్పబడిన నిమిత్తములవిషయమై చెప్పిన చౌర్యబలాత్కారాదులొనర్చు వారియందు ధార్మికుడగురాజు దండమును విధించరాదు రాజుయొక్క మౌర్ఖ్యముచేతనేగదా బ్రాహ్మణుడాకలిచే పీడితుడుగావడము అందువలన॥ ౨౧॥

మూ॥ తస్య భృత్యజనం జ్ఞాత్వా స్వకుటుంబాన్మహీపతిః।
శ్రుతశీలేచ విజ్ఞాయ వృత్తిం ధర్మ్యాం ప్రకల్పయేత్॥ ౨౨॥

బ్రాహ్మణుని పుత్రదారాదిపోష్యవర్గమును గణించి శ్రుతశీలాను సారముగా వృత్తిని కల్పించవలెను॥ ౨౨॥

మూ॥ కల్పయిత్వాస్య వృత్తించ రక్షేదేనం సమంతతః।
రాజాహి ధర్మషడ్భాగం తస్మాత్ప్రాప్నోతి రక్షితాత్॥ ౨౩॥

అట్లువృత్తినికల్పించి చోరాదిబాధలురాకుండ నాబ్రాహ్మణుని రక్షించవలెను రాజువానివలన ధర్మషడ్భాగమును బుచ్చుకొనుచున్నాడు॥ ౨౩॥

మూ॥ నయజ్ఞార్థం ధనం శూద్రా ద్విప్రోభిక్షేత కర్హిచిత్।
యజమానోహి భిక్షిత్వా చండాలః ప్రేత్యజాయతే॥ ౨౪॥

బ్రాహ్మణుడు యజ్ఞార్థమై శూద్రునియెప్పుడున్ను యాచించరాదు యాచించి తెచ్చిన శూద్రధనముచే యజ్ఞమును జేసినవాడు చచ్చి చండాలుడై బుట్టును గావున నీయాచ్ఞానిషేధమువలన నయాచితోపస్థిత శూద్రద్రవ్యమనిషిద్ధము॥ ౨౪॥

మూ॥ యజ్ఞార్థమర్థం భిక్షిత్వా యోనసర్వం ప్రయచ్ఛతి।
సయాతి భాసతాం విప్రః కాకతాం వాశతంసమాః॥ ౨౫॥

యజ్ఞార్థమై యాచించి తెచ్చిన ధనమంతయును యజ్ఞమందు వినియోగింపజేయకుండెనేని వాడునూరేళ్ళు భాసమనెపక్షిజన్మమైనా కాకజన్మమైనాబొందును॥

మూ॥ దేవస్వం బ్రాహ్మణస్వంవా లోభేనోపహినస్తియః।
సపాపాత్మా పరేలోకే గృధ్రోచ్ఛిష్టేన జీవతి॥౨౬॥

ప్రతిమాది దేవతలకుస్వార్థముత్సృష్టమగు సొమ్మునున్ను బ్రాహ్మణద్రవ్యము నున్ను లోభముచే నెవడు హరించునో వాడు పరలోకమందనగా జన్మాంతరమందు గృధ్రోచ్ఛిష్టమునుదిని బ్రతుకును॥ ౨౬॥

మూ॥ ఇష్టింవైశ్వానరీం నిత్యం నిర్వపేదబ్దపర్యయే।
క్లృప్తానాం పశుసోమానాం నిష్కృత్యర్థ మసంభవే॥౨౭॥

పాతసంవత్సరముబోయి క్రొత్తసంవత్సరాదియందు విహితమగు సోమయాగాసంభవమందు తదకరణదోషముబోవుటకై వైశ్వానరేష్టిని జేయవలయును॥

మూ॥ ఆపత్కల్పేన యోధర్మం కురుతే నాపదిద్విజః।
సనాప్నోతి ఫలంతస్య పరత్రేతి విచారితం॥౨౮॥

ఆపత్కాలమందు విహితమగు ధర్మముననాపదయందాచరించినవానికది పరలోకమందు నిష్ఫలమగుచున్నది॥ ౨౮॥

మూ॥ విశ్వైశ్చదేవైః సాధ్యైశ్చ బ్రాహ్మణైశ్చ మహర్షిభిః।
ఆపత్సు మరణాద్భీతై ర్విధేః ప్రతినిధిఃకృతః॥౨౯॥

విశ్వనామకులగు దేవతలచేతనున్ను సాధ్యులచేతనున్ను మహర్షులగు బ్రాహ్మణులచేతనున్ను మరణభీతిచే నాపదయందు ముఖ్యవిధియగు సోమయాగాదికమునకు వైశ్వానర్యాది ప్రతినిధి చేయబడెను ఇదిముఖ్యాసంభవమందు జేయదగునుగాని ముఖ్యముసంభవించుచుండగా జేయగూడదు॥ ౨౯॥

మూ॥ ప్రభుః ప్రథమకల్పస్య యోఽనుకల్పేన వర్తతే।
నసాంపరాయికం తస్య దుర్మతే ర్విద్యతేఫలం॥౩౦॥

ఎవడు ముఖ్యమగు విధినిజేయుటకు సంపన్నుడై యాపద్విధియగు ప్రతినిధిచే ననుష్ఠానమును జేయునో యాదుర్బుద్ధి పారలౌకికాభ్యుదయరూపమై ప్రత్యవాయపరిహారార్థమగు ఫలముకాదు-"ఆపత్కల్పేనయోధర్మ"మనుశ్లోకముచే జెప్పబడిన స్మృతికిని యిదిశాస్త్రార్థమయి మరలజెప్పబడెను॥ ౩౦॥

మూ॥ నబ్రాహ్మణో నివేదయేత్ కించిద్రాజని ధర్మవిత్।
స్వవీర్యేణైవ తాం ఛ్ఛిష్యా న్మానవా నపకారిణః॥30॥

కర్మజ్ఞుడగు బ్రాహ్మణుడు తనకెవ్వడైనం జేసిన యపకారమును రాజునకు దెలియజేయరాదు మరేమంటే స్వశక్తిచేతనే వక్ష్యమాణాభిచారాదికముచే నపకారులను శిక్షించవలెను అందువలన స్వకీయధర్మవిరోధనుంటె నపకృష్టమగు నపరాధకరణను గలుగుచుండగా నభిచారాదికము దోషమునకుగాదనునది పరమతము ఇదియభిచారమును విధించదు రాజనివేదనము నయినను నిషేధించదు॥ 30॥

మూ॥ స్వవీర్యా ద్రాజవీర్యాచ్చ స్వవీర్యం బలవత్తరం।
తస్మాత్స్వేనైవ వీర్యేణ నిగృహ్ణీయా దరీన్ద్విజః॥31॥

స్వసామర్థ్యముకంటె రాజసామర్థ్యము పరాధీనముగనుక స్వశక్తి బలవత్తరమయినదిగావున స్వశక్తిచేతనే బ్రాహ్మణుడు శత్రువులను నిగ్రహించవలెను ఆస్వవీర్యమనగా నేమంటే॥ 31॥

మూ॥ శ్రుతీ రథర్వాంగిరసీః కుర్యాదిత్య విచారయన్।
వాక్శస్త్రంవై బ్రాహ్మణస్య తేనహన్యా దరీన్ద్విజః॥33॥

అథర్వవేదమందు నంగిరస్సులను దుష్టాభిచారశ్రుతులను బట్టి విచారించకుండ శత్రుజయార్థమయి యాభిచారికమును జేయవలయును అభిచారమంత్రోచ్చారణరూపమగు వాక్కు బ్రాహ్మణునకు శస్త్రము గావున దానిచే విప్రుడు శత్రువులను జంపవలెను॥ 33॥

మూ॥ క్షత్రియో బాహువీర్యేణ తరేదాపద మాత్మనః।
ధనేన వైశ్యశూద్రౌతు జపహోమై ర్ద్విజోత్తమః॥34॥

క్షత్రియు డాత్మశౌర్యముచే శత్రుకృతపరాభవరూపమగు నాపదనుదరించవలెను వైశ్యశూద్రులు ప్రతీకారముజేయువానికి ధనమిచ్చియు బ్రాహ్మణు డభిచారముచేతనున్ను శత్రులను జయించవలెను॥ 34॥

మూ॥ విధాతా శాసితావక్తా మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే।
తస్మైనా కుశలం బ్రూయా న్నశుష్కాంగిర మీరయేత్॥35॥

విహితకర్మానుష్ఠాన మొనర్చువాడును శిష్యపుత్త్రాదులకు శిక్షకుడును ప్రాయశ్చిత్తాదులను జెప్పెడువాడున్ను సకలభూతమైత్త్రిగలవాడున్ను బ్రాహ్మణుడైనవడును వానికనిష్టమగునట్టి వాగ్దండధిగ్దండరూపమగు వాక్కులనుబలుకరాదు॥ ౩౫॥

మూ॥ నవై కన్యా నయువతి నాల్పవిద్యో నబాలిశః ।
హోతా స్యాదగ్నిహోత్రస్య నార్తో నా సంస్కృత స్తథా॥ ౩౬॥

పెళ్లి కానియాడదిన్ని పడుచుదిన్ని కొంచమధ్యయనము గలవాడున్ను మూఖుడున్ను వ్యాధ్యాదిపీడితుడు ననుపనీతుడున్ను శ్రౌతసంబంధములగు సాయంప్రాతర్హోమములు చేయగూడదు చేయించుట తటస్థించునపుడు కన్యాదులకు నిషేధము॥ ౩౬॥

మూ॥ నరకే నిపతంత్యేతే జుహ్వతః సచయస్యతత్ ।
తస్మా ద్వైతానకుశలో హోతా స్యా ద్వేదపారగః॥ ౩౭॥

ఈకన్యాదులు హోమమునుజేసి రేని నరకమునం బడుదురు ఎవనియొక్కయాయగ్నిహోత్రమును బ్రతినిధిరూపముగా జేతురో వాడున్ను నరకమునంబడును గావున శ్రౌతకర్మప్రవీణుడును స్వాధ్యాయసంపన్నుడునగు బ్రాహ్మణుడుహోతగా జేయదగును॥ ౩౭॥

మూ॥ ప్రాజాపత్య మదత్వాశ్వ మగ్న్యాధేయస్య దక్షిణాం ।
అనాహితాగ్ని ర్భవతి బ్రాహ్మణో విభవేసతి॥ ౩౮॥

ఆధానమొనర్చి సంపన్నుడయిన్ని ప్రజాపతిదేవతదేవతాకమైన యశ్వమును దక్షిణగా నివ్వని బ్రాహ్మణుడనాహితాగ్నియే యగుచున్నాడు ఆధానఫలమును బొందడు గావున నాధానమందశ్వమును దక్షిణగా నీవలెను॥ ౩౮॥

మూ॥ పుణ్యాన్యన్యానికుర్వీత శ్రద్దధానో జితేంద్రియః ।
నత్వల్పదక్షిణై ర్యజ్ఞై ర్యజేతేహ కథంచన॥ ౩౯॥

శ్రద్ధావంతుడును జితేంద్రియుండునునై యజ్ఞవ్యతిరిక్తములగు తీర్థయాత్రాదిపుణ్యములను జేయవలెను గాని శాస్త్రోక్తమగు దక్షిణలేనియజ్ఞమును జేయరాదు దక్షిణయజ్ఞమున నుపకారకము గావున నీవచనము స్వల్పదక్షిణమైతె భయము

క్కుటకు గాదు॥ ౩౯

మూ॥ ఇంద్రియాణి యశస్స్వర్గ మాయుః కీర్తిం ప్రజాః పశూన్।
హంత్యల్ప దక్షిణో యజ్ఞ స్తస్మా న్నాల్పధనో యజేత్॥౪౦॥

చక్షురాదీంద్రియములనున్ను బ్రతికియుండగా వచ్చినఖ్యాతియశస్సుదానినిన్ని స్వర్గమునున్ను ఆయుష్యమునున్ను దేహత్యాగానంతరమందగు ఖ్యాతికీర్తి యనబడునదిన్ని సంతానమునున్ను పశువులనున్ను స్వల్పదక్షిణమగు యజ్ఞమునశింప జేయును గావున పూర్ణదక్షిణ నివ్వలేనివాడు యజ్ఞమును జేయరాదు॥ ౪౦॥

మూ॥ అగ్నిహోత్ర్యపవిధ్యాగ్నీన్ బ్రాహ్మణః కామకారతః।
చాంద్రాయణం చరేన్మాసం వీరహత్యా సమంహి తత్॥౪౧॥

అగ్నిహోత్రి ఇచ్ఛచేసాయంప్రాతఃకాలమందు హోమమును మానెనేని యొకమాసము చాంద్రాయణము జేయవలెను ఆయగ్నిహోత్రత్యాగము వీరుడనగా పుత్రుడు వానిజంపిన పాపముబొందును॥ "శ్రు॥ వీరహావా ఏష దేవానాంభవతి యోగ్నిముద్వాసయతే" ఎవడగ్నుల నుద్వాసనము జేసునో వాడు దేవతలకు వీరహత్య జేసినవాడగుచున్నాడని కొందరు మాసమగ్నిహోత్రము జేయనివాడనిసవరించిరి॥

మూ॥ యేశూద్రాదధిగమ్యార్థ మగ్నిహోత్ర ముపాసతే।
ఋత్విజస్తేహి శూద్రాణాం బ్రహ్మవాదిషుగర్హితాః॥ ౪౨॥

ఏబ్రాహ్మణులు శూద్రునివలన ధనము దెచ్చి యనగా సామాన్యులనుయాచించి యైనను దెచ్చినధనముతో॥ "శ్లో॥ వృషలాగ్న్యుపసేవినా॥" మనివక్ష్యమాణ లింగముచే నాధానపూర్వకముగ నగ్నిహోత్రము జేతురో వారు శూద్రునకు యాజకులగుచున్నారు గాని వారికాఫలనులేదు గావున వారు వేదవాదులందు నిందితులగుచున్నారు॥ ౪౨॥

మూ॥ తేషాంసతతయజ్ఞానాం వృషలాగ్న్యుపసేవినాం।
పదామస్తకమాక్రమ్య దాతాదుర్గాణి సంతరేత్॥౪౩॥

ఆశూద్రధనముచే యజ్ఞమొనర్చి యగ్నులనుసేవించిన వారియొక్క శిరస్సుమీదను పాదమునుంచి శూద్రుడాదానముచే దుర్గములగు పాపములను దాటిపర

లోకమునుబొందును గాని యజమానులకాయజ్ఞఫలములేదు॥ ౪౩

మూ॥ అకుర్వన్ విహితంకర్మ నిందితంచసమాచరన్।
ప్రసక్తశ్చేంద్రియార్థేషు ప్రాయశ్చిత్తీయతేనరః॥ ౪౪॥

శాస్త్రవిహితసంధ్యోపాసనాదినిత్యకర్మమునున్ను అస్పృశ్యస్పర్శమైనచిన స్నానమొనర్చుటమొదలగు నైమిత్తికములనున్ను జేయకుండినను శాస్త్రనిషిద్ధమగు హింసాదికర్మమును జేయుచుండినను శాస్త్రముచేవిహితమయినను నిషిద్ధములునగు కర్మములందాసక్తుడైయుండినను మనుష్యజాతిమాత్రుడు ప్రాయశ్చిత్తమునకర్హుడగుచున్నాడు॥ "ఇంద్రియార్థేషుసర్వేషునప్రసజ్యేత కామతః॥" యనిమున్నునిషేధించుటవలననీశ్లోకమందున్ననిందితపదముచేతనే "ప్రసక్తశ్చేంద్రియార్థేషు॥" యనునదిసంగ్రహీతమగుచు మరల నెందుకిదిజెప్పవలెనని శంకరాగా నాశ్లోకముస్నాతకవ్రతవిషయమయినదిగావున "వ్రతానీమానిధారయేత్॥" దనియుపక్రమించుటవలననిది ప్రతిషేధముగాదు మరేమంటే వ్రతవిధిఅన్లైతే "అకుర్వన్ విహితంకర్మ॥" యనుదానిచేతనే ప్రాప్తమామెనుగనా వేరేచెప్పనకర్హరలేదంటే ఇదిస్నాతకేతరవిషయముగనుకనిచ్చటిది సవిషయమే॥ ౪౪॥

మూ॥ అకామతః కృతేపాపే ప్రాయశ్చిత్తంవిదుర్బుధాః।
కామకారకృతేప్యాహు రేకే శ్రుతినిదర్శనాత్॥౪౫॥

అబుద్ధిపూర్వకముగజేసిన పాపమునకే ప్రాయశ్చిత్తమని కొందరుపెద్దలు చెప్పిరి కొందరుబుద్ధిపూర్వకృతమునకున్ను ప్రాయశ్చిత్తముకలదనిచెప్పిరి వేదనిదర్శనమువలన ఇట్లువేరుగా జెప్పుట ప్రాయశ్చిత్తగౌరవార్థము॥ "శ్రు॥ ఇంద్రోయతీన్ సాలావృకేభ్యః ప్రాయచ్ఛత్ తమశ్లీలావాగభ్యవదత్ సప్రజాపతి ముపాధావత్ తస్మాత్తముపహవ్యం ప్రాయచ్ఛదితి॥" దీనియర్థము ఇంద్రుడుయతులనుబుద్ధిపూర్వకముగ శునకములకిచ్చెను అతడు ప్రాయశ్చిత్తార్థము ప్రజాపతివద్దికి బోయెను అతనికాప్రజాపతియుపహవ్యాఖ్యమగు కర్మమును బ్రాయశ్చిత్తమునుగా జెప్పెను ఇట్లుండుటవలన గామముచేజేసినదానికిన్ని ప్రాయశ్చిత్తముగలదు॥౪౫॥

మూ॥ అకామతః కృతంపాపం వేదాభ్యాసేనశుధ్యతి।
కామతస్తు కృతంమోహా త్ప్రాయశ్చిత్తైః పృథగ్విధైః॥౪౬॥

అకామముగాఁ జేసినపాపము వేదాభ్యాసముచే నశించును ఇట్లనుట లఘుప్రాయశ్చిత్తజ్ఞాపనార్థము ప్రాయశ్చిత్తాంతరములను జెప్పుటవలన నబుద్ధిపూర్వకృతపాపములుగలవాఁడు లఘుప్రాయశ్చిత్తాధికారియు బుద్ధిపూర్వకృతపాపముగలవాఁడు గురుప్రాయశ్చిత్తాధికారియునని యధికారిరూపము మాత్రమే నియమమువలన దెలియఁదగు నన్నిపాపములకు వేర్వేఱప్రాయశ్చిత్తములు జెప్పఁబడును॥ ౪౬॥

మూ॥ ప్రాయశ్చిత్తీయతాం ప్రాప్య దైవాత్పూర్వకృతేనవా।
నసంసర్గం వ్రజేత్సద్భిః ప్రాయశ్చిత్తే కృతేద్విజః॥౪౭॥

ఈజన్మమందు ప్రమాదముచే పాపములు జేసిగాని జన్మాంతరకర్మముచేఁగాని రోగములచే సూచింపబడునుగాన వాటిచేఁ గాని ద్విజుఁడు ప్రాయశ్చిత్తార్హుఁడగుచున్నాఁడు వాఁడు ప్రాయశ్చిత్తమును జేయక సజ్జనులతో యాజనాధ్యాపనాదులలో కలియరాదు॥ ౪౭॥

మూ॥ ఇహదుశ్చరితైః కేచి త్కేచిత్పూర్వ కృతై స్తథా।
ప్రాప్నువంతి దురాత్మానో నరారూప విపర్యయం॥౪౮॥

కొందఱీజన్మమందుఁ జేసిన పాపముచేతనున్ను కొందఱు జన్మాంతరకృతముచేతనున్ను పుప్పిగోళ్ళు మొదలైనరూపవ్యత్యాసమును బొందుదురు॥ ౪౮॥

మూ॥ సువర్ణచోరః కౌనఖ్యం సురాపశ్శ్యావదంతతాం।
బ్రహ్మహాక్షయరోగిత్వం దౌశ్చర్మ్యం గురుతల్పగః॥౪౯॥
పిశునః పౌతినాసిక్యం సూచకః పూతివక్త్రతాం।
ధాన్యచోరోంగ హీనత్వ మాతిరైక్త్యంతు మిశ్రకః॥౫౦॥
అన్నహర్తా మయావిత్వం మౌక్యంవా గపహారకః।
వస్త్రాపహారక శ్శ్వైత్రం పంగుతా మశ్వహారకః॥౫౧॥
ఏవంకర్మ విశేషేణ జాయంతే సద్విగర్హితాః।
జడమూకాంధ బధిరా వికృతా కృతయ స్తథా॥ ౫౨॥

సువర్ణచోరుఁడు పుప్పిగోళ్ళవాఁడయిన్ని సురాపానముఁజేసినవాఁడు మఱుగుపళ్ళవాఁడయిన్ని బ్రహ్మహత్యగాఁడు క్షయరోగయిన్ని గురుభార్యనుబొందినవాఁడు

దుశ్చర్మరోగము గలవాడయున్ని కొందరు లింగవృషణహీనుడయున్ని ఉన్నదోష మును బ్రకటించినవాడు షండుడు వాడుకంపు పీనసరోగిన్ని దోషముకల్పించి బ్రకటించినవాడు సూచకుడు వీడు కంపునోరుగలవాడయున్ని ధాన్యచోరుడంగహీనుడయున్ని ధాన్యములో చెడ్డగింజలు బుగ్గి కలిపినవాడధికాంగుడున్ను అన్నచోరుడగ్నిమాంద్యముగలవాడయున్ని గురువుయొక్క యనుమతిలేనిది చదివినవాడు మూగవాడయున్ని వస్త్రచోరుడు బొల్లివాడయున్ని గుర్రమునుదొంగిలించినవాడు మరుగుజ్జువాడయున్ని ఇట్లు కర్మవిశేషములచే బుద్ధిజాడ్యము నంధత్వము బాధిర్యము నొంది సాధునిందితులై బుట్టి వికృతాకారులగుదురు॥ ర॥౫౦॥౫౧॥౫౨॥

మూ॥ చరితవ్యమతోనిత్యం ప్రాయశ్చిత్తం విశుద్ధయే।
నింద్యైర్హి లక్షణైర్యుక్తా జాయంతే నిష్కృతైనసః॥౫౩॥

"అనిష్కృతైనసః" యనగా జన్మాంతరమందు ప్రాయశ్చిత్తముచే నశింపజేయబడని పాపములుగలవారు నరకదుఃఖానుభవముకాగా తచ్ఛేషముచే పుప్పిగోళ్లు మొదలగుపాపచిహ్నములు గలవారలై పుట్టుచున్నారుగావున సర్వదా శుద్ధికొరకు ప్రాయశ్చిత్తమునుజేసుకొనవలెనుగాన ప్రాయశ్చిత్తము నైమిత్తికమాత్రమే కాదు మరేమంటే యనిష్కృతైనసః యనిచెప్పుటవలన ప్రాయశ్చిత్తమును జేసుకొనవలెనని యుపదేశమువలన పాపక్షయార్థికే యధికారము అదియుక్తమేగదా ప్రాయశ్చిత్తముజేయవలెను విధియందధికారిగావలెనుగావున శ్లోకమందు జెప్పబడిన విశుద్ధయేయనుటచే పాపక్షయరూపమను ఫలముగోరెడువాడధికారియనుటయుక్తము ఈయర్థమునే యాజ్ఞవల్క్యులు స్ఫుటపరిచిరి॥ శ్లో॥ "విహితస్యాననుష్ఠానాన్నిందితస్యచ సేవనాత్।అనిగ్రహాచ్చేంద్రియాణాం నరఃపతనమృచ్ఛతి" విహితములనుజేయకనున్ను నిందితములనుజేసిన్ని ఇంద్రియవశుడయిన్ని నరుడు పాపమునుబొందును॥ శ్లో॥ "తస్మాత్తేనేహకర్తవ్యం ప్రాయశ్చిత్తం విశుద్ధయే" కావుననట్టివానిచే ప్రాయశ్చిత్తము శుద్ధికొరకుజేయందగుననిన్ని॥ శ్లో॥ "బహూన్వర్షగణాన్ఘోరాన్ నరకాన్ ప్రాప్యతత్క్షయాత్।సంసారాన్ప్రతిపద్యంతేమహాపాతకినస్త్విమాన్" అనేకవర్షగణములు ఘోరనరకములందుండి మహాపాతకులు యాతనాంతమందు నీసంసారములనుబొందుచున్నారని వక్ష్యమాణమువలనమహాపాతకులకు నరకప్రాప్తిజెప్పబడుటవలన ప్రాయశ్చిత్తము నైమిత్తికమాత్రము

నకేయని సందర్భము లేదు గావున బ్రహ్మవధాదిజనిత పాపక్షయార్థులు ప్రాయశ్చిత్తవిధికధికారులని తెలియదగును॥ ౫౩॥

మూ॥ బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వంగనాగమః।
మహాంతి పాతకాన్యాహు స్సంసర్గ శ్చాపి తైస్సహ॥౫౪॥

బ్రహ్మహత్యయనగా బ్రాహ్మణప్రాణవియోగానుకూలవ్యాపారాశ్రయుడనగాద ఁనమంటే బాహాబాహ్యాయుధములను జేసినవాడును బ్రహ్మహంతగావలెను గావునగోభూహిరణ్యాదిహరణార్థను స్త్రీప్రసక్తిచేతను స్త్రీహ్యాదులు గనిగ స్వయముగాగాని యన్యునిచే గాని బ్రాహ్మణుని జచ్చేలాగు చేస్తే యది బ్రహ్మహత్య॥ "శ్లో॥ గోభూహిరణ్యహరణే స్త్రీసంబంధకృతేపివా। యముద్దిశ్య త్యజేత్ప్రాణాం స్తమాహుర్బ్రహ్మఘాతుకం॥" గోహిరణ్యస్త్రీసంబంధాదులనుబట్టి యెవనిను ద్దేశించి ప్రాణములను బ్రాహ్మణుడు విడుచునో వానిబ్రహ్మఘాతకునిగా నంటురని శాతాతపుడు- మరిన్ని శాస్త్రీయములగు బ్రహ్మవధనిమిత్తములు గలవు తెలియవలెను॥ "శ్లో॥ రాగాద్ద్వేషాత్ప్రమాదాద్వా స్వతః పరత ఏవ వా। బ్రాహ్మణం ఘాతయేద్యస్తు తమాహుర్బ్రహ్మఘాతకం॥" దీనిచే చేయించినవాడున్ను బ్రహ్మహంతయౌనని నిషిద్ధసురాపానమున్ను బ్రాహ్మణస్వర్ణచౌర్యమున్ను గురుభార్యాగమనమున్ను వీరితో సంవత్సరము గలసియుండడమున్ను ఇవి మహాపాతకములని చెప్పుచున్నారు ఈమహాపాతకసంజ్ఞ ముందుపపాతకములని జెప్పునవాటిలాఘవార్థము॥

మూ॥ అనృతంచ సముత్కర్షే రాజగామిచ పైశునం।
గురోశ్చాలీక నిర్బంధ స్సమాని బ్రహ్మహత్యయా॥౫౫॥

జాత్యుత్కర్షము కొరకు నేను బ్రాహ్మణుడనని యసత్యము బలుకడము రాజునొద్దవొంగలు మొదలగు పరులకు మరణమయ్యేటట్లు పైశున్యమును జెప్పుట గురు నడలమిథ్యబలుకడము నివిబ్రహ్మహత్యాతుల్యములు॥ ౫౫॥

మూ॥ బ్రహ్మోజ్ఝతా వేదనిందా కౌటసాక్ష్యం సుహృద్వధః।
గర్హితా న్నాద్యయోర్జగ్ధి స్సురాపానసమానిషట్॥౫౬॥

చదివిన వేదమును మరువడమున్ను అసత్ శాస్త్రముల నాశ్రయించి వేదమును నిందించడము కూటసాక్ష్యమును బలుకడము మిత్రుడగు బ్రాహ్మణుని వధించుటయు

ల్లి మొదలగు నిషిద్ధవస్తువులను దినడము భక్షణార్హము గాని పురీషాదులనుభక్షించడము ఇక్కడ మేధాతిథి భుజించనని సంకల్పించిన వస్తువును దినడమనివ్రాసెను ఇవి సురాపానసమములు॥ ౫౬॥

మూ॥ నిక్షేపస్యాపహరణం నరాశ్వరజతస్య చ ।
భూమివజ్రమణీనాం చ రుక్మస్తేయసమం స్మృతం॥౫౭॥

బ్రాహ్మణసువర్ణవ్యతిరిక్తమగు నిక్షేపమును హరించుట మనుష్యతురగరజత భూమి హీరమణులను దొంగలించుట ఇవి స్వర్ణస్తేయతుల్యములు॥ ౫౭॥

మూ॥ రేతస్సేకస్స్వయోనీషు కుమారీష్వంత్యజాసు చ ।
సఖ్యుః పుత్రస్య చ స్త్రీషు గురుతల్పసమం విదుః॥౫౮॥

సోదర్యభగినీ చండాలి సఖిభార్యా పుత్రభార్యలందు రేతస్సేక మొనర్చుట గురుభార్యాగమనము సమానమనిరి- ఇట్టి పాపములతో దేనిని సమమని చెప్పెనో వాటికి సమప్రాయశ్చిత్తమునకుగాదు రాజతుల్యుడు రాజుకు తక్కువేగావునను సమానమునకు జెప్పిన ప్రాయశ్చిత్తము నుపమేయమునకు తన్న్యూన ప్రాయశ్చిత్తమని॥ ౫౮॥

మూ॥ గోవధోఽయాజ్యసంయాజ్యం పారదార్యాత్మవిక్రయం ।
గురుమాతృపితృత్యాగః గురుతల్పసమం విదుః॥౫౯॥
పరివిత్తితానుజేన పరివేదనమేవ చ ।
తయోర్దానం చ కన్యాయాస్తయోరేవ చ యాజనం॥౬౦॥
కన్యాయా దూషణం చైవ వార్ధుష్యం వ్రతలోపనం ।
తటాకారామదారాణామపత్యస్య చ విక్రయః॥౬౧॥
వ్రాత్యతా బాంధవత్యాగో భృత్యాధ్యాపనమేవ చ ।
భృతాచ్చాధ్యయనాదానమపత్యానాం చ విక్రయః॥౬౨॥
సర్వాకరేష్వధీకారో మహాయంత్రప్రవర్తనం ।
హింసౌషధీనాం స్త్ర్యాజీవోఽభిచారో మూలకర్మ చ॥ ౬౩॥
ఇంధనార్థమశుష్కాణాం ద్రుమాణామవపాతనం ।

ఆత్మార్థంచ క్రియారంభో నిందితాన్నాదనంతథా॥ ౬౪॥
అనాహితాగ్నితా స్తేయ మృణానామనపక్రియా।
అసచ్ఛాస్త్రాధిగమనం కౌశీలవ్యస్యచక్రియా॥ ౬౫॥
ధాన్యకుప్యపశుస్తేయం మద్యపస్త్రీనిషేవణం।
స్త్రీశూద్రవిట్క్షత్రవధో నాస్తిక్యం చోపపాతకం॥ ౬౬॥

ఇటుపై నుపపాతకములను జెప్పుచున్నాఁడు గోవధ జాతిచేతనున్న కర్మ
ముచేతనున్ను దుష్టులగువారికి యాజనమున్ను పరదారగమనము నాత్మవిక్రయ
ము తల్లిదండ్రులకు శుశ్రూష చేయకపోవడము నిచ్చట స్వాధ్యాయమనగా స
ర్వదా బ్రహ్మయజ్ఞత్యాగము (బ్రహ్మోజ్ఝతాయనుచో వేదవిస్మరణము చెప్పెనుగా
పునస్స్మార్తాగ్నిత్యాగము అపవిధ్యాగ్నిత్యనుచోట శ్రౌతాగ్నిత్యాగము జెప్పబడె
ను గావున పుత్రునికి నుపనయనాది సంస్కారములను పోషణమున్ను మానడము
ముందుగా తమ్మునకు పెళ్లియైతే వానియన్నగావడమున్ను "దారాగ్నిహోత్ర
సంయోగః" యనుచోట జెప్పబడిన యన్నకంటె మున్న దారాగ్నిసంయోగ
ము గలవాడు పరివేత్త యీపరివిత్తిని పరివేత్తకున్ను కన్యల నివ్వడమున్ను వా
ళ్ళకు వివాహాదికను జేయించడమున్ను కన్యను మైథునాంగులిప్రక్షేపాదులచే
జెడగొట్టడమున్ను నిషిద్ధవృద్ధి జీవనమున్ను బ్రహ్మచారి మైథునమున్ను కోనేళ్ళ
ను తోటలను భార్యను సంతానమును నమ్మకోవడమున్ను కాలమందుపనయ
నము లేకుండుటయును పినతండ్రులు మొదలగు బంధువుల ననుసరించకుండుట నియ
తముగా జీతమిచ్చి వేదమును జదువుటయు నట్లుజెప్పుటయును అమ్మరాని నువ్వు
లు మొదలగువాటి నమ్ముటయును బంగారుగనులు మొదలగువాటిపైని రాజాజ్ఞచేన
ధికారమును పెద్దప్రవాహముల కడ్డుగా గట్టుకట్టడమున్ను జాతిమాత్రములగు నో
షధులనభ్యాసముచే జంపడమున్ను తనభార్య మొదలగుస్త్రీలను వేశ్యలనుగా జేసి
యందువలన బ్రతుకుటయును శ్యేనాదియజ్ఞములచే నిరపరాధులను జంపుటయు
ను మంత్రవశ్యము నోషధివశ్యమును జేయుటయును వంటచెరకునిమిత్తమై మాత్రము
బ్రతికెడిచెట్లను జంపుటయును తాననరోగియయ్యును దేవాద్యుద్దేశము లేనిదితనకి
ష్టమని వంటజేసుకొని తినడమున్ను నిందితులకు నాదలనిచ్చుచే సకృద్భక్షణమున్ను
ఇచ్ఛచేనసకృద్భక్షణము శ్లో॥ "గర్హితాన్నాద్యయోర్జగ్ధిః" యనుశ్లోకముచే జెప్పబ

డెను గావున తానధికారి యయ్యునాధానము జేయకుండుట సువర్ణవ్యతిరిక్తసారద్రవ్యములను హరించుట ఋణత్రయవిముక్తుడు గాకుండుట శ్రుతిస్మృతి విరుద్ధశాస్త్రములను జదువడమున్ను నృత్యగీతవాద్యముల నభ్యసించడమున్ను ధాన్యమున్ను రాగి మొదలగులోహములనున్ను దొంగిలించుటయును తాను ద్విజుడయ్యును మద్యముద్రావెడుస్త్రీని బొందడమున్ను స్త్రీశూద్రవైశ్యక్షత్రియులను జంపుటయున్ను పరలోకోపయోగకర్మములను మానడము నివియును ప్రత్యేకముగా నుపపాతకములనబడెను॥ ౫౯॥ ౬౦॥ ౬౧॥ ౬౨। ౬౩॥ ౬౪॥ ౬౫॥ ౬౬॥

మూ॥ బ్రాహ్మణస్య రుజఃకృత్వా ఘ్రాతిరఘ్రేయమద్యయోః।
జైహ్మ్యంచ మైథునంపుంసి జాతిభ్రంశకరంస్మృతం॥ ౬౭॥

బ్రాహ్మణునికర్రచేగాని చేతగాని పీడించుటయును అతిదుర్గంధిత్వముచేఘ్రేయములుగాన లశునపురీషాదులనాఘ్రాణించుటయును వక్రనుగా వ్యవహరించుటయును పురుషులతో పురుషులు మైధునమున్ను ఇవి ప్రత్యేకమున్ను జాతిభ్రంశకరములనబడును॥ ౬౭॥

మూ॥ ఖరాశ్వోష్ట్రమృగేభానా మజావికవధ స్తథా।
సంకరీకరణం జ్ఞేయం మీనాహి మహిషస్యచ॥ ౬౮॥

గాడిదె యొంటె గుర్రము లేడి యేనుగ మేక గొర్రె మత్స్యము సర్పము యెనుపశు వీటిని ప్రత్యేకముగా జంపుట సంకరీకరణము॥ ౬౮॥

మూ॥ నిందితేభ్యో ధనాదానం వాణిజ్యం శూద్రసేవనం।
అపాత్రీకరణం జ్ఞేయ మసత్యస్యచ భాషణం॥ ౬౯॥

నిందితులవలన ధనముపుచ్చుకోవడమున్ను వర్తకమున్ను శూద్రులకుపరిచర్యజేయడమున్ను అసత్యముబలుకడమున్ను ఇవిప్రత్యేకముగానపాత్రీకరణములనబడును॥ ౬౯॥

మూ॥ క్రిమికీటవయోహత్యా మద్యానుగతభోజనం।
ఫలైధఃకుసుమస్తేయ మధైర్యంచ మలావహం॥ ౭౦॥

క్రిములనగా చిన్నపురుగులు కీటములంతకంటె పెద్దవి వీటినిన్ని పక్షులనున్ను జం

ఘటయున్ను మద్యముతో గూడ చేబడిన దానిని తినడమున్ను ఇచ్చట మద్యస్పృష్టమై నదనిమేధాతిథివ్రాసెను గాని యదిగాదు దానికి ప్రాయశ్చిత్తమెక్కువ యగును గాన నని కుల్లూకభట్టువ్రాసెను పళ్లు కట్టెలు పుష్పములును వీటిని దొంగలించడము కొంచపుశ్రీణదశలోనున్న ధైర్యము నొందడమున్ను ఇవన్నియున్ను ప్రత్యేకముగా మలినీకరణములనబడును॥ ౭౦

మూ॥ ఏతాన్యేనాంసి సర్వాణి యథోక్తాని పృథక్పృథక్।
వైర్వైర్వ్రతైరపోహ్యంతే తానిసమ్యఙ్నిబోధత॥౭౧॥

ఈ వేరు వేరజెప్పబడిన బ్రహ్మహత్యాదిపాపములేయే ప్రాయశ్చిత్తములచే నశింపజేయబడునో వాటిని లెస్సగా జెప్పెదనువినుండు॥ ౭౧॥

మూ॥ బ్రహ్మహా ద్వాదశసమాః కుటీంకృత్వా వనేవసేత్।
భైక్షాశ్యాత్మవిశుద్ధ్యర్థం కృత్వాశవశిరోధ్వజః॥ ౭౨॥

బ్రహ్మహత్యజేసినవాడు వనమందుకుటీరమును వేసుకుని తనచేజంపబడిన వానికపాలమునైన నదిసంభవించకపోతే నన్యునిదైన కపాలమును చిహ్నముగాధరించిభిక్షాన్నమునుతింటునాత్మపాపహరణార్థమై పదిరెండబ్దములునివసించి వ్రతమునుజేయవలెను ఇచ్చటనున్ను క్షౌరమును జేయించుకొనియుండవలెనని చెప్పగలదు ఆపైని జెప్పబడునవిశేషములు గ్రహించవలెను అందుకు యమస్మృతి॥ "శ్లో॥ సప్తాగారాన్యపూర్వాణి యాన్యసంకల్పితానిచ। సంవిశేత్తానిశనకైః విధూమే భుక్తవజ్జనే॥ భ్రూణఘ్నేహిమే భిక్షా వేనోపవిశ్యాప్యసంచరేత్। ఏకకాలం చరేద్భైక్షం తదలబ్ధ్వోదకం పిబేత్॥ పూర్వదినములందు భిక్షకు వెళ్ళకుండునట్టియు మనస్సులో నీయిండ్లకు బోతే భిక్షబాగుగా దొరుకునని సంకల్పించబడనట్టియు తటస్థమైన యేడిండ్లను నందరును భుజించి పొగగూడ బడకుండునట్టి వేళనబోయి యీభ్రూణహత్య జేసిన నాకుభిక్షబెట్టుడని తనపాపమును ప్రకటించుచు నొకపూటనే భిక్షకుబోవలెను దొరకనివాడుదకమును ద్రావియుండవలె నీద్వాదశవార్షికవిధియజ్ఞానముచే జేయబడిన బ్రాహ్మణవధకగు బ్రాహ్మణునకే॥ "శ్లో॥ ఇయంవిశుద్ధిరుదితా ప్రమాప్యాకామతోద్విజ॥" మని ఈశుద్ధియకామముచే ద్విజునిజంపినవానికి జెప్పబడెనని చెప్పగలదు గావున నిపుపరెండువర్షముల విధిశుద్ధియులకు ద్విగుణము వై

శ్యులకు త్రిగుణము శూద్రులకు చతుర్గుణము గావలెనని చూడతగ్గది ఇందుకు భవిష్యత్పురాణము॥ "ద్విగుణాః క్షత్రియాణాంతు వైశ్యానాం త్రిగుణాస్స్మృతాః। చతుర్గుణాస్తు శూద్రాణాం పర్షదుక్తామహాత్మనాం। పర్షదంచ వ్రతం ప్రోక్తం శుద్ధయే పాపకర్మణాం॥" బ్రాహ్మణులకు ప్రాయశ్చిత్తవిధి కొందరు బ్రాహ్మణులు సభగావలెనో క్షత్రియులకు ద్విగుణముగా బ్రాహ్మణులును క్షత్రియులును సభ గూడవలెను వైశ్యులకు వైశ్యులతో త్రిగుణముగానున్న శూద్రులకు శూద్రులతో గూడ చతుర్గుణముగానున్న సజ్జన సభగావలెను ఈ మూడు జాతులకున్ను వ్రతమున్ను ద్విగుణ త్రిగుణ చతుర్గుణముగావలెనని ఈ బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తమునకు మనూక్తవచనములు గుణవంతునిచే నిర్గుణబ్రాహ్మణుడు చంపబడెనేని తద్విషయములని భవిష్యత్పురాణముచే వ్యాఖ్యచేయబడెను॥ "శ్లో॥ హరితా చేద్గుణవాన్విర అకామాన్నిర్గుణో హతః। కర్తవ్యానిమనూక్తాని కృత్వావై విశ్వమేధికం। బ్రహ్మహా ద్వాదశాబ్దాని కుటీంకృత్వావనేవసేత్। గచ్ఛేదవభృథంవాపి అకామే నిర్గుణేహతె। జాతిశక్తిగుణాపేక్షం సకృద్బుద్ధికృతం తథా॥" అనుబంధాదివిజ్ఞాయ ప్రాయశ్చిత్తం ప్రకల్పయేత్" అకామమువలన నిర్గుణబ్రాహ్మణుని గుణవంతుడు చంపెనేని యీ మనూక్తప్రాయశ్చిత్తము వనవాసాదికము జేయవలెను అశ్వమేధికావభృథమైనగావలెను జాతిగుణశక్తిసకృత్కృతాద్యనుబంధములను విచారించి ప్రాయశ్చిత్తము జేయవలెనని విశ్వామిత్రవచనము వలన ప్రాయశ్చిత్తాధిక్యమూహించవగును కోరికచే బ్రాహ్మణుని జంపెనేని ద్విగుణమాత్ర ప్రాయశ్చిత్తము జేయవలెను అనగా నిరువదినాలుగేడులు ఇందుకాంగీరసవచనము॥ "శ్లో॥ అకామతః కృతే పాపె ప్రాయశ్చిత్తం న కామతః। స్యాత్త్వకామకృతేయత్తు ద్విగుణం బుద్ధిపూర్వకే। అకామకృత పాపమునకె ప్రాయశ్చిత్తము కామకృతమునకు లేదు అకామకృతమునకే ప్రాయశ్చిత్తమో యది కామకృతమునకు ద్విగుణముగావలెను॥ ౭౨॥

మూ॥ లక్ష్యంశస్త్ర భృతాం వాస్యా ద్విదుషామిచ్ఛయాత్మనః।
ప్రాస్యేదాత్మానమగ్నౌవా సమిద్ధే త్రిరవాక్ఛిరాః॥ ౭౩॥

ధనురాద్యాయుధధారులేయు బాణాదులకు లక్ష్యభూతుడయ్యెనేని బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తార్థమై యిట్లు లక్ష్యమయ్యెనని యెఱిగిగాని యెఱుగకగాని గొట్టిన దెబ్బచే జచ్చినను మృతకల్పుడై బ్రదికియుండినను శుద్ధుడగును ఇందుకు యాజ్ఞవల్క్యవచనము॥ "శ్లో॥ సంగ్రామేవాహతో లక్ష్యభూతశ్శుద్ధిమవాప్నుయాత్। మృత

తజ్జాతస్య భవేదపి॥" అనుభవిష్యత్పురాణవచనము మనువచన వ్యాఖ్యానరూపమునగుటచే నీప్రాయశ్చిత్తమజ్ఞానకృతజాతిమాత్ర బ్రాహ్మణహననమైనచో న వేదాగ్నిమద్ద్విజునకని తెలియవలెను॥ ౭౫॥

మూ॥ సర్వస్వం వేదవిదుషే బ్రాహ్మణాయోపపాదయేత్।
ధనంవా జీవనాయాలం గృహంవా సపరిచ్ఛదం॥ ౭౬॥

సర్వధనమును వేదవేత్తయగు బ్రాహ్మణునికీవలెను జీవనపర్యాప్తమగు ధనమునైనను గృహోపకరణయుక్తగృహమునైనను నీవలెను॥ "శ్లో॥ జాతిమాత్రం యదాహన్యాద్బ్రాహ్మణం బ్రాహ్మణోగుహా। వేదాభ్యాసవిహీనో వై ధనవానగ్నివర్జితః॥ ప్రాయశ్చిత్తం తదాకుర్యాదిదం పాపవిశుద్ధయే। ధనంవాజీవనాయాలం గృహంవాసపరిచ్ఛదం॥" అను భవిష్యత్పురాణవచనము మనువచనవ్యాఖ్యారూపము నీప్రాయశ్చిత్తమును దెలియజేసెను గావున జాతిమాత్రబ్రాహ్మణవధ నొనర్చిన బ్రాహ్మణునకని తెలియవలెను॥ ౭౬॥

మూ॥ హవిష్యభుగ్వానుసరేత్ప్రతిస్రోతస్సరస్వతీం।
జపేద్వానియతాహారస్త్రిర్వై వేదస్యసంహితాం॥ ౭౭॥

నీవారాదిహవిష్యాన్నమునుదింటున్ను సరస్వతీనదికెదురుగా నడువవలెను నియతాహారుడై వేదసంహితను మువ్మారుపఠించుటయైనం జేయవలయును॥ "శ్లో॥ జాతిమాత్రేహతే విప్రే ద్విజేంద్ర మతిపూర్వకం। హంతాయదా వేదహీనో ధనేన వభవేద్భృతః। తథైతత్కథ్యతే ప్రాయశ్చిత్తం నిబోధమే॥ హవిష్యభుక్చరేద్వా ప్రతిస్రోతస్సరస్వతీం। యద్వాపరిమితాహారస్త్రిర్వాన్వేదసంహితాం। ఋచోయజూంషి సామాని త్రైవిద్యాఖ్యం సుకోత్తమం॥" యనుమనువచనవ్యాఖ్యారూపభవిష్యత్పురాణవచనములచే నీప్రాయశ్చిత్తము జాతిమాత్రబ్రాహ్మణవధజ్ఞానపూర్వకముగ జేసెనేని ప్రతిసరస్వతీగమనమున్ను అజ్ఞానముచే వధజరిగెనేని వేదత్రయసంహితామాత్రపారాయణ మనియు విశేషము॥ ౭౭॥

మూ॥ కృతవాపనోనివసేద్గ్రామాంతే గోవ్రజేపివా।
ఆశ్రమే వృక్షమూలేవా గోబ్రాహ్మణహితేరతః॥ ౭౮॥

"సమాప్తే ద్వాదశేవర్షే" యని యుపదేశము వలననిప్పుడు ద్వాదశవార్షిక

ముకకు విశేషమును జెప్పుచున్నాడు॥ "శ్లో॥ యానకే ... గో బ్రాహ్మణ ... తేరతః" యని గోబ్రాహ్మణుల కుపకారము జేయుచు గ్రామసమీపమందు గోష్ఠమందునైన పుణ్యాపదేశవృక్షమూలముననైన వసించవలెను వనమందు కుటీరమును వేసుకొనియుండవలెనను దానికిది వికల్పము॥ ౭౮॥

మూ॥ బ్రాహ్మణార్థే గవార్థేవా సద్యః ప్రాణాన్ పరిత్యజేత్ ।
ముచ్యతే బ్రహ్మహత్యాయా గోప్తాగోర్బ్రాహ్మణస్యచ॥ ౭౯॥

బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తార్థము ... చోరాదులు వ్యాఘ్రాదులు వలన ఘాతుకజంతువులు వీటి వలన ప్రమాదము గోబ్రాహ్మణులకు దప్పించబోయి చచ్చెనేనియు నాప్రమాదము దప్పింపబోయి బ్రతికెనేనియు బ్రహ్మహత్యవలన విముక్తుడగును॥ ౭౯॥

మూ॥ త్రివారం ప్రతిరోద్ధావా సర్వస్వమవజిత్యవా।
విప్రస్య తన్నిమిత్తేవా ప్రాణాలాభేపి ముచ్యతే॥ ౮౦॥

బ్రాహ్మణుని సర్వమున్ను చోరాపహృతమగుచుండగ దబ్బోకుండ బట్టుకొనుట కు నిర్వ్యాజముగా బ్రవర్తించి యాసొమ్ము దొరకక ... యిట్లు మూడుమార్లు యావచ్ఛక్తి వినియోగపరచెనేని బ్రహ్మహత్యవలన విముక్తుడగును ఇదియితర ప్రకారముచే గోబ్రాహ్మణులను రక్షించడము "గోప్తాగోర్బ్రాహ్మణస్యచ" యను వచనమునకు పునరుక్తిగాదు॥ ౮౦॥

మూ॥ ఏవం దృఢవ్రతో నిత్యం బ్రహ్మచారీ సమాహితః ।
సమాప్తే ద్వాదశేవర్షే బ్రహ్మహత్యాం వ్యపోహతి॥ ౮౧॥

ఈ చెప్పబడిన ప్రకారముచే సర్వథా స్త్రీసంగాదిరహితుడై సంయతచిత్తుడును నై పదిరెండేండ్లునైన పైని బ్రహ్మహత్యాపాపము వలన విముక్తుడగును ఏవమనుట చే బ్రాహ్మణార్థేయనునది మొదలుగ ద్వాదశవార్షికవ్రతము దెలియందగును॥

మూ॥ శిష్ట్వావా భూమిదేవానాం నరదేవసమాగమే ।
స్వమేనోవభృథస్నాతో హయమేధే విముచ్యతే॥ ౮౨॥

రాజును ఋత్విజులగు బ్రాహ్మణులును గూడి యున్నచో తనపాపమును వా.

రితో జెప్పి యశ్వమేధమునఁ జేసిన యాయవభృథమందు స్నానంబు జేసి బ్రహ్మహత్య వలన ముక్తుఁడగును ద్వాదశవార్షికమునకు నశ్వమేధమునకును తంత్రము గాదు॥ “శ్లో॥ యదా తు గుణవాన్ విప్రో హత్వా విప్రం తు నిర్గుణం। అకామతస్తదా గచ్ఛేత్స్నాత్వా చైవాశ్వమేధికం॥” గుణవంతుఁడగు విప్రుఁడు నిర్గుణబ్రాహ్మణుని నిష్కారణముగఁ జంపెనేని యశ్వమేధావభృథమందు స్నానంబు సేసిన శుద్ధుండగునని భవిష్యత్పురాణము గోవిందరాజిచ్చట ద్వాదశవార్షికవ్రతమధ్యమం దశ్వమేధావభృథస్నానము జేసెనేని దానితో శుద్ధుఁడగునని వ్యాఖ్యానము సేసెను గాని భవిష్యత్పురాణవచనమునకు విరుద్ధము॥ ౮౨॥

మూ॥ ధర్మస్య బ్రాహ్మణో మూలమగ్రం రాజన్య ఉచ్యతే।
తస్మాత్సమాగమే తేషామేనో విఖ్యాప్య శుద్ధ్యతి ౮౩॥

బ్రాహ్మణులు ధర్మము పదేశించువారు గావున ధర్మతరువునకు మూలము రాజు ధర్మమును జేసి ఫలమగు పర్చును గనుక నావృక్షమున కగ్రము ఈయుభయుల యెదుటను స్వదనపాపముఁ జెప్పెనేని యాయశ్వమేధావభృథస్నానముచే శుద్ధుఁడగునని పూర్వమునకె విశేషము॥ ౮౩॥

మూ॥ బ్రాహ్మణస్సంభవేనైవ దేవానామపి దైవతం।
ప్రమాణం చైవ లోకస్య బ్రహ్మాత్రైవ హి కారణం॥౮౪॥

బ్రాహ్మణుఁడు జన్మమాత్రముచేతనే దేవతలకున్ను పూజ్యుఁడు శ్రుతాదిసంపన్నుఁడైతే జెప్పనేల లోకమందు ప్రత్యక్షమగు ప్రమాణము బ్రాహ్మణుఁడతని యుపదేశము ప్రమాణము గావున అన్నింటికిని వేదము ప్రమాణము దానిమూలమీ బ్రాహ్మణులు గావున నీయర్థము॥ ౮౪॥

మూ॥ తేషాం వేదవిదో బ్రూయుస్త్రయోప్యేనస్సునిష్కృతిం।
సా తేషాం పావనాయ స్యాత్పవిత్రా విదుషాం హి వాక్॥౮౫॥

విద్వాంసులగు నా బ్రాహ్మణులలో వేదజ్ఞులు ముగ్గురు నధికులని యేమి జెప్పదగ్గది నేదికారణముచే విద్వాంసుల యొక్క వాక్కు పవిత్రులనుగా జేయునో యది హేతువచే వారెట్టి ప్రాయశ్చిత్తమును జెప్పుదురో యది పాపపరిహారమున కగుచున్నది గావున ప్రకాశప్రాయశ్చిత్తమునకు విద్వాంసుల యొక్క సభ చేయదగ్గది

రహాస్యప్రాయశ్చిత్తమునకా సభలేదు రహాస్యత్వము విరోధియగును గావున॥౮౫॥

మూ॥ ఇతోన్యత మయాప్తాయ విధింవిప్ర స్సమాహితః।
బ్రహ్మహత్యాకృతం పాపం వ్యపోహత్యాత్మవత్తయా॥౮౬॥

ఈచెప్పబడిన ప్రాయశ్చిత్తగణములో దేనినయిన సమాహితమనస్కుఁడై యవలంబించి బ్రాహ్మణుఁడు బ్రహ్మహత్యాపాతకమునబోగొట్టుకొనును ఈప్రాయశ్చిత్తమొకటిమాఱు జేసినపాపమునకే మరలమరలజేసె నేని ప్రాయశ్చిత్తావృత్తియున్ను గావలెను॥సూ॥ "ఎనసిగురుణిగురూణి లఘునిలఘూనీతి" పాపమెకుడవజేసె నేనిగురుప్రాయశ్చిత్తమున్ను దక్కువ జేసె నేని లఘుప్రాయశ్చిత్తమున్ను గావలెనని గౌతమవచనమువలన॥శ్లో॥ "ప్రాణేనాపానస్య నస్థ్నాంతు శూద్రహత్యా వ్రతంచరేత్" ఎముకలులేని నల్లులు మొదలగుడంతువులను బండెడుజంపెనేని శూద్రహత్యావ్రతమును జేయవలయునని వచనమువలన బహుమారణమందధిక ప్రాయశ్చిత్తము జెప్పబడెనుగావున॥శ్లో॥ "విధేః ప్రాథమికాదస్మా ద్ద్వితీయె ద్విగుణంస్మృతం। తృతీయెత్రిగుణంప్రోక్తమితి" ఈసకృత్కృతపాపప్రాయశ్చిత్తవిధి రెండుమారులుపాపమునుజేసె నేని రెండుప్రాయశ్చిత్తములును మువ్మారుపాపమొనర్చె నేని మూడుప్రాయశ్చిత్తములున్ను జేయవలెనని గౌతమస్మృతివల్లనున్ను ఇళ్ళుకాల్చడం మొదలగువాటిచే ననేక బ్రహ్మహత్యలొకమారు జరిగెనేని భవిష్యత్పురాణమందు జెప్పబడెను॥శ్లో॥ "బ్రాహ్మణో బ్రాహ్మణంవీర బ్రాహ్మణోవా బహూన్ గుహ। నిహత్యయుగపద్వీర ఏకంప్రాణాంతికంచరేత్" బ్రాహ్మణుఁడు బ్రాహ్మణునొకనినిగాని యిద్దరినిగాని బహుమందినిగాని యొకమారుజంపెనేని ప్రాణాంతిక ప్రాయశ్చిత్తమొకటియె జేసుకొనవలెనని ఇదంతయును జ్ఞానవిషయము॥శ్లో॥ "కామతస్తుయదాహన్యా ద్బ్రాహ్మణాన్ సురసత్తమ। తదాత్మనం దహేదగ్నౌ విధినాయేనతచ్ఛృణు" కామపూర్వకముగ బ్రాహ్మణులనుజంపె నేని తనను వహ్నిలోకాల్చివేసుకొనవలెను దానివిధానమును జెప్పెదనని గావున॥శ్లో॥ "అకామతో యదాహన్యా ద్బ్రాహ్మణాన్ బ్రాహ్మణోగుహ। చరెద్వ్రతేయదాఘోరె యావత్ప్రాణపరిక్షయః" కోరికలేకుండ ననేకబ్రాహ్మణవధను బ్రాహ్మణుఁడొనర్చె నేని ఘోరారణ్యమందు తనయామరణముగా జరిగించవలెనని యుగపదనేక బ్రాహ్మణవధనకామముచేజేసినవానికని క్రమముగాననేక బ్రాహ్మణవధకు ప్రాయశ్చిత్తావృత్తియునుం జెప్పబడెను॥ ౮౬॥

మూ॥ హత్వాగర్భ మవిజ్ఞాత మేతదేవ వ్రతంచరేత్।
రాజన్యవైశ్యౌ చేజానా వాత్రేయీమేవచ స్త్రియం॥౮౭॥

ప్రకృతముగావున బ్రాహ్మణగర్భవిషయమని స్త్రీపుంభేదము తెలియదుగావున బ్రాహ్మణీగర్భమునున్ను క్షత్రియునిన్ని వైశ్యునిన్ని యాగమొనర్చ దలచినవానిన్ని ఆత్రేయియైనన గా ఋతుస్నాతయగు బ్రాహ్మణస్త్రీనిన్ని జంపినవాడు బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తమును జేయవలెను శ్లో॥ 'తథాత్రేయీంచబ్రాహ్మణీ' మని యమస్మృతి॥ శ్లో॥ 'రజస్వలామృతుస్నాతా మాత్రేయీ' మనివసిష్ఠస్మృతి అనాత్రేయి బ్రాహ్మణీవధచేసెనేని త్రైవార్షికోపపాతక వక్ష్యమాణ ప్రాయశ్చిత్తము యదియనాహితాగ్ని బ్రాహ్మణబ్రాహ్మణీవిషయము॥ శ్లో॥ "ఆహితాగ్నే బ్రాహ్మణస్యహత్వా పత్నీమనిందితాం। బ్రహ్మహత్యావ్రతంకుర్యా"దనియాహితాగ్నిబ్రాహ్మణబ్రాహ్మణిని జంపెనేని బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తముజేయవలయునని॥౮౭॥

మూ॥ ఉక్త్వాచైవానృతం సాక్ష్యే ప్రతిరుధ్య గురుంతథా।
అపహృత్యచ నిక్షేపం కృత్వాచ స్త్రీసుహృద్వధం॥౮౮॥

హిరణ్యభూమ్యాదిసాక్ష్యమందుఅనృతమాడిన్ని గురువును మిథ్యగానిందిచిన్ని నిక్షేపముగా జేయబడిన సువర్ణవ్యతిరిక్త బ్రాహ్మణరజతాదికమున్ను క్షత్రియాదులస్వర్ణమునున్ను హరించిన్ని పైనివ్రాసినవ్యాఖ్యానప్రకారము స్త్రీవధనొనర్చిన్ని బ్రాహ్మణుడుగానిమిత్రునిజంపిన్ని బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తమును జేయవలెను॥ ౮౮॥

మూ॥ ఇయంవిశుద్ధిరుదితా ప్రమాప్యా కామతోద్విజం
కామతోబ్రాహ్మణ వధేనిష్కృతిర్న విధీయతే॥ ౮౯॥

ఈచెప్పబడిన ప్రాయశ్చిత్తమకామముచేనైన బ్రాహ్మణవధకు జెప్పబడెను కామముచేబ్రాహ్మణవధజేసెనేనియీ ప్రాయశ్చిత్తము గాదుదీనికిద్విగుణమురణాదికమున్నునని ప్రాయశ్చిత్తగౌరవార్థముయని ప్రాయశ్చిత్తములేదనికాదు "శ్లో॥ కామతస్తుకృతేమోహాత్ప్రాయశ్చిత్తైః పృథగ్విధైః" యనుదానికివిరోధముగావున॥ ౮౯॥

మూ॥ సురాంపీత్వాద్విజో మోహాదగ్నివర్ణాంసురాంపిబేత్।
తయాసకాయే నిర్దగ్ధే ముచ్యతే కిల్బిషాత్తతః॥౯౦॥

ఇచ్చట సుర యనగా పిండిచే జేసిన సారాయిమాత్రమె గాని గౌడీమాధ్వీయను నవి గావు॥ "శ్లో॥ సురాచ పైష్టీముఖ్యోక్తా న తస్యా ఇతరే స్మృతే। పైష్ట్యాః పానే సదైవాసాం ప్రాయశ్చిత్తం నిబోధత॥" పైష్టీ గౌడీ మాధ్వీ యను మూడింటిలోను పైష్టీముఖ్యము మిగిలిన రెండున్ను దీనికి సరిగావు విట్లు పైష్టీ పానమునకు ప్రాయశ్చిత్తము చెప్పెదనని భవిష్యత్పురాణమునందు నియమోక్తి వలన "మనూక్తప్రాయశ్చిత్తమపైష్టికే॥" ద్విజుడు మోహముచేనగా నభిలషించిచే పైష్టీసురను త్రావెనేని యది కాచి యగ్నివలెనుండుచున్న దాని త్రావిచచ్చి శుద్ధుడగును ఇది గురుప్రాయశ్చిత్తము గావున కామకృతమునకని తెలియవలెను॥ "సురాపానే కామకృతే జ్వలంతీం తాం వినిక్షిపేత్। ముఖే తయా స నిర్దగ్ధో మృతశ్శుద్ధి మవాప్నుయాత్॥" కామకృతసురాపానమునకు యెఱ్ఱగా కాచిన కల్లునోటిలో బోసినందున చేవాడు కాలి చచ్చి శుద్ధుడగునని బృహస్పతివచనము॥ ౯౦॥

మూ॥ గోమూత్రమగ్నివర్ణంవా పిబేదుదకమేవవా।
పయోఘృతంవామరణాద్గోశకృద్రసమేవవా॥ ౯౧॥

గోమూత్ర జల గోఘృత గోక్షీర గోమయరసములలో దేనినైన నగ్నివలె గాచి త్రావిచచ్చెనేని శుద్ధుడగును॥ ౯౧॥

మూ॥ కణాన్వా భక్షయేదబ్దం పిణ్యాకం వా సకృన్నిశి।
సురాపానాపనుత్త్యర్థం వాలవాసా జటీధ్వజీ॥ ౯౨॥

ఇట్లుగాకున్న నిష్కృతముగ గుడ్డలనుగట్టుకుని జటలను ధరించి సురాపాత్రము చిహ్నముగాగలవాడై నూకగంజల నేరుకొనివాటినైనయక్కష్టపచ్యాలపిణ్యాకమునైన నాకటిపూటరాత్రులందొకసంవత్సరము త్రావెనేని సురాపానదోషముబోవు నిదియబుద్ధిపూర్వకసురాపానప్రాయశ్చిత్తము లఘువైనదిగావున॥ ౯౨

మూ॥ సురావై మలమన్నానాం పాప్మాచ మలముచ్యతే।
తస్మాద్బ్రాహ్మణ రాజన్యౌ వైశ్యశ్చనసురాంపిబేత్॥ ౯౩॥

బియ్యపుపిండిచే సురచెయ్యబడును గనుక నన్నమలమని జెప్పబడెను మలమనగా పాపము గావున బ్రాహ్మణక్షత్రియవైశ్యులు సురను త్రావరాదు ఇట్లు నిషేధముగలుగుచుండుటచే నన్నమలమని చెప్పుటవలన॥ "శ్లో॥ సురాంపీత్వా॥" యనుశ్లో

కముచే జెప్పబడిన ప్రాయశ్చిత్తముప్పెట్టకేయమని మనువుచే త్రైవర్ణికులకు జెప్పబడెను॥ ౯౩॥

మూ॥ గౌడీపైష్టీచ మాధ్వీచ విజ్ఞేయా త్రివిధా సురా।
యథైవైకా తథా సర్వా నపాతవ్యా ద్విజోత్తమైః॥ ౯౪॥

బెల్లముచే జేసినది గౌడి పిండిచే జేసినది పైష్టి ఇప్పపువ్వుతో చేసినది మాధ్వీ యీ మూడున్ను సురాశబ్దవాచ్యములై ముఖ్యమగుపైష్టి యెట్టివో మిగిలినవి రెండున్ను అట్టివే గావున బ్రాహ్మణాదిమూడువర్ణములవారున్ను వీటినన్నిటిని త్రాగరాదు॥ ౯౪

మూ॥ యక్షరక్షఃపిశాచాన్నం మద్యం మాంసం సురాసవం।
తద్బ్రాహ్మణేన నాత్తవ్యం దేవానామశ్నతా హవిః॥ ౯౫॥

ఈశ్లోకమందగు మద్యశబ్దము త్రివిధసురావ్యతిరిక్తనవవిధమని తెలియవలెను అవేవియనగా॥ "శ్లో॥ పానసం ద్రాక్షమాధ్వీకం ఖార్జూరం తాలమైక్షవం। మాధ్వీకం టంకమాధ్వీకమైరేయం నారికేళజం। సామాన్యానిద్విజాతీనాం మద్యాన్యేకాదశైవచ" ద్వాదశంతు సురామద్యం సర్వేషామధమం స్మృతం" పనసచెట్టువలననున్ను ద్రాక్షమనగా సామాన్యముకదంబాదివృక్షములవలననున్ను తేనియవలననున్ను ఖర్జూరచెట్టువలననున్ను తాటిచెట్టువలననున్ను చెరుకువలననున్ను ద్రాక్షవలననున్ను టంకమనగా జీలుగుచెట్టువలననున్ను ఇప్పపువ్వువలననున్ను మైరాయనువృక్షమువలననున్ను కొబ్బరిచెట్టువలననున్ను పుట్టినవి పదకొండున్ను ద్విజులకుసమానములేను పండ్రెండవది పైష్టియగుసుర యీయన్నింటిలోను నధమము నిషిద్ధమాంసమున్ను సురయనగా పైనవ్రాసిన పండ్రెండింటిలోనున్ను తొమ్మిదిగాక త్రివిధమగుసురయున్ను వస్తుమేళనముచే నప్పటికప్పుడు మద్యగుణముగలది యాసవము ఇట్లగు త్రివిధసురానవవిధమద్యమాంసాసవములు యక్షరక్షఃపిశాచభక్ష్యములు గావున దేవతాహవిస్సులగు పురోడాశాదులను భక్షించెడు బ్రాహ్మణుడు భక్షణార్హములు గావు ఇచ్చటసురయను చెప్పడము యక్షరక్షఃపిశాచాహారమనినిందార్థమాసవములవిషయమై॥ శ్లో॥ "ద్రాక్షేక్షుటంకఖార్జూరపనసాదేశ్చయోరసః। సద్యోజాతంతు పీత్వాతు త్రిరాత్రాచ్ఛుద్ధ్యేద్ద్విజోత్తమః॥" అప్పుడుబుట్టినపనసాదిమేళనముచేనగు నాసవమును ద్విజోత్తముడు త్రాగెనేని మూడుపవాసములచే శుద్ధుడగునని పులస్త్యుడు ఇందుకొందరు దేవానామశ్నతా యని పుల్లింగని

కేశవునుచే స్త్రీలకినిషేధములేదనిరిగాని యిదికాదు॥ "శ్లో॥ పతిలోకం న సా యాతి. బ్రాహ్మణీయా సురాంపిబేత్। ఇహైవసా శునీగృధ్రీ సూకరీచైవజాయతే॥" సురాపానమొనరించిన బ్రాహ్మణి పతిలోకమును జేరక ఈ లోకముననే కుక్క గ్రద్ద పందియునై బుట్టునని యుండుటవలన సురగాక పైనిచెప్పిన యాసవమద్యములు స్త్రీలకు దోషములేదని సర్వజ్ఞ నారాయణుని వ్యాఖ్యలో మాత్రమున్నది॥ ౯౫॥

మూ॥ అమేధ్యేవా పతేన్మత్తో వైదికంవా ప్యుదాహరేత్।
అకార్యమన్యత్కుర్యాద్వా బ్రాహ్మణో మదమోహితః॥ ౯౬॥

బ్రాహ్మణుడు మద్యపానముచే నొడలెరుగక నశుద్ధస్థానమైనం బడునను వేదవాక్యము ననుచ్చరించును బ్రహ్మహత్యాద్యకార్యములనయినం జేయుంగావున త్రాగరాదని పూర్వమున కనువాదము॥ ౯౬॥

మూ॥ యస్యకాయగతం బ్రహ్మ మద్యేనాప్లావ్యతేసకృత్।
తస్యవ్యపైతి బ్రాహ్మణ్యం శూద్రత్వంచ సగచ్ఛతి॥ ౯౭॥

ఏబ్రాహ్మణుని శరీరమందున్న జీవాత్మ మద్యముచే దడుపబడునో వాని బ్రాహ్మణ్యముబోయి శూద్రత్వమువచ్చును గాన బ్రాహ్మణుడు కల్లుద్రావరాదు॥ ౯౭॥

మూ॥ ఏషావిచిత్రాభిహితా సురాపానస్య నిష్కృతిః।
అతఊర్ధ్వం ప్రవక్ష్యామి సువర్ణస్తేయనిష్కృతిం॥ ౯౮॥

ఇది సురాపానజనితపాపప్రాయశ్చిత్తము చెప్పబడెనిక స్వర్ణస్తేయప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాను॥ ౯౮॥

మూ॥ సువర్ణస్తేయకృద్విప్రో రాజాన మభిగమ్యతు।
స్వకర్మఖ్యాపయన్ బ్రూయా న్మాంభవాననుశాస్త్వితి॥ ౯౯॥

"శ్లో॥ అపహృత్యసువర్ణంతు బ్రాహ్మణస్యయనస్స్వయం"మని శాతాతపస్మృతివలన బ్రాహ్మణుని బంగారముదొంగిలించిన విప్రుడనగా నరుడు దాను రాజునొద్దకుబోయి బ్రాహ్మణస్వర్ణాపహారిని నన్ను నిగ్రహింపుమని చెప్పవలెను॥ ౯౯॥

మూ॥ గృహీత్వా ముసలం రాజా సకృద్ధన్యాత్తుతంస్వయం।

వధేన శుధ్యేత్స్తేనో బ్రాహ్మణ స్తపసైవతు॥ ౧౦౦॥

“శ్లో॥ స్కంధేనాదాయ ముసల” మని చెప్పబడుటవలన నాచోరుడు తెచ్చియిచ్చిన రోకలిచేవ్రాచి యొకదెబ్బ రాజాచోరుని గొట్టవలెను దానిచేవాడుచచ్చి శుద్ధుడగును॥ “శ్లో॥ హతో ముక్తోపివాశుచిః” యని యాజ్ఞవల్క్యవచనముచే మృతకల్పుడై బ్రతికినను శుద్ధుడగును బ్రాహ్మణుడైతే తపముచేతనే శుద్ధుడగునని ఏవకారమునచే॥ “శ్లో॥ నజాతు బ్రాహ్మణంహన్యా త్సర్వపాపేష్వవస్థిత” మను వచనముచే బ్రాహ్మణునకు తపముచేతనే శుద్ధియగును మనుస్మృతివ్యాఖ్యారూపమగు భవిష్యత్పురాణమందు॥ “శ్లో॥ యదేతద్వచనంవీర బ్రాహ్మణ స్తపసైవవా। తత్రైవకారణాద్విద్యాత్ బ్రాహ్మణస్య సురాధిప॥ తపసైవేష్యతేనేహ ప్రతిషేధో వధస్యతు॥” ఇందుగలవాకల్పము క్షత్రియాదులకు తపస్సుచేతనున్ను వికల్పార్థము బ్రాహ్మణునకు తపస్సుచేతనేయనిగాని బ్రాహ్మణునికే తపస్సు చేసనని నియమనుగాదు॥ “శ్లో॥ ఇతరేషా మపివిభో తపోనప్రతిషిధ్యతే” యని బ్రాహ్మణేతరులకున్ను తపస్సునిషేధించబడలేదని భవిష్యత్పురాణమువలన అతపస్సునుచెప్పుచున్నాడు॥౧౦౦॥

మూ॥ తపసాపనునుత్సుస్తు సువర్ణస్తేయజంమలం।
చీరవాసాద్విజోరణ్యే చరేద్బ్రహ్మహణోవ్రతం॥ ౧౦౧॥

తపస్సుచే స్వర్ణస్తేయపాపమును బోగొట్టుకొన నిచ్ఛగలవాని కైనచెప్పినట్టు బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తవ్రతము నరణ్యమందుండి నారచీరగట్టిచేయవలెనుఇది పదిరెండేళ్ళప్రాయశ్చిత్తమధిక క్లేశము గలదిగావున క్షత్రియాదులకు మరణమునందని తెలియవలెను॥ “శ్లో॥ పంచకృష్ణలకోమాష స్తేసువర్ణస్తు షోడశ” యనగాయైదు కృష్ణలములొకమాషమనిపదారైతే సువర్ణమని సువర్ణపరిమాణమెరుగవలెను ఇంతకు తక్కువపరిమాణమునకు ప్రాయశ్చిత్తము లేదు న్యూనముగావున మనూక్తపరిమాణమే న్యాయ్యముగావున అధికపరిమాణమునకధికప్రాయశ్చిత్తము భవిష్యత్పురాణమందు చెప్పబడెను॥ “శ్లో॥ క్షత్రియాద్యాస్త్రయోవర్ణా నిర్గుణా హ్యఘశత్పరాః। గుణాఢ్యస్యతు విప్రస్య పంచనిష్కాన్ హరంతిచేత్। నిష్కే నైకాదశతథా దగ్ధ్వాత్మానంతుపావకే। శుద్ధయమరణాద్వీర చరేద్బ్రహ్మహణో వ్రతమ్॥” క్షత్రియాదిమూడువర్ణములవారు నఘతత్పరులును గుణహీనులు నగువారు గావున గుణవంతుడగు బ్రాహ్మణుని సువర్ణముపైదునిష్కములు మొదలు ప

బినో - మనిషహ్ములు దనుకనపహరించెనేని యగ్నిలో బడి కాలిచచ్చినను శుద్ధుల గుదురు లేదా బ్రహ్మచర్యమైన పైనిజెప్పినట్లు జేయవలయును॥ ౧౦౧॥

మూ॥ ఏతైర్వ్రతైరపోహేత పాపం స్తేయకృతం ద్విజః।
గురుస్త్రీగమనీయంతు వ్రతైరేభిరపానుదేత్॥ ౧౦౨॥

బ్రాహ్మణుడు సువర్ణస్తేయపాపమును తపోవ్రతములచేతను ఈపూర్వోక్త ప్రకారముగ బోగొట్టుకోవలెను గురుస్త్రీగమన జనిత పాపము వక్ష్యమాణముల గు ప్రాయశ్చిత్తములచే బోగొట్టుకొనవలెను॥ ౧౦౨॥

మూ॥ గురుతల్ప్యభిభాష్యైన స్తప్తే స్వప్యాదయోమయే।
సూర్మీం జ్వలంతీం స్వాశ్లిష్యే న్మృత్యునా సవిశుధ్యతి॥ ౧౦౩॥

నిషేకాదికర్మములను జేయించినవాడు గురువు తండ్రివంటివాడు తల్పమనగా భార్య గురుభార్యాగమనజనిత దోషమును బ్రకటించిన కాల్చినలోహమయ శయ్యయందు బరుండవలెను మరిన్ని లోహమయమగు నాడబొమ్మ నెర్రగాగాల్పించిదానికౌగలించుకొనిచచ్చెనేని శుద్ధుడగును॥ ౧౦౩॥

మూ॥ స్వయంవా శిశ్నవృషణా వుత్కృత్యాధాయచాంజలౌ।
నైఋతీం దిశమాతిష్ఠే దానిపాతాద జిహ్మగః॥ ౧౦౪॥

స్వయముగా శిశ్నవృషణములనుగోసి యంజలియందుంచుకొని వక్రగతిలేకుండ నైఋతిదిక్కుగా పడిపొయ్యేపర్యంతమునడిచి పడిచచ్చెనేని శుద్ధుడగును ఈ ప్రాయశ్చిత్తద్వయమున్ను కఠినముగావున జ్ఞానపూర్వకసవర్ణ, గురుభార్యావిషయమున్ను రేతస్సేచనపర్యంత మైధునవిషయమయిన్ని దెలియవలెను॥ ౧౦౪॥

మూ॥ ఖట్వాంగీ చీరవాసావా శ్మశ్రులో విజనేవనే।
ప్రాజాపత్యం చరేత్కృచ్ఛ్ర మబ్దమేకం సమాహితః॥ ౧౦౫॥

మంచముకోడును ధరించి నారచీరగట్టి గోళ్ళుముఖలోమములున్ను జటలనున్ను ధరించి నిర్జనవనమందు బ్రాజాపత్యకృచ్ఛ్రమొక సంవత్సరము సలిపి శుద్ధుడగును ప్రాయశ్చిత్తమిది యికవక్ష్యమాణమును స్వల్పముగావున సవర్ణభార్యాదిభ్రమచే గురుభార్యాగమనవిషయమజ్ఞానకృతమునకని దెలియవలెను॥ ౧౦౫॥

మూ॥ చాంద్రాయణం వా త్రీన్మాసా న్నభ్యసే న్నియతేంద్రియః।
హవిష్యేణ యవాగ్వా వా గురుతల్పాపనుత్తయే॥౧౦౬॥

గురుభార్యాగామిత్వదోషము పోవుటకు నియతేంద్రియుడై కందమూలాది హవిష్యములచేగాని నీవారాదివ్రతమగు గంజిచేగాని మూడుమాసములు చాంద్రాయణము జేయవలయును ఇది పూర్వోక్తముకంటె లఘుప్రాయశ్చిత్తము గావున గురువుయొక్క విజాతిభార్యతోగాని యదివ్యభిచారిణిగాని అయినట్టిదానితో బోయినవానికని యూహించవలెను॥ ౧౦౬॥

మూ॥ ఏతైర్వ్రతైరపోహేయు ర్మహాపాతకినో మలం।
ఉపపాతకినస్త్వేవ మేభిర్నానావిధైర్వ్రతైః॥౧౦౭॥

ఉక్తప్రకారములగు నియమములచే బ్రహ్మహత్యాది మహాపాతకులు పాపములుబోగొట్టుకొనవలెను ఇంక గోహత్యాద్యుపపాతకులు వక్ష్యమాణవ్రతములచే నిష్పాపులుగావలెను॥ ౧౦౭॥

మూ॥ ఉపపాతకసంయుక్తో గోఘ్నో మాసం యవాన్ పిబేత్।
కృతవాపో వసేద్గోష్ఠే చర్మణా తేనసంవృతః॥౧౦౮॥
చతుర్థకాల మశ్నీయా దక్షారలవణంమితం।
గోమూత్రేణాచరే త్స్నానం ద్వౌమాసౌ నియతేంద్రియః॥ ౧౦౯॥
దివానుగచ్ఛే ద్గాస్తాసాం తిష్ఠన్నూర్ధ్వం రజఃపిబేత్।
శుశ్రూషిత్వా నమస్కృత్య రాత్రౌ వీరాసనంవసేత్॥౧౧౦॥
తిష్ఠంతీ ష్వనుతిష్ఠేత్తు వ్రజంతీ ష్వప్యనువ్రజేత్।
ఆసీనాసు తథాసీనో నియతో వీతమత్సరః॥ ౧౧౧॥
ఆతురా మభిశస్తాం వా చోరవ్యాఘ్రాదిభి ర్భయైః।
పతితాం పంకలగ్నాం వా సర్వోపాయై ర్విమోచయేత్॥౧౧౨॥
ఉష్ణే వర్షతి శీతే వా మారుతే వాతి వా భృశం
న కుర్వీతాత్మన స్త్రాణం గోరకృత్వా తు శక్తితః॥౧౧౩॥
ఆత్మనో యది వాన్యేషాం గృహే క్షేత్రేఽథవా ఖలే।
భక్షయంతీం న కథయే త్పిబంతం చైవ వత్సకం॥౧౧౪॥

అనేనవిధినాయస్తు గోఘ్నో గామను గచ్ఛతి
సగోహత్యాకృతంపాపం త్రిభిర్మాసై ర్వ్యపోహతి॥౧౧౫॥

"ఉపపాతక" యనుపది మొదలుకొని "అనేనవిధినా" యనుశ్లోకమ్ము దనుక కలకము గోహత్యా రూపోపపాతకయుక్తుడు నలగగొట్టిన యవలతో గాచినగంజి ప్రథమమాసమందు ద్రాగవలెను॥శిఖతో గూడబోడగా శిరస్సునున్ను ముఖలోమములున్ను గొరిగించుకొని తనచేజంపబడిన గోవుయొక్కచర్మమును గప్పుకొనిమూడుమాసములు గోవులశాలయందుండవలెను గోమూత్రమునుచేతస్నానమును జేయుచు నియతేంద్రియుడై క్షారలవణవర్జితముగునన్నమునొక్క పగలు భక్షించుచు రెండవరోజున సాయంకాలమందు ద్వితీయతృతీయమాసములందు దినవలెను రెండుమాసములందునుపగలు ప్రాతస్స్నాన మొనర్చవలెను ప్రొద్దుటనే యాగోవులవెంటనే బోవలెను వాటిడెక్కలవలన దూలినధూళిసేవించుచు వాటి నిగోకడము మొదలగువాటిచే సేవించుచు మ్రొక్కుచు రాత్రియందు వాటిని దొడ్డిబెట్టి తానచ్చటనేయుండవలెను తానుశుచియు నక్రోధుడునగుచునిల్చుండి యవిలేచినప్పుడు లేవవలెను వనమందలితిరుగునప్పుడు వాటివెనుకనే నడుచుచుదిరుగవలెను యీగోవులు పడుండినప్పుడు తానునుంగూర్చుండవలెను చోరవ్యాఘ్రాదులభయముచేగాని రోగముచేగాని బడియుండినను బురదలో కూరుకొనిపోయినను ధానుయథాశక్తిగా నాపీడనుదొలగించవలెను మిక్కిలియెండగా యున్నప్పుడును వర్షించుచున్నప్పుడును చలిగాలిమొదలగుపీడలుగలుగునప్పుడు చేతనైనంతతప్పించి తాను దప్పించుకొనవలెను తనయొక్కగానియితరులయొక్కగాని గృహమందు సస్యమందును కళ్ళమందును గోవులుబడిమేయునప్పుడును వాటివత్సలుగుడుచుకబోవునప్పుడునునొరులతో జెప్పరాదు ఇట్లుజెప్పినప్రకారము మూడుమాసములు గోసేవనొనర్చినేనియు గోహత్యాజనితపాపముబోవును॥౧౦౮॥౧౦౯॥ ౧౧౦॥ ౧౧౧, ౧౧౨॥ ౧౧౩॥౧౧౪॥౧౧౫॥

మూ॥ వృషభైకాదశాగాశ్చ దద్యాత్సు చరితవ్రతః।
అవిద్యమానే సర్వస్వం వేదవిద్భ్యోనివేదయేత్॥ ౧౧౬॥

ఇట్లు గోహత్యాప్రాయశ్చిత్తముజేసిన పిమ్మట పదిగోవులు నొకవృషభమున్ను దానమీవలెను ఇంతకుతగినసొమ్ములేకుండెనేని తనసర్వస్వమున్ను వేదవేత్తలకీవలెను॥ ౧౧౬॥

మూ॥ ఏతదేవ వ్రతంకుర్యు రుపపాతకినో ద్విజాః।
అవకీర్ణివర్జ్యం శుద్ధ్యర్థం చాంద్రాయణమథాపివా॥౧౧౭॥

వక్ష్యమాణుడగు నవకీర్ణిగాక మిగిలినయుపపాతకులందరు నీగోవధప్రాయశ్చిత్తమైనను చాంద్రాయణమైనను లఘుప్రాయశ్చిత్తముజేయవలెను లఘువగు నీ చాంద్రాయణములఘూపపాతకమందుజాతిశక్త్యాద్యపేక్షయుగానూహించదగును

మూ॥ అవకీర్ణీతు కాణేన గర్దభేన చతుష్పథే।
పాకయజ్ఞవిధానేన యజేత నిరృతింనిశి॥౧౧౮॥

వక్ష్యమాణుడగునవకీర్ణియొకకన్నుబోయినగాడిదెను పశువుగా చతుష్పథమందు పాకయజ్ఞవిధానముచే రాత్రియందునిరృతిదేవతాయాగమొనర్చవలెను॥

మూ॥ హుత్వాగ్నౌ విధివద్ధోమా నంతతశ్చ సమేత్యృచా।
వాతేంద్రగురువహ్నీనాం జుహుయాత్సర్పిషాహుతీః॥౧౧౯॥

గర్దభవపచేవిధ్యుక్తముగ చతుష్పథమందునిరృత్యుద్దేశహోమమునకనంతరమందు॥ "శ్రు॥ సమ్మాసించంతుమరుత స్సమింద్రస్సంబృహస్పతిరితి॥" యీమంత్రముచే వాయువునకు నింద్రునకు బృహస్పతికి నగ్నికిని ఘృతాహుతులనువ్రేల్చవలెను అప్రసిద్ధముగాననవకీర్ణివ్రతలక్షణమును జెప్పుచున్నాడు॥ ౧౧౯॥

మూ॥ కామతో రేతసస్సేకం వ్రతస్థస్య ద్విజన్మనః।
అతిక్రమంవ్రతస్యాహు ర్ధర్మజ్ఞాబ్రహ్మవాదినః॥౧౨౦॥

"శ్లో॥ అవకీర్ణీభవేద్గత్వా బ్రహ్మచారీచయోషితం॥" ఇచ్ఛచేబ్రహ్మచర్యవ్రతస్థుడు స్త్రీనిబొంది రేతస్సేకమొనర్చెనేని యవకీర్ణియనబడునని బ్రహ్మవేత్తలు చెప్పిరి॥ ౧౨౦॥

మూ॥ మారుతం పురుహూతంచ గురుంపావకమేవచ।
చతురోవ్రతినోభ్యేతి బ్రాహ్మంతేజోవకీర్ణినః॥ ౧౨౧॥

బ్రహ్మచర్యవ్రతస్థుని వేదాధ్యయననియమానుష్ఠానజన్యమగు బ్రహ్మతేజస్సువావకీర్ణియైనట్టయితేవానివిడిచి మరుదింద్రబృహస్పత్యగ్నులనుజేరునుగావునవారికినాజ్యాహుతులను వ్రేల్చవలెను ఇదిపూర్వోక్తాజ్యాహుతివిధికనువాదము ౧౨౧॥

మూ॥ ఏతస్మిన్నేనసి ప్రాప్తే వసిత్వా గర్దభాజినం ।
సప్తాగారాంశ్చరేద్భైక్షం స్వకర్మ పరికీర్తయన్॥ ౧౨౨॥

ఇట్లు బ్రహ్మచారి యొకడు గాడిదతోలు కప్పుకొని తాను అవకీర్ణి యని పాపమును బ్రకటించుచు యేడిండ్లను భిక్షమెత్తి లబ్ధమగుదానిచే జీవించుచు నేకకాలమందే దినుచు నుండవలెను॥ ౧౨౨॥

మూ॥ తేభ్యో లబ్ధేన భైక్షేణ వర్తయన్నేకకాలికమ్ ।
ఉపస్పృశంస్త్రిషవణం త్వబ్దేన స విశుద్ధ్యతి॥ ౧౨౩॥

ఆ యేడు గృహములయందు దొరికిన మాత్రమగు భిక్షాన్నము నొక్క కాలమందే భక్షించుచు మూడు వేళలనున్ను స్నానమాడుచు నొకసంవత్సరమునకు శుద్ధుడగును॥ ౧౨౩॥

మూ॥ జాతిభ్రంశకరం కర్మ కృత్వా న్యతమమిచ్ఛయా ।
చరేత్సాంతపనం కృచ్ఛ్రం ప్రాజాపత్యమనిచ్ఛయా॥ ౧౨౪॥

“శ్లో॥ బ్రాహ్మణస్య రుజః కృత్వా” యని మున్ను జెప్పబడిన జాతిభ్రంశకర పాపములలో నొకదాని నిచ్ఛచే జేసెనేని యేడురోజులు నిర్ణయముగల వక్ష్యమాణమగు సాంతపనకృచ్ఛ్రమునున్ను అనిచ్ఛచే జేసెనేని ప్రాజాపత్యమునున్ను జేయవలెను॥ ౧౨౪॥

మూ॥ సంకరాపాత్రకృత్యాసు మాసం శోధనమైందవమ్ ।
మలినీకరణీయేషు తప్తః స్యాద్యావకం త్ర్యహమ్॥ ౧౨౫॥

“శ్లో॥ ఖరాశ్వోష్ట్ర” యనుశ్లోకముచే జెప్పబడిన సంకరీకరణములనున్ను “నిందితేభ్యో ధనాదాన” మిత్యాద్యుక్తములగు అపాత్రీకరణములనున్ను జేసెనేని యొక మాసము చాంద్రాయణమును జేసి “క్రిమికీటవయోహత్యా” ద్యుక్తములగు మలినీకరణమును జేసెనేని మరిగించిన గంజి మూడు దినములు త్రాగుచునుండి శుద్ధుడగును॥ ౧౨౫॥

మూ॥ తురీయో బ్రహ్మహత్యాయాః క్షత్రియస్య వధే స్మృతః ।
వైశ్యేష్టమాంశో వృత్తస్థే శూద్రే జ్ఞేయస్తు షోడశః॥ ౧౨౬॥

"శ్లో॥ స్త్రీవిట్క్షత్రవధః" యనుదానఁచే క్షత్రియవధ యుపపాతకములలోఁ జే ప్పబడెను వానికిశ్లోకమందు చెప్పబడిన ప్రాయశ్చిత్తము బ్రహ్మహత్యాప్రాయశ్చి త్తములో నాలవభాగము మూఁడుసంవత్సరములు చేయవలసివచ్చెనుగాన నధిక ముగావున వృత్తసంపన్నుఁడగు క్షత్రియు నిచ్ఛచే జంపెనేని దీనిజేయదగుననియూ హించవలెను మంచివైశ్యుఁజంపి సార్ధవర్షమున్ను సచ్ఛూద్రుఁనిజంపి తొమ్మిది నెలలున్నుజేయవలెను॥ ౧౨౬॥

మూ॥ అకామతస్తు రాజన్యం వినిపాత్య ద్విజోత్తమః।
వృషభైకసహస్రా గా దద్యాత్సుచరితవ్రతః॥౧౨౭॥

అబుద్ధిపూర్వకముగ క్షత్రియుని ద్విజుడు జంపెనేని తచ్ఛుద్ధికై వేయుమొదవు లను నొకయెద్దును సుత్తమబ్రాహ్మణున కీవలెను॥ ౧౨౭॥

మూ॥ త్ర్యబ్దం చరేద్వా నియతో జటీబ్రహ్మహణోవ్రతమ్।
వసన్ దూరతరే గ్రామా ద్వృక్షమూలనికేతనః॥౧౨౮॥

ఇట్లు గాకున్న జటలను ధరించి గ్రామమునకు దూరముగా నొకవృక్షమూల మందుండి బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తవ్రతమును మూఁడుసంవత్సరములునడిపినను శుద్ధుడగును "తురీయోబ్రహ్మహత్యాయాః" యనుశ్లోకోక్తమునకిది పునరుక్తిగాదు "వసన్దూరతరేగ్రామాద్వృక్షమూలే" యనిచెప్పుటచే బ్రహ్మహత్యాప్రాయశ్చి త్తచిహ్నములగు కపాలధారణాదులు లేవు గావున॥ ౧౨౮॥

మూ॥ ఏతదేవచరే దబ్దంప్రాయశ్చిత్తం ద్విజోత్తమః।
ప్రమాప్య వైశ్యంవృత్తస్థం దద్యాచ్చైకశతంగవాం॥ ౧౨౯॥

ఈబ్రహ్మహత్యావ్రతమునే మంచివైశ్యు నిచ్ఛచే జంపెనేని యొకవత్సరము జేయవలెను లేదా నూరునొకగోవులనయిన నీవలెను॥ ౧౨౯॥

మూ॥ ఏతదేవ వ్రతం కృత్స్నం షణ్మాసాం చ్ఛూద్రహాచరేత్।

వృషభైకా దశావాపి దద్యాద్విప్రాయగాః సితాః॥౧౩౦॥

అనిచ్ఛచే శూద్రునిజంపెనేని ద్విజుడా బ్రహ్మహత్యావ్రతము నారుమాసము

లాచరించవలెను లేదా పదితెల్లనిగోవులను నొకవృషభమును బ్రాహ్మణునకీయ వలెను॥ ౧౩౦॥

మూ॥ మార్జారనకులౌ హత్వా చాషం మండూకమేవచ।
శ్వగోధోలూకకాకాంశ్చ శూద్రహత్యావ్రతం చరేత్॥౧౩౧॥

పిల్లి ముంగి చెమరకాకి కప్ప కుక్క యుడుము గుడ్లగూబ కాకి వీనిలో నొకదానిని జంపినా శూద్రహత్యావ్రతమును జేయవలెను "స్త్రీశూద్రవిట్క్షత్రవధో" యను ఉపపాతకములలో జెప్పబడెను దానికి మూడునెలలు బ్రహ్మహత్యావ్రతము చెప్పబడెను చెప్పబడినదిగాను గోవధప్రాయశ్చిత్తము చాంద్రాయణమని చెప్పవలెను యీ పాపము స్వల్పముగావున నదియొక్క కామమునచే ననేకమారు లొకటిచేసినని చెప్పవలెను॥ ౧౩౧॥

మూ॥ పయఃపిబేత్త్రిరాత్రంవా యోజనంవాధ్వనోవ్రజేత్।
ఉపస్పృశేత్ స్రవంత్యాంవా సూక్తంవాబ్దైవతం జపేత్॥౧౩౨॥

అబుద్ధిపూర్వక మార్జారాదివధకు త్రిరాత్రము పాలుత్రాగవలెను అశక్తమాంద్యముచే నట్లు త్రాగలేనప్పుడు నాలుగు క్రోసులునడవవలెను దానికిశక్తుడే ని నదీస్నానముచేయవలెను అదియుసాధ్యమైనని "ఆపోహిష్ఠామయో" యను సూక్తమును జపించవలెను. ఉత్తరోత్తరము లఘువుగాన పూర్వపూర్వాసంభవమందు ఉత్తరోత్తరము కర్తవ్యముగాని వికల్పములుగావు॥ ౧౩౨॥

మూ॥ అభ్రిం కార్ష్ణాయసీం దద్యాత్సర్పం హత్వా ద్విజోత్తమః।
పలాలభారకం షండే సైసకం చైవ మాషకం॥౧౩౩॥

బ్రాహ్మణుడు సర్పమునుజంపెనేని కొనసూదిగానున్న యినుపదండమును న్ను నపుంసకునిజంపెనేని పొల్లి మనిషి మోతబరువుగలది మాషపరిమితసీసమును దానముజేయవలెను॥ ౧౩౩॥

మూ॥ ఘృతకుంభం వరాహేతు తిలద్రోణంతు తిత్తిరౌ।
శుకే ద్విహాయనం వత్సం క్రౌంచం హత్వా త్రిహాయనం॥౧౩౪॥

వరాహమునుజంపి ఘృతకుంభమునున్ను తిత్తిరినిజంపి కుంచెడు నువ్వులనున్ను

చిలుకనుజంపి రెండేండ్ల గోవత్సమునున్ను క్రౌంచమును జంపి మూడేండ్ల వత్సమును నొసగవలెను॥ ౧౩౪॥

మూ॥ హత్వాహంసం బలాకాంచ బకం బర్హిణమేవచ।
వానరం శ్యేనభాసౌచ స్పర్శయేద్బ్రాహ్మణాయగాం॥౧౩౫॥

హంస బెగ్గురె మేక నెమలి వానరము డేగ భాసమనెడుపక్షి వీట్లనుజంపిన నొకగోవును బ్రాహ్మణునకివ్వవలెను॥ ౧౩౫॥

మూ॥ వాసోదద్యాద్ధయంహత్వా పంచనీలాన్ వృషాన్గజం।
అజమేషావనడ్వాహం ఖరంహత్వైకహాయనం॥౧౩౬॥

గుఱ్ఱమునుజంపి వస్త్రమునున్ను గజమునుజంపి నీలవర్ణముగల అయిదువృషభములనున్ను గొఱ్ఱెనుగాని మేకనుగానిజంపి యొకవృషభమునున్ను గాడిదెనుజంపి యొకవత్సరము వయస్సుగలగోవత్సమును బ్రాహ్మణునకివ్వవలెను॥ ౧౩౬॥

మూ॥ క్రవ్యాదాంస్తు మృగాన్ హత్వా ధేనుందద్యాత్పయస్వినీం।
అక్రవ్యాదాన్వత్సతరీ ముష్ట్రంహత్వాతు కృష్ణలం॥౧౩౭॥

పచ్చిమాంసమునుదినెడి మృగములననగా వ్యాఘ్రాదులనుజంపెనేని పాలిచ్చెడియావునున్ను మాంసమునుదినని మృగముల హరిణాదులజంపెనేని ప్రౌఢవత్సనున్ను ఉష్ట్రమునుజంపెనేని కృష్ణలపరిమితి సువర్ణమునునీవలెను॥ ౧౩౭॥

మూ॥ జీనకార్ముకబస్తావీన్ పృథగ్దద్యాద్విశుద్ధయే।
చతుర్ణామపివర్ణానాం నారీర్హత్వానవస్థితాః॥ ౧౩౮॥

ఉత్కృష్టాపకృష్టపురుషులతో వ్యభిచరించి చెడిననాలుగుజాతుల స్త్రీలనున్ను జంపెనేని క్రమముగా వేరువేర చర్మపుటకమునున్ను ధనుస్సునున్ను మేకనున్ను గొఱ్ఱెనున్ను దానమిచ్చి యాపాపమును బోగొట్టుకొనవలెను॥ ౧౩౮॥

మూ॥ దానేన వధనిర్ణేకం సర్పాదీనామశక్నువన్।
ఏకైకశశ్చరేత్కృచ్ఛ్రం ద్విజఃపాపాపనుత్తయే॥ ౧౩౯॥

సర్పాదివధకర్త్రయనగా తీక్ష్ణాగ్రాయసదండదానాదులకశక్తుడయ్యెనేని ఆస

శ్వవధాదిపాపములకు ప్రత్యేకమొకొక్క కృచ్ఛ్రమును జేసి శుద్ధుడగును॥ ౧౩౯॥

మూ॥ అస్థిమతాంతు సత్త్వానాం సహస్రస్య ప్రమాపణే।
పూర్ణేచానస్యనస్థ్నాంచ శూద్రహత్యావ్రతంచరేత్ ॥౧౪౦॥

ఎముకలుగల తొండలు మొదలగుజంతువులను వేయింటిని జంపినను నెముకలులేనినల్లులు మొదలగుజంతువులను బండెడుజంపిన నొకశూద్రహత్యాప్రాయశ్చిత్తమును జేయవలెను॥ ౧౪౦॥

మూ॥ కించిదేవతు విప్రాయ దద్యాదస్థిమతాంవధే।
అనస్థ్నాంచైవహింసాయాం ప్రాణాయామేనశుధ్యతి॥ ౧౪౧॥

ఎముకలుగలజంతువులను జంపికించిదనగా పణమాత్రసువర్ణదానముచేతను, న్ను ఎముకలులేని జంతువులను జంపెనేని ప్రాణాయామముచేతనున్ను శుద్ధుడగును ప్రాణాయామమనగా॥ "శ్లో॥ సవ్యాహృతిం సప్రణవాం గాయత్రీం శిరసా సహ। త్రిఃపఠేదాయతప్రాణః ప్రాణాయామస్సఉచ్యతే॥" వ్యాహృతిప్రణవములతో గూడ గాయత్రిని శిరస్సుతో మువ్మారుప్రాణవాయువుని నిలిపి యుచ్చరించిన నది ప్రాణాయామమనబడుననివసిష్ఠోక్తి॥ ౧౪౧॥

మూ॥ ఫలదానాంచ వృక్షాణాం ఛేదనేజప్యమృక్శతం।
గుల్మవల్లీలతానాంచ పుష్పితానాంచవీరుధాం॥ ౧౪౨॥

మామిడిమొదలగు ఫలవృక్షములనున్ను తుప్పలనున్ను పుష్పించెడి గుల్మములనగాతుప్పలు వల్లులనగా బల్లుగాబలిసెడి తిప్పతీవమొదలగునవి లతలనగా కొమ్మలను చుట్టుకొనేవి వీరుత్తులనగా మల్లెలు మొదలగునవివీటిని నరికెనేని సావిత్ర్యాదిఋక్శతమును జపించవలెను ఇవి- "శ్లో॥ ఇంధనార్థమశుష్కాణా" మనేను శ్లోకముచే నుపపాతకములందు గణించబడినవి యచ్చట గురుప్రాయశ్చిత్తార్థమిచ్చట ఫలవృక్షాదుల యబుద్ధిపూర్వకహానియందు లఘుప్రాయశ్చిత్తార్థము॥ ౧౪౨॥

మూ॥ అన్నాద్యజానాం సత్త్వానాం రసజానాంచ సర్వశః।
ఫలపుష్పోద్భవానాంచ ఘృతప్రాశోవిశోధనం॥ ౧౪౩॥

అన్నమందును గుడాదిరసములందును బొడ్డుపళ్ళు మొదలగుకాటయందును తప్ప

పుష్పమొదలగు పుష్పములందును బుట్టిన జంతువధదోషము ఘృతప్రాశనముచే బోవును॥ ౧౪౩॥

మూ॥ కృష్టజానామోషధీనాం జాతానాంచ స్వయంవనే।
వృథాలంభేనుగచ్ఛేద్గాం దినమేకం పయోవ్రతః॥ ౧౪౩॥

దున్నబడిన భూమియందగు శాల్యాద్యోషధులనున్ను వనమున స్వయముగా బుట్టిన పుష్పాదులనున్ను నిష్ప్రయోజనముగా నశింపజేసినచో క్షీరాహారముగలవాడై యొకపగలెల్లా గోవుననుసరించి శుద్ధుడగును॥ ౧౪౪॥

మూ॥ ఏతైర్వ్రతైరపోహ్యం స్యాదేనోహింసాసముద్భవమ్।
జ్ఞానాజ్ఞానకృతం సర్వం శృణుతానద్య భక్షణే॥౧౪౫॥

ఈచెప్పబడిన ప్రాయశ్చిత్తములచే జ్ఞానాజ్ఞానకృతహింసాజనితదోషమును పరిహరించదగిన దింకనభక్ష్యభక్షణప్రాయశ్చిత్తములను వినుండు॥ ౧౪౫॥

మూ॥ అజ్ఞానాద్వారుణీం పీత్వా సంస్కారేణైవ శుద్ధ్యతి।
మతిపూర్వమనిర్దేశ్యం ప్రాణాంతికమితిస్థితిః॥౧౪౬॥

ఈవచనము మహాపాతకములకు దూరముగా జెప్పుటవలన ముఖ్యపైష్టీవిషయముగాదు మరేమంటె తదితరవిషయము నున్నచ్చట॥ "శ్లో॥ యథైవైకా తథా సర్వాః" యని గౌడీమాధ్వీయు రెంమన్న మితగముగువాటికంటే పైష్టీసామ్యమందు ముఖ్యములని బ్రాహ్మణులకు ప్రాయశ్చిత్తగౌరవార్థమని చెప్పబడెను గౌడిని మాధ్వినిద్రావిగానీ మాకృత ప్తకృఛ్రము జేసి పునస్సంస్కారముచే శుద్ధుడగునని చెప్పబడెను॥ "సూ॥ అమత్యామద్యపానేపయోఘృతముదకంవాయుం ప్రత్యహంతప్తకృఛ్రంతతోస్యసంస్కారః॥" అబుద్ధిపూర్వకమద్యపానమున నొకనాడుపాలు నొకనాడు నేయి నొకనాడుదకము నొకనాడు వాయువును భక్షించిన తప్తకృఛ్రమువిజేసి యటపైని సంస్కారమని గౌతముడు దీనికి వ్యాఖ్యారూపముగాభవిష్యత్పురాణము॥ "శ్లో॥ అకామతః కృతేపానే గౌడీమాధ్వ్యోర్నరాధిప। తప్తకృఛ్రవిధానం స్యాద్గౌతమేనయథోదితం॥" దీని యర్థము వివరించబడినదె బుద్ధిపూర్వకపైష్టీతరమద్యపానమునను ప్రాణాంతికమునిర్దేశించరాదనిశాస్త్రమర్యా

ద గౌడీమాధ్వ్యలను బుద్ధిపూర్వకముగ త్రావిన మరణనిషేధము వలననితరమద్యా పేక్షచే వీటికి ప్రాయశ్చిత్తగౌరవము॥"శ్లో॥ కణాన్వాభక్షయే దబ్దమని మనువే చెప్పెను గావుననే గౌడీమాధ్వ్యలకు కామముచే పానానువృత్తిగలుగుచుండెనేని భవిష్యపురాణముందును."శ్లో॥ యద్వాస్మిన్ననవిషయే మానవీయం ప్రకల్పయేత్ । కణాన్వా భక్షయేదబ్దం పిణ్యాకంవానకృన్నిశి సురాపానాపనుత్త్యర్థంవాలవా సాజటీన్వజీ॥" యని ఈశ్లోకముచే కథకమన్ను పైనివ్రాయబడెను పైష్టీగౌడీమాధ్వీ వ్యతిరిక్తఫలస్త్యోక్త పానసాదినవవిధమద్యములలో దేని త్రావినను లఘుప్రాయశ్చిత్తము సంవత్సరమాత్రమే కాని మరియొకటిగాని బ్రాహ్మణుని శుచింముబుద్ధిపూర్వముగ పానసాదులను త్రావెనే॥"శ్లో॥ మపూర్వాం సురాపానే కృతేన్యజ్ఞానతోగుహ । కృఛ్రాతికృఛ్రౌభవతః పునస్సంస్కార ఏవహి॥"యనుభవిష్యత్పురాణీయమంతయు నితరమనూక్తను॥ ౧౪౬॥

మూ॥ అపస్సురాభాజనస్థామద్య భాండస్థితాస్తథా ।
పంచరాత్రం పిబేత్పీత్వా శంఖపుష్పీశృతంపయః॥౧౪౭॥

పైష్టీవ్యతిరిక్తమద్యభాండస్థితములగు నీళ్లు మద్యరసగంధవర్జితములైనందాత్రావెనేని శంఖపుష్పియనెడి యోషధిని వేసి కాచినపాల నయిదుదినములు త్రావినశుద్ధుడగును ఇచ్చట పయస్సబ్దమునకర్థము పాలెగాని నీళ్లుగావు॥"సూ॥శంఖపుష్పీ విపక్వేన క్షీరేణవర్తనమే"దని బోధాయనస్మృతిలో క్షీరమని చెప్పుటవలన సురాపానమునందు గురుప్రాయశ్చిత్తము మద్యమునందు లఘుప్రాయశ్చిత్తమని చెప్పుట వలన నిచ్చట జ్ఞానాజ్ఞానప్రకారభేదముచే విషయసమీకరణము గావలెను॥ ౧౪౭॥

మూ॥ స్పృష్ట్వా దత్వాచ మదిరాం విధివత్ప్రతిగృహ్యచ ।
శూద్రోచ్ఛిష్టాశ్చపీత్వాపః కుశవారి పిబేత్త్ర్యహమ్॥౧౪౮॥

మద్యము నొకరికి తెచ్చిననను పుచ్చుకున్నను స్పృశించినను శూద్రోచ్ఛిష్టోదకమునుత్రావినను కుశతోనుగినజలమాత్రము త్రావియుండిన శుద్ధుడగును॥౧౪౮॥

మూ॥ బ్రాహ్మణస్తు సురాపస్య గంధమాఘ్రాయ సోమపః।
ప్రాణానప్సుత్రిరాయమ్య ఘృతంప్రాశ్య విశుద్ధ్యతి॥ ౧౪౯

సోమపానమొనర్చిన బ్రాహ్మణుడు మద్యపాయియొక్క ముఖగంధమును ఘ్రాణించెనేని జలమందుండి మూడుప్రాణాయామములు జేసిఘృతప్రాశనము జేసినశుద్ధుడగును॥ ౧౪౯॥

మూ॥ అజ్ఞానాత్ప్రాశ్య విణ్మూత్రం సురాసంస్పృష్టమేవచ।
పునస్సంస్కారమర్హంతి త్రయోవర్ణా ద్విజాతయః॥ ౧౫౦॥

మనుష్యసంబంధిమూత్రపురీషములనున్ను సురామద్యసంస్పృష్టవస్తువునున్ను ద్విజాతులగు మూడువర్ణములవారును భక్షించిరేని పునరుపనయనముచే శుద్ధులగుదురు॥ ౧౫౦॥

మూ॥ వపనం మేఖలాదండౌ భైక్షచర్యా వ్రతానిచ।
నివర్తంతే ద్విజాతీనాం పునస్సంస్కారకర్మణి॥౧౫౧॥

మూ॥ అభోజ్యానాంచ భుక్త్వాన్నం స్త్రీశూద్రోచ్ఛిష్టమేవచ।
జగ్ధ్వామాంసమభక్ష్యంచ సప్తరాత్రం యవాన్పిబేత్॥౧౫౨॥

"శ్లో॥ నాశ్రోత్రియకృతేయజ్ఞే॥" యనునదిమొదలుకొని జెప్పబడినయభోజ్యాన్నుల యొక్కయన్నమునుదినియవపిండితో కాచినదైనగలపినదైనజలము నేడుదినములు త్రావవలెను ఈవిషయమన్యే॥ "శ్లో॥మత్యాభుక్త్వాచరేత్కృచ్ఛ్ర"మనెడిచతుర్థాధ్యాయమందుప్రాయశ్చిత్తముదీనికి వికల్పము కర్తయొక్కశక్తిననుసరించివైకల్పికము ద్విజాతిస్త్రీలయొక్కయు శూద్రులయొక్కయు నుచ్ఛిష్టమును దినినదే ప్రాయశ్చిత్తము క్రవ్యాదసూకరోష్ట్రాణామనువచనముచే నేవిశేష ప్రాయశ్చిత్తము జెప్పబడెనో తన్నిషిద్ధమగుమాంసమునుదిననిదే ప్రాయశ్చిత్తము జేయవలెను॥

మూ॥ శుక్తానిచకషాయాంశ్చ పీత్వామేధ్యాన్యపిద్విజః।
తావద్భవత్యప్రయతో యావత్తన్నవ్రజత్యధః॥ ౧౫౩॥

స్వభావముచే మధురములైనను నీళ్లుకలిసికొన్నివాళ్ళకుపులిసినవిగవ్యమువినా శుక్తములనబడును కషాయములనగా విభీతకాదిక్వథితములు నప్రసిద్ధములును ద్రావెనేని యవియెంతపర్యంతముజీర్ణములుగాకుండునంతదాక నశుచియగును॥

మూ॥ విడ్వరాహఖరోష్ట్రాణాం గోమాయోఃకపికాకయోః।

ప్రాశ్యమూత్రపురీషాణి ద్విజశ్చాంద్రాయణంచరేత్॥ ౧౫౪॥

ఊరబంది గాడిదె లొట్టిపిట నక్క కోతి కాకి వీటియొక్క మూత్రపురీషములను ద్రావెనేని ద్విజుడు చాంద్రాయణముజేయవలెను "ఛత్రాకంవిడ్వరాహంచ" యనువచనముచే బంచమాధ్యాయమందు జెప్పినప్రాయశ్చిత్తము జ్ఞానకృతమునకిచ్చుటనజ్ఞానకృతమునకు గాన విరోధములేదు॥ ౧౫౪॥

మూ॥ శుష్కాణి భుక్త్వా మాంసాని భౌమానికవకానిచ।
అజ్ఞాతంచైవసూనాస్థ మేతదేవవ్రతంచరేత్॥

ఎండకట్టినమాంసమునున్ను భూమియందున్ను వృక్షమందును బుట్టిన పుట్టకొక్కులనున్ను "శ్లో॥ భూమిజంవా వృక్షజంవా ఛత్రాకం భక్షయంతియే । బ్రహ్మఘ్నాంస్తాన్విజానీయాత్॥" యనియమవచనమువలన భూమివృక్షకవకములు రెండున్ను నిషిద్ధములే గావున కటికవానిదుకాణము మీదకొనినదిన్ని యేమాంసమో తెలియనిదిన్ని దినినచాంద్రాయణము జేయవలెను॥ ౧౫౫॥

మూ॥ క్రవ్యాదసూకరోష్ట్రాణాం కుక్కుటానాంచ భక్షణే।
నరకాకఖరాణాంచ తప్తకృచ్ఛ్రం విశోధనం॥ ౧౫౬॥

పచ్చిమాంసముదినువాటియొక్కయు ఊరబందియొంటె కోడి నరుడు కాకి గాడిదె వీటియొక్క మాంసమునెరిగితినెనేని తప్తకృచ్ఛ్రమును జేయవలెను॥ ౧౫౬

మూ॥ మాసికాన్నంతుయోశ్నీయా దసమావర్తకోద్విజః।
సత్రీణ్యహాన్యుపవసే దేకాహం చోదకేవసేత్॥ ౧౫౭॥

సపిండీకరణముకాకమునుపటి ఏకోద్దిష్టవిధిచేజేయబడిన మాసికాన్నమును బ్రహ్మచారిదినెనేని మూడుదినములు పవసించవలెనందులోనొకటిదినమెల్లా నీళ్లలో నుండవలెను॥ ౧౫౭॥

మూ॥ బ్రహ్మచారీతుయోశ్నీయా న్మధుమాంసం కథంచన।
సకృత్వా ప్రాకృతం కృచ్ఛ్రం వ్రతశేషం సమాపయేత్॥ ౧౫౮॥

బ్రహ్మచారియనిచ్ఛచేనైనను తేనెయునున్ను మాంసమునున్ను దినెనేని ప్రాకా

పత్యకృఛ్రమొనర్చి మరిన్ని బ్రహ్మచర్యవ్రతమును కొనసాగించవలెను॥ ౧౫౮॥

మూ॥ బిడాలకాకాఖూచ్ఛిష్టం జగ్ధ్వాశ్వనకులస్యచ।
కేశకీటావపన్నంచ పిబేద్బ్రహ్మసువర్చలాం॥ ౧౫౯॥

పిల్లి కాకి యెలుక కుక్క ముంగి వీటియుచ్ఛిష్టమున్ను కేశములు పురుగులు నుగలసినదిన్ని యెరిగితినేని మరిగించిన నీళ్లు త్రావవలెను॥ ౧౫౯॥

మూ॥ అభోజ్యమన్నం నాత్తవ్య మాత్మనశ్శుద్ధిమిచ్ఛతా।
అజ్ఞానభుక్తం తూత్తార్యం శోధ్యంవాప్యాశుశోధనైః॥ ౧౬౦॥

తినరాని యన్నముల నజ్ఞానముచే దినెనేని వమనము జేసుకొనవలెను గాకున్న ప్రాయశ్చిత్తమును జేయవలెను వమనము జేసినను లఘుప్రాయశ్చిత్తను గావలెను యెరిగతినెనేని పూర్వోక్తప్రాయశ్చిత్తమునే జేయవలెను॥ ౧౬౦॥

మూ॥ ఏషోనాద్యాదనస్యోక్తో వ్రతానాం వివిధోవిధిః।
స్తేయదోషాపహర్తౄణాం వ్రతానాం శ్రూయతాం విధిః॥ ౧౬౧॥

అభక్ష్యభక్షణవిషయమయిన ప్రాయశ్చిత్తవిధులు నానావిధములుగ జెప్పబడెను దొంగతనముచేవచ్చిన పాపములకు వ్రతములనువినుండు॥ ౧౬౧॥

మూ॥ ధాన్యాన్నధనచౌర్యాణి కృత్వా కామాద్ద్విజోత్తమః।
స్వజాతీయగృహాదేవ కృఛ్రాబ్దేన విశుధ్యతి॥ ౧౬౨

బ్రాహ్మణుడు బ్రాహ్మణగృహమువలన ధాన్యమున్నన్నమును ధనమున్ను యెరిగి చౌర్యమొనర్చెనేనినొకసంవత్సరము ప్రజాపత్యవ్రతమొనర్చి శుద్ధుడగును॥ ౧౬౨

మూ॥ మనుష్యాణాంతు హరణే స్త్రీణాం క్షేత్రగృహస్యచ।
కూపవాపీజలానాంచ శుద్ధిశ్చాంద్రాయణంస్మృతం॥ ౧౬౩

పురుషస్త్రీ క్షేత్ర గృహములలో దేనిని హరించినను వాపీకూపములను గాని హరించెనేని చాంద్రాయణమును జేయవలయునని మన్వాదులచే జెప్పబడెను ఇదిన్ని దేశకాల ద్రవ్యపరిమాణ స్వామిగుణాద్యపేక్షచేలఘుత్వమహత్త్వ ములనుసర్వత్ర విచారించవలెను॥ ౧౬౩॥

మూ॥ ద్రవ్యాణా మల్పసారాణాం స్తేయంకృత్వాన్యవేశ్మతః।
చరేత్సాంతపనంకృచ్ఛ్రం తన్నిర్యాత్యాత్మశుద్ధయే॥ ౧౬౪

కొంచెపు విలువగల సత్తు సీసము మొదలగు వాటిని దొంగిలించినేని ప్రాయశ్చిత్తవిశేషము లేని విగాఢుండా ద్రవ్యమును స్వామికిచ్చివేసి సాంతపనకృచ్ఛ్రమును జేసి శుద్ధుడగును పశ్చాచ్చౌర్యమందు నపహృతద్రవ్యమును స్వామికిచ్చుటయును ప్రాయశ్చిత్తవిశేషము॥ ౧౬౪॥

మూ॥ భక్ష్యభోజ్యాపహరణే యానశయ్యాసనస్యచ।
పుష్పమూలఫలానాంచ పంచగవ్యం విశోధనం॥ ౧౬౫॥

అపూపాదిభక్ష్యములు పాయసాది భోజ్యములు శకటాది యానములు శయ్యలు ఆసనములు పుష్పమూలఫలములు నెత్తుకొనిపోయినేని పంచగవ్యమును ద్రాగుట ప్రాయశ్చిత్తము॥ ౧౬౫॥

మూ॥ తృణకాష్ఠద్రుమాణాంచ శుష్కాన్నస్య గుడస్యచ।
చేలచర్మామిషాణాంచ త్రిరాత్రంస్యాదభోజనం॥ ౧౬౬॥

గడ్డి కఱ్ఱలు చెట్లు శుష్కాన్నమనగా దండులాదులు వస్త్రములు చర్మము మాంసము వీటిలో దేనినపహరించినను మూడుదినములుపవసించి శుద్ధుడగును॥ ౧౬౬॥

మూ॥ మణిముక్తాప్రవాళానాం తామ్రస్య రజతస్యచ।
అయఃకాంస్యోపలానాంచ ద్వాదశాహంకణాన్నతా॥ ౧౬౭॥

మణి ముక్తా ప్రవాళ తామ్ర రూప్య కాంస్యాయః పాషాణములలో దేనిని దొంగిలించినను తండులకణములు భక్షించుచు పండ్రెండు రోజులుపవసించిన శుద్ధుడగును అన్నిటియందును సకృదభ్యాస దేశకాల ద్రవ్యస్వామి గుణశక్తులనుబట్టి ప్రాయశ్చిత్తగౌరవలాఘవములను కల్పించవలెను॥ ౧౬౭॥

మూ॥ కార్పాసకీటజోర్ణానాం ద్విశఫైక శఫస్యచ।
పక్షిగంధౌషధీనాంచ రజ్జ్వాశ్చైవ త్ర్యహంపయః॥ ౧౬౮॥

ప్రత్తి పొత్తి పట్టు కంబళములు రెండు డెక్కలుగలవాదులు ఒంటి డెక్కగల

హంసాదులు చిలుక మొదలగుపక్షులు చందనాదికము త్రాళ్ళు వీటిలో దేనినిహరించినను పాలను త్రాగుచు మూడుదినములుపవసించి శుద్ధుడగును॥ ౧౬౮॥

మూ॥ ఏతైర్వ్రతై రపోహేత పాపం స్తేయకృతం ద్విజః।
అగమ్యాగమనీయం తు వ్రతై రేభి రపానుదేత్॥౧౬౯॥

ఇచ్చటనున్న పూర్వమువలె విషయసమీకరణాదికము నూహించవలెను ఈచెప్పబడినవాటిచే చౌర్యజనితపాపమును బోగొట్టుకొనవలెను ఇంక నగమ్యాగమన నిమిత్తమగు పాపము నివక్ష్యమాణవ్రతములచె బోగొట్టుకొనవలెను॥ ౧౬౯॥

మూ॥ గురుతల్పవ్రతం కుర్యా ద్రేతస్సిక్త్వా స్వయోనిషు।
సఖ్యుః పుత్రస్య చ స్త్రీషు కుమారీ ష్వంత్యజాసు చ॥౧౭౦॥

ఏకోదరభగినులయందును మిత్రులయొక్కయు పుత్రులయొక్కయు భార్యలందును పుత్రికలందును చండాలస్త్రీలయందును రేతస్సేకము ప్రత్యేకముగజేసెనేని గురుదారగమన ప్రాయశ్చిత్తమొనర్చవలెను ఇచ్చట నెరుగకనేని యభ్యాసముచేనేనియిట్లను బధవిచారముగావలెను యభ్యాసముచేజేసిన మరణాంతికమెను గావున నే॥శ్లో॥ "రేతస్సిక్త్వా కుమారీషు చండాలీష్వంత్యజాసు చ। సపిండాపత్య దారేషు ప్రాణత్యాగో విధీయతే" యనియమస్మృతి ఈకుమార్యాదులందు జ్ఞానగమనమునకుమరణము నజ్ఞానకృతమునకు వ్రతమునుం గావలెను॥ ౧౭౦॥

మూ॥ పైతృష్వసేయీం భగినీం స్వస్రీయాం మాతురేవ చ।
మాతుశ్చ భ్రాతృతనయాం గత్వా చాంద్రాయణం చరేత్॥౧౭౧॥

తల్లిదండ్రుల సోదరీలపుత్రికలనున్ను తనసోదరీలనున్ను మేనమామకూతురినిన్ని బొందెనేని చాంద్రాయణముజేయవలెను॥ ౧౭౧॥

మూ॥ ఏతాస్తిస్రస్తు భార్యార్థే నోపయచ్ఛేత్తు బుద్ధిమాన్।
జ్ఞాతిత్వేనానుపేయాస్తాః పతతి హ్యుపయన్నధః॥౧౭౨॥

మేనత్తకూతురు పినతల్లికూతురు మేనమామకూతురు వీరు భగినివంటివారే గావున వీరినిముగ్గురినిన్ని భార్యార్థము బుద్ధిగలవాడు వివాహముగారాదు జ్ఞాతిబంధుత్వముచేవీరు బొందదగరు బొందెనేని యధఃపాతమునొందును॥శ్లో॥ "అస

ఫీండాచ యామాసు" రిత్యాదివచనముచే నిషేధముచెప్పబడినప్పటికిని దాక్షిణా
త్యాచారదర్శనముచేతన్నిషేధ దాధ్యార్థమీవచనము॥ ౧౭౨॥

మూ॥ అమానుషీషు పురుష ఉదక్యాయా మయోనిషు।
రేతస్సిక్త్వాజలేచైవ కృఛ్రంసాంతపనం చరేత్॥ ౧౭౩॥

అమానుషీషుయనగా గోవువినాజంతువులందును గోవుయందైతేసంవత్సరము
ప్రాజాపత్యము నచరించవలెను గావున స్త్రీయోన్యప్రదేశమందును జలమందును రే
తస్సేకమొనర్చిన సాంతపనకృఛ్రమాచరించి పురుషుడుశుద్ధుడగును॥ ౧౭౩॥

మూ॥ మైథునంతు సమాసేవ్య పుంసియోషితివాద్విజః।
గోయానేప్సుదివాచైవసవాసాస్స్నాన మాచరేత్॥ ౧౭౪॥

పురుషునితోగాని స్త్రీతోగాని మైథునమొనర్చిన్ను యెద్దులబండిమీదనున్న జల
మందున్న పగలున్ను మైథునమొనర్చిన ద్విజుడు సచేలస్నానముజేయవలెను॥ ౧౭౪॥

మూ॥ చండాలాంత్య స్త్రియోగత్వాభుక్త్వాచ ప్రతిగృహ్యాచ।
పతత్యజ్ఞానతోవిప్రో జ్ఞానాత్సామ్యంతు గచ్ఛతి॥ ౧౭౫॥

చండాలస్త్రీని యవనశబరాద్యంత్యజాతిస్త్రీనిన్ని యజ్ఞానముచేబొందిన్ని వాళ్ల
యన్నము నుతినిన్ని వాళ్ళవల్లప్రతిగ్రహించిన్ని పతితుడగుననగా పతితప్రాయశ్చిత్త
ముజేసుకొనవలెను జ్ఞానముచేవిప్రుడువాళ్ళయొక్క మైథునాన్న భక్షణప్రతిగ్రహ
ములొనర్చిన తత్సముడగును ప్రాయశ్చిత్తగౌరవమునిదీని దెలియదగును॥ ౧౭౫॥

మూ॥ విప్రదుష్టాం స్త్రియం భర్తా నిరుంధ్యాదేకవేశ్మని।
యత్పుంసః పరదారేషు తచ్చైనాం చారయేద్వ్రతం॥ ౧౭౬॥

విశేషించి ప్రదుష్టురాలనగా నిచ్ఛచే వ్యభిచరించినస్త్రీనిభర్త నిరోధించవలె
ననగా పత్నీకృత్యములందు దప్పించి యొకగృహమందునకట్టవలెను దానిచేతసజాతీ
యపరస్త్రీతో వ్యభిచరించిన పురుషునకేప్రాయశ్చిత్తమో యదిజేయించవలెను॥
"శ్లో॥ స్త్రీణామర్ధంప్రదాతవ్య" మను వసిష్ఠవచనమువల్లచే వ్యభిచరించినదా
నికి చేయదగును॥ ౧౭౬॥

మూ॥ సా చేత్పునః ప్రదుష్యేత్తు సదృశేనోపమంత్రితా।

కృచ్ఛ్రం చాంద్రాయణంచైవ తదస్యాః పావనం స్మృతం॥ ౧౭౭॥

ఆస్త్రీకృతప్రాయశ్చిత్తురాలు మనప్పటికిని సజాతీయునిచే ప్రార్థింపబడినదై తిరిగి వ్యభిచరించెనేని దానికి ప్రాజాపత్యకృచ్ఛ్రచాంద్రాయణములు చేయదగునని మునులచే జెప్పబడెను॥ ౧౭౭॥

మూ॥ యత్కరోత్యేకరాత్రేణ వృషలీసేవనంద్విజః।
తద్భైక్షభుగ్జపన్నిత్యం త్రిభిర్వర్షైర్వ్యపోహతి॥ ౧౭౮॥

ప్రాయశ్చిత్తగౌరవములవలన నిచ్చట వృషలియనగా చండాల స్త్రీగాన లెనుచండాల స్త్రీతో నొకరాత్రిభోగించి యేపాపము నార్జించెనో బ్రాహ్మణుడాపాపమును భిక్షాన్నముదింటూ గాయిత్ర్యాదిమంత్రజపమును జేయుచు మూడుసంవత్సరములు నియతుడుగానుండెనేని బోగొట్టుకొనును॥ ఇందుకు ఆపస్తంబవచనము॥ "శ్లో॥ యదేకరాత్రేణ కరోతి పాపం కృష్ణంవర్ణం బ్రాహ్మణస్సేవమానః। చతుర్థకాలఉదకఆహ్నజాపీ త్రిభిర్వర్షైస్తద్వ్యపోహతి పాపం॥" బ్రాహ్మణుడు నికృష్టజాతిస్త్రీ నొకరాత్రియందు బొందిచేసిన పాపమును జతుర్థకాలమందుదకమును ద్రావుచు ననగా నొకదినముందుపవాసముండి రెండవదినము సాయంత్రమందు నాహారముగొనుచు నాన్హ ప్రకాశకమంత్రమును జపించుచు మూడుసంవత్సరములకాపాపమును బోగొట్టుకొనును యాపస్తంబులు మేధాతిథియాపస్తంబవచనార్థము నేవ్యాఖ్యగాజేసెను గోవిందరాజు దీనికి నక్రమపరిణీత శూద్రాగమనప్రాయశ్చిత్తముగావ్రాసెను॥ ౧౭౮॥

మూ॥ ఏషాం పాపకృతాముక్తా చతుర్ణామపినిష్కృతిః।
పతితైస్సంప్రయుక్తానా మిమాశ్శృణుతనిష్కృతీః॥ ౧౭౯॥

హింస అభక్ష్యభక్షణము చౌర్యము నగమ్యాగమనము చేసిన నల్వురికినిం బ్రాయశ్చిత్తము జెప్పబడెను పతితో సంసర్గము నుచేసినవారికి ప్రాయశ్చిత్తము వినుడు॥ ౧౭౯॥

మూ॥ సంవత్సరేణ పతతి పతితేన సహాచరన్।
యాజనాధ్యాపనాద్యౌనా న్నతుయానాసనాశనాత్॥ ౧౮౦॥

పతితునితో నేకశయ్యాసనము నేకాసనోపవేశనము నేకపఙ్క్తిభోజనమునో కసంవత్సరముజేసినం బతితుడగును యజ్ఞము జేయించడము వేదముపనయనాదిగాజెప్పడము పిల్లనిచ్చి పుచ్చుకొనే సంబంధము వీటిచేతను సంవత్సరము పతితునితో జరిగిన పతితుడగునని గాదు మరేమంటే యాజనాది సంసర్గము పతితునితో నెప్పుడు జరుగునో యప్పుడే పతితుడగును॥ "శ్లో॥ యాజనం యోనిసంబంధం స్వాధ్యాయం సహభోజనం। కృత్వాసద్యః పతంత్యేతే పతితేన నసంశయః॥" పతితునితో యాజనాధ్యయనయోనిసంబంధసహభోజనములొనర్చిన సద్యఃకాలమందే పతితుడగునని దేవలుడు॥ "శ్లో॥ సంవత్సరాత్పతతి పతితేన సహాచరన్। సహయానాసనాభ్యాసం యానాత్తుసద్య ఏవహి." పతితునితో సహయానాదులు జరిగనేని సంవత్సరమునకున్ను యోనిసంబంధముచే సద్యఃకాలమందున్ను పతితుడగునని విష్ణువచనము "శ్లో॥ సంవత్సరేణపతతి పతితేన సహాచరన్। యాజనాధ్యాపనాద్యానాత్సద్యోవశయనాసనాదితి-" యని బోధాయనులున్ను జెప్పిరి॥ గోవిందరాజైతే యాజనాదిత్రయమును సంవత్సరమొనర్చిన పతితుడగుననియు నేకాసనాదులు లఘురూపములు గావున సంవత్సరమునకంటె నధికకాలసంసర్గము గావలెనని వ్యాఖ్యానమొనర్చెను గానిమునులమతమునకువిరుద్ధనుగావుననదియాదరణీయము గాదనికుల్లూభట్టు వ్రాసెను॥ ౧౮౦॥

మూ॥ యోయేన పతితేనైషాం సంసర్గంయాతిమానవః।
సతస్యైవ వ్రతంకుర్యాత్తత్సంసర్గవిశుద్ధయే॥ ౧౮౧॥

ఈపతితశబ్దము పాపకారివాచకము యేపతితునితో సంసర్గమెవడుచేసెనో వాడాపతితునకు జెప్పిన ప్రాయశ్చిత్తముజేసిన శుద్ధుడగును గాని మరణాంతికము లేదు బహ్మహత్యకు జెప్పిన ద్వాదశవార్షిక ప్రాయశ్చిత్తములో పాదహీనముగానగా తొమ్మిదేడులు జేయవలెను- ఇందుకు వ్యాసవచనము॥ "శ్లో॥ యోయేనసంసృజేద్వర్షం సోపితత్సమతామియాత్। పాదన్యూనంచరేత్సోపి తస్యతస్యవ్రతం ద్విజః॥" ఎవడే పాపకర్మునితో సంవత్సరముదనుక సంసర్గమునర్చునో యతండు తత్తుల్యుడగును గావున నాద్విజుడా యీపాపవ్రతము పాదన్యూనముగ జేయవలెను॥ ౧౮౧॥

మూ॥ పతితస్యోదకం కార్యం సపిండైర్బాంధవైర్బహిః।

నిందితే హనిసాయాహ్నే జ్ఞాత్యృత్విగ్గురుసన్నిధౌ॥ ౧౮౨॥

మహాపాతకి బ్రతికియుండగానే వక్ష్యమాణప్రకారముగ ప్రేతకర్మము సపిం. డసమానోదకులతోగూడ సాయాహ్నమందు గ్రామమునకు వెలిని ఋత్విగ్గురుసన్నిధానమందు రిక్తతిథియగునవమి నాడు జేయవలెను॥ ౧౮౨॥

మూ॥ దాసీ ఘటమపాంపూర్ణం పర్యస్యే త్ప్రేతవత్పదా।
అహోరాత్ర ముపాసీర న్నశౌచం బాంధవై స్సహ॥౧౮౩॥

సపిండసమానోదకులతోగూడ దాసీ మనిషి జలపూర్ణఘటమును దెచ్చి యి దిప్రేతతుల్యమని పాదముచే చిమ్మివేయవలెను అదిమొదలుగా జ్ఞాతులందరు నొకయహోరాత్రమాశౌచము బట్టవలెను॥ ౧౮౩॥

మూ॥ నివర్తేరంశ్చ తస్మాత్తు సంభాషణ సహాసనే।
దాయాద్యస్య ప్రదానంచ యాత్రాచైవహి లౌకికీ॥౧౮౪॥

అదిమొదలుగా వానితో సంభాషణను నొకచో గూచుండుటయు దాయ మిచ్చుటయు లౌకికవ్యవహారమున్ను ననగా నెప్పుడైన భోజనము పెట్టుటమొద లగునవి మానవలెను॥ ౧౮౪॥

మూ॥ జ్యేష్ఠతాచ నివర్తేత జ్యేష్ఠావాప్యంచ యద్ధనమ్।
జ్యేష్ఠాంశం ప్రాప్నుయాచ్చాస్య యవీయాన్ గుణతోధికః ౧౮౫॥

జ్యేష్ఠునకొనర్చెడి ప్రత్యుత్థానాదికము వీనికి జేయరాదు జ్యేష్ఠులకులభ్యమగు వింశత్యుద్ధారాదికమున్ను లేదు దాయమే లేదుగదా జ్యేష్ఠాంశములేదని చెప్పడమే లనంటె వానితమ్మునకా జ్యేష్ఠాంశము లభ్యమని జెప్పుటకిది యనువాదము ఆజ్యే ష్ఠాంశము వానితమ్ముడు గుణాధికుడు బొందవలెను॥ ౧౮౫॥

మూ॥ ప్రాయశ్చిత్తేతు చరితే పూర్ణకుంభ మపాంనవం।
తైనైవసార్ధం ప్రాస్యేయు స్స్నాత్వా పుణ్యే జలాశయే॥౧౮౬।

పతితుడు ప్రాయశ్చిత్తమును జేసిన పిమ్మట వానిసపిండసమానోదకులు పుణ్య జలాశయమందు స్నానమొనర్చి జలపూర్ణమగు నూతనఘటమును చెరువులో వానిచే పారవేయించవలెను॥ ౧౮౬॥

మూ॥ సత్వప్సుతం ఘటం ప్రాస్య ప్రవిశ్య భవనం స్వకం।
సర్వాణి జ్ఞాతికార్యాణి యథాపూర్వం సమాచరేత్॥౧౮౭॥

ప్రాయశ్చిత్తము జేసుకొనినవాడు ఘటమునట్లు బారవేసి తన గృహమునకు బోయి యెప్పటివలె జ్ఞాతికర్మములను జేయవలెను॥ ౧౮౭॥

మూ॥ ఏతమేవ వ్రతం కుర్యాద్యోషిత్సు పతితాసుచ।
వస్త్రాన్నపానం దేయంతు వసేయుశ్చ గృహాంతికే॥౧౮౮॥

స్త్రీలు పతితలైతే పైనిచెప్పినట్టే స్త్రీలతో దకదానాదికమును భర్త్రాదిసపిండులు చేసుకొనవలెను ఈ స్త్రీలకు తమయింటికి సమీపమందు కుటీరము వేయించి గ్రాసవాసస్సులిచ్చి పోషించవలెను॥ ౧౮౮॥

మూ॥ ఏనస్విభిరనిర్ణిక్తైర్నార్థం కించిత్సహాచరేత్।
కృతనిర్ణేజనాంశ్చైవ నజుగుప్సేత కర్హిచిత్॥౧౮౯॥

ప్రాయశ్చిత్తమును జేసుకొనని పాపకర్ములతో దానప్రతిగ్రహాదికర్మములను జేయరాదు ప్రాయశ్చిత్తమును జేసుకొనినవాని నించుకైన నిందజేయరాదు పూర్వమందునువలె వ్యవహారములో జేర్చుకొనవలెను॥ ౧౮౯॥

మూ॥ బాలఘ్నాంశ్చ కృతఘ్నాంశ్చ విశుద్ధానపి ధర్మతః।
శరణాగతహంతౄంశ్చ స్త్రీహంతౄంశ్చ నసంవసేత్॥౧౯౦॥

శిశుహత్యయు నుపకారికి నపకారము శరణమనువాని జంపుటయు స్త్రీహత్య జేసినవాళ్ళు ప్రాయశ్చిత్తమును యథావిధిగా జేసి కొనినను వీరితో సంసర్గము జేయరాదు॥ ౧౯౦॥

మూ॥ ఏషాం ద్విజానాం సావిత్రీం నానూచ్యేత యథావిధి।
తాంశ్చారయిత్వా త్రీన్కృచ్ఛ్రాన్ యథావిధ్యుపనాయయేత్॥౧౯౧॥

ఏ బ్రాహ్మణక్షత్రియ వైశ్యులకు కాలమందుపనయనముగాకుండిన నందుకు మూడుకృచ్ఛ్రములు జేయించి పైని యథావిధిగానుపనయనము జేయవలెను యాజ్ఞవల్క్యాదులు వ్రాత్యస్తోమాది ప్రాయశ్చిత్తమును జెప్పెడి నీరెండు ప్రకారములను జాతికాలగుణాదులనుబట్టి గురులఘువికల్పముగా జేయవలెను॥ ౧౯౧॥

మూ॥ ప్రాయశ్చిత్తంచికీర్షంతి వికర్మస్థాస్తు యేద్విజాః।
బ్రహ్మణాపి పరిత్యక్తా స్తేషామప్యేతదాదిశేత్॥ ౧౯౨॥

ఏద్విజులు శూద్రసేవాదివికర్మస్థులై వేదమునుజదువక ప్రాయశ్చిత్తము గోరినమూఁడుప్రాజాపత్యములను జేసికొనవలెనని చెప్పిరి॥ ౧౯౨॥

మూ॥ యద్గర్హితే నార్జయంతి కర్మణా బ్రాహ్మణాధనం।
తస్యోత్సర్గేణ శుధ్యంతి జప్యేన తపసైవచ॥ ౧౯౩॥

నిందితవృత్తిచే దుష్ప్రతిగ్రహాదులవలన ధనమునార్జించినదానికి ప్రాయశ్చిత్తమాధనమువిడుచుటగాని వక్ష్యమాణజపతపస్సులుగాని జేయవలెను ద్రవ్యత్యాగమున్ను ప్రాయశ్చిత్తముగాజెప్పబడెను గావున అమ్మదగని వాటినమ్మిన నిదేప్రాయశ్చిత్తము॥ ౧౯౩॥

మూ॥ జపిత్వా త్రీణిసావిత్ర్యాః సహస్రాణి సమాహితః।
మాసంగోష్ఠే పయఃపీత్వా ముచ్యతే సత్ప్రతిగ్రహాత్॥ ౧౯౪॥

మూఁడువేలగాయత్రీజపించిన యొకమాసము గోష్ఠమందు క్షీరాహారమునుజేయుచునుండిన నసత్ప్రతిగ్రహజనితదోషమువలన ముక్తుఁడగును శూద్రాదిదాతృదోషమున్ను చౌర్యాద్యాగతధనదోషమున్ను ప్రతిగ్రహించిన వానికిందు వలననే బోవును॥ ౧౯౪॥

మూ॥ ఉపవాసకృశంతంతు గోవ్రజాత్పునరాగతం।
ప్రణతంపరిపృచ్ఛేయు స్సామ్యంసౌమ్యేచ్ఛసీతికిం॥ ౧౯౫॥

కేవలక్షీరాహారముచే కృశించి గోష్ఠమువలనతిరిగివచ్చి నమస్కరించియున్న వానినియోసౌమ్యుఁడా మాతోసామ్యమును గోరుచుంటివాయిఁటుపైన నసత్ప్రతిగ్రహముచేయకుమని బ్రాహ్మణులనవలయును॥ ౧౯౫॥

మూ॥ సత్యముక్త్వాతు విప్రేషు వికిరేద్యవసంగవాం।
గోభిః ప్రవర్తితే తీర్థే కుర్యుస్తస్య పరిగ్రహం॥ ౧౯౬॥

ఆబ్రాహ్మణులయెదుట ప్రాయశ్చిత్తముజేసుకొన్నవాఁడు సత్యముగానసత్ప్రతిగ్రహముజేయనని పలికి గోవులకుగడ్డివేసి యవి మేసినవిమ్మటనాగోవులుప్రవర్తిం

చిన వృత్త్యాదేశమందు వానినాబ్రాహ్మణులు తమలోఁ జేర్చుకొనవలెను॥ ౧౯౬॥

మూ॥ వ్రాత్యానాం యాజనంకృత్వా పరేషామంత్యకర్మచ।
అభిచారమహీనంచ త్రిభిఃకృచ్ఛ్రైర్వ్యపోహతి॥ ౧౯౭॥

వ్రాత్యులనగా॥ "శ్లో॥ అతఊర్ధ్వం త్రయోప్యేతే॥" యనుశ్లోకముచే చెప్పబడినవారికి యజ్ఞమును జేయించిన్ని తండ్రిగురువులుదక్కనితరులకు ప్రేతదాహాది కర్మమొనరించిన్ని అభిచారమునకనర్హుఁడగువాని పైశ్యేనయాగాదికను జేసిన్ని అహీనమనెడియాగవిశేషము తంత్రాదికము దానిజేసిన్ని మూఁడుకృచ్ఛ్రములచే శుద్ధుఁడగును॥ ౧౯౭॥

మూ॥ శరణాగతంపరిత్యజ్య వేదంవిప్లావ్యచద్విజః।
సంవత్సరం యవాహారః తత్పాపమపసేధతి॥ ౧౯౮॥

శరణాగతునిగావఁదాను శక్తుఁడయిన్ని విడిచిపెట్టినాఅనర్హునకు వేదమును జెప్పినానాద్విజుఁడొకసంవత్సరము యవాహారమొనరించి యాపాపమునుబోఁగొట్టుకొనును॥ ౧౯౮॥

మూ॥ శ్వసృగాలఖరైర్దష్టో గ్రామ్యైఃక్రవ్యాద్భిరేవచ।
నరాశ్వోష్ట్రవరాహైశ్చ ప్రాణాయామేనశుధ్యతి॥ ౧౯౯॥

కుక్క నక్క గాడిదె నరుఁడు గుఱ్ఱము పంది పచ్చిమాంసముదినెడి గ్రామ్యజంతువులు పిల్లులుమొదలగునవి ఇవియే భక్షించినను ప్రాణాయామముచే శుద్ధుఁడగును॥ ౧౯౯॥

మూ॥ షష్ఠాన్నకాలతామాసం సంహితాజపఏవవా।
హోమాశ్చ సాకలానిత్య మపాఙ్క్త్యానాం విశోధనం॥ ౨౦౦॥

చోరక్లీబాద్య పాఙ్క్తేయులలో నెవళ్లకువిశేషముగ ప్రాయశ్చిత్తము నిర్దేశించి మూఁడవదినము రాత్రిభోజన మిట్లొకమాస మొనరించినదైనను వేదసంహితాజపమైనను ॥ "శ్రు॥ దేవకృతస్యైనసోవయజనమసి" యనునది మొదలుగా నెనిమిది మంత్రములచేఁబ్రత్యేకముగనుద్గాతచేయవలెను ఇదియైనను తత్పాపశుద్ధికి జెప్పబడెను॥ ౨౦౦॥

మూ॥ ఉష్ట్రయానం సమారుహ్య ఖరయానం తు కామతః।
స్నాత్వా తు విప్రో దిగ్వాసాః ప్రాణాయామేన శుధ్యతి॥ ౨౦౧॥

లొట్టిపిట్టలను గాడిదెలను బూన్చినబండిమీద నెక్కిన నగ్నుడై స్నానమొనర్చిన ప్రాణాయామముచే శుద్ధుడగును ఖరోష్ట్రములమీద నెక్కినేని బహుప్రాణాయామములు కావలెనని యూహించవలెను॥ ౨౦౧॥

మూ॥ వినాద్భిరప్సు వాప్యార్తః శారీరం సన్నివేశ్య చ।
సచేలో బహిరాప్లుత్య గామాలభ్య విశుధ్యతి॥ ౨౦౨॥

జలము సన్నిధినుండకుండగా గాని యుదకమందు గాని మూత్రమైన పురీషమైన విడిచెనేని గ్రామమునకు పైనినద్యాదులందు సచేలస్నానమొనర్చి గోవును స్పృశించి శుద్ధుడగును॥ ౨౦౨॥

మూ॥ వేదోదితానాం నిత్యానాం కర్మణాం సమతిక్రమే।
స్నాతకవ్రతలోపే చ ప్రాయశ్చిత్తమభోజనం॥ ౨౦౩॥

ప్రాయశ్చిత్తవిశేషములేని వేదవిహితములగు నగ్నిహోత్రాదినిత్యకర్మములయొక్కయు చతుర్థాధ్యాయోక్తస్నాతకవ్రతములయొక్కయు నతిక్రమమునందు ఏకాహోపవాసము ప్రాయశ్చిత్తముగా జేయవలెను॥ ౨౦౩॥

మూ॥ హుంకారం బ్రాహ్మణస్యోక్త్వా త్వంకారం చ గరీయసః।
స్నాత్వానశ్నన్నహః శేషమభివాద్య ప్రసాదయేత్॥ ౨౦౪॥

విద్యాదిగుణసంపన్నుడగు బ్రాహ్మణునధిక్షేపించి హుంకారమైనను నీవు నీవని త్వంకారమైనను జేసి యతని పాదములుబట్టుకొని ప్రసన్నునిజేసికొని యాపైనున్న పగటియందు భుజించకుండిన శుద్ధుడగును॥ ౨౦౪॥

మూ॥ తాడయిత్వా తృణేనాపి కంఠే వాబధ్య వాససా।
వివాదే వా వినిర్జిత్య ప్రణిపత్య ప్రసాదయేత్॥ ౨౦౫॥

ప్రకృతమగు బ్రాహ్మణుని తృణముచేనైనం గొట్టియైన బట్టమెడకుదగిలించిలాగియైన వాక్కలహముచే జయించియైన పాదములపైనిబడి ప్రసన్నునిగా జేయవలెను॥

మూ॥ అవగూర్య త్వబ్దశతం సహస్ర మభిహత్యచ ।
జిఘాంసయా బ్రాహ్మణస్య నరకం ప్రతిపద్యతే॥ ౨౦౬॥

బ్రాహ్మణునిజంపి నిచ్ఛచే కర్రయెత్తి కొట్టబోతే నూరేడులున్ను కొట్టివేయు
వత్సరములున్ను నరకమునంబడును॥ ౨౦౬॥

మూ॥ శోణితం యావతః పాంసూన్ సంగృహ్ణాతి మహీతలే।
తావంత్యబ్దసహస్రాణి తత్కర్తా నరకే వసేత్॥ ౨౦౭॥

బ్రాహ్మణశరీరమువలన నేవముగొట్టిన దెబ్బచేబడినరక్తము భూమియందెన్ని
పరాగరేణువులతడుపునో వాడన్నివేలబ్దములు నరకమందుండును॥ ౨౦౭॥

మూ॥ అవగూర్య చరేత్ కృచ్ఛ్ర మతికృచ్ఛ్రం నిపాతనే।
కృచ్ఛ్రాతికృచ్ఛ్రౌ కుర్వీత విప్రస్యోత్పాద్య శోణితమ్॥౨౦౮॥

బ్రాహ్మణుని కొట్టుటకు దండమెత్తి కృఛ్రమునుకొట్టి అతికృఛ్రమును నెత్తురు
కలుగచేసి కృఛ్రాతికృఛ్రములు నాచరించవలెను॥ ౨౦౮॥

మూ॥ అనుక్తనిష్కృతీనాంతు పాపానామపనుత్తయె ।
శక్తించావేక్ష్య పాపంచ ప్రాయశ్చిత్తం ప్రకల్పయేత్॥ ౨౦౯॥

వేటికిప్రాయశ్చిత్తములు చెప్పలేదో అట్టి ప్రతిలోమవధాదులవలననైన పా
పములనివారణార్థముకర్త యొక్కశరీరధనాది సామర్థ్యమున్నున్ను పాపముల
నున్నుజూచి జ్ఞానాజ్ఞాన సకృదావృత్త్యనుబంధముల కనురూపమగు ప్రాయశ్చిత్త
మును గల్పించవలెను॥ ౨౦౯॥

మూ॥ యైరభ్యుపాయైరేనాంసి మానవో వ్యపకర్షతి।
తాన్ వోభ్యుపాయాన్ వక్ష్యామి దేవర్షి పితృ సేవితాన్॥ ౨౧౦॥

ఏయేయుపాయములచే మనుష్యుడు పాపములను బోగొట్టుకొనునో పాప
నాశహేతువులగు దేవర్షి పితృచరితములగు నట్టియుపాయములను జెప్పెదను॥
౨౧౦॥ ఈసరికి జెప్పబడిన ప్రాయశ్చిత్తములను జేయనశక్తులగువారికి పాపాపనో
దనోపాయములు॥ *

మూ॥ త్ర్యహం ప్రాతస్త్ర్యహంసాయం త్ర్యహమద్యాదయాచితం।
త్ర్యహం పరంచనాశ్నీయా త్ప్రాజాపత్యంచరన్ ద్విజః॥ ౨౧౧॥

ద్విజుడుప్రాజాపత్యాఖ్యమగువ్రతమాచరించుచు మూడుదినములు ప్రాతఃకా
లమందును అనగా బ్రాహ్మణభోజనోచిత కాలమందనియతభక్షము మూడుదినములురా
త్రులందును మూడుదినములయాచితమునుంభుజించి మూడుదినము లుపవాసము

ఘుంజేయవలయును ఇందుకువసిష్ఠుడు ॥సూ॥ త్ర్యహందివా భుఞ్జీత నక్తమ త్ర్యహంచ త్ర్యహంత్ర్యహమయాచిత వ్రతంత్ర్యహంనభుఞ్జీత ఆపస్తంబములు॥ “శ్లో” త్ర్యహమునక్తాశీ దివాశీచ తతస్త్ర్యహం। త్ర్యహమయాచిత వ్రతస్త్ర్యహంనాశ్నాతి కించన॥ ఇతికృచ్ఛ్రోద్వాదశరాత్రస్యవిధిః॥ అపరంచ-దివాదినత్రయం సాయంసంధ్యాయామతీతాయాం దినత్రయంభుంజీతాన్యద్దినత్రయమయాచితం తావదన్నం భుంజీత శేషంచ దినత్రయమనశ్నీయాత్” ఈస్మృతులకన్నిటికి నొకటే మొదటవ్రాసినదేయర్థము-ఇందును కబళములసంఖ్యయు పరిమాణమును పరాశరునిచేజెప్పబడెను॥ శ్లో॥ “సాయం ద్వావింశతిగ్రాసాః ప్రాతష్షడ్వింశతి స్తథా। అయాచితే చతుర్వింశత్ పరంచానశనంస్మృతం॥ కుక్కుటాండప్రమాణంచ యావాంశ్చప్రవిశేన్ముఖం। ఏతంగ్రాసంవిజానీయాత్ శుద్ధ్యర్థంగ్రాసశోధనం। హవిష్యంచాన్న మశ్నీయాద్యథారాత్రౌ తథాదివా। త్రీంస్త్రీన్యహాని శాస్త్రీయాన్ గ్రాసాన్ సంఖ్యాకృతాన్యథా। అయాచితం తథైవాద్యాదుపవాసస్త్ర్యహంభవేత్” రాత్రియందు ముప్పదిరెండును పగటియందిరువదియారును నయాచితమిరువదినాలుగును కబళములనుదినవలెను మూడుదినములుపవసింపవలెను నోరుపట్టినంతకబళమదియు కుక్కుటాండప్రమాణమని తెలియవలెను ఈగ్రాసశోధశుద్ధికగును ఇదిన్నిహవిష్యాన్నము రాత్రియెటులో పగలునట్టే దినవలెను మూడురాత్రులను మూడుపగళ్ళనున్న మూడుదినములయాచితమునున్ను శాస్త్రీయమగుపరిమాణముసంఖ్యయును గావలెను మూడుదినములుపవసింపవలెను॥ ౨౧౨॥

మూ॥ గోమూత్రం గోమయంక్షీరం దధిసర్పిః కుశోదకం।
ఏకరాత్రోపవాసశ్చ కృచ్ఛ్రం సాంతపనంస్మృతం॥ ౨౧౩॥

ఆవుయొక్కపంచితము పేడయు పాలును పెరుగున్ను నెయ్యిన్ని కుశోదకమున్ను కలిపి యొకదినమందు ద్రావి మరునాడుపవసించేనేని సాంతపనమని చెప్పబడెను మరియునీయారు నొక్కొక్కదినమందొక్కొక్కటి ద్రావుచునుండి యేడవదినమందుపవసించెనేని మహాసాంతపనమని చెప్పబడెను॥ శ్లో॥ “కుశోదకంచ గోక్షీరందధిమూత్రంశకృద్ఘృతం। జగ్ధ్వాపరేహ్న్యుపవసేత్కృచ్ఛ్రంసాంతపనంచరన్॥ పృథక్సాంతపనంద్రవ్యైః షడహస్సోపవాసికః। సప్తాహేనతు కృచ్ఛ్రోయం మహాసాంతపనంస్మృతం” గవ్యపంచకమును కుశోదకమును నారింటినిం గలిపి యొకదినమందు ద్రావి మరునాడుపవసించెనేని సాంతపనమనియారునారు దినములను ద్రావి మరు

నాడుపవసించిన మహాసాంతపనమని పరాశరులుజెప్పిరి॥ ౨౧౨॥

మూ॥ ఏకైకం గ్రాసమశ్నీయాత్ త్ర్యహాణి త్రీణిపూర్వవత్।
త్ర్యహంచోపవసేదంత్య మతికృచ్ఛ్రంచరన్ ద్విజః॥౨౧౩॥

అతికృచ్ఛ్రమును జేయుచునుండెనేని సాయంప్రాతఃకాలములందను నయాచితాదిప్రాప్తముగనన్నమునుదినమునకొకకకబళముచొప్పునదొమ్మిదిదినములుశాస్త్రీయప్రకారముగదిని మూడుదినములుపవసించవలెను॥ ౨౧౩॥

మూ॥ తప్తకృచ్ఛ్రం చరన్విప్రో జలక్షీర ఘృతానిలాన్।
ప్రతిత్ర్యహం పిబేదుష్ణాన్ సకృత్స్నాయీ సమాహితః॥౨౧౪॥

తప్తకృచ్ఛ్రమునాచరించిన విప్రుడుసమాహితుడై వేడిగల జలక్షీర ఘృతానిలములనుప్రత్యేకముగ మూడేసిదినములు దావవలెను దినమునకొకటి మారేస్నానమాడవలెను దీనికిపరాశరుడువిశేషముజెప్పెను॥ "శ్లో॥ షట్పలంతుపిబేదంభ స్త్రిపలంతుపయఃపిబేత్। పలమేకంపిబేత్సర్పి స్తప్తకృచ్ఛ్రంవిధీయతే" యనిజలమారుపలములును పాలుమూడుపలములు నేయొకపలముద్రావిన తప్తకృచ్ఛ్రమగునని॥౨౧౪॥

మూ॥ యతాత్మనో ప్రమత్తస్యద్వాదశాహమభోజనం।
పరాకోనామకృచ్ఛ్రోయం సర్వపాపాపనోదనః॥ ౨౧౫॥

నియతచిత్తుడునప్రమత్తుడునై పదిరెండుదినములుపవసించిన పరాకమనెడికృచ్ఛ్రమగునిది గురులఘుతారతమ్యముచే స్వల్పదసకృత్తారతమ్య మూహించవలెనుఇదిసర్వపాపములనున్ను బోగొట్టును॥ ౨౧౫॥

మూ॥ ఏకైకంహ్రాసయేత్పిండం కృష్ణేశుక్లేచవర్ధయేత్।
ఉపస్పృశంస్త్రిషవణ మేతచ్చాంద్రాయణంస్మృతం॥౨౧౬॥

సాయంప్రాతర్మధ్యాహ్నకాలమందు స్నానమొనరుచుచు పూర్ణిమనాడు పదేనుకబళములుదిని కృష్ణప్రతిపదమొదలుగదినమునకొకకగ్రాసముతరగతిని కృష్ణచతుర్దశి యందొక కబళముదినియమావాస్యనాడుపవసించి శుద్ధప్రతిపదమొదలొకటి విదియనాడు రెండుసీరీతిని పౌర్ణమినాడు పదేను కబళములు దినవలెన దిపిపీలికామధ్యాఖ్యచాంద్రాయణము॥ ౨౧౬॥

మూ॥ ఏవ మేవవిధిం కృత్స్న మాచరే ద్యవమధ్యమే ।
శుక్ల పక్షాది నియత శ్చరంశ్చాంద్రాయణం వ్రతం॥౨౧౭॥

ఈపైనిచెప్పిన ప్రకారమే త్రిషవణస్నానగ్రాసహ్రాసవృద్ధ్యాద్యాత్మకమగు విధి, యవమధ్యచాంద్రాయణము శుక్లప్రతిపదాదిగ జేయవలెను శుక్లప్రతిపదనాడొక గ్రాసమిట్లొకొక్కటివృద్ధిగా పూర్ణిమనాడు పదేను గ్రాసములు దిని కృష్ణప్రతిపదాదిగా నొక్కొక్కటి తగ్గించిన నమావాస్యనాడుపవాసమగుచున్నది॥ ౨౧౭॥

మూ॥ అష్టావష్టౌ సమశ్నీయా త్పిండాన్మధ్యందినే స్థితే ।
నియతాత్మా హవిష్యాశీ యతిచాంద్రాయణం చరన్॥౨౧౮॥

యతిచాంద్రాయణమాచరించువాడుశుక్లపక్షమందైన కృష్ణపక్షమందైన ప్రారంభించి ప్రతిదినమును మధ్యాహ్నమందెనిమిదికబళములునియతచిత్తుడైహవిస్సుభక్షించవలెను మధ్యందినమని చెప్పడము గృహస్థబ్రహ్మచారులకు రాత్రిభోజననిషేధార్థము॥ ౨౧౮॥

మూ॥ చతురః ప్రాతరశ్నీయా త్పిండాన్ విప్ర స్సమాహితః।
చతురో స్తమితే సూర్యే శిశుచాంద్రాయణం స్మృతం॥౨౧౯॥

పొద్దుటనెనాలుగు కబళములును సూర్యుడ స్తమించిన నాలుగు కబళములును దినిన శిశుచాంద్రాయణమని మునులచే జెప్పబడెను॥ ౨౧౯॥

మూ॥ యథా కథంచి త్పిండానాం తిస్రోశీతి స్సమాహితః ।
మాసేనాశ్నన్ హవిష్యస్య చంద్రస్యైతి సలోకతాం॥౨౨౦॥

నీవారాదిహవిష్యాన్నము మాసమున కిమ్నూటనలుబదికబళము లేదినసమందెన్ని దినిన నుపవసించినను నెలనాటికెన్ని కబళములు మాత్రము దిని యుండిన చంద్రసాలోక్యము గలుగును॥ ౨౨౦॥

మూ॥ ఏతద్రుద్రా స్తథాదిత్యా వసవశ్చా చరన్ వ్రతం ।
సర్వా కుశల మోక్షాయ మరుతశ్చ మహర్షిభిః॥౨౨౧॥

ఈచాంద్రాయణవ్రతము వసురుద్రాదిత్యులును మరత్తులును మహర్షులతో

గూడ సర్వపాపనాశార్థము గురులఘుపాపాపేక్షచే సకృదావృత్తిప్రకారము గా జేసిరి॥ ౨౨౧॥

మూ॥ మహావ్యాహృతిభి ర్హోమః కర్తవ్య స్సర్వమన్వహం ।
అహింసాం సత్యమక్రోధ మార్జవంచ సమాచరేత్॥౨౨౨॥

"భూః-భువః-సువః" ఈమంత్రములచేత।"శు్రి॥ ఆజ్యంవిరనాదేశే జుహోతిషు విధీయతే।" యనుపరిశిష్టవచనముచే నేయిప్రత్యహమున్ను హోమము జేయవలెను అహింసయు సత్యము నక్రోధము నకౌటిల్యమును గావలెను- ఇవిపురుషార్థము లుగా జెప్పబడినవే యైనను వ్రతాంగములుగా నుపదేశించబడెను॥ ౨౨౨॥

మూ॥ త్రిరహ్నస్త్రి నిశాయాశ్చ సవాసా జలమావిశేత్ !
స్త్రీశూద్ర పతితాంశ్చైవ నాభిభాషేత కర్హిచిత్॥౨౨౩॥

రాత్రియందైనను పగటియందైనను ఆదిమధ్యాంతములయందు సచేలస్నానము కావలెను ఇదిపిపీలికామధ్యయవమధ్యచాంద్రాయణేతరచాంద్రాయణ విషయము వారితో వ్రతసమాప్తిపర్యంతమును సంభాషించరాదు॥ ౨౨౩॥

మూ॥ స్థానాసనాభ్యాం విహరే ద్దశక్తోధశ్శయీత వా ।
బ్రహ్మచారీ వ్రతీచస్యా ద్గురుభాషేత కర్హిచిత్॥౨౨౪॥

అహోరాత్రములు కూచుండియుండవలెను బరుండరాదు కూచుండుటకు శక్తిలేకుండెనేని స్థండిలమందు బరుండవలెను గాని మంచము మొదలగువాటియందు గూడదు స్త్రీసంగరహితుడును॥ "శ్లో॥ పాలాశంధారయే ద్దండం శుచిమౌంజీచ మేఖలా" మనియమవచనముచేమౌంజీపాలాశదండములనుధరించవలెనుగురుదేవబ్రాహ్మణులను బూజించవలెను॥ ౨౨౪॥

మూ॥ సావిత్రీంచ జపేన్నిత్యం పవిత్రాణిచశక్తితః ।
సర్వేష్వేవ వ్రతేష్వేవం ప్రాయశ్చిత్తార్థమాదృతః॥ ౨౨౫॥

గాయత్రీజపమున్ను పవిత్రములగు నఘమర్షణాదిమంత్రముల జపమును జేయవలెను- అదిన్ని చాంద్రాయణమందునుంబలె ప్రాజాపత్యాదులందునున్ను ప్రాయశ్చిత్తార్థముగా జేయవలెను॥ ౨౨౫॥

మూ॥ ఏతైర్ద్విజాతయశ్శోధ్యా వ్రతైరావిష్కృతైనసః।
అనావిష్కృతపాపాంస్తు మంత్రైర్హోమైస్తు శోధయేత్॥ ౨౨౬॥

రోగాదికముచే పోల్చబడినపాపముగలవారికిని చెప్పబడిన ప్రాయశ్చిత్తముచే పరిషత్ప్రాజ్ఞులు శుద్ధులనుగా జేయవలెను బ్రకటించబడని పాపములుగలవారినిమంత్రములచేతనున్ను హోమములచేతనున్ను పరిషత్తు శోధించవలెను చేసినపాపమును చెప్పినంగదపరిషత్తుశుద్ధినొసఁగునట్లునుండలియకుండిన నెట్లగునని సామాన్యమగుశంకతో విరోధములేదు॥ ౨౨౬॥

మూ॥ ఖ్యాపనేనానుతాపేన తపసాధ్యయనేనచ।
పాపకృన్ముచ్యతేపాపా త్తథాదానేనచాపది॥ ౨౨౭॥

ఈపాపమునుజేసినపాపకర్ముఁడనని పాపమును బ్రకటించుటచేతనున్ను పశ్చాత్తాపముచేతనున్ను నుగ్రమగుతపస్సుచేతనున్ను సావిత్ర్యాదిమంత్రజపముచేతనున్ను తపంబునకశక్తుఁడేని దానముచేతనున్ను పాపవిముక్తుఁడగును ఖ్యాపనము ప్రకాశప్రాయశ్చిత్తాంగము అనుతాపము ప్రకాశరహస్యములకు రెండింటికిసంగము॥

మూ॥ యథాయథానరోధర్మం స్వయంకృత్వానుభాషతే।
తథాతథాత్వచేవాహి స్తేనాధర్మేణ ముచ్యతే॥ ౨౨౮॥

ఏయేప్రకారముగ నరుఁడు పాపము నొనర్చి ప్రకటించునో ఆయాప్రకారముగ పాపముపొరవలన పామువలెను పాపమువలన విముక్తుఁడగును ఇది ఖ్యాపనకనువాదము॥

మూ॥ యథాయథామనస్తస్య దుష్కృతం కర్మగర్హతి।
తథాతథాశరీరంతత్తేనాధర్మేణముచ్యతే॥ ౨౨౯॥

ఆపాపకర్ముని మనస్సునకు పాపమునందు నిందతోఁచిన కొద్దియు నాజీవాత్ముఁడాయధర్మమువలన క్రమముగ ముక్తుఁడగును ఇది రహస్యకృతపాపప్రాయశ్చిత్తానుతాపానువాదము॥ ౨౨౯॥

మూ॥ కృత్వాపాపంహి సంతప్య తస్మాత్పాపాత్ప్రముచ్యతే।
నైవంకుర్యాం పునరితి నివృత్యాపూయతేతుసః॥ ౨౩౦॥

పాపమొనర్చినవాఁడు పశ్చాత్తాపమునుపొందెనేని వానిపాపముబోవును

మరియెప్పుడు నిటులఁజేయనని యనుదపించెనేని మఱికి శుద్ధుఁడగును॥ ౨౨౯॥

మూ॥ ఏవంసంచింత్య మనసా ప్రేత్యకర్మఫలోదయం।
మనోవాఙ్మూర్తిభిర్నిత్యం శుభంకర్మ సమాచరేత్॥ ౨౩౦॥

ఇట్లు కర్మఫలమిష్టానిష్టరూపమిచ్చటనేమి పరమందేమియిచ్చునని మనస్సులో విచారించి శుభకర్మమునే జేయవలెను శుభఫలమగును గావున నరకాదిహేతువగు నసత్కర్మమును జేయరాదు॥ ౨౩౦॥

మూ॥ అజ్ఞానాద్యదివిజ్ఞానా త్కృత్వాకర్మవిగర్హితం।
తస్మాద్విముక్తిమన్విచ్ఛన్ ద్వితీయంనసమాచరేత్॥ ౨౩౧॥

తెలిసియైన దెలియకనైనం బాపకర్మమునొనరించి యాపాపము బోఁగొట్టను పాయము దలఁచుచు మరలఁజేయరాదు మరలఁజేసినం బ్రాయశ్చిత్తగౌరవార్థమీ వచనము॥ "శ్లో॥ విధేః ప్రాథమికాదస్మాద్ద్వితీయేద్విగుణంభవేత్॥" ఇతి దేవలుఁడు॥ ౨౩౨

మూ॥ యస్మిన్కర్మణ్యస్య కృతేమనసస్స్యాదలాఘవం।
తస్మింస్తావత్తపఃకుర్యా ద్యావత్తుష్టికరంభవేత్॥ ౨౩౩॥

ఎవఁడే పాపమునకు ప్రాయశ్చిత్తముఁజేసునో దానిచే మనస్సంతుష్టియైన దనుకంజేసినచిత్తప్రసాదముచే శుద్ధుఁడగును॥ ౨౩౩॥

మూ॥ తపోమూలమిదంసర్వం దైవమానుషకంసుఖం।
తపోమధ్యంబుధైః ప్రోక్తం తపోంతం వేదదర్శిభిః॥ ౨౩౪॥

దేవతలయొక్కయు మనుష్యులయొక్కయు సుఖమేది గలదో యదియెల్లను తపంబు మూలముగాఁ బ్రాప్తమయినదే యాసుఖముయొక్కస్థితికిని తపస్సే హేతువని పరితినియత దేవాదిజన్మములకు కారణము తపస్సేయని వేదవేత్తలచే జెప్పఁబడెను కృచ్ఛ్రచాంద్రాయణాదికముతపస్సు దీనిప్రశంసార్థమీవచనము॥ ౨౩౪॥

మూ॥ బ్రాహ్మణస్య తపోజ్ఞానం తపఃక్షత్రస్య రక్షణం।
వైశ్యస్యతు తపోవార్తా తపశ్శూద్రస్య సేవనం॥ ౨౩౫॥

బ్రాహ్మణునకు బ్రహ్మచర్యాశ్రమవేదాంతజ్ఞానమున్ను క్షత్రియునకు బ్రజారక్ష

ణముసున్న వైశ్యునకు కృషివాణిజ్యపాశుపాల్యములున్ను శూద్రునకు బ్రాహ్మణ సేవయున్ను తపస్సులని వర్ణభేదములచే తపోవిశేషము చెప్పబడెను॥ ౨౩౫॥

మూ॥ ఋషయ స్సంయతాత్మానః ఫలమూలానిలాశనాః।
తపసైవ ప్రపశ్యంతి త్రైలోక్యం సచరాచరం॥ ౨౩౬

ఋషులు త్రికరణశుద్ధిగా ఫలమూలవాయుభక్షణాదులచే నియతులై జంగమ స్థావరాత్మకములగు లోకత్రయమునొకచోటనుండియె సవిశేషముగ జూచుచున్నారు నిష్పాపాంతఃకరణులుగావున॥ ౨౩౬॥

మూ॥ ఔషధాన్యగదోవిద్యా దైవీచ వివిధాస్థితిః।
తపసైవ ప్రసిధ్యంతి తపస్తేషాంహి సాధనం॥ ౨౩౭॥

మందులున్ను నారోగ్యమున్ను బ్రహ్మజ్ఞానమున్ను దేవతారూపముచే నానా పుణ్యలోకములందునికియునీటికన్నింటికిని తపస్సే సాధనము॥ ౨౩౭॥

మూ॥ యద్దుస్తరం యద్దురాపం యద్దుర్గం యచ్చదుష్కరం।
సర్వంహి తపసాసాధ్యం తపోహి దురతిక్రమం॥ ౨౩౮॥

గ్రహచారాదిసూచితమగు నాపత్తి యేదికష్టముచేనయినం దాటశక్యముగానిదో యదిదుస్తరము యదిదుఃఖముచేనయిన పొందశక్యముగానిదో క్షత్రియాదులీ శరీరముచేతనే బ్రాహ్మణత్వాదికము దురాపము యేదిదుఃఖముచేనయిన బొందరానిదో మేరుపర్వతాగ్రాదికమిది దుర్గమము యేదిదుఃఖముచేనయిన జేయశక్యముగానిదో బహుగోప్రదానాదికమిది యంతయుగావడమునకు సాధనముతపస్సే తపంబుననివియన్నియు సాధ్యములగుచున్నవి ఇదితపోమహిమానువర్ణనము॥

మూ॥ మహాపాతకినశ్చైవ శేషాశ్చా కార్యకారిణః।
తపసైవసుతప్తేన ముచ్యంతే కిల్బిషా త్తతః॥ ౨౩౯॥

బ్రహ్మహాదులగు మహాపాతకులున్ను గోహత్యాద్యుపపాతకవంతులునునింక నకార్యకర్తలును తపస్సుచేతనే తత్తత్పాపములవలన విముక్తులగుచున్నారు ఇది పూర్వోక్తమైనను శ్రాయశ్చిత్తస్తుత్యర్థము॥ ౨౩౯॥

మూ॥ కీటాశ్చాహిపతంగాశ్చ పశవశ్చ వయాంసిచ।
స్థావరాణిచ భూతాని దివంయాంతి తపోబలాత్॥ ౨౪౦॥

పాములు పురుగులు మిడతలు పశువులు పక్షులు తరుగుల్మలతాదులు బద్ధములగునీభూతములన్నియును దపోమహిమంజేసి స్వర్గంబునొందును కపోతోపాఖ్యానాదులగు నితిహాసములందు పక్షులకగ్నిప్రవేశమును కీటాదులకు తత్తజ్జాతీయములకుసమానము నివేతపస్సులనిజెప్పబడెను వీటిచే పాపముక్షీణించిన జన్మాంతరసుకృతముచే పుణ్యలోకములనొందును॥ ౨౪౦॥

మూ॥ యత్కించిదేనః కుర్వంతి మనోవాఙ్మూర్తిభిర్జనాః।
తత్సర్వం నిర్దహంత్యాశు తపసైవ తపోధనాః॥ ౨౪౧॥

తపస్సునే ధనమునుంబలె రక్షించువారు తపోధనులు మనోవాక్కాయకర్మములు నించుకైనంజేయబడ్డి పాపమును తపంబుచేతనె నశింపంజేతురు॥ ౨౪౧॥

మూ॥ తపసైవ విశుద్ధస్య బ్రాహ్మణస్య దివౌకసః।
ఇజ్యాశ్చ ప్రతిగృహ్ణంతి కామాన్ సంవర్ధయంతిచ॥ ౨౪౨॥

ప్రాయశ్చిత్తముచే క్షీణపాపుడగు బ్రాహ్మణుడొనర్చిన యాగమందె హవిస్సులను దేవతలుస్వీకరింతురు కోరికలనుం గురిపింతురు॥ ౨౪౨॥

మూ॥ ప్రజాపతిరిదం శాస్త్రం తపసైవాసృజత్ప్రభుః।
తథైవవేదాన్ ఋషయ స్తపసైవ ప్రపేదిరే॥ ౨౪౩॥

హిరణ్యగర్భుడు సృష్ట్యాదులప్రభువై తపస్సుచేతనే ఈగ్రంథమును రచించెను వసిష్ఠాదులును తపస్సుచేతనే మంత్రజ్ఞులై వేదమునుగుర్తెరిగిరి॥ ౨౪౩॥

మూ॥ ఇత్యేతత్తపసో దేవా మహాభాగ్యం ప్రచక్షతే।
సర్వస్యాస్య ప్రపశ్యంత స్తపసః పుణ్యముత్తమం॥ ౨౪౪॥

సకలభూతకోటిన్ని దుర్లభమగు నీజన్మము తపస్సుయొక్క ప్రకాశనుచేతనే యని దేవతలు తపస్సు మహాభాగ్యమనిన్ని యెన్నికచేసిపలుకుదురు॥ ౨౪౪॥

మూ॥ వేదాభ్యాసోన్వహం శక్త్యా మహాయజ్ఞక్రియాక్షమా।

నాశయంత్యాశు పాపాని మహాపాతకజాన్యపి॥ ౨౪౫॥

నిత్యమున్ను యథాశక్తిగా వేదాధ్యయనమున్ను పంచయజ్ఞములున్ను నపరాధము సహించుటయు నివిమహాపాతకములనయినంబోద్రోయు నింక నన్యములన్ను జెప్పనేల॥ ౨౪౫॥

మూ॥ యథైధస్తేజసావహ్నిః ప్రాప్తం నిర్దహతి క్షణాత్।
తథాజ్ఞానాగ్నినాపాపం సర్వం దహతి వేదవిత్॥ ౨౪౬॥

అగ్నితనయందుబడిన కర్రలను స్వతేజస్సుచే తత్క్షణమె యెట్లునిశ్శేషముగా దహించునో యట్లు వేదాంతార్థజ్ఞానసంపన్నుడు జ్ఞానముచే నఖిలపాపములనున్ను నిర్మూలముగ జేయును యిది పరమార్థజ్ఞానముచే పాపక్షయమగుననిజ్ఞాపనార్థము॥ ౨౪౬॥

మూ॥ ఇత్యేతదేనసాముక్తం ప్రాయశ్చిత్తం యథావిధి।
అతఊర్ధ్వం రహస్యానాం ప్రాయశ్చిత్తం నిబోధత॥ ౨౪౭॥

ఈప్రకాశకృతములగు బ్రహ్మహత్యాదిపాపములకు యథావిధిగా ప్రాయశ్చిత్తము జెప్పబడెను రహస్యకృతములగు పాపములకు ప్రాయశ్చిత్తము చెప్పబడును ఈశ్లోకము మేధాతిథి ప్రభృతులు వ్రాసిరిగాని గోవిందరాజువ్రాయలేదు॥

మూ॥ సవ్యాహృతిప్రణవకాః ప్రాణాయామాస్తు షోడశ।
అపిభ్రూణహణంమాసాత్పునంత్యహరహఃకృతాః॥ ౨౪౮॥

ప్రణవవ్యాహృతియుక్తముగ గాయత్రీమంత్రము శిరస్సుతోగూడదీనిచే పదారు ప్రాణాయామము ప్రతిదినము నొక్కొక నెలజేసిన బ్రహ్మహత్యాసమపాపములును నశించును ద్విజులకె యీప్రాయశ్చిత్తము॥ ౨౪౮॥

మూ॥ కౌత్సంజప్త్వాపఇత్యేతద్వాసిష్ఠంచ ప్రతీత్యృచం।
మాహిత్రం శుద్ధవత్యశ్చ సురాపోపివిశుద్ధ్యతి॥ ౨౪౯॥

శు॥ "అపనశ్శోశుచదఘ" మనెడి సూక్తమున్ను "శ్రు॥ ప్రతిస్తోమేభిరుషసంవసిష్ఠ" మనుఋక్కున్ను "మహిత్రీణామవోస్తు" అనుసూక్తమున్ను "శుద్ధవ" త్యయనుమూడుఋక్కులనున్ను మాసము ప్రతిదినమున్ను పదారుమారులు జపించి సు

ర్గాఫాయియైన శుద్ధుడగును॥ ౨౪౯॥

మూ॥ సకృజ్జప్త్వాఽస్యవామీయం శివసంకల్పమేవచ।
అపహృత్యసువర్ణంతు క్షణాద్భవతినిర్మలః॥ ౨౫౦॥

"శ్రు॥ అస్యవామీయప్రణీతస్య" యను సూక్తమున్ను శివసంకల్పమున్ను "యజ్జాగ్రతోదూర" మనెడివాజసనేయకమందు బఠించబడిన మంత్రమునున్నొకమాసమనుదినము నొకరువారమేకరించి స్వర్ణస్తేయదోషమువలన నప్పుడే శుద్ధుడగును॥ ౨౫౦॥

మూ॥ హవిష్యంతీయమభ్యస్య నతమంహఇతీతిచ।
జపిత్వా పౌరుషం సూక్తం ముచ్యతె గురుతల్పగః॥ ౨౫౧॥

"శ్రు॥ హవిష్యాంగమజర" మనుబుక్కున్ను "నతమంహోదురిత" మనుశివసంకల్పసూక్తమునున్ను "సహస్రశీర్షాపురుష" యనుపురుషసూక్తమునున్ను ప్రత్యహమును పదారుమారులుచొప్పున నెలజపించి గురుతల్పగత్వపాపమువలనశుద్ధుడగును॥

మూ॥ ఏనసాం స్థూలసూక్ష్మాణాం చికీర్షన్నపనోదనం।
అవేత్యృచం జపేదబ్దం యత్కించేదమితీతివా॥ ౨౫౨॥

మహాపాతకోపపాతకాదులను బోదో్యందలచెనేని॥ "శ్రు॥ అవతేహేలోవరుణమో" రనుబుక్కున్ను "యత్కించిదిదం వరుణదైవ్యేజలఇతి" యను బుక్కున్ను "ఇతిమేమనః" యను సూక్తమున్ను నొక సంవత్సరము ప్రత్యహమును జపించవలెను॥ ౨౫౨॥

మూ॥ ప్రతిగృహ్యా ప్రతిగ్రాహ్యం భుక్త్వాచాన్నం విగర్హితం।
జపం స్తరత్సమందీయం పూయతె మానవస్త్ర్యహాత్॥ ౨౫౩॥

మహాపాతకిత్వాదికముచే నప్రతిగ్రాహ్యధనులగు. వారివలన ప్రతిగ్రహించిన్ని స్వభావకాల పరిగ్రహ సంసర్గాది దుష్టమగు నన్నమును భక్షించిన్ని॥ "శ్రు॥ తరత్సమందిధావతి" యను నాలుగు బుక్కులను మూడురోజులు జపించిన్ని స్నానమర్యమామను మూడుబుక్కులనైన జపించి శుద్ధుడగును॥ ౨౫౩॥

మూ॥ సోమరౌద్రంతు బహ్వేనా మాసమభ్యస్య శుధ్యతి।

స్రవంత్యా మాచరన్ స్నానమర్యమ్ణామితి చ త్ర్యృచం॥ ౨౫౪॥

"శ్రు॥ సోమారుద్రా ధారయేథా మస్స" యను నాల్గు ఋక్కులనున్ను "అర్యమా వరుణంమిత్ర" మను రెండుఋక్కులను నదీస్నానము జేయుచు నొక మాసము ప్రత్యేకమభ్యసించి బహుపాపకర్ముడైనను శుద్ధుడగును అనేక పాపములకు తంతనుచే నీప్రాయశ్చిత్తనుగునని జ్ఞాపకార్థమీవచనము॥ ౨౫౪॥

మూ॥ అబ్దార్ధమింద్ర మిత్యేత ద్దేనస్వీస ప్తకం జపేత్ ।
అప్రశస్తంతు కృత్వాప్సు మాసమాసీత భైక్షభుక్॥ ౨౫౫॥

ఏపపాము జేసినవాడున్ను "శ్రు॥ఇంద్రంమిత్రం వరుణ" మను ఋక్కులనేడింటిని యారుమాసములు జపించవలెను జలమందు మూత్రపురీషోత్సర్జనము జేసిన పాపము వలన శుద్ధుడగునొకమాసము భిక్షాన్నము దినవలయును॥ ౨౫౫॥

మూ॥ మంత్రై శ్శాకలహోమీయై రబ్దం హుత్వా ఘృతం ద్విజః।
సుగుర్వప్యపహంత్యేనో జప్త్వావా నమ ఇత్యృచం॥ ౨౫౬॥

"శ్రు॥దేవకృతస్య" యనునది మొదలగు మంత్రముచే నొకసంవత్సర మన్నహోమును ఘృతహోమమొనర్చియైనను "నమఇంద్రశ్చ" యనుఋక్కు నొక యేడు జపించియైనను ద్విజుడు మహాపాతకమునైనను బోద్రోయును॥ ౨౫౬॥

మూ॥ మహాపాతక సంయుక్తో నుగచ్ఛేద్గా స్సమాహితః ।
అభ్యస్యాబ్దం పావమానీ ర్భైక్షాహారో విశుద్ధ్యతి॥ ౨౫౭॥

బ్రహ్మహత్యాదిమహాపాతకయుక్తుడైనను భిక్షాన్నము దింటు నొకసంవత్సరము జితేంద్రియుడై గోవులను సంచరించుచు పావమానిఋక్కులను నిత్యాభ్యాసమొనర్చెనేని శుద్ధుడగును॥ ౨౫౭॥

మూ॥ అరణ్యేవా త్రిరభ్యస్య ప్రయతో వేదసంహితాం।
ముచ్యతే పాతకై స్సర్వైః పరాకై శ్శోధితస్త్రిభిః॥ ౨౫౮॥

మూడుపరాకములచే పవిత్రుడై మంత్రబ్రాహ్మణాత్మకయగు సంహితను దా

తకములనైన నశింపజేయును॥   ౨౫౮॥

మూ॥ త్ర్యహంతూపవసే ద్యుక్త స్త్రిరహ్నో భ్యుపయన్నపః।
ముచ్యతే పాతకైః స్సర్వై స్త్రిర్జపిత్వాఘ మర్షణమ్॥ ౨౫౮॥

మూడు రాత్రులుపవసించి నియతచిత్తుడై త్రిషవణస్నానమొనర్చుచు "ఋతంచ సత్యంచ" యనునట్టి యఘమర్షణమంత్రము నుదకమందుమునిఁగియుండి ముమ్మారు జపించిన సర్వపాపంబుల వలనను విముక్తుడగును॥   ౨౫౯॥

మూ॥ యథాశ్వమేధః క్రతురా ట్సర్వపాపాపనోదనః।
తథాఘమర్షణం సూక్తం సర్వపాపాపనోదనం॥ ౨౬౦॥

ఎట్లు క్రతురాట్టగు నశ్వమేధమఖిలపాపములను నశింపజేయునో యట్లఘమర్షణము మంత్రములలో రాజు సకల పాపములనున్ను నశింపజేయును॥   ౨౬౦॥

మూ॥ హత్వా లోకానపీమాం స్త్రీ నశ్నన్నపి యత స్తతః।
ఋగ్వేదం ధారయ న్విప్రో నైనః ప్రాప్నోతి కించన॥ ౨౬౧॥

భూరాది లోకత్రయమును నశింపజేసినవాడైనను మహాపాతకాది దూషితాదుల యన్నమును దినినవాడైనను ఋగ్వేదము నభ్యసించిన ద్విజుడొకించుకైనను పాపము నొందడు ఋగ్వేదము రహస్యప్రాయశ్చిత్తార్థము జెప్పబడెను రహస్యపాపహరణార్థము ఋక్సంహితాబ్రాహ్మణము లభ్యసించవలెనని జెప్పుచున్నాడు॥ ౨౬౧॥

మూ॥ ఋక్సంహితాం త్రిరభ్యస్య యజుషాంవా సమాహితః।
సామ్నాంవా సరహస్యానాం సర్వపాపైః ప్రముచ్యతే॥ ౨౬౨॥

మంత్రబ్రాహ్మణాత్మకమగు ఋగ్వేదమునైనను అటులే యజుర్వేదమునైనను మంత్రోపనిషత్సహితమగు సామవేదమునైనను ముమ్మారుపఠించిన సర్వపాపముక్తుడగును॥   ౨౬౨॥

మూ॥ యథా మహాహ్రదం ప్రాప్య క్షిప్తం లోష్టంవినశ్యతి।
తథా దుశ్చరితం సర్వం వేదేత్రివృతి మజ్జతి॥ ౨౬౩॥

ఋగాదిస్వరూపముచే ముమ్మారావర్తించునుగాన త్రివృతయనబడునట్టి వే

దమందు నిఖిలపాపములును హ్రదమందుబడిన జెడ్డనశించినట్లు నశించును త్రివృ ల్లక్షణమును జెప్పచున్నాడు॥ ౨౬౩

మూ॥ ఋచోయజూంషి చాన్యాని సామాని వివిధానిచ।
ఏషజ్ఞేయ స్త్రివృద్వేదో యోవేదైనంసవేదవిత్॥ ౨౬౪॥

ఋఙ్మంత్రములున్ను యజుర్వేదమంత్రములున్ను బృహద్రథంతరము మొదలగు నానాప్రకారములగు సామములున్ను యింకనితరములున్ను యీమూడువేదములయొక్క వేరువేరగుమంత్రబ్రాహ్మణములున్ను త్రివృద్వేదములని తెలియవలయును యిట్టిదీని నెవ్వడు తెలుసుకొనునో వాడువేదవేత్తయగుచున్నాడు॥ ౨౬౪॥

మూ॥ ఆద్యంయత్త్ర్యక్షరంబ్రహ్మ త్రయీయస్మిన్ ప్రతిష్ఠితా।
సగుహ్యోన్యస్త్రివృద్వేదో య స్తంవేదస వేదవిత్॥

ఇతిమానవే ధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాంసంహితాయాం
ఏకాదశోధ్యాయః.

సకలవేదములకు నాదిభూతమైనదిగనుకనే వేదసారమున్ను అకారోకార మకారాత్మకమై వేదత్రయాస్పదమైన బ్రహ్మప్రతిపాదకమగు ప్రణవమేదో యదిన్ని త్రివృత్సంజ్ఞికము పరమార్థాభిధాయకమగుటవలన ధారణజపములచే దీనినెవడుగుతెలుసుకొనునోయతడే వేదవేత్తయగుచున్నాడు॥ ౨౬౫

ఇచ్చట కుల్లూకభట్టొకశ్లోకమును లిఖించెను॥ "శ్లో॥ ప్రాయశ్చిత్తే బహుమునిమతాలోచనాద్యన్మయోక్తం సద్వ్యాఖ్యానంఖలుమునిగిరాం తద్బుధైర్వం గుణజ్ఞాః। నైతం మేధాతిథిరభిదధేనాపి గోవిందరాజో వ్యాఖ్యాతారోనజగురపరేప్యన్యతోదుర్లభంవః॥" ప్రాయశ్చిత్తవిషయమై బహుమునిమతములనాలోచించినాచేజేయబడిన వ్యాఖ్యానమేదో మునిమతసమ్మతమగు దానిని గుణజ్ఞులుఇట్టివ్యాఖ్యానమును మేధాతిథిగోవిందరాజాదులగు వ్యాఖ్యాతలుచెప్పలేదు గావున నిట్టిజ్ఞానమితరవ్యాఖ్యానములవలనమీకు దుర్లభమని॥

ఇది శ్రీమహామహీంబిడౌజ శ్రీమదానందగజపతిరాజ మహారాజ
దయాపాత్రభారద్వాజ సగోత్ర పవిత్రసుకవిజనవిధేయ
మండకామేశ్వర నామధేయ విరచితాంధ్ర
మన్వర్థదీపికాఖ్యయగువ్యాఖ్యయందు
ఏకాదశాధ్యాయము.



శ్రీరస్తు.

ఆంధ్రాన్వయార్థదీపికాసహితము.

# మనుస్మృతి * ద్వాదశాధ్యాయప్రారంభము.

మూ॥ చాతుర్వర్ణ్యస్య కృత్స్నోఽయముక్తో ధర్మస్త్వయానఘ।
కర్మణాంఫలనిర్వృత్తింశంసనస్తత్త్వతఃపరాం॥ ౧॥

ఓ పాపరహితుఁడా బ్రాహ్మణాదినాలుగు వర్ణములవారి యొక్కయు సంకర జాతులయొక్కయు ధర్మమంతయు నీచే జెప్పబడె నింకజన్మాంతరీయ శుభాశుభక ర్మఫలప్రాప్తిని యదార్థముగ మాకానతిమ్మని మహర్షులు భృగుమహా మునిన డిగిరి॥ ౧॥

మూ॥ సతానువాచ ధర్మాత్మా మహర్షీన్మానవోభృగుః।
అస్యసర్వస్యశృణుత కర్మయోగస్య నిర్ణయం॥ ౨॥

ధర్మప్రధానుండును మనుసంతానాత్మకుండునగు భృగుమహాముని యీసర్వ మునయొక్క కర్మములను జెప్పెదవినుండని జెప్పందొడంగె॥ ౨॥

మూ॥ శుభాశుభఫలంకర్మ మనోవాగ్దేహసంభవం।
కర్మజాగతయోనౄణా ముత్తమాధమమధ్యమాః॥ ౩॥

మనోవాక్కాయములు హేతువులు గాఁగలకర్మము విహితనిషిద్ధరూపమై సుఖ దుఃఖఫలముల నిచ్చునది ఆకర్మములవలననే మనుష్యతిర్యగాది భావముచే నుత్తమ మధ్యమాధమ జన్మాంతర సంప్రాప్తిమనుష్యునకగును ఇచ్చట కర్మమనఁగా శరీర కృతమేగాదు సదసత్సంకల్పరూపకమగు మానసికమున్ను గలదు॥ ౩॥

మూ॥ తస్యేహత్రివిధస్యాపిత్ర్యధిష్ఠానస్యదేహినః।
దశలక్షణయుక్తస్య మనోవిద్యాత్ప్రవర్తకం॥ ౪॥

ఆదేహసంబంధమైన యుత్తమాధమమధ్యమత్రివిధరూపమై మనోవాక్కాయ

యములనాశ్రయించునట్టిదై వక్ష్యమాణదశ లక్షణోపేతమగు కర్మమునకు మనస్సే ప్రవర్తకమని దెలియవలెను మనస్సుచే సంకల్పితమగునదే పలుకబడును జేయబడును॥ "శ్రు॥ తస్మాద్యత్పురుషోమనసాభిగచ్ఛతి తద్వాచావదతి తత్కర్మణాకరోతి" యనిదైత్తిరీయోపనిషత్తు దీని యర్థమును వ్రాయబడెను. ఆదశలక్షణములగు కర్మములను గనపరుచుచున్నాడు॥ ౪॥

మూ॥ పరద్రవ్యేష్వభిధ్యానం మనసానిష్టచింతనం ।
వితథాభినివేశశ్చ త్రివిధం కర్మమానసం॥ ౫॥

పరధనమునన్యాయముగా నెట్లైన నపహరింతునని చింతయు మనస్సుచే బ్రాహ్మణవధాదికములు జేయదలచుట పరలోకమన్నదిలేదు దేహమేయాత్మ యను నట్టియసద్గ్రహమీమూడు ప్రకారములగునశుభఫలకమగుమానసకర్మమున్నుయీ మూడింటికిని విపరీతమగు బుద్ధి శుభఫలకమగు మానసకర్మమున్ను శుభాశుభఫల కర్మమని రెండురూపములై ప్రకాశింతమగుటవలన త్రివిధమగు నిదిమానసిక కర్మము॥ ౫॥

మూ॥ పారుష్య మనృతంచైవ పైశున్యం చాపిసర్వశః ।
అసంబద్ధ ప్రలాపశ్చ వాఙ్మయం స్యాచ్చతుర్విధం॥ ౬॥

అప్రియముగ బలుకుట యసత్యమాడుట పరోక్షమందు పరదూషణము సత్యమైనదైనను రాజ దేశవార్తాదికము నిష్ప్రయోజనముగ జెప్పడను ఇదిచతుఃప్రకారమగు శుభఫలకమగు వాచికమగును ఏతద్విపరీతమగు ప్రియ సత్యపరగుణాభిధానమున్ను పురాణాదులందగు రాజాదిచరిత్రవర్ణనమున్ను శుభఫలకమగువాచనిక కర్మములునాల్గు విధములు॥ ౬॥

మూ॥ అదత్తానా ముపాదానం హింసాచైవా విధానతః ॥
పరదారోప సేవాచ శారీరంత్రి విధంస్మృతం॥ ౭॥

అన్యాయముగాపరద్రవ్యమును బుచ్చుకొనుటయు నశాస్త్రీయమగుహింసయు పరదారగమనము నీమూడుప్రకారములుగల యశుభఫలకమగు శారీరకర్మము ఏతద్విపరీతమగు శుభఫలకమైనత్రివిధశారీరకర్మము॥ ౭॥

మూ॥ మానసంమనసైవాయ ముపభుఙ్క్తే శుభాశుభం ।

వాచా వాచా కృతంకర్మ కాయేనైవచ కాయికం॥౮॥

మనస్సుచే జేయబడిన సుకృతదుష్కృతకర్మముల ఫలములగు శుభాశుభముల ను మనస్సు చేతనే యిచ్చటగాని పరజన్మమందుగాని వాడనుభవించును. ఇట్లువా క్కుచే జేయబడినకర్మముల శుభాశుభఫలరూపమగు మధురగద్గదభాషిత్వాదిక ము చేతనున్ను శారీరమగు శుభాశుభములు శరీరముచేతనే స్రక్చందనాది స్త్రీసం భోగవ్యాధిరూపమునున్ను ననుభవించును గావునకరణత్రయముచేతనున్ను దుష్టక ర్మముల జేయరాదు॥ ౮॥

మూ॥ శరీరజైః కర్మదోషై ర్యాతి స్థావరతాం నరః।
వాచికైః పక్షిమృగతాం మానసైరంత్యజాతితాం॥ ౯॥

శారీరమగు పాపమధికమై శుభముస్వల్పమేని మనుష్యుడు జన్మాంతరమందు స్థా వరత్వమునున్ను వాచికముమట్టులేని పక్షిమృగత్వమున్ను యట్లేమానసికపాపముచే నంత్యజాతిత్వమునున్ను బొందును॥ ౯॥

మూ॥ వాగ్దండోథమనోదండః కాయదండ స్తథైవచ।
యస్యైతే నిహితా బుద్ధౌ త్రిదండీతిస ఉచ్యతే॥ ౧౦॥

దండమనగా దమనము అనగా మళ్లించుట వాఙ్మనః కాయములయొక్క దండ మనగా నిషిద్ధములు పలుకుటయు నసత్సంకల్పము చెడ్డవ్యాపారము వీటిని మాను టబుద్ధియందుగలవాడు త్రిదండియనబడును మూడువెదురుకర్రలు బట్టుకొనినమా త్రముచే గాడని యిదియాంతరత్రిదండప్రశంస॥ ౧౦॥

మూ॥ త్రిదండమేతన్నిక్షిప్య సర్వభూతేషుమానవః।
కామక్రోధౌతు సంయమ్య తతస్సిద్ధిం నియచ్ఛతి॥ ౧౧॥

ఈప్రకారముగా నిషిద్ధవాక్కు మొదలగువాటిని పరులయందు గాకుండమళ్లిం చి యీరూపమేయగు కామక్రోధనిరాసమొనర్చి మోక్షావాప్తిరూపమగు సిద్ధి ని మనుష్యుడొందును ఈసిద్ధినొందువాడెవడనిన జెప్పుచున్నాడు॥ ౧౧॥

మూ॥ యోస్యాత్మనః కారయితా తం క్షేత్రజ్ఞం ప్రచక్షతే।
యఃకరోతితు కర్మాణి సభూతాత్మోచ్యతే బుధైః॥ ౧౨॥

లోకసిద్ధమై నేనని వ్యవహరించబడెడి యాత్మయగు శరీరమును కర్మములయం దు బ్రవర్తింపజేయునతని క్షేత్రజ్ఞుడన్ని యాకర్మములనుజేయుశరీరము భూత సంఘాతరూపముగావున భూతాత్మయన్ని పండితులు జెప్పచున్నారు॥ ౧౨॥

మూ॥ జీవసంజ్ఞోంతరాత్మాన్య స్సహజస్సర్వదేహినాం।
యేన వేదయతే సర్వం సుఖం దుఃఖంచ జన్మసు॥ ౧౩॥

ఈజీవశబ్దము మహత్పరము యేనయనికర్తృవిభక్తిని దేశముపలన నుత్తరశ్లో కమందున్ను॥ "శ్లో॥ తావుభౌభూతసంపృక్తౌ మహాన్ క్షేత్రజ్ఞ ఏవచ-"యని తచ్ఛ బ్దముచే పూర్వమున్ను పరామర్శించి మహానని జెప్పటవలన శరీరక్షేత్రజ్ఞాతిరిక్తు డు శరీరమందు నాత్మయని పేరుగలవాడగుటవలన జీవాఖ్యుడు సర్వక్షేత్రజ్ఞులకు న్ను సహజుడాత్మ ఆయాత్మప్రాప్తి యాక్షేత్రజ్ఞునకు వినియోగించుటవలన అహం కారేంద్రియరూపముగ పరిణమించి కారణభూతమయ్యే మహత్తుచే ప్రతిజన్మమం దున్ను క్షేత్రజ్ఞుడు సుఖమునున్ను దుఃఖమునున్ను .యనుభవించునో యతండే జీ వుడు॥ ౧౩॥

మూ॥ తావుభౌ భూతసంపృక్తౌ మహాన్ క్షేత్రజ్ఞ ఏవచ।
ఉచ్చావచేషు భూతేషు స్థితంతం వ్యాప్యతిష్ఠతః॥ ౧౪॥

ఆమహత్తత్వక్షేత్రజ్ఞులిద్దరును పృథివ్యాదిపంచభూతములతో గలసినవారై స ర్వభూతస్థుడును సర్వవేదపురాణాదులందు బ్రసిద్ధుడునుం గావున నాపరమాత్మ నినాశ్రయించి యుంటున్నారు॥ ౧౪॥

మూ॥ అసంఖ్యామూర్తయ స్తస్య నిష్పతంతి శరీరతః।
ఉచ్చావచాని భూతాని సతతం చేష్టయంతియాః॥ ౧౫॥

ఈపరమాత్మని శరీరమువలన నసంఖ్యాతమూర్తులనగా జీవులు క్షేత్రజ్ఞశబ్ద ముచే ననంతమ్ము క్తులును లింగశరీరావచ్ఛిన్నులై వేదాంతములందు జెప్పబడిన ప్ర కారముచే నగ్నివలన మిణుగురులుంబలెను బయలు దేరుచున్నారు యేమూర్తుల ఉచ్చావచభూతములను కర్మములవిషయమై ప్రేరణమొనర్చుచున్నారో॥ ౧౫॥

మూ॥ పంచభ్యఏవమాత్రాభ్యః ప్రేత్యదుష్కృతినాంనృణాం।
శరీరం యాతనార్థీయ మన్యముత్పద్యతేధ్రువం॥ ౧౬॥

అయిదగుపృథివ్యాదిభూతములవలననే పాపకర్ములగు మనుష్యులకు పీడననుభ
వింపజేయు జరాయుజాదిదేహవ్యతిరిక్తమగుదుఃఖమును సహించే స్వభావముగ
లశరీరము పరలోకమందు బుట్టుచున్నది॥ ౧౬॥

మూ॥ తేనానుభూయ తా యామీః శరీరేణేహ యాతనాః।
తాస్వేవ భూతమాత్రాసు ప్రలీయంతే విభాగశః॥ ౧౭॥

ఆబాధలు దేరినశరీరముచే నాయమయాతనలననుభవించి యానుప్రాణిజీవులు
సూక్ష్మశరీరముచే ననుభూతమగు స్థూలశరీరము నశించగా నాయాయిశరీరారం
భకభూతమాత్రలయందు స్వస్వాంశములందప్పకుండ లీనులై యుందురు॥ ౧౭॥

మూ॥ సోనుభూయాసుఖోదర్కాన్ దోషాన్ విషయసంగజాన్।
వ్యపేత కల్మషోభ్యేతి తావేవో భౌ మహౌజసౌ॥౧౮॥

భూతసూక్ష్మాదిలింగ శరీరావచ్ఛిన్నుడగువాడు శబ్దస్పర్శాదినిషిద్ధవిషయోప
భోగముచేనగు యమలోకమందగు దుఃఖాదులననుభవించి యాభోగముచే నపగ
తపాపుడగుచు భావముచేనాగొప్ప తేజముగలమహత్తత్త్వపరమాత్ములనిద్దరిని నాశ్రి
యించును॥ ౧౮॥

మూ॥ తౌ ధర్మం పశ్యత స్తస్య పాపంచా తంద్రితౌ సహ।
యాభ్యాం ప్రాప్నోతి సంపృక్తః ప్రత్యేహచ సుఖాసుఖం॥౧౯॥

అనలసులగు నాపరమాత్ములు జీవునియొక్క ధర్మమునున్ను భుక్తశేషమగు
పాపమునున్ను దెలియుచున్నారు యేధర్మాధర్మములతో గూడ గలసి జీవుడు పర
లోకమందు నీలోకమందును సుఖదుఃఖములనుబొందుచున్నాడు॥ ౧౯॥

మూ॥ యద్యాచరతి ధర్మంస ప్రాయశో ధర్మమల్పశః।
తైరేవచావృతో భూతైః స్వర్గే సుఖముపాశ్నుతే॥౨౦॥

ఆజీవుడు మనుష్యలోకమందు ధర్మమధికముగానున్ను పాపము స్వల్పముగా
నున్ను జేసెనేని స్థూలశరీరరూపముచే పరిణతములగు నాభూతములలోనే గూడి
స్వర్గసుఖముననుభవించును॥ ౨౦॥

మూ॥ యదితు ప్రాయశోధర్మం సేవతే ధర్మమల్పశః।

వైర్యాత్తైస్సపరిత్యక్తో యామీః ప్రాప్నోతి యాతనాః॥ ౨౦॥

ఆజీవుడు మానుషదశయందు పాపమున ధికముగానున్న పుణ్యమునుస్వల్పము గానున్న జేసె నేని మానుష దేహరూపముగా పరిణమించినభూతములచే త్యక్తుడగుచు ననగామృతుడగుచు నటపైనిమైదగు తన్మాత్రలచే సంపాదితమునుయాతననుభవించుటకుచితమగు కాఠిన్యముగ దేహముగలవాడై యమసంబంధమగుపీడలననుభవించును॥ ౨౦॥

మూ॥ యామీస్తాయాతనాః ప్రాప్య సజీవో వీతకల్మషః॥
తాన్యేవ పంచభూతాని పునరప్యేతి భాగశః॥ ౨౧॥

ఆజీవుడుయమయాతనల నాకఠినమగు దేహముచేననుభవించి యందువలననిష్కల్మషుడై జరాయుజాది శరీరారంభకములగు నామైదగు భూతభాగములను బొందుననగా మానుషశరీరము గలవాడగును॥ ౨౧॥

మూ॥ ఏతాదృష్ట్వాస్య జీవస్య గతీస్స్వేనైవ చేతసా।
ధర్మతో ధర్మతశ్చైవ ధర్మేదద్యాత్సదామనః॥ ౨౩॥

ఈజీవునియొక్క ధర్మా ధర్మగతులను దనమనస్సుచే నెరిగికాని యనగాస్వర్గనరకాద్యనుభవములకు దగినశరీరములను బొందుటదెలిసిధర్మము నాచరించుటయందేమనస్సునను ష క్తముగాజేయవలెను॥ ౨౩॥

మూ॥ సత్వం రజస్తమశ్చైవ త్రీన్విద్యా దాత్మనో గుణాన్।
యైర్వ్యాప్యేమాన్ స్థితో భావాన్ మహాన్ సర్వానశేషతః॥ ౨౪॥

సత్వరజస్తమస్సులనెడి వక్ష్యమాణములగు గుణములలక్షణము లాత్మోపకారకములగుటవలన నాత్మయనగా మహత్తత్వమునొక్క గుణములుగా దెలియవలెను వీటిచేవ్యాప్తమై మహత్తుస్థావరజంగమరూపములగు నీపదార్థములను నిశ్శేషముగావ్యాపించియుండెనో॥ ౨౪॥

మూ॥ యోయదైషాం గుణో దేహే సాంకార్స్యే నాతిరిచ్యతే।
సతదా తద్గుణప్రాయం తం కరోతి శరీరిణం॥ ౨౫॥

విచారించ గాయీసర్వమున్ను త్రిగుణాత్మ కమైనైన నేదేహమందు గుణమెప్పు

ఋసంపూర్ణముగ నధికమగుచుండునో యప్పుడాగుణలక్షణ బాహుళ్యవంతునిగా నాగుణమా దేహిని జేయుచున్నదియిప్పుడు సత్త్వాదులలక్షణములను చెప్పుచున్నాడు॥

మూ॥ సత్త్వం జ్ఞానం తమో ఞ్జానం రాగద్వేషౌ రజస్స్మృతం।
ఏతద్వ్యాప్తిమదేతేషాం సర్వభూతాశ్రితం వపుః॥ ౨౬॥

యథార్థముగ తెలియడము జ్ఞానమదిసత్త్వమునకులక్షణము దీనికివిపరీతమజ్ఞానమదితమోలక్షణము విషాదము నభిలాషయునను మానసకార్యము రజోలక్షణము యీసత్త్వరజస్తమోగుణములయొక్క స్వరూపమైతే ప్రీతియువిషాదము నప్రీతియు నగుచున్నవి ప్రీత్యప్రీతివిషాదాత్మకములను ప్రకాశప్రవృత్తినియామార్థములు నన్యోన్యాభిభవజననమిథునవృత్తులగుచున్నవి గుణములు॥ వీటియొక్కస్వరూపమనంతర శ్లోకత్రయమందు జెప్పగలడు యీసత్త్వాదిగుణములయొక్క యీజ్ఞానాధిక్యము సర్వప్రాణివ్యాపకలక్షణము॥ ౨౬॥

మూ॥ తత్రయత్ప్రీతి సంయుక్తం కించిదాత్మని లక్షయేత్।
ప్రశాంతమివశుద్ధాభం సత్త్వం తదుపధారయేత్॥ ౨౭॥

ఆయాత్మయందు ప్రీతియుక్తమగుజ్ఞానమనగా క్లేశశూన్యమై ప్రకాశరూపమై యేదిలోపలనగుచున్నదో దానిని సత్త్వమని తెలియవలెను॥ ౨౭॥

మూ॥ యత్తుదుఃఖసమాయుక్తమప్రీతికరమాత్మనః।
తద్రజోప్రతిఘంవిద్యాత్సతతం హారిదేహినాం॥ ౨౮॥

ఏజ్ఞానముదుఃఖయుక్తమైనది గావుననే సత్త్వశుద్ధాత్మప్రీతిని బుట్టించనిదై యెల్లప్పుడుశరీరములకువిషయస్పృహను పుట్టించుచు యథార్థమును నివారించునుగావున శత్రురూపమైన రజోగుణమని దానిని దెలియవలయును॥ ౨౮॥

మూ॥ యత్తుస్యాన్మోహసంయుక్తమవ్యక్తంవిషయాత్మకం।
అప్రతర్క్యమవిజ్ఞేయం తమస్తదుపధారయేత్॥ ౨౯॥

ఏజ్ఞానము సదసద్వివేకశూన్యమై స్ఫుటముగాని విషయాకారస్వభావముగల కృత్యస్వరూపము గలదియై యంతఃకరణబహిఃకరణములచే దెలియరానిది యగుచున్నదో దానినితమోగుణమని దెలియవలయును॥ ౨౯॥

మూ॥ త్రయాణా మపిచైతేషాం గుణానాంయః ఫలోదయః।
అగ్ర్యోమధ్యోజఘన్యశ్చ తంప్రవక్ష్యామ్యశేషతః॥30॥

ఈసత్త్వాదిగుణములుమూడింటికి యథాక్రమముగను త్తమమధ్యమాధమరూపమైనఫలోత్పాదకమేదో దానినిచెప్పగలను॥ 30॥

మూ॥ వేదాభ్యాస స్తపోజ్ఞానం శౌచమింద్రియనిగ్రహః।
ధర్మక్రియాత్మ చింతాచ సాత్త్వికం గుణలక్షణం॥ 31॥

వేదాభ్యాసము తపస్సు శాస్త్రార్థజ్ఞానము మృద్వార్యాదులచే శౌచము నింద్రియనిగ్రహము దానాదిధర్మానుష్ఠానము నాత్మధ్యానపరతయు నివిసత్వగుణములయొక్క కార్యములు॥ 31॥

మూ॥ ఆరంభ రుచితా ధైర్య మసత్కార్య పరిగ్రహః॥
విషయోపసేవా చాజస్రం రాజసం గుణలక్షణం॥32॥

ఫలార్థమై కర్మానుష్ఠాన శీలతయు కొంచపుకార్యమందును దైన్యమునొందుట నిషిద్ధకర్మాచరణము సంతతముశబ్దాదివిషయభోగము నిదియంతయురజోగుణకార్యము॥ 32॥

మూ॥ లోభస్స్వప్నో ధృతిఃకార్యం ఆస్తిక్యం భిన్నవృత్తితా।
యాచిష్ణుతా ప్రమాదశ్చ తామసం గుణలక్షణం॥ 33॥

ధనమధికముగా గావలెనని యిచ్ఛయు నిద్రయు కార్పణ్యము పైశున్యము పరలోకములేదనేడి బుద్ధియు నాచారలోపము యాచనాశీలత్వము ధర్మాదులయందజాగరూకతయు నిందితయు తమోగుణలక్షణము॥ 33॥

మూ॥ త్రయాణామపి చైతేషాం గుణానాంత్రిషు తిష్ఠతాం।
ఇదం సామాసికం జ్ఞేయం క్రమశో గుణలక్షణం॥34॥

ఈసత్త్వాదిగుణత్రయము భూతభవిష్యద్వర్తమాన కాలములయందుండును గావున దీనికి క్రమముగా సంక్షేపగుణలక్షణమీవక్ష్యమాణ ప్రకారముగా దెలియందగును॥ 34॥

మూ॥ యత్కర్మ కృత్వా కుర్వంశ్చ కరిష్యంశ్చైవలజ్జతి।

తజ్జ్ఞేయం విదుషా సర్వం తామసం గుణలక్షణమ్॥ ౩౫॥

ఏకర్మమును జేసి జేయుచు జేయగలవాడై లజ్జనుబొందునో యీకాలత్రయ కృత్యములలో నొకదానియందు గాని రెండిటి యందుగాని జరగబడిన దంతయు తమఃకార్యము గావున తమోభిధానమగు గుణలక్షణమని శాస్త్రవేత్తచే దెలియం దగును॥ ౩౫॥

మూ॥ యేనాస్మిన్ కర్మణా లోకే ఖ్యాతిమిచ్ఛతి పుష్కలామ్।
నచశోచత్యసంపత్తౌ తద్విజ్ఞేయంతు రాజసం॥ ౩౬॥

ఈలోకమందధికమగు సంపత్తిని నొందుటకుగా నేవకర్మము నొనర్చిన సంపత్తియందు దుఃఖించకుండునది రజోగుణకార్యము గావున నది రజోగుణలక్షణమని దెలియవలెను॥ ౩౬॥

మూ॥ యత్సర్వేణేచ్ఛతి జ్ఞాతుం యన్నలజ్జతి చాచరన్।
యేనతుష్యతి చాత్మాస్య తత్సత్వ గుణలక్షణమ్॥ ౩౭॥

ఏకర్మమయినను వేదార్థజ్ఞానార్థమిచ్ఛయించునో యేపనిచేసి కాలత్రయమందును లజ్జనొందడో యేయేపనిచేసిన నాత్మకు సంతుష్టియగునో యద్ది సత్వగుణలక్షణమని దెలియవలెను॥ ౩౭॥

మూ॥ తమసో లక్షణం కామో రజసస్త్వర్థఉచ్యతే।
సత్వస్య లక్షణం ధర్మశ్శ్రైష్ఠ్యమేషాం యథోత్తరం॥ ౩౮॥

కామప్రధానత తమోలక్షణము ధనప్రధానత రజోలక్షణము ధర్మప్రధానత సత్వలక్షణము కామమర్థమూలము గావునను కామార్థములు ధర్మమూలములు గావునను కామాదులకు వీటిలో నుత్తరోత్తరము శ్రేష్ఠము॥ ౩౮॥

మూ॥ యేనయాంస్తు గుణైరేషాం సంసారాన్ ప్రతిపద్యతే।
తాన్ సమాసేన వక్ష్యామి సర్వస్యాస్య యథాక్రమం॥ ౩౯॥

ఈసత్వాదిగుణములలో నేగుణముచేనగు నేకార్యముచే జీవు డేగతులనొందు నాగతులనీజగత్తునకు క్రమముగా జెప్పెదను॥ ౩౯॥

మూ॥ దేవత్వం సాత్త్వికాయాంతి మనుష్యత్వంచ రాజసాః।
తిర్యక్త్వం తామసానిత్య మిత్యేషా త్రివిధాగతిః॥ ౪౦॥

ఎవరు సత్త్వవ్యాపారవంతులో వారు దేవత్వమున్ను రజోవృత్తులుగలవారు మనుష్యత్వమున్ను తమోవృత్తులు తిర్యక్త్వమున్ను బొందుదురిట్లు జన్మప్రాప్తి త్రివిధము॥ ౪౦॥

మూ॥ త్రివిధాత్రివిధైషాంతు విజ్ఞేయా గౌణికీగతిః।
అధమా మధ్యమాగ్ర్యాచ కర్మవిద్యావిశేషతః॥ ౪౧॥

సత్త్వాదిగుణనిమిత్తమై త్రివిధజన్మాంతరప్రాప్తియేదిజెప్పబడెనో, యది దేశ కాలాదిభేదముచేతనున్ను సంసారమందగు భూతముల కర్మభేదమువల్లనున్ను అధమ మధ్యమోత్తమభేదములచే మూడుప్రకారములగుచున్నది॥ ౪౧॥

మూ॥ స్థావరాః క్రిమికీటాశ్చ మత్స్యాస్సర్పాస్సకచ్ఛపాః।
పశవశ్చ మృగాశ్చైవ జఘన్యాతామసీగతిః॥ ౪౨॥

వృక్షములు చిన్నపురుగులు పెద్దపురుగులు చేపలు పాములు తాబేళ్లు మృగములు తమోగతిలోజఘన్యములు॥ ౪౨॥

మూ॥ హస్తినశ్చ తురంగాశ్చ శూద్రా మ్లేచ్ఛాశ్చ గర్హితాః।
సింహావ్యాఘ్రావరాహాశ్చ మధ్యమా తామసీగతిః॥ ౪౩॥

గర్హితములు ఏనుగులు శూద్రులు తురుష్కులు సింహవ్యాఘ్రవరాహాదులు తామసగతిలో మధ్యమములు॥ ౪౩॥

మూ॥ చారణాశ్చ సుపర్ణాశ్చ పురుషాశ్చైవ దాంభికాః।
రక్షాంసిచ పిశాచాశ్చ తామసీషూత్తమాగతిః॥ ౪౩॥

నటాదులు పక్షులు మాయాధర్మకర్తలగు పురుషులు రాక్షసులు పిశాచములు వీనన్నియుం దమోగతిలో నుత్తమములు॥ ౪౪॥

మూ॥ ఝల్లామల్లా నటాశ్చైవ పురుషాశ్శస్త్రవృత్తయః।
ద్యూతపానప్రసక్తాశ్చ జఘన్యారాజసీ గతిః॥ ౪౫॥

ఝల్లులనగా వ్రాత్యక్షత్రియునివలన సవర్ణయందు బుట్టినవారు దండతో యోధులు మల్లులనగా బాహుయోధులు రంగావతారకులగునటులున్ను శస్త్రజీవులున్ను ద్యూతమద్యపానప్రసక్తులగు నరులున్ను రజోగతిలో నధములు॥ ౪౫॥

మూ॥ రాజానః క్షత్రియాశ్చైవ రాజ్ఞాంచైవ పురోహితాః।
వాదయుద్ధప్రధానాశ్చ మధ్యమా రాజసీగతిః॥ ౪౬॥

మూర్ధాభిషిక్తులును జాతిక్షత్రియులును శాస్త్రార్థము గాని వాదయుద్ధప్రదులును రజోగతిలో మధ్యములు॥ ౪౬॥

మూ॥ గంధర్వా గుహ్యకాయక్షా విబుధానుచరాశ్చయే।
తథైవాప్సరసస్సర్వా రాజసీషూత్తమాగతిః॥ ౪౭॥

గంధర్వులు గుహ్యకులు యక్షులు నప్సరస స్త్రీలును దేవతల ననుసరించియుండు విద్యాధరాదులున్ను రజోగతిలోనుత్తములు॥ ౪౭॥

మూ॥ తాపసాయతయోవిప్రా యేచవై మానికాగణాః।
నక్షత్రాణిచ సాధ్యాశ్చ ప్రథమా సాత్వికీగతిః॥ ౪౮॥

వానప్రస్థులు యతులు విప్రులు సాధ్యులు నక్షత్రములు పుష్పకాదివిమానములెక్కి దిరుగువారును అధమసాత్వికగతిగలవారు॥ ౪౮॥

మూ॥ యజ్వానఋషయోదేవా వేదాజ్యోతీంషివత్సరాః।
పితరశ్చైవ సాధ్యాశ్చ ద్వితీయా సాత్వికీగతిః॥ ౪౯॥

యజ్ఞశీలురును ఋషులును వేదాధిష్ఠానదేవతలును ధ్రువాదులును పురాణప్రసిద్ధవిగ్రహవంతులగు సంవత్సరములు పితృదేవతలును సాధ్యులును వీరుసాత్వికగతిలో మధ్యములు॥ ౪౯॥

మూ॥ బ్రహ్మావిశ్వసృజో ధర్మో మహానవ్యక్తమేవచ।
ఉత్తమాం సాత్వికీ మేతాం గతిమాహుర్మనీషిణః॥ ౫౦॥

చతుర్ముఖుడును మరీచ్యాదులగు ప్రజాపతులును విగ్రహాయుక్తమగు ధర్మమున్ను నవ్యక్తమనగా సాంఖ్యప్రసిద్ధదేవతాద్వయము అవ్యక్తాధిష్ఠాతృదేవతల కి

చ్చట వివక్ష అచేతనమగుగుణత్రయమాత్రమునకు త్తమసాత్వికత్వముపపన్నము గాదు వీరుసాత్వికగతిలోను త్తములుగాబండితులచే జెప్పబడిరి॥ ౫౦॥

మూ॥ ఏషసర్వస్య ముద్దిష్టస్త్రిప్రకారస్య కర్మణః।
త్రివిధస్త్రివిధః కృత్స్నస్సంసారస్సార్వభౌతికః॥౫౧॥

ఇది మనోవాకాయ రూపభేదముచే త్రిప్రకారమగు కర్మమునకు సత్వరజ స్తమోభేదముచేత త్రైవిధ్యమును వాటికిన్ని ప్రథమమధ్యమోత్తమభేదముచేమరల త్రైవిధ్యమున్ను గలస్వప్రాణిగతమగు గతివిశేషమున్ను నిశ్శేషముగ జెప్పబడెను సార్వభౌతికః యనుటవలన నను క్తములగువాటినిన్ని యూహించవలెను గతులు కొన్ని ప్రదర్శనార్థము చెప్పబడెను॥ ౫౧॥

మూ॥ ఇంద్రియాణాం ప్రసంగేనధర్మస్యాసేవనేనచ।
పాపాన్సంయాంతి సంసారానవిద్వాంసోనరాధమాః॥౫౨॥

ఇంద్రియములకు విషయములందు ప్రసక్తివలనను నిషిద్ధాచరణము వల్లనున్ను ప్రాయశ్చిత్తాదిధర్మములను జేయకుండుట వల్లనున్ను మూఢులగు మనుష్యాధములు కుత్సితగతులను బొందుచున్నారు॥ ౫౨॥

మూ॥ యాంయాంయోనింతు జీవోయం యేనయేనేహ కర్మణా।
క్రమతో యాంతి లోకేస్మిన్ తత్తత్సర్వం నిబోధత॥౫౩॥

ఈ జీవుడీలోకమం దేయేపాపమొనర్చిన నేయేజన్మము నొందునో యవి యెల్ల నువినుండు॥ ౫౩॥

మూ॥ బహూన్ వర్షగణాన్ ఘోరాన్నరకాన్ప్రాప్యతత్క్షయాత్।
సంసారాన్ ప్రతిపద్యంతే మహాపాతకినస్త్విమాన్॥౫౪॥

బ్రహ్మహత్యాదిపాపముల నొనర్చినవార నేకసహస్రవర్షములు ఘోరనరకములనొంది భుక్తశేషమగు పాపముచే మరల నిచ్చట నేయేజన్మముల నొందుదురో యవన్నియును జెప్పెదను॥ ౫౪॥

మూ॥ శ్వసూకరఖరోష్ట్రాణాం గోజావిమృగపక్షిణామ్।

చండాలపుల్కసానాంచ బ్రహ్మహాయోని మృచ్ఛతి॥ ౫౫॥

కుక్క పంది గాడిదె లొట్టిపిట్ట గోవు మేక గొర్రియలేడి పక్షి చండాలుడు పుల్కసుడనగా నిషాదుని వలన శూద్రస్త్రీయందు బుట్టినజాతి బ్రహ్మహత్యా శేషముచే నీజన్మములనొందును పాపలేశగౌరవములను బట్టి క్రమముగా నన్నిజన్మములనొందును ఉత్తరమందు నిట్లుతెలియవలెను॥ ౫౫॥

మూ॥ క్రిమికీట పతంగానాం విడ్భుజాంచైవ పక్షిణామ్ ।
హింస్రాణాం చైవసత్వానాం సురాపో బ్రాహ్మణో వ్రజేత్॥౫౬॥

క్రిములు కీటములు శలభములు పురీషమును దినెడిపక్షులు ఘాతుకజంతువులు వ్యాఘ్రాదులు యీజన్మను సురాపానమొనర్చిన బ్రాహ్మణుడా పాపవిశేషముచే బుట్టును॥ ౫౬॥

మూ॥ లూతాహి సరటానాంచ తిరశ్చాం చాంబుచారిణామ్ ।
హింస్రాణాంచ పిశాచానాం స్తేనో విప్రస్సహస్రశః॥౫౭॥

సాలెపురుగు సర్పము తొండ జలచరములు బాధించెడివిషసర్పాదులు పిశాచములు వీటియోనుల ననేకసహస్రవారంబులు స్వర్ణస్తేయంబొనర్చిన విప్రుడు బుట్టును॥ ౫౭॥

మూ॥ తృణగుల్మలతానాంచ క్రవ్యాదాం దంష్ట్రిణామపి ।
క్రూరకర్మకృతాంచైవ శతశో గురుతల్పగః॥౫౮॥

గడ్డి తుప్పలు తీగెలు పచ్చిమాంసమును దిను గ్రద్దలు, మొదలగునవి కోరలుగల సింహాదులు క్రూరకర్ములు యీజాతులందు నూర్లకొలది గురుదారగామి జన్మములనొందును॥ ౫౮॥

మూ॥ హింస్రాభవంతి క్రవ్యాదా క్రిమయో భక్ష్యభక్షిణః ।
పరస్పరాదినస్తేనాః ప్రేతాంత్య స్త్రీనిషేవిణః॥౫౯॥

ఎవరుహింసాకర్మశీలురో వారుపచ్చిమాంసముదినుమార్జాలాదిజన్మమునొందుదురు అభక్ష్యభక్షణముచేక్రిమిజన్మము నొందుదురు మహాపాతకవ్యతిరిక్తచో

రులు పరస్పరమాంసము దినెడి జంతుజన్మము నొందుదురు చండాలాదిస్త్రీలను బొందినవారు ప్రేతలగుదురు ప్రేతాంత్యస్త్రీనిషేవణాదనుచో విసర్గలోపము స్మృతిఛందస్సమానముగావున సవర్ణదీర్ఘమాయెను॥ ౫౯॥

మూ॥ సంయోగం పతితైర్గత్వా పరస్యైవచ యోషితం।
అపహృత్యచ విప్రస్వం భవతి బ్రహ్మరాక్షసః॥౬౦॥

మహాపాతకులతో నెంతకాలముగలసియుండినం దత్సముడగునో యట్లుసంసర్గమొనర్చినవాడున్ను పరస్త్రీతో బోయినవాడున్ను బ్రాహ్మణధనము నపహరించినవాడున్ను బ్రహ్మరాక్షసుడగును॥ ౬౦॥

మూ॥ మణిముక్తాప్రవాళాని హృత్వాలోభేన మానవః।
వివిధానిచ రత్నాని జాయతే హేమకర్తృషు॥౬౧॥

మాణిక్యములు ముత్తెములు పగడములు నింకవజ్రాదులగురత్నములను స్వీయభ్రమచేగాకహరించెనేని బంగారుపని చేసెడి కమసాలియైబుట్టును కొందరుస్వర్ణకారియను పక్షిజన్మమొందునని యందురు॥ ౬౧॥

మూ॥ ధాన్యంహృత్వా భవత్యాఖుః కాంస్యం హంసోజలంప్లవః।
మధుదంశః పయఃకాకో రసంశ్వా నకులోఘృతం॥౬౨॥

ధాన్యముహరించి యెలుక కంచునుహరించి హంసయు జలమునుహరించి ప్లవమనుపక్షి తేనెహరించి దోమ పాలుహరించి కాకియేదైనరసమునుహరించి కుక్క నేయిహరించి ముంగియునై బుట్టును॥ ౬౨॥

మూ॥ మాంసం గృధ్రోవపాంమద్గు స్తైలంతైల పయఃఖగః।
చీరీవాకస్తు లవణం బలాకా శకునిర్దధి॥౬౩॥

మాంసహారిగ్రద్దయగును వపయనుమాంసవిశేషమును దొంగిలించి మద్గుయనెడినీటిపక్షియగును నూనెనెత్తుకపోయి తైలపాయియను పక్షియైబుట్టును లవణచోరుడుకీచురాయియనుపురుగగును పెరుగునుహరించి బెగ్గురుయనుపక్షియగును॥

మూ॥ కౌశేయంతిత్తిరిర్హృత్వా క్షౌమంహృత్వాతు దర్దురః॥

కార్పాసతాంతవం క్రౌంచో గోధాగాం వాగ్గుదో గుడం॥౬౪॥

పొత్తిపంచనుహరించి తీతువపిట్టయగును పట్టుబట్టనుహరించి కప్పయగును ప్రత్తినూలుబట్టనెత్తుకపోయి కొంగయగును మాటనుహరించియుడుమగును బెల్లపుచోరుడైన వాగ్గుదమనుపక్షియగును॥ ౬౪॥

మూ॥ ఛుచుందరి శ్శుభాన్ గంధాన్ పత్రశాకంతు బర్హిణః।
శ్వావిత్కృతాన్నం వివిధ మకృతాన్నంతు శల్యకః॥౬౫॥

పరిమళద్రవ్యములను హరించువాడు చుంచెలుకయగును తోటకూర మొదలగు వాటినిదొంగిలించి నెమలియగును సిద్ధాన్నాదికమునుహరించి ఉయాలుగగును బియ్యము మొదలగువాటినెత్తుకొనిపోయి యేదుబందియగును॥ ౬౫॥

మూ॥ బకోభవతి హృత్వాగ్నిం గృహకారీ హ్యుపస్కరం।
రక్తానిహృత్వా వాసాంసి జాయతే జీవజీవకః॥౬౬॥

అగ్నినపహరించి గుడ్డికొంగయగును చాటలుచీపురు రోకలిమొదలగుగృహోపకరణములనపహరించి గోడలందు మట్టిగూడుబెట్టెడి తుమ్మెదవంటి పురుగగును యెఱ్ఱరంగుబట్టలను దొంగిలించి చకోరమగును॥ ౬౬॥

మూ॥ వృకోమృగేభం వ్యాఘ్రోశ్వం ఫలమూలంతు మర్కటః।
స్త్రీమృక్షః స్తోకకోవారి యానాన్యుష్ట్రః పశూనజః॥౬౭॥

లేడినిగాని గజమునుగానిహరించి తోడేలగును గుఱ్ఱమునుహరించి పులియగును పళ్ళుదుంపలనుదొంగిలించి కోతియగును స్త్రీనిహరించి భల్లూకమగును త్రాగెడినీళ్ళు దొంగిలించి చాతకమగును బళ్ళుమొదలగు యానములను హరించియుష్ట్రమగును మిగిలినపశువులను దొంగిలించి మేకయగును॥ ౬౭॥

మూ॥ యద్వాతద్వా పరద్రవ్య మపహృత్యబలాన్నరః।
అవశ్యంయాతి తిర్యక్త్వం జగ్ధ్వాచైవాహుతంహవిః॥౬౮॥

నిస్సారమైనదైనా యేద్రవ్యమైన నిచ్ఛచేహరించినన్ని హోమముచేయకనే పురోడాశమునుతినినన్ని తప్పకుండ తిర్యక్త్వమును బొందును॥ ౬౮॥

మూ॥ స్త్రియోప్యేతేన కల్పేన హృత్వాదోషమవాప్నుయుః ।
ఏతేషామేవజంతూనాం భార్యాత్వముపయాంతి తాః॥ ౬౯

ఈచెప్పబడిన ప్రకారముగ పరద్రవ్యమును స్త్రీలుహరించి రేని పాపమును బొందీ యాయాజంతువులభార్యలై బుట్టుదురు ఇట్లునిషిద్ధాచరణఫలము జెప్పివిహితాననుష్ఠానదోషగతిని జెప్పుచున్నాడు॥ ౬౯॥

మూ॥ స్వేభ్యస్స్వేభ్యస్తుకర్మభ్య శ్చ్యుతావర్ణాహ్యనాపది ।
పాపాన్ సంసృత్యసంసారాన్ ప్రేష్యతాంయాంతి శత్రుషు॥ ౭౦॥

బ్రాహ్మణాదులగు నాలుగువర్ణమువారు ననాపదయందు స్వస్వనియతములగు పంచయజ్ఞాదికర్మములను విడిచి రేని యాపాపమువలన నీచయోనులంబుట్టి జన్మాంతరంబున శత్రువులకు దాసులగుదురు॥ ౭౦॥

మూ॥ వాంతాశ్యుల్కాముఖః ప్రేతో విప్రోధర్మాత్స్వకాచ్చ్యుతః।
అమేధ్యకుణపాశీచ క్షత్రియః కటపూతనః॥ ౭౧॥

బ్రాహ్మణుడు స్వకర్మభ్రష్టుడయ్యేనేని వాంతాశియు జ్వాలాముఖనామకప్రేతవిశేషుడగును క్షత్రియుడు కర్మభ్రష్టుడయ్యేనేనిపురీషమును శవములనుభక్షించు కటపూతనామక ప్రేతవిశేషుడై బుట్టును॥ ౭౧॥

మూ॥ మైత్రాక్షజ్యోతికః ప్రేతో వైశ్యోభవతిపూయభుక్ ।
చైలాశకశ్చభవతి శూద్రో ధర్మాత్స్వకాచ్చ్యుతః॥ ౭౨॥

వైశ్యుడు స్వకర్మభ్రష్టుడయ్యేనేని మైత్రాక్షజ్యోతి నామకప్రేతమై చీమును దినుచునుండును మైత్రమనగా మిత్రదేవతాకమగు నక్షమనగా కర్మేంద్రియముగు దస్థ్సాన మచ్చట జ్యోతిగలది పృషోదరాదులలోదిదాన షత్వలోపము మైత్రాక్షజ్యోతికమనివ్యుత్పత్తి శూద్రుడు కర్మభ్రష్టుడయ్యేనేని చైలాశకనామకప్రేత విశేషుడగును చేలసంబంధమగు యూకాదులనుదినెడు వాడగునని యర్థము గోవిందరాజు చేలాశకమని పఠించిబట్టలను దినెడు పురుగగునని వ్రాసెను పైని ప్రేతప్రకరణము గావున నదియుక్తము కాదని కుల్లూభట్టువ్రాసెను॥ ౭౨॥

మూ॥ యథాయథానిషేవంతే విషయాన్విషయాత్మకాః।

తథా తథా కుశలతా తేషాం తేషూపజాయతే॥ ౭౩॥

ఏయే ప్రకారముగ విషయాసక్తులై విషయములను సేవింతురో యాయాప్ర కారముగ విషయములందే ప్రవీణులగుదురు॥ ౭౩॥

మూ॥ తేఽభ్యాసా త్కర్మణాం తేషాం పాపానామల్పబుద్ధయః।
సంప్రాప్నువంతి దుఃఖాని తాసు తాస్విహ యోనిషు॥ ౭౪॥

అల్పబుద్ధులు విషయానుభవాభ్యాసమువలన విషయలోలుపులై తత్తదభ్యాస తారతమ్యములచే గర్హితగర్హితతర గర్హితతమయోనులందుబుట్టి దుఃఖము ననుభవింతురు॥ ౭౪॥

మూ॥ తామిస్రాదిషుచోగ్రేషు నరకేషువివర్తనం।
అసిపత్రవనాదీని బంధనచ్ఛేదనానిచ॥ ౭౫॥

చతుర్థాధ్యాయోక్త తామిస్రాదులసిపత్రాదులు నగు నరకములందు బడి బంధనచ్ఛేదనాది పీడల నొందుదురు॥ ౭౫॥

మూ॥ వివిధాశ్చైవసంపీడాః కాకోలూకైశ్చ భక్షణం।
కరంభవాలుకాతాపాన్ కుంభీపాకాంశ్చ దారుణాన్॥ ౭౬॥

నానావిధములగు పీడలనున్ను కాకాది పక్షులచే భక్షణమునున్ను తప్తవాలు కాదులందున్ను దారుణయాతనలనొందుదురు॥ ౭౬॥

మూ॥ సంభవాంశ్చ వియోనీషు దుఃఖప్రాయాసునిత్యశః।
శీతాతపాభిఘాతాంశ్చ వివిధాని భయానిచ॥ ౭౭॥

తిర్యగాది దుఃఖబహుయోనులందు బుట్టుదురు శీతాతపాది నానావిధపీడలను న్ను భయమునున్ను బొందుదురు॥ ౭౭॥

మూ॥ అసకృద్గర్భవాసేషు వాసం జన్మచదారుణం।
బంధనానిచకష్టాని పరప్రేష్యత్వమేవచ॥ ౭౮॥

మాటిమాటికి గర్భవాస మందుండుటయు యోని యంత్రాదులచే దుఃఖ యుక్తమగు జన్మమున్ను పుట్టి విశృంఖలాదిబంధనము లొందుదురు పరదాసత్వాది పీడలనొందుదురు॥ ౭౮॥

మూ॥ బంధుప్రియవియోగాంశ్చ సంవాసంచైవదుర్జనైః।
ద్రవ్యార్జనంచ నాశంచ మిత్రామిత్రస్య చార్జనమ్॥ ౭౯॥

బంధుమిత్రాదులవియోగమున్ను దుర్జనులతో నొకచోటనునికియు ధనార్జనప్రయాసమున్ను ధననాశమందు దుఃఖమున్ను మిత్రులనార్జించుటకు ప్రయాసమున్ను శత్రులకభ్యుదయమునసగు దుఃఖము ననుభవింతురు॥ ౭౯॥

మూ॥ జరాంచైవాప్రతీకారాం వ్యాధిభిశ్చోపపీడనమ్।
క్లేశాంశ్చ వివిధాంస్తాంస్తాన్ మృత్యుమేవచదుర్జయమ్॥ ౮౦॥

మల్లించరాని ముదిమినిన్ని రోగాదిపీడయున్ను క్షుత్పిపాసాదినానాప్రకారక్లేశములనున్ను దుర్వారమగు మరణమునున్ను బొందుదురు॥ ౮౦॥

మూ॥ యాదృశేనతు భావేన యద్యత్కర్మనిషేవతే।
తాదృశేన శరీరేణ తత్తత్ఫలముపాశ్నుతే॥ ౮౧॥

సాత్వికరాజసతామసమగు మనస్సులో నెద్దానిచే స్నానదాన యోగాద్యనుష్ఠానమొనర్చునో తాదృశమగు శరీరముచే తత్తత్ఫలము ననుభవించును॥ ౮౧॥

మూ॥ ఏషసర్వస్సముద్దిష్టః కర్మణాంవః ఫలోదయః।
నైశ్శ్రేయసం కర్మవిధిం విప్రస్యేమం నిబోధత॥ ౮౨॥

ఇది విహితప్రతిషిద్ధములగు సర్వకర్మములఫలోదయము మీకు జెప్పబడెనిప్పుడు బ్రాహ్మణునకు నిశ్శ్రేయసప్రాప్తికుపాయమగు కర్మానుష్ఠానమును జెప్పగలను తెలియుడు॥ ౮౨॥

మూ॥ వేదాభ్యాసస్తపోజ్ఞాన మింద్రియాణాంచ సంయమః।
అహింసాగురుసేవాచ నిశ్శ్రేయసకరంపరమ్॥ ౮౩॥

ఉపనిషదభ్యాసము కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సు బ్రహ్మవిషయమైన జ్ఞానము నింద్రియజయము వేదవిహితముగాని హింసనువర్జించుట గురుశుశ్రూషయును నివియంతయు మోక్షమునకుత్కృష్టమగు సాధనము॥ ౮౩॥

మూ॥ సర్వేషామపిచైతేషాం శుభానామిహకర్మణామ్।

కించిచ్ఛ్రేయస్కరతరం కర్మోక్తం పురుషంప్రతి॥ ౮౪॥

ఈచెప్పఁబడిన వేదాభ్యాసాదిసకలశుభకర్మములలోను నొకటియుత్కృష్టమోక్షసాధనమని యూహించి చెప్పబడెను ఋషులయొక్క జిజ్ఞాసావిశేషమువలన నుత్తరశ్లోకముచే దీనినిర్ణయమును జెప్పుచున్నాఁడు॥ ౮౪॥

మూ॥ సర్వేషామపి చైతేషా మాత్మజ్ఞానం పరం స్మృతం।
తద్ధ్యగ్ర్యం సర్వవిద్యానాం ప్రాప్యతేహ్యమృతం తతః॥ ౮౫॥

ఈ వేదాభ్యాసాదులందుపనిషదుక్తపరమార్థజ్ఞానము ప్రకృష్టమని చెప్పబడెను గావున జ్ఞానము సర్వవిద్యలకును బ్రధానము యేమనిన యట్టి జ్ఞానమువలన మోక్షము బ్రాప్తించును॥ ౮౫॥

మూ॥ షణ్ణామేషాంతు సర్వేషాం కర్మణాం ప్రేత్యచేహచ!
శ్రేయస్కరతరం జ్ఞేయం సర్వదా కర్మవైదికం॥ ౮౬॥

ఈపూర్వోక్తములగు వేదాభ్యాసాది షట్కర్మములలోను పరమార్థజ్ఞానపూర్వకమగు వైదికకర్మమైహికాముష్మికశ్రేయస్కరమని తెలియతగినది పూర్వశ్లోకమందు అవిమోక్షహేతువనియు నిచ్చట నిహపరసాధనమనియు జెప్పుటవలన పునరుక్తిలేదు గోవిందరాజు ఇచ్చట స్మార్తకర్మముకంటే వైదికకర్మమిహపరసాధనమని వ్రాసెను వేదాభ్యాసాదికర్మములు స్మృతివిహితములగుటచేత నందువైదికముగానిది స్మార్తకర్మమనిలేదు గావున నిర్ధారణషష్ఠి సంభవించదని కుల్లూకభట్టువ్రాసెను॥ ౮౬॥

మూ॥ వైదికే కర్మయోగేతు సర్వాణ్యేతాన్యశేషతః।
అంతర్భవంతి క్రమశ స్తస్మిం స్తస్మిన్ క్రియావిధౌ॥ ౮౭॥

పరమాత్మోపాసనారూపమగు వైదికకర్మయోగమందు పూర్వోక్తములగు నైహికాముష్మికశ్రేయస్ఫలాయా యుపాసనవిధియందు సంభవించుచున్నవి ఇట్లుగాకున్న "సర్వాణ్యేతాని" యనుటచే నావేదాభ్యాసాదులే పరామర్శించబడుసుగాన నివిపరమాత్మజ్ఞానవిషయమయి యుపయోగించును॥ శ్రు॥ "తమేతంవేదానువచనేనబ్రాహ్మణావివిదిషంతి।యజ్ఞేనదానేన తపసానాశకేన" యనుశ్రుతివలన యజ్ఞాదులు విహితాంగములుగా నంతర్భావమునుపొందుచున్నది॥ ౮౭॥

మూ॥ సుఖాభ్యుదయికం చైవ నైశ్శ్రేయసికమేవచ।
ప్రవృత్తంచ నివృత్తంచ ద్వివిధం కర్మ వైదికం॥౮౮॥

ఇచ్చట వైదికకర్మమనగా జ్యోతిష్టోమాదికమున్ను ప్రతీకోపాసనాదికమున్ను గ్రహింపబడుచున్నది స్వర్గాదిసుఖప్రాప్తికరమగునని సంసారప్రవృత్తిహేతువౌటవలన ప్రవృత్తమనిన్ని మోక్షార్థమగుకర్మము సంసారనివృత్తి హేతువుగావున నివృత్తమనిన్ని వైదికకర్మము ద్విప్రకారకమని తెలియదగునుదీనినే స్పష్టపరచుచున్నాడు॥ ౮౮॥

మూ॥ ఇహచాముత్రవా కామ్యం ప్రవృత్తం కర్మకీర్త్యతే।
నిష్కామం జ్ఞానపూర్వంతు నివృత్తముపదిశ్యతే॥౮౯॥

ఇహలోకఫలకమగు కారీరాదికము స్వర్గసాధనమగు జ్యోతిష్టోమాదికమున్ను దృష్టాదృష్టఫలకమగునది కామ్యము ప్రవృత్తమనియు నిట్లుకామ్యముగాని కేవలమోక్షసాధనమయిన కర్మమునివృత్తమనిచెప్పబడెను॥ ౮౯॥

మూ॥ ప్రవృత్తం కర్మసంసేవ్య దేవానామేతి సామ్యతాం।
నివృత్తం సేవమానస్తు భూతాన్యత్యేతి పంచవై॥౯౦॥

ప్రవృత్తకర్మాభ్యాసముచే దేవసమానత్వము నొందుననగా నుపలక్షణముచే తత్తత్ఫలమునొందును నివృత్తకర్మాభ్యాసముచే మరల శరీరారంభకములగు భూతములనతిక్రమించుననగా మోక్షమునొందును॥ ౯౦॥

మూ॥ సర్వభూతేషు చాత్మానం సర్వభూతేషు చాత్మని।
సమంపశ్యన్నాత్మయాజీ స్వారాజ్యమధిగచ్ఛతి॥౯౧॥

స్థావరజంగమాది సర్వభూతములందు నాత్మరూపముగానుంటున్నాను సర్వభూతములును పరమాణురూపములై నాయందుంటున్నవని యావజ్జీవము బ్రహ్మార్పణన్యాయముచే యజ్ఞాదులొనర్చుచు స్వయముగా బ్రకాశించువానిధర్మము స్వారాజ్యము బ్రహ్మత్వమునొందును॥ శ్రు॥ "సర్వంఖల్విదంబ్రహ్మ" యజనాదిభి శ్శాంతముపాసీత" యనియును యజుర్మంత్రము "యస్తుసర్వాణిభూతాని చాత్మన్యేవానుపశ్యతి। సర్వభూతేషుచాత్మానం తతోనవిజుగుప్సతి" యనియు వీటియర్థ

ము వ్రాయబడెను॥ ౯౧॥

మూ॥ యథోక్తాన్యపి కర్మాణి పరిహాయ ద్విజోత్తమః।
ఆత్మజ్ఞానే శమేచ స్యాద్వేదాభ్యాసే చ యత్నవాన్॥౯౨॥

శాస్త్రోక్తములయినప్పటికిని యగ్నిహోత్రాదికర్మానుష్ఠానములనువిడిచి బ్రహ్మధ్యానేంద్రియజయప్రణవోపనిషదాది వేదాభ్యాసమందు యత్నముగలవాడు బ్రాహ్మణుడుగావలెను ఇదిసర్వమోక్షోపాయములలో నంతరంగోపాయమని తెలియుటకు గాని యగ్నిహోత్రాదికర్మములను విడుచుటకుగాదు॥ ౯౨॥

మూ॥ ఏతద్ధి జన్మసాఫల్యం బ్రాహ్మణస్య విశేషతః।
ప్రాప్యైతత్కృతకృత్యోవా ద్విజోభవతి నాన్యథా॥౯౩॥

ఈయాత్మజ్ఞానవేదాభ్యాసాదికము బ్రాహ్మణునకుజన్మసాఫల్యకరము ద్విజుడుదీనినిబొంది కృతకృత్యుడగును గావున మరొకప్రకారముచేగాదు వేదమువలననె బ్రహ్మమునెరుగవలెనని వేదమును బ్రశంసించుచున్నాడు॥ ౯౩॥

మూ॥ పితృదేవమనుష్యాణాం వేదశ్చక్షుస్సనాతనం।
అశక్యంచాప్రమేయంచ వేదశాస్త్రమితిస్థితిః॥౯౪॥

పితృదేవమనుష్యులకు హవ్యకవ్యాన్నదానములు జేయుటవిషయమై వేదమే నాశములేనినేత్రమువంటిది ప్రమాణాంతర మక్కరలేని ప్రమాణముగావున నిదియొకరన్యథా జేయుటకశక్యమైనదియైనగాన పౌరుషేయమనుటకు మీమాంసాదిన్యాయనిరపేక్షముగా దెలియశక్యము గానిది గాన నప్రమేయము గావుననే మీమాంసచేతనున్ను వ్యాకరణాద్యంగములతో సర్వమున్ను బ్రహ్మప్రతిపాదకముగు వేదార్థము దెలియందగునని వ్యవస్థితమాయెను॥ ౯౪

మూ॥ యా వేదబాహ్యాస్స్మృతయో యాశ్చకాశ్చకుదృష్టయః।
సర్వాస్తానిష్ఫలాః ప్రేత్య తమోనిష్ఠాహితాస్స్మృతాః॥౯౫॥

ఏస్మృతులు వేదమూలములుగావో చైత్యవందనమువలన స్వర్గప్రాప్తి యగునని యెడిది మొదలగు నాదృష్టార్థవాక్యములును మొవిసతర్కమూలములును దేవాదినిరాకరణాత్మకములును వేదవిరుద్ధములగు చార్వాకాదిశాస్త్రములు నివియ

న్నియుంబరలోకమందు నిష్ఫలములు నరకఫలములుగావుననని మన్వాదులచే జెప్ప బడెను దీనినేస్పష్టపరచుచున్నాడు॥ ౯౫॥

మూ॥ ఉత్పద్యంతేచ్యవంతేచ యాన్యతోన్యానికానిచిత్।
తాన్యర్వాక్కాలికతయా నిష్ఫలాన్యనృతానిచ॥ ౯౬॥

వేదేతరమూలములగు కొన్నిశాస్త్రములు పౌరుషేయములుగావున పుట్టించుచున్నవి నశించుచున్నవి యాధునికములుగావున నవినిష్ఫలములునసృతములును స్మృత్యాదులు వేదమూలములుగావుననే ప్రమాణములగుచున్నవి॥ ౯౬॥

మూ॥ చాతుర్వర్ణ్యం త్రయోలోకాశ్చత్వారశ్చాశ్రమాఃపృథక్।
భూతంభవద్భవిష్యచ్చ సర్వం వేదాత్ప్రసిధ్యతి॥౯౭॥

"శు॥ బ్రాహ్మణోస్యముఖమాసీ" దనునదిమొదలుగాగలవేదముచేతనే నాలుగువర్ణములును సిద్ధములాయెను॥ "బ్రాహ్మణేభూతమాతా పితృజనితత్వ॥" యనితదుపజీవిగా స్వర్గాదిప్రాప్తిన్ని సిద్ధమాయెను నాలుగాశ్రమములున్ను వేదమూలములయ్యేవేసిద్ధములాయెను అనేకముజెప్పనేల అయినదియు నగుచున్నదియు కానున్నయునగు నీజడము "అగ్నౌప్రాస్తాహుతిస్సమ్య" గనుదానిచేభేదమువలననే సిద్ధించుచున్నది॥ ౯౭॥

మూ॥ శబ్దస్పర్శశ్చ రూపఞ్చ రసోగంధశ్చ పంచమః।
వేదాదేవప్రసూయంతే ప్రసూతిగుణకర్మతః॥ ౯౮॥

ఈలోకమందును పరలోకమందున్ను యేశబ్దాదివిషయములు పుట్టింపచేసే గుణత్రయవ్యాపారములుగలవగుటవలన తన్నిబంధనమైదికకర్మము హేతువుగాగలవిగావున వేదమువలననే సిద్ధించుచున్నవి॥ ౯౮॥

మూ॥ బిభర్తి సర్వభూతాని వేదశాస్త్రం సనాతనం।
తస్మాదేతత్పరం మన్యే తజ్జంతోరస్యసాధనం॥ ౯౯॥

నిత్యమగువేదశాస్త్రము సర్వభూతములనున్ను భరించుచున్నది యదియెట్లన్న "శ్రు॥ హవిరగ్నౌ హూయతే।సోగ్నిరాదిత్యముపసర్పతి। వేదస్తత్సూర్యో రశ్మిభిర్వర్షతి। తేనాన్నంభవతి। అథేహభూతానాముత్పత్తిస్థితిశ్చేతిహవిజ్ఞాయతే,